శ్రీ

# ఆంధ్ర వాచస్పత్యము

## విజ్ఞప్తి

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే,
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ."

I. సంస్కృతభాషలోని శబ్దార్థజ్ఞానమునకుమాత్రము అమరసింహప్రణీతమగు నామలింగానుశాసనము మున్నగు పెక్కు నిఘంటువులు గలవు. వీనిలో కవిచౌడప్ప "చౌడప్పసీసము", శ్రీ వేంకటేశాంధ్రము, ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రరత్నాకరము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, ఆంధ్రభాషార్ణవము, ఆంధ్రపదాకరము, ఆంధ్రదీపిక, బ్రౌణ్యనిఘంటువు, చిన్నయసూరి నిఘంటువు, శబ్దరత్నాకరము, ఆంధ్రపదపారిజాతము, శబ్దార్థచంద్రిక, లక్ష్మీనారాయణీయము, వావిళ్ళనిఘంటువు (మొదటి సంపుటము) వెలువడినవి. వీనిలో కొన్ని పద్యనిఘంటువులు, కొన్ని అకారాది నిఘంటువులు. అకారాది నిఘంటువులు పర్యాయపదముల నీయవు. పద్యనిఘంటువులు పర్యాయపదములం గొంత వరకు దెలుపునుగాని అకారాదిగఁ జూపఁజాలవు. వీనియం దిట్టి చిక్కులు గలవు.

II. అందుపయిన నేను పర్యాయపదములందెలుపు నిఘంటువిధ మెట్లని చింతించి 25 సం॥రములు పరిశ్రమచేసి "ఆంధ్రవాచస్పత్యము" వ్రాసి అచ్చొత్తించి ప్రథమముద్రణము పూర్తి గావించితిని. అచ్చుపూర్తియగు సరికి 2 వేల సెటను లోకము స్వీకరించినది. ద్వితీయముద్రణమునకు యత్నింపఁగా కాగితములకఱవు కలిగినది. చందాదార్లతొందర హెచ్చినది. నా స్వప్రయత్నములు వృథాలైనవి. అందు చాలనష్టము కష్టము పొందితిని. పరమేశ్వరానుగ్రహమున "ది ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ, తెనాలి" యజమానులు ము॥ శ్రీబ్రహ్మణ్యశర్మగారు తోడ్పడి ఈ ద్వితీయముద్రణమునకు మార్గదర్శకులైరి. ఇందులకు గ్రంథకర్తయును, వారి వంశీయులును శ్రీ శర్మగారికి ఎంతేని కృతజ్ఞులై యున్నారు.

# ఆంధ్రవాచస్పత్యము

## ద్వితీయ - తృతీయ సంపుటములు

స్వర్గీయ శ్రీ కొట్ర శ్యామలకామశాస్త్రిగారు రచియించిన ఈ మహాంధ్ర నిఘంటువు మొదటి సంపుటము ముద్రించి ప్రకటించు భాగ్యము మాకు కలిగినను, ముద్రణాసంబంధమైన యాతి బాధవలన శ్రీ శాస్త్రిగారు జీవించి యుండగనే రెండు మూడు సంపుటములు ముద్రించి ప్రకటించు నదృష్టము మాకు కలుగలేదు. అనివార్యముగ కొంతకాలము వృధగా గడచిపోయినది.

పరమేశ్వరు కటాక్షమున నీ యుద్గ్రంథ మిపుడు ముద్రణ పూర్తికా వచ్చినది; రెండవసంపుట మిపుడు అన్నివిధముల పూర్తియయి కాపీలు గూడ సిద్ధముగ నున్నవి. మూడవ సంపుటముగూడ అటులే వేగముగ పూర్తికాగలదని విశ్వసించుచున్నారము.

తెనాలి

*1—11—1957* —ప్రకాశకులు

# నియమవిధానక్రమము



1. ఈ నిఘంటువునందలి పదములన్నియు అకారాది హకారాంతము వఱకు ప్రాసాక్షరాది నియమముతో వ్రాయఁబడును.

2. ప్రతి అర్థమునకును అకారాది హకారమువఱకు గల పర్యాయపదములు తద్విశేషములతో ప్రాసాక్షరాది నియమముఁతో వ్రాయఁబడును. (చూ : ధేనువు, నది, మత్స్యము, యుద్ధము, వాయువు, సదనము, సర్పము, స్వరము, హయము మొ.)

3. కకారము తరువాత క్ష కారమును, ల కారము తరువాత ళ కారమును వ్రాయఁబడును.

4. సంస్కృతపదములకు ప్రత్యయములుఁ జేర్చి (తత్సమరూపములు) వ్రాయఁబడును.

5. ఇందు నిర్దుష్టమగు సంస్కృతపదములు రమారమి 50,000 ను, తెనుఁగుపదములు మున్నగునవి 50,000 ను కలసి ఒక లక్ష పదములవఱకు కలవని అంచనా వేయఁబడెను.

6. ప్రతి పదమునకును భాషాభాగమును, అర్థమును, గూఢపదములకు ప్రయోగములును, నానార్థములును, ప్రత్యర్థమునకు పర్యాయపదములును, విశేషించి తద్విశేషాదులును వ్రాయఁబడును. (చూ: అ, అంకము, అంగము, వాయువు, వీణె, సదనము, సర్పము, స్వరము, స్త్రీ, హయము మొ.)

7. మఱియు తత్సమము (వికృతి) లకు తద్భవము (వైకృతి) లును, తద్భవములకు తత్సమములును = గుర్తుతోను, రూపాంతరములు — గుర్తుతోను గనుపఱుపఁబడును. (చూ: కుడ్యము = గోడ, బమ్మ = బ్రహ్మ: అంబా-అంబేద మొ.)

8. పర్యాయపదములు శీర్షికాపదము లయినపుడు పైన వ్రాయఁబడిన వివరణాదులమ వ్రాని పర్యాయపదములకుతుదిని, తద్విశేషాదులను గనుఁగొనుటకై తద్గణాద్యపద తదర్థసంఖ్యలను :చూ, అను గుఱుతుతో సూచింపఁబడును. (:చూ, అ. అమ్. అంకము. అంగము. మొ.)

9. వేఁట. యుద్ధము మొ. (వివిధవృత్తులకును, ప్రకృతి శాస్త్రములు, గణితము, ధర్మశాస్త్రము, జ్యోతిషము, వైద్యము, భూగోళము, వ్యాకరణము, సంజ్ఞావివరణములు, న్యాయములు, జాతీయములు మున్నగు వివిధశాస్త్రములకును సంబంధించిన పారిభాషిక పదములును, వ్యావహారిక పదములును, అకారాదిగ సాహిత్యపదములతో కలఁబోసి కూర్పఁబడును. (చూ : అలంకారము, అంగము, అంకోలబీజన్యాయము, అందెవేసిన చేయి మొ.)

10. చెట్టునకు * గుఱుతు చూపఁబడినది. చూ: కొబ్బరి, మామిడి మొ.)

11. ఇందుఁ గ్రియాపదములకు ధాతురూపములును, నామపదములకుఁ బ్రథమైకవచనరూపములును వ్రాయఁబడును.

12. సంస్కృత, వైకృత, దేశ్య, గ్రామ్య, వాడుక, పారిభాషిక, జాతీయ, ఉపసర్గ వీనికాయాయిసంజ్ఞ లిడఁబడును. నిర్దిష్టమగు అన్యదేశ్యము దేశ్యముగాఁ జేర్పఁబడినదిగావ దానికిఁ బ్రత్యేకముగా సంజ్ఞ యిడఁబడదు.

13. ద్వ్యయమునకు అవయవములైన పదములయొక్క సంజ్ఞలను ఆయా శబ్దములకడఁ జూచునది. అనఁగా "అందాఁక" అనుచో అంత శబ్దముయొక్క సంజ్ఞను అంతకడను, దాఁక శబ్దముయొక్క సంజ్ఞను దాఁకకడను జూడవలయునని యర్థము. ఇట్లు తక్కినచోట్లను దెలియవలయును. (వైకృతమును దేశ్యమును మిశ్రమమైన పదము.)

14. ఒక్కొకచో నించుక రూపభేదముగల శబ్దము దాని మొదటి రూపముకడనే రూపాంతరమని వ్రాయఁబడును. (చూ: అకటవికటము, ఒకతె మొ.)

15. ఒక్కొకయెడ 'ముచర్ణాంత' రూపము ముచర్ణములేని శబ్దరూపముకడనే రూ-అని వ్రాయఁబడును. (చూ: అగ్గలిక మొ.)

16. కొన్నిచోట్ల తెనుఁగు పదమునకు ఇయాంతరూపము, ఏదంత రూపము రెండును వ్రాయఁబడును. కొన్నియెడల ఇయాంత రూపముకడ ఏదంత రూపమును, ఏదంత రూపముకడ ఇయాంతరూపమును వ్రాయఁబడును. (చూ: అందకత్తియ; అగిసియ మొ; మఱియు అలె - అలొ - మొదలగువాని భేదములను గుర్తింపవలయును.)

17. ఉకారలోపముగల అల్లు లోనగు వాడుకలోని పదములు ఒక్కొకయెడ ప్రత్యేకముగ వ్రాయఁబడవు. (చూ: అలుగు మొ.)

18. దేశ్యక్రియలయందు ఇంచుకు వచ్చెడు సామాన్యప్రేరణ రూపములు ప్రత్యేకముగా వ్రాయఁబడును. చూ : (అడఁగించు, ఇప్పించు మొ.)

19. తేటగాఁ దెలియఁబడుచోట్ల తఱచుగ దెనుఁగు పదములకు సంస్కృతపదములతోడను, సంస్కృతపదములకుఁ దెనుఁగు పదములతోడను అర్థములతో వ్రాయఁబడును.

20. ఒకపదము సంస్కృతముగాను తెనుఁగుగాను నున్నయెడల ముందు సంస్కృతార్థములను వెనుక తెనుఁగర్థములను గ్రమముగా వ్రాయఁబడును. అట్టిచోటుల సంస్కృతార్థములకు బ్రాకెట్టులేని విడిఅంకెలును, తెనుఁగర్థములకు బ్రాకెట్టుగల అంకెలును గుఱుతిడఁబడును. (చూ: అ, అంకము, అంగము. మొ.) ఇటులనే ఒక పదము తెనుఁగుగాను సంస్కృతముగాను నున్నయెడల ముందు తెనుఁగర్థములను వెనుక సంస్కృతార్థములను గ్రమముగా వ్రాయఁబడును. అట్టిచోటుల తెనుఁగర్థములకు బ్రాకెట్టుగల అంకెలును, సంస్కృతార్థములకు బ్రాకెట్టులేని విడి అంకెలును గుఱుతిడఁబడును. చూ: స్రుక్కు.

21. ఒక పదము విశేష్యము, విశేషణము, సర్వనామము, అవ్యయము, క్రియ అగునెడల ముందు విశేష్యార్థములును, వెనుక విశేషణార్థములను, నా వెనుక క్రియార్థములను వ్రాయఁబడును. (చూ: అంటు, ఎత్తు, ఒడ్డు మొ.)

22. ఇందుఁ గొన్నిటికి గ్రంథవిస్తరభీతిచే ప్రయోగములు సంగ్రహముగ వ్రాయఁబడి యుండుటవలన ఇందు వ్రాయఁబడిన అర్థములకు సందేహములు కలిగినయెడల ఆ యుదాహరణములకు ముందు వెనుకలను ఆ గ్రంథములయందు విశదముగఁ జూచుకొనవలయును.

23. ప్రయోగములు దొరకియు పాఠభేదములతోఁ గూడి యుండుటవలన నట్టిచోట్ల ఆశ్వాసాదిపద్యసంఖ్యలు వ్రాయఁబడును.

24. చదివెడివారికిఁ జిక్కుఁగా దెలియుటకై యిందు అర్థము లోనగునది తఱచుగ సంధిలేక వ్రాయఁబడును. నియమబాహుళ్యముచే నీ క్రమము కొన్నియెడలఁ దప్పినను దప్పియుండును.

25. క్రొత్తగ నచ్చటచ్చటఁ జేరిన నియమవిధానాదులను పాఠకు లా యా సందర్భాదులంబట్టి గ్రహించుకొనవలయును.

26. తెనుఁగున వాడుకలోనికివచ్చిన యన్యదేశీయాది శబ్దములు కొన్ని చేర్పఁబడినవి. ఇట్టి పదములకు గ్రంథదృష్టాంతాదులు దొరకుట దుస్సాధ్యము. అవి వాడుకయందున్నవి యున్నట్లే గ్రహింపవలయును.

27. రూపాంతరములలో కొన్నిమాత్ర మచ్చటచ్చట శీర్షికాపదములుగ నీయక నాయా పదములకడనే చూపఁబడినవి.

28. గ్రంథసంకేతాది పట్టికయందుఁ జేరని గ్రంథములు పెక్కులుండును. అట్టిచోట్ల నా యా గ్రంథముల పేర్లు వ్రాయఁబడును.

29. సంజ్ఞావివరణ పట్టికయందుఁ జేరని గుఱుతులు మెండుగ నుండును. అట్టిచోట్ల వాడుకనుబట్టి తెలిసికొనవలయును.

30. ప్రబంధాదులు పెక్కు ముద్రణాలయములయందు ముద్రింపఁబడిన కారణమున పాఠభేదములు వ్రాయ నలవికానన్ని గాన్పించుచున్నవి. తాళపత్ర గ్రంథములు పెద్దలు పెక్కుమంది వ్రాసిన కారణమున వాటియందు పాఠభేదములు విశేషముగఁ గాన్పించుచున్నవి. ఆ కారణమునఁ గొన్నిచోట్ల సుశబ్దాపశబ్ద నిర్ణయమును, అర్థనిర్ణయమును దుస్సాధ్యముగ నున్నది. అట్టిచోట్ల అట్టి పదములుగల పద్యము లుదాహరింపకయే నా బుద్ధికిఁ దగినరీతిని అర్థనిర్ణయాదులను వ్రాసితిని. అట్టిచోట్ల పాఠకులకు గ్రంథపరిశీలన మవసరమగునేని చూచుకొనుట కనువుగ నట్టి ప్రబంధాదులయొక్క ఆశ్వాసాదులను పద్యములయొక్క సంఖ్యను వివరించి పాఠకమహాశయుల కా పరిశ్రమ వదలివేసితిని. (ఉ॥ నేను స్వయముగ నాలువిధములగు తాళపత్రప్రతుల, నాలు విధములగు అచ్చు భారతప్రతుల నొకదానితో నొకటి పరిశీలింపఁగ నైదువేల పదములకు పాఠభేదములుఁ గాన్పించినవి.)

31. మొదటి ముద్రణము రెండువేల ప్రతులును అచిరకాలములోనే ఆంధ్రమండల మంతయు స్వీకరించుటవలనను, రెండవ ముద్రణమునకు ఆంధ్రమండలమంతయు ద్విగుణీకృతముగ ప్రోత్సహించుటంబట్టియు నీ పునర్ముద్రణమునకు సాహసించితిని.

32. బుద్ధిమంతు లిందుల పొరపాట్లు తెలిపి దిద్దించి నన్నుఁ గృతార్థుం జేయుదురని ప్రార్థించెద.

ఇట్లు

నిఘంటు కర్త

# సంజ్ఞా వివరణ పట్టిక

| సంకేతము | వివరణములు | సంకేతము | వివరణములు |
|---|---|---|---|
| అ. | అకారాన్తము. (ఇట్లు ఆ, ఇ. ఈ, ఉ, ఊ, ఋ, | నాట్య. | నాట్యశాస్త్రము. |
| | ఐ, ౯, చ్, జ్, త్, డ్, ఫ్, న్,ప్, ర్,వ్,శ్, | ని. | నిపాతము. |
| | భ్, ్న్, హ్. అనువర్ణములు గలచోట్ల ఆయా | న్యా. | న్యాయము. |
| | అంత్యంగా చెప్పుకొనవలెను, ఉదా.— ఆకా | పర. | పరస్మైపది. [ఫలము.) = అనాస. మొ) |
| | రాంత ఇకారాంతము, ఈకారాంతము, చకా | పా. | పారిభాషికపదము. (ఉదా:- పుష్పసమూహ పరిణామ |
| | రాంత ఝకారాంతము, తకారాంతము అని.) | పాఠా. | పాఠాంతరము. |
| (అ. ఆ. | పుంలింగవిశే మైనప్పుడు, అకారాంతము. | పీ. | పీఠిక. |
| ఆ.) | (స్త్రీలింగవిశేషణ మైనప్పుడు) ఆకారాంతము | పు. | పుంలింగము. |
| | లేక ఈకాంతము. (నపుంసకలింగ విశేషణ | పుం. న. | పుంనపుంసకలింగము. |
| అం. | అంకము [మైనప్పుడు) అకారాంతము. | పుం. స్త్రీ | పుంస్త్రీలింగము. |
| అం. ప్రే. | అంతర్భావిత,రణము. | —పై.— | పైయర్థాదులే. |
| అ. క్రి. | అకర్మక క్రియ | ప్ర. | ప్రత్యయము. |
| అనౌ. | అనౌపవిభక్తిక | ప్రా. | ప్రాకృతము. |
| అప. | అపదము (ఆగము మొ॥) | ప్రే. | ప్రేరణము. |
| అప్ర. | అప్రసిద్ధము. | బ. | బహువచనాంతము. |
| అలం. | అలంకారములు. | బీజగ. | బీజగణితము. |
| అవ్య. | అవ్యయము. | మంత్ర. | మంత్రశాస్త్రము. |
| ఆత్మ. | ఆత్మనేపది. | మి. | మిశ్రము (సంస్కృతాంధ్రములు కలిసిన శబ్దము) |
| ఆమ్రే. | ఆమ్రేడితము. | ము. | మువర్ణకాంతము. |
| ఉదా. | ఉదాహరణము. | మొ॥ | మొదలైనవి. |
| ఉప. | (తెనుఁగు పదము ముందున్నచో) ఉపపదము | యు. | యుగళము. (కొన్ని యర్థములయందు దేశ్యమును |
| | (అపి, ఉద్ద, ఎమొ.) (సంస్కృతపదములకు | యోగ. | యోగశాస్త్రము. [కొన్ని యర్థములయందు వైకృతమును |
| | ముందున్నచో)పసర్గము. (ప్ర. మొ.) | రూ. | రూపాంతరము. |
| ఉభ. | ఉభయము. (కొన్నిఁ అచ్చ తెనుఁగును, కొన్నిట | వా. | వాడుక. |
| ఏ. | ఏకవచనాంతము. [సంస్కృతమును.) | వి. | విశేష్యము. |
| ఔ. | ఔపవిభక్తికము. | విణ. | విశేషణము. |
| క్రి. | క్రియ. | వు. | వువర్ణకాంతము. |
| క్రి. విణ. | క్రియావిశేషణము. | వై. (లేక) | వైకృతము(తద్భవము)ప్రాకృతసమమును సంస్కృత |
| గ్రా. | గ్రామ్యము. (అనింద్య) | తద్భ. | ప్రాకృత భవము నైన పదము. |
| చూ. | చూడుము. (సంస్కృతతెనుఁగు పర్యాయపదముల | వైద్య. | వైద్యశాస్త్రము. |
| ఛం. | ఛందశ్శాస్త్రము. కొఱకు.) | వ్యతి. | వ్యతిరేకార్థకపదము. |
| జా. | జాతీయము. (దేశీయము | వ్యవ. | వ్యవహారము. |
| జ్యో. | జ్యోతిశ్శాస్త్రము. | వ్యు. | వ్యుత్పత్త్యర్థము. |
| తంత్ర. | తంత్రశాస్త్రము. | వ్యాక. | వ్యాకరణము. |
| తద్వి. | తద్విశేషములు. | శత్ర. | శత్రంతము. |
| తర్క. | తర్కశాస్త్రము. | శప్. | శబ్వికరణము. |
| (తె. ప.) | తెలుఁగు పర్యాయపదము | సం. | సంస్కృతసమము. (తత్సమము.) |
| దే. | దేశ్యము. | సంగీత. | సంగీతశాస్త్రము. |
| ద్రు. | ద్రుతాంతావ్యయము. | సర్వ. | సర్వనామము. |
| ద్రు. | ద్రుతాంతము. | స. క్రి. | సకర్మకక్రియ. |
| ద్వ. | ద్వయము(వైకృతమును దేశ్యమును మిశ్రమైనపదము) | (సం. ప.) | సంస్కృత పర్యాయపదములు. |
| ద్వి. | ద్వివచనాంతము. (తెనుఁగున బహువచనాంతములో | సా. | సామెత. |
| ధర్మ. | ధర్మశాస్త్రము. [అంతర్భూతము) | స్త్రీ. | స్త్రీలింగము. |
| ధా. లేక క్రి. | ధాతువు (క్రియాపదము) | = | ప్రకృతి వికృతులు గుఱుతు. |
| న. | నపుంసకలింగము. | * | వృక్షలతాది వాచకమగుటను తెలియఁజేయును. |
| నాటక. | నాటకపరిభాష. | .... | ఈ గుఱుతు నడుమ కొన్ని యక్షరము లుండును. |

☞ అచ్చతెనుఁగు పదములలో చకార-రపదములుండవు. చే జే కారములు గలిగిన పదములే యుండును.

# వివర్శక గ్రంథ సంకేతాది వివేచన పట్టిక

| సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|
| | | **సంస్కృతనిఘంటువులు** |
| 1 | ఆ. ని. | ఆప్తని సంస్కృతాంగ్ల నిఘంటువు. |
| 2 | అభి. | అభిధానరత్నమాల. |
| 3 | అమర. | అమరకోశము. |
| 4 | అ. పా. | అమరపదపారిజాతము. |
| 5 | త్రి. శే. | త్రికాండశేషము. |
| 6 | ధన్వ. ని. | ధన్వంతరి నిఘంటువు. |
| 7 | నా. ర. | నానార్థరత్నమాల. |
| 8 | నా. సం. | నానార్థ సంక్షేప నిఘంటువు. |
| 9 | బ్రౌ. ని. | బ్రౌణ్యానిఘంటువు. |
| 10 | మే. కో. | మేదినీ కోశము. |
| 11 | రా, ని. | రాజనిఘంటువు. |
| 12 | వాచ. ని. | వాచస్పత్య (తారానాథతర్క) నిఘంటువు. |
| 13 | విశ్వ. | విశ్వకోశము. |
| 14 | వై. ని. | వైజయంతి నిఘంటువు. |
| 15 | శ. క. త. | శబ్దార్థ కల్పతరువు. |
| 16 | శ. కల్ప. | శబ్దకల్పద్రుమము. |
| 17 | శా. ని. | శాశ్వతనిఘంటువు. |
| 18 | సం. ఆం. | సంస్కృతాంధ్ర నిఘంటువు. |
| 19 | స. సం. | సర్వశబ్దసంబోధిని. |
| 20 | హారా. | హారావళి. |
| | | **మిశ్రాంధ్ర నిఘంటువులు** |
| 21 | ఆం. వా. | ఆంధ్ర వాచస్పత్యము (మొదటి ముద్రణము) |
| 22 | ఆం. దీ. | ఆంధ్ర దీపిక. |
| 23 | పురు. క. | పురుషోత్తమ కవీయము. |
| 24 | శబ్ద. ర. | శబ్దరత్నాకరము. |
| 25 | శ. చం. | శబ్దార్థచంద్రిక. |
| 26 | సూ. ని. | శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు. |
| | | **అచ్చతెనుఁగు నిఘంటువులు** |
| 27 | లక్ష్మీనా. | లక్ష్మీనారాయణీయ(ము ఆం.ప్ర.ప) నిఘంటువు |
| 28 | వైకృ. | వైకృత దీపిక. |
| 29 | శు. పా. | శుద్ధాంధ్రపద పారిజాతము. |
| 30 | ఆం. భా. | ఆంధ్రభాషార్ణవము. |
| 31 | ఆం. ప. | ఆంధ్ర పదాకరము. |
| 32 | ఆం. శే. | ఆంధ్రనామశేషము. |
| 33 | ఆం. సం. | ఆంధ్రనామ సంగ్రహము. |
| 34 | వేం. ఆం. | వేంకటేశ్వరాంధ్రము. |
| 35 | సాంబ. | సాంబనిఘంటువు. |
| 36 | చి. సూ. | చిన్నయసూరివ్రాఁతది. |
| 37 | బాల. | బాలచంద్రోదయము. |
| 38 | ఆం. భూ. | ఆంధ్ర భాషాభూషణము. |
| 39 | ఆం. సర్వ | ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము. |
| | | **ప్రకృతిశాస్త్రములు** |
| 40 | భౌ. | భౌతికశాస్త్రము (మైన.). |
| 41 | రసా. | రసాయన ,, (వే వి. శర్మ). |
| 42 | మ. మ. | మహమ్మదీయ మహాయుగం (కొ. వె. ల.) |
| 43 | ప. వి. | పదార్థవిజ్ఞాన శాస్త్రము (మం. సా.) |
| 44 | ఆం. చ. | ఆంధ్రుల చరిత్ర (చి॥ వీ॥) |
| 45 | వ్య. శా. | వ్యవసాయశాస్త్రము (గో. జో.) |
| 46 | ప. వా. | పరిణామవాదము (వి॥ దీ॥) |
| 47 | వృ శా. | వృక్షశాస్త్రము (టి సా.) |
| 48 | శా. శా. | శారీరశాస్త్రము (పి చం.) |
| 49 | జం. శా. | జంతుశాస్త్రము (శి. ల.) |
| 50 | స్వీ. చ. | స్వీయచరిత్ర (కం॥ వీ॥) |
| 51 | హి. మ. | హిందూ మహాయుగము (కొ. వె. ల.) |
| 52 | అ. శా. | అర్థశాస్త్రము (సి. రా. రెడ్డి.) |
| 53 | శా. పరి. | శాస్త్రపరిభాష (పి. వెం. శి.) |
| | | **గ్రంథస్థములు వేదములు శాస్త్రములు మొదలగునవి** |
| 54 | వ్యా. | వ్యాకరణము. |
| 55 | వేద. | వేదములు. |
| 56 | నిరు. | నిరుక్తము. |
| 57 | జ్యో. | జ్యోతిషము. |
| 58 | కల్ప. | కల్పము. |
| 59 | ఛంద. | ఛందస్సు. |
| 60 | మీమాం. | మీమాంస. |
| 61 | న్యాయ. | న్యాయశాస్త్రము. |
| 62 | పురా. | పురాణములు. |
| 63 | ధర్మ. | ధర్మశాస్త్రము. |
| 64 | ఆయు. | ఆయుర్వేదము. |
| 65 | పాక. | పాకశాస్త్రము. |
| 66 | అర్థ. | అర్థవేదము. |
| 67 | కామ. | కామశాస్త్రము. |
| 68 | ధను. | ధనుర్వేదము. |
| 69 | మల్ల. | మల్లశాస్త్రము. |
| 70 | గజ. | గజశాస్త్రము. |
| 71 | వ్యూహ. | వ్యూహశాస్త్రము. |
| 72 | అశ్వ. | అశ్వశాస్త్రము. |
| 73 | పురు. సా. | పురుషసాముద్రికము. |
| 74 | స్త్రీ. సా. | స్త్రీసాముద్రికము. |
| 75 | గాంధ. | గాంధర్వవేదము (రాగ - తాళ). |
| 76 | భావా. | భావాధ్యాయ ప్రమేయము. |
| 77 | అలం. | అలంకారములు. |

| సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|
| 78 | నాటక. | నాటకలక్షణము. |
| 79 | కావ్య. | కావ్యలక్షణము. |
| 80 | ఛందో. | ఛందోలక్షణము. |
| 81 | భరత. | భరతశాస్త్రము. |
| 82 | చతు. | చతుష్షష్ఠి విద్యావివరణము. |
| 83 | క్షే. గ. | క్షేత్రగణితము. |
| | | ఆంధ్రలక్ష్య గ్రంథములు |
| 84 | అచలా. | అచలాత్మజా పరిణయము. |
| 85 | అచ్చ. భా. | అచ్చతెనుఁగుభారవి. |
| 86 | అచ్చ. రా. | అచ్చతెనుఁగు రామాయణము. |
| 87 | అధ్యా. | అధ్యాత్మ రామాయణము. |
| 88 | అని. | అనిరుద్ధచరిత్రము. |
| 89 | అప్ప. | అప్పకవీయము. |
| 90 | అ. మ. క. | అష్టమహిషీకళ్యాణము. |
| 91 | అహ. | అహల్యాసంక్రందనము. |
| 92 | ఆం. చం. | ఆంధ్ర చంద్రాలోకము. |
| 93 | ఆము. | ఆముక్తమాల్యద. |
| 94 | ఇందు. | ఇందుమతీపరిణయము (ధూ.) |
| 95 | ఇందు. రా | ,, (రామభద్రకవి) |
| 96 | ఉ. రా. | ఉత్తరరామాయణము. |
| 97 | ఉ. హరి. | ఉత్తరహరివంశము. |
| 98 | ఉ. హరిశ్చ. | ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము. |
| 99 | కకు. | కకుత్స్థవిజయము. |
| 100 | కలు. శ. | కలువాయిశతకము. |
| 101 | కవిక. ర. | కవికర్ణరసాయనము. |
| 102 | క. చౌ. | కవిచౌడప్పశతకము. |
| 103 | క. రం. | కవిజనరంజనము. |
| 104 | క. జ. | కవిజనాశ్రయము. |
| 105 | క. రాజ. | కవిరాజ మనోరంజనము. |
| 106 | క. స. | కవిసర్ప గారుడము. |
| 107 | క. పూ. | కళాపూర్ణోదయము. |
| 108 | కా. సం. | కావ్యాలంకారసంగ్రహము. |
| 109 | కాశీ. | కాశీఖండము. |
| 110 | కాళ. | కాళహస్తి మాహాత్మ్యము. |
| 111 | కాళ. శ. | కాళహస్తీశ్వరశతకము. |
| 112 | కిరా. | కిరాతార్జునీయము. |
| 113 | కుచే. | కుచేలోపాఖ్యానము. |
| 114 | కువల. | కువలయాశ్వచరిత్రము. |
| 115 | కుమార. | కుమారసంభవము (నన్నెచోడుఁడు) |
| 116 | కృ. క. | కృష్ణకర్ణామృతము. |
| 117 | కృష్ణాభ్యు. | కృష్ణాభ్యుదయము. |
| 118 | కృ. శకుం. | కృష్ణకవిశకుంతలా పరిణయము. |
| 119 | కృ. వి. | కృష్ణరాయవిజయము. |
| 120 | కృ. శ. | కృష్ణశతకము. |
| 121 | కే. బా. | కేయూరబాహు చరిత్రము. |
| 122 | క్రీడా. | క్రీడాభిరామము. |
| 123 | గం. వ. | గంధవహము. |
| 124 | గాధే. | గాధేయోపాఖ్యానము. |
| 125 | గో. రా. | గోపీనాథ రామాయణము. |
| 126 | ఘ. మ. | ఘటికాచలమాహాత్మ్యము. |
| 127 | చం. హా. | చంద్రహాస చరిత్రము. |
| 128 | చం. భా. | చంద్రభానుచరిత్రము. |
| 129 | చం. రే. | చంద్రరేఖావిలాసము. |
| 130 | చం. చ. | చంద్రాంగదచరిత్రము. |
| 131 | చం. ప. | చంద్రికాపరిణయము. |
| 132 | చం. రా. | చంపూరామాయణము. |
| 133 | చమ. | చమత్కారమంజరి. |
| 134 | చి. భా. | చిత్రభారతము. |
| 135 | చె. పు. | చెన్నబసవపురాణము. |
| 136 | జా. మా. | జాహ్నవీమాహాత్మ్యము. |
| 137 | జై. భా. | జైమిని భారతము. |
| 138 | తపతీ. | తపతీ సంవరణోపాఖ్యానము. |
| 139 | ద రా. చ. | దశరథరాజనందన చరిత్రము. |
| 140 | ద. కు. | దశకుమార చరిత్రము. |
| 141 | ద. చ. | దశావతారచరిత్రము. |
| 142 | దా. శ. | దాశరథీ శతకము. |
| 143 | ది. చ. | దిలీపచరిత్రము. |
| 144 | ద్వా. క. | ద్వాత్రింశిక (కథలు). |
| 145 | ద్వి. భాగ. | ద్విపదభాగవతము. |
| 146 | ద్వి. సా. | ద్విపదసారంగధర. |
| 147 | ద్వి. నల. | ద్విపద నలచరిత్ర. |
| 148 | ద్వి. పర. | ద్విపద పరమయోగివిలాసము. |
| 149 | ద్వి. భా. | ద్విపద భాగవతము. |
| 150 | ద్వి. భార. | ద్విపద భారతము. |
| 151 | ద్వి. హరిశ్చ | ద్విపద హరిశ్చంద్ర. |
| 152 | ధనాభి. | ధనాభిరామము. |
| 153 | ధర్మ. | ధర్మఖండము. |
| 154 | ధాతు. | ధాతుమాల (ఆంధ్రము). |
| 155 | నరస. | నరసభూపాలీయము. |
| 156 | న. నాథ. | నవనాథచరిత్రము. |
| 157 | నలచ. | నలచరిత్రము. |
| 158 | నా. పం. | నారాయణకవి పంచతంత్రము |
| 159 | నార. పు. | నారసింహపురాణము. |
| 160 | నిరం. | నిరంకుశోపాఖ్యానము. |
| 161 | నిర్వ. రా. | నిర్వచనోత్తరరామాయణము. |
| 162 | నీతి. శ. | నీతిశతకము (సీసము). |
| 163 | నీ. సుం. | నీలాసుందరీపరిణయము |
| 164 | నృ. పు. | నృసింహపురాణము. |

| సంఖ్య | సంకేతములు | పేరు | సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|---|---|---|
| 165 | నైష. | శృంగారనైషధము. | 209 | రం. రా. | రంగనాథ రామాయణము (ద్వి.) |
| 166 | పండి. | పండితారాధ్యచరిత్రము. (ద్వి.) | 210 | రఘు. | రఘువంశము. |
| 167 | పద్మ. | పద్మపురాణము (ఉ. ఖం.) | 211 | రఘునా. | రఘునాథాభ్యుదయము. |
| 168 | పరమ. | పరమయోగి విలాసము. | 212 | రత్న. | రత్నపరీక్ష. |
| 169 | పా. హ. | పారిజాతాపహరణము. | 213 | రస. | రసమంజరి. |
| 170 | పాం. ప. | పాంచాలీ పరిణయము. | 214 | రసా. | రసాభరణము. |
| 171 | పాం.మా. | పాండురంగ మాహాత్మ్యము. | 215 | రసిక. | రసికజన మనోభిరామము. |
| 172 | పార్వ. | పార్వతీ పరిణయము. | 216 | రాఘ. | రాఘవపాండవీయము. |
| 173 | పు. చ. | పురూరవశ్చరిత్రము. | 217 | రాజగో. | రాజగోపాల విలాసము. |
| 174 | ప్ర. ప్ర. | ప్రభావతీ ప్రద్యుమ్నము. | 218 | రాజశే. | రాజశేఖరచరిత్రము. |
| 175 | ప్ర. లీ. | ప్రభులింగలీల. | 219 | రాజవా. | రాజవాహనవిజయము. |
| 176 | ప్ర.లీ.ద్వి. | ,, ద్విపద. | 220 | రాజ. వి. | రాజశేఖరవిలాసము. |
| 177 | ప్ర. వెం. | ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసము. | 221 | రాధామా. | రాధామాధవము. |
| 178 | ప్ర. బో. | ప్రబోధచంద్రోదయము. | 222 | రాధికా. | రాధికాసాంత్వనము. |
| 179 | ప్రభా. | ప్రభావతీప్రద్యుమ్నము. | 223 | రామరా. | రామరాజీయము. |
| 180 | ప్ర. భూ. | ప్రబంధమణి భూషణము. | 224 | రామలిం. | రామలింగేశ్వర శతకము. |
| 181 | బస. ద్వి. | బసవపురాణము (ద్విపద.) | 225 | రామాభ్యు. | రామాభ్యుదయము. |
| 182 | బహు. | బహులాశ్వచరిత్రము. | 226 | రామా. | రామాయణము. |
| 183 | బిల్హ. | బిల్హణీయము. | 227 | రా. ద్వి. | ,, (ద్విపద.) |
| 184 | బ్ర. ఖం. | బ్రహ్మోత్తరఖండము. | 228 | రు. చ. | రుక్మాంగదచరిత్రము. |
| 185 | భ. సు. | భర్తృహరి (సుభాషిత రత్నావళి.) | 229 | రుక్మి. | రుక్మిణీపరిణయము. |
| 186 | భ. ప. | భద్రాపరిణయము. | 230 | లక్ష. సం. | లక్షణసార సంగ్రహం |
| 187 | భ. చ. | భల్లాణచరిత్రము. | 231 | ల. వి. | లక్ష్మీవిలాసము. |
| 188 | భాగ. | భాగవతము. | 232 | లక్ష్మీ.నృ. | లక్ష్మీనృసింహావతారము. |
| 189 | భాగ. ద్వి. | భాగవతము (ద్విపద.) | 233 | వన. వి. | వనమాలివిలాసము. |
| 190 | భాను. | భానుమతీ పరిణయము. | 234 | వరా. పు. | వరాహపురాణము. |
| 191 | భార. | భారతము. | 235 | వసు. | వసుచరిత్రము. |
| 192 | భాస్క. రా. | భాస్కర రామాయణము. | 236 | వాసి. | వాసిష్ఠరామాయణము. |
| 193 | భా. శ. | భాస్కరశతకము. | 237 | వాల్మీ. | వాల్మీకిచరిత్రము |
| 194 | భీ. పు. | భీమేశ్వరపురాణము. | 238 | విక్ర. | విక్రమార్క చరిత్రము. |
| 195 | భే. క. | భేషజకల్పము. | 239 | విజ. వి. | విజయ విలాసము. |
| 196 | భో. | భోజరాజీయము. | 240 | విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము. |
| 197 | భో. ప. | భోజసుతాపరిణయము. | 241 | వి. నం. వి. | విజయనందన విలాసము. |
| 198 | మనుచ. | మనుచరిత్రము (స్వారోచిష మనుసంభవము.) | 242 | విష్ణుపు. | విష్ణుపురాణము. |
| 199 | మల్ల. | మల్లభూపాలీయము. | 243 | విష్ణుమా. | విష్ణుమాయా నాటకము. |
| 200 | మ. పు. | మల్లపురాణము. | 244 | విప్ర. | విప్రనారాయణ చరిత్రము. |
| 201 | మల్హా. | మల్హాణచరిత్ర. | 245 | వీధినా. | వీధినాటకము. |
| 202 | మార్కం. | మార్కండేయ పురాణము. | 246 | వీర. వి. | వీరభద్రవిజయము. |
| 203 | ముకుంద. | ముకుందవిలాసము. | 247 | వేం.పం. | వేంకటకవి పంచతంత్రము. |
| 204 | మృ. వి. | మృత్యుంజయవిలాసము. | 248 | వేం. మా. | వేంకటాచల (కృ. కవి.) |
| 205 | మై. | మైరావణచరిత్రము. | 249 | వేం. మా. | వేంకటాచల మాహాత్మ్యము. |
| 206 | మొ. రా. | మొల్లరామాయణము. | 250 | వేణు. శ. | వేణుగోపాలశతకము. |
| 207 | యయా. | యయాతిచరిత్రము. | 251 | వేమన. | వేమనశతకము. |
| 208 | రంగా. | రంగారాయచరిత్రము. | 252 | వైజ. | వైజయంతీ విలాసము. |

| సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|
| 253 | శశాం. | శశాంకవిజయము. |
| 254 | శాస. ప. | శాసనపద్యములు. |
| 255 | శి. ధ. | శివధర్మోత్తరము. |
| 256 | శి. ర. | శివరహస్యఖండము. |
| 257 | శి. రా. | శివరాత్రిమాహాత్మ్యము. |
| 258 | శి. సా. | శివతత్త్వసారము. |
| 259 | శి. యో. | శివయోగసారము. |
| 260 | శుక. | శుకసప్తతి. |
| 261 | శు. చ. | శుకచరిత్రము. |
| 262 | శృం. ర. | శృంగార రసమంజరి. |
| 263 | శృం.రసా. | శృంగారరసాలవాలము. |
| 264 | శేష. | శేషధర్మము. |
| 265 | శ్రీరంగ. | శ్రీరంగ మాహాత్మ్యము (భై.) |
| 266 | శ్రీరం.మా. | „ (వరద.) |
| 267 | ష. చ. | షట్చక్రవర్తిచరిత్రము. |
| 268 | షో. చ. | షోడశకుమార చరిత్రము. |
| 269 | సకలనీ. | సకలనీతి సమ్మతము. |
| 270 | సత్య.సాం. | సత్యభామాసాంత్వనము. |
| 271 | సమీర. | సమీరకుమారవిజయము. |
| 272 | సర్వ. సా. | సర్వలక్షణ సారసంగ్రహము. |
| 273 | సస్యా. | సస్యానందము. |
| 274 | సాంబో. | సాంబోపాఖ్యానము. |
| 275 | సానం. | సానందోపాఖ్యానము. |
| 276 | సారం. | సారంగధర చరిత్రము |
| 277 | సా. ద్వి. | (ద్విపద.) |
| 278 | సిం. నా. | సింహాద్రినారసింహ శతకము. |
| 279 | సీతా. | సీతారామాంజనేయసంవాదము. |
| 280 | సీ. వి. | సీతావిజయము. |
| 281 | సీమం. | సీమంతినీకళ్యాణము. |
| 282 | సుద. | సుదక్షిణాపరిణయము. |
| 283 | సురా. | సురాభాండేశ్వరము. |
| 284 | సు. శ. | సుమతీశతకము. |
| 285 | సే. ఖం. | సేతుఖండము. |
| 286 | హంస. | హంసవింశతి. |
| 287 | హరిశ్చ. | హరిశ్చంద్రనలోపాఖ్యానము. |
| 288 | హర. | హరవిలాసము. |
| 289 | హ. వి. | హరభక్తవిలాసము. |
| 290 | హరి. | హరివంశము. |
| 291 | హ. ద్వి. | హరిశ్చంద్రోపాఖ్యానము. (ద్విపద.) |
| 292 | హరి.వరా. | హరిభట్టువరాహపురాణము. |
| | | **సంస్కృతలక్ష్య గ్రంథములు** |
| 293 | అమర. | అమరసుధ. |
| 294 | ఉత్త. | ఉత్తరరామచరితము. |
| 295 | కాదం. | కాదంబరీకావ్యము. |

| సంఖ్య | సంకేతములు | పేరు |
|---|---|---|
| 296 | కావ్యా. | కావ్యాదర్శము. |
| 297 | గీత. | భగవద్గీత. |
| 298 | గీ. గో. | గీతగోవిందము. |
| 299 | పరా. | పరాశరస్మృతి. |
| 300 | భట్టి. | భట్టికావ్యము. |
| 301 | భామిని. | భామినీవిలాసము. |
| 302 | మనుస్మృ. | మనుస్మృతి. |
| 303 | మ. వీర. | మహావీరచరిత్రము. |
| 304 | మాలతీ. | మాలతీమాధవము. |
| 305 | మాళ. | మాళవికాగ్నిమిత్రము. |
| 306 | ముద్రా. | ముద్రారాక్షసము |
| 307 | మురా. | అనర్ఘరాఘవము (మురారి.) |
| 308 | మృచ్ఛ. | మృచ్ఛకటికము. |
| 309 | మే. దూ. | మేఘదూతము. |
| 310 | యాజ్ఞ. | యాజ్ఞవల్క్యస్మృతి. |
| 311 | రత్నా. | రత్నావళి. |
| 312 | రసగం. | రసగంగాధరము. |
| 313 | విక్ర. | విక్రమోర్వశీయము. |
| 314 | వేణీ. | వేణీసంహారము. |
| 315 | శాకుం. | అభిజ్ఞానశాకుంతలము. |
| 316 | శిశు. వ. | శిశుపాలవధము. |
| 317 | సం. కిరా. | కిరాతార్జునీయము. |
| 318 | సం.కు.సం. | కుమారసంభవము. |
| 319 | సం.చంరా | చంపూరామాయణము. |
| 320 | సం. దశ. | దశకుమారచరితము. |
| 321 | సం. నైష. | నైషధీయచరితము. |
| 322 | సం. పం. | పంచతంత్రము. |
| 323 | సం. ప్ర. | ప్రబోధచంద్రోదయము. |
| 324 | సం.భర్తృ. | భర్తృహరిసుభాషితము. |
| 325 | సం. భాగ. | భాగవతము. |
| 326 | సం. భార. | భారతము. |
| 327 | సం. రఘు. | రఘువంశము. |
| 328 | సం.రామా. | రామాయణము. |
| 329 | సం.సా.ద. | సాహిత్యదర్పణము. |
| 330 | హి. దే. | హితోపదేశము. |
| 331 | త. చం. | తత్సమచంద్రిక. |
| | | **కావ్యములు** |
| 332 | ర. వం. | రఘువంశము |
| 333 | కు. సం. | కుమారసంభవము |
| 334 | మే. సం. | మేఘసందేశము |
| 335 | భారవి | భారవి |
| 336 | మురారి | మురారి |

(మిగతవి స్పష్టము.)

# పదముల పట్టిక

| అక్షరము | శబ్దరత్నాకరము 5873 | | ఆంధ్ర వాచస్పత్యము - 12309 | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | సం. పదములు | తెనుఁగు పదములు | సం. పదములు | తెనుఁగు పదములు | అంకములు | పారిభాషికములు | జాతీయములు | శాసన పదములు | ఆంగ్ల పరిభాష | వాడుక | లోకోక్తులు |
| అ | 1521 | 855 | 2800 | 1323 | 254 | 833 | 8 | .... | 47 | 20 | 14 |
| ఆ | 626 | 260 | 1062 | 475 | 69 | 259 | 5 | 3 | 23 | 18 | 8 |
| ఇ | 61 | 261 | 182 | 432 | 14 | 48 | 2 | 19 | 27 | 3 | 9 |
| ఈ | 29 | 119 | 56 | 183 | 6 | 3 | 2 | 0 | 0 | 0 | 2 |
| ఉ | 619 | 273 | 933 | 400 | 14 | 137 | 8 | 24 | 1 | 8 | 2 |
| ఊ | 36 | 102 | 83 | 132 | 3 | 22 | .... | .... | .... | 1 | ... |
| ఋ | 29 | .... | 65 | ... | .... | .... | .... | .... | .... | .... | .... |
| ౠ | .... | .... | 1 | .... | .... | .... | .... | .... | .... | .... | .... |
| ఌ | .... | .... | 1 | .... | .... | .... | .... | .... | .... | .... | .... |
| ౡ | .... | .... | 1 | .... | .... | .... | .... | .... | .... | .... | ... |
| ఎ | .... | 353 | .... | 645 | 3 | 32 | 6 | 5 | 112 | 7 | 6 |
| ఏ | 44 | 160 | 142 | 218 | 14 | 63 | 3 | 2 | 29 | 3 | 3 |
| ఐ | 20 | 20 | 41 | 27 | 9 | 5 | 1 | 3 | 7 | 0 | 0 |
| ఒ | .... | 308 | .... | 445 | 3 | 15 | 5 | 8 | 5 | 3 | 5 |
| ఓ | 15 | 110 | 49 | 150 | .... | 11 | .... | 3 | 20 | .... | .... |
| ఔ | 34 | 18 | 66 | 15 | 2 | 5 | .... | .... | 7 | 1 | ... |
| క | 1192 | 706 | 3956 | 2904 | 357 | 229 | 58 | | 17 | 124 | 5 |
| క్ష | 125 | 0 | 342 | 0 | 5 | 9 | 0 | | 0 | 2 | 0 |
| ఖ | 124 | 4 | 432 | 2 | 9 | 15 | 0 | | | 22 | 6 |
| గ | 460 | 1061 | 1322 | 1623 | 160 | 127 | 14 | | | 207 | 0 |
| ఘ | 89 | 0 | 208 | 0 | 16 | 13 | 1 | | | 6 | 0 |
| ఙ | 0 | 0 | 2 | 0 | 0 | 0 | 0 | | | 0 | 4 |
| చ | 231 | 686 | 800 | 982 | 114 | 55 | 23 | | | 49 | 2 |
| ౘ | 0 | 554 | 0 | 830 | 10 | 0 | 5 | | | 8 | 0 |
| ఛ | 53 | 0 | 135 | 0 | 8 | 5 | 0 | | | 2 | 1 |
| జ | 296 | 125 | 640 | 195 | 51 | 20 | 1 | | | 10 | 1 |
| ౙ | 0 | 545 | 0 | 600 | 0 | 0 | 0 | | | 20 | |
| ఝ | 23 | 0 | 65 | 0 | 8 | 1 | 0 | | | 2 | |
| ఞ | 0 | 0 | 1 | 0 | 0 | 0 | 0 | | | 0 | |
| ట | 9 | 50 | 28 | 55 | 0 | 0 | 0 | | | 35 | |
| ఠ | 2 | 16 | 3 | 22 | 0 | 1 | 0 | | | 6 | |
| డ | 26 | 156 | 36 | 166 | 3 | 0 | 1 | | | 46 | |
| ఢ | 6 | 0 | 6 | 4 | 0 | 0 | 0 | | | | |
| ణ | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | | | | |
| | 8704 | 9663 | 18927 | 16283 | 1654 | 3351 | 183 | 67 | 573 | 967 | |

# ఆంధ్ర వాచస్పత్యమును గుఱించి పండితాభిప్రాయములు

## విమర్శకాగ్రేసర కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారు

"ఇందున్న విశేషములన్నియు నితరనిఘంటువులలో లేవు. పెక్కేల? ఇది సర్వస్వమును గలవు. దీనిని నిఘంటు సామాన్యముగా నెంచఁదగినది కాదు. శబ్దార్థ సర్వస్వ మనవచ్చును. తారానాథ తర్కవాచస్పతిచే విరచింపఁబడిన వాచస్పత్యమువలెఁ దెనుఁగున నీయది యుపయోగించునని యనుటకు సందియమింతయు నుండ నేరదు. కావున దీనిని శబ్దకల్పద్రుమమని చెప్పవచ్చును."—(పీఠికనుండి)

## జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, యం. ఏ., బి. యల్.,

"......రత్నాకరమున బ్రవేశించు ధృతిశాలివలె భాషార్ణవమునఁ బ్రవేశించునాతఁడే భావార్థరహస్యముల నెఱుఁగఁజాలును. గభీరతత్త్వమును హృదయంగమ మొనరించుకొనఁగలుగును. ఆంధ్ర వాచస్పత్యకర్త యీ యుత్కృష్ట కర్తవ్యమును నిర్వహించిరి. ఏదేని శాస్త్రమునకు అర్థము చెప్పవలసిన సందర్భమున దాని నెఱింగించి ఆ శాస్త్రమునకు సంబంధించిన బహుళ విషయములను పూసగ్రుచ్చినట్లు వీరు తెలిపిరి. వివిధశాస్త్రములను చదువనివారు ఈ మహాగ్రంథమును పరిశీలించిరేని వాని విశేషములను కన్నులకు కట్టినట్లు కట్టెదుటఁ గాంచఁగలరు......... వైజ్ఞానిక మహీరుహామిది ......—"

(సింహావలోకనమునుండి)

## కట్టమంచి రామలింగారెడ్డిగారు, యం. ఏ.,

"ఈ మహోద్గ్రంథము కారణముగ తమకు నమర్త్యకీర్తి సంఘటిల్లు ననుటకు సందేహములేదు."

## భారతీతీర్థప్రధాని: బుర్రా శేషగిరిరావుగారు, యం. ఏ.,

"శబ్దనిర్వచనములు చాల జ్ఞానదాయకములుగ నున్నవి. విజ్ఞాన సర్వస్వమువలె నుపయోగించును."

## గిడుగు రామమూర్తి పంతులుగారు

"మీ నిఘంటువు శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువును మించియున్నది."

## శ్రీ చిరంతనానందస్వామివారు, శ్రీరామకృష్ణమఠము, చెన్నపురి.

"నేను వ్రాసి ప్రకటించిన శ్రీ వివేకానంద జీవితచరిత్ర రచనకు దయతో మీరొసంగిన 'ఆంధ్రవాచస్పత్య' మెంతయు నాకుఁ దోడ్పడినది".

## జటావల్లభుల పురుషోత్తంగారు, యం. ఏ., ప్రిన్సిపాల్, సంస్కృత కళాశాల, కొవ్వూరు.

"ఏతన్నిఘంటునిర్మాణమువలన మీ రాంధ్రుల శాశ్వత కృతజ్ఞతకుం బాత్రులైతిరి..."

## దువ్వూరి జగన్నాథ శర్మగారు

"భళీ! ఇదివఱకుఁ బ్రకటితములైన నిఘంటువులకేకాక శ్రీ సూర్యరాయ - వావిళ్లాది రాఁగల నిఘంటువులకుఁ గూడ పర్యాయపద సూచీకరణమందైతే తమ నిఘంటువు మాతృస్థానము కాఁగలదని నా నమ్మకము."

## కౌమాండూరి శఠకోపంగారు, యం. ఏ., బి. యల్.,

"...ఆంధ్రవాచస్పత్యములో నున్న తెలుఁగు పదములు పూర్వసాహిత్యపు శబ్దములనే గాక ఇప్పటి జనుల వాడుక పదములనుగూడ చేర్చినారు. ఒకే శబ్దమునకు సంస్కృతములోను తెలుఁగులోను గల వివిధార్థము లన్నిటిని చూపినారు. ఆవశ్యకమని తోచినచోట ఉదాహరణలను (క్లుప్తముగానే) ఇచ్చినారు. వైజ్ఞానిక పారిభాషిక పదముల నెన్నిటినో కామశాస్త్రిగారీ నిఘంటువులో చేర్చుట ఈ వైజ్ఞానిక యుగములో చాల ఉపయోగకరమైనది. ఇందులో సంస్కృతాంధ్ర శబ్దములసంఖ్య క్రిందటికన్నను చాల హెచ్చినది. క్రొత్తగ కొన్ని మాండలిక పదములును చూపఁబడినవి. ఇది ఒక విధముగా గీర్వాణాంధ్రపదముల రెండింటి కోశమని చెప్పవచ్చు......".

## జనమంచి సీతారామస్వామిగారు

"ఆంధ్ర వాచస్పత్యము ఆంధ్రగీర్వాణ భాషా వైశారద్యమునకు నిదర్శనమై పండితులకుఁ బరమ మిత్రమై, విద్యార్థులకుఁ గామధేనువై, కళాశాలలకుఁ జెన్నిధానమై, పాఠశాలలకుఁ జింతామణియై, యాంధ్రహస్తముల కమూల్యభూషణమై, గ్రంథాలయములకుఁ గల్పతరువై, నిఘంటువులకు శిరోరత్నమై విరాజిల్లునని విశ్వసించుచున్నాను."

## గంటి లక్ష్మీనారాయణగారు

"పూర్వ నిఘంటువులవలె యిది మనుష్యమాత్రులుగాక యే ఋషులో, యే దేవతలో వ్రాసినదన్నను నమ్మదగ్గదే."

## గరిమెళ్ల వేంకటరామమూర్తిగారు

"ఇట్టి కార్యదీక్షా ధురంధరులగు మీకును మీ యాంధ్ర వాచస్పత్యమునకును గృపాళుఁడగు నప్పరమేశ్వరుఁడు చిరతరాయుస్సమృద్ధులఁ బ్రసాదించి సంరక్షించుఁగాత !..."

## మంత్రిప్రగడ నరసింహం పంతులుగారు, బి. ఏ., బి. యల్.,

"ఎన్ని కష్టములకైన ఓర్చి నిఘంటువును పూర్తిచేయుట చాల శ్లాఘనీయము."

## కావ్య పురాణతీర్థ, విద్వాన్ : జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు

మ. జననం బాదిగఁ బెంచినట్టి జనని, స్సద్భక్తితో వందనం
బును గావించి నిఘంటు రత్నము మదిం, బూజ్యుల్ప్రశంసింపఁ బే
ర్మిని శ్రీ శ్యామల కామశాస్త్రి ! కృతిసం, తృప్తిం దదంఘ్ర్యంకితం
బును గావించిన ధన్యమూర్తివి నినుం, బోలంగ లేరెవ్వరున్.

## గోరుగంతు అచ్యుత సూర్యనారాయణశర్మగారు

మ. ఎవరే శబ్దము నెట్లు వాడిరో యటం, చేకాగ్రచిత్తంబుతోఁ
గవిరాడ్గ్రంథములన్ విమర్శనముగా, గాలించి తత్సార భూ
తవచోరత్నములన్ని యేర్చి మనయాం, ధ్రంబందుఁ గోశంబు నిం
త వివేకంబున వ్రాసినారె యెవరై, నన్మున్ను విద్వన్మణీ !

ఇత్యాదు లింకను గలవు

శ్రీ

# ఆంధ్రవాచస్పత్యము



## త

త, ఒకయక్షరము. సం. వి. అ. పుం. 1. అంటు; చూ, సంయోగము; 2. నిశ్చయము: చూ, సత్యము; 3. కోపము: చూ, రోషము; 4. తోఁక, పందితోఁక (అనికొందఱు): చూ, వాలము. 1; 5. పరస్పరవిరోధము ను గలుగఁజేయు మాట: చూ, శబ్దము. 2; 6. దొంగ: చూ. హారకుఁడు. 1; పుం. న. 7. అడుట; ఏణ. 8. ఆడించువాఁడు; 9. ప్రస్తుతప్రయోజనపుమాట: చూ, శబ్దము. 2; 10. కారణము; చూ, హేతువు. 1; 11. లక్ష్మీముఖము; అం. 12. చూ, దంత్యములు; 13. చూ, పరుషములు.

తంకర, దే. వి. తుచ్ఛధాన్యము: చూ, ధాన్యము.

తంగు, దే. వి. చూ, రూ-టంగు.

తంగువాఱు, దే. వి. చూ, రూ-టంగువాఱు.

తంగెడు, దే. వి. రూ-తంగేడు*: చూ, హేమపుష్పకము.

తంగేటిజున్ను, జా. సులభముగా లభించునది. "అపవర్గ కాంక్షచే నాకొన్నవాఁకిఁదంగేటిజున్ను శ్రీరంగశాయి." కవికర్ణరసాయనము.

తంగేడు, దే. వి. చూ, రూ-తంగెడు *.

తంట, దే. వి. రూ-తంటా, 1. అప్పు: చూ, బాకి. 2; 2. మోసము: చూ, వంచన; 3. అతలకుతలము: చూ, శ్రమము. 1; 4. కలహము: చూ, యుద్ధము; 5. కొండియము-రూ-కొండెము. చాడి-రూ-చాడీ.

తంటలమారి, దే. విణ. రూ-తంటాలమారి. కలహకారి: చూ, సూచకుఁడు. 1.

తంటసము, వా. వి. 1: చూ, తండసము. (1); 2: చూ, తండసము. (2).

తంటా, దే వి. చూ, రూ-తంట. 168.

తంటియము, దే. వి. రూ-తంటెము*: (తగిరిన=తంటెము అయినది) చూ, ప్రపున్నాటము.

తంటెము, —పై.—

తండకము, సం. వి. అ. పుం. 1.=దంతియ, ఇంటిదూలము: చూ, మదనచేతులు; 2. కాటుకపిట్ట: చూ, పిచ్చుక; 3. నురుగు: చూ, ఫేనము; 4. కాలికివేసికొనెడు నగ: చూ, భూషణము. 2.

తండము, సం. వి. అ. పుం.=తండా, లంబాడీల గుంపు: చూ, సమూహము.

తండసము, సం. వి. అ. పుం. 1. కమ్మరకొలిమి: చూ, రంధ్రము. 1; దే. వి. (1) మంగలి వెంట్రుకలనూడఁబెటి తెడి పనిముట్టు: కుటిలిక, తంటసము; వా. (2) జరిమానా, తంటసము.

తండా, వై. వి. 1.=తండ. లంబాడీలగుంపు: చూ, సమూహము; 2. సరకునింపిన గోనెల సమూహము.

తండిరి, దే. వి. రూ-తంద్రి: చూ, సవిత. 1.

తండు, దే. స. క్రి. ఇయ్యవలసినధనమును పోయియడుగు. (తండుకొను అనియు) (తగులుకొను అనియు.)

తండుగోల, దే. వి. (తండు+కోల) చేసలఁ బొడిచెడు చిల్లకోల, మండము. పంచ. వేం. 1, ఆ. 614; చూ, సర్వల.

తండురీణము, సం. వి. అ. పుం. 1. కడుగునీరు: చూ, శుక్తము. 1; 2. కీటకము: చూ, పురుగు; 3. బొబ్బరలు; చూ, ధాన్యము.

తండులకొలింగనము, అం. చూ, ఆలింగనములు.

తండులఫల, సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి*: చూ, శొండి.

తండులము, సం. వి. అ. పుం. 1: చూ, బియ్యము; 2: చూ, వాయువిడంగము*. (ఇట్లు తండులీయిక-తండులువు.)

తండులాంబువు, సం. వి. ఉ. న. పులికడుగు: చూ, శుక్తము. 1.

తండులి, సం. వి. ఈ. స్త్రీ. చిట్టి *: చూ, ఖండీరము.

తండులీకము, సం. వి. అ. పుం.—పై.—

తండులీయకము, —పై.—

తండులీయము, 1.—పై.—; 2. ఒకానొక ధాన్యము: చూ, ధాన్యము; 3: చూ, వాయువిడంగము*.

తండులేరము, సం. వి. అ. పుం: చూ, తండులి*.

తండులోత్థము, సం. వి అ. న: చూ, తండులాంబువు.

తండులోదకము, —పై.—

తండువు, సం. వి. ఉ. పుం. ఈ. స్త్రీ. 1.=తెడ్డు-తెడ్డు. రూ-తండువు-తర్దువు. హస్తాకారమైన దారువు: చూ, దర్వి. 1. (చూ, పాత్రము. 6.): 2=త్రెడ్డు-తెడ్డు. రూ-తండువు-తద్దు-తడ్డు-తడ్డువు-తర్దువు-నావనడపు తెడ్డు: చూ, పీలి. 2; ఉ. పుం. 3. నందీశ్వరుఁడు (శ. ర.) (తుండి అని అమరము): చూ, వృషభము. 1.

తండెలు, దే. వి. రూ-తండేలు; చూ. సరంగు.

తండేలు, దే. వి.—పై.—

తండోపతండము, మి వి. 1: అహమహమిక, అహంపూర్వికి. (పె. ప):—ఓహరి; వా. వి. బ. 2. గుంపులు గుంపులు;

తంద్రి, దే. వి. 1: చూ, రూ-తండిరి. అం. 2. చూ, స్త్రీ రతకులు.

తంద్రి తంద్రి, దే. వి. (తండిరి+తండిరి) తాత; చూ, పితామహుఁడు. 1.

తంతి, వై. వి. 1=తంత్రి. తీఁగియ: చూ, సూత్రము. 1; 2. వీణె మొదలగు వానికి వేసెడు ఉక్కు కమ్మి: చూ, సారణి. 3; వా. వి. 3. వార్తలనందించెడి ఉక్కు తీఁగె, తంతువు.

**తంతియ**, దే. వి. రూ.తంతె. మెట్టు: చూ, సోపానము. (బ తంతియలు = మెట్లు.)

**తంతీపు**, దే. వి. చూ, సంభ్రమము. అం. భా. ప్ర. 140. (తరితీపు అని కొందఱు).

**తంతు**, వై. వి. 1. = తంత్ర. క్షుద్రదేవతకొలువు. (దేశ్యమని శ. ర.): చూ, పండుగ. 2; 2. = తంత్రమ్. ఉభయార్థ సాధకమైన ఉపాయము: చిట్టె. (సం. ప.).—తంత్రము; 3. వివాహాదులలోఁజేయు కార్యవిశేషము.

**తంతుకాష్ఠము**, సం. వి. అ న. 1. సాలెవానినాడె: చూ, నాడె; 2. మాలు వడికెడు కదురు; చూ, తర్కువు.

**తంతుకీటము**, సం. వి. అ. పుం. పట్టు పురుగు: చూ, పురుగు.

**తంతునాగము**, సం. వి. అ. పుం. నెగడు: చూ, మత్స్యము. 1.

**తంతునాభము**, సం. వి. అ. పుం: చూ, సాలెపురుగు.

**తంతుభము**, సం. వి. అ. పుం. ఆవాలు: చూ, సర్షపము.

**తంతువాయము**, సం. వి. అ. పుం: చూ, సాలెపురుగు.

**తంతువాయుఁడు**, సం. వి. అ. పుం. 1: చూ, సాలెవాఁడు: అం. 2: చూ, జాతులు.

**తంతువు**, సం. వి. ఉ. పుం. 1. మాలిపోఁగు: చూ, సూత్రము. 1; 2: చూ, తంతునాగము; 3: చూ, తంతి. 2; 4: చూ, తంతి. 3.

**తంతుస్నేహము**, సం. వి అ. పుం: చూ, తంతుభము.

**తంతె**, దే. వి. చూ, రూ-తంతియ.

**తంత్రకము**, సం. విఱ క్రొత్తది (బట్ట): చూ, వస్త్రము.

**తంత్రభేదము**, అం. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములలో నొకటి: చూ, తంత్రములు.

**తంత్రము**, సం. వి. అ. న. 1: చూ, తంతు 2; 2. స్వరాష్ట్రచింత. (చూ, ఆవాపము. 4.); 3. వ్యాకరణశాస్త్రము: చూ, శాస్త్రములు; 4. కుటుంబవ్యాపారము; 5. ఉత్తమమైన ఔషధము; చూ, మందు. 1; 6. నవవిధజ్యోతిషగ్రంథములు: చూ. సిద్ధాంతము. 2. (చూ, జ్యోతిషము.); 7. ప్రధానము: చూ, శ్రైష్ఠ్యము; 8. మాలుపడుగు: చూ, మగ్గము; 9. పరిజనము: చూ, పరివారము. 1; 10. ఒకానొక వేదశాఖ: చూ, వేదము; 11. కారణము: చూ, హేతువు. 1; 12. ఇట్లుచేయఁదగినదనుట; 13. ఒకపదమునకు రెండర్థములు గలిగియుండుట; 14. = తంతు. క్షుద్రదేవతారాధనము: చూ, పండుగ. 2; 15. చూ, అగమములు. (చూ, ఉపవిద్యలు 11-౧.)

**తంత్రములు**, అం. 1. మిత్రలాభము, మిత్రభేదము, సంధివిగ్రహము, లబ్ధనాశము. అసంప్రేక్ష్యకారిత్వము. (5); 2. అవ్యాజపాలిన్యాది — అవ్యాజపాలినీ, రాజ్యలక్ష్మి ప్రసాదక, సర్వసామ్రాజ్య. అంగారగమన, రాజ్యపాలన, స్త్రీబాలరాజ, చామరద్వంద్వ, ప్రవర్షరాజ, ధీర, గ్రామపాలన, మిత్రలక్ష్మీప్రయోగ, దుర్గపాలన, ప్రాణలక్ష్మీప్రయోగ, ప్రభాలక్ష్మీప్రయోగ, తోయలక్ష్మీప్రయోగ, గంధలక్ష్మీప్రయోగ, పుష్పలక్ష్మీప్రయోగ, కామరూప, కళాజీవనిక. కుంజకంబళ, కనకప్రయోగ, బోధినీ, సత్యలక్ష్మీప్రయోగ, పాదుక, ప్రజ్ఞాలక్ష్మీప్రయోగ. ఖేటక, చాపలేప, శల్య. క్షేమలక్ష్మీప్రయోగ, మణిస్థాపనప్రయోగ, పాతాళగమన, మర్దిని, స్ఫులింగలక్ష్మి, శంఖమర్దళ, చక్రాయుధప్రయోగ, భైరవాదిప్రయోగ, సూపతంత్ర, లేఖతంత్ర, పృథివి, అశ్వ, గజ, గోరక్ష. ఐశ్వర్యలక్ష్మి, శుల్క, మిశ్రలక్ష్మీప్రయోగ, జీవని, గిరి, వన, స్థానాపత్యప్రయోగ, శ్రీసర్వదండిని, విఘ్నచ్ఛేద, భరత, శృంగకాద్యప్రయోగ, నరవాహన, స్తంభిని, దాహిని, మారిణి, ద్వేషిణి, మృతసంజీవని, ఉచ్చాటన, తోషణి, ఆకర్షణ, హార, మేఖలికా తంత్రములు (60); 3. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములు.—మహామయాశంబరము, యోగినీ జాలశంబరము, తత్వశంబరము, సిద్ధభైరవ తంత్రము, కాలాగ్నిభైరవ తంత్రము, అగ్నిభైరవ తంత్రము, శక్తిభైరవతంత్రము, యోగినీభైరవ తంత్రము, మహాభైరవ తంత్రము, ప్రధానభైరవ తంత్రము, బ్రాహ్మీతంత్రము, మహేశ్వరీ తంత్రము. కౌమారీ తంత్రము, వైష్ణవీతంత్రము, వారాహీ తంత్రము, ఇంద్రాణీ తంత్రము, చాముండా తంత్రము, శివమాతీ తంత్రము, యమళాష్టక తంత్రము, చంద్రజ్ఞాన తంత్రము, మాలినీవిద్య, మహాసమ్మోహనము, వామజుష్ట తంత్రము, మహాదేవ తంత్రము, వాతూలము, వాతూలోత్తరము. కామికము, హృద్భేద తంత్రము, తంత్రభేదము, గుహ్యతంత్రము, కలావాదము, వాత్స్యాయనాదికము, కళాసారము, కుండికామతము, మతోత్తము, వీణాఖ్యము, త్రోతలము, త్రోతలోత్తరము, పంచామృతము, రూపభేదము, భూతోడ్డామరము, కులసారము, కులోడ్డీశము, కులచూడామణి, సర్వజ్ఞానోత్తమము, మహాకాళీమతము, అరుణేశము, మిలినేశము, వికుంఠేశ్వరము, పూర్వము, పశ్చిమము, దక్షిణము, ఉత్తరము, నిరుత్తరము, విమలము, విమలోద్ధము, దేవీమతము, శుభాగమపంచకము, వశిష్ఠసంహిత, సనకసంహిత, శుకసంహిత, సనందనసంహిత, సనత్కుమార సంహిత (మహావిద్యలు 18 యును ఉపవిద్యలు 46 ను గూడి చతుష్షష్టి విద్యలయ్యె.)

**తంత్రి**, సం. వి. ఈ. స్త్రీ. 1 = తంతి, లోహపుతీఁగె : చూ, సారణి. 3; 2, తిప్పతీఁగె: * : చూ, సోమవల్లి; 3. నాడి : చూ, నరము. (1).

**తంత్రిక**, సం. వి. అ. స్త్రీ, చూ, తంత్రి. 2.

**తంత్వాతర్చనము**, సం. వి. అ. న. అనుగ్రోవి: చూ, మగ్గము.

**తందనము**, వై. వి. = తానము. మాటిమాటికి తానశబ్దపూర్వకముగ చేసెడి రాగాలాపము. కళా. 3, ఆ. 197 : చూ, స్వరము. 2.

**తందర**, వై. వి. = తంద్ర. 1. తూఁగు, కునికిపాటు : చూ, ప్రమీల; 2. నిద్దుర : చూ, స్వప్నము. 2.

**తందరీణము**. సం. వి. అ. పుం; చూ. తండులోదకము

**తందువు**, సం. వి. ఉ. పుం : చూ, రూ తండువు.

**తందూరీణము**, సం. వి. అ, పుం : చూ, రూ- తండురీణము.

**తంద్ర**, సం. వి. ఆ. స్త్రీ = తందర. చూ, తందర.

**తంద్రి**, సం. వి. ఈ. స్త్రీ.—పై.—

**తంద్రిక**, సం. వి. ఆ. స్త్రీ —పై.—

**తంపటి**. వా. వి. కుండలో తేగలులోనగు వానిని నుంచి బోరగిలఁబెట్టి గడ్డిలోనగువానిచేత నుడికించుట.

**తంపటిదోసకాయ**, జా. క్రమవిరుద్ధముగా తయారైనది.

**తంపర**, దే. వి. తామరగుంపు, షండము: చూ, సహస్రపద్మము. 1.

తంపి, దే వి. రూ-త్రంపి 1. దాఁగిగుంట : చూ, రంధ్రము. 1;2 కయ్యము : చూ, యుద్ధము. 1.

తంబ, సం. వి. ఆ. స్త్రీ. 1. ఆవు : చూ, ధేనువు; దే. వి. (1) తంబతీఁగె * : చూ, శింబి

తంబళ, దే. వి రూ- తంబళి- తంబన-తమ్మళి- తంబిగ. 1. శివార్చనచేసి బ్రదికెడు జాతి. (తంబళవాఁడు, తంబళది); 2. అర్చకుఁడు : చూ, పూజారి; 3. శివార్చకుఁడు : చూ, పూజారి; విష్ణ్వర్చకుఁడు : చూ, పూజారి.

తంబళి, — పై. —

తంబిగ, — పై —

తంబి. దే వి. రూ- తమ్ముఁడు : చూ, సహోదరుఁడు. (ఇది వాల్లభ్య సంబోధనమునందు వాడఁబడును.)

తంబుగ, దే వి. మెడ నిడుపుగా నుండెడు చెంబు : చూ, పాత్రము 6.

తంబుర, వై వి = తుంబురు. రూ-తంబురా- తంబుఱ తంబుఱా, ఉ. రా. 6, ఆ. 116 : చూ, వీణె.

తంబురా, — పై. —

తంబుఱ, — పై. — (తంతి + బుఱ్ఱ) (ద్వయమని శబ్దరత్నాకరము.) ఉ. రా. 6. ఆ 116.

తంబుఱా, వై. వి = — పై —

తక, వా వి చూ, కిట.

తకతక, దే.వి తాళమునందగు ధ్వన్యనుకరణము:చూ, హాహా,

తకపికలాడు, దే వి. క్రి. (తకపి లు + ఆడు) ఇట్టట్టు చలించు. శశాం. 4, ఆ. 61 : చూ, సలించు.

తకపికలుసేయుట, జా. ఎచ్చుతగ్గులు సేయుట. "మకరాంకుని యనఁగు మేనమామకు నీకుం దకపికలు సేయవలదనుము." విజ. 2, ఆ 196.

తకరరు, వా. వి. చూ, రూ-తకరారు.

తకరారు, వా వి 1. భేదము; 2 వివాదము.

తకావి. హిం. వి. సేద్యముచేయుటకై సహాయముగా నియ్యబడెడు సొమ్ము.

తక్క, దే అవ్య. కాక : చూ, వినా.

తక్కటి. దే. వి మూఁడు ముఖములుగల దీపారాత్రికపు తట్ట

తక్కడ, వై. వి 1 = తర్కారి, రూ-తిక్కడ- తక్కెడ. కూర నెల్లి* : చూ, శ్రీపర్ణము. 1; వై. వా. వి 2. = త్ర్యంకటమ్. (పేముతట్టలు వ్రేలవేసిన) తక్కెడ-రూ- తక్కిడ- తక్కిడి తక్కెడ : చూ, త్రాసు.

తక్కరి, వై. వి. 1 = తర్కారి* : చూ, వైజయంతి. 4; వై. విశ. రూ-టక్కరి. (తక్కు + అరి) 2. మోసకాఁడు జై. 8, ఆ. 111 : చూ, వంచకుఁడు; 3. వంచకురాలు : చూ, స్త్రీ,

తక్కలి, చూ, రూ- తక్కరి. 1. *.

తక్కారి, — పై. —

తక్కాలి. — పై. —

తక్కిడ, వై. వి. చూ, రూ-తక్కడ. 1—2.

తక్కిడి, వై వి 1 = తస్కర. మోసము : చూ, వంచన; 2 = తర్కారి జయంతి* చూ, వైజయంతి. 4; 3. చూ, రూ-తక్కడ.2.

తక్కిడికాఁడు, వై. విశ. మోసకాఁడు. అచ్చ. సుం, కాం. 47 : చూ. వంచకుఁడు. 1.

తక్కిల, వై వి. = తర్కారీ* : చూ, వైజయంతి. 4.

తక్కిలి. — పై —

తక్కు, వై. వి = రక్క. రూ-టక్కు. 1. మోసము : చూ, వంచన; 2 అసత్యము : చూ, వితథము; 3. న్యూనము : చూ, వెలితి. 2; దే. వి 4. మిగులు. భార. సౌ. 2, ఆ. 60 : చూ, శేషము 1; దే. విశ. 5. ఇతరము : చూ, పరాయి; దే. అ. క్రి. 6. తప్పు. భార. సౌ. 2, ఆ 100. చూ, మిడివోపు; దే. స. క్రి 7. విడుచు. భార భీష్మ 3, ఆ. 306 : విసర్జించు; వై. అ. క్రి. 8. టక్కుచేయు : చూ, వంచించు.

తక్కుడు, దే వి. తక్కుట, మోసగించుట, సిర్వి. 4, ఆ. 66.

తక్కులాఁడి, ద్వ. విశ. (తక్కులు + ఆఁడి) : చూ, రూ-టక్కులాఁడి.

తక్కువ, దే. వి. కొఱత : వెలితి. 2.

తక్కువపడు, ద్వ. అ క్రి : చూ, లోపించు. 2.

తక్కువ పఱచు, ద్వ స. క్రి : చూ, చిన్నపుచ్చు, అగడుచేయు

తక్కువపఱచుట, దే వి. అధఃకరణము, అధఃకారము.

తక్కువపాటు, ద్వ. వి 1. కొఱఁతపాటు, భార. అర. 6, ఆ. 17. చూ, లోపము. 2; 2. న్యూనము ; చూ, వెలితి 2.

తక్కె, దే. వి. 1. రెండువీసెలయెత్తు. రూ- తక్కెడు, ఎత్తు, ఎత్తెడు, రెండువీసెలు; వై.వి. 2 = తర్కారి* ; వైజయంతి.4.

తక్కెడ- వై. వి. 1 = తర్కారీ. తక్కిలి, తక్కోలకము. *. చూ, వైజయంతి. 4. 2. = తర్కారీ. కూరనెల్లి : *. చూ, శ్రీపర్ణము. 1; 3. = త్ర్యంకటము : చూ, తక్కడ. 2.

తక్కెడు, దే. వి. = : చూ, రూ- తక్కె. 1.

తక్కెఁడు, దే. విశ. అల్పము : స్వల్పము.

తక్కెల, వై. వి. = చూ, రూ-తక్కెడ. 1.

తక్కేడ, వై. వి. = — పై. —

తక్కేల, వై వి. = — పై. —

తక్కొను, దే. అ. క్రి : చూ, యత్నించు. భార. ఆది. 4, ఆ. 79.

తక్కోలకము, సం. వి అ. న. రూ-కోలకము * చూ, తక్కెడ. 1. (తక్కోలఫలమని కొందఱు)

తక్కోలము, సం. వి. అ. న: చూ, తక్కోలకము.

తక్కోలబుట్లు, మి. వి: చూ, కటిఫలము.

తక్తు, వా. వి సింహాసనము: చూ, తప్తు.

తక్రకౌండిన్య న్యాయము, న్యా. "బ్రాహ్మణులకందఱికిని పెరుగు వడ్డింపుము కౌండిన్యునకు మాత్రము మజ్జిగ వడ్డింపుము." అన్నపుడు కౌండిన్యుఁడు బ్రాహ్మణుఁడైనను సామాన్యవిధి యిటఁ బ్రవర్తిల్లదు. విశేషవిధిచే సామాన్యవిధికి బాధగలిగినపు డీ న్యాయము వర్తించును.

తక్రము, సం. వి. అ. న. పాతికపాలు నీళ్ళుచేర్చిన మజ్జిగ: చూ, మజ్జిగ.

తక్రాటము, సం. వి అ. పుం. పెరుఁగుచిలికెడు కవ్వము: చూ, మంథానము.

తక్రాంతంభోజనమ్, న్యా. భోజనముచివర మజ్జిగను బోసికొనవలయును.

తక్షకుఁడు, సం. వి. అ. పుం 1. తక్షకుఁడను సర్పరాజు: చూ, సర్పము; 2. వడ్లవాఁడు. రూ-తక్షుఁడు-తక్షినుఁడు (కృశముగఁజేయువాఁడు): చూ, స్వర్ణకారుఁడు.

తక్షణము, సం. వి. అ. న. 1. (క్రమాను.) చెక్కుట; వా. వి. 2. జరుగుడు, వెంటనే: చూ, అకస్మాత్తు, దబ్బున.

తక్షిణి, సం వి. ఈ స్త్రీ. బాడిస: చూ, వాశి.

తక్షశిల, సం. వి ఆ. స్త్రీ. తక్షశిలయను దేశము: చూ, దేశము.

తక్షుఁడు, సం వి. న్. పుం: చూ, రూ-తక్షకుఁడు. 2.

తగటి, దే. విశ. (తగటు + ఇ) రూ-తగటీ. సరిగది: చూ, వస్త్రము.

తగటీ, దే. విశ—పై.—

తగటు, దే. వి. జలతారు. అచ్చ, బాల, కాం. 93: చూ, సరిగ.

తగడు, దే వి. బంగారు లోనగుకాఁచరేకు. పాండు. 3, అ. 202: చూ. సరిగ.

తగణము, పా. రెండుగురువులు ఒకలఘువు గలది. ఉదా — శ్రీరామ (చూ. అష్టగణ లక్షణము.)

తగము, పాత + గ ఉదా.— విశ్వేశ్వరా (చూ, ఉపగణములు.)

తగరపాదికము, సం. వి. అ. న. తగరము; చూ, లోహము. 1.

తగరము, సం. వి. అ. పుం. 1. = తగరు. పొట్టేలు: చూ, మేషము. 1: 2. జిహ్మము*: చూ, నందివర్ధనము; వై. వి. (1). = తమల-త్రపుల. రూ-తవరము: చూ, లోహము 1.

తగరు, వై. వి. 1. = తగర. పొట్టేలు: చూ, మేషము. 1; అం. 2. చూ, దిక్పాలవాహనములు.

తగరురవుతు, వై. వి. = తగర రాహుత్త. అగ్ని: చూ, వహ్ని. 1. (ఇట్లు తగరబాబాసామి)

తగవరి, దే. వి (తగవు + అరి) రూ-తగువరి. న్యాయాధిపతి: చూ, స్వామి. 3.

తగవు, దే. వి. రూ-తగువు. 1. న్యాయము. భార. ఉద్యో. 2, అ. 64: చూ, సత్యము. 1; 2 తగుట; 3. ధనాది నిమిత్తమైన జగడము: చూ, యుద్ధము; 4. పెండ్లప్పుడు పెండ్లికూఁతునకు తల్లిదండ్రులిచ్చెడు బహుమానము; అగవు— అగువు, విశ. 5. తగినది. యుక్తము భార స్త్రీ. 2, అ. 62: చూ, సమీచీనము. 1; వా. వి. 6. తగాదా. "తగవు తెచ్చినాఁడు."

తగవుగోరి, దే. విశ. (తగవు + కోరి) సంధిచేయువాఁడు: చూ, మధ్యస్థుఁడు.

తగాదా, వా వి. 1. తగవు; 2. వ్యాజ్యము.

తగాయిదా, వా. వి.—పై.—

తగియుండు, వా. అ. క్రి: చూ, సార్థకమగు

తగిరిస, దే. వి. తంగేడు*: చూ, ప్రపున్నాటము.

తగిలించు, దే. స. క్రి: అంటించు. 3.

తగు, దే. అ. క్రి. 1. ఒప్పు అ., భా. తృ. 83: చూ, సమ్మతించు; 2. యుక్తమగు: చూ, పరిపడు. 2.

తగుకత్తి, ద్వ. వి. సాధనకు ఉపయుక్తమైన కత్తి: చూ, కృష్టి 2

తగులఁగట్టు, దే. స. క్రి. (తగులన్ + కట్టు) తగిలించు: చూ, తగులఁబెట్టు.

తగులఁబడు, ద్వ. అ. క్రి. (తగులన్ + పడు) తగులు, చిక్కు (స్వార్థమువపడు); చూ, లోఁబడు.

తగులఁబెట్టు, దే స. క్రి. (తగులన్ + పెట్టు) 1: చూ, తగులఁగట్టు; 2 కాల్చు: చూ, దహించు.

తగులము, దే. వి. రూ-తగులు-తవులు-తౌలు. 1. చొక్కు: చూ, వలపు. 2; 2. ఆసక్తి. భార. విరా. 2, అ. 261: చూ, వాంఛ; 3. అడ్డపాటు: చూ, వారణము 1.

తగులాటకత్తె, ద్వ. వి. (తగులాటము + కత్తె) తగులాటము గల ఆఁడుది: చూ, స్త్రీ. 1.౨౧౧.

తగులాటము, దే. వి. (తగులు + ఆట) తగులు: చూ, బంధము. 1. (ఇది పోరాటము మాటాటము వంటిది)

తగులు, దే. వి. 1. రూ-తవులు-తౌలు, ఆసక్తి. భార. అర. 2, అ. 62: చూ, వాంఛ; 2. చొక్కు, అభిలాష: చూ, వలపు. 2; 3 పశువుమెడత్రాడు. ఆం, భా. ద్వి. 231: చూ, సూత్రము. 1; 4. తగులాటము కళా 4, అ. 49: చూ, బంధము. 1; అ. క్రి 5 చిక్కు: చూ, లోఁబడు; 6. తాఁకు: చూ, స్పృశించు; 7. సక్తమగు: చూ, మేళగించు. 1; 8 అంటు: చూ, లంకించు. 1; 9, పొసఁగు: చూ, పొసఁగు; 10 పట్టు; "ఆయిల్లు కట్టుటకు ఖర్చు ఏమితగిలెను": చూ, పట్టు; అం. ప్రే. 11. తగులఁజేయు. కళా, 3, అ. 197. తగులుచు-రూ- తగుల్చు-తవులుచు-తౌలుచు-తౌల్చు. (సం. వ).— క్రీలించు; స. క్రి. 12: చూ, వెంబడించు.

తగులుకొను, దే అ. క్రి. 1. మంటయెత్తు. "ఆ గుడిసె తగులుకొన్నది.": చూ, రాలు; స. క్రి. 2. కామించు, రూ-తవులుకొను, తౌలుకొను: చూ, సంభోగించు.

తగులుకోలు, దే. వి. తగులుకొనుట : చూ, లంకెపాటు.

తగులుగొంటి, దే. విశ. (విటుని) తగులుకొనునట్టిది. (ఆఁడుది): చూ, విటుకులాఁడి.

తగులుచు, దే. ప్రే: చూ, రూ-తగులు. 11.

తగుల్చు, దే. ప్రే. —పై.—

తగులుడు, దే. వి. 1: చూ, తగులుకోలు; 2. పెట్టుబడి: చూ, వ్యయము.

తగులుదల, —పై.—

తగులుబడి, —పై.—

తగులుపడు, ద్వ. అ. క్రి. చిక్కు: చూ, లోఁబడు.

తగులుపాటు, ద్వ. వి. తగులుపడుట.

తగువు, దే. వి: చూ, రూ- తగవు.

తగ్గించు, దే. స. క్రి: అతకరించు, తీసివేయు. ప్రే.—క్రిందుపఱచు. అ. క్రి.— అణుగువడు, ఓసరిలు- రూ-ఓసరిల్లు-ఓసరు. తగ్గు, తఱుఁగు-రూ-తఱుగు. (మి. వ.).— అ క్రి.— అల్పత నొందు. (సం. వ.) స. క్రి.— అధఃకరించు, 2. చూ, సంక్షేపించు.

తగ్గింపు, దే. వి. చౌక: చూ, వెల. 1.

తగ్గు, దే. వి. 1. తక్కువ. రూ-తగ్గుదల: చూ. వెలితి. 2; అం. 2. త్రివర్గమునందొకటియగు క్షయము. (త్రివర్గములు.— క్షయ స్థానవృద్ధులు. = తగ్గు నిల్కడ పెరుగుట.) చూ, వర్గములు; దే. అ. క్రి 3. తక్కువగు: చూ, ప్రుక్కు. 4; 4. ఓసరిలు. ఆం, భా. తృ. 98: చూ, తగ్గించు; 5. వెనుకకుఁదీయు: చూ, వెనుకదీయు; 6. తెగిపడు. భార. విరా. 4, అ. 87.

తగ్గుదల, దే. వి; చూ, రూ- తగ్గు. 1.

తచ్చన, దే. వి. 1. ఆట చూ, పరిహాసము; 2 కపటము : చూ, వ్యాజము. 1.

తచ్చనలాడు, దే. అ. క్రి. పరిహసించు; చూ, పిసాళించు.

తచ్చనచేయు, ద్వ. స క్రి. (తచ్చన + చేయు) —పై.— పాండు. 1, ఆ. 199.

తటకా, దే. వి. నివ్వెఱ; చూ, వెఱవెఱపాటు.

తటకాపడు, ద్వ. అ. క్రి. చేష్టలుతక్కు. సా 2, ఆ. 37.

తటకాపాటు, ద్వ. వి. రూ- తటుకుపాటు. ఆశ్చర్యము; చూ, వింత. 1.

తటతట, దే. వి. గుండెలదరుటలో. గువానియందగుననుకరణము. ప్రభా. 3, ఆ. 126 : చూ, హుహూహూ.

తటపటాయించు, వా. అ. క్రి 1. వెనుక ముందులు ఆలోచించు; 2. సందేహించు.

తటమట, దే. వి. 1. మోసము ; చూ, వంచన; విణ. 2. మోసముగలది. రూ- తటవట : చూ, వంచకము ; 3. కలఁతనొందినది. లక్ష్మీ. 4, ఆ. 172; చూ, వ్యాకులము.

తటమటించు, దే. స క్రి. 1. మోసపుచ్చు : చూ, వంచించు; 2 కలఁచు. భాగ. 4, స్కం. 746 : చూ, కలగుండువెట్టు.

తటము, సం. వి. అ. న. 1. వరిమడి ; చూ, భూమి. 1. (చూ, పొలము); పుం, న. 2. = తట్టు. రూ - తటి. ఏటి ఒడ్డు : చూ, రోధస్సు; 3. చోటు : చూ, స్థానము. 1; పుం 4. కొండచఱియ ; చూ, పర్వతము.

తటపట, దే వి : చూ. రూ - తటమట. 1-2-3; 4. కల్ల : చూ, వితథము.

తటవటచేయు, దే. స. క్రి : చూ, వంచించు. తటవిటలు, వా. వి. బ. చిక్కులు.

తటవిట్లు,—పై.—

తటస్థము, సం. విణ. 1. సమీపమందున్నది : చూ, సమీపము. 1; 2. ఒనఁగూడినది : చూ, సిద్ధము. 3; వా. వి 3. కలుగఁజేసికొనక పోవుట. "తటస్థవృత్తి."

తటస్థించు, సం. అ. క్రి. 1 : చూ, సమీపించు; 2 : చూ, సిద్ధించు.

తటస్థుఁడు, సం. విణ. 1 న్యాయస్థుఁడు : చూ, సత్యవంతుఁడు; వా. 2. కలుగఁజేసికొననివాఁడు.

తటాకపరివాహన్యాయము, స్వా. చెఱువునీరు తూముగుండా కొంచెముగానైన విడువనియెడల గట్టు బ్రద్దలయి నీరంతయుఁ బోవుననువిధము.

తటాకము, సం. వి. అ. పుం. రూ - తటాగము - తడాకము - తడాగము. చెఱువు : చూ, సరస్సు 1; అం. 2. సంతానములు ఏడింటిలోనొకటి : చూ, సంతానములు.

తటాగము,—పై.—

తటాన, దే. ద్ర. క్రి. విణ. రూ - తటాలున - తటుకున - తటుక్కున - తడుకున. దబ్బున : చూ, డబ్బాటు; చూ, స్యదము. 1,

తటాయించు, దే. స. క్రి. అడ్డగించు : చూ, వారించు.

తటారించు, దే. అ. క్రి. చొచ్చు. అం, భా. తృ. 122 : చూ, సోఁకు. 4.

తటార్ధము, సం. వి. అ. పుం. దున్న : చూ, మహిషము.

తటాలు, దే. వి : చూ, తటతట జై. 6, ఆ. 13.

తటాలున, దే. ద్ర. క్రి. విణ : చూ, రూ - తటాన. వసు, 2, ఆ 83.

తటి, సం వి. ఈ. స్త్రీ. 1 : చూ, తటము. 2; 2 : చూ, తటము. 3.

తటిత, సం. వి. త్. స్త్రీ. రూ - తటిత్తు - స్తటిత్తు. మెఱపు : చూ, విద్యుత్తు.

తటిత్తు, —పై.—

తటిత్ప్రతి, సం. వి. ఇ. పుం. 1. మబ్బు : చూ, మేఘము. 1; అం. 2 ; చూ, విద్యుత్తులు.

తటిత్వంతము, సం. వి. త్. పుం. రూ - తడిత్వంతము. మబ్బు : చూ, మేఘము. 1.

తటిని, సం. వి. ఈ. స్త్రీ ఏఱు : చూ, నది. 1.

తటుకున, దే. ద్ర. క్రి. విణ : చూ, రూ. తటాన. జై. 4, ఆ. 107.

తటుక్కున, —పై.—

తటుకుపాటు, ద్వ. వి : చూ, రూ - తటకాపాటు - అం, భా. ప్ర. 182.

తట్ట, దే. వి. 1. తబుకు : చూ, పాత్రము 6 ; 2. వెదురుబద్దలు లోనగు వానితో నల్లిన పల్లెము, చిన్నగంప (అనికొందఱు) "ఎండుపుతట్ట - తక్కెడతట్ట." మొ : చూ, సజ్జ. 1.

తట్టగిల్లు, దే. అ. క్రి. తట్టయగు.

తట్టమి, దే వి : చూ, టంగువాఱు. కళా. 3, ఆ. 62.

తట్టన, వై. వి. ధైర్యము. ఉ. హరి. 3, ఆ. 123 చూ, స్థైర్యము. 1.

తట్టాడు, దే. స. క్రి. (తట్టు + ఆడు) (అడుగులు) ఇట్టట్టిడు. లక్ష్మీ. 3, ఆ. 147.

తట్టి, దే. వి. 1. కంచము : చూ, పాత్రము. 6; 2. తెర. నిర్వ. 5, ఆ. 100 : చూ, వేఁటతెర.

తట్టు, వై. వి. 1. = తటమ్. ఒడ్డు : చూ, రోధస్సు; 2. వైపు : చూ, పార్శ్వము. 2; 3. = దండ. రూ - తట్టువ - తట్టువము. గుఱ్ఱము : చూ, హయము; 4. = దండ. రూ - తట్టువ - తట్టువము. కుత్సితాశ్వము, పొట్టిగుఱ్ఱము (అనికొందఱు) : చూ, హయము; దే. వి. 5. శబ్దదోషములలో నొకటి; 6. దెబ్బ : చూ, హతి. 1; అ. క్రి. 7. కలుగు : చూ, పుట్టు. 2; 8. తోఁచు : చూ, స్ఫురించు. 2: స. క్రి. 9 చఱచు : చూ, పటతళించు.

తట్టుగాలి, వా. వి. 1. ప్రక్కగాలి; 2. కోపము; 3. చిరాకు; 4 పోవుకాలము (పోయికాలము) "నీకు ఏమితట్టుగాలి వచ్చెనదిరా!" (వినాశకాలము)

తట్టుచేయు. ద్వ. వి. కోటకొమ్మమీఁది అవయవము : చూ, సదనము. 1.

తట్టుపునుఁగు, ద్వ. వి. తట్టియెత్తిన మేలైన పునుఁగు : చూ, పూతిపునుఁగు.

**తిరిపరి**, దే. విశ. (తిరిపము + అరి): చూ, తిరిపగాఁడు. కాశీ 7, ఆ. 52.

**తిరిపె**, —పై.—

**తిరిపెగాఁడు**, —పై.—

**తిరిపెము**, దే. వి: చూ, రూ-తిరిపము.

**తిరియు**, దే. స. క్రి. రూ-తిరుచు. భిక్షమెత్తు. భార. సౌ. 1, ఆ. 217; చూ, యాచించు.

**తిరిర**, దే వి. తిత్తికి యను చేఁప: చూ, మత్స్యము. 1.

**తిరివడు**, ద్వి. అ. క్రి. (తిరి + పడు) కలఁతపడు: చూ, సంక్షోభించు.

**తిరివెట్టు**, దే. స. క్రి. (తిరి + పెట్టు) కలఁతపఱచు: చూ, సంక్షోభించు.

**తిరీటకము**, సం. వి. అ. పుం. రూ-తిరీటము: చూ, లొద్దుగు*.

**తిరీటము**, 1.—పై.—; న. 2. కిరీటము: చూ, సీసకము. 1.

**తిరు**, వై విశ = శ్రీ శ్రీప్రదము, శుభకరమైనది: చూ, శుభము. 4. "తిరునామము, తిరుమేను" మొ (దేశ్యమని శ. ర.)

**తిరుఁడు**, వై. విశ. = స్థిరః: చూ, స్థిరుఁడు.

**తిరుకాపు**, ద్వి. వి. భగవంతునియొక్క అలంకారము: చూ, భూషణము. 2.

**తిరుకొలను**, వై. వి. రూ-తిరుకోళంబు. పుష్కరిణి; చూ, సరస్సు. 1. (దేశ్యమని శ ర.)

**తిరుకోళంబు**, వై. వి.—పై—

**తిరుక్షౌరము**, జా. ఏమియులేకుండఁజేయుట.

**తిరుగఁబడు**, ద్వి. అ. క్రి. (తిరుగన్ + పడు) 1. ఎదిరించు: చూ, ప్రతిఘటించు; 2. తిరుగు: చూ, అల్లాడు. 2; 3 మరలు. భార. ఉద్యో. 4, ఆ. 61: చూ, వచ్చిల్లు; 4. ఎదురెక్కు. లక్ష్మీ. 4, ఆ. 69: చూ, పల్లటిల్లు; వా. 5 వీఁపుక్రిందగు, వెలకిలఁబడు: చూ, వెలికిలు. (స్వార్థమున పడు).

**తిరుగఁబోఁత**, దే. వి. రూ-తిఱుగఁబోఁత. తిరుగఁబోయుట, తాలింపు. రా, వి 2: ఆ 10: చూ, సాతాళింపు.

**తిరుగఁబోయు**, దే. స. క్రి. (తిరుగన్ + పోయు) తాలించు: చూ, సాతాళించు.

**తిరుగడ**, ద్వి. వి. (తిరుగు + గడ) మరపెట్టిన గొట్టము: చూ, మరచుట్టు.

**తిరుగలి**, దే వి. 1. (తిరుగు + కలు) పిండిలోనగునవి విసరెడు శిలాయంత్రము: రూ-తిరగలి-తిఱుగల్లు, జక్కి. (సం. ప).— ఘరట్టము, చక్రికాయంత్రము; వా. 2. బియ్యముపైనఁగల ఎఱ్ఱనిచారపోకుండునట్లు విసరెడు గఱుకులగళ్ళు గల వడ్ల తిరగలి. (ఈబియ్యము మరబియ్యముకంటె ఆరోగ్యప్రదము.); దే. వి. 3. (తిరుగు + కలి) భ్రమము: చూ, విహారము. 1.

**తిరుగాడు**, దే. అ. క్రి. (తిరుగు + ఆడు) తిరుగు. జై. 8, ఆ 125. చూ, సంచరించు.

**తిరుగు**, దే. వి 1. రూ-తిరుగుడు. తిరుగుట. పాండు. 4, ఆ. 276: చూ, విహారము. 1; 2. రూ-తిరుపు. అపజయము. అం, భా. ద్వి. 224: చూ, పరాజయము; అ. క్రి. రూ-తిరుపు; 3: చూ, సంచరించు. ఉ. హరి. 6, ఆ. 140; 4: చూ, పరిభ్రమించు; 5. వెనుకకు మరలు: చూ, వెనుదీయు. 1. 6; చూ, వచ్చిల్లు. భాగ. 1, స్కం. 82; స. క్రి. రూ-తిరుపు; 7 పరివేష్టించు. పాండు. 4, ఆ. 275; నై. 2, ఆ 4: చూ, వేష్టించు.

**తిరుగుఁబోతు**, దే. విశ. (తిరుగు + పోతు) 1. తిరుగునట్టి స్వభావముగలవాఁడు; 2. తిరుగునట్టి స్వభావముగలది: చూ, స్త్రీ; 3. కులట; చూ, అంకులాఁడి; 4. లంజెకాఁడు: చూ, విటుఁడు.

**తిరుగుడు**, దే. వి. రూ-తిఱుగుడు. 1. తిరుగుట: చూ, విహారము. 1; 2; చూ, సంభ్రమము; 3: చూ, వ్యత్యయము; 4. తిరుగుడునొక్కు: చూ, మ(అ)ర; 5. చక్రము: చూ, శకటము. 1: (చూ, చక్రము. 10.)

**తిరుగుడుచీల**, దే వి. రూ-తిఱుగుడుచీల. తిరుగుడు నొక్కులు గల చీల: చూ, మ(అ)ర,

**తిరుగుడుత్రాడు**, దే. వి. పశువులను బట్టెడు సాధనము, త్రిప్పుడు త్రాడు: చూ, సూత్రము. 1.

**తిరుగుడునొక్కు**, దే. వి. (రూ-తిరుగుడు-తిఱుగుడు-తిఱుగుడు నొక్కు); చూ, మ(అ)ర.

**తిరుగుడుపడు**, ద్వి. అ. క్రి: చూ, పరిభ్రమించు

**తిరుగుడుపాటు**, ద్వి. వి తిరుగుడుపడుట; నిర్వ 3, ఆ 2.

**తిరుగుడుబిల్ల**, దే. వి స్త్రీల శిరోభూషణము: చూ, భూషణము. 2.

**తిరుగుడుబిల్లలు**, దే. వి: చూ, బాలక్రీడ.

**తిరుగుదల**, దే. వి. మరలుట: చూ, మరలుబాటు.

**తిరుగుమొగము**, ద్వి. విశ 1. అభిముఖము. "వ్యాధి కొంచెము తిరుగుమొగము పట్టినది.": చూ, ముందఱ. 1: 2. విముఖము: చూ, నొలయిక.

**తిరుగులాడు**, దే అ. క్రి; తారాడు.

**తిరుగువాఱు**, దే. స. క్రి. (తిఱుగు + పాఱు) పరివేష్టించు. పంచ. నా. 1, ఆ. 247: చూ, వేష్టించు.

**తిరుచిన్నము**, ద్వి వి. సన్నగాళె. ఒకానొక వాద్యము: చూ, వీణె.

**తిరుచు**, దే. స. క్రి: చూ, తిరియు.

**తిరుచూర్ణము**, మి. వి. పసుపు బియ్యము చేర్చిచేసి వైష్ణవులు నొసటనుంచుకొనెడు పొడి: చూ, బొట్టు. 1.

**తిరునామము**, ద్వి వి. తిరుమణిబొట్టు: చూ, బొట్టు. 1.

**తిరునాళ్ళ**, దే వి. రూ-తిరునాళ్ళు దేవోత్సవము: చూ, పండుగ. 2.

**తిరునాళ్ళు**, —పై.—

**తిరునీఱు**, దే. వి. శైవులు నొసటనుంచుకొనెడు గోమయపిండ భస్మము: చూ, భస్మము.

**తిరుపగూడ**, దే. వి (తిరు + గూడ) గూడ, వైష్ణవులు తిరుమణి పెట్టె మొదలైనవియుంచి చంకను దగిలించుకొనెడు తాటాకుల బుట్ట: చూ, సజ్జ. 1.

**తిరుపతి**, దే. వి. తిరుమల (చిత్తూరుమండలములోనిది) విష్ణుక్షేత్రము, వేంకటాచలము: చూ, పర్వతము.

**తిరుపు**, దే. వి. తిరుగుట: చూ, విహారము. 1.

**తిరుపులుగట్టు**, దే. అ. క్రి. (తిరుపులు + కట్టు): చూ, వ్యాపించు. పంచ. వేం. 4, ఆ. 147.

తిరుప్పాణియాళ్వారు, అం: చూ, ఆళ్వారులు.

తిరుమంగయాళ్వారు, అం.—పై.—

తిరుమజ్జనము, మి. వి. భగవంతుని యభిషేకము: చూ, స్నానము. 1.

తిరుమణి, వై. వి.=శ్రీమృత్. (తిరు+మన్ను) రూ-తిరుమన్ను. వైష్ణవులు నొసటనుంచుకొనెడు ధవళమృత్తిక: చూ, బొట్టు. 1. (ద్వయమని శ, ర.)

తిరుమణివడము, మి. వి. తామరపూసలదండ: చూ, భూషణము. 2.

తిరుమన్ను, వై. వి =: చూ, రూ-తిరుమణి.

తిరుమల, ద్వ. వి: చూ, తిరుపతి.

తిరుమాళిగ, ద్వ. వి. ఇల్లు: చూ, సదనము. 1.

తిరుముడి, దే. వి. వైష్ణవుఁడు: చూ, బ్రాహ్మణుఁడు.

తిరుముషియాళ్వారు, అం: చూ, ఆళ్వారులు.

తరుపడికోల, దే. వి. దాసరివాని దీపస్తంభము: చూ, స్తంభము. 1.

తిరువరంగములు, దే వి. బ. శాలిధాన్యము; చూ, ధాన్యము.

తిరువరాధనము, మి వి. (తిరు+ఆరాధనము) (వైష్ణవుల భాషయందు) దేవతార్చన: చూ, సపర్య. (తిరుశబ్దము విశిష్టాద్వైతమతస్థుల భాషలోనిది.)

తిరువు, దే. అ. క్రి: చూ, రూ-తిరుగు.

తిర్గు, —పై.—

తిరోధానము, సం. వి. అ. న. మఱుఁగుపాటు: చూ, వ్యవధానము. 3.

తిరోభావము, సం. వి. అ. పుం. మఱుఁగుపడుట: చూ, వ్యవధానము. 3.

తిరోహితమగు, మి. అ. క్రి: చూ, మఱుఁగుపడు.

తిరోహితుఁడు, సం. విణ: మఱుఁగుపడినవాఁడు

తిర్యక్కరణబంధములు, అం. సముద్గతము, పరివర్తితము, సమాంగకము, అభిత్రికము, సంపుటము, వేణుకాఖ్యము, కుక్కుటము, మానితము. (8).

తిర్యక్కరణము, అం. (శుకవాణి ప్రక్కవాలుగఁ బవ్వళింప పురుషుఁడెదురుగఁ బవ్వళించికూడుట): చూ, బంధములు.

తిర్యక్కు, అం. 1. చూ, రతులు; 2. చూ, బాహ్యప్రచారములు

తిర్యక్కోశము, సం. వి. అ. పుం. ఉపస్థలోపల నడ్డముగు మొగ్గగలది, భగభేదము: చూ, భగము. 12.

తిర్యక్ఛేద, అం. చూ, కంఠక్రియలు.

తిర్యక్సర్గము, అం. చూ, సృష్టిసర్గములు.

తిర్యగము, అం. 1. చూ, చుంబనములు; 2. చూ, చుంబనములు.

తిర్లి, దే. వి. రూ-తిర్వళిక. దీపము: చూ, స్నేహాశము (తిరువరాధనసమయమున వెలిగించెడు దీపము.): చూ, తిరువరాధనము.

తిర్వళిక, —పై—

తిఱి, దే వి. 1. మెలి: చూ, లంకె; 2. కర్ణరంధ్రాదులలోఁ ద్రిప్పెడువర్తి: చూ, వత్తి.

తిఱికి, దే. వి. తిరిరఅనుచేఁప: చూ, మత్స్యము. 1.

తిఱిగొట్టు, దే. వి. (రూ-తిఱిపగొట్టు-తిరిపగొట్టు-తిట్టిగొట్టు-తిట్టి-తిట్టె): చూ, యాచకుఁడు.

తిఱిపగొట్టు, —పై.—

తిఱుగఁబోఁత, దే. వి. తాలింపు: చూ, సొతాళింపు.

తిఱుగల్లు, దే. వి: చూ, రూ-తిరుగలి. 1-2.

తిఱుగుడు, దే వి. 1: చూ, రూ-తిరుగుడు. 4; 2. భ్రమణము: చూ, విహారము. 1.

తిఱుగుడునొక్కు, దే. వి: చూ, రూ-తిరుగుడు. 4.

తిట్టి, దే. వి. 1: చూ, రూ-తిఱిగొట్టు. అం, భా. ద్వ. 176; 2: చూ, కొడము; (చూ, వల. 1.)

తిట్టిగొట్టు, దే. విణ: చూ, రూ-తిఱిగొట్టు.

తిట్టె, దే. వి.—పై.—

తిలకము, సం. వి. అ. న. 1. సౌవర్చలమనెడి యుప్పు: చూ, లవణము. 1; 2. కడుపులో కుడిప్రక్కనుండెడు ఎఱ్ఱని మాంసము. నీరుతిత్తి (అనికొందఱు): చూ, మాంసము; పుం. న. 3. నుదుటిమక్క: చూ, బొట్టు. 1; పుం. 4. నల్లగుఱ్ఱము: చూ, హయము; 5: చూ, పుట్టుమచ్చ; 6 బొట్టుగు*: చూ, (దీనికి దోహదక్రియ వీక్షణము.): చూ, నువ్వులు; 7: చూ, బొట్లు*; విణ. 8: చూ, శ్రైష్ఠ్యము; అం. 9: చూ, సంయుతహస్తములు.

తిలకాలకము. సం. వి. అ. పుం: చూ, పుట్టుమచ్చ.

తిలకించు, దే. స. క్రి. 1. చూచు: చూ, వీక్షించు; అ. క్రి. 2. ప్రకాశించు. లక్ష్మీ. 3, ఆ. 97: చూ, హసఱిల్లు; 3. ప్రసన్నతనొందు, తెలియు, తేఱు: చూ, వెలయు.

తిలఘాతకుఁడు, సం. వి. అ పుం. 1.=: చూ, తెలుకలవాఁడు; అం. 2. జాతులు 18 లో నొకఁడు: చూ, జాతులు.

తిలతండులన్యాయము, న్యా. నువ్వులును బియ్యమును గలిపినఁ గలియును, విడఁదీసిన విడును అనురీతి.

తిలతండులము, వా. 1. బాహ్యసంభోగాలింగన విశేషము: చూ, రతిబంధము; అం. 2: చూ, జాత స్మరాలింగనములు: (చూ, ఆలింగనములు.)

తిలపర్ణి, సం. వి. ఈ. స్త్రీ, న్. పుం, రక్తచందనము: చూ, వాసన.

తిలపింజము, సం. వి. అ. పుం: చూ, రూ-తిలపేజము.

తిలపిష్టము, సం. వి. అ. న.=. చూ. తెలికపిండి.

తిలపుష్పనాసిక, సం. వి. ఆ. స్త్రీ. సుఖానుభవము గలిగెడు ఆఁడుది: చూ, స్త్రీ.

తిలపేజము, సం. వి అ. పుం. పొల్లునువ్వులు: తిలపింజము: (చూ, నువ్వులు.)

తిలబీజ, సం. వి. ఆ. స్త్రీ. గురివెంద*: చూ, శ్వేతపాకి.

తిలభావి, సం. వి. న్. పుం. నారింజ*: చూ, శర్కరాంకము.

తిలభావిని, సం. వి. ఈ. స్త్రీ. జాజి, మాలతి*: చూ, సుమనస్సు.

తిలమయూరము, సం. వి. అ. న. గురుంటకము: చూ, మయూరము.

తిలయంత్రము, సం వి. అ. న. గానుఁగ: చూ, పరంజము. 1.

తిలలు, సం. వి. అ. పుం. బ.=తెలకలు. 1: చూ, నువ్వులు. (ఇది సంస్కృతమున నిత్యబహువచనాంతము కాదు.); అం. 2: చూ, దానములు; 3: చూ, దానములు; 4: చూ, మహాదానములు.

తిలాంజలిన్యాయము, న్యా. నువ్వులనీళ్ళు వదలు విధము.

తిలిత్సము. సం. వి. అ. పుం. తిలిప్పము-రూ-తిలీప్పము, కొండ చిలువ: చూ, సర్పము.

తిలౌదనము, సం. వి. అ. న. నువ్వులపులగము, కృసరవిశేషము: చూ, సాదము. (1).

తిల్వకము, సం. వి. అ. పుం. పట్టికాలోధ్రము*. చూ, లొద్దుగు.

తిల్వము, సం. వి. అ. పుం. ఎఱ్ఱలొద్దుగు*. చూ, లొద్దుగు.

తిల్యము, సం. విశే. రూ-తైలీనము. 1. తిలలు పండునది (పొలము): చూ, భూమి. 1; అ న. 2. నూనె: చూ, స్నేహము. 2.

తిల్లిక, వా. వి: చూ, రూ-తిర్లిక.

తిల్వకము, సం. వి. అ. పుం. తిల్వకమను గ్రంథ్యము. చూ, రాజార్హము.

తిల్వము, సం. వి. అ. పుం: చూ, లొద్దుగు*.

తివ, వై. స.=త్రికమ్: చూ, రూ-తిగ, అచ్చ. సుం, కాం. 58.

తివారిబ్రాహ్మణులు, ఆం. వీరు కన్యాకుబ్జులు వీరు సామవేదులు, కౌతుమశాఖ, గోభిలసూత్రమువారు నైయున్నారు: చూ, కన్యాకుబ్జులు (చూ, బ్రాహ్మణులు.)

తివాసి, వై. వి=శ్రీభాసి, రూ-తివాసీ. మేలైన చిత్రాసనము ఉ. రా. 6, ఆ. 128; చూ, రల్లకము.

తివాసీ, —పై.—

తివియు, దే. స. క్రి. (రూ-తివుచు-తిగియు-తిగుచు.) ఆకర్షించు: చూ, రెమ్మ.

తివుచు, —పై.—

తివుట, దే. వి. 1. రూ-తివురు. శీఘ్రము. ఆం, భా. ప్ర. 65: చూ, స్యదము. 1; 2. కోరిక: చూ, వాంఛ.

తివురు, దే. వి. 1. రూ-తివుట. శీఘ్రము. ఆం, భా. ప్ర. 65: చూ, స్యదము 1; స. క్రి. 2. కోరు. భార. ఆది. 8, ఆ. 242: చూ, వాంఛించు; వై. అ. క్రి. 3.=తీవ్ర. త్వరపడు. భార. ఆది. 7, ఆ. 115: చూ, సంభ్రమించు; 4. కుతూహలపడు. భార. ఆది. 4, ఆ. 251. చూ, సంతోషించు; 5. చూ, యత్నించు. భార. అర. 3, ఆ. 8; 6. మ్రోఁగు: చూ, శబ్దించు; 7. కోపించు. హరిశ్చ. 3, ఆ. 96: చూ, రోషించు.

తివ్వ, వై. వి.=దీర్ఘ. (రూ-తీఁగ-తీఁగియ-తీఁగె తీవ-తీవియ-తీవె): చూ, లత. 1.

తిష్యఫల, సం. వి. ఆ. స్త్రీ. రూ-తిష్యఫలి. ఉసిరిక*. చూ, శ్రీఫలి. 1.

తిష్యము, సం. వి. అ. పుం. 1. రూ-త్విష్యము. పుష్యమి: చూ, రిక్క. 1. ల; 2. పుష్యమాసము, పుష్యము: చూ, మాసము. 1; 3. కలియుగము: చూ, యుగములు.

## తీ

తీ, వై. స. వృత్తియందు తీగ శబ్దమునకగు ఆదేశము. "తీవంచ"; 2.=త్రి: చూ, రూ-తిగ.

తీంట్రము, దే. వి. తీఁట, దురద: చూ, విదర్చిక.

తీండ్ర, దే. వి. 1. ప్రకాశము: చూ, వెలుతురు. 1; 2. తీక్ష్ణము. చూ, మిడి. 4; 3. తేజము, ఉష్ణము (అగ్గియు). పాండు. 3, ఆ. 110: చూ, వేఁడిమి; 4. ప్రతాపము: చూ, వాఁడిమి; 5. చుఱుకు. స్వా. 5, ఆ. 17; పాండు. 2, ఆ. 268: చూ, వేగము. 3.

తీండ్రము, వై. విశే=తీక్ష్ణ. రూ-తీవ్రము. వెట్ట, భీకరము. భాగ. 7, స్కం. 345: చూ, మిడి. 4. (దేశ్యమని శ. ర.)

తీండ్రించు, దే. అ. క్రి. ప్రకాశించు. స్వా. 6, ఆ. 39: చూ, హవణిల్లు; 2. జ్వలించు. స్వా. 4, ఆ. 17: చూ, మండు. 1.

తీఁగ, వై. వి=దీర్ఘ. 1. వీణె మొదలగువానికి వేసెడు ఉక్కుతీఁగె: చూ, సారణి. 3; 2: చూ, రూ-తివ్వ. నై. 3, ఆ. 88; 3. మొలనూలు. చూ, భూషణము. 2; 4. స్త్రీల మెడను ధరించెడు బంగారపునగ కళా. 8, ఆ. 137: చూ, భూషణము. 2.

తీఁగఁబోఁడి, ద్వ. వి. (తీఁగ+పోఁడి) రూ-తీవఁబోఁడి. 1. తీఁగవలె మనోజ్ఞురాలగు అఁడుది: చూ, స్త్రీ; 2. ఆఁడుది: చూ, స్త్రీ.

తీఁగకానుగు, ద్వ. వి: చూ, శాదఘ్నము*.

తీఁగగఱిక, ద్వ. వి: చూ, తృణము. 1.*

తీఁగజాజి, వై. వి: చూ, సుమనస్సు*.

తీఁగతుమడి, ద్వ. వి. చూ, దీర్ఘమూల*.

తీఁగపాఁచి, ద్వ. వి. చూ, శైవలము*.

తీఁగపాల, ద్వ. వి: చూ, మనుపాల*.

తీఁగపేరికల్కిమగఁడు, ద్వ. వి. కుమారస్వామి. చూ, స్కందుఁడు.

తీఁగబచ్చలి, ద్వ. వి. అల్లుబచ్చలి*; చూ, బచ్చలి

తీఁగమల్లియ, వై. వి. 1. ఒకానొకమల్లె*; చూ, హసంతి. బ. 2. ఒకరకమువడ్లు: చూ, ధాన్యము.

తీఁగమెఱుఁగు, ద్వ. వి. 1. ఉఱుములేనిమెఱుపు చూ, విద్యుత్తు. 1; 2. ప్రొద్దుతిరుగుడు*. చూ, సూర్యానువర్తిని.

తీఁగమోడి, ద్వ. వి. గొలుసుమోడివ్రాఁత: చూ, వ్రాఁత.

తీఁగయిల్లు, ద్వ. వి. (తీఁగ+ఇల్లు) పొదరిల్లు; చూ, సదనము. 1.

తీఁగయెలుఁగు, ద్వ. వి. (తీఁగ+ఏలుఁగు) హీనస్వరము: చూ, స్వరము. 2.

తీఁగలువాఱు, ద్వ. అ. క్రి. (తీఁగలు+పాఱు): చూ, వ్యాపించు.

తీఁగవిలుకాఁడు, ద్వ. వి: చూ, మన్మథుఁడు.

తీఁగసరులు, వై. వి. బ. ఒకరకమువడ్లు: చూ, ధాన్యము.

తీఁగసాఁగు, ద్వ. వి. (తీఁగ+చాఁగు); చూ, వర్ధిల్లు.

తీఁగియ, వై. వి.=దీర్ఘ: చూ, రూ-తీఁగ.

తీఁగె, —పై.—

తీఁగెమెడనూలు, ద్వ. వి. మెడనగ: చూ, భూషణము. 2.

తీఁట, దే. వి. (రూ-తీంట్రము-తీవివరము.) దురద; చూ, విదర్చిక. (ఒకరకముగజ్జి).

తీఁటకసింద, దే. వి; చూ, సముద్రాంత*. (దీని కషాయము గర్భాశయ ఉన్మాదములలో మంచి పనిచేయును.)

తీఁటకసివింద, —పై.—(ఆం, భా. ద్వి. 54.)

తీఁటకసివెంద, —పై.—

తీఁటకోవెల, 1.—పై.—; 2. దూలగొండి*; చూ, శూకశింబి.

తీఁడిరించు, దే. అ. క్రి. ప్రకాశించు. కాశీ. 3, ఆ. 235: చూ, హవణిల్లు.
తీఁపురము, దే. వి. లప్పు: చూ, సొంటు.
తీక్ష్ణ, సం. వి. ఆ. స్త్రీ. ఊరఁగోగు*: చూ, మృదుద్రుమము.
తీక్ష్ణకంటక, సం. వి. ఆ. స్త్రీ: చూ, దృష్టావేళ*.
తీక్ష్ణకర్మ, సం. వి. న్. పుం. తీక్ష్ణమగు కర్మగలవాఁడు: చూ, అయస్కాలికుఁడు.
తీక్ష్ణగంధ, సం. వి. ఆ. స్త్రీ. 1. ఓమము: చూ, యవాని; 2. నల్లావలు: చూ, సర్షపము.
తీక్ష్ణగంధము, సం. వి. అ. పుం. 1. మునగ*: చూ, శిగ్రువు. 1; 2. పెద్దతుమ్మి*: చూ, తుమికి; 3. నెరవెంద*: చూ, సరవెంద.
తీక్ష్ణతుండము, సం. వి. అ. పుం. దోమ: చూ, మశకము. 1.
తీక్ష్ణపత్ర, సం. వి. ఆ. స్త్రీ. ఉప్పి*: చూ, లవణి.
తీక్ష్ణము, సం. వి. అ. న. 1. = తీంద్రము. వెట్ట: చూ, వేఁడిమి; 2. విషము: చూ, విసము. 1; 3. పోరు: చూ, యుద్ధము; 4. ఇందుప్పు: చూ, లవణము. 1; 5. ఇనుము: చూ, లోహము. 1; పుం. 6. గాజుప్పు: చూ, లవణము. 1; విణ. 7. చుఱుకైనది: చూ, రౌద్రము. 3; 8. వాఁడియైనది: చూ, మిడి. 4.
తీక్ష్ణసారము, సం. వి. అ. పుం. ఇప్ప*: చూ, మధూకము.
తీడు, దే. స. క్రి. వాఁడిచేయు. పంచ. వేం. 2, ఆ. 197.
తీతువు, వై. వి. = తిత్తిరి. (సం. ప).—అర్ధపారావతము, ఖరకోణము, ఖరక్వాణము, తిత్తిరి; తద్వి-తిత్తిరి పక్షుల సమూహము.— (సం. ప) .—తైత్తిరము.
తీన్‌తేఱ, వా. అవ్య. నీరసము.
తీనియ, దే. వి. రూ-తిన్నియ. అచ్చ. యు, కాం. 439: చూ, వేదిక.
తీనె,—పై.—
తీపారు, దే. అ. క్రి. (తీపు + ఆరు): చూ, మనోజ్ఞమగు.
తీపి, దే. వి. 1. తీపు. కమ్మనిరసము: చూ, మాధుర్యము; 2. కోరిక: చూ, వాంఛ; విణ. 3. కమ్మనిది: చూ, మధురము.
తీపు, దే. వి. 1. కమ్మన: చూ, మాధుర్యము;2: చూ, యాతన; 3. అరఁటిగెలలోనిఅత్తము. ఆం, భా. ద్వి. 58: చూ, పూగుత్తి; విణ. 4. కమ్మనిది: చూ, మధురము; అం. 5: చూ, రసములు.
తీపుద్రాడు, దే. వి. (తీపు + త్రాడు) వేఁటాడుటకుఁదగిన సాధనము: చూ, వాగుర.
తీమునగ, ద్వ. వి: చూ, రూ-తియ్యమునగ*. ఆం, భా. ద్వి. 44.
తీయ, దే. విణ: చూ, తీపి. 3.
తీయదోస, దే. వి. తియ్యనిదోస*: (చూ, దోస): చూ, హరివాలుకము.
తీయవ. దే. వి: చూ, తీపు. 1-5.
తీయము, దే. వి: చూ, రూ-తియ్యము. విజ. 3, ఆ. 182.
తీయమునగ, ద్వ. వి: చూ, రూ-తియ్యమునగ.
తీయు, దే. అ. క్రి. 1. తొలఁగు: చూ, విరియు. 5; 2. కృశించు: చూ, సొటసొటవోవు; 3. తగ్గు: చూ, ముక్కు. 9; స. క్రి. 4. ఈడ్చు: చూ, రెమ్ము; 5. కొను: చూ. విలుచు; 6. వెలయిచ్చికొను; 7. వేయు. హరిశ్చ. 4, ఆ. 119: చూ, విసరు. 8.
తీయువాఁడు, దే. వి: చూ, గ్రహీత.
తీరబకన్యాయము, న్యా. ఒడ్డున కొంగ జపముచేయుచున్నట్లుండి చేప చేరువకు రాఁగా లటుక్కునఁబట్టి మ్రింగునరీతి.
తీరము, సం. వి. అ. న. 1. = దరి. ఒడ్డు: చూ, రోధస్సు; 2. తగరము: చూ, లోహము. 1.
తీరు, దే. వి. రూ-తీఱు. 1. న్యాయము: చూ, సత్యము. 1; 2. శరము: చూ, బాణము. 1; 3. రీతి: చూ, విధము. 1; 4. మంజులము. వేం. అం. 56: చూ, హృద్యము; 5. సొగసు: చూ, సౌందర్యము; 6. సంధి: చూ, సాప్తపదీనము; అ. క్రి. 7. చచ్చు: చూ, మరణించు; 8. చక్కఁబడు, యుక్తమగు: చూ, సరిపడు. 2; 9. శక్యమగు. నిర్వ. 7, ఆ. 76: చూ, సిద్ధించు; 10. చెడు: చూ, నశించు; 11. పాయు: చూ, విరియు. 1; 12. అవకాశపడు.
తీరుకు, దే. వి. ఒకానొక నాట్యగతి: చూ, నాటకము. 1. (తీరుకులు = కోపులు.)
తీరుచు, వై. ప్రే. = తీర. (రూ-తీర్చు-తీఱుచు-తీఱుపు) దేశ్యమని శ. ర). 1. నెఱవేర్చు, తీర్పుచేయు (అని కొందఱు): చూ, సవరించు; 2. చక్కఁబఱచు, దిద్దు. విజ. 1. ఆ. 132: చూ, సవరించు; 3. నృత్తగీతవాద్యములు సమముకావించు; 4. నాశముచేయు; 5. పాయఁజేయు: చూ, పాపు.
తీరుపరి, దే. వి. రూ-తీర్పరి. (తీరుపు + అరి) 1. న్యాయాధిపతి: చూ, స్వామి. 3; 2. చారుఁడు: చూ, వేగువాఁడు; విణ. 3. అధిపతి: చూ, ప్రభువు. 2; 4. కార్యనిర్వాహకుఁడు. జై. 8, ఆ. 57: చూ, సమర్థుఁడు.
తీరుపు, దే. వి. రూ-తీర్పు. 1. న్యాయము, తెగతెంపు, ఉ. రా. 6, ఆ. 139: చూ, సత్యము. 1; 2. చక్కఁబాటు; 3. తాళమానలయ: చూ, నాటకము. 1; 4. బాకీని తీర్చుట; వా. 5. ధాన్యాదులుగొనినవారు అమ్మినవారి కిచ్చెడు పద్దు.
తీరువ, దే. వి. (రూ-తీరువాయి-తీర్వ.) పంటపెట్టువాఁడు రాజున కిచ్చెడు సీటిపన్ను: చూ: విస్తు. 1.
తీర్చు, వై. ప్రే: చూ, రూ-తీరుచు- (దేశ్యమని శ. ర.) చక్కఁబరచుటకు.—భార-విరా. 1,ఆ. 101; నాశముచేయుటకు.- భార. ఉద్యో. 2, ఆ. 273. సవరించుటకు.— భార. విరా. 1. ఆ. 54; నృత్తగీతవాద్యములు సమముకావించుటకు. —ఉ, రా. 6, ఆ. 139.
తీర్ణము, సం. విణ. దాటఁబడినది: చూ, లంఘ.
తీర్థంకరుఁడు. సం. విణ. తీర్థకరుఁడు, బుద్ధదేవుఁడు: చూ, బుద్ధుఁడు. 1.
తీర్థకరుఁడు,—పై.—
తీర్థకాకన్యాయము, న్యా. కాకి గంగాదితీర్థములయందు మునుఁగునుగాని దానివలనఁగలుగు ఫలము నెఱుఁగదను రీతి.
తీర్థమాట, మి. వి. తీర్థమాడుట. కాశీ. 5, ఆ. 48: చూ, స్నానము. 1.

తీర్థమాడు, మి. అ. క్రి (తీర్థము + ఆడు) స్నానముచేయు: చూ, నీళ్ళాడు; ప్రే. 2. తీర్థమార్చు. కాశీ. 6, ఆ. 270.

తీర్థము, సం. వి. అ. న. 1. మహర్షులు స్నానముచేసిన పుణ్యోదకము: చూ, సలిలము; 2. పుణ్యనది: చూ, నది; 3: చూ, రేవు. 1-2; 4. నూతి దగ్గఱ నుండెడు తొట్టి: చూ, నిపానము. 1; 5. పుణ్యక్షేత్రము: చూ, భూమి. 1; 6. జన్నము: చూ, యజ్ఞము; 7. నియమగ్రంథము: చూ, శాస్త్రము; 8. ఉపాయము: చూ, వెరవు; 9. భాజనము: చూ, పాత్రము. 6; 10. స్త్రీరజస్సు, ముట్టునెత్తురు: చూ, రేతస్సు. 1; 11. ఉపాధ్యాయుఁడు. (శ. ర): చూ, తీర్థుఁడు; 12. మంత్రి (శ. ర): చూ, తీర్థుఁడు.

తీర్థయాత్ర, అం. (గంగాది తీర్థములు సేవించుట): చూ, శకున రహితములు.

తీర్థరాజి, సం. వి. ఇ. పుం. కాశి: చూ, దేశము. 176: (చూ, క్షేత్రములు.)

తీర్థవాసి, సం. విణ. (న్. ఈ. న్.) తీర్థసేవచేయువాఁడు: తైర్థికుఁడు.

తీర్థుఁడు, సం. వి. అ. పుం: చూ, తీర్థము. 11-12.

తీర్పరి, చూ, రూ-తీరుపరి.

తీర్పు, దే. వి: చూ, రూ-తీరుపు. (చక్కఁబాటునకు—భార. ఉద్యో. 4, ఆ. 193.)

తీఱమి, దే. వి. అక్కఱ, పోరామి. భార. విరా. 1, ఆ. 128: చూ, వ్యాపారము. 1.

తీఱిక, దే. వి. తీఱుబడి, అవకాశము: చూ, సందు. 6.

తీఱు, దే. వి. అ. క్రి: చూ, రూ-తీరు. (నశించుటకు.—భార. ఉద్యో. 4, ఆ. 273; పాయుటకు.- భార. ఆది. 4, ఆ. 19; అవకాశపడుటకు.—భార. ఉద్యో. 3, ఆ. 102.)

తీఱుగడ, దే. వి. 1. రూ-తీరుదల. తేఱుగడ, ముగియిక: చూ, సమాప్తి. 1; 2: చూ, తీఱిక.

తీఱుచు, వై. ప్రే. = తీర: చూ, రూ-తీరుచు.

తీరుదల, దే. వి: చూ, రూ-తీరుగడ. ఉ, రా. 6, ఆ. 302.

తీఱుపడు, ద్వ. అ. క్రి: చూ, నశించు. పంచ. వేం. 1, ఆ. 696.

తీఱుపాటు, ద్వ. వి: చూ, తీఱిక.

తీఱుపు, వై. ప్రే: చూ, రూ-తీఱుచు. రాఘ 1, ఆ. 42. (దేశ్య మని శ. ర.)

తీఱుబడి, దే. వి: చూ, తీఱిక.

తీలగు, దే. అ. క్రి. (తీలు + అగు) రూ-తీలుపడు. అడఁగు: చూ, స్రుక్కు. 4.

తీలు, దే. వి. లోపల నణఁగియుండుట: చూ, స్తబ్ధము.

తీలుపడు, ద్వ. అ. క్రి. తీలగు. పాండు. 4, ఆ. 18: చూ, స్రుక్కు. 4.

తీలుపాటు, ద్వ. వి: చూ, పీలుపాటు. వై. 7, ఆ. 52.

తీవ, వై. వి. = దీర్ఘ: చూ, రూ-తీఁగ.

తీవంచ, ద్వ. స. (తిగ + వంచ) మూఁడునొకటి "సీ. వామాక్షి యొకతె తీ-వంచవేయుమటన్న, నది శిల్పిరాక యె-ట్లగు నటంచు" చమ. 1, ఆ. 43; పండి. పురా. 125. పౌ.

తీవంచమోములదిట్ట, ద్వ. వి. నల్మోము దేవర. సాం. దే. 5: చూ, బ్రహ్మ. 1.

తీవరపడు, వై. అ.క్రి. (తీవరము + పడు): చూ, సంభ్రమించు.

తీవరపాటు, వై. వి. తీవరపడుట: చూ, సంభ్రమము. 1.

తీవరము, వై. వి. = తీవ్రము. త్వరితము: చూ, స్యదము.

తీవరించు, వై. స. క్రి. త్వరితపఱచు. శశాం. 4, ఆ. 24.

తీవరుఁడు, సం. వి. అ. పుం. 1. చేఁపలఁబట్టువాఁడు: చూ, వలజేఁడు (శ. ర); 2. సముద్రుఁడు: చూ, సముద్రము; వై. వి. (1). = ధీవరః. చేఁపలుబట్టువాడు: చూ, వలజేఁడు (పురుషోత్తమకవీయము.)

తీవియ, వై. వి. = దీర్ఘ: చూ, రూ-తీఁగ. అచ్చ. బాల, కాం. 189.

తీవిరము, దే. వి: చూ, రూ-తీఁట.

తీవె, వై. వి. = దీర్ఘ: చూ, రూ-తీఁగ.

తీవెసరులు, వై. వి. ఒకరకమువడ్లు : చూ, ధాన్యము.

తీవ్ర, సం. వి. ఆ. స్త్రీ. 1. నల్లావలు: చూ, సర్షపము; 2. కటుకరోహిణి: చూ, కటులాదని. 1; 3. తీఁగగతిక*: చూ, తృణము. 1.

తీవ్రగంధ, సం. వి. ఆ. స్త్రీ. ఓమము: చూ, యవాని.

తీవ్రగంధము, సం. వి. అ. పుం. కారుబుడమ*: చూ, బుడమ.

తీవ్రము, సం. వి. అ. న. 1. పెల్లు: చూ, హేరాళము. 1; విణ. 2. అధికము: చూ, హేరాళము; 3. మిక్కిలి వేఁడిమి గలది: చూ, వేఁడిమి; 4. కారముగలది: చూ, కారము. 1; 5. = తీవరము. శీఘ్రము: చూ, స్యదము; అం. శ్రుతులు 22 లో నొకటి: చూ, శ్రుతులు.

తీసికొను, దే. స. క్రి: చూ, కొను. 6.

తీసివేఁత, వా. వి. ఎత్తివేఁత: చూ, వ్యవకలనము.

తీసివేయు, దే. స. క్రి. 1. ఖండించు: చూ, సెలగు; 2. తగ్గించి వేయు: చూ, ఎత్తివేయు. 1; 3: చూ, తగ్గించు; అ. క్రి. 4: చూ, వ్యయించు.

## తు

తు, సం. అవ్య. 1. పాదపూరణమందు వర్తించును: "తతస్తు రాజంతం", త్వర్చాహేత్యః పాదపూర్తా వితిశేషః: చూ, చ. 1; 2. అయ్యవే; 3. విశేషమందు వర్తించును "పూజ్యాగౌః కపిలాతు పూజ్యతరా.": చూ, హేరాళము. 1; 4. నిశ్చయార్థకము. "వేదాస్తుప్రమాణం": చూ, సత్యము; 5. మర్యాదయందు వర్తించును. (పూజయందు వర్తించును.) "వేదాధ్యస్తు ద్విజాతీనాం.": చూ, సన్మానము; 6. హేత్వర్థకము. "ద్విజస్తుజలదైశ్చనాభవిత్రీవృష్టిసంహతిః.": చూ, హేతువు. 1; 7. అభిప్రాయము: చూ, స్మృతి. 1; 9. నిద్దుర: చూ, స్వప్నము. 2; 9. దూరమునుండి పిలుచుట: చూ, సంబోధనము; 10. గుంభ్రడింపు: చూ, వికారము. 1; 11. మేలు: చూ, శుభము; 12: చూ, లుఠనము. 1.

తుంగ, సం. వి. ఆ. స్త్రీ. 1. జమ్మి*: చూ, శమి; దే. వి. (1) తుంగముస్తె, నిడుముస్తె, (అని కొందఱు)*: చూ, తృణము. 1.

తుంగభద్ర, సం. వి. ఆ. స్త్రీ. 1. తుంగభద్రానది : చూ, నది; అం. 2: చూ, గంగలు. (చూ. నది.)
తుంగభద్రము, సం. వి. అ. పుం. మదపుఏనుఁగు: చూ, హస్తి.
తుంగము, సం. వి అ. పుం. 1. కొండ: చూ, పర్వతము; 2. కొబ్బరి*: చూ, స్కంధఫలము; 3: చూ, పొన్న*; విణ. 4. పొడవైనది: చూ, సోగ. 2.
తుంగముస్తె, వై. వి: చూ, తుంగ. (1)
తుంగి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, వాయింట*; 2: చూ, రాత్రి.
తుంగీపతి, సం. వి. ఇ. పుం. చంద్రుఁడు: చూ, హిమాంశువు.
తుంచు, వా. స. క్రి. పెంచు.
తుంట, దే. వి. 1. తునక: చూ, శకలము. 4; 2. చెఱకు*: చూ, సాలము. 3; వై. విణ. 3.=ఖంర-దుష్ట (రూ-తుంటరి-తూఁట-తూఁటరి-తూఁడరి) దుష్టుఁడు. వసు. 3, ఆ. 176: చూ, వ్యాధుఁడు. 2.
తుంటరి, మి. విణ. (ద్వయమని శ. ర; వై అని మఱికొందఱు) (తుంట + అరి) తుంట, వై; అరి. సం. అని శ. ర.) (తుంటరి = ఖంర—దుష్ట. అని పురుషోత్తమ కవీయము) దుష్టుఁడు: చూ. వ్యాధుఁడు 2.
తుంటరితనము, ద్వ. వి: చూ, ఒడుపరితనము.
తుంటవిలుతుఁడు, దే. వి. ఇక్షుధన్వుఁడు: చూ, మన్మథుఁడు.
తుంటి, దే. వి. కంటిపార్శ్వభాగము, మలుగు. స్వా. 4, ఆ. 17: చూ, రొండి.
తుంటికూర, ద్వ. వి: చూ, శైవలము.
తుండకేరి, సం వి. ఆ. స్త్రీ. = దొండ*: చూ, రక్తఫల.
తుండము, సం. వి. అ. న. = తొండము. 1. పక్షిముక్కు: చూ, ముక్కు; 2. నోరు: చూ, వదనము .2; 3. మొగము: చూ, వదనము. 1; 4. ఏనుఁగుముక్కు (ఇదివైకృతమని కొందఱు): చూ, హస్తి; వై. వి. (1) = త్వష్ట. ఖండము: చూ, శకలము. 4.
తుండి, సం. వి. ఇ. స్త్రీ. 1. రూ-తుంది. ఉబుకుడుబొడ్డు, ఊదబొడ్డు: చూ, బొడ్డు 1; పుం. 2. పక్షిముక్కు: చూ, తుండము 1; 3. మొగము: చూ, వదనము. 1; న్. 4. వక్కి:చూ,పక్షి; 5.వందొమ్మిదియేండ్లయేనుఁగు: చూ,హస్తి.
తుండించు, వై. స. క్రి. ఖండించు, భేదించు. ఉ, హరి. 6, ఆ, 129: చూ, పెలగు. [2: చూ, ప్రత్తి*.
తుండికేరి, సం. వి. ఈ. స్త్రీ. 1. దొండ*: చూ, రక్తఫల;
తుండిభుఁడు, సం. విణ. రూ—తుందిభుఁడు—తుండిలుఁడు. పొడవైన బొడ్డువాఁడు: చూ, బొడ్డువాఁడు.
తుండిలుఁడు, —వై.—
తుండు, వై. వి. = ఖండ. తుండెము: చూ, శకలము. 4.
తుండె, వై. వి. = శోడన. —వై.—
తుండెము, వై. వి.= శోడన —వై.— [అంగము.9)
తుర్యోపాంగములు, అం. ఛాయాతుండి, తురుష్కతుండి (చూ,
తుంతుర్వము, సం. వి. అ, పుం. తుంపురు: చూ, శీకరము.
తుందకూపి, సం. వి. ఈ. స్త్రీ. పొక్కిలి: చూ, బొడ్డు. 1.
తుందపరిమృజుఁడు, సం. వి. ఆ. పుం: చూ, సోమరి.
తుందము, సం. వి. అ. న. కడుపు: చూ, భ్రూణము. 1.
తుంది, సం. వి. ఇ. న. 1. —వై.—; పుం. 2: చూ, రూ—తుండి. 1; విణ. (న్. ఈ. న్.) 3. = తొంద. (రూ—తుందిలుఁడు-తుదిభుఁడు-తుందికుఁడు.) బొజ్జకడుపువాఁడు: చూ, బొజ్జవాఁడు.
తుందికరము, సం. వి. అ. పుం: చూ, తుందకూపి.
తుందికుఁడు, సం. విణ: చూ, రూ—తుంది. 3.
తుందిభుఁడు, సం. విణ. 1. = దొడ్డు: చూ, రూ—తుంది. 3; 2: చూ, రూ—తుండిభుఁడు.
తుందిలుఁడు, —వై.—
తుందుడుకు, దే. వి. (తుడుకు + తుడుకు) 1. ఆరాటము: చూ, సంతాపము; 2. మనోవ్యథ: చూ, శోకము; 3. విచారము. ఉ, రా. 6, ఆ. 212: చూ, సంతాపము; 4. కలఁత: చూ, సంతాపము; విణ. 5. యోచింపక త్వరపడి చేయువాఁడు.
తుందునుకలు, దే. వి. బ, (తునుకలు + తునుకలు) తుత్తునియలు: చూ, శకలము. 4.
తుందుభము, సం. వి. అ. పుం అవాలు చూ, సర్షపము.
తుంపర, వై. వి. = తుషార. రూ-తుంపురు. గాలిచే చెదరిపడు వానలోనగువాని నీటిబొట్టు: చూ, శీకరము: (చూ, వాన. 1.); 2. త్రస్న: చూ, ప్రస్న.
తుంపిళ్ళు, దే. వి. బ. తూరవాన: చూ వాన. 1,
తుంపురు, వై. వి. = : చూ, రూ—తుంపర,
తుంపెసలాడు, దే. అ. క్రి. (తుంపెసలు + ఆడు.) 1: చూ, సలించు; 2: చూ, వ్రేలాడు; 3. నర్తించు. పా. 2, ఆ. 9: చూ, మలపుగొను.
తుంపెసలు, దే. వి. చలనము, చూ, లోలము.
తుంపెసలు గునియు, దే. అ. క్రి: చూ. సలించు.
తుంబ, సం. వి. ఆ. స్త్రీ. 1. పాలుపితుకుచెంబు: చూ, పాత్రము. 6; వా. వి. 2: చూ, తుండు. 2.
తుంబకము, సం. విణ. నంగిమాట: చూ, శబ్దము. 2.
తుంబి, సం. వి. ఈ. స్త్రీ. 1. = తుమ్మి*: చూ, తుమికి; 2. ఆనబ*: చూ, సొఱ.
తుంబిక, సం. వి. ఆ. స్త్రీ. 1. = తూము. బండిచక్రము నడిమి రంధ్రము: చూ, రంధ్రము. 1; 2: చూ, తుంబి. 2*.
తుంబీవికల వీణన్యాయము, న్యా. తుంబకాయబుఱ్ఱ లేనిదే వీణ పాడదనురీతి.
తుంబురి, సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుకుక్క, సరమ, శుని: చూ, శునకము; అం. 2: చూ, ఆనద్ధవాద్యములు.
తుంబురు, అం. 1: చూ, భిన్నషడ్జకజభాషలు: (చూ, భాష. 1.); 2. = తంబురా. ఒకానొక తంత్రీవాద్యము: చూ, వీణె.
తుకతుక, దే. వి. 1. కలఁత: చూ, సంతాపము; 2. కోపము: చూ, రోషము; 3. ఉడుకుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ; 4. కాఁగుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.
తుకము, దే. వి. విత్తనాల చల్లకపు అంచన.
తుకాక్షీరి, సం. వి. ఈ. స్త్రీ. తవాక్షీరి*: చూ, వంశరోచన.
తుకాటము, దే. విణ. మిక్కిలి ప్రాఁతది: చూ, పురాతనము.

తుక్కు, దే. విణ. 1. అల్పము: చూ, స్వల్పము; 2. గాదము పట్టు, చెత్త: చూ, పెంట. 1; వా. 3. పనికిమాలినది, తుక్కుడు.

తుక్కుడు, దే. వి. 1: చూ, తుక్కు, 2; వా. 2: చూ, తుక్కు. 3.

తుక్ఖారము, సం. వి అ. పుం. గుఱ్ఱము: చూ, హయము.

తుగాక్షీరి, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-శుకాక్షీరి*.

తుచ్ఛ, సం. వి. ఆ. స్త్రీ. చిప్తెలకి*: చూ, పత్రల.

తుచ్ఛమగు, మి. విణ తొచ్చెమగు.

తుచ్ఛుఁడు, సం. విణ. = తొచ్చెము-తోచ; చూ, వ్యాధుఁడు 2.

తుజాలకము, సం. వి. అ. పుం. ఆరుబొండ*; చూ, రక్తఫల.

తుజుగు, దే. విణ: చూ, వేగిరకాఁడు.

తుటాయించు, దే. స. క్రి. అలక్ష్యముచేయు.

తుటారము, దే. వి. 1. పరుషవచనము, కష్టైవి పుమాట: చూ, శబ్దము. 2; 2. దిట్టతనము. అచ్చ. అ. కాం. 38; చూ, హొంత; 3. అతిక్రమణము; చూ, పర్యయము; 4. తుచ్ఛ వచనము, తొచ్చెము: చూ, శబ్దము. 2.

తుటారి, దే విణ. (తుటారము + ఇ) రూ-తుటారికత్తియ-తుటారికత్తె. 1. దిట్టతనముగలది; చూ, స్త్రీ: 2. పారుష్యము కలది: చూ, స్త్రీ.

తుటారించు, దే. స. క్రి. 1. తిరస్కరించు. చూ, భంగించు; 2. అతిక్రమించు: చూ, దాఁటు. 6.

తుటారికత్తియ, ద్వ. విణ: చూ, రూ-తుటారి.

తుటారికత్తె, —పై.—

తుటారికాఁడు, దే విణ. 1. దిట్టతనము గలవాఁడు: చూ, దిట్టఁడు; 2. పారుష్యము గలవాఁడు. (స్వార్థమునకాఁడు.)

తుటుక్కు, దే. వి. గుండెలు అదరుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

తుటుమము, సం. వి. అ. పుం. ఎలుక: చూ, మూషికము.

తుటుము, దే. వి. 1. (రూ-తుట్టియ-తుట్టె-త్రుట్టియ-త్రుట్టె-తుడుము.) గుంపు: చూ, సమూహము; 2. దండు. ఆం, పదా. నర. 111: చూ, సేన. 1: 3. పరి, పరిగమి, చతురంగ బలసేన. అచ్చ. యు, కాం. 480: చూ, సేన. 1.

తుట్ట, వా. వి. 1. లేనినింద ఆరోపించుట: చూ, నింద. 1; 2. మండుచు గాలిచేనెగిరి మఱియొకచోట పడెడు గడ్డిలోనగు వాని చుట్ట: చూ, వహ్ని. 1; 3. లేనిమాట పుట్టించుట; 4. అసత్యము.

తుట్టకుద, దే. వి (తుద + తుద) కట్టకడ: చూ, సుద. 3.

తుట్టపురుగు, వా. వి. పెంటపోగులులోనగువాని యందుండెడ తుట్టెవంటి పురుగు; చూ, పురుగు.

తుట్టమర, దే. అవ్య. క్రి. విణ బొత్తిగా. (శ. ర.)

తుట్టియ, దే. వి. రూ-తుట్టె. 1. వర్గము; చూ, సమూహము; 2. తేనెతుట్టె: చూ, మధుపటలము.

తుట్టు, దే వి. 1. దండుగ: చూ, సేగి; విణ. 2. నాశకుఁడు. రా. వి 3, అ. 8: చూ, వేరువిత్తు.

తుట్టె, దే వి; చూ, రూ-తుట్టియ.

తుట్టెగట్టు, దే. అ. క్రి. (తుట్టె + కట్టు) (పురుగులుపట్టి) ఉండలుగట్టు.

తుట్టెపురుగు, ద్వ. వి. సామాన్యసర్పము: చూ, సర్పము. 1.

తుట్టెపురుగుగొంగ, ద్వ. వి. గరుడుఁడు. వేం. అం. 18. చూ, హరివాహనుఁడు.

తుట్ర, దే. వి. 1. మంచువంటి తూరవాన, తుట్టు చూ, వాన. 1; వా. 2. ఊడ్చిన పెంటకుప్ప.

తుడుచు, దే స. క్రి. రూ-తుడ్చు. 1. తడిపోవనొత్తు: చూ, ప్రాము. 4; 2. ఊడుచు. భార. సభా. 2. ఆ. 200; చూ, సమ్మార్జించు.

తుడుపు, దే. వి రూ-తుడ్పు. 1. తుడుచుట: చూ, రుద్దుడు; 2. తప్పు వ్రాలను గిలికిన గీఱుకు: చూ, గీఱుకు. 1; 3. చీట్లాటలోని గెలుపురంగు. రూ-తురుపు; 4: చూ, ఊడుపు. 3. వా. వి. 5. తప్పిన అక్షరములపైన గీచినగీఁత.

తుడుము, దే. వి. 1. రూ-తుముకు. మద్దివు. అచ్చ. సుం. కాం. 109; చూ, వీణె; 2. గుంపు. రూ-తుటుము; చూ, సమూహము.

తుడ్చు, దే. స. క్రి: చూ, రూ-తుడుచు.

తుడ్పు, దే. వి: చూ, రూ-తుడుపు.

తుతినాగము, దే. వి. తుత్తము: చూ, లోహము. 1.

తుతె, దే. వి: తంతియ అం, పదా. నర. 44; చూ, సోపానము.

తుత్తనాగము, దే. వి: చూ, రూ-తుతినాగము

తుత్తము, —పై.—

తుత్తి, దే. వి. కంగునీపత్రము*; తుత్తిరి.

తుత్తిరి, —పై.—

తుత్తుంభిక, సం. వి. ఆ స్త్రీ. ఒకానొక వాద్యము: చూ, వీణ.

తుత్తునియలు, దే. వి. బ (తునియలు + తునియలు) చిన్నచిన్న తునుకలు: చూ, శకలము. 4.

తుత్తుమురు, దే. వి. (తుమురు + తుమురు) మిక్కిలి తుమురు. (తుమురు = పొడి)

తుత్థ, సం. వి. ఆ స్త్రీ. 1. రూ-తుచ్ఛ. చిప్తెలకి*: చూ, పత్రల; 2. నీలి*; చూ, రంజని.

తుత్థము, సం. వి. అ. న. 1. మూనిపసుపున పండిన అంజన విశేషము: చూ, రసాంజనము; పుం. 2. అగ్ని: చూ, వహ్ని. 1; వా. 3: ఒకానొక భస్మము.

తుత్థాంజనము, సం. వి. అ. న. మయిలుతుత్తము; చూ, రసాంజనము.

తుద, దే. వి. రూ-సుద. 1. అగ్రము. చివర: చూ, సుద. 3; 2. అంతము, కడ: చూ, సుద. 3.

తుదకులమునేర్పరి, ద్వ. వి. కాలిపుట్టువు. సాం. మాన. 3: చూ, శూద్రుఁడు.

తుది. దే. వి. 1. కడ, అంతము: చూ, సుద. 3; 2. చావు: చూ, సావు.

తుదిదిక్కుటెంకి, ద్వ. వి. ఈశానుఁడు: చూ, శివుఁడు. 1.

తుదిముట్టు, దే. అ. క్రి. చచ్చు: చూ, సమయు.

తుదిరేయి, దే. వి. బ్రహ్మదిన ప్రళయము, కల్పాంతము: చూ, సంవర్తము. 1.

**తుదివాఁడు**, దే విశే. కనిష్ఠుఁడు: చూ, సహోదరుఁడు.
**తునక**, దే. వి: చూ, రూ-తునుక.
**తునికోల**, దే వి. (తూనిక + కోల) తూఁచునట్టికోల: రూ-తూనికకోల-తూనికోల-తూనకోల, త్రాసుగడ, దండి-రూ-ద డె. (సం. ప)—అక్షము, తులాదండము.
**తునికోలమద్దు**, దే. వి. గవుండ్లవాఁడు బుద్ధిశగిలించుకొని పోయెడు తునికోలవంటి దుడ్డుకోల.
**తునియ**, దే. వి. రూ-తునె: చూ, తునక.
**తునియు**, దే. అ. క్రి. రూ-తునుఁగు, ఖండితమగు: చూ, వ్రక్కలౌ.
**తునుఁగు**, —పై.— అన్ప. అర, కాం. 109; 2 కివ్వ: చూ, మడియు.
**తునుక**, దే. వి. రూ-తున్క: చూ, శకలము. 4.
**తునుమాడు**, దే. స. క్రి (రూ - తునుము - తున్మాడు - తున్మ) (తునుము + ఆడు) 1. ఖండించు చూ, నెఱకు; 2 చంపు. జై. 5, ఆ. 73: చూ, సంహరించు.
**తునుము**, —పై—(ఖండించు.—ఉ. హరి. 3, ఆ 22)
**తునుముట**, దే వి. హింస: చూ, వధము.
**తునె**, దే వి: చూ, రూ తునియ.
**తున్నకము**, సం. వి. అ. పుం: చూ, నంది*.
**తున్నవాయము**, సం. వి. అ. పుం. బట్టలుకుట్టుట: చూ, సౌచికము.
**తున్నవాయుఁడు**, సం. వి, అ. పుం. కుట్రపువాఁడు: చూ, సౌచికుఁడు.
**తున్మాడు**, దే. స. క్రి: చూ, రూ-తునుమాడు.
**తున్మ**, —పై.—
**తుపర**, వై. వి. = తుషార, రూ-తుంపర చూ, శీకరము: (చూ, వాన. 1.)
**తుపాకి**, దే. వి. సిపాయిలు మందుగుండువేసి దట్టించి కాల్చెడు ఇనుపక్రోవి: చూ, బాణము. 1.
**తుపాను**, దే. వి. గాలివాన: చూ, వాన 1.
**తుపానుగాలి**, దే. వి. ఈఁదురు: చూ, వాయువు. 1.
**తుపారము**, దే. వి. వస్త్రమకుట భేదము: చూ, సీసకము. 1.
**తుభాసి**, వై. వి. = ద్విభాషీ ఒక భాషను మఱియొక భాషతో చెప్పెడువాఁడు.
**తుపుక్కు**, దే. వి ఉమియుట, కాండ్రించి ఉమియుట లోనగు వానియందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.
**తుప్ప**, దే. వి. 1. చిన్నపొద, గుల్మము: చూ, పొద. 2; వా. 2 ప్రాణము, దుర్వ్యసనతో దుర్వ్యసనితలవెండ్రుకల గుంపు (అని కొందఱు.) "నీతుప్ప తీసెదను"
**తుప్పటిల్లు**, వై. అ. క్రి. = తృప్తి. తనియు. స్వా 2, ఆ. 11: చూ, తృప్తిపడు.
**తుప్పర**. వై. వి. = తుషార: చూ, రూ-తుంపర.
**తుప్పలుదూలు**, దే. అ. క్రి. (తూలు + తూలు). మిక్కిలి చలించు: చూ, చలించు.
**తుప్పు**, దే. వి రూ-త్రుప్పు 1 లోహమలము: చూ, లోహము. 1; 2: చూ, తుపుక్కు. హరిశ్చ. 4, ఆ. 162; వా. 3. ముక్కుట (కంపు.) "తడియుటచే ధాన్యము తుప్పు (కంపు) కొట్టుచున్నవి."
**తుబరము**, సం. వి అ పుం: చూ, రూ-తూబరము
**తుభము**, సం. వి. అ. పుం. మేఁకపోతు: చూ, మేషము. 1.
**తుమిక**, వై. వి. = తిందుక*: చూ, స్ఫూర్జకము.
**తుమికి**, వై. వి. = —పై.—
**తుమురు**, దే. వి 1. ధూళి: చూ, రేణువు: 1; 2. సూక్ష్మఖండము. భార, శల్య. 2, ఆ. 256: చూ, శకలము. 4.
**తుములము**, సం. వి. అ. న. 1. = దొమ్మి. దొమ్మి యుద్ధము: చూ, యుద్ధము; పుం. 2: చూ, తాండ్ర*.
**తుమ్మ**, దే వి. అరిమేదము*: చూ, విట్ఖదిరము.
**తుమ్మకట్టు**, వా. వి. 1. తుమ్మచెట్టుకట్టు; 2. క్షుతము చేయవలదు. (వ్యతిరేకమందు.—దగ్గకట్టు, ఇట్లు తినకట్టు మొ.)
**తుమ్మి**, వై. వి. = తుంబీ. ద్రోణ*: చూ, తుమిక.
**తుమ్మిక**, —పై.—
**తుమ్మికి** —పై.—
**తుమ్మిపూరాజనాలు**, ద్వ. వి. ఒకరకమువడ్లు: చూ, ధాన్యము.
**తుమ్ము**, దే. వి 1. (సం. ప.)— కాశము, క్షుధువు, క్షవము, క్షుత, క్షుతము; అ. క్రి. 2. క్షుతము చేయు.
**తుమ్మెద**, దే. వి. పూఁదేనెఁద్రావెడి యొకరకము నల్ల ఱెక్కల పురుగు: చూ, భ్రమరము.
**తుమ్మెదకంటు**, ద్వ. వి చూ, సంపెఁగ*.
**తుమ్మెదమామిడి**, దే. వి. కోశామ్రము*: చూ, మామిడి.
**తుమ్మెదయల్లె**, అం. మన్మధుని మొదటిపేరగు వింటియొక్క నారి. (వీని బాణములు.— కలువ, తామర, మావిపూలు.) (చూ, బాణము. 1.) వేం. అం. 9: చూ, మౌర్వి. 1 (చూ, మన్మథబాణములు.)
**తుమ్మెదరేపుడు**, దే. వి: చూ, బాలక్రీడ.
**తురంగమము**, సం. వి. అ. పుం. = తురికీ. గుఱ్ఱము: చూ' హయము.
**తురంగము**, సం. వి. అ. పుం. = —పై.—
**తురంగలీల**, అం: చూ. జన్యతాళములు.
**తురక**, వై. వి. = తురుష్క: చూ, మ్లేచ్ఛుఁడు.
**తురకదొగ్గలి**, ద్వ. వి. ఒకరకము దొగ్గలి*: చూ, రక్తబాష్పము
**తురకపికిలి**, ద్వ. వి. ఒకరకము పికిలిపిట్ట: చూ, పికిలిపిట్ట.
**తురకబాయి**, ద్వ. వి. బొంతబాయి: చూ, రాయి.
**తురకవేము**, ద్వ వి. తృణనింబము* (ఋతురక్తమును జారీ చేయును.): చూ, వేము.
**తురగజాతి**, అం: చూ, అంతరజాతిత్రయము.
**తురగబ్రహ్మచర్యకము**, సం. వి. అ. న. అభావముచే బ్రహ్మచర్యము వహించుట. (లేకపోవుటవల్ల ఆఁడుదానిని వదలుట.)
**తురగము**, సం వి. అ. పుం. 1. చూ, రూ-తురంగమము; 2. గుండె: చూ, హృదయము. 2; అం. 3. ఒకానొక వృత్తము. ఒక్కొక్క పాదము న-న-న-న-స-ల-గ

గురువులతోఁగూడి పదునేనవయింట యతిగల ద్వావింశ చ్ఛందస్సునం దుద్భవించిన వృత్తము. అప్ప. 4, ఆ. 248: చూ, వృత్తము. 1.
తురగములు, అం. (గుఱ్ఱములు): చూ, సేనాంగములు: (చూ, అంగము. 9): (చూ, చతురంగములు.)
తురగవల్గనము, అం. నవవిధ రగడలలో నొకటి. ఒక్కొక్క పాదము హయప్రచారగతిగ రెండు పాదములు కలిసి ఒక పాదముగా అగును. యతి యయిదవగణాద్యక్షరము: చూ, రగడ: (చూ, వృత్తము.)
తురగి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, పెన్నేరు*; 2. ఆఁడుగుఱ్ఱము: చూ, హయము; అం. 3: చూ, అవాంతరజాతులు.
తురా, దే.వి. రూ-తురాయి. 1.నిడువుకాఁడబెట్టి కట్టిన పూబంతి: చూ, పూబంతి; 2. తలనుంచెడు ఒకానొకభూష. శకాం. 5, ఆ. 7: చూ, భూషణము. 2.
తురాయణము, సం. వి. అ. న. తడఁబడకుండ చదువుట: చూ, పఠనము.
తురాయి, దే. వి: చూ, తురా.
తురాషాహుఁడు, సం. వి. హ్. పుం. ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు.
తురి, సం. వి. ఈ. స్త్రీ. కండెలుంచి నేసెడు యంత్రము: చూ, నాడె.
తురికి, వై. వి.1 : చూ, కచ్చి; 2. = తురంగః. గుఱ్ఱము: చూ, హయము.
తురితము, వై. అవ్య. క్రి. విణ. = త్వరితమ్: చూ, వేగము.1.
తురితు, = —పై.—
తురీన, వై. ద్ర.క్రి. విణ. = —పై.—
/తురీయము, సం. వి. అ. న. 1. బ్రహ్మము, పరమాత్మ: చూ, హంసుఁడు;విణ. 2. నాలవయవస్థ: చూ, తుర్యము.
తురుంభము, సం. వి. అ.పుం. = తుఱుము. పూలదండలు మొదలగునవి తుఱిమినకొప్పు: చూ, వేనలి.
తురుఁజ, దే. వి: చూ, గండీరము*.
తురుతు, వై. అవ్య. క్రి. విణ: చూ, తురితము.
తురుపు, వా. వి: చూ, రూ-తుడుపు.
తురుపు, వా. వి. 1. గుఱ్ఱపుదండు; 2. చీట్లాటయందలి నాలుగు రంగులలోను గెలుపుకొరకు చెప్పెడు యొకానొకరంగు, (ఇస్పేటు తురుపు, కళావరు తురుపు, అరఖు తురుపు, డైమాను తురుపు;తురుపు తుడుపు అనియు.)
తురుము, వై. వి. = తురుంభ. రూ-తుఱుము. 1; దే. వి. 2: చూ, రూ-తుఱుము. 2; 3. కాయపెండళము: చూ, సమష్ఠిల.
తురుష్కతుండి, అం: చూ, తుండ్యుపాంగములు: (చూ, అంగము. 9.)
తురుష్కము, సం. వి. అ. పుం. 1. చిల్లమడ్డి. తురుష్కమను గ్రంధ్యము. (కపియను గంధద్రవ్యము): చూ,రాజార్హము; 2. తురుష్కదేశము: చూ, దేశము; 3. టికము: చూ, ముడ్డిపూస; స. 4. తిగ: చూ, మూఁడు.
తురుష్కుఁడు, సం. వి. అ. పుం. = తురక. (మాలవానికంటె నితరమగు పన్రెండు కడపటి జాతులలో నొకఁడు): చూ, మ్లేచ్ఛుఁడు.
తుర్య, సం. వి. ఆ. స్త్రీ: చూ, తురి.
తుర్యతుండి, సం. వి. ఈ. స్త్రీ. పిండిదొండ*: చూ, రక్తఫల.
తుర్యము, సం. విణ: చూ, తురీయము: (చూ, అవస్థలు.)
తుఱఁగలి, దే. వి. ప్రకాశము. భార. విరా. 1, ఆ. 294: చూ, వెలుతురు. 1.
తుఱఁగలించు, దే. అ. క్రి. 1. ప్రకాశించు. భార. భీష్మ. 2, ఆ. 155: చూ, హవణిల్లు; 2. అతిశయించు. విజ. 3, ఆ. 42: చూ, ముమ్మరించు; 3.ఒప్పు. ఆం, భా. తృ. 83: చూ, సమ్మతించు.
తుఱఁగలిగొను, —పై.—
తుఱుఁగు, దే. స. క్రి. (బలవంతమున లోపలవేసి) క్రుక్కు: చూ, దోపు. 5.
తుఱుతు, వై. వి. = త్వర. 1. వేగిరపాటు: చూ, వేగము. 3; క్రి. విణ. 2. శీఘ్రము: చూ, వేగము. 3.
తుఱుము, వై. వి. 1 = తురుంభ. రూ-తురుము. పూలుముడిచిన కొప్పు, కొప్పు (అనియు); చూ, వేనలి; దే. వి. 2. రూ-తురుము. పొడి: చూ,సురుము; స. క్రి. 3. తుఱుముపీటతో పొడిచేయు; వై. స. క్రి. 4. (కొప్పుగా) ముడుచు. భార. విరా. 1,ఆ. 291; 5. (కొప్పున) చెరుపు. స్వా, 3, ఆ. 84.
తుఱుముపీఁట, ద్వ. వి.తుఱుముట కనువుగా చివరను పండ్లేర్పఱచిన యినుపకమ్మి చెక్కినపీఁట: చూ, పీఁట.
తుఱ్ఱ, దే. వి: చూ, తుట్ర. ఆం. పదా. సుర. 46.
తుఱ్ఱు, వై. వి. 1. = త్వర: చూ, రూ-తుఱుతు; 2. పిట్ట ఎగురుటయందగు ధ్వన్యనుకరణము. "పిట్ట తుఱ్ఱున యెగిరిపోయినది. ": చూ, హుహూహూ.
తుల, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, త్రాసు; 2. = దూలము. తనాబి, కడయొత్తు: చూ, దూలము; 3, నూఱుపలముల కొలఁది; 4. పోలిక: చూ, సామ్యము; 5. ఒకరాసి: చూ, రాశి. 2; అం. 6. (తులారాశి): చూ, రాసులు. (తులాసూత్రము ప్రగ్రాహము.)
తులకించు, దే. అ. క్రి. 1. ప్రకాశించు: చూ, హవణిల్లు; 2. కుతూహలపడు: చూ, సంతోషించు.
తులకింపు, దే. వి. ప్రకాశము. విజ. 1, ఆ. 196: చూ, వెలుతురు. 1.
తులము, దే. వి. పలమునందు మూఁడవభాగము. (రూపాయయెత్తు.)
తులసి, సం. వి. ఈ. స్త్రీ. = తొళసి: చూ, హరిప్రియ. (తులసి రసము విషములకు విరుగుడు; దోమలు చేరవు.)
తులసిసేవనము, అం: చూ, సుజ్ఞానదాయకములు.
తులాకోటి, సం. వి. ఇ. పుం. అందె, నూపురము: చూ, భూషణము. 2.
తులాదండన్యాయము, న్యా. త్రాసు బరువుగానున్నవైపు క్రిందికి, తేలికగా నున్నవైపు మీఁదికిని బోవుననురీతి.
తులాదండము, సం. వి. అ. న: చూ, తునికోల.

తులాదివ్యము. అం. చూ, దివ్యములు.
తులాపురుషకృచ్ఛ్రము, పా. ఒకానొక కృచ్ఛ్రము: చూ, కృచ్ఛ్రము.
తులాపురుషము, అం. 1. మహాదానములు 16లో నొకటి ; చూ, మహాదానములు; 2. తెలికపిండి, పచ్చినస్తువులు, మజ్జిగ, జలము, పిండి ఈ యైదునుకలిసినది తులాపురుషము.
తులాభిజము, సం. వి. అ. పుం. గురివెంద* : చూ, శ్వేతపాకి.
తులితము, సం విణ. 1. సరిపోల్పఁబడినది: చూ, సుషమ; 2. తూఁచఁబడినది.
తులువ్, దే. విణ. వేగముగలది: చూ, స్యదము. 1.
తులువ, దే. విణ. కుత్సితుఁడు : చూ, వ్యాధుఁడు. 2.
తులువకత్తి. ద్వ. వి. వంపుచురకత్తి : చూ, రిష్టి. 2.
తులువగుట్టము, దే. వి. నీవాళ్యము : చూ, హయము.
తుల్యమగు, మి. అ. క్రి. సరియగు, సమానమగు.
తుల్యము, సం. విణ. సమము, సరి ; చూ, సమానము. 2.
తుల్యయోగిత, అం. అర్థాలంకారములలో నొకటి : (వర్ణ్యమున కితరవస్తువునకును ధర్మైక్యము చెప్పుట. ఉదా :— కమలములు ముడిగెను. జారిణుల వదనములు ముడిగెను.) ; చూ, అలంకారము. 3.
తువర, వై. వి. 1.= తొగర. ఒగరు—వగరు. రుచి, రూ - తువ్వర—తూవర ; చూ, రసము. 5; దే. వి. 2. రూ-తువ్వర-తూర. చినుకు ; చూ, వాన. 1.
తువరము, సం. వి. అ. పుం. 1. = తువర ; చూ, తువర. 1; విణ. 2. ఒగరైనది ; చూ, తువర. 1. (చూ, రసము. 5.)
తువరయావనాల(ళ)ము, సం. వి. అ. పుం. కషాయ యావనాళ ధాన్యము : చూ. ధాన్యము.
తువరి. సం. వి. ఈ స్త్రీ. = ; చూ, తొగరి.
తువాలు, వా. వి, రూ - తువ్వాలు. రుమాలు, చేతిగుడ్డ : చూ, వస్త్రము.
తువ్వర, దే. వి. రూ - తువర - తువర. 1. సన్నవాన. జై. 4, ఆ 138 ; చూ, వాన. 1; 2. దూళి : చూ, రేణువు. 1.
తువ్వాయి, వా. వి. అప్పుడే పుట్టినదూడ. "మా ఆవునకు తువ్వాయి పుట్టినది" ; 2. పాలుత్రాగెడుదూడ.
తువ్వాలు. వా. వి : చూ, రూ - తువాలు.
తుషము, సం. వి. అ. పుం. 1. రూ - తుసము, ఉమక - రూ - ఉముక -ఊఁక, నూఁకపొట్టు, పొట్టు. (సం. ప).—అక్షము, కంక పత్రము. కటంగరము; 2: చూ, తాండ్ర*.
తుషాగ్రహుఁడు, సం. వి అ. పుం. అగ్నిహోత్రుఁడు : చూ, వహ్ని. 1.
తుషానలము, సం. వి. అ. పుం ఊకనిప్పు : చూ, వహ్ని. 1.
తుషారము, సం. వి అ. పుం. 1. మంచు: చూ, హిమము; 2.= తుంపర. జల్లు; చూ, వాన, 1; విణ. 3. చల్లనిది: చూ, శీతలము. 5.
తుషారాట్టు, సం. వి. జ్. పుం. ఇంద్రుఁడు: చూ, వేలుపుతేఁడు.
తుషితుఁడు, సం. వి. అ. పుం. గణదేవతావిశేషము (వీరు ముప్పదియాఱుగురు. ; చూ. గణదేవతలు.
తుషోదకము, సం. వి. అ. న. పులిగడుగు; చూ, శుక్తము.
తుష్టి, సం. వి. ఇ. స్త్రీ; చూ, హ్లాదనము.
తుష్టుఁడు, సం. విణ: చూ, హృష్టుఁడు.
తుసము, వై. వి; చూ, రూ-తుషము.
తుస్సి, దే. విణ. తుసరభూమి, రూ-తుస్సె. తోవర; చూ, సురాష్ట్రజము. 2.
తుస్సు, వై. విణ. 1. అధమము ; చూ, హీనము. 1; వా వి 2. అపానవాయువు విడుచుటయందలి ధ్వన్యనుకరణము, "తుస్సుపిత్తు": చూ, హూహూ; 3. టపాకాయ, సిసింద్రీ చిచ్చుబుడ్డి లోనగునవి పేలకను, సరిగా కాలకను చీఁదుట లోనగువానియందలి ధ్వన్యనుకరణము; చూ, హూహూ.
తుస్సుపెంజెర, ద్వ వి. పెంజెరభేదము. ఒకరకము కొంత చిలువ; (చూ, పెంజెర): చూ, సర్పము.
తుస్సె, దే. విణ; చూ, రూ-తుస్సి. అం. భా. ద్వి. 4.
తుహినకరుఁడు, సం. వి. అ. పుం. చలివెలుఁగు; చూ, హిమాంశువు.
తుహినము, సం. వి. అ. న. మంచు: చూ, హిమము.
తుళువము, అం. చూ, దేశము.

## తూ

తూ, దే వి 1. తూపొడుచుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూ హూ; వా. 2. బాలబాలికలయొక్క ఆటలయందలి ఒట్టు. "తూ నాబొడ్డుకు తూ" (తూతూఅనియు.)
తూఁగాడు, దే. అ. క్రి. (తూఁగి + ఆడు) 1: చూ, సలించు. భార. ఉద్యో. 4, ఆ. 344; 2: చూ, వ్రేలాడు.
తూఁగియాడు, —పై —
తూఁగు, దే. వి. 1. నిద్ర: చూ, స్వప్నము. 2; 2. కూరుకుపాటు: చూ, ప్రమీల; అ. క్రి. 3. ఊఁగు: చూ, వ్రేలాడు; 4. కూరుకు; చూ, నిద్రించు; 5. రూ-తూఁగాడు-తూఁగియాడు, తూలు-రూ-తూలియాడు: చూ, సలించు; 6. తూనికపడు; 7. నడచు; చూ, వెళ్ళు. 3.
తూఁగుటుయ్యాల, ద్వ. వి. తూఁగుమంచము. కళా. 2, ఆ. 17: చూ, పాలకి.
తూఁగుపలక, ద్వ. వి. తా.పివాఁడు గోడల మట్టము చూచుటకై తాయివ్రేలఁగట్టిన నిడుపాటిపలక.
తూఁగుమంచము, ద్వ. వి; చూ, తూఁగుటుయ్యాల.
తూఁచు, దే. ప్రే. తూఁగఁజేయు: దడకట్టు.
తూఁట, దే. వి. 1. రూ-తుంట. ఖండము: చూ, శకలము. 4; వై. విణ. 2.= దుష్ట. దుష్టుఁడు: చూ, వ్యాధుఁడు. 2.
తూఁటకట్ట, వా, వి. గడ్డిని జడగానల్లి నిప్పుముట్టించెడుకట్ట.
తూఁటకట్టు, దే. అ. క్రి. కోఁతవడు. చూ, వ్రక్కవాఱు.
తూఁటరి, వై. విణ. (తూఁట + అరి) = కుంత. దుష్టుఁడు, రూ-తూఁడరి. భాగ. 6, స్కం. 182: చూ, వ్యాధుఁడు. 2.
తూఁటాడు, దే. స. క్రి. (తూఁటు + ఆడు); చూ, వేధించు. జై. 7, ఆ. 4.
తూఁటి, దే. వి. నశి, తుంటికూర: చూ, శైవలము.
తూఁటికూర, ద్వ. వి. —పై. —(దేశ్యమని శ. ర)
తూఁటిగానపు తేజిగలబోటి, ద్వ. వి; చూ, సరస్వతి. అం. భా ప్ర. 42.

**తూఁటు,** దే. వి. రూ-తూము. 1. కనుమ. ఆం, భా. ప్ర. 145: చూ, రంధ్రము. 1; 2. చిల్లి; చూ, రంధ్రము. 1.

**తూఁటుకట్టు,** దే. అ. క్రి. తూఁటుపడు, తూఁటుపోవు. భార. ఉద్యో. 4, ఆ. 131; చూ, తో అటలువాలు

**తూఁడరి,** వై. విణ.=కుంఠ: చూ, రూ తూఁటరి.

**తూఁడు,** దే. వి. తామరపువ్వులోనగువానివేరు, బిసము. విజ. 1, ఆ, 197: చూ, పద్మము. 1.

**తూఁడుదిండి,** దే. వి. (తూఁడు + తిండి) తెలిపిట్ట అచ్చ. యు, కాం. 30: చూ, హంస. 1.

**తూఁడునూలునారి,** అం. మన్మధుని మూఁడవది యగు వింటి యొక్క నారి. (దీనిబాణములు — మంకెన, అశోక, మల్లెపూలు.) వేం. ఆం. 9: చూ, స్థావరము. 1; (చూ, బాణము. 1.) (చూ, మన్మథబాణములు)

**తూఁడువిల్తుఁడు,** దే. వి: చూ, మన్మథుఁడు, వేం. ఆం. 8.

**తూఁతకొమ్ము,** దే. వి. మురళి, వంశనాళవాద్యము: చూ, వీణ (తూఁతూబాకా అనియు)

**తూఁతూబాకా,** వా. వి.—పై.—

**తూకము,** దే. వి. రూ-తూకు. 1. పూనిక. జై. 7, ఆ. 40: చూ, యత్నము; అం. 2. నాట్యములోని పదునాలుగు అంగములలో తుక యనునది ఒకానొకయంగము; (చూ, నాటకము. 1.)

**తూకు,** —పై.—

**తూకొను,** దే. అ. క్రి. (తూకు + కొను) 1. పూను: చూ, యత్నించు; 2. ప్రవేశించు. ఆం, భా. తృ. 122: చూ, సోఁకు. 4.

**తూణము,** సం. వి. అ. పుం.=దొన. రూ తూణి-తూణీరము. అమ్ములపొది (ఇది ఆ. స్త్రీ గాను, ఈ. స్త్రీ. గాను గలదు): చూ, బాణము. 1.

**తూణీరము,** సం. వి. అ పుం. —పై—

**తూదము,** సం. వి. అ. పుం. గంగరావి*: చూ, రావి,

**తూవసస్యకము,** సం. వి. అ. పుం. పోఁకమామిడి*: చూ, మామిడి.

**తూనరతుక్కము,** దే. వి. చూ, బాలక్రీడ

**తూనిక,** దే. వి: చూ, తులామానము. (రూ-తూనికె.)

**తూనికకోల,** దే. వి: చూ, రూ-తునికోల.

**తూనికవేయు,** దే. స. క్రి: చూ, తూఁచు.

**తూనికె,** దే. వి: చూ, రూ-తూనిక.

**తూనికోల,** దే. వి: చూ, రూ తునికోల.

**తూనిఁగ,** దే. వి. పతంగిక. రూ-తూనీఁగ. చూ, మక్షిక.

**తూనీఁగ,** —పై.—

**తూనీఁగతానిగ,** దే. వి. చూ, బాలక్రీడ.,

**తూనుకోల,** దే. వి: చూ, రూ-తునికోల.

**తూనెకొట్లాట,** దే. వి: చూ, బాలక్రీడ.

**తూపరము,** దే. వి. 1. చిల్లి: చూ, రంధ్రము. 1; 2. కనుమ. ఆం, భా. ప్ర. 145: చూ, రంధ్రము. 1.

**తూపరాణ,** దే. వి. (రూ-తూపరాణి-తూపరాణము.) తూము, నీళ్ళుబయటికివచ్చు తూము: చూ, తూము. 2.

**తూపరాణము,** 1.—పై.—; 2. ఒడపి: చూ, రంధ్రము. 1.

**తూపరాణి,** దే వి: చూ, రూ-తూపరాణ.

**తూపి,** వై. వి.=స్తూప. గుడిలో మూలవిగ్రహము ఉండెడు చోటికి మీఁద విమానమువలె ఎత్తుగా కట్టిన కట్టడము.

**తూపు,** దే. వి. అమ్ము. చూ, బాణము. 1.

**తూపురాసి,** ద్వ. వి: చూ, తూము. 2.

**తూపురిక్క,** ద్వ. వి శ్రవణనక్షత్రము, కరివేల్పురిక్క: చూ, రిక్క. 1-౨౨.

**తూపురూపురిక్క,** ద్వ. వి: చూ, తూపురిక్క.

**తూపురిక్కనెల,** ద్వ. వి. శ్రావణమాసము: చూ, మాసము. 1.

**తూపొడుచు,** దే. స. క్రి: ఉమియు, క్రాయు.

**తూబరము,** సం. వి. అ. పుం. రూ. తుబరము. కాలమున కొమ్ములు మొలవని యెద్దు: చూ, వృషభము. 1.

**తూబరుఁడు,** సం. వి. అ. పుం. రూ-తుబరుఁడు. 1. పేడిమూతివాఁడు, ప్రాయమున గడ్డము మీసము రాని మగవాఁడు: చూ, సౌవిదల్లుఁడు; 2. అంతఃపుర కావలివాఁడు: చూ, సౌవిదల్లుఁడు.

**తూము,** వై. వి. 1.=తుంబికా. బండిచక్రము నడిమిరంధ్రము: చూ, రంధ్రము. 1; 2. నీళ్లు బయటికి వచ్చునట్లు కట్టిన కట్టడము. వసు 5, ఆ. 17: చూ, మరిగొమ్ము; 3. నాలుగు కుంచముల కొలఁది: చూ, ప్రస్థము; 4. సూదిచెవి: చూ, రంధ్రము. 1; 5. నగలమోపునందలి రంధ్రము: చూ, రంధ్రము. 1; 6. కన్నము: చూ, రంధ్రము. 1; వా. 7. వంటకాలువకు ప్రక్కను చేర్చివేసెడి కుండతూర. "కుండతూము": చూ, తూర. 4. (చూ. మరిగొమ్ము.)

**తూర,** దే. వి. 1. వానబొట్టు: చూ, వాన. 1; 2. తుంపర: చూ, సీకరము; 3. రూ తూల, పండుచేఁప చూ, మత్స్యము. 1; వా. వి. 4: చూ, తూము. 7. "కుండతూర, తాటితూర" మొ.

**తూరజల్లు,** ద్వ. వి ధారావర్షము: చూ, వాన. 1.

**తూరనగోలీలు,** దే వి. బ: చూ, బాలక్రీడ.

**తూరనదుక్కా,** దే. వి.—పై.—

**తూరనతుంకములు,** దే వి. బ.—పై.—

**తూరి,** దే. వి. తడవ, ఆవృత్తి (ఇది ఏకావర్ణర్థక శబ్దపూర్వకముగానే ప్రయోగింపఁబడును. ఉదా. "ఒకతూరి-కొతూరి"): చూ, సారి. 2.

**తూరు,** దే. వి. 1. తుచ్ఛధాన్యము: చూ, ధాన్యము; అ. క్రి. 2. సన్నగతూరపడు.

**తూరుపాలి,** దే వి. 1. ఒకానొకగాలి. రూ-తూర్పాలి, తూర్పెడి: చూ, వాయువు: 2. తుచ్ఛధాన్యోత్క్షేపణము: తూరుపాఱఁబట్టుట.

**తూరుపాఱఁబట్టుట,** జా. 1. ధాన్యము తూరు (అనఁగాఁబొల్లు) గాలిలో నెగురునట్లు పట్టుట; 2. ఎగురఁగొట్టుట; 3. తేలికచేయుట "నాలుక తుదిపలుకులైన నూరక తూరుపాఱఁబట్టుచున్నాఁడవు." (ధర్మజ రాజసూయము)

**తూరుపాఱఁబట్టు,** దే. స. క్రి (తూరు + పాఱన్ + పట్టు) రూ. తూర్పాఱఁబట్టు. గలపొట్టు లోనగునవి యెగిరిపోవునట్లుగా చేట లోనగువానితో ధాన్యము లోనగు వానిని పైకెత్తి క్రిందుగాఁబోయు.

తూరుపు, దే. వి: చూ, రూ-తూర్పు.
తూరుపుఁగొండ, ద్వి. వి. ఉదయాద్రి: చూ, పర్వతము.
తూరుపుపతి, ద్వి. వి. ఇంద్రుఁడు. ఆం, భా. ప్రి. 46: చూ, వేలుపుఱేఁడు.
తూరుపుఱేఁడు, దే. వి.—పై.—
తూరుపెత్తు, దే. వి. (తూరుపు + ఎత్తు) రూ-తూర్పెత్తు. 1: చూ, ఎగరఁబోఁత; స. క్రి. రూ-తూర్పెత్తు; 2. ధాన్యాదికములను ఎత్తి తూర్పుగాలికివిడుచు; 3. ఏదేని గాలివాటముగా ఎత్తివిడుచు; 4. వెండ్రుకలు పాయఁదీసి అడ్డముగా మీఁది కెత్తిపట్టు. పాండు. 3, ఆ. 30.
తూర్చు, దే. ప్రే. రూ-దూర్చు. గుచ్చు. నై. 4, ఆ. 81: చూ, రూ-తూఱుచు.
తూర్ణము, సం. క్రి. విశ. అ. న. 1. త్వరితము: చూ, స్యదము; విశ. 2. వడిగలది: చూ, స్యదము.
తూర్పాఱ, దే. వి: చూ, రూ-తూరుపాఱ. 1.
తూర్పాఱఁబట్టు, దే.స. క్రి: చూ, రూ-తూరుపాఱఁబట్టు.
తూర్పిడి, దే. వి: చూ, తూరుపాఱ. 1.
తూర్పు, దే. వి. (రూ-తూరుపు-తూఱుపు.)1. ప్రాగ్దిశ: చూ, హరిత్తు; అం. 2: చూ, దిశలు; 3: చూ, దిశలు; 4: చూ, దిక్కులు.
తూర్పెత్తు, దే. స. క్రి: చూ, రూ-తూరుపెత్తు.
తూర్యగంజ, సం. వి. ఆ. స్త్రీ. ద్రగడమను వాద్యము: చూ, వీణె.
తూర్యత్రియకౌశలము, అం: చూ, సుగుణములు.
తూర్యము, సం. వి. అ. న. 1. వాద్యము: చూ, వీణె; పుం, న. 2. వాద్యపుమ్రోఁత: చూ, స్వరము. 2.
తూఱఁబడు, ద్వి. అ. క్రి. (తూఱన్ + పడు) తూఱు, ప్రవేశించు. నిర్వ. 4, ఆ. 76: చూ, సోఁకు. 4.
తూఱు, దే. అ. క్రి.—పై.—భార. భీష్మ. 2, ఆ. 398
తూఱుచు, దే. ప్రే. తూఱఁజేయు: గుచ్చు, తూర్చు.-రూ-దూర్చు. (ఎక్కించు అనియు.)
తూఱుపు, దే. వి: చూ, రూ-తూరుపు-తూర్పు.
తూల, దే. వి. తూర. పండుచేఁప: చూ, మత్స్యము. 1.
తూలఁబాఱు, దే. అ. క్రి. (తూలన్ + పాఱు) 1. తూలు, చలించు: చూ, సలించు; 2. తొలఁగు: చూ, విరియు. 5.
తూలకంటకము, సం. వి. అ. పుం. గొబ్బి*: చూ, మొగలీర.
తూలకార్ముకము. సం. వి. అ. న. దూదియేకువిల్లు, పింజనము: చూ, బాణము. 1.
తూలనాసిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, దూదిచుట్ట.
తూలనాళిక, సం. వి. ఆ. స్త్రీ.—పై.—
తూలపోవు, మి. అ. క్రి. (తూలము + పోవు) చిన్నవోవు. భార. భీష్మ. 2, ఆ. 259: చూ, విన్నవోవు. (ప్రే. తూలపుచ్చు. భార. ఉద్యో. 3, ఆ.298.)
తూలము, సం. వి. అ. న. 1. గంగరావి*: చూ, రావి; 2. ఆకాశము: చూ, వ్యోమము; పుం, న. 3. = దూది. విత్తులు తీసినప్రత్తి, పిచుపు: చూ, ప్రత్తి.
తూలాడు, దే. అ. క్రి. (తూలి + ఆడు) రూ- తూలియాడు- తూలు, చలించు. భార. విరా. 5, ఆ. 184: చూ, సలించు.
తూలి, సం. వి. ఈ. స్త్రీ. 1. తూలిక: చూ, తెక్కి. 1; దే. వి. (1) (తూల + ఇ) చేఁపలనుబట్టి జీవించెడి యొకానొక జాతివాఁడు: చూ, వలతేఁడు; (2) తూలికాఁడు. మేఁకలను బట్టి జీవించెడి యొకానొకజాతివాఁడు.
తూలిక, సం. వి. ఈ. స్త్రీ. 1. చిన్నయీఁక: చూ, తెక్కి. 1; 2. వ్రానెడుకలము; చూ, లేఖిని; 3. (చిత్రమువ్రానెడు) వాగర, జాలిని: చూ, వాగఱ; వా. 4. = తూలిక: చూ, , తూలిక. (1); వై. వి. = తూలిక. (1) మాల్యగ్రంధి. ఆం. పదా. 439: చూ, పూవులపొట్లము.
తూలికాఁడు, దే. వి: చూ, తూలి. (1), (2).
తూలించు, దే.స.క్రి.చంపు.సాంబ.మా,32: చూ, సంహరించు.
తూలియాడు, దే. అ. క్రి: చూ, రూ-తూలాడు. నై. 7, ఆ. 92.
తూలు, దే. అ. క్రి. 1.—పై.—; 2. అపసరిల్లు: చూ, విరియు. 5; 3. ఉపశమిల్లు. ఆం, భా. తృ. 87: చూ, సుక్కు. 4.
తూలుచు, దే. ప్రే. రూ-తూల్చు. 1. చలింపఁజేయు; 2. తొలఁగించు. సా. 1, ఆ. 101.
తూలుమాటలు, వా. వి. తిట్లు, బండబూతులు, కుచ్ఛితపుతిట్లు, త్రాగుబోతుమాటలు.
తూల్చు, దే. ప్రే: చూ, రూ-తూలుచు.
తూవర, చూ, రూ-తువర,
తూవరము, వై. వి.—పై.— (సం. అని కొందఱు.)
తూషణము, అం: చూ, ముఖరతులు.
తూష్ణీమ్, సం. అవ్య. మౌనమందు వర్తించుసు, తూష్ణీకామ్. చూ, మౌనము.
తూష్ణీంశీలుఁడు, సం. విశ. మాటలాడక ఊరకుండువాఁడు: రూ- తూష్ణీకుఁడు.
తూష్ణీకామ్. సం. అవ్య: చూ, తూష్ణీమ్.
తూష్ణీకుఁడు, సం. విశ: చూ, తూష్ణీంశీలుఁడు.
తూస్తము, సం. వి. అ. న. దుష్కృతము: చూ, పాపము.

## తృ

తృటము, సం. వి. అ. పుం. = చిటిక. తృటి: చూ, స్వరము. 2.
తృటి. సం. వి. ఇ. పుం. 1. = చిటిక.—పై.—; ఈ. స్త్రీ. 2. చిన్నేలకి*: చూ, పత్రల.
తృట్టు, సం. వి. ష్. స్త్రీ. 1. రూ-తృషము-తర్షము. దప్పి. పాండు. 5, ఆ. 179: చూ, పిపాస; 2. ఇచ్ఛ: చూ, వాంఛ.
తృణకుటి, సం. వి, ఈ. స్త్రీ. పూరిగుడిసె: చూ, సదనము. 1.
తృణకేతువు, సం. వి. ఉ. పుం. వెదురు*: చూ, వేణువు.
తృణగండము, సం. వి. అ. పుం. ఉచ్చింటుఁడను చేఁప: మత్స్యము. 1.
తృణగ్రాహి, సం. వి. న్. పుం. పచ్చ, మరకతము: చూ, రత్నములు: (చూ, తృణమణి. 2.)
తృణచ్ఛన్నకూపన్యాయము, న్యా. గడ్డికప్పుకొనియున్న బావి విధము. గోముఖవ్యాఘ్రమువంటిది.

**తృణజలూక**, సం. వి. ఆ స్త్రీ. జలగవలెనుండి గడ్డిలో తిరుగు పురుగు: చూ, పురుగు.

**తృణజలూకన్యాయము**, న్యా. గడ్డిపైపురుగు మూతికి సమీపమందు రెండుకాళ్లను వెనుకవైపున చివర రెండుకాళ్లను గలది. అది వెనుకకాళ్ళతో నిలబడి ముందునిలుచుట కాధారము చూచుకొని ముందుకాళ్ళ నక్కడబెట్టి తరువాత వెనుక కాళ్లు తీయుననురీతి

**తృణత**, సం. వి. ఆ. స్త్రీ. 1. తృణభావము; 2. (రూ-తృణిత-త్రిణత.) విల్లు: చూ, బాణము. 1.

**తృణతతి**, సం. వి. ఈ. స్త్రీ గడ్డిమేటి. చూ, మేటి.

**తృణద్రుమములు**, సం. వి. అ. పుం. బ. తాటి, కొబ్బరి, ఈత, ఖర్జూరము మొ.

**తృణధాన్యము**, సం. వి. అ. న. 1. విత్తక పండెడు గునుకు నివ్వరి దూసరి లోనగునవి: చూ, ధాన్యము; వా. 2. గడిజాతి సస్యములు-వరి, జొన్న, గోధుమ లోనగునవి.

**తృణధృక్కు**, సం. వి. హ. పుం బడబాగ్ని, కాకధ్వజము: చూ, వహ్ని. 1.

**తృణధ్వజము**, సం. వి. అ. పుం. వెదురు*: చూ, వేణువు.

**తృణనింబము**, సం. వి. అ. పుం. నేపాళవేము*: చూ, అశ్వతిక్తము.

**తృణపంచమూలము**, అం. వరి, దర్భ, గనపదంటు, చెఱుకు, కామంచిగడ్డి (5).

**తృణపుష్పిక**, సం. వి ఆ. స్త్రీ కొండయల్లము*: చూ, శృంగబేరము.

**తృణపూలి**, సం. వి. ఈ. స్త్రీ గడ్డిబొమ్మ, చంచ: చూ, బింబము. 3.

**తృణమణి**, సం. వి. ఇ. పుం, స్త్రీ. నీలము: చూ, రత్నము. 1; పా. 2. తృణగ్రాహి, ఉన్నిగుడ్డతోరాచిన గడ్డిపోచలు మొదలగువాని నాకర్షించు వస్తువు.

**తృణమత్కుణుడు**, సం. విణ. జూదములో జమానతు ఇచ్చువాడు; చూ, లగ్నకుడు.

**తృణము**, సం. వి. అ. న. 1. (క్రిక్కిసలోనగు) గడ్డి: అంబరీషము, అర్జునము, ఆశు, బుశము, కక్షము, కచపము, కచ్ఛరుహ, క్షేత్రియము, గవాదనము, ఘాసము, తృణము. (తె ప) —కవను,కసవు, గడ్డి, గవతము,గాదము,చెత్త, పిల్లిపులు రూ-పుల్లు, పూరి: (చూ, హరిత. 1.) తృణవిశేషములు.- (౧) ఊర్ధ్వమూలము, బుషిశస్త్రము, కుందరము, ఖంజి, ఖగ్గదము, ఖరచ్ఛదము, జయ, తాండవము, వారుణి. (తె. ప).— ఉలస, ఊవర, కౌంద్ర, గాబ, గాబము, గునుకు, గొలివె, గోళ్ళగొండి, దూసరి, నాలికచేలు, నెంద్ర, బరపట, బూరగడ్డి, వంచవిడియ, వెట్టిచెఱకు; (౨) అంట్రింతగడ్డికి.— (తె. ప)— అంటిస-అంట్రింత, అంటింత, చిగిరింత; (౩) అడవికిక్కిసకు.— దేవనాళము. (తె. ప)— అడవికిక్కిస;(౪) అడవిగెనసునకు —పిండాంశుకము, పిండాలువు. (తె. ప )— అడవిగెనసు; (౫) అవురుకసవునకు —కుమారము, వీరణము, వీరతరము, వీరతృణము. (తె ప)— అగురు—అవురు—ఔరు; (౬) ఆశ్వలాయనదర్భకు.—అశ్వలాయకము, అశ్వవాలకము, కాశ, కాశగర్భము, కాశము, శరము; (౭) ఉప్పుగడ్డికి.—(తె. ప).—కాను, కారె; (౮) కాకి చెఱకునకు (కుందుజెల్లు).—ఇంద్రము, ఇక్ష్వారిక-రూ-ఇక్ష్వాలిక, కాండ్రేక్షువు, కాకేక్షువు, కాశము, కాశేక్షువు, ఖరచ్ఛదము, గుంద్ర, గుంద్రము, గుచ్ఛపుష్పిక, తేజనకము, ముంజము, ముంజేక్షువు, వాయనేక్షుకము, వాయనేక్షువు, శరము, శ్వేతచామరకము. (తె. ప).—కాకిచెఱకు, కాకిజెల్లు, కుందుజెల్లు, పౌనిక, జెల్లు; (౯) జెల్లుకు.—కటుకము, కాండకాండకము, చామరపుష్పము, శణము, (తె. ప).—కనపపులు, కనుము, రెల్ల — రెల్లు — జెల్లు; (౧౦ పెద్దజెల్లుకు.—ఖడ్గటము, బృహత్కాశము; (౧౧)జెల్లుగడ్డికి.—ఇక్షుగంధ, కాశము, పోటగళము, బల్బజము; (౧౨) కామంచికి —కత్తృణము—రూ-కార్తృణము, కాకధాతువు, కాకమాలి, కాకమాచి, కామంచిక, గంధకతృణము, గుడఫల, చపలము, ఛత్ర, ఛత్రాతిఛత్రము, జిలనాభము, జాత్యంభము, దేవగంధిక, దేవజగ్ధకము, దేవజగ్ధము, దేవజగ్ధిక, ధ్యామకము, ధ్యామయము, పౌరము, బిందుచిత్రము, రౌహిషము, వాయసి, సౌగన్ధికము. (తె. ప).—కామంచి—కావంచి; (౧౩) గ్రుడ్డికామంచికి.—అతిఛత్ర—అతిఛత్రము, ఆతపత్రము, గుహ్యాము, చుకనాశనము, ఛత్ర, ఛత్రాతిఛత్రము, తృణరాజము, పలఘ్నము—పాలఘ్నము, బీజకము, భూస్తృణము, మాలాతృణకము, రౌహిషము. (తె. ప) — గుడ్డికామంచి — గ్రుడ్డికామంచి, గొడుగుగడ్డి; (౧౪) కిక్కిసకసవునకు (క్రోవివంటితృణము) —ధమనము, నడము-నలము-నళము-నళ-నళిక-నాళిక, నడ్య, పోటగళము, మృదుపుష్పము, సూన్యమధ్యము. (తె. ప).—కిక్కిసకసవు, క్రోలుకసవు, గనుపదంటు; (౧౫) కుశదర్భకు.— ఉలపము, ఉల్లానము, బుషిశస్త్రము, కర్మమూలము, కుతపము, కుధము, కుశము, కూర్చ, క్షురపత్రము, దర్భ, పవిత్రము. (తె. ప).— కొన్నె, దబ్బ: (౧౬) గంటమార్వకు.—కలాయ, గండదూర్వ, గండాలి, గ్రంథిపర్ణి, శకులాక్షి; (౧౭) గడ్డిదుబ్బునకు (తృణస్తంభము) —కాండము, గుచ్ఛము, గుల్మము, (తె. ప) —కరుగు, కరువు, గంట, గంటకట్ట, దుబ్బు, పైరుదుబ్బు, పొట్టకట్ట (చూ, పొట్టకట్ట); (౧౮) గడ్డిపరకకు.—(సం. ప)—త్రిసకము: గఱికకు—అనంత, అమర, గుణ, దూర్వ, భార్గవి, రసాలి, లత, శతపర్వక. సహస్రవీర్య, హరిత-హత్తు: (తె. ప).—గరిమిడి. గఱిక; (౧౯) నల్లగఱికకు —శష్పము, శాంభవి (తె. ప) —నల్లగఱిక; ౨౦. తెల్లగఱికకు. (శ్వేతదూర్వ):—అనంతసముద్భవ, గండాలి, గోలోమి, శకులాక్షకము, శతవీర్య, సహస్రవీర్య, సిత, (తె. ప.):—తెల్లగఱిక; ౨౧. తీగెగఱికకు:—అజయ, గండాలి, తీవ్ర, శకులాక్షకము. (తె ప)— తీగెగఱిక-తీగెగఱిక, నిడుపుగఱిక; ౨౨. గింజలేనివరిపోచకు:—కిర్మి, రులాలము. (తె ప) మోడు; ౨౩. గుంద్రమూలాతృణమునకు:—ఎరక, గుంద్రమూల; ౨౪. గుచ్ఛబంధా తృణమునకు:—ఆశయ, గుండాల, గుండాసిని, గుచ్ఛబంధ, గుచ్ఛభద్ర, గుచ్ఛమూలిక: ౨౫ గోమూత్రికాతృణమునకు:— కృష్ణభూమిజ, గోమూత్రిక; ౨౬. చణికతృణమునకు:— గోదుగ్ధిక, చణిక; ౨౭. చించోటకమనుగడ్డికి:— కొంచా

దనము, చించోటకము; ౨౮. చిప్పగడ్డికి:–కేశి, గుహ్యా, ఓజము, గోమయప్రియము, భూతకేశి, భూతికము, భూతృణము - భూస్తృణము, మాలాతృణము. (తె. ప):— చిప్ప, చిప్పకసవు, చిప్పగడ్డి, చిప్పర; ౨౯. జరడీతృణమునకు:— గర్మోటిక, జరడి; ౩౦. జలతృణవిశేషమునకు:- చూ, శైవలము; జమ్మునకు:—(తె. ప).— జంబు-జమ్ము; ౩౧. తుంగగడ్డికి.—అంత్యము, అబ్దము, కర్ణపూరము, కర్తనము, కలాపిని, కాండగుండము, తోయదము, నాగరముస్త. (తె. ప).- తుంగ; ౩౨. గుంద్రపుంగకు.—గుండము, గుండాల, గుండాసిని, అంబుపత్ర, ఉచ్చట, చక్రల చలదళము, జలాశ్రయము, దీర్ఘరాజము, శాలపత్రము; (తె. ప).— గుండతుంగ–గుంద్రతుంగ, గుంద్రా; చూ, ముపుకము. 1-౨; ౩౩ తుంగముస్తెకు.—అబ్దము, కిశేరువు, కుతరము, కురువిందము (పచ్చతుంగముస్తె, భద్రముస్తకము, వత్రువముస్తె, కోలతుంగముస్తె, తుంగముస్తె లోనగువానియొక్క పర్యాయపదములు "ముస్తకము" అనుపదముకడఁ జూచుకొనవలెను). ౩౪. పర్పాటకమునకు;— కవచము, తృణాఘ్నము, (తె. ప).— పర్పాటకము; ౩౫. పశ్వాదులకసవునకు:— (లేఁత కసవు).—ఘాసము, బాలతృణము, యవసము; ౩౬. పొల్లికసవునకు.—కడంగరము, బుసము-బుషము. (తె. ప):— పొల్లిగడ్డి; ౩౭. పూచికకు:— (తె. ప):—పూచి-పూచిక, పూసకామంచి; ౩౮. మొదవుగడ్డికి:—అనుమత, ఇక్ష్వాలిక-ఇక్ష్వాలిక, బల్బజము. (తె. ప):— బొద, మొదవ-మొదువు, మోదయము; ౩౯. పొనుఁగునకు:— (తె. ప):—పొణుకుగడ్డి, పొనుఁగు; ౪౦. మూఁడంచుల తుంగకు:— (తె. ప):— ముయ్యంచుతుంగ; ౪౧. యావనాలశరమునకు:—ఖరపత్రము, యావనాలశరము; ౪౨. రక్తతృణమునకు.— (తె. ప):— చెంగలి; (౪౩) లఘుతృణమునకు.—ఖడము; ౪౪. వాసనగడ్డికి:-కరేందుకము, కర్పూరతృణము, గంధతృణము, భూతికము, భూతృణము, భూస్తృణము, (తె. ప):— వాసనగడ్డి; ౪౫ వృత్తతృణమునకు:- గుచ్ఛము: ౪౬ శిల్పికాదితృణవిశేషమునకు:- అంబువాహము; క్షేత్రజ, గోమూత్రిక, చణిక, శిల్పిక; శూకతృణమునకు:—కనిష్ఠకము, (ఇందలి విశేషములకును మిగతవిశేషములకును గల పర్యాయపదాదులకు "హరిత. 1." చూడుము); ౪౭. ఔలపము; 2. చామలోనగు పైరు: చూ, సస్యము. 1.

తృణరజ్జున్యాయము, న్యా. బలములేని గడ్డిపరకలు పోఁగుజేసి త్రాడల్లి యేనుఁగునైనం గట్టవచ్చుననురీతి.

తృణరాజము, సం. వి. అ. పుం 1. తాటిచెట్టు: చూ, శ్రీతాళము; 2. గిఱకతాటిచెట్టు: చూ, హింతాళము; 3. కొబ్బరి*: చూ, నారికేళము.

తృణవీథదాధ్వము, అం. చూ, అశ్వసంచార మార్గములు.

తృణశూన్య, సం. వి. అ. స్త్రీ. రూ-తృణశూన్యము. తృణశూల్య-తృణశూల్యము. మల్లె*; చూ, హసంతి. 2.

తృణశూన్యము, సం. వి అ. న. 1.—పై.—(అకారాంత స్త్రీలింగమును అగును); అ. పుం, న. ఆ స్త్రీ. 2. మొగలిపండు: చూ, మొగలి; విణ. 3. తృణములేనిది.

తృణశూల్య, సం. వి. అ. స్త్రీ: చూ, రూ-తృణశూన్య.*

తృణశూల్యము, చూ, రూ-తృణశూన్యము. 1—2—3.

తృణషట్పదము, సం. వి. అ. పుం. కందురీఁగ: చూ, మక్షిక.

తృణసార, సం. వి. ఆ. స్త్రీ. అరఁటి*: చూ, రంభ. 2.

తృణహర్మ్యము, సం. వి. అ. న. గడ్డిమేడ, మయటము; చూ, సదనము. 1.

తృణిత, సం. వి. ఆ. స్త్రీ చూ, రూ-తృణత.

తృణీకరించు, పం. స. క్రి. అలక్ష్యముచేయు.

తృణేన కార్యం భవతీశ్వరాణామ్, న్యా. సర్వసమర్థులును గడికపరకతోఁ బనిపడును.

తృణైర్విరచ్యతేరజ్జు ర్బధ్యంతే తేన దంతినః, న్యా. తృణములు త్రాడుగా నేర్పడి యేనుఁగును బంధించుచున్నవి. ఇట్టిదే "బలవంతమైనసర్పము చలిచీమలచేతఁజిక్కి చావదె సుమతీ!"

తృణ్య, సం. వి. ఆ. స్త్రీ: గడ్డిమోపు: చూ, మోపు. 5.

తృతీయ, సం. వి. ఆ. స్త్రీ. = తదియ-రూ-తద్దె మూఁడవతిథి, చూ, తిథి.

తృతీయకము, అం. చూ, జన్యతాళములు.

తృతీయప్రకృతి, సం. వి. ఇ. స్త్రీ. రూ-తృతీయాప్రకృతి. నపుంసకుఁడు, పేడి: చూ, సౌవిదల్లుడు.

తృతీయము, సం. స. 1. మూఁడవది; అం. 2. లగ్నకారకత్వములు పండ్రెండింటిలో నొకటి (ధైర్యము, సోదరుఁడు, యుద్ధము, పాత్ర, ఆభరణము, కంఠము, భటులు, శాంతము, మిత్రులు, ఉపాయము, ఆయుపు, సహజము, భ్రాతృ. విక్రమము); చూ, లగ్నకారకత్వములు; 3. పక్షమందు మూఁడవ తిథి; చూ; తృతీయ.

తృతీయాకృతము, సం. విణ. మూఁడుచాళ్లు దున్నినది (నేల); చూ, భూమి. 1.

తృతీయాతిరాత్రము, అం: చూ, క్రతుచతుష్టయము.

తృతీయాప్రకృతి, సం. వి. ఇ. స్త్రీ; చూ, రూ-తృతీయప్రకృతి.

తృప్తము, సం. వి. అ. పుం. 1: చూ, పురోడాశము. 1-2-3; విణ. 4, తృప్తిపొందినది.

తృప్తి, సం. వి. ఇ. స్త్రీ. = తనివి; చూ, సౌహిత్యము.

తృప్తిపడు, మి. అ. క్రి. (తె. ప)— ఆదటవోవు, అపోవు, తనియు, తనివోవు, తనిసను, తనుపారు, తుప్పటిల్లు.

తృప్తుఁడు, సం. విణ. తనివినొందినవాఁడు.

తృఫల, సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-త్రిఫల.

తృష, సం. వి. అ. ష్. స్త్రీ. 1. దప్పి: చూ, పిపాస; 2. కోరిక; చూ, వాంఛ.

తృషితుఁడు, సం. విణ. 1. దప్పిఁగొన్నవాఁడు: చూ, సతృష్ణు; 2. ఇచ్ఛఁగొన్నవాఁడు: చూ, లుబ్ధుఁడు. 2.

తృష్ణ, సం. వి. ఆ. స్త్రీ: చూ, తృష. 1—2; అం. 3. (చూ, రసనా మలము): చూ, ఊర్మిలు.

తృష్ణక్కు, సం. విణ. జ్: చూ, తృషితుఁడు.

తృష్ణాఘ్నము, సం. వి. అ. పుం. పర్పాటక మను గడ్డి; చూ, తృణము. 1.

# తె

తెంకాయ, దే. వి: చూ, రూ-టెంకాయ.
తెంకాయచెట్టు, దే. వి: చూ, రూ-టెంకాయచెట్టు.
తెంకి, దే. వి. రూ-టెంకి. చోటు : చూ, స్థానము 1; 2. ఇల్లు; చూ, సదనము 1. (దేవళము అనికొందరు.)
తెంచు, దే. ప్రే. తెగఁజేయు రూ-త్రెంచు. తెంపు-త్రెంపు.
తెండు, దే. అ. క్రి. 1. పరుండు: చూ, శయనించు; వా. 2. తీసికొనిరండు. "అసందు తెండు."
తెందెప్పలు, దే. విణ. బ (తెప్పలు + తెప్పలు) రూ-తెందేపలు, దరిలేనిది. సా. 1, అ. 67: చూ, అపారము.
తెందేపలు, —పై.—
తెంపరి, దే. విణ. (తెంపు + అరి) 1. తెగుదారి; చూ, సాహసికుఁడు; 2. శూరుఁడు. జై 2, అ. 46: చూ, హంవీరుఁడు. 2.
తెంపి, దే. వి. 1. అనాథ: చూ, విధవ; 2. తెగువ: చూ, సాహసము; 3. తెగుట : తెంపు. భార. విరా. 5, అ. 61.
తెంపు, దే. వి. 1 తెగువ: చూ, సాహసము; 2. తెగుట: చూ, తెంపి. 3; ప్రే. 3: చూ, రూ-తెంచు.
తెకతెక, దే. వి. ఉడుకుట, క్రాఁగుట, ఎగయుటయందగు ధ్వన్యనుకరణము. రామా. 5, అ. 22: చూ, హుూహుూ.
తెకతేర, దే. విణ. (తేర + తేర) 1. బొత్తిగా సంబంధములేనిది. పా. 4, అ. 58; క్రి. విణ. 2. మిక్కిలి వ్యర్థము. కళా. 3, అ. 191: చూ, వ్యాహతము. 2.
తెక్కరము, దే. వి. అగ్గలిక: చూ, విలాసము.
తెక్కలి, వై. వి. 1.=తస్కర. చౌర్యము: చూ, హరణము. 1; 2. మోసము, భార. శల్య. 2, అ. 401: చూ. వంచన ; 3. ఏమరిక : చూ, ప్రమాదము: విణ. 4 మోసముచేయునది. భాగ. స్కం. 352: చూ, వంచన.
తెక్కలికాఁడు, ద్వ. వి. 1. దొంగ: చూ, హారకుఁడు. 1; విణ. 2: చూ, వంచకుఁడు. భార స్త్రీ. 2, అ. 137.
తెక్కలిపాటు, వై. వి. అవద భాగ. 6, స్కం. 349: చూ, విపత్తు.
తెక్కు, దే. వి. 1. పడుచుఁదనపు టెక్కు: రూ-టక్కు-టిక్కు—టెక్కు—టెక్కువ— తెక్కెర, విక్కు, 2. అగ్గలిక. పా. 5. అ. 10: చూ, విలాసము.
తెగ, దే. వి. 1. రూ-తెవ. గుంపు. అచ్చ యు, కాం. 236: చూ, సమూహము; 2. జాతీయసమూహము: చూ, సమూహము; 3. పక్షము. ఉ, రా. 6, అ. 99: చూ, ప్రక్క: 2; 4. (ఎక్కుపెట్టిన) అల్లెత్రాడు. ఉ, హరి 3, అ. 53. చూ, మౌర్వి. 1; 5. జ్యాకృషి. ఎక్కుపెట్టుట; 6. రీతి: చూ, విధము. 1; 7. దీర్ఘము: చూ, పొడవు. 2; ద్ర. 8. నిశ్శేషముగా; 9. ఖండితముగా. "తెగనాడ వలదు సభలను."
తెగఁగొట్టు, దే. స. క్రి. (తెగన్ + కొట్టు) 1. నఱకు: చూ, ఖండించు; వా. 2. మధ్యవర్తిని.గా నుండి స్థిరపఱచు.
తెగఁజూచు, దే. స. క్రి. (తెగన్ + చూచు) చంపు. భార విరా. 1, అ. 324: చూ, సంహరించు.
తెగఁబడు, ద్వ. అ. క్రి. (తెగన్ + పడు) తెగించు: చూ, సాహసించు.
తెగఁబాటు, దే. అ. క్రి. (తెగన్ + పాటు): చూ, తెగన్ + పాటు): చూ, తెగఁబడు.
తెగచు, దే. అ. క్రి. కలఁగు: చూ, సంక్షోభించు.
తెగటాఱు, దే అ. క్రి: (తెగటు + అఱు) చూ, మరణించు, భార. అర. 4, అ 254.
తెగటాఱుచు, దే. ప్రే. తెగటాఱఁజేయు: రూ-తెగటార్చు.
తెగటార్చు —పై.—
తెగటార్పు. దే. వి. హింస. అం, భా. ద్వి. 224: చూ, వధము.
తెగటు, దే. వి. 1. త్రుళ్లు, గర్వము: చూ, హంకారము; అ. క్రి. 2. త్రుళ్లు, గర్వించు. భార. ఉద్యో. 1, అ. 377: చూ, హంకరించు.
తెగడ, వై. వి. =త్రిపుటా. త్రివృతా * (దీనిభేదములు.— తెల్లతెగడ, నల్లతెగడ. ఇదే తెల్లతెగడ): చూ, సర్వానుభూతి.
తెగడిక, దే. వి. రూ- తెగడు. చూ. నింద. 1.
తెగడికమానిసి. ద్వ. వి: అవగణితుఁడు.
తెగడు, దే. వి. 1: చూ, రూ-తెగడిక. భార. కర్ణ. 1, అ. 313; అ. క్రి. 2. ఉపేక్షింపఁబడు; స. క్రి. 3. తిరస్కరించు: చూ, భంగించు; 4 ఉపేక్షించు: అచ్చ. బాల, కాం. 112: చూ, కన్నడించు; 5. దూఱు. నిర్వ. 10, అ. 12: చూ, నెగ్గించు.
తెగనీలుగుట, వా. వి. 1. చెప్పినమాట వినకపోవుట; 2. నాకేమనెడి గర్వము: చూ, హంకారము. (ఉత్తరసర్కారులలో వాడుక.)
తెగవేయు. దే. స. క్రి. నఱకు: చూ, నెఱుగు.
తెగసాఁగుట, వా. వి: చూ, తెగనీలుగుట.
తెగించు. దే అ. క్రి: చూ, తెగఁబడు.
తెగు, దే. అ. క్రి. రూ-త్రెగు-త్రెయ్యు. 1: చూ, మరణించు; 2. ఛిన్నమగు: చూ, భేదిల్లు. 2; 3. ఖండితమగు: చూ, వ్రక్కలాఱు; 4. తీర్పగు. రూ-త్రెగు-త్రెయ్యు. జై. 8, అ. 209; 5: చూ, తెగఁబడు. ఉ, హరి. 4, అ. 205.
తెగుట, దే. వి: చూ, సావు. అం, భా. ద్వి. 226.
తెగుడు, దే. వి. నఱకుడు: చూ, విచ్ఛేదనము. 2.
తెగుదల, దే. వి. 1. అంతము. నిర్వ. 9, అ. 53: చూ. సుడ. 2; 2. క్షయము. భార-అర. 5, అ. 340: చూ, కుత్త.
తెగుదారి, దే. విణ. (తెగువ + దారి) 1. తెంపరి: చూ, సాహసికుఁడు; 2. ఈఁగికాఁడు. ప్రభా. 1, అ. 46: చూ, దాత; 3. సాహసికుఁడు, సాహసికురాలు. ఉ, రా. 6, అ. 240.
తెగుదెంపు, దే. వి. (తెగు + తెంపు) తీర్పు, జై. 8, అ. 210: చూ, సత్యము. 1. (తెగదెంపు అనియు వాడుక.)
తెగుబడి. దే. వి 1: చూ, తెగుడు; 2. దుక్కి: చూ, వ్యవసాయము. 2; 3. అమ్మకము: చూ. విక్రయము.
తెగులు. దే. వి. రూ-తెవులు. 1. వ్యాధి: చూ, రోగము. 1; 2. సస్యరోగము: చూ, నావి.

తెగులుగొంటు, దే. విశ. రూ-తెవులుగొంటు- తెవ్లుగొంటు. 1. వ్యాధిగ్రస్తుఁడు: చూ, వ్యాధితుఁడు; 2. వ్యాధిగ్రస్తురాలు: చూ, స్త్రీ: 3. వ్యాధిగ్రస్తము: చూ, రోగము. 1.

తెగులుగొను, దే. అ. క్రి. (తెగులు + కొను): రూ-తెవులుగొను, తెవులువడు.

తెగువ, దే. వి. 1. తెంపు; చూ, సాహసము; 2. దాతృత్వము: చూ, వితరణము.

తెగుపడు, ద్వ. అ. క్రి. (తెగుకు + పడు) భేదపడు: చూ, వేఱుపడు.

తెచ్చు, దే. స. క్రి. తీసికొనివచ్చు: కొనివచ్చు. (సం. ప.):— ఆనయించు.

తెచ్చుట, వా. వి. పొందుట: (సం. ప.)—ఆనయము — రూ— ఆనేయము, ఆహరణము, ఆహారము, ఆహృతి; తద్వి:— పొందింపఁదగినది.—ఆనేతవ్యము.

తెచ్చువాఁడు, వా. వి: చూ, ఆనేత.

తెటిక, దే. వి తెప్ప: చూ, హోడము.

తెటుకు, వా. వి. వంపు, ఎగుడు దిగుడు. "మంచపుపట్టెలు తెటుకుగానున్నవి"; 2. తేడా, భేదము. "నీమాట తెటుకుగ నున్నది."

తెట్ట, వై. వి. = థట్ట. ప్రోవు: చూ, రాశి 1.

తెట్టగిలఁబడు, ద్వ. అ. క్రి. (తెట్టగిలన్ + పడు) రూ-తెట్టగిలు-తెట్టగిల్లు, తెల్లవాఱు; చూ, సొల్వడు (స్వార్థమునపడు.)

తెట్టగిలు, దే. అ. క్రి. —పై.—

తెట్టగిల్లు, —పై.—

తెట్టతెన్ను, ద్వ. వి. ఘంటాపథము, సంసరణము, ఘంటలతోఁ గూడిన యేనుఁగులదారి: చూ, మార్గము. 1.

తెట్టతెరువు, —పై.—

తెట్టి, దే. వి. (రూ-తెట్టియ-తెట్టువ-తెట్టె-తొట్టి-తొట్టువ.) 1. నీటి మీఁదిమడ్డి; 2. పెరుఁగుమీఁదితెట్టె: చూ, మీఁగడ.

తెట్టియ, వై. వి. రూ-తెట్టె. 1.—పై.—; 2. తేనెపెర, తెట్టె: చూ, మధుపటలము; 3 తృణకాష్ఠావిథారము: రూ-తెట్టువ—తెట్టె.

తెట్టు, దే. వి. కంచెకోట: చూ, ప్రాచీనము. 1.

తెట్టువ, వై. వి. 1. నీటియందుగాలి కొంక ప్రక్కఁజేరిన తృణాది సమూహము. లక్ష్మీ. 3, అ. 110: చూ, రూ-తెట్టియ. 3; 2. వర్గము ఉ, రా. 3, అ. 78: చూ, సమూహము.

తెట్టువగట్టు, ద్వ. అ. క్రి. (తెటువ + కట్టు) నీటియందు తృణాది కము గాలి కొంక ప్రక్కఁజేరు. నిర్వ. 1, అ. 51. రూ-తెట్టువలుగట్టు-తెట్టెగట్టు, తెట్టువలుగొను-తెట్టెలుగొను.

తెట్టువలుగట్టు, —పై.—

తెట్టువలుగొను, —పై.—

తెట్టువు, దే. వి. కంచెకోట: చూ, ప్రాచీనము. 1.

తెట్టె, వై. వి. 1: చూ, రూ-తెట్టియ. 1-2-3; 4. రూ-తెట్టెము. గుంపు: చూ, సమూహము.

తెట్టెము, వై. వి: చూ, రూ-తెట్టె.

తెట్టెలుగట్టు, ద్వ. అ. క్రి. (తెట్టెలు + కట్టు) ప్రోవుకొను: చూ, రాశివడు.

తెట్టెలుగొను, (తెట్టెలు + కొను) — పై. — ఉ, హరి. 3, అ. 27.

తెడ్డు, వై. వి. = తండువు-తండూ. రూ-త్రెడ్డు. 1. కొయ్య గరిటె: చూ, దర్వి. 1. (చూ, పాత్రము. 6.); 2. పడవ త్రోసెడుపలక; చూ, పీలి. 2.

తెడ్డునకుఁ బాకగుణము తెలియునా, లో. ఉదా—"ఉ. కర్రవు గావు హర్తవునుగా వభిరక్షిపిగావు నీవు స, త్కీర్తిధురీణ యింతకును గృష్ణుఁడె మూలము గాన పుణ్యవి, స్ఫూర్తియుఁ బాపవైకృతముఁ బూరుషుఁబొందునె యస్వతంత్రతన్, వర్తిలు చున్కిఁ దెడ్డునకు వచ్చునె పాకగుణాగుణావళుల్"? (పాండురంగ మాహాత్మ్యము. 5, అ. 45.)

తెడ్డుమూతికొంగ, ద్వ. వి. జలపక్షివిశేషము: చూ, బకము.

తెనమఱు, దే. అ. క్రి. పరుండు. చూ, శయనించు.

తెనుంగు, తెనుఁగు, వై. వి. = త్రినగ. రూ-తెలుఁగు ఆంధ్ర భాష. య. 1, అ. 1: చూ, భాష. 1.

తెనుఁగువాఁడు, ద్వ. వి: చూ, రూ-తెలుఁగువాఁడు.

తెన్గువాఁడు, వా. వి.—పై.—

తెన్నడి, దే. వి రీతి: చూ, విధము. 1.

తెన్ను, దే. వి. 1. దారి: చూ, మార్గము. 1; 2. కష్టము: చూ, మండలము. 3.

తెన్నుండు, దే. అ. క్రి. రూ-తొన్నుండు. పరుండు: చూ, శయనించు.

తెప్ప, దే. వి. 1. రూ-తేప-తేపిక: చూ, హోడము; 2. రూ-తేవ. ప్రోవు. వసు. 1, అ. 139: చూ, రాశి. 1.

తెప్పదెరలఁగ, దే. ద్ర. క్రి. విశ. అతిశీఘ్రముగ: చూ, స్వదము. 1.

తెప్పఁదేలు, దే. అ. క్రి. 1. (తెప్పన్ + తేలు) 1. ఓలలాడు. చూ, తేలు. 4; ప్రే. 2. తెప్పఁదేల్చు. కళా. 6, అ. 262.

తెప్పలుఁదేలుట, జా. ఓలలాడుట. "నిచ్చనిచ్చలు గ్రొత్తలై యెచ్చరించు, ఖేలనంబులఁ దెప్పలఁ దేలుచుండె." (కవికర్ణ రసాయనము.)

తెప్పి, వా. వి. మగగుటి తుదను చర్మములోపల నుండెడు ఎఱ్ఱని కండ: రూ-తొప్పి

తెప్పిర్లు, దే. అ. క్రి. అపాయమునుండి తేఱు. రూ-తెప్పిఱిలు-తెప్పిఱిల్లు తెప్పిఱు-తేఱు.) ఉ, రా. 3, అ. 353: చూ, సేకరించు.

తెప్పిఱిలు, —పై—

తెప్పిఱిల్లు, —పై.—

తెప్పిఱు, —పై.—

తెప్పున, దే. ద్ర. క్రి. విశ: చూ, తెప్పదెరలఁగ

తెబక, దే. వి. 1. మొత్తము; చూ, సమూహము; వా. 2. తేరగా వచ్చినసొమ్ము, లాటరీలో వచ్చినసొమ్ము. (ఉత్తరసర్కారు లలోవాడుక.)

తెమడ, దే. వి: చూ, శ్లేష్మము.

తెమలు, దే. అ. క్రి. 1. చలించు. పంచ. నా. 2, అ. 209: చూ, సలించు; వా. 2. తెమలిచేసికొను.

తెమలుచు, దే. ప్రే. తెమలిచేసికొను. రూ-తెమల్చు.

తెమల్చు, — పై.—
తెమ్మ, వై. వి 1 = తేమః. చెమ్మ: చూ, పదను. 2; 2. లోష్టము మంటిగడ్డ: చూ, భూమి. 1.
తెమ్ము, వా. స. క్రి: చూ, రూ-తే.
తెమ్మెర, దే వి. (తెమ్మ+ఎర) 1. చల్లగాలి, మలయమారుతము విజ. 3, ఆ, 40; చూ, వాయువు; 2 చిఱుగాలి, మందమారుతము. చూ, వాయువు (ఎరశబ్దమునకు వృత్తి యందు గాలియర్థమని తెలియవలయును)
తెమ్మెరకొడుకు, ద్వ. వి: చూ, భీముఁడు. సాం. మా 12.
తెమ్మెరచెలి, దే. వి. అగ్ని. సాం. దే. 12: చూ, వహ్ని. 1.
తెయితక్కలు, వా. వి. బ 1. ఒకరకము గంతులు. "తెయి తక్క తెయ్యి అని ఆడెను"; 2. కపటనాటకము. "నీతెయి తెక్కలును నీకమాషాలును నావద్దఅవసరంలేదు."
తెర, వై. వి 1. = తరంగ. అల. ఉ, హరి. 4, ఆ 216: చూ, వీచి. 1; 2. మఱుఁగుచీర. భార. సౌ. 1, ఆ. 147; చూ, వస్త్రము. 3. అడ్డువల: చూ, వల. 1; 4 = తిరస్కరిణి. గండవడము. చూ, వస్త్రము; 5. తట్టి: చూ, వేఁటతెర; బ. 6: చూ, పరంపర. భార. సభా. 1, ఆ. 226; 7. అడ్డపాటు; చూ, వ్యవధానము. 3; వా. 8. నాటకాడులయందు క్రింద కును మీఁదకును లాగెడు చిత్రవర్ణములుగల (సీను) అడ్డ వస్త్రము; 9. తోలుబొమ్మలులోనగు ఆటలయందు బొమ్మల నాడించుట కనుపుగఁగట్టిన తెల్లనిబట్ట.
తెరఁగు, దే. వి. రూ-తెఱఁగు 1. రీతి: చూ, విధము. 1; 2 దారి: చూ, మార్గము. 1.
తెరచాఁప, ద్వ. వి. డమాను, ఓడకొయ్యకుఁగట్టు తంతుపటము: చూ, చాఁప. 2. (చూ, వస్త్రము.)
తెరతెర, వై. వి. (విడువకసాగునది) కాలువ, (పరంపర): చూ, వెల్లి. 4; వా. 2 పరంపర. "వానికి దగ్గు తెరతెరగా వచ్చుచున్నది."
తెరనాటకపుబంగాలు, మి. వి. బ: చూ, బొమ్మలాటవాండ్రు.
తెరపి, దే. వి; చూ, తెర. 7.
తెరయీఁగ, దే. వి. తూనీఁగ. ఆం. భా. ద్వి. 65: చూ, మక్షిక.
తెరల, దే. వి. కబళము. చూ, సాపాటు.
తెరలఁబాఱు, దే. అ క్రి. (తెరలన్+పాఱు) కొలఁగు: చూ, విరియు. (స్వార్థమున పాఱు)
తెరలిక, దే. వి. గుంపు: చూ, సమూహము.
తెరలు, దే. వి. 1. రూ-తెరతెర-తెర్లు. పరంపర. పాండు. 1, ఆ. 184: చూ, వెల్లి. 4; అ. క్రి. 2. కొలఁగు: చూ, విరియు. 5; 3 బయలుదేఱు జై. 3, ఆ 57; చూ, వెళ్ళు 3; 4. కలఁగు. భార. కర్ణ. 3, ఆ. 52; లక్ష్మీ. 3, ఆ 3: చూ, సంక్షోభించు; 5. చచ్చు. ఆం, భా. శృ. 87: చూ, మరణించు; 6. నీళ్ళులోనగునవి కాఁగి సలసల పొంగు; రూ-తెర్లు.
తెరలుచు; దే. ప్రే. తెరలఁజేయు రూ-తెరల్చు. భార. ద్రో. 4, ఆ. 147.
తెరల్చు, —పై.—
తెరలుడు, దే. వి చూ, ప్రయాణము.

తెరవ, దే. వి రూ-తెఱవ. ఆఁడుది; చూ, స్త్రీ.
తెరవాఱు, ద్వ. అ. క్రి (తెర+పాఱు) జిడ్డుదేఱి తెరగట్టు; (తెర = అల).
తెరవు, దే. వి (రూ-తెరఁగు-తెరకువ-తెరువు-తెర్వు-తెఱవు.) దారి; చూ, మార్గము. 1.
తెరవేఁట, ద్వ. వి. తెరయెత్తి ఆడెడువేఁట: చూ, వేఁట. 3
తెరవేఁటకాఁడు, ద్వ. వి తెరయెత్తి వేఁటాడెడువేఁటకాఁడు. స్వా. 4, ఆ. 4: చూ. వేఁటకాఁడు.
తెరువు, దే. వి దారి: చూ, రూ-తెరవు.
తెరువుమఱవు, దే వి. రూ-తెఱవుమఱవు. అపస్మారము; చూ, విస్మృతి.
తెరువరి, దే. విశ. (తెరువు+అరి) దారినడచువాఁడు: చూ, పాంథుఁడు.
తెరువాటీఁడు, దే. విశ. (తెరువాటు+ఈఁడు) రూ-తెరువాటుకాఁడు, దారిదొంగ; చూ, ముచ్చు. 1.
తెరువాటు, దే. వి. (తెరువు+ఆటు) (దొంగలు) దారికొట్టుట, అభిగ్రహణము: చూ, ముచ్చిలి.
తెరువాటుకాఁడు, దే. విశ: చూ, రూ-తెరువాటీఁడు.
తెరవు. దే. వి. దారి. ఉ, హరి. 6, ఆ. 28; చూ, రూ-తెరవు.
తెర్లు, చూ, రూ-తెరలు.
తెర్వు, దే. వి. చూ, రూ-తెరవు.
తెఱ, దే. వి. రూ-తెఱ్ఱు. 1. అగ్ని: చూ, వహ్ని 1; 2. అడ్డపాటు: చూ, వ్యవధానము. 3; విశ. 3. తెఱపయినది.
తెఱఁగు, దే వి. 1. రూ-తెరఁగు. రీతి. అచ్చ. యు, కాం, 37: చూ, విధము. 1; 2. చక్కన. భార. అర. 7, ఆ. 158: చూ, సౌందర్యము; 3. సంధి. భార. ఉద్యో. 3, ఆ. 262: చూ, సాపసదీనము.
తెఱఁగువడు, ద్వ. అ. క్రి. (తెఱఁగు+పడు) 1. సంధియగు, ముడివడు. భార. ఉద్యో. 1, ఆ. 21; చూ, సంధిఁచు; ప్రే. 2. తెఱఁగుపఱచు.
తెఱకువ, దే. వి. 1. తెలివి. భాగ. 1, స్కం. 99: చూ, బుద్ధి; 2. ఉపాయము స్వా. 2, ఆ. 20: చూ, వెరవు.
తెఱకొను, దే. అ. క్రి. (తెఱచు+కొను) బయలువెడలు: తెఱచు.
తెఱగంటి, దే. వి. (బ. తెఱగంటులు) (తెఱ+కన్ను) 1. అనిమిషుఁడు. ఉరా. 4. ఆ. 318: చూ, వేలుపు; 2. అనిమిషస్త్రీ; చూ, వేలుపులు. 2; 3. చేప. అనిమిషము: చూ, మత్స్యము. 1.
తెఱగంటిబోనము తెచ్చినలావరి, ద్వ వి. గరుత్మంతుఁడు. వేం. ఆం. 18: చూ, హరివాహనుఁడు.
తెఱగంటిమ్రాఁకు, దే వి. కల్పవృక్షము. సాం. దే. 19: చూ, వేలుపుఁజెట్టు.
తెఱగఁటియన్నులు, దే. వి బ: చూ, అచ్చరలు.
తెఱగఁటిఱేఁడు, దే. వి. ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు.
తెఱచు, దే. స. క్రి. తెఱపిఁజేయు.
తెఱచుట, దే. వి: తెఱప. (సం. ప) — ఉద్ఘాటనము.

తెఱనోటిమెకము, ద్వ. వి. (తెఱనోరు + మెకము): చూ, సింహము.

తెఱప, దే. వి. 1: చూ, తెఱపు; 2. ఓప్పు చూ, శాంతము. 1; 3. అడ్డపాటు; చూ, వ్యవధానము. 3; విణ 4. మఱుఁగు లేనిది: చూ, తెఱపి. 3. వా. వి. 5. సుఖము: తెఱపి.

తెఱపి, దే. వి. 1. వకాశము. భార. అర. 6, ఆ. 350: చూ, సందు. 6; 2. తలపైవెండ్రుకలుదిగిపోవుట; విణ. 3. మఱుఁగు లేనిది తెఱప-రూ-తెరిపి. (సం. ప)— అవకాశము; వా. 4 ఖాళీ; 5; చూ, తెఱప. 5. వి. అ. చూ, రూ తెఱప. 3.

తెఱపుమఱపు, ద్వ. వి. 1. (చిత్తస్వాస్థ్యము తప్పినప్పుడు కలుగు) మఱపు; చూ, రూ-తెరపుమఱపు; 2. అకటవికటము: చూ, వ్యత్యయము.

తెఱమొగము మెకము, ద్వ. వి: చూ, సింహము.

తెఱలు, దే. అ. క్రి. 1. (వాసన) బయలు వెడలు: చూ, తెఱకొను; 2. మరణించు. సాం. మా. 36. చూ, సమయు.

తెఱవ, దే. వి. (తెఱ + వా) ఆఁడుది. భార. అర. 4, ఆ. 285: చూ, రూ-తెరవ

తెఱవామెకము, ద్వ. వి: చూ, సింహము. 1.

తెఱవు, దే. అ క్రి. 1. దారి: చూ, రూ-తెరవు. 2. రూ-తెఱఁగు. రీతి. అచ్చ. అ, కాం. 22; చూ, విధము. 1.

తెఱవుగాపరి, ద్వ. వి. కోల్పులి. సాం. తి. 1: చూ, శార్దూలము.

తెఱిపి, దే. వి. రూ-తెఱప-తెఱపి-తెరపి 1. అడ్డపాటు: చూ, వ్యవధానము. 3; 2. అరతి: చూ, విరామము; విణ. 3; చూ, తెఱపి. 3.

తెఱుకువ, దే వి. తెలివి; చూ, హృల్లేఖము. 2.

తెఱ్ఱి, దే. విణ. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2: చూ, తెఱ. 2.

తెల, వై. విశే. = ధవళ. రూ-తెల్ల. (ఆమ్రేడితమందు తెలతెల) శుక్లవర్ణము. ప చ. నా. 5, ఆ 19. చూ, వర్ణము. 6.

తెలకపిండి, వై. వి. = తిలపిష్టము: చూ, రూ-తెలికపిండి.

తెలకలు, వై. వి. బ. = తిల: చూ, నువ్వులు.

తెలికివాఁడు, వై వి. = తిలఘాతుక: చూ, తెలుకులవాఁడు.

తెలగ, వై. వి. = త్రిలింగ. రూ-తెలగా. 1. త్రిలింగదేశ శూద్రుఁడు, నాలవకులమువాఁడు; చూ, శూద్రుఁడు; 2. త్రిలింగదేశమునందలి యొకానొక శూద్రజాతి; చూ, శూద్రుఁడు; బ. 3. ఆజాతివారు (వృత్తియందు దీర్ఘమునకు హ్రస్వము. ఉదా.—తెలగ(గా) బలిజెలు. (బ. తెలగలు-తెలగాలు.)

తెలగాణ్యబ్రాహ్మణులు, అం. కృష్ణయజుర్వేదులును, ఋగ్వేదులును కలరు వీరు క్రమముగా ఆపస్తంబ అశ్వలాయన కాత్యాయన సూత్రముల ననుష్ఠించువారు. వీరిలో దుంప తెలగాణ్యమని, చవిటితెలగాణ్యమని ద్వివిధము. వీరిలో గ్రామ పాచకారి (పురోహిత) వృత్తివలన జీవించువారు కొంత కాలముపఱకు నింద్యముగఁ జూడఁబడిరి: చూ, బ్రాహ్మణులు.

తెలచు, దే స. క్రి: చూ, రూ-తెలుచు (ఇది వెలచు క్రియ వంటిదిగా నుండవచ్చును.)

తెలతెలఁబోవు, ద్వ. అ. క్రి. (తెలతెల + పోవు): చూ, వెల్వెలఁబాఱు.

తెలతెలవాఱు, — పై.— అచ్చ. బాల, కాం. 78; 2. తెల్లతెల్లవాఱు: చూ, వేవు.

తెలతెలవాఱు, (తెలతెల + పాఱు). 1.—పై —అచ్చ. బాల, కాం. 78; 2. తెల్లగా తెల్లవాఱు: చూ, వేవు.

తెలనాకు, ద్వ. వి. తెల్లని సన్నపు తములపాకు. రూ-తెల్లనాకు. కళా. 2, ఆ. 17.

తెలవాఱు, ద్వ. అ. క్రి రూ-తెల్లవాఱు 1. ఉదయమగు: చూ, వేవు; 2. తెల్లనగు: చూ, వెల్లబాఱు.

తెలి, వై. విణ. 1 = ధవళ. తెల్లనిది. "తెలినవ్వు": చూ, వర్ణము. 6; 2. నిర్మలము, తేట, నిచ్చలము: చూ, నిర్మాల్యము; 3 కంచము. రూ-తెలె: చూ, పాత్రము. 6; 4. పక్వ ఘృతము: చూ, హవిస్సు. 1.

తెలికపిండి, వై వి. రూ-తెలకపిండి, గానుఁగ పిండి. (సం ప)- తిలపిష్టము, పిణ్యాకము.

తెలికలు, వై. వి. బ. = తిల నువు రూ-నువ్వు. నూగు-రూ-నూవు. బొట్టుగు- రూ-బొట్టువు (వృత్తియందు ఏకవచనాంతము. తెలికపిండి మొ.): చూ, నువ్వులు.

తెలికవాఁడు, వై. వి. = తిలఘాతుక: చూ, రూ-తెలుకులవాఁడు.

తెలికాకి, వై. వి. ధూంక్ష్మము: చూ, వాయసము. 1.

తెలిగ, వై. వి. = స్థాలికా. కంచము: చూ, పాత్రము 6.

తెలిగంటి, ద్వ. వి. (తెలి + కన్ను) ధవళాక్షి, ఆఁడుది. ఉ, రా. 2, ఆ. 137: చూ, స్త్రీ.

తెలిగాము, వై. వి = ధవళగ్రహ శుక్రుఁడు: చూ, శుక్రుఁడు.

తెలిగిబ్బ, ద్వ. వి. ఈశవృషభము. ఆం, బా. ప్ర. 64: చూ, వృషభము. 1.

తెలిగొను, ద్వ. అ. క్రి (తెలి + కొను) ప్రమాణము చేయించు.

తెలిదమ్మి, వై. వి. (తెలి + తమ్మి) (రూ-తెల్లదమ్మి-వెలిదమ్మి-వెల్లదమ్మి.) పుండరీకము: చూ, పద్మము. 1.

తెలిదమ్మికంటి, ద్వ. వి (తెలిదమ్మి + కన్ను) పుండరీకాక్షుఁడు: చూ, విష్ణువు 1.

తెలిదీవిమన్నీఁడు, — పై —.

తెలిదెమ్మకిరి, ద్వ వి. ఎరపిల్లపులుఁగు (ఒకానొక చేఁప అని కొందఱు.): చూ, మత్స్యము. 1.

తెలిపక్కము, వై వి. = ధవళపక్షము. రూ-తొలుపక్కము. శుక్లపక్షము: చూ, పక్షము. 1.

తెలిపిట్ట, వై. వి. = ధవళపిత్సన్. శ్వేతగరుత్తు: చూ, హంస. (ఇట్లు తెలిపులుఁగు.)

తెలిపెడువాఁడు. వా. వి. చూ, ఆవేదకుఁడు.

తెలిమెకము, వై. వి. = ధవళమృగ: చూ, సింహము.

తెలిమొదవు, ద్వ వి కామధేనువు: చూ, ధేనువు.

తెలిమోముపక్కి, వై. వి. = ధవళముఖపక్షి. గరుత్మంతుఁడు: చూ, హరివాహనుఁడు.

తెలియ, వై. వి = స్థాలికా: చూ, రూ-తెలె.

తెలియమి, వా. వి. అప్రసిద్ధి: చూ, రహస్యము.

తెలియు, దే. అ. క్రి. 1. ఎఱుకపడు. భార. ఉద్యో. 2, ఆ. 102: చూ, విదితమగు; 2. తేటపడు. జై. 8, ఆ 63: చూ, విశదమగు; 3. మేలుకొను: చూ, లేచు. 2; 4. ప్రసన్నత

నొందు. భార. భీష్మ. 1, ఆ 102: చూ, వెలయు; స. క్రి. 5: ఎర్గు - రూ-ఎఱుగు, కను, కనుగొను - రూ-కన్గొను.
తెలియేఱు, ద్వ. వి. ఆకాశగంగ. చూ, నది.
తెలివరి, వా. వి: చూ, విద్వాంసుఁడు.
తెలివాఁక, ద్వ. వి. చూ, తెలియేఱు. సాంబ. దే 16.
తెలివి, దే. వి. 1. ప్రసన్నత, తేఁ, తేఱు. భార. ఉద్యో. 3, ఆ. 263: చూ, శుద్ధము. 3; 2. ప్రకాశము, కాంతి. చూ, వెలుతురు. ; 3. రూ-తెలివిడి, వివేకము. భార ద్రో. 2, ఆ. 213 : చూ, బుద్ధి ; 4 తెలుపు. స్వా. 2, ఆ. 23: చూ, వర్ణము 6; 5. దేహాత్మాది భేదజ్ఞానము: చూ, బుద్ధి (ఇ.దలి 3 వ అర్థము చూడుము.); 6. గెలివి భార. ద్రో. 2, ఆ. 375: చూ, వికాసము; 7. నీళ్ళు, తేఱుట స్వా. 3, ఆ 23.
తెలివిమెత్తె, ద్వ విణ. ప్రాజ్ఞ, వివేకముగలది (ఆఁడుది): చూ, స్త్రీ.
తెలివికాఁడు, దే విణ. రూ-తెల్వికాఁడు. 1. ప్రాజ్ఞుఁడు: చూ, విద్వాంసుఁడు. 2. నేర్పరి: చూ, సమర్థుఁడు.
తెలివిడి, దే. వి. 1 తెలివి. చూ, హృల్లేఖము. 2; 2. దృష్టాంతము: చూ, నిదర్శనము. 1; 3. తెలియఁజేయుట.
తెలివితేటలు, జా. నిర్మలమైనబుద్ధి. "నీతెలివితేటలు మంచివి." "వాఁడు తెలివితేటలు గలవాఁడు."
తెలివిలేనితనము, వా. వి: చూ, మఱపు 2.
తెలివిలేనివాఁడు, వా. వి: చూ, స్తబ్ధుఁడు.
తెలివిల్తుఁడు, ద్వ. వి: చూ, మన్మథుఁడు. వేం. ఆ. 8.
తెలివేల్పు, వా. వి: చూ, శివుఁడు. ఆం. పదా. సుర. 10.
తెలుకులవాఁడు, వై. వి.= తిలఘాతకః: రూ-తెలకవాఁడు-తెలుకులి - గాండ్లవాఁడు. (సం. ప)—తిలఘాతకుఁడు.
తెలుంగు, తెలుఁగు. వై. వి = త్రిలింగః: చూ, రూ-తెనుఁగు.
తెలుఁగువాఁడు, ద్వ. వి: రూ-తెల్గువాఁడు. తెనుఁగువాఁడు-తెన్గువాఁడు. (సం. ప)—ఆంధ్రుఁడు.
తెలుకులి, వా. వై. వి =: చూ, తెలుకులవాఁడు.
తెలుచు. దే. స. క్రి. రూ-తెలచు-తెల్చు. 1. మ్రొక్కు రాఘ. 1, ఆ. : చూ, నమస్కరించు; 2. తేర్చు: చూ, తెలుపు. 9 భార. విరా. 4, ఆ. 227; 3. ప్రార్థించు. కళా. 6, ఆ 268. చూ, వేఁడికొను.
తెలుపాఱు. ద్వ. అ. క్రి. (తెలుపు + ఆఱు) (రూ-తెలుపువాఱు-తెల్లవాఱు-తెలవాఱు-తెల్వాఱు.) 1. తెల్లనగు: చూ, వెల్లబాఱు; 2. ఉదయమగు: చూ, వేగు.
తెలుపు, దే వి. 1. ఊఱట: చూ, విశ్రాంతి. 2; వై. వి. 2.= ధవళ. (రూ-తెల్ల-తెల్లన-తెలి-తెల్ల.) ధావళ్యము చూ, వర్ణము. 6; 3. మిక్కిలి గరగర: చూ, పరిశుద్ధి; 4. మేహరోగము: చూ, రోగము. 1; విణ 5. తెల్లనిది: చూ, వర్ణము. 6. అం. 6. పంచరంగులలో నొకటి: చూ, రంగులు; ప్రే. 7. ఎఱిఁగించు: చూ, బోధించు: 8. మేలుకొలుపు. భార. అర. 7, ఆ. 252: చూ, శుభోదయము; 9. తేర్చు చూ, తెలుచు. 2; 10. తెలియఁజేయు.
తెలుపుడు, దే. వి. ఎఱుక. రూ-తెల్పుడు: చూ, సూచకము
తెలుపుడుసేయు, ద్వ. స. క్రి. (తెలుపుడు + చేయు) ఎఱిఁగించు: చూ, సూచించు. (రూ-తెల్పుడుసేయు.)
తెలుపువాఱు, ద్వ. అ. క్రి. (తెలుపు + వాఱు) తెలుపాఱు. లక్ష్మి. 3, ఆ. 13 : చూ, వెల్లబాఱు.
తెలె, వై. వి = స్థాలికా, స్థాలీ. భోజనపాత్రము, కంచము. రూ-తెలియ. చూ, పాత్రము. 6.
తెల్గువాఁడు, వా వి: చూ, రూ-తెలుఁగువాఁడు.
తెల్చు, దే స. క్రి: చూ, రూ-తెలుచు.
తెల్పుడు, దే. వి: చూ, రూ-తెలుపుడు.
తెల్పుడుసేయు, ద్వ. స. క్రి: చూ, రూ-తెలుపుడుసేయు
తెల్ల, వై. విణ. 1.= ధవళః రూ-తెల. తెల్లనైనది: చూ, వర్ణము, 6; 2. రూ-తెల్లమి-తెల్లము, తేట-రూ-తేటతెల్ల: చూ, స్పష్టము
తెల్లఉల్లి, వా. వి: చూ, వెల్లుల్లి *
తెల్లకలిగొట్టు, ద్వ వి. కాష్ఠపాటలి*: చూ, స్థాలి. 2.
తెల్లకలువ, వై. వి. = ధవళకైరవ. రూ-తెల్లకల్వ, కైరవము*. ఆం, భా. ప్ర. 164: చూ, పద్మము. 1.
తెల్లకల్వ, —పై.—
తెల్లకాకి, వై. వి: చూ, రూ-తెలికాకి
తెల్లకొక్కెర, వై. వి బకాక: చూ, బకము;
తెల్లగగ్గెర, ద్వ. వి. ఖర్జూరము*. చూ, పర్ణాసము.
తెల్లగడ్డ, వై. వి: చూ, వెల్లుల్లి*.
తెల్లగన్నేరు, ద్వ. వి: చూ, హయమారకము*.
తెల్లగఱిక, ద్వ. వి. శతవీర్య*; చూ, తృణము, 1.
తెల్లగలిజేరు, ద్వ వి: చూ, వర్షకేతువు*.
తెల్లగలువ, వై వి. =: చూ, రూ-తెల్లకలువ.*
తెల్లగినియ, వై. వి: చూ, శిరీషపత్ర*.
తెల్లగిసె, వై. వి: చూ, శుకనామము. 1.
తెల్లగుబ్బలి, ద్వ వి. కైలాసపర్వతము. వేం. ఆ. 77: చూ, పర్వతము.
తెల్లగురిగింజ, ద్వ. వి: చూ, శ్వేతపాకి*.
తెల్లగురిజ, వై. వి.—పై.—
తెల్లగోరంట, వై వి. సైరేయకము*: చూ, మహాసహా.
తెల్లచెన్నంగులు, ద్వ వి బ ఒకరకమువడ్లు: చూ, ధాన్యము.
తెల్లచెఱకు, ద్వ. వి. తేజనకము*: చూ, హరిత. 1.
తెల్లచెఱకుపంటు, జా. అతిమధురిమకై కల్పనఁజేసిన వస్తువు. ఉదా.—"కుందనము కమ్మవలపుం, జెందినచందమునఁ దెల్లచెఱకునఁబండై, సుందరియగు నక్కన్నియ, యందెలఁ బ్రాయంబువిడువ నాయతమాయెన్." (కవికర్ణరసాయనము.)
తెల్లజనము, వై. వి. రూ-తెల్లజనుము. వృత్తపర్ణి*: చూ, శణము.
తెల్లజనుము, —పై.—
తెల్లజిలకఱ్ఱ, వై. వి. శ్వేతజీరకము*; చూ, సుషవి 2.
తెల్లజిల్లేడు, ద్వ. వి అలర్కరము*; చూ, వికీరణము.
తెల్లడాలుమెకము, ద్వ. వి: చూ, సింహము. 1.
తెల్లతగరము, వై వి. ఖురకము: చూ, లోహము. 1.
తెల్లకుమ్మ, ద్వ. వి. క్షోమవల్కము*: చూ, విట్ఖదిరము.

తెల్లతెగడ, వై. వి. త్రివృత*: చూ, సర్వానుభూతి.
తెల్లతేజీ, ద్వ. వి ఉచ్చైశ్శ్రవము: చూ, హయము.
తెల్లతొగరపి, వై. వి. కటుపత్రము*; చూ, హరిప్రియ.
తెల్లదనము, వై. వి. తెల్లన: చూ, వర్ణము. 6.
తెల్లదమ్మి, వై. వి: చూ, రూ-తెలిదమ్మి.
తెల్లదామర, —వై.—
తెల్లదింటెన, ద్వ. వి అశ్వఖురము*: చూ, దింటెన.
తెల్లదీవి, వై. వి. = ధవళద్వీప. శ్వేతద్వీపము. చూ, లంక. 1.
తెల్లని, వై. వి. = ధవళ. 1. శుక్లవర్ణము: చూ, వర్ణము. 6; విశ 2. తెల్లనిది. అచ్చ. బాల, కాం. 5: చూ, వర్ణము. 6.
తెల్లనాకు, ద్వ. వి. (తెల్లని + ఆకు): చూ, రూ తెలనాకు (తెల్లన = తెల్లదాళు.)
తెల్లనార, ద్వ. వి. ఒకానొకచేఁప: చూ, మత్స్యము. 1.
తెల్లనిదొర, ద్వ. వి. 1: చూ, శివుఁడు. విజ. 1, ఆ. 1'6; 2: చూ, బలరాముఁడు.
తెల్లనిపిట్ట, వై. వి: చూ, హంస. సా బ తిర్య. 7.
తెల్లనిబట్ట, వా. వి. శ్వేతవస్త్రము: చూ, వస్త్రము.
తెల్లనిమయిదంట, ద్వ. వి: చూ, బలరాముఁడు,
తెల్లనివాఁడు, వా. వి: చూ, శ్వేతముఖుఁడు.
తెల్లనీరుల్లి, వా. వి తెల్లనినీరుల్లిగడ్డ: చూ, పలాంతువు.
తెల్లనేలగుమ్ముడు, ద్వ వి. విదారి*; చూ, భూమికర్కారువు.
తెల్లపులుగుడు, ద్వ వి. శ్వేతవాతంగిని*: చూ, వాతంగిని.
తెల్లపుటము, ద్వ. వి. కుష్ఠము, శ్విత్రము: చూ, మండలము. 3.
తెల్లబల్లి, వా. వి, తెలుపురంగుగలబల్లి: చూ, బల్లి.
తెల్లబుడమలు, ద్వ వి. ఒకరకమువడ్లు: చూ, ధాన్యము.
తెల్లమి, వై. విశ. రూ-తెల్లము: చూ, స్పష్టము.
తెల్లము, —వై.—
తెల్లములక, ద్వ. వి. శ్వేతబృహతి* (ములక అనునది క్రమములక, తెల్లములక, పెద్దములక అని త్రివిధము): చూ, హింగుళి.
తెల్లమొదవు, ద్వ. వి; చూ, రూ-తెలిమొదవు.
తెల్లమ్రాను, ద్వ వి. కల్పవృక్షము: చూ, వేలుపుఁజెట్టు.
తెల్లయిబుగుడు, ద్వ. వి శ్వేతపత్రము*: చూ, శింశుప.
తెల్లయుప్పు, ద్వ వి. మౌక్తికప*; చూ, లవణి.
తెల్లయురగ పిల్లవ్రేళ్ళది, ద్వ. వి. కోడిడేగ: చూ, పుంజు.
తెల్లయేనుఁగు, వై. వి. (తెల్ల + ఏనుఁగు) ఐరావతము; చూ, హస్తి.
తెల్లలొద్దుగు, వై. వి. జీర్ణవృంతము* చూ, లొద్దుగు.
తెల్లవట్టివేరు, ద్వ వి. లామజ్జకము*: చూ, వట్టివేరు.
తెల్లవస, వై. వి. హైమవతి*: చూ, విష.
తెల్లవాఁకుడు, వై. వి. శ్వేతకంటకారిక*: చూ, వాఁకుడు.
తెల్లవాఱగ, ద్వ వి. రూ - తెల్లవాటి - తెల్లవాఱుగడ: చూ, వేగుజాము.
తెల్లవాటీ, —వై.—
తెల్లవాఱు, ద్వ. అ. క్రి. (తెల్ల + పాఱు) 1. ఉదయమగు: చూ, రూ-తెలవాఱు. 1; 2. తెల్లనగు భార. ఉద్యో. 2, ఆ. 112; చూ, రూ-తెలవాఱు. 2; 3. చూ, తెల్లబోవు/తెబ్బగిలఁబడు. "వాని పని తెల్లవాఱెను."
తెల్లవాఱుగడ, ద్వ వి చూ, రూ-తెల్లవాఱగ.
తెల్లవాలు, ద్వ. వి రూ-తెల్లావలు. వెట్టియావాలు, చూ, సర్షపము.
తెల్లవావిలి, ద్వ. వి. శ్వేతసురస, పుల్లవావిలి, బందెడ*: చూ, వావిలి.
తెల్లవెంపలి, ద్వ. వి. శ్వేతపుంఖము.*: చూ, వెంపలి.
తెల్లసుగంధిపాల, మి. వి ఉత్పల శారిబ*: చూ, శారిబ.
తెల్లావలు, ద్వ. వి: చూ, రూ-తెల్లవాలు.
తెల్లి, వై. వి = ధవళ. తెల్లఁదనము; చూ, వర్ణము. 6.
తెల్వికాఁడు, దే వి: చూ, రూ-తెలివికాఁడు.
తె , దే వి. రూ-తెగ. గుంపు అచ్చ. బాల, కాం. 189. చూ, సమూహము.
తెవడు, దే స. క్రి: చూ, రూ-తెగడు.
తెవులు, దే. వి: చూ, రూ-తెగులు.
తెవులుగొంటు, దే. విశ: చూ, రూ-తెగులుగొంటు-తెవ్లుగొంటు. భార. విరా. 1, ఆ. 101.
తెవులుగొను, దే. అ. క్రి. రూ-తెగులుగొను, తెగులుపడు-రూ-తెవులుపడు: చూ, రోగపడు.
తెవులుపడు, (తెవులు + పడు) -వై—కాశీ. 4, ఆ. 60.
తెవ్లుగొంటు, దే. విశ: చూ, రూ-తెవులుగొంటు.
తెస్సుబాఱు, వా, అ క్రి. వెల్వెలబాఱు. "నీతెలివి తెస్సుబాఱు చున్నది; (ఇట్లు తెస్సు ఓడు-తెస్సోడు అనియు ఉత్తరసర్కారులలో వాడుక)

## తే

తే, వా క్రి. తీసికొనిరమ్ము: తెమ్ము. (చూ, తెచ్చు).
తేఁకు, దే. వి. చూ, రూ-టేఁకు. *.
తేఁకువ, దే. వి 1. ధైర్యము: చూ, స్థైర్యము. 1; 2. తెలివి: చూ, బుద్ధి; 3. భయము. భార. ద్రో. 2, ఆ. 19; చూ, వెఱపు; 4. నిలుకడ: చూ, పాదు.
టేఁజెట్టు, దే. వి. 1. తెంకాయ* చూ, నారికేళము; వా. వి. 2. తేయాకుచెట్టు.
తేఁటగీతము, తేఁటగీతి. పా. ఉపజాతులలో నొకటి. నాలుగు పాదములు సరిసమైనవే. ఒక్కొక్క పాదమున ఒక సూర్యగణము రెండింద్రగణములు మఱిరెండు సూర్యగణములు గలిగి నాలుగవ గణాద్యక్షరము యతిగాగల పద్యము. (గీతి-గీతము-ఎత్తుగీతి.) "ఉదా. రామ, నామీఁద, నీకింత ప్రేమ, రాదె.": చూ, వృత్తము. 1.
తేఁటి, దే. వి. తుమ్మెద: చూ, భ్రమరము.
తేఁటితెగిదణి, ద్వ. వి; చూ, మన్మథుఁడు.
తేఁటియల్లెవాఁడు, దే. వి.—వై.—
తేఁటియల్లెవింటిదొర, —వై.— అం, భా. ప్ర 45.
తేఁడు, దే అ. క్రి. 1. తెండు; చూ, శయసించు; వా. 2. తీసికొనిరాఁడు. (వ్యతి.)
తేగ, దే. వి తాటిమొలక. తెంగట-రూ-గెంగెట (సం. వ.)—ఆరోహిణి.

తేగడ, దే. విణ. 1. తేసినది (నాణెము): చూ, లోహము. 1; 2. వృద్ధి: చూ, వారకము.

తేగము, వై. వి. = త్యాగము; చూ, వితరణము.

తేగాకత్తి, ద్వ. వి. చురకత్తి; చూ, రిష్టి. 2.

తేజఃప్రదము, అం. చూ. అస్త్రములు.

తేజఃఫలము, సం. వి. అ. పుం; చూ. కంటవృక్షము.

తేజనకము, సం. వి. అ. పుం. కాకివెదురు (ఇదె తెల్లచెఱకు అని శ. ర.) *; చూ, హరిత. 1, (చూ, తృణము. 1.)

తేజనము, సం. వి. అ. పుం. వెదురు*: చూ, వేణువు.

తేజని, సం. వి. ఈ. స్త్రీ. చాఁగ*; చూ, స్రవ.

తేజము, సం. వి స్. న. = తేజః. రూ-తేజస్సు. 1. ప్రకాశము; చూ, వెలుతురు. 1; 2. కోశబలమువలనఁ గలిగిన తేజస్సు: చూ, ప్రభావము; 3. పరాక్రమము, శౌర్యము; చూ, శక్తి. 1; 4. ఇంద్రియము: చూ, రేతస్సు. 1; అం. 5: చూ, ద్రవములు; 6. చూ, మూర్తులు; 7. చూ, గుణములు; 8 చూ, భూతములు.

తేజస్తిమిరన్యాయము, న్యా. వెలుఁగున్నచోటఁ జీఁకటి యుండదను రీతి.

తేజస్వి, సం. విణ. తేజస్సుగలవాఁడు.

తేజస్విత (పరాక్రమ), అం. చూ, నాయకగుణములు.

తేజస్సు, చూ, రూ-తేజము.

తేజి, దే. వి. రూ-తేజీ. 1. గుఱ్ఱము: చూ, హయము; 2. పూజ్యాశ్వము: చూ, హయము. (ఇదె ఉన్నతవాజి.)

తేజితము, సం. విణ. వాఁడి చేయఁబడినది, శాతము: చూ, శితము. 1.

తేజీ, దే. వి: చూ, రూ-తేజి.

తేజోపకర్షణము, అం. చూ, అస్త్రములు.

తేజోవతి, అం. చూ, దిక్పాలపట్టణములు.

తేజరిలు, వై. అ. క్రి. = తేజః రూ-తేజరిల్లు: చూ, ప్రకాశించు. 1.

తేజరిల్లు. —పై—

తేజు, వై వి = తేజః. 1. ప్రకాశము, కాంతి. అచ్చ. బాల, కాం. 26; చూ, వెలుతురు. 1; 2 కోశబలము వలన కలిగిన తేజము, ప్రతాపము. అచ్చ. బాల, కాం. 43; చూ, ప్రభావము. 1; 3; చూ, తేజము. 2.

తేట, దే. వి. 1. ప్రసన్నత: చూ, శుద్ధము. 3; 2. నైర్మల్యము; చూ, నిర్మాల్యము; 3. తేఱినమజ్జిగ లోనగునది; విణ. 4. నిర్మలము. "నీళ్ళుమిక్కిలి తేటగా నున్నవి"; చూ నిర్మాల్యము; 5. ప్రసన్నము. "తెలివితేటలు" "ఇప్పుడు వీని మొగము తేటగా నున్నది,"; చూ, శుద్ధము. 3; 6 విశదము. "నీవు తేటగా మాటాడుము.": చూ, స్పష్టము.

తేటతెల్ల, ద్వ. విణ. 1. మిక్కిలి స్పష్టము; చూ, స్పష్టము; 2. వెల్లడి, విశదము. హరిశ్చ. 4, ఆ 36: చూ, స్పష్టము.

తేటపడు, ద్వ. అ. క్రి; చూ; విశదమగు. వసు. ?, ఆ 75.

తేటిక, దే. వి. తెప్ప: చూ, హోడము.

తేడా, వా. వి 1. భేదము. వా. వి. 2. పెచ్చు.

తేడామాట, వా. వి: చూ, మాటతేడా.

తేఱుపు, దే. వి. రూ-త్రేఁపు-తేన్పు; చూ, రూ-త్రేనుపు.

తేది, వై. వి = తిథి. 1 (సౌరమాసమునందు) దివి, దినము. చూ, రోజు; 2. ఇంగ్లీషుతారీఖు. (డేట్).

తేనియ, దే. వి. రూ-తేనె: చూ, మధువు. 5.

తేనియతిండి, దే. వి. రూ-తేనెతిండి. తుమ్మెద, మధుపము: చూ, భ్రమరము.

తేనీఁగ, దే వి; చూ, రూ-తేనెటీఁగ. ఆం, భా. ద్వి. 95.

తేనీరు, వా. వి. తేయాకువేసికాఁచిన కషాయము. (టీ, టీవాటర్).

తేనె, దే. వి. 1; చూ, రూ-తేనియ (పుట్టతేనె, పెరతేనె లోనగు రకములు కలవు.); అం. 2. చూ, అమృతములు; 3. చూ, అర్ఘ్యములు.

తేనెగద్ద, ద్వ. వి. ఒకరకముగ్రద్ద: చూ, హరివాహనుఁడు.

తేనెగాజు, దే వి. కాచవలయవిశేషము; చూ, భూషణము. 2.

తేనెటీఁగ, దే వి. (తేనె + ఈఁగ) సరఘ; చూ, మధుమక్షిక.

తేనెతిండి, దే. వి; చూ, రూ-తేనియతిండి.

తేనెతుట్ట, దే. వి; చూ, మధుపటలము.

తేనెతెర, దే. వి: చూ, తేనెతుట్ట.

తేనెతొన, దే. వి. రూ-తేనెతొల. 1. ఒకరకపు తినుబండము: చూ, భక్ష్యము; వా. 2: చూ, తేనెతుట్ట.

తేనెతొల. —పై.—

తేనెదానిమ్మ, ద్వ. వి. తియ్యదానిమ్మ*: చూ, దానిమ్మ.

తేనెపటికబెల్లము, ద్వ. వి. చిన్నిపూవుతేనె: చూ, శర్కర. 1.

తేనెపట్టు, చూ, తేనెతొన.

తేనెపూసినకత్తి, జా. పైకినెమ్మదిగాఁ గాన్పించుచు లోనఁ గ్రౌర్యము గలవాఁడు. "తేనెపూసినకత్తి ధాత్రీసురుండు." (పాండురంగ మాహాత్మ్యము.)

తేనెమామిడి, దే. వి. తియ్యమామిడి*: చూ, మామిడి.

తేనెమ్రాను, దే. వి: చూ, కేశముష్టి. 3 *.

తేనెయరఁటి, దే. వి. (తేనె + అరఁటి) బూడిదెవర్ణపు పండ్లుగల నల్లని అరఁటి*: చూ, రంభ. 2.

తేనెలూటిపడుట, జా. మధురములగనుండుట, ఆనందముచే తియ్యని లాలాజలము ఊఱుట. "పలుకులఁ దేనెలూటిపడఁ బల్కవు నేఁడిదియేమి." (పారిజాతాపహరణము.)

తేనెసారాయి, ద్వ. వి. తేనెతోఁజేసిన మద్యము: చూ, సుర. 2.

తేప, దే. వి. 1. తడవ: చూ, వెండియు; 2. రూ-తెప్ప. భార. భీష్మ. 2, ఆ. 160: చూ, హోడము.

తేపిక, దే. వి: చూ, రూ-తేప. 2. అం, భా. ప్ర. 157.

తేమ, వై. వి. = తేమః. 1. రూ-తెమ్మ: చూ, స్తేమము; విణ. 2. తడిసినది: చూ, స్తేమము.

తేమగిల్లు, వై. అ. క్రి. చెమ్మగిల్లు: చూ, పదనుకొను.

తేమనము, సం. వి. అ. న. 1. = తెమ్మ. తడియుట: చూ, స్తేమము; 2. = తిమ్మనము, మజ్జిగపులుసు: చూ, మజ్జిగ.

తేమము, సం. వి. అ. పుం. = తెమ్మ. చెమ్మ: చూ, స్తేమము.

తేమానము, దే. వి: చూ, వడ్డి.

తే్రమాను, దే. వి. 1. కొబ్బరి*: చూ, స్కంధఫలము; వా. 2. తేయాకుచెట్టు.

తేయాకు, వా. వి. (తే+ఆకు) తే అను ఒకానొక చెట్టుఆకు. (తే అన్యదేశ్యము)
తేయు, దే. అ. క్రి: చూ, జీర్ణించు.
తేర, దే. వి. 1. తేట: చూ, శుద్ధము. 3; 2: సంబంధము లేమి; విశ. 3. సంబంధము లేనిది; క్రి. విశ. 4. వ్యర్థముగా: తేరకు; 5. అనాయాసముగా. "వానికిసొమ్ము తేరగావచ్చెను. (తేర=తేరగా) వై. 6, ఆ. 201: తేరకు; తద్వి.—సునాయాసముగా.— తేరకుండేర.
తేరకత్తియ, ద్వ. విశ. రూ-తేరకత్తె. 1. సంబంధము లేనిది (ఆడుది), రిత్తకత్తె: చూ, స్త్రీ; వా. 2 తేరగావచ్చిన యాడుది.
తేరకత్తె, ద్వ. విశ —పై.—
తేరకాడు, దే విశ. సంబంధము లేనివాడు: చూ, పరాయివాడు. (ఈపదమునకు 'తేర' కడనుండెడు అర్థములనుబట్టి ఇతర అర్థములను ఊహించునది.)
తేరకు, దే. ద్ర. క్రి. విశ. చూ, తేర. 4-5.
తేరకుండేర, దే. అవ్య క్రి. విశ: చూ, తేర. 5. పాండు. 3: ఆ. 67.
తేరకొను, దే. అ. క్రి. తేటపడు. స్వా. 3, ఆ. 91: చూ, విశదమగు.
తేరినది, దే. వి. ప్రసన్నము. ఆం. భా. ప్ర. 158: చూ, శుద్ధము. 3.
తేరు, దే. వి. 1. రథము: చూ, శకటము. 1; 2. బండి: చూ, శకటము 1; 3. జలాదుల నైర్మల్యము: చూ, నిర్మాల్యము: అ. క్రి. 4. కలుగు, రాఘ. 1, ఆ. 19. చూ, పుట్టు. 2.
తేరుకాడు, దే. వి: చూ, రథికుడు.
తేరుపూన్పరి, దే. వి. (తేరుపూన్పు+అరి): చూ, సారథి. అచ్చ. అ, కాం. 118.
తేర్చు, దే. స. క్రి. 1: చూ, తెలుచు. 2; ప్రే. 2: చూ, రూ-తేలుచు. 1—2.
తేలి, దే. వి. కాచగా తేలిననెయ్యి: చూ, హవిస్సు 1.
తేలిచూపు, దే. వి. తేరకొనజూచుట చూ, వీక్షణము.
తేలిపాఱచూపు, —పై.—
తేలు, దే. వి. 1. ప్రసన్నత. ఆం, భా ప్ర. 50: చూ, శుద్ధము. 3; అ. క్రి 2. చచ్చు. సాంబ. మాన. 36: చూ, సమయు: 3: చూ, తేటపడు. స్వా. 3, ఆ 23; 4. ప్రసన్నతనొందు: చూ, వెలయు; 5. ఉపశమిల్లు: చూ, స్రుక్కు. 4: 6. స్వస్థమగు, తేఱుకొను: చూ, రెక్కొను; 7. తెప్పిఱిలు: చూ, పేకరించు; 8. కలుగు: చూ, పుట్టు. 2; 9. సమాప్తమగు: చూ, సరిపోవు. 3; 10: చూ, తేరకొను. అచ్చ. అర, కాం. 107
తేఱుకొను, దే. అ. క్రి: చూ, తేఱు. 6.
తేఱుగడ, దే. వి. 1. ముగియిక: చూ, సమాప్తి. 1; 2. తెలివిడి, దృష్టాంతము: చూ, నిదర్శనము. 1.
తేఱుచు, దే. ప్రే. రూ-తేర్చు. 1. ప్రసన్నతనొందు; 2. చంపు: చూ, సంహరించు.
తేలగిలంబడు, ద్వ. అ. క్రి. (తేలగిలన్+పడు) 1. పైకితేలు: రూ-తేలగిలు-తేలగిల్లు-తేలు-తేలాడు-తేలిపోవు. తేలియాడు: 2 పరవశమగు. రూ-తేలగిలు-తేలగిల్లు-తేలు: చూ, విస్మృతినొందు. (స్వార్థమున పడు)
తేలగిలు, దే అ. క్రి: చూ, తేలగిలబడు.
తేలగిల్లు, —పై.—
తేలవేయు, దే. స. క్రి తేలగిలవేయు.
తేలాడు, దే. అ. క్రి. (తేలి+ఆడు): చూ, తేలగిలంబడు. 1.
తేలించు, దే స, క్రి జయించు: చూ, విజయమునొందు.
తేలిక, దే. వి. 1. లఘుత్వము: చూ, లాఘవము; విశ. 2. లఘువు: చూ, లాఘవము.
తేలికగాలి, వా. వి. ఉలకనగాలి: చూ, వాయువు.
తేలికపఱచు, దే. అ. క్రి. లాఘవపఱచు: చూ, తిరస్కరించు.
తేలిపోవు, దే. అ. క్రి. 1. హానిచేయక తొలగిపోవు చూ, విరియు. 5; 2. తొలగిపోవు: చూ, విరియు. 5; 3: చూ, తేలు 2; 4: చూ, తేలగిలంబడు. 1.
తేలియాడు, దే. అ. క్రి: చూ, తేలగిలంబడు. 1.
తేలీబ్రాహ్మణులు, ఆం. వీరు ఋగ్వేదులును శుక్లయజుర్వేదులును కూడ కలరు. వీరు తిలఘాతకులకు పురోహిత్యము చేయు వృత్తి కలవారుగా నున్నారు: చూ, బ్రాహ్మణులు.
తేలు, దే. వి. 1. పొట్టియ: చూ, వృశ్చికము 1; అ. క్రి 2. నీళ్ళలో మునుగక మీద సంచరించు: ఓలలాడు-రూ-ఓలాడు, జలకమాడు, తెప్పలదేలు, తేలిపోవు; 3. మునుకవేయు, నీళ్ళలో క్రీడించు (అని కొందఱు) విజ 1, ఆ 94: చూ, నీళ్ళాడు. 2; 4. పైకితేలు. పాండు. 3, ఆ 65: చూ, తేలగిలంబడు. 1; 5. తలచూపు: చూ, పొడచూపు: 6. పరవశమగు: చూ, తేలగిలంబడు. 2; వా. 7. వెల్లడియగు "వారంద్ర గుసగుసలలోని సంగతి తేలినది"; 8. తెలియబడు. "ఉభయవాదులును చెఱియొక నూఱుహపాయలు దండుగతోను తేలిరి"
తేలుకుట్టు, దే అ. క్రి. తేలుకొండెతోపొడుచు.
తేలుకొండి, దే. వి వృశ్చికాలి*: చూ, వృశ్చికము. 2.
తేలుకొండిమల్లు, దే. వి: అలము-రూ-అలము-అలము.
తేలుచు, దే ప్రే తేలజేయు: రూ-తేల్చు.
తేలుతోక, దే. వి కొండె: చూ, వాలము. 1.
తేలుబాణము, మి. వి. ఒకరకముబాణసంచు: చూ, బాణసంచు.
తేలుమణి*, మి. వి: చూ, తేలుకొండి*.
తేలుమీను, ద్వ. వి. చిలిచిమను: చూ, మత్స్యము. 1.
తేలుమేసరి, దే. వి: చూ, బిలేశయ.
తేలుమొన, దే. వి: చూ, తేలుకొండి*.
తేలురాసి, ద్వ. వి. వృశ్చికరాశి: చూ, రాశి. 2.
తేలువాఱు, దే. అ. క్రి. (తేలు+వాఱు) జనించు. చూ, పుట్టు. 2.
తేల్చు, దే. ప్రే: చూ, రూ-తేలుచు.
తేవ, దే. వి. ఒకానొకపండుగ: చూ, పండుగ. 2.
తేవనము, సం. వి. అ. న. 1. ఆటతోట; చూ, వనము. 2; 2. ఆట; చూ, విలాసము. 1.

## తై

తైజసము, సం వి. అ. న. 1. బంగారు వెండి లోనగు ధాతు ద్రవ్యము: చూ, లోహము. 1; పుం. 2. రాజసగుణము సత్వాదిగుణములు మూఁడింటిలో నొకటి: చూ, గుణములు 2. (చూ, త్రయము)

తైజసావర్తని, సం. వి. ఈ స్త్రీ బంగారులోనగునవి కరఁగు మూస. చూ, మూస.

తైతిల, వా. అం: చూ, రూ-తైతుల.

తైతిలము, సం. వి. అ. న. 1. చూ, రూ-తైతులః పుం. 2. మండెఁగ; చూ, భక్ష్యము.

తైతుల, అం. రూ-తైతిల-తైతిలము; చూ, కరణము. 14; కరణములు. 2.

తైత్తిరము, సం. వి అ. న తిత్తిరిపిట్టలగుంపు: చూ, తీతువు

తైరు, దే వి. దధి. చూ, పెరుఁగు. 1.

తైపారు, వా. వి. ఋజువు, తయ్యపారు.

తైర్థికుఁడు, సం. విణ: చూ, తీర్థవాసి.

తైలకంద, సం. వి అ స్త్రీ. కరవీరకంద*: చూ, సూరణము.

తైలంగసామవేద బ్రాహ్మణులు, పా. వీరు రణాయ. శాఖవారు. వీరిలో భరద్వాజ, వాధూలస, గౌతమ, అత్రి, నితుందిల (నిత్యుందిన), వాసిష్ఠ, కౌండిన్యులను సప్తగోత్రములవారును గలరు. వీరిది ద్రాహ్యాయణ సూత్రము: చూ, బ్రాహ్మణులు.

తైలపర్ణి, సం. వి. ఈ. స్త్రీ. 1. చిల్లమడ్డి (దేవదారుబంకచేఁ జేయఁబడి సరళద్రమమను పేరుగలది): చూ, సల్లకి. 3; 2. పీతచందనము; చూ, వాసన.

తైలపాయిక, సం వి. అ. స్త్రీ. 1: ఖలాధార. (తె ప)—గబ్బిడము—రూ—గబ్బిడా—గబ్బిడాయి-గబ్బిరాయి-గబ్బిలము - గబ్బిలాయి, జిబ్బటీ-రూ-జిబ్బడాయి; గబ్బిలపుజాతి భేదములు.— అజినపత్ర, చర్మచటక-రూ-చర్మచటి, జతుక-రూ-జతూక. (తె. ప)—చిపుక-చిపుకపిట్ట, చీకురాయి - రూ-చీకురువాయి, చీకువాయి, జివ్వీక-రూ-జీవుక; 2. ఎఱ్ఱతోఁట కూర*: చూ, మారిషము.

తైలపిపీలి, సం. వి. ఈ. స్త్రీ. ఎఱ్ఱచీమ; చూ, పిపీలిక.

తైలపిపీలిక, సం. వి అ స్త్రీ. —పై.—

తైలము, సం. వి. అ. న. నూనె; చూ, స్నేహము. 2. తద్వి - ఒకరకము మందునూనె:—అంగారకము.

తైలికుఁడు, సం. వి. అ. పుం; చూ, తెలకులవాఁడు.

తైలీనము, సం. విణ. తిలలు పండునది (పొలము): చూ, భూమి. 1.

తైషము, సం. వి. అ. పుం. పుష్యమాసము, పౌషము: చూ, మాసము. 1.

## తొ

తొంక, దే. వి. రూ-తోఁక. అచ్చ. సుం, కాం. 105. చూ, వాలము. 1.

తొంగలి, దే. వి. 1. ప్రకాశము. చూ, వెలుతురు. 1; విణ. 2. వాలునది. స్వా. 2, ఆ. 32: చూ, వాలుపు; 3. ప్రవించు నది: చూ, స్రావకము.

తొంగలించు, దే. అ. క్రి. 1. అలరు: చూ, వికసించు; 2. అతిశయించు. భాగ. 3, స్కం. 47: చూ, ముమ్మరించు; 3. చూ, ప్రకాశించు; 4: చూ, వర్ధిల్లు; 5: చూ, ప్రవించు; 6. నిక్కు: చూ, పీఁగు.

తొంగలిగొను, దే. అ. క్రి: చూ, తొంగలించు.

తొంగలిపాట్లు, ద్వ వి. బ: చూ, నమస్కారము.

తొంగలిదెప్ప, దే. వి. ఘనపక్ష్మము: చూ, దెప్ప.

తొంగిల్లు, దే. వి. బ నీళ్లలోనగువాని బొట్లు: చూ, బొట్టు, 6.

తొంగు, దే. అ. క్రి. 1: చూ, శయనించు; 2. వాలు. విజ. 3, ఆ. 29: చూ, వ్రాలు. 3.

తొంట, దే వి. 1. చెట్టుపట్ట: చూ, బెరడు; 2. కసవువెంటి, పిరి: చూ, వెంటి.

తొంటచేతివాఁడు, ద్వ. వి. (తొంటచేయి+వాఁడు) ఈడ్చుకొనిపోయిన చేయికలవాఁడు, కుకరుఁడు, కోణి: చూ, వంకర చేతుల వాఁడు.

తొంటచేయి, ద్వ వి. ఈడ్చుకొనిపోయినచేయి: చూ, హస్తము.

తొంటి, దే విణ. తొల్లిటి. "తొంటిపువ్వు.": చూ, తొలి, 5.

తొంటె, దే. వి. పూర్వము—పై.—

తొండ, దే వి: చూ, సరటము.

తొండపుఁద్రాడు, ద్వ. వి. (తొండము+త్రాడు) కపిలెబొక్కెన తోఁకకు కట్టెడుత్రాడు. రూ - తొండాపుఁద్రాడు: చూ, సూత్రము. 1.

తొండపుదోమ, ద్వ. వి. (తొండము+దోమ) ఏనికదోమ: చూ, మశకము. 1.

తొండము, వై. వి = తుండ. 1. గజహస్తము: చూ, హస్తి; 2. పక్షిముక్కు: చూ, ముక్కు; 3. ఈఁగముక్కు: చూ, ముక్కు: వా. 4. కపిలెబొక్కెనతోఁక. (వంపుగనుండు గొట్టములు లోనగువానిని తొండము అనియే వాడెదరు.)

తొండముచివర, ద్వ. వి: అంగురి.

తొండరప్పొడియాళ్వారు, అం. చూ, ఆళ్వారులు.

తొండరూపురిక్క, ద్వ. వి. పుష్యమి, పొట్లరూపురిక్క: చూ, రిక్క. 1-ఆ.

తొండాడు, దే. స. క్రి. త్వరపడుచు.

తొండాపుఁద్రాడు, ద్వ. వి: చూ, రూ-తొండపుఁదాడు.

తొండి, దే. వి: చూ, రూ-దొండి.

తొండు, దే. వి. రూ-తొండొరు. చండిపోతు: చూ, సోమరి.

తొండుతనము, దే వి. రూ-తొండొరుతనము. అలసత్వము: చూ, విలంబము.

తొండొరు, దే. వి: చూ, రూ-తొండు.

తొండొరుతనము, దే. వి: చూ, రూ-తొండుతనము.

తొండ్లి, దే. వి. తొండ్లియనుచెట్టు. హంస. 4, ఆ. 11; చూ, వృక్షము.

తొంద, వై. వి.= తుందీ. రూ-తొందు. బొజ్జవాఁడు; చూ, లంద.

తొంచర, వై. వి. (తొర + తొర) రూ - తొందఱ = త్వర. 1. జాఱుపాటు; చూ, స్ఖలనము. 2; 2. వేగిరపాటు: చూ, సంభ్రమము. 1; 3. బాధ: చూ, శోకము; 4. = త్వరా. మిక్కిలిసంభ్రమము: చూ, సంభ్రమము. 1.
తొందరచేయు, వై. స. క్రి. 1. ఏంచు. చూ, బాధించు; వా 2. తొందరపెట్టు, చుఱుకుదనము కలుగఁజేయు.
తొందరపడు, వై. అ. క్రి: చూ, సంభ్రమించు.
తొందరపాటు, వై. వి: చూ, తొందర, 2.
తొందఱ, వై. వి. = త్వర: చూ, రూ-తొంచర.
తొందఱచేయు, వై. స. క్రి: చూ, రూ-తొందరచేయు.
తొందఱపడు, వై. అ క్రి: చూ, రూ-తొందరపడు.
తొందఱపాటు, వై. వి; చూ, రూ-తొందరపాటు.
తొందఱమాట, ద్వ. వి. కొన్నెమాట: చూ, శబ్దము. 2.
తొందళము, దే. వి. 1. కొళంబు: చూ, పులుసు. 2; వా. 2. కలగలపు.
తొందు, వై. విశే. = పుందీ. చూ, రూ-తొంద.
తొంబ, వా. వి. గుంపు: చూ, సమూహము.
తొంబండ్రు, ద్వ. స. బ. తొంబదిమంది (తొంబదికి మహ న్మహత్వర్థకరూపము.)
తొంబందుము, ద్వ వి. బ. ఆధకనవకము: రూ-తొమ్మందుము.
తొంబది, ద్వ. స. బ. తొమ్మిదిపదులు: (సం. వ.) — నవతి.
తొంబదితొమ్మిది, ద్వ. స. బ. (99.) నిర్వ. ఉ. రా. 8, ఆ. 84; "మాటికి తొంబదిమంది ఉత్తీర్ణులైరి."
తొంబదినూఱు, ద్వ. స. బ: రూ-తొంబనూఱు-తొంబన్నూఱు-తొమ్మనూఱు-తొమ్మన్నూఱు. (తొంబదినూఱులు.)
తొంబనూఱు, —వై.—
తొంబన్నూఱు, —వై.—(ఇట్లు తొంబదివేలకు.—హరి. పూ. 3, ఆ. 7.)
తొకతొక, దే విశే. తొక్కుమాట; చూ, శబ్దము. 2.
తొక్క, వై. వి. 1. = త్వక్. చెట్టు లోనగువాని తోలు, పట్ట: చూ, బెరడు; వా. 2. నిర్లక్ష్యము నందుపయోగించుమాట, "పో పో తొక్కకబుర్లు చెప్పినావు."
తొక్కట, దే. వి రూ-తొక్కటము-త్రొక్కట-త్రొక్కటము. 1. ఆసదు శశాం. 5, ఆ. 121; చూ, సంకటము; 2 వ్యధ: చూ, శోకము.
తొక్కటము, —వై.—
తొక్కటపడు, ద్వ. అ. క్రి. రూ-త్రొక్కటపడు. ఇంద్రపడు; చూ, సంతాపించు.
తొక్కటపాటు, ద్వ. వి. రూ-త్రొక్కటపాటు: చూ, సంకటపాటు: (చూ, శోకము.)
తొక్కిస, అం: చూ, మల్లశాస్త్రము.
తొక్కు, దే. వి. 1. ఉప్పును కారమును చేర్చి మామిడికాయ లోనగువానిని తోటిలోపెసి త్రొక్కిన ముద్ద, పచ్చడి. చూ, భక్ష్యము; 2. ఊరుబిండి: చూ, భక్ష్యము; 3. అశక్యము: చూ, లావు. 7; 4. అవ్యక్తము (బిడ్డలమాట) భార, ఆది, 6, ఆ. 260; చూ, శబ్దము. 2; వై. వి. 5 = త్వక్. చర్మము: చూ, రూ-తొక్క. 1; దే. స. క్రి. 6. ఉప్పును కారమును చేర్చి మామిడికాయ లోనగువానిని తోటిలోవేసి చదియఁగొట్టు.
తొక్కుడు, దే. వి: చూ, తొక్కు. 1-2.
తొక్కుడుగమ్మి, ద్వ వి గడపక్రిందికమ్మి. రూ-త్రొక్కుడుగమ్మి-తొక్కుడుపట్టె-త్రొక్కుడుపట్టె.
తొక్కుడుపచ్చడి, దే. వి. ఉప్పును కారమును చేర్చి రోటిలో వేసి తొక్కిన మామిడికాయ లోనగువాని వ్యంజనము; చూ, భక్ష్యము.
తొక్కుడుపట్టె, ద్వ. వి. 1: చూ, తొక్కుడుగమ్మి; వా. 2. తొక్కుడు ఏతముమీఁది పట్టె. (చూ, ఏతము.)
తొక్కుడుబిళ్ళఆట, అం.
తొగ, వై. వి. 1. కష్టము: చూ, శోకము; విశే. 2: అగచాట్ల పోతు, అగచాట్లమారి-రూ-అగసాట్లమారి, కడగండ్లమారి, (సం. వ.)— అభిపన్నుఁడు, కష్టశీలుఁడు, కష్టాత్ముఁడు, కృచ్ఛ్రిఁడు; దే. వి. 3. కలువ: చూ, పద్మము. 1; 4. గుంపు. విజ. 3, ఆ. 64: చూ, సమూహము; 5. రీతి: చూ, విధము. 1.
తొగకంటి, దే. వి. (తొగ + కన్ను) 1. ఆఁడుది: చూ, స్త్రీ; 2. తొగలవంటి కన్నులుగల ఆఁడుది: చూ, స్త్రీ.
తొగకొమ్మ తొలఁగుబావ, ద్వ. వి: చూ, సూర్యుఁడు. వేం. అం. 11.
తొగచెలికాఁడు, దే. వి. కుముదబాంధవుఁడు, చందురుఁడు: చూ, హిమాంశువు.
తొగట, దే. వి. 1. గుడ్డలునేసి బ్రదికెడుజాతి, "తొగటవాఁడు, తొగటది, తొగటసెట్టి."; 2. సాలె: చూ, సాలెవాఁడు.
తొగడు, దే. వి. లోపలికణఁగుట.
తొగర, వై. వి. = తువరి. రూ తొవర. ఒగరు: చూ, రసము. 5.
తొగరి, వై. వి. = తువరి. రూ-తొవరి. 1. తొవరి, కంది*: చూ, సురాష్ట్రజము. 1; 2. తొవరిమన్ను, సురాష్ట్రదేశపు మన్ను: చూ, సురాష్ట్రజము. 2; 3. అడవితొగరితీఁగె, అడవి కందితీఁగె: చూ, సురాష్ట్రజము. 3.
తొగరు, దే. వి. రూ-తొవరు. 1. ఎఱుపు. రక్తవర్ణము: చూ, వర్ణము. 6; 2. ఎఱ్ఱనూలు: చూ, పోఁగు 1; విశే. 3. ఎఱ్ఱనిది. పాండు. 4, ఆ. 9: చూ, వర్ణము. 6.
తొగరుకొను, దే. అ. క్రి. ఎఱ్ఱనగు (ప్రే. తొగరుకొలుపు.)
తొగరుముక్కుపులుఁగు, ద్వ. వి. చిలుక. అం, సం. తిర్య 13: చూ, శుకము.
తొగరుమోముపుల్లు, —వై.— వే. అం. 99.
తొగఱేఁడు, దే. వి. రూ-తొగలఱేఁడు, చందమామ: చూ, హిమాంశువు. (ఇట్లు తొగదొర.)
తొగలఱేఁడు, —వై.—
తొగలవాఁడు, దే. వి: చూ, తొగట. 2.
తొగవిందు, దే. వి: చూ, తొగచెలికాఁడు.
తొగసూఁడు, దే. వి: చూ, సూర్యుఁడు.
తొచ్చియము, వై. వి. = తుచ్ఛమ్. తుచ్ఛవచనము. రూ - తొచ్చెము: చూ, శబ్దము. 2.
తొచ్చెము, —వై.—

తొటతొట, దే. వి. తొటఅగుట, పడుటయందగు ధ్వన్యను కరణము: చూ, హూహూ. (తుటతుటఅనియు.)

తొప్ప, దే. వి. 1. కోటరము. (రూ-తొఱ్ఱ-తొఱ్ఱు-తొఱ-తొఱట-తొఱ్ఱి-దొఱట- దొఱ్ఱట): చూ, రంధ్రము. 1; విశ. 2. వలుద చూ, స్థూలము. 2.

తొట్టగిలఁబడు, ద్వ. అ. క్రి. (తొట్టగిలన్ + పడు) తొట్రుపడు. పాండు. 4, ఆ. 165: చూ, సంభ్రమించు.

తొట్టగిలు, దే. అ. క్రి. రూ-తొట్టగిల్లు. 1. అతిశయించు: చూ, ముమ్మరించు; 2. కలుగు: చూ. పుట్టు. 2; వా. 3. వంపగు. "మంచము తొట్టగిలినది."

తొట్టగిల్లు, —పై. —

తొట్టి, దే. వి. 1: చూ, తెట్టి. అం. భా. ప్ర. 157; 2. నోరు వెడల్పును అడుగు సన్నమునైన గంపవంటి పాత్రము: చూ, పాత్రము. 6; 3. పసులు నీళ్లుత్రాగుట లోనగువాని కుపయుక్తముగ జాతితో కట్టిన కట్టడము: చూ, నిపానము; 4. కొప్పెర: చూ, పాత్రము. 6; 5: చూ, గాఁడి. 3; అం. 6. చూ, విన్నాణములు.

తొట్టికట్టు, దే. వి. 1. లోఁగిలి: చూ, సదనము. 1; 2. అంక ణము: చూ, ముంగిలి. 2.

తొట్టియ, దే వి. రూ-తొట్టె. 1. నేయువాఁడు నూలుకంటె నుంచుకొనెడు నాడె: చూ, నాడె; పై. వి. 2. = డోల. ఉయాల. (రూ.-తొట్టె-తొట్ల-తొట్లియ-తొట్లె): చూ, పాంకి.

తొట్టిల, దే. వి. తొట్ల-రూ-తొట్టెల. వసు, 3, ఆ. 21: చూ, పాలకి.

తొట్టు, దే. వి 1. చెఱువులోపలి పొలము: చూ, భూమి. 1; 2. స్పృక్కు: చూ, స్పర్శము. 1; 3. పాము: చూ, సర్పము; 4. పడుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ; 5. గుంపు, తెట్టువ: చూ, సమూహము; అ క్రి. 6: చూ, వ్యాపించు; 7: చూ, ప్రవహించు. భార. ఆర. 5, ఆ. 421; 8 చూ, స్రవించు; 9: ఎగఁబట్టు, ఎత్తిపెట్టు. (సం. ప.)— ఉద్వహించు; 10. నిండుకొను. పా. 4, ఆ. 66: చూ, మెండుకొను; 11. నాటు: చూ, మొంపేయు; 12. జరగు: చూ, సాగు; స క్రి. 13. అంటు: చూ, స్పృశించు; 14. అపల బించు: చూ, ప్రాపుగొను. 15. మొదలుకొను. భార. ఆది 3, ఆ. 154: చూ, వహించు.

తొట్టుకొను, దే. అ క్రి: చూ, రూ-తొట్టు. 6 మొదలు 15 వఱకు. (స్వార్థమునకొను.)

తొట్టువ, దే. వి: చూ, రూ-తెట్టువ.

తొట్టె, చూ, రూ-తొట్టియ.

తొట్టెల, దే. వి; చూ, రూ-తొట్టిల.

తొట్ర, దే. వి. తొఱ్ఱు: చూ, రూ తొట్ట. 1.

తొట్రగిల్లు. దే. అ. క్రి: చూ, రూ-తొట్రిలు.

తొట్రగిల్లుట, దే. వి. ఉరియాట. అం. భా. ప్ర. 143. చూ, స్ఖలనము. 2.

తొట్రిలఁబడు, ద్వ. అ. క్రి. (తొట్రిలన్ + పడు): చూ, సంభ్ర మించు భార. విరా. 2, ఆ. 104.

తొట్రిలు, దే. అ. క్రి. రూ-తొట్రిల్లు తొట్రగిల్లు. 1. తడఁబడు; చూ, ఱకలుకలాడు; 2. భేదిల్లు: చూ, వేఱుపడు.

తొట్రిల్లు, —పై.—భార. ఆర. 7, ఆ. 219.

తొట్రు. దే. వి. 1. తొందర: చూ, సంభ్రమము. 1; 2: చూ, తొట్రగిల్లుట: 3: చూ, రూ-తొట్ర. 1. (ప్రే. తొట్రుకొలుపు.)

తొట్రుకొను, దే. అ. క్రి; చూ, సంభ్రమించు.

తొట్రుపడు, ద్వ. అ. క్రి. 1.—పై.—భార. విరా. 4, ఆ. 51; 2: చూ, తొట్రిలు. 1.

తొట్రుపాటు, ద్వ. వి: చూ, తొట్రగిల్లుట భార. విరా. 2, ఆ. 106.

తొట్ల, పై. వి. = డోల. ఉయాల: చూ, రూ-తొట్టియ. 2. (దేశ్య మని శ. ర.)

తొట్లియ, —పై —కళా. 5, ఆ. 2. (దేశ్యమని శ. ర)

తొట్లె, —పై.—(దేశ్యమని శ. ర.)

తొడ, దే. వి గజ్జకును మోఁకాలికిని నడిమి భాగము; చూ, ఊరు, ఊరువు. (సం. ప.)—అంకపాళిక, ఉత్సంగము, ఊరువు, అంకపాలి-అంకపాళి - సక్థి - అంకము, తద్వి —, తొడపైభాగము.—ఒడి. తొడ. (సం. ప.)—అంకము ఉత్సంగము, ఉపస్థ, కోలము, క్రోడము, అఙ్క ఆరాత్; తొడలోపలిభాగము.— క్రీఁదొడ.

తొడఁకు, దే. అ. క్రి: రూ-తొణఁకు-తొనఁకు. తొలకాడు— తొలఁకు, చిందు.

తొడఁగు, దే. అ. క్రి. 1. ప్రారంభించు: చూ, యత్నించు; 2. మొనలుకొను. భార. ఆర. 6, ఆ. 115: చూ, వహించు.

తొడగు, దే. వి. చూ, రూ-తొడవు.

తొడతొక్కిడి, వా. వి. 1. ఇఱుకు, జనసమ్మర్దము; 2. అధి కము: చూ, హేరాళము. 1; 3. తొడదగ్గఱపని, చీకటి తప్పుపని.

తొడప, దే. వి. 1. త్వక్కు. అం, భా. ద్వి. 131: చూ, బెరడు, 2. బండికల్లు లోనగు వాని మొనను వేసెడు లోహవల యము: చూ, కంబరము

తొడపటము, దే. వి. 1. రూ-తొరపణము. దారువుల రంధ్రము చేయు పనిముట్టు. (చూ, పిడసాన); వా. 2. పెక్కుమంది గలిగి వివరము తెలియనిదొమ్మి: చూ, లటపటము. "వారును వీరును తగవుపడి తొడపటమై కొట్టుకొనిరి; 3. చూ, తొత్త డము; 4. వేన్నీళ్ళుచల్లార్చుట. (గోదావరీ మండలప్రాంత మున వాడుక.) (తొడపడము-తొరపడము అనియు.)

తొడపాశము, వా. మి. వి. 1. తొడను బొట్టన చూపుడు వ్రేళ్లతో నొక్కుట: చూ, గిచ్చుట; (ఉత్తరసర్కారులయందు వాడుక). 2: చూ, తొడతొక్కిడి. 3.

తొడపుట్టువు, దే. వి. ఊరుజుఁడు; చూ, వైశ్యుఁడు

తొడబిడ్డ, —పై. — సాంబ, మాన. 2.

తొడబెల్లము, దే. వి: చూ, తొడపాశము. 1—2.

తొడయు, దే. స. క్రి. 1. ఊడుచు: చూ, సమ్మార్జించు; 2. కడుగు: చూ, ప్రక్షాళించు.

తొడరిక, దే. వి. అనుసరణము: చూ, వెంబడి,

తొడరు, దే. వి. 1. ఉత్సాహము: చూ, యత్నము; 2. ఆయ తము; చూ, యత్నము; 3. అభిముఖము: చూ, ముందఱ. 1; అ. క్రి. 4. కలుగు, లక్ష్మీ. 4, ఆ. 114: చూ, పుట్టు. 2; 5: చూ, యత్నించు. భార. విరా. 1, ఆ, 127; 6. సక్త మగు; చూ, మేళగించు. 1; 7. తొట్రుపడు. భార. ఆర.

2, ఆ 85: చూ, సంభ్రమించు; స. క్రి 3. ఎదిరించు: భార. సభా. 1, ఆ. 1.3; భార. విరా. 1, ఆ 74: అభిమానమగు (అనికొందఱు): చూ, ప్రకాశించు; 9. అనుసరించు: చూ, వెంబడించు; 10. పొందు. చూ, ప్రాపించు; 11. అనుకరణ చేయు పా. 4, ఆ 28 చూ, అనుకరించు.

తొడపవు, దే. వి 1. ఆయతము. భార. శల్య. 1, ఆ. 349; చూ, యత్నము; విశ. 2. మొదటిచె.

తొడలు, అం. 1. చూ, నక్షత్రస్థానములు; 2. చూ, కళలుండు స్థలములు; పా. 2. దీనికి ఉపమానములు.—ఏనుఁగు తొండము, అరఁటికంబము.

తొడతేఁవాని సైఁదోడు. ద్వ. వి. గరుడుఁడు. సాం. దే 15: చూ, హరివాహనుఁడు.

తొడవసము, దే. వి. త్వక్కు, అం, పదా. నర. 70: చూ, బెరడు.

తొడవిల్లు, దే. వి. బాణమును సంధించిన కార్ముకము: చూ, బాణము. 1.

తొడవు, దే. వి. రూ-తొడుగు, నగ. చూ, భూషణము. 2.

తొడి, దే. వి. త్వర: చూ, సంభ్రమము.

తొడిఁబడు, దే. అ. క్రి. (తొడి + పడు) 1. చలించు: చూ, సలించు; 2. చెదరు కళా. 6, ఆ. 64: చూ, వెల్లివిరియు; 3. తొట్రుపడు: చూ, సంభ్రమించు; వా. 4 (తొందఱచేతను వత్తివలనను) ఉచ్చారణలోపము కలుగు.

తొడికిలు, దే స. క్రి; చూ, లంఘించు.

తొడికొను, దే. స. క్రి. (రూ-తొడుకొను - తోడికొను - తోడుకొను-తోకొను-తోడ్కొను) పిలుచుకొను: చూ, వెంటఁ దీసికొను.

తొడితెచ్చు, దే. స. క్రి; చూ, రూ-తోడితెచ్చు.

తొడిమ, దే. వి రూ-తొడిమె: చూ, వృంతము.

తొడిమె, —పై—

తొడు, దే, స. క్రి. 1. సొమ్ములు లోనగువాని తొడుగు. భార. ఆది. 7, ఆ. 165. చూ, తొడుగు. 8; 2. బాణముతొడుగు. భార. భీష్మ. 3, ఆ. 40: చూ, తొడుగు. 9.

తొడుకు, దే. వి. 1. గోమహిష్యాదులు; చూ, పసులము; 2. ఆవు. అచ్చ. అ, కాం. 92: చూ, ధేనువు; 3. దొంగ మేఁత: చూ, మేఁత; స. క్రి. 4. పట్టు. పాండు. 5, ఆ. 181: చూ, ప్రాపుగొను; 5. ఒడిసిపట్టు; 6. ఒడియు: చూ, రెమ్మ. 2; (చూ, లంఘించు); 7. గ్రహించు: చూ, పుచ్చుకొను.

తొడుకుసామి, ద్వ. వి; చూ, శివుఁడు. వేం, అం. 2.

తొడుకుసాహిణిమామ, ద్వ. వి. హిమాద్రి. వేం, అం. 77; చూ, పర్వతము.

తొడుకొను, దే. స. క్రి. 1; చూ, రూ - తొడికొను; 2. తొడుగుకొను.

తొడగల్లు, దే. వి. (తొడుగు + కల్లు) (రూ-తొడుగల్లు-తొడుగు-తొడుపు-తొడ్గు.) ముండ్లకంపమోపు, ముండ్లకంప (అని కొందఱు.) స్వా. 3, ఆ 130: చూ, ప్రాచీనము. 1.

తొడుగల్లు, —పై—

తొడుగు, రూ-తొడ్గు-తొడుపు. 1.—పై.—స్వా. 4, ఆ. 54; 2. ఆభరణము, నగ: చూ, భూషణము. 2; 3. దుప్పటి; చూ, వస్త్రము; 4. గదాదండములు లోనగువానికి వెనెడు ఇనుము లోనగువాని కడియము: రూ-తొడుపు - తొడువు - తొడ్గు, అనుసు: 5. కవచము. జై. 2, ఆ. 78: చూ, వారవారణము; 6. శరము: చూ, బాణము. 1; 7. గవుసెన, వీణె మొదలగువానిమొల: చూ, నిచోళము; స. క్రి. 8. రూ-తొడు (భూషణాదులను) ధరించు: చూ, పఘించు; 9. రూ-తొడు (వింటబాణము) సంధించు రూ-తొడువు-తొడ్గు: చూ, సంధించు. 4.

తొడుపు, దే. వి. 1. అనుసు: చూ, రూ-తొడుగు. 4; 2. కవచము. చూ, వారవారణము; 3. చెప్పినది మరలచెప్పుట; చూ, ప్రస్తారము. 2.

తొడువు, చూ, రూ-తొడుగు.

తొడుసు, దే. వి. 1. చుట్టఱికము; చూ, సంబంధము; 2. భోగవనిత: చూ, స్త్రీ; 3. చిక్కు: చూ, స్రుక్కు 3.

తొడ్గు, చూ, రూ-తొడుగు (భూషణము ధరించుటకు.—భార. ఆది. 1, ఆ. 114)

తొణఁకు, వా. అ. క్రి. చూ, రూ-తొడఁకు. "బిందెలోని నీరు తొణఁకుచున్నది.": తొణికిలు.

తొణికిలు, దే. స క్రి; చూ, రూ-తొడికిలు; వా, అ. క్రి. 2: చూ, తొణఁకు.

తొత్తటము, దే. వి. భేదముతెలియనికూడిక, తొడపటము: చూ, సంకరము. 1.

తొత్తటికము, దే. వి. (తొత్తు + అటికము) తొత్తుదనము.

తొత్తు, దే. వి. 1. దాసి: చూ, బానిసె; 2. బోగముది: చూ, వేశ్య.

తొత్తుకొడుకు, వా. ద్వ. వి. 1. బోగమువాని కొడుకు; 2. దాసీదానికొడుక; 3. తప్పుచేసినవానిని తిట్టుతిట్టు. "నీవు దొంగతొత్తుకొడుకువురా?" "తొత్తుకొడకా," అనియు (ఉత్తర సర్కారులలో వాడెదరు.)

తొత్తులమారి, దే. విశ. తొత్తులయిండ్లకుఁబోవు స్వభావము కలవాఁడు.

తొన, దే వి. 1. పనసపండులోనితొల: రూ-తొల; విశ. 2. అద్దికము. జై. 1, ఆ. 105: చూ, రక్షకము; వా. 2. కడుపుమీఁది మడుపు; చూ, మడత. 3.

తొనఁకు, దే. వి. తొట్రుపాటు. భార. కర్ణ. 1, ఆ. 110; చూ, సంభ్రమము. 1; అ. క్రి. 2 చిందు. చూ, తొడఁకు; 3. చలించు, వసు. 3, ఆ. 150; ఆం, భా. తృ. 63; చూ, సలించు.

తొన్నండు, దే. అ. క్రి. రూ-తెన్నుండు: చూ, శయనించు.

తొపారము, దే. వి. దేగలముఖమునఁగట్టుతోలుగంత: రూ-తోపారము.

తొప్పగఁదోఁగు, దే. అ. క్రి. (తోఁగు + తోఁగు) 1. మిక్కిలి తోఁగు. రూ-తొప్పఁదోఁగు. భార. అర. 7, ఆ. 76; ప్రే; 2. తొప్పఁదోఁచు.

తొప్పఁదోఁగు, —పై—

తొప్పటిలఁబడు, దే. అ. క్రి. తట్టువిఱుగఁబడు: చూ, వ్రాలు. 3.

తొప్పటిలు, —పై.— (రూ-తొప్పటిల్లు-తొప్పలు.)
తొప్పటిల్లు, —పై.—
తొప్పలు, —పై.—
తొప్పలుపోరలు, దే. విణ బ: చూ, కోటానఁగోటులు.
తొప్పి, దే. వి. 1: చూ, రూ-టోపి; వా. 2: చూ, రూ-తెప్పి.
తొబిక, దే. విణ. విత్తులురాలినది (మిరపకాయలోనగునవి.)
తొమ్మండ్రు, దే. స. బ. తొమ్మిదిమంది. (తొమ్మిదికి మహ న్మహత్త్వర్థకరూపము. "నీ తొమ్మండ్రుకొడుకులుఁ," ఉ, హరి 2, ఆ 144.
తొమ్మందుము, ద్వ. వి. బ. (తొమ్మిది+తూము): చూ, రూ-తొంబందుము.
తొమ్మనూలు, దే. స. బ. (తొమ్మిది+నూఱు) తొమ్మిది నూఱులు. రూ-తొమ్మన్నూఱు. సర్వ ఉ, రా, 8, ఆ 84
తొమ్మన్నూఱు, —పై.—
తొమ్మాసు, దే. వి. నాశము. "దానిని తొక్కి తొమ్మాసుచేసి నారు": చూ, రుత్త.
తొమ్మిది, దే. స. ఖండము, అంకము, నవకము; చూ, ముమ్మాఁడు. భార. ద్రోణ. 4, ఆ. 189; భార భీష్మ 2, ఆ 34. భార. ద్రోణ. 3, ఆ. 207; కాశీ. 3, ఆ. 131. (తొమ్మిదికి బహువచనరూపము 'తొమ్మిదులు' గని తొమ్మ దులు" గాదని తెలియునది.)
తొమ్మిదియంకములుగలవి, అం. పాశములు, ఆత్మలు, వర్ష ములు, ఖండములు, గ్రహములు, బ్రహ్మలు, రసములు, రత్నములు, ధాన్యములు, నిధులు, రంధ్రములు, వ్యాకరణ ములు, స్థాయీభావములు, తారలు, మేఘములు, భక్తులు, చక్రములు, ద్రవ్యములు, శిరోభేదములు, చేతనరత్నములు, అప్రకాశములు, అజ్ఞానదాయకములు, భక్తిలక్షణములు, గతి భేదములు, సంబంధములు, సృష్టిసర్గములు మొ.
తొయ్యలి, దే. వి. ఆఁడుది: చూ, స్త్రీ.
తొయ్యేరు, వా. వి. ఒకానొక గ్రామనామము యింటిపేరుగ మాటి "తొయ్యేటి"వారైరి
తొర, వై. వి. 1. = త్వర. వేగిరపాటు: చూ, స్యదము. 1; 2 ఆపద. హరిశ్చ. 4, ఆ. 108: చూ, విపత్తు; విణ. 3. = త్వర. త్వరితము: చూ, స్యదము. 1.
తొరఁగు, దే. అ. క్రి. 1. రూ-తొరుఁగు. విజ. 1, ఆ. 179: చూ, ద్రవించు; 2. ప్రవహించు. భార. విరా 1, ఆ. 12: చూ, వెల్లిగొను 3. పడు. భార. అర. 1, ఆ 183-184 చూ, దొరలు; 4. చూ, తొప్పటిలఁబడు.
తొరపడు, వై. అ. క్రి: చూ, సంభ్రమించు.
తొరపణము, దే వి: చూ, రూ తొడపటము. 1.
తొరపుట, వా. వి: చూ, తొడపటము, 4.
తొరలించు, దే. ప్రే. వేస్నిళ్ళచల్లార్చు: రూ-తొరుపు తొర్లించు-తొల్లించు.
తొరలు, దే అ. క్రి. 1. కలుగు: చూ, సంభవించు 2. వేఱు రూపమగు; మాఱు.
తొరలుచు, దే. ప్రే రూ-తొరల్చు. బదిలించు; చూ, మార్చు. 3.
తొరల్చు, —పై.—

తొరితొరి, వై. అవ్య. క్రి. విణ తెరపుగా: చూ, లెస్స. 2.
తొరుఁగు, దే, అ. క్రి: చూ, రూ తొరఁగు.
తొరుపు, దే. స. క్రి. చూ, తొరలించు.
తొర్లించు, దే. ప్రే. —పై.—
తొఱ, దే. వి. రూ-తొఱ్ఱ. చూ, రంధ్రము. 1.
తొఱఁగు, దే. వి. 1. విడివడుట. రూ తొఱవు: స. క్రి. 2 విడుచు. కిరా. 7, ఆ. 225: చూ, విసర్జించు, వా. 3. పెంచు: చూ, త్రెక్కొను. 1.
తొఱఁగుపోవు, దే. అ. క్రి. (పసులు) తప్పించుకొనిపోవు: రూ-తొఱఁగుపోవు.
తొఱఁగుపోవు, —పై.—భార. విరా. 1, ఆ. 279.
తొఱఁగుట, దే వి. చూ, విమోచనము.
తొఱట, దే వి: చూ, తొఱ.
తొఱటలువాఱు, దే. అ. క్రి. (తొఱటలు+పాఱు) చిల్లులుపడు. జై. 7, ఆ 101; చిందరవోవు, చిల్లులువోవు' చీదఱగొను, చీఁకులువోవు, తూఁటుకట్టు.
తొఱతేనె, దే. వి. పుట్టతేనె: చూ, మధువు. 5.
తొఱవు, చూ, రూ-తొఱఁగు.
తొఱుద్రొక్కు, దే వి. (తొర్రి+కొక్కు) గట్టి తొర్రికుక్క.
తొఱ్ఱ, దే. వి. (రూ తొఱ తొఱట-తొఱ్ఱ-తొట్ర-తొట్రు-దొఱట-దొఱ్ఱ): చూ, రంధ్రము. 1.
తొఱ్ఱి, దే వి. 1. ముందటిపంట్లులేనినోరు: చూ, వదనము 1; 2: చూ, తొఱుకు. 1. ఆం. భా. ద్వి. 261; 3 రిప్పు, పీసర. రూ-పీసరము: చూ, వెలితి.
తొఱ్ఱివాఁడు, దే. విణ. తొఱ్ఱినోటివాఁడు, పతితదంతుఁడు.
తొఱ్ఱు, దే వి ఆవు. పాండు. 5, ఆ. 240: చూ, ధేనువు.
తొఱ్ఱుపట్టు, దే. వి. ఆవులమంద. భార. ఆది. 8, ఆ. 210: చూ, ధేనువు.
తొల, దే. వి: చూ, రూ-తొన. 1.
తొలఁకాడు, దే అ. క్రి. (తొలఁకి+ఆడు) 1. చిందు: చూ, తొడఁకు; 2. చలించు: చూ, సలించు; 3. అతిశయించు: చూ, ముమ్మరించు; 4. ప్రకాశించు. చూ, హవణిల్లు.
తొలఁకియాడు, —పై.—
తొలఁకు, దే. వి 1. అతిశయము: చూ, హేరాళము. 1; 2. ప్రకాశము: చూ, వెలుతురు. 1; 3 అల: చూ, వీచి 1; 4. చలనము: చూ, లోలము; అ. క్రి 5. చలించు: చూ, సలించు; 6. చూ, తొడఁకు. పా. 5, ఆ. 86; 7. అతిశ యించు: చూ, ముమ్మరించు; 8: చూ, తొలఁకాడు. 4. కళా. 4, ఆ 105.
తొలఁగఁబాఱు, దే. అ. క్రి (తొలఁగన్+పాఱు, తొలఁగు: చూ, విరియు. 5.
తొలఁగించు, దే. స. క్రి. ఈఁగు: చూ, విసర్జించు.
తొలఁగింపు, వా. వి. త్యక్తము.
తొలఁగు, దే. అ. క్రి: చూ, తొలఁగఁబాఱు.
తొలఁగుడు, దే. వి: చూ, రూ-తలఁగుడు.

రొలఁగువావ, ద్వ. వి: చూ, శత్రువు.
రొలఁచు, దే. ప్రే రొలఁగఁజేయు. పాండు. 2, ఆ. 56.
రొలక, దే. వి. రూ-తోలు. చెట్టుపైపట్ట: చూ, బెరడు.
రొలకరి, ద్వ. వి. రూ-రొలుకరి-రొల్కరి-తొలుకారు-తొల్కారు. 1. (చైత్రవైశాఖమాసములయందు కురియు) వాన "తొలకరి వానలు" చూ, వాన 1; 2. వర్షర్తువు. వసు. 3, ఆ. 15: చూ, మాసద్వయము.
రొలకరించు, దే. అ. క్రి. రూ-రొల్కరించు. 1. (చైత్రవైశాఖ మాసములయందు) వానకురియు: చూ, వర్షించు; 2. వాన కురియు: చూ, వర్షించు; 3. కలుగు: చూ, పుట్టు. 2.
రొలకరిమెఱుపు, అం. 1. మల్లయుద్ధగతిభేదము: చూ, కాయ మానములు; దే. వి. 2. వర్షకాలారంభమందలి తటిత్తు. రూ-తొలుకరిమెఱుపు: చూ, విద్యుత్తు. 1.
తొలకరిగబ్బిగువ్వ, దే. వి: చూ, హంస. వేం, అం. 97.
తొలకరిసూత, —పై.—
రొలకు, దే. వి. మృగముల వెనుకకాలి మూలమునకును ప్రక్కకును నడిమిచోటు: చూ, ఉపరంధ్రము.
రొలతేనె, దే. వి. ఒకరకముతేనె: చూ, మధువు. 5
తొలసి, వై. వి.=తులసీ, తొళసి*: చూ, హరిప్రియ.
తొలి, దే. వి. రూ-రొల్లి. 1. కందరము ఆం, భా. ప్ర. 145: చూ, రంధ్రము. 1; 2. కన్నము. చూ, రంధ్రము. 1: 3. తొఱ్ఱ: చూ, రంధ్రము. 1; 4. బండికంటినడిమితూము. పిండిక. చూ, రంధ్రము. 1; 5. ముందు, పూర్వకాలము, (రూ-తొల్లి-తొలుత-తొల్త-తొలితొలుత-తొంటి-తొంటె); చూ, మొదలు. 4; 6. ఎత్తనగోలు. లక్ష్మీ. 3, ఆ. 79: చూ, మొదలు. 4. (ఆమ్రేడితమందు తొలి తొలి); విణ. 7. ముందటిది. "తొలిజాము": రూ, తొల్లి. వెనుక-రూ-వెన్క: చూ, పూర్వము. 1; 8. మొదటిది. "తొలిముద్ద": చూ, మొదలు. 6; అవ్య. 9. పురార్థకము. అం, భా. తృ. 73. రూ-తొల్లి-తొలుత-తొలుదొల్త. చూ, మొదలు 4: తొక్కుడు బిళ్లఆట గడులలోని మొదటిగడి: చూ, తొక్కుడుబిళ్ళ.
తొలిక, దే. వి. ఒడపి: చూ, రంధ్రము. 1.
తొలికోడి, వా. వి. తెల్లవాఱుజామున మొట్టమొదట కూసెడుకోడి: చూ, పుంజు.
తొలిచదువులు, దే. వి. బ. మొదటిమినుకులు. రూ-తొల్చదువులు: చూ, వేదము. (ఇట్లు తొలుపలుకులు, తొలుమినుకులు)
తొలిచూలావు, వా. వి. ఉపసర్య: చూ, దేనువు.
తొలిమక్కి, దే. వి. ఆద్యకృషి, మున్నరక. అం, భా. ద్వి. 233: చూ, లాంగలము. 1.
తొలినాఁడు, దే. వి. రూ-తొలునాఁడు. అన్యదివ పూర్వదినము: చూ, రోజు.
తొలివారము, మి. వి. ఆ. పుం. ఖాను (అది) వారము: చూ, వారము. 2.
తొలివేలుపు, దే. వి. రూ-తొలువేలుపు. 1. నలువ. చూ, బ్రహ్మ. 1; 2. అసురుఁడు, పూర్వదేవుఁడు: చూ, రాక్షసుఁడు. 1.
తొలివేల్పుపగతురు, ద్వ. వి. బ. దేవతలు. సాం. దే 18. చూ, వేలుపు.
తొలిసంజ, వా. వి: చూ, అగ్రసంధ్య.
తొలు, దే. విణ. వృత్తియందు తొలుతశబ్దమునకును రొలుకు శబ్దమునకును మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. "తొలుచూలు, తొలుమబ్బు" మొ.
తొలుక, వై. వి.=త్వక్: చూ, బెరడు.
తొలుకరి, ద్వ. వి: చూ, రూ-తొలకరి.
తొలుకరిమెఱుపు. దే. వి: చూ, రూ-తొలకరిమెఱుపు.
తొలుకారు, ద్వ. వి. 1. (తొలుక+కారు): చూ, రూ-తొలకరి. 1; 2. (తొలుత+కారు) ముక్కారుపంటలలో మొదటికారు పంట: చూ, ముక్కారుపంట.
తొలుకు. దే. స. క్రి. కురియు; చూ, వర్షించు. (వృత్తియందు అంత్యవర్ణలోపము. "తొలుకారు, తొలుమొగులు" మొ)
తొలుకుడుపు. దే. వి. (తొలుత+కుడుపు) అన్నప్రాశనము: చూ, కర్మములు. 1.
తొలుగట్టు, ద్వ. వి. (తొలుత+గట్టు) ఉదయాద్రి, పూర్వపర్వతము. వసు. 6, ఆ 6: చూ, పర్వతము.
తొలుచదువులు, దే వి. బ (తొలుత+చదువులు): చూ, రూ-తొలిచదువులు.
తొలుచు, దే. స. క్రి. రూ-తొల్చు. 1. నాటులోనగువాని గ్రుచ్చు. అం, భా. తృ. 112: చూ, నాటువాటు; 2. రంధ్రముచేయు: చూ, మర్చు; 3. తోఁడు, కెల్లగించు. భార. స్త్రీ 2, ఆ. 109; చూ, విచారించు.
తొలుజాతివాఁడు, ద్వ. వి. విప్రుఁడు: చూ, బ్రాహ్మణుఁడు.
తొలుత, చూ, రూ-తొలి. 5—7—8—9. (ద్ర.పురార్థకము.—వసు. 4, ఆ. 36.)
తొలుతొలుత, ద్వ ద్ర. క్రి. విణ: చూ, రూ-తొలుదొల్త.
తొలుదీవి, ద్వ. వి. (తొలుత+దీవి) నేరేడుదీవి. వసు. 1, ఆ. 93: చూ, ద్వీపములు.
తొలుదెస, ద్వ. వి. తూరుపుదెస ఆం, భా. ప్ర 71: చూ, హరిత్తు.
తొలుదొల్త, ద్వ. ద్ర. క్రి. విణ: చూ, తొలి. 9.
తొలునాఁడు, దే. వి: చూ, రూ-తొలినాఁడు.
తొలునీటిరిక్క, ద్వ వి. (తొలుత+నీటిరిక్క) పూర్వాషాఢా నక్షత్రము. నీటిరిక్క-రూ-నీరురిక్క: చూ, రిక్క. 1. ౧౮.
తొలుపంది, దే. వి. (తొలుత+పంది) రూ-తొల్పంది. ఆదివరాహము. అచ్చ బాల, కాం. 153: చూ సూకరము.
తొలుపక్కము, ద్వ వి. (తొలుత+పక్కము): చూ, తెలిపక్కము.
తొలుపలుకులు, దే. వి. బ: చూ, తొలిచదువులు.
తొలుమినుకులు, దే. వి. బ —పై.—
తొలుమొగులు, దే. వి. వర్షించుచున్నమేఘము. అచ్చ యు, కాం, 65: చూ, మేఘము. 1.
తొలురిక్క, ద్వ. వి. అశ్వినీనక్షత్రము: చూ, రిక్క: 1-1.
తొలురిక్కనెల, ద్వ వి ఆశ్వయుజమాసము:
తొలువేలుపు, ద్వ. వి: చూ, రూ-తొలివేలుపు.

తొలుసంఁజె, ద్వ. వి: చూ, సూర్యోదయము.
తొల్కరి, ద్వ. వి: చూ, రూ-తొలకరి.
తొల్కరించు, దే. అ. క్రి : చూ, రూ-తొలకరించు.
తొల్చదువులు, దే. వి. బ: చూ, రూ-తొలిచదువులు.
తొల్చు, దే. స. క్రి. చూ. రూ-తొలుచు.
తొల్జంగమయ్య, ద్వ. వి: చూ, శివుఁడు.
తొల్కారు, ద్వ వి: చూ, రూ-తొలుకారు.
తొల్త, దే. వి: చూ, రూ-5-7-8. తొలి.
తొల్పంది, దే, వి. చూ, రూ-తొలుపంది.
తొల్లి, దే. వి. 1. చూ, తొలి. 5; 2: చూ, తొలి. 6: 3. బిలము: చూ, రంధ్రము. 1; అవ్య. 4: చూ, తొలి. 9. ఆం, భా. తృ. 73; విణ. 5. ముందటిది. "తొల్లిఁటివారు-తొల్లిఁటివారు.": చూ, పూర్వము 1.
తొల్లించు, దే ప్రే: చూ, రూ-తొరలించు.
తొల్లింటికత, వా. వి. పురావృత్తము: చూ, సమాచారము. 2.
తొల్లింటిది, దే. విణ. పూర్వకాలసంబంధమైనది.
తొల్లిక, దే. వి. 1. ఒకరకముచేఁప: చూ, మత్స్యము. 1; 2. రూ-తొళ్ళిక: చూ, ముద్గరము.
తొవ, దే వి. కలువ: చూ. రూ-తొగ.
తొవర, వై. వి.=తువర: చూ, రూ-తొగర.
తొవరి, వై. వి.=తువరి: చూ, రూ-తొగరి.
తొవరు, చూ, రూ-తొగరు. (ఎఱ్ఱనిది,—అచ్చ. యు, కాం. 323.)
తొస్సు, దే. వి. ఉచ్చారణలోపము. తొస్సి.
తొస్సి, వా. వి. —. పై.—
తొస్సె, దే. విణ. పండ్లులేనిది, బొక్కి : చూ, బోసి.
తొళక, దే. విణ. పలుచనిది, తనువు; చూ, పేఁపము.
తొళసి, వై. వి.=తులసి: చూ, రూ-తొలసి.*
తొళ్ళిక, వా. వి: చూ, రూ-తొల్లిక. 2.

## తో

తో దే. అవ. 1. తృతీయావిభక్తి యందు వచ్చెడు ఒకానొక ప్రత్యయము: చూ, చే. 1; ద. 2. కూడ. భార. భీష్మ. 1,ఆ. 112: చూ, సైకము; 3. వెంట జై. 5, ఆ. 192:చూ, వెంబడి.
తోమ్, వా. అవ్య. ఒకానొకరాగభాగము. "తధకిణతోమ్."
తోఁక, దే. వి: చూ, రూ-తొంక.
తోకగుంఁజె, ద్వ. వి. ఆఁదోఁకగా నేర్పఱచిన స్తంభము: చూ, స్తంభము. 1.
తోఁకచిచ్చు, ద్వ. వి. ఉపాహితము, నిప్పుదగిలించిన పిడుకల వరుస. స్వా. 1, ఆ. 37: చూ, పిడక.
తోఁకచుక్క, ద్వ. వి. ధూమకేతువు: చూ, రిక్క. 1.౨౮ (౨).
తోఁకత్రెంచుకపోవుట, జా. పారిపోవుట. "నీమాటవిన్నఁదా నిలుచునే మరుతేజి లోఁకత్రెంచుక కానఁ దొలఁగి చనక." (రసికజనమనోరంజనము)

తోఁకత్రొక్కినత్రాచువలె, లో. ఉదా. — "అనినఁ దోఁకఁద్రొక్కిన త్రాఁచుచందంబున సముత్థితుండై వశక పక్షీంద్రుండు రోషావేశంబున," (నీతిచంద్రిక—విగ్రహము.)
తోఁకపురుపు, ద్వ. వి. రూ-తోఁకపుర్వు: చూ, పురుగు.
తోఁకపుర్వు. —పై.—
తోఁకమిరియము, ద్వ. వి: చూ, చలువ మిరియము (చూ, మిరియము.)
తోఁకలేనిపిట్ట తొంబై ఆమడ వెళ్ళెను. లో. జాబు.
తోఁగు, దే. వి. 1. సదురు: చూ, స్వప్నము. 2; 2 తడి: చూ, పదను. 2; అ. క్రి. 3. ముసుఁగు. పాండు. 1, ఆ. 10: చూ, నీహారం; 4. తడియు. కళా. 3, ఆ. 16 : చూ, నాను.
తోఁచిగాఁడు. దే. వి. ఒకానొకడేగ. స్వా. 4, ఆ. 55 : చూ, శ్యేనము. 1.
తోఁచ, వై. వి.=తుచ్ఛ. (దేశ్యమని శ. ర.) మాదిగ: చూ, కడజాతివాఁడు.
తోఁచు, దే. అ. క్రి. 1. ఉదయించు, రూ-తోఁతెంచు. భార. ద్రో. 5, ఆ. 128: చూ, స్ఫురించు. 2; 2. భావముదయించు: చూ, స్ఫురించు 2; 3. ప్రత్యక్షమగు, తలచూపు; చూ, పొడచూపు; 4. ఫలపరిమితి నూహించు, అంచించు, అంచనకట్టు, అంచన జూచు, అంచనవేయు, అద్దించు, అద్దు, ఉండఁజూఁచు, ఉజ్జగొను, ఉజ్జాయించు. (సం. వ. - ఊహించు; ప్రే 5. తోఁచఁజేయు పాండు. 2, ఆ. 128.
తోఁచుట, వా. వి: చూ, ఉపస్థితి. 2.
తోఁట, దే. వి. 1. ఇంటితోఁట కళా. 2, ఆ. 49. చూ, వనము. 2; 2. ఉపవనము, తోఁపు, హౌసుతోఁట. కళా. 2, ఆ. 41; చూ, వనము. 2; 3. ఆశ్రమము; చూ, సదనము. 1.
తోఁటకాఁపు, దే. వి. రూ-తోటఁవాఁడు - తోఁటీఁడు, కజావేక్షకుఁడు: చూ, వనపాలుఁడు.
తోఁటకూర, దే. వి: చూ, మారిషము*.
తోఁటపోఁక, ద్వ వి. భూపూగము.*: చూ, పోఁక.
తోఁటమాలియ, ద్వ. వి. రూ-తోఁటమాలె-తోమాలియ-తోమాలె. 1. (ఆకులు పుష్పలు కూర్చికట్టిన దండ); చూ, వనమాల; వా వి 2. తోఁటను పెంచువాఁడు.
తోఁటమాలె, —పై.—
తోఁటమొల్ల, ద్వ. వి. కుందము, మల్లియ-మూ-మల్లె*: చూ, మొల్ల.
తోఁటవాఁడు, ద్వ. వి: చూ, తోఁటకాఁపు.
తోఁటీఁడు, ద్వ. వి. (తోఁట + ఈఁడు)—పై.—
తోఁడు, దే. స. క్రి. 1. కెల్లగించు: చూ, విదారించు; 2. నూలిపోఁగు తీసి చుట్టు : చూ, చుట్టు. 5.
తోఁడుడు, దే. వి. తంతునిస్సరణము. (నిస్సరణము=వెడలఁబాటు): చూ, వెలువుడు.
తోఁడుఁబోతు, దే. వి. 1. వంపుచేయుట: చూ, హింసాకర్మ; విశ. 2. వంపుచేయువాఁడు. హింసాకర్మ చేయువాఁడు.
తోఁడెలు, దే. వి. రూ-తోఁడేలు. స్వా 4. ఆ. 50; చూ, వృకము.

**తోఁచేటికడుపుమేటి,** ద్వ వి. (తోఁచేలు + కడుపుమేటి) : చూ, భీముఁడు.

**తోఁచేలు,** దే. వి: చూ, రూ తోఁదేలు. (తోఁచేలువృ అనికొందఱు.)

**తోఁచేఁకొంగ,** ద్వ. వి. పెద్దనుప్పి: చూ, రామము. 3.

**తోఁతెంచు,** దే. అ. క్రి. (తోఁచు + తెంచు) 1. ఉదయించు: చూ, స్ఫురించు. 2; 2. కనఁబడు. భార. కర్ణ. 3, ఆ. 174: చూ, ప్రత్యక్షమగు; 3. కనిపించు. భార. అర. 4, ఆ. 226: చూ, ప్రత్యక్షమగు; 4. దూరమునుండి సమీపమునకు నడచు: చూ, వచ్చు 2.

**తోఁప,** దే. వి. 1. పిండికూడు, సంకటి: చూ, సాదము. (1); వా. 2. తొక్కు. "తోఁపరేఁగునట్లు కొట్టెను."

**తోఁపిక,** దే. వి రూ-తొ.పు. తలఁపు. చూ, వాంఛ.

**తోఁపు.** 1 —పై.—; 2. ఎఱుపు : చూ, వర్ణము. 6; 3. పెంపుడువనము. చూ, వనము 2; 4 చీమిడి ఆం. భా. ద్వి. 126: చూ, శ్లేష్మము; 5. బట్ట. చూ, వస్త్రము; 6. ఎఱ్ఱ (కపిలవర్ణము) బట్ట: అరుణవస్త్రము. ఆం. భా. ద్వి. 154: చూ, వస్త్రము; 7. సుకియలు లోనగువాని మూఁకపిండి (బూరెలపై చోవిపిండి అని కొందఱు.): చూ, సాదము. (1).

**తోఁబుట్టినది,** దే వి: చూ, సహోదరి. ఆం, భా. ద్వి. 113.

**తోఁబుట్టు,** దే. వి. (తోన్ + పుట్టువు): చూ, రూ-తోడఁబుట్టు. అచ్చ. బాల, కాం. 6.

**తోఁబుట్టుగు,** దే. వి. (తోన్ + పుట్టుగు)-పై-. జై. 7, ఆ 134.

**తోఁబుట్టువు,** దే. వి —పై —

**తోకము,** సం. వి. అ న. బిడ్డ: చూ, శిశువు.

**తోకొను,** దే. స క్రి: చూ, రూ-తోడికొను. భార. అర. 3, ఆ. 220.

**తోక్మము,** సం. వి. అ న. 1, గులిమి: చూ, పింజూషము; పుం. 2. పచ్చని: చూ, వర్ణము 6; 3. పచ్చయవలు: చూ, ధాన్యము; విశ. 4. పచ్చనిది: చూ, వర్ణము. 6.

**తోటకము,** అం. ఒకానొకవృత్తము. ఒక్కొక్క పాదమునందు స-స-స-స గణములు గలిగి తొమ్మిదింట యతిగల ద్వాదశ ఛందోద్భవవృత్తము. "కపటా పరువా౹య-కాం, తి సిధీ.": చూ, వృత్తము. 1.

**తోటి,** దే. వి. మాల. జై. 8, ఆ. 6౯: చూ, కడజాతివాఁడు.

**తోడ,** చూ, రూ-తో. (వెంబడికి—స్వా. 2, ఆ 33.)

**తోడంటు,** దే వి. (తోడు + అంటు) చేమిరి: చూ, తోడు. 4.

**తోడఁబుట్టు,** దే. వి. (తోడన్ + పుట్టు) (రూ-తోఁబుట్టుగు-తోడఁబుట్టువు-తోఁబుట్టు-తోఁబుట్టుగు) తోడు, తోడిచూలు, పైదోడు. 1: చూ, సహోదరుఁడు; 2: చూ, సహోదరి.

**తోడఁబుట్టుగు,** —పై. —

**తోడఁబుట్టువు,** —పై. —

**తోడనము,** సం. వి. అ. న. = తుండెము, తునక: చూ, శకలము. 4.

**తోడా,** దే వి. 1. హస్తభూషావిశేషము: చూ, భూషణము. 2; 2. కాలికివేసికొను బిరుద: చూ, భూషణము. 2; 3. చూ, బాలక్రీడ; వా. 4. శిక్షార్హుని ముంజేతులకుఁ దగిలించుసంకెల; 5. చేతికివేసికొను కడెము. (బంగారుమురుగు) "తోడా మురుగు."

**తోడి,** అం. 1: చూ, రాగాంగములు: (చూ, స్వరము. 2); 2: చూ, శ్రీరాగములు. (చూ, స్వరము. 2.)

**తోడికొను,** చూ. రూ-తోడుకొను.

**తోడికోడలు,** దే. వి. మగనితోడఁబుట్టినవాని భార్య. యాత: చూ, భార్య.

**తోడిచూలు,** దే. వి: చూ, తోడఁబుట్టు.

**తోడితెచ్చు,** దే. స. క్రి. 1 పిలుచుకొనివచ్చు. రూ-తొం తెచ్చు-తోడ్తెచ్చు-తోతెచ్చు; ప్రే. 2. తోడితెప్పించు: రూ-తోడ్తెచ్చు-తోతెచ్చు.

**తోడిపెండ్లాము,** దే వి ఏరలు-ఏరాలు, సవరాలు, సపత్ని: చూ, సవతి (చూ, భార్య.)

**తోడియల్లుఁడు,** దే వి: చూ. షడ్డకుఁడు.

**తోడివాఁడు,** దే వి: చూ, సహాయుఁడు. 1.

**తోడు,** దే. వి. 1 త్వక్కు ఆం, భా. ద్వి. 37: చూ, బెరడు; 2: చూ, తోడఁబుట్టు. 1; 3: చూ, తోడఁబుట్టు. 2; 4: చేమిరి, తోడంటు (సం. ప.). - ఆతంకము, ఆతంచనము; 5. ఆన: చూ, సెలవు; 6. (శపథమునందుఁ బలుకునది) మాట: చూ, శబ్దము. 2; విశ. 7. సహాయము: చూ, వెంబడి; వా. వి, 8. దిక్కు, అండ "నాకు నీవు తోడు"; వా. స. క్రి. 9. (నూలుపోఁగు) చుట్టు;

**తోడుఁబాలు,** ద్వ. వి. పాలుపిండఁబోవునపుడు పాలదుత్తలో నుంచుకొనెడు నీళ్లు; చూ, సలిలము. 1.

**తోడుకొను,** దే. అ క్రి. రూ-తోడ్కొను-తోడికొను. 1. (పాలు) పేరుకొను; స క్రి. 2. పిలుచుకొను: చూ, వెంటఁ దీసికొను.

**తోడుచల్ల,** దే వి. చేమిరిపెట్టు మజ్జిగ: చూ, మజ్జిగ.

**తోడుత,** దే. క్రి వెంబడిని. (రూ-తోడుతో-తోడుతోడ-తోడ్తో-తోడ్తోడ.) భార. విరా. 1, ఆ. 118: చూ, సైకము.

**తోడుతో,** —పై.—

**తోడుతోడ,** —పై.—

**తోడునీడ,** దే. విశ. 1: చూ, సహాయుఁడు. స్వా. 2, ఆ. 17; వా. విశ. 2: (చూ, తోడు. 7.) సహాయము. "అఖిలకళలందుఁ దోడునీడగుచు మెలఁగు" (కళాపూర్ణోదయము.)

**తోడుపట్టి,** ద్వ వి: చూ, తోడు. 1.

**తోడుపడు,** ద్వ. అ క్రి రూ-తోడ్పడు. సహాయపడు.

**తోడుపాటు,** ద్వ వి. రూ-తోడ్పాటు: చూ, వెంబడి.

**తోడుపాయసము,** వా. మి. వి. అనుకుగావండిన పరమాన్నము.

**తోడుపెట్టు,** దే. స. క్రి. చేమిరిపెట్టు.

**తోడులేనివాఁడు,** వా విశ. అసహాయుఁడు: చూ, విడి. 12.

**తోడువోవు,** దే. అ. క్రి. (తోడు + పోవు) సరియగు, : శించు: చూ, సమయు. 3.

**తోడెము,** దే. వి. రూ-తోలెము: చూ, స్వల్పము.

**తోడ్తెచ్చు,** చూ, రూ-తోడితెచ్చు. భార. విరా. 4, ఆ. 68.

**తోడ్కొను,** దే. స, క్రి: చూ, రూ-తోడుకొను.

తోద్తో, దే. క్రి: చూ, రూ-తోడుత.

తోద్తోడ, —పై —

తోడ్పడు, ద్వ. అ. క్రి: చూ, రూ రోదుపడు.

తోడ్పాటు, ద్వ వి: చూ, రూ-తోడుపాటు.

తోణము, దే. వి. చాపకర్షణ బలసాధనము. అం, భా స్వ. 212: చూ, బాణము. 1.

తోతెచ్చు, చూ, రూ లోడితెచ్చు.

తోత్రము, సం. వి అ. న. 1. ఏనుఁగును పొడిచెడు ఇరిగోల, ఈఁటె, వైణుకము: చూ, బాణము. 1; 2. పసులనుదోలెడు ములుకోల: చూ, ములుకోల. 2; అం. 3. ముప్పదిరెండాయుధములలో నొకటి: చూ, ముప్పదిరెండాయుధములు. (చూ, బాణము. 1.)

తోదకము, అం. ఒకానొకవృత్తము. ఒక్కొక్కపాదమున-భ-భ-భగగణములతోఁ గూడి యెనిమిదింట యతిగల ద్వాదశ వర్ణపాదమునఁ బుట్టిన వృత్తము, "కొలుతు, మురారి, ని-గోర్కెల్, బు దీర్పన్" (అప్ప. 4, ఆ. 232. పౌరాణ)

తోదనము, సం. వి. అ. న. 1. నొప్పించుట; 2: చూ, తోత్రము. 2; అం. 3. చూ, హస్తక్రియలు.

తోపు, దే. వి వరుసకట్టు.

తోనకము, వై వి. = తోరణ. ఆకుమండలక్షి. చూ, తోరణము.

తోనమ్మ, దే వి. అల్పబాణము; చూ, బాణము. 1.

తోకాఁడు, దే. వి. పుంశ్యేనము: చూ, శ్యేనము.

తోపరా, వా. వి. ఉలవలసంచి.

తోపాటు, దే అవ్య. 1. వలె; చూ, సామ్యము; వా 2. కూడ

తోపారము, దే. వి. దేగలముఖమునకుఁ గట్టెడు తోలుగంత. రూ-తౌపారము: చూ, బెరడు.

తోపి, దే వి. రూ-టోపి: చూ, సీసకము. 1.

తోపు, వా. విణ పింగళ (అరుణ) వర్ణము, ఒకరకము ఎఱుపు "తోపుచీర": చూ, వర్ణము. 6.

తోమకము, దే. వి: చూ, తోముడు.

తోమరము, సం. వి. అ. పుం, న. 1. చిల్లకోల, సర్వల; చూ, బాణము. 1; అం. 2 : చూ, ముప్పదిరెండాయుధములు. (చూ, బాణము. 1.)

తోమాలియ, ద్వ. వి (తోఁట + మాలియ) : చూ, రూ- తోఁట మాలియ (వనమాల.—పాండు. 2, ఆ. 21.)

తోమాలె, —పై —

తోము, దే. స. క్రి. మురికిపోవరుద్దు : చూ, రుద్దు. 1

తోముడు, దే. వి ; చూ, రుద్దుడు.

తోయగాఁడు, దే. విణ. (తోయము + కాఁడు) విధముగలవాఁడు.

తోయజము, సం. వి. అ. న. తామర, నీటిపుట్టుగు : చూ, పద్మము. 1.

తోయజాక్షి, సం. వి. ఈ. స్త్రీ 1. ఆఁడుది : చూ, స్త్రీ: 2. తామరపువ్వువంటి కన్నులుగల ఆఁడుది ; చూ, స్త్రీ. (దీనికి తెనుఁగు తమ్మికంటి.)

తోయడింభము, సం. వి. అ. పుం : చూ, వడగల్లు.

తోయదము, సం. వి అ. న. నెయ్యి : చూ, హవిస్సు 1; పుం. 2. మబ్బు : చూ, మేఘము. 1; 3. తుంగ* చూ, తృణము. 1.

తోయధి, సం. వి. ఇ. పుం. సముద్రము : చూ, సముద్రము.

తోయపిప్పలి. సం. వి. ఈ. స్త్రీ నీరుపిప్పలి* : చూ, శతావని. 2.

తోయము, సం వి అ. న. 1. జలము : చూ, సలిలము; దే. వి. (1) వర్గము, తెగ. కళా. 7, ఆ. 76 : చూ, సమూహము; (2) దండు : చూ, సేన 1; (3) రీతి. భాగ. 2, స్కం. 78 : చూ, విధము 1; (4) ఆదను. భాగ. 1. స్కం. 459 : చూ, సమయము. 1; (5) పరిజనము : చూ, సంగడము. 5; (6) తడవ : చూ, వెండియు.

తోయరుహము, సం. వి. అ. న : చూ, తోయజము.

తోయలక్ష్మప్రయోగము, అం : చూ, తంత్రములు.

తోయలి, దే. వి : చూ, రూ- తొయ్యలి.

తోరణ, వై. వి. 1.= తోరణమ్: చూ, తోరణము. 1; వా. 2. బారు : చూ, పంక్తి. 1.

తోరణము, సం. వి. అ. పుం. 1.= తోరణ-తోరకము-తోరనము -దోరణము. పుష్పమాలికాదులు గట్టబడినై గృహమునకు వెలుపల స్తంభద్వయముచేత నేర్పఱుపఁబడిన ద్వారమునకును, మంగళార్థముగా ఆ తోరణమునకుఁ గట్టెడు మామిడాకులు లోనగువాని సరమునకును, రెండు స్తంభములకుగాని గుమ్మమునకుగాని కట్టిన మామిడిచిగురు లోనగువాని మాలికకును పేరు; వా. 2. బారు : చూ, పంక్తి 1; అం. 3 : చూ, స్త్రీ లక్షణాంగములు.

తోరణస్తంభము, సం. వి. అ. పుం. నాందీకము : చూ, స్తంభము. 1.

తోరనము, వా. వై. వి. చూ, తోరణము. 1.

తోరమల్లి, దే. వి. వజ్రమువలె తెల్లగానుండు అల్పమణివిశేషము: చూ, రాయి, రత్నము.

తోరము, వై. వి. 1. వ్రతసూత్రము. స్వా. 3, ఆ. 88 : చూ, సూత్రము. 1; విణ = స్థూల. 2. లావైనది : చూ, స్థూలము. 4; 3. అధికము : చూ, హెచ్చు. 1;4 మిక్కిలి బలము కలది. భార. భీష్మ. 1, ఆ. 140 : చూ, బలిష్ఠము; 5. మంజులము : చూ, హృద్యము. ఆం. సం. మాన. 52; 6. అందము : చూ, సౌందర్యము.

తోరహస్తము, వై. వి = స్థూలహస్త ; చూ, మల్లశాస్త్రము.

తోరహత్తు, వై. విణ ; చూ, సమృద్ధి.

తోరెము, దే. వి. రూ- దోరెము, దేవునకట్టు త్రాడు : చూ, సూత్రము. 1.

తోలించు, దే. స. క్రి : చూ, తోలుచు.

తోలు, దే. వి. 1. రూ- తోలుక. చర్మము ; చూ, బెరడు; 2. జంతువు లోనగువాని చర్మము ; చూ, బెరడు; వా. స. క్రి. 3. పసులు లోనగువాని నడపించు : చూ, వెలుచు.

తోలుక, దే. వి : చూ, రూ- తోలు. 1.

తోలుచు, దే. ప్రే. తోలఁజేయు : తోలించు.

తోలుదాలుపు, దే. వి. రూ- తోలుదాల్పు, అద్భ, బాల, కాం. 176 : చూ, శివుఁడు. 1.

తోలుబోఁగు, వా. అ. క్రి : చూ, తోలూడ్చు.

తోలువాయిదము, ద్వ. వి. ఆనద్ధము, తోలుకప్పిన వాద్యము : చూ, వీణ.

తోలూడ్చు, వా. అ. క్రి : తోలుబోఁగు, ఒలియు స. క్రి. — ఒలుచు.

తోలెము, దే. వి : చూ, రూ- తోడెము.

తోవ, దే. వి. 1. కలువ, అం. పదా. 6-49 : చూ, పద్మము. 1; 2. కొలను, వసు. ఆం, భా. ద్వి. పుర. 21 : చూ, సద నము. 1.

తోషకము, పా. ఒకానొకవృత్తము. ఉదా.— భ, భ, భ, గగ. 7 యతి. "తోయజలోచన-తోడగుమయ్యా."

తోషిణి, అం : చూ, తంత్రములు.

తోషము, వై. వి. = చూ, సంతోషము. సాం. మాన. 23.

తోసిరాజు, మి. వి. 1. తొలఁగఁదగిన రాజు. విజ. 1, ఆ. 103. (చదరంగమునందలి పరిభాష. దీనిని భాషాంతరమందు షహా అందురు. "తోసిరాజు ఆటకట్టు"; జా. 2. లక్ష్యము చేయ కుండుట.

తోసివేయు, వా. స. క్రి. 1 రీసివేయు. 2. (శావా) కొట్టివేయు.

# తౌ

తౌ, దే. అ. క్రి : చూ, రూ- తవ్వు-తగు

తౌటిపాము, దే. వి. (తౌడు + పాము) : చూ, రూ-తవుటిపాము.

తౌడు, దే. వి: చూ, రూ- తవుడు.

తౌర్యత్రికము, సం. వి. అ. న. నృత్తగీతవాద్యములు మూఁడును గూడుట, నాట్యము. (చూ, ఉద్ధతము-చూ, లాస్యము.)

తౌలఁబడు, ద్వ. అ. క్రి : చూ, రూ-తవులఁబడు. భార. ఉద్యో. 2, ఆ. 195.

తౌలు, దే. అ. క్రి : చూ, రూ-తగులు. (తవులునకు— భార. ఆర. 1, ఆ. 211.)

తౌలుకొను : చూ, రూ-తవులుగొను. 1-2; దే ప్రే. 3 : చూ, రూ-తవులుకొలుపు. జై. 8, ఆ. 114.

తౌలుచు, దే. ప్రే : చూ, రూ-తగులుచు.

తౌలుపడు, ద్వ. అ. క్రి : చూ, రూ-తవులుపడు.

తౌల్యము, సం. వి. అ. న. సామ్యము : చూ, సమానము. 2.

తౌశపము, అం : చూ, దేశములు.

# త్య

త్యక్తము, సం. విణ. విడువఁబడినది, నిర్వ్యాపారము: చూ, హీనము. 3-౧.

త్యజనము, సం. వి. అ. న. వర్జనము, విడుపు : చూ, విమోచ నము.

త్యజించు, సం. స. క్రి వర్జించు, విడుచు : చూ, విసర్జించు

త్యజితవంతము, సం. విణ. రూ త్యాజితవంతము. విడిచిపెట్టినది: చూ, హీనము. 3.

# త్యా

త్యాగము, సం. వి. అ. పుం. 1 = తేగ-చాగము, ఈవి : చూ, వితరణము.

త్యాగరత్నము, సం. వి. అ. న. = చాగరతనము, చింతామణి : చూ, రత్నములు.

త్యాగరాజకృతి, వా. (సంగీతవిద్యను లోకమునకు త్యాగము చేసిన విద్వాంసుఁడగు) త్యాగరాజు చెప్పినకృతి (త్యాగరాజ కృతులు పెక్కు గలవు.)

త్యాగి, సం. విణ. 1. = చాగి. దాత: చూ, వదాన్యుఁడు.

త్యాజితవంతము, సం. విణ: చూ, రూ-త్యజితవంతము.

త్యాజ్యము, సం. విణ. 1. విడువఁదగినది: చూ, హీనము 2; వా. వి 2. విడువఁదగినకాలము; 3. దోషయుక్తమైన కొద్ది కాలము; (పంచాంగమునందు ప్రతిదినమును త్యాజ్యము చూపఁబడును)

# త్ర

త్రంగ, సం. వి. అ. స్త్రీ: చూ, ఉద్రంగము 2.

త్రంగము, సం. వి. అ. పుం.— పై.—

త్రంపి, దే. వి: చూ, రూ-తంపి. 1.

త్రచ్చన, వై. వి. 1. ఆట: చూ, పరిహాసము; 2 చిలుకుట: చూ, మథనము; 3. చెక్కుట: చూ, చెరుపు. 1.

త్రచ్చు, వై. స. క్రి. = కృ, తక్షీ. రూ-తిరుచు. చిలుకు: చూ, మథించు.

త్రచ్చుట, వై. వి. చిలుకుట, ఆం. భా. ద్వి. 265: చూ, మథనము.

త్రప, సం. వి. ఆ. స్త్రీ. 1. చూ, సిగ్గు; 2: చూ, అంకిలాఁడి; అం. 3. (తనవరుని నామంబుఁ బరాకున బేరొ్కని తన నెచ్చెలి వినెఁగదాయని యచ్చోటి మోమువంచె: చూ, సంచారిభావములు.

త్రపిష్ఠుఁడు, సం. విణ. మిక్కిలి సిగ్గుగలవాఁడు. చూ, హ్రీ మంతుఁడు.

త్రపుకర్కటి, సం. వి. ఈ. స్త్రీ. ములుదోస*: చూ, దోస.

త్రపులము, సం. వి. అ. న. 1 = తగరము: చూ, లోహము. 1; 2. సీసము: చూ, లోహము. 1.

త్రపువు, సం. వి. ఉ. న. 1.—పై.—; ఉస్. న. 2.—పై.—

త్రపుస, సం. వి. ఆ స్త్రీ. చేఁదుగలదోస*: చూ, దోస.

త్రపుసము, సం. వి. అ. న. రూ-త్రాపుసము. తగరపుబొమ్మ: చూ. బింబము. 3.

త్రమ్మ, దే. వి 1. రూ-తుమురు-త్రుమ్మ-దుమ్ము-దుమ్మ చూ, రేణువు. 1; స. క్రి. 2: దుమ్ముచేయు. రాఘ. 1, ఆ. 42.

త్రయము, సం. న. అ. మూఁటిసమూహము. త్రయి, త్రికము. తద్విశేషములు.— అం. మూఁడంకములుగలవి — అంతర జాతులు (శశాది), అంబలు, అగ్నులు, అగ్నులు, అనుప్రాసము (అలంకారము), అభిషేకములు, అలంకారములు, అవస్థలు, అవాంతరములు (హరిణ్యాది), ఆదిశక్తులు, ఆనందములు

(మనుష్యానందాది), ఇచ్ఛాదులు, ఈషణములు, ఉదయములు (క్షయాది), ఋణములు, కటుకములు (త్రికము), కరణములు, కర్తృత్రయము (ప్రకృత్యాది), కర్మలు (కాయికాది), కర్మలు (పుణ్యాది), కర్మలు (ఆగామ్యాది), కవులు, కాండములు, కార్యములు, కాలములు (ఉదయాది), కాలములు (త్రిషవణము = గ్రీష్మాది), కావ్యదోషములు, కావ్యపాకములు (పాకములు), కావ్యరీతులు (రీతులు), కుంభకారత్రయము, కైస్తవత్రిపుటి, క్రియాకాలములు, క్రియలు, క్షారములు, గజజాతులు (జాతులు), గయత్రీమంత్రత్రిపాదములు, గుణములు (త్రైగుణ్యము), గురువులు, చిత్రమూలాది, జాతకములు (ఏలకులు మొ.), జ్ఞానములు, తత్త్వములు, తాపములు, త్రికము (శొంఠి మొ.), త్రిదండము (మనోదండాది 1-2), త్రిదోషములు, దండములు (మనోదండాది), దండలు, దశలు, దీక్షలు, దేవత్రయము, దేవీత్రయము, దేహములు, (లక్షణములకు గలిగెడు) దోషములు, ద్విజులు, ధనగతులు, నాడీక్రియలు, నాకలు, నాయకులు (దేవాది), నాయకులు (పతి మొ.), నాయికలు, నేత్రములు (జ్ఞానాది), నేత్రములు (భ్రూమధ్యాది), పత్రములు (లవంగపత్ర్యాది), పాపములు, పునర్నవాత్రయము, పురుషములు, పూర్వరాగము (కుసుంభ, నీలి, మంజిష్ఠములు), ప్రకృతులు (శ్లేష్మాది), ఫలములు (త్రికము), బంధనములు, భక్తులు, భేదములు, మండలములు, మతములు, మదములు, మధువులు, ముక్తులు, మూర్తులు, మౌనములు, యతులు, రాజముఖ్యగుణములు, రాములు, లక్షణలు (లక్షణములు), లక్ష్యములు, లయలు, లవణములు, లింగములు (శ్రీలింగాది), లింగములు (శ్రీశైలాది), లోకములు (స్వర్గాది), లోకములు (పృథివ్యాది), వర్గములు, వాసనలు, విధులు, వృత్తులు, వృద్ధులు, వేదములు (త్రయి), వేదస్వరములు, వైద్యశాస్త్రస్కంధములు, వైరాగ్యములు, వ్యంజనములు, వ్యాహృతులు, శక్తులు (జననము మొ.), శక్తులు (సిద్ధులు) (ఉత్సాహాది), శక్తులు (ఇచ్ఛాది), శక్తులు (జీవనదాత్ర్యాది), శత్రువులోడి సంధులు, శాస్త్రములు, శుద్ధులు, సంగములు, సంహితలు, సింహాసనములు, సిద్ధిత్రయము, సుఖములు, సూత్రత్రయము (యజ్ఞోపవీతము లోనగునవి), స్థానములు, స్వరములు, స్వాధ్యాయము (వాచికాది) (ఇందుగల పదములకు 'త్రి' చేర్చి యుచ్చరింపవలెను— త్రిమూర్తులు, త్రిలోకములు: త్రిగుణములు మొ.): చూ, మూఁడు అంకములు గలవి.

త్రయరాశికము, పా: చూ, రూ-త్రైరాశికము.

త్రయి, సం. వి. ఈ. స్త్రీ 1. ఋగ్యజుస్సామవేదములు (చూ, వేదము): చూ, త్రయము; 2. మూఁటిసమూహము: చూ, త్రయము; 3 ఏనుఁగుకాలి సంకెల: చూ, శృంఖలము. 2; 4. కుటుంబముగల ఆఁడుది: చూ, స్త్రీ; 5. మంచిమనస్సుగల ఆఁడుది: చూ, స్త్రీ: అం. 6. ధర్మాధర్మములు తెలిపెడు శాస్త్రము, రాజవిద్యలు నాలుగింటిలో నొకటి: చూ, విద్యలు: (చూ, ఆన్వీక్షకి.)

త్రయీతనువు, సం. వి ఉ. పుం: చూ, సూర్యుఁడు.

త్రయీధర్మము, సం. వి. అ. పుం. వేదవిహితధర్మము.

త్రయీషిత, అం: చూ, ఏకవింశతి స్థానకములు.

త్రయోదశము, సం. స. పదుమూఁడవది.

త్రయోదశి, సం. వి. ఈ. స్త్రీ. 1. పక్షమునందు పదుమూఁడవ తిథి: చూ, తిథులు-తిథి; 2. పదుమూఁడు తంతులుగల పరివాదిని యను వీణె. చూ, వీణె; విణ. 3. పదుమూఁడవది; అం. 4: చూ, తతవాద్యములు; అం. 5. చూ, తిథి.

త్రవు, దే. స. క్రి: చూ, రూ-త్రవ్వు. (పుట్టుపూర్వోత్తరములనెత్తు. భార. ఉద్యో. 1. ఆ. 311.)

త్రవుకోల, దే. వి: చూ, రూ-త్రవ్వుకోల.

త్రవ్వ, దే. వి రెండుసోలలు: చూ, రూ-తవ్వ.

త్రవ్వటము, దే. వి త్రవ్వుట. కళా. 4, ఆ. 78.

త్రవ్వితలకెత్తుట, జా నిశ్శేషముగా నిచ్చుట. హెచ్చుగా నిచ్చుట, అమితలాభము గలిగించుట. "కొమరులుపుట్టి తమకేమో యట్టె త్రవ్వి తలకెత్తెదరను చిత్తంబులో" (ధర్మజ రాజసూయము; "తమకు నేమి త్రవ్వితలకెత్తి రమరులీ, యుర్విమనుజు లేమి యొసఁగరైరి." (వైజయంతీ విలాసము.)

త్రవ్వితఁబోసికొనుట, జా. పూర్వపుసంగతులను మరల జ్ఞప్తికిఁ దెచ్చుకొని యదియే యాలోచించుట. "లేనిపోనివి త్రవ్వితఁబోసికొననేల?" (ధర్మజరాజసూయము.)

త్రవ్వు, దే. స. క్రి. రూ- త్రవు- త్రవ్వటించు. 1. ఖననము చేయు; 2. ఖండించు : చూ, నెఱుగు; 3. పుట్టుపూర్వోత్తరములనెత్తు; 4 ప్రస్తావనకుఁదెచ్చు; వా. 5. (మొక్కలకు గొప్పులు) త్రవ్వు; 6. (కొంపలు కట్టుటకును తీయుటకును గోతులు) త్రవ్వు.

త్రవ్వుకోల, దే వి. రూ- త్రవుకోల - తవుకోల - తవ్వుగోల : చూ, ముద్గరము.

త్రవ్వువాఁడు, వా విణ: చూ, రూ- త్రవ్వెడువాఁడు.

త్రవ్వెడువాఁడు, వా. విణ. రూ- త్రవ్వువాఁడు (సం.ప.) — ఖనకుఁడు, ఖాతకుఁడు.

త్రసకము, సం. వి అ. న. గడ్డిపరక : చూ, తృణము. 1.

త్రసము, సం. విణ. తిరుగునది : చూ, వలమానము. 1.

త్రసరము, సం. వి అ. పుం, రూ - తసరము. పంటెకఱ్ఱ, నూలుచుట్టుట (అనికొందఱు) : చూ, మగ్గము.

త్రసరేణువు, సం. వి. ఉ. స్త్రీ. 1. సంజ్ఞాదేవి; పుం. 2 ముప్పది పరమాణువుల కొలఁది.

త్రస్త, అం. : సంచారిభావమునఁ బుట్టిన దృష్టులు.

త్రస్తము, సం. విణ. భయపడినది : చూ, భీతము.

త్రస్తరి, దే. వి. ఆట : చూ, పరిహాసము.

త్రస్తరించు, దే. అ. క్రి. పరిహాసమాడు : చూ, పిసాళించు.

త్రస్నువు, సం. విణ. భయపడువాఁడు: చూ, వెఱపరి.

త్రస్స, దే. వి. వేదాధ్యయనము చేయునపుడు నోటనుండి రాలెడు తుంపర, బ్రహ్మబిందువు : చూ, ప్రుస్స.

## త్రా

త్రాఁచు, దే. వి. రూ- తాఁచు. పడగదారి : చూ, సర్పము (త్రాఁచులలో భేదములు- నల్లత్రాఁచు, తెల్లత్రాఁచు, గోధుమత్రాఁచు, మొ.)

త్రాగు, దే. స. క్రి: రూ-త్రావు, ఆను, ఆరగించు, కుడుచు-రూ-కుడుచు, క్రోలు, త్రెక్కొను, నిముకు. (సం ప.)—అనుభవించు.

త్రాగుబోతు, వా. వి కల్లు సారాయి బ్రాందిలోనగువాని నెల్ల ప్పుడు పానముచేయువాఁడు.

త్రాగుడు, దే. వి. రూ-త్రావుడు: చూ, పానము. 1.

త్రాడు, దే. వి. 1. కిరణము: చూ, హాయనము. 2; 2. రూ-తాడు. పేనినదారము, పాశము: చూ, సూత్రము. 1; 3. రాశి. *. సాం.బ. స్థా. 3: చూ, త్రిరాశము; 4. రూ-తాడు. చేప: చూ, సూత్రము. 1; వా. 5. మంగళసూత్రము. "నా త్రాడుగట్టిదిగాన నాభర్త 99 ఏండ్లు జీవించెను." (బ. త్రాడులు-త్రాళులు-త్రాళ్లు.)

త్రాడుతాఁబుపు, దే. వి. వాశి. అచ్చ. సుం. కాం. 41: చూ, వరుణుఁడు. 1.

త్రాడుబారుట, జా. దృఢత్వమునొందుట; నష్టదైన్యము లేకుండుట. "తావకాపరాధములు కంఠంబుగలదె త్రాడు బారెడు దౌష్ట్యంబుఁ దవులుకతన." (శ్రీనివాస విలాసము.)

త్రాడువడు, ద్వ. అ. క్రి. 1. కృశించు: చూ, సొటసొటవోవు; 2. దారమగు.

త్రాణ, వై. వి. = ద్రవిణమ్-బలము: చూ, శక్తి. 1.

త్రాణము, సం. వి. అ. న. 1. కలుఁగానుగు*: చూ, వార్షికము. 1; 2. కాపు: చూ, రక్షణము; విణ. 3. రూ-త్రాతము. కాపఁబడినది: చూ, రక్షితము.

త్రాత, సం. వి. ఋ. పుం: చూ, రక్షకుఁడు.

త్రాతము, సం. విణ: చూ, రూ-త్రాణము. 3.

త్రాపుషము, సం. విణ. త్రపువుచేత చేయఁబడినది.

త్రాపుసము, సం. వి. అ. న: చూ, రూ-త్రపుసము.

త్రాయంతి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, త్రాణము. 1. *; 2 = తాయి. తల్లి: చూ, మాత 1; విణ. 3. కాపఁబడుచుండునది: చూ, రక్షితము.

త్రాయమాణ, సం. వి ఆ స్త్రీ: చూ, త్రాణము. 1. *.

త్రావణ, అం. 1; చూ, పంచమజభాషలు (చూ, భాష. 1.); 2: చూ, భిన్నషడ్జకజభాషలు (చూ, భాష. 1.)

త్రావు, దే. స. క్రి: చూ, రూ-త్రాగు. భార. ఉద్యో. 4, ఆ. 95.

త్రావుడు, దే. వి: చూ, రూ త్రాగుడు.

త్రాసము, సం. వి. అ. పుం. 1. భయము: చూ, వెఱపు; 2. మణిదోష విశేషము; చూ, రత్నము. 1; అం. 3: (చిత్తరువునందు వ్రాసిన మన్మథునిఁగాంచి యయ్యింతి బెదురు చూపులతో దవ్వునం బోవసాఁగెను): చూ, సంచారీభావములు.

త్రాసు, దే. వి: రూ-తరాజు, తరాసు. (సం. ప).—ఆరాచి-నారాచి, ఏషణి-ఏషణిక, తుల, త్ర్యంకటము, నారాచి. తద్వి—తక్కెడకు.—తక్కెడ—రూ-తక్కిడి-తెక్కెడ, దడ (సం.ప.) ప).—ధటము. పెద్దతక్కెడకు.—కాటా.

త్రాసురాశి, ద్వ. వి. తులారాశి: చూ, రాశి 1.

త్రాళ్ళరాశిగాఁడు, ద్వ. వి: ఎలికె: చూ, మూషికము.

త్రాసుగడ, వా. వి: చూ, తునికోల.

# త్రి

త్రి, సం. స. = తీ: చూ, మూఁడు.

త్రింశత్తు, సం. స. త్. స్త్రీ. 1: ముప్పది; అం 2: చూ, ముద్దిపూస.

త్రింశము, సం. స. ముప్పదవది.

త్రిక, సం. వి. ఆ స్త్రీ నూతిగిరక: చూ, రాట్నము.

త్రికంటకము, సం. వి. అ. పుం. 1: చూ, ములువె...*; 2. పెద్దపల్లేరు*: చూ, పల్లేరు; 3. లఘుగర్గము, ఏనుఁగు పల్లేరువంటిచేప: చూ, మత్స్యము. 1.

త్రికకుత్తు, సం. వి. ద్. పుం. 1. త్రికూటాద్రి: చూ, పర్వతము; 2. వెన్నుఁడు; చూ, విష్ణువు. 1; 3. అభినయహస్త విశేషము: చూ, వ్యంజకము. 1.

త్రికటుకము, అం. సొంటిపిప్పలిమిరియాలు: చూ, త్రయము. (గళరోగగుల్మ పీనసములను హరించి దీపనపాచక శక్తి నిచ్చును.)

త్రికటువు, —వై.—

త్రికము, సం. వి. అ. న. 1. = లిప. మూఁడింటిసమూహము: చూ, త్రయము. 1; 2. = తికము-రూ-టికము: చూ, ముద్దిపూస; 3: చూ, త్రికటుకము; 4. కరణ రాడి యుక్తి...: చూ, త్రయము. 2; 5. మూఁడుదారులు కలయుచోటు: చూ, మార్గము. 1; వా. 6. షష్ఠాష్టమవ్యయములు; 7. కావ్యలక్షణము. — సంఖ్యాబద్ధమగు ముక్తకాదికములలో నొకటి: చూ, మహాకావ్యము. (చూ, దండకము. 7.)

త్రికరణములు, అం. మనస్సు, వాక్కు, కాయము. (చూ, త్రయము.)

త్రికాష్ఠి, సం. వి. ఇ. న. = త్రిక్కటి: చూ, బాణము. 1.

త్రికూటము, సం. వి. అ. న. 1. ఇందుప్పు: చూ, లవణము. 1; పుం. 2: చూ, త్రికకృత్తు. 1.

త్రికోణము, సం. వి. అ. న. మూఁడుమొనలు కలసినరూపము, త్రిభుజము, ముక్కోణము: చూ, కోణము, కోణమానము.

త్రిక్క, దే. వి: చూ, రూ-తిక్క. 1—2; ద్ర. 3 వినార్థము: చూ, విరా.

త్రిక్కటి, వై. వి. = : చూ, త్రికాష్ఠి.

త్రిక్కు, వై. వి. 1 = రక్క. మోసము; చూ, వంచన; దే వి. 2. చిక్కు, బాధ: చూ, శోకము; అ. క్రి 3. తక్కు, తప్పు, గెంటువడు; చూ, మిడివోవు.

త్రిగర్త, సం. వి ఆ. స్త్రీ: చూ, ఱంకులాఁడి.

త్రిగర్తము, సం. వి. అ. పుం. త్రిగర్తదేశము: చూ, దేశము.

త్రిగుణ, సం. వి. ఆ. స్త్రీ. ముయ్యాకుపొన్న *: చూ, సాలపర్ణి.

త్రిగుణములు, అం: చూ, త్రయము, గుణములు.

త్రిగుణాకృతము, సం. విణ మూఁడుచాళ్లదున్నినది (పొలము): చూ, భూమి. 1.

త్రిపుటము, సం. వి. అ. పుం. = తెగడ*: చూ, సర్వానుభూతి.

త్రిజాతములు, అం. ఏలకులు, లవంగాలు, దాల్చినిచెక్క. (చూ, త్రయము.)

త్రిణత, సం. వి ఆ. స్త్రీ. రూ-తృణత. 2.

త్రితయము, సం. స: చూ, త్రి.

త్రిదండము, అం. పుం. 1. మనోదండము, వాగ్దండము, కర్మదండము అను మూడుదండములుగల సన్న్యాసాశ్రమము: చూ, త్రయము; అం. న. 2. మనోదండము, వాగ్దండము, కర్మదండము; చూ, త్రయము.

త్రిదండి, సం. వి. న్. పుం. మనోదండ, వాగ్దండ, కర్మదండము లను మూడుదండములుగల సన్న్యాసి: చూ, సన్న్యాసి. 1.

త్రిదశాయుధము, సం. వి. అ. న. ఇంద్రుని వజ్రాయుధము; చూ, బాణము. 1.

త్రిదశాలయము, సం. వి. అ. పుం: చూ, స్వర్గము.

త్రిదశుఁడు, సం. వి. అ. పుం. దేవత: చూ, వేల్పు.

త్రిదివ, సం. వి. ఆ. స్త్రీ. త్రిదివ అను ఏఱు: చూ, నది.

త్రిదివము, సం. వి. అ. పుం: చూ, స్వర్గము.

త్రిదివేశుఁడు, సం. వి. అ. పుం: చూ, త్రిదశుఁడు.

త్రిదోషజము, అం. ఏనుఁగుయొక్క త్రిదోషజనితజ్వరము. (ఇవి మూఁడు. — పిత్తజ్వరము, పాలకము, కూటపూర్వము అనునవి.)

త్రిదోషము, అం. 1. వాతపిత్తశ్లేష్మములు: చూ, త్రయము; 2. లక్షణములకు గలిగెడివి - అతివ్యాప్తి, అవ్యాప్తి, అసంభవము: చూ, త్రయము.

త్రిద్యుస్పృక్కు, సం. వి. క్. పుం. మూఁడువారములు కూడిన తిథి, అవమము. (చూ, తిథి. 5.) చూ, వారము.

త్రిధాముఁడు, సం. వి. న్. పుం. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2. వెన్నుఁడు; చూ, విష్ణువు. 1; 3: చూ, శివుఁడు; 4: చూ, యముఁడు; 5. గణపతి: చూ, వినాయకుడు. 1.

త్రినగము, సం. వి. అ. పుం. = తెనుఁగు; చూ, తెనుఁగు.

త్రినేత్రక్రియ, అం. క్రియాంగములు పండ్రెండింటిలో నొకటి. (చూ, అంగము. 9): చూ, క్రియాంగములు.

త్రినేత్రచూడామణి, సం. వి. ఇ. పుం. చంద్రుఁడు: చూ, హిమాంశువు.

త్రిపతాకము, సం. వి. అ. న. 1. మూఁడురేఖలుగలనొసలు; పుం. 2. అభినయహస్తవిశేషము. (బొటనవ్రేలినివంచి చూపుడువ్రేలి మొదటఁగూర్చి యుంగరపువ్రేలిని వంచి కడమవ్రేళ్ళను జాఁచిపట్టినది); అం. 3. చూ, అసంయుతహస్తములు.

త్రిపథగ, సం. వి. ఆ. స్త్రీ. గంగానది, ముత్రోవద్రిమ్మరి: చూ, నది. 1.

త్రిపద, అం. 1. ఒకానొకవృత్తము. ఒక్కొక్క పాదమునందు నాలుగు ఇంద్రగణములుగలిగి మూఁడవ గణాద్యక్షరము యతిగాఁగలవృత్తము: చూ, వృత్తము 1; 2. చిత్రకవిత్వము నందొకటి. ఉదా — "దేవమునివంద్యగోవింద - దితిజహరణ, పుండరీకాక్ష యవ్యక్త-పుణ్యపురుష, యమరసన్నుతగోపాల-హరిముకుంద, దేవ యవ్యక్త హరియునాఁ-ద్రిపదయయ్యె.": చూ, వృత్తము. 1.

త్రిపది, సం. వి. ఈ. స్త్రీ. ఏనుఁగుకాలిసంకెల: చూ, శృంఖలము. 2.

త్రిపర్ణిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, సాలపర్ణి. *.

త్రిపాత్తు, సం. వి. ద్. పుం: చూ, విష్ణువు. 1.

త్రిపుండ్రకము, సం. వి. అ. న. నొసటనుంచిన విబూదిలోనగు వాని మూఁడురేఖలు; త్రిపుండ్రము.

త్రిపుండ్రము. సం. వి. అ. న.—పై.—

త్రిపుట, సం. వి. ఆ. స్త్రీ. 1. చిట్టేలకి *: చూ, పత్రల; 2. తెల్లతెగడ*: చూ, సర్వానుభూతి; 3. చూ, మల్లె *; 4. చూ, బొల్లిబూసర*; అం. 5. (రూ-త్రిపుటము,): చూ, సూడకములు. (ఇదె సప్తతాళములలో నొకటి: చూ, తాళములు, తాళము. 2,): చూ, స్వరము. 2.

త్రిపుటము, సం. వి. అ. పుం. 1. ఏడక్షరములకాలము: చూ, త్రిపుట. 5; 2. తీరము: చూ, రోధస్సు; 3. నాడి; చూ, నరము. (1).

త్రిపుటీఫలము, సం. వి. అ. న. ఆముదము *; చూ, వ్యడంబకము.

త్రిపురదహనుఁడు, సం. వి అ. పుం: చూ, శివుఁడు.

త్రిపురము, సం. వి. అ. న. 1. మయునిచే నిర్మింపఁబడిన మూఁడుపురములు: చూ, దేశము; పుం. 2: చూ, బంగి.*.

త్రిపురాంతకుఁడు, సం. వి. అ. పుం; చూ, శివుఁడు. (ఇతనికి త్రిపురసంహారమపుడు తేరు భూమి, చక్రములు సూర్యచంద్రులు, గుఱ్ఱములు వేదములు, చాపము మేరువు, నారి శేషుఁడు, బాణము విష్ణువు అయ్యెను)

త్రిపుష్పి, సం. వి. ఈ. స్త్రీ. నల్లఉమ్మెత్త *: చూ, హాలాపుష్పము.

త్రిప్పట, దే. వి. రూ-త్రిప్పు-త్రిమ్మట: చూ, విహారము. 1.

త్రిప్పరి, దే. విశే. (త్రిప్పు + అరి.) రూ-త్రిమ్మరి-త్రిమ్మరీఁడు-దిమ్మరి: చూ, దిమ్మరీఁడు.

త్రిప్పికొను, దే. అ. క్రి. 1. తిరిగికొను: చూ, వక్రిల్లు; ప్రే. 2: త్రిప్పికొలుపు.

త్రిప్పియాడు, దే. ప్రే. (త్రిప్పి + ఆడు) తిరుగఁజేయు, త్రిప్పు, మలపు. భార. శల్య. 1, ఆ. 317: చూ, మురించు. (స్వార్థమునఆడు.)

త్రిప్పు, దే. వి. 1 తిరుగుడు. లక్ష్మి. 5, ఆ. 172: చూ, విహారము 1; ప్రే. 2: చూ, త్రిప్పియాడు. జై. 5. ఆ. 173. (తలత్రిప్పు, ఒడలుత్రిప్పు, గానుగత్రిప్పు, చక్రముత్రిప్పు ఇత్యాదులూహ్యంబులు.)

త్రిప్పుడుత్రాడు, దే. వి; చూ. తిరుగుడుత్రాడు.

త్రిప్పుత్రాడు, దే. వి: చూ, తరిత్రాడు.

త్రిప్పుళ్ళు, వా. వి. బ. 1. తిరుగుటలు; 2: చూ, బాలక్రీడ.

త్రిప్రాస, అం. హ్రస్వాక్షరమున కవ్వల నొకటి రెండక్షరములు. తక్కిన పాదములందుఁ గూడఁగూర్చి చెప్పినచో వానిని ద్విప్రాస, త్రిప్రాసములందురు.

త్రిఫల, సం. వి. ఆ. స్త్రీ. రూ-తృఫల-త్రిఫలి. 1. కరకతాడియుసిరికలు: చూ, త్రయము; 2. ద్రాక్షాకాశ్మర్య ఖర్జూర ఫలములు: చూ, త్రయము; 3. జాజీలవంగపూగ ఫలములు: చూ, త్రియము.

త్రిఫలములు. ఆ. కరక తాడి ఉసిరికలు: చూ, త్రయము.

త్రిబాహువు, అం, చూ, ప్రచారములు.

త్రిభంగి, అం. 1. మాలికావృత్తములలో నొకటి. న, న. న, న, న, న, స, స, భ, మ, స, గ. 2—10—18

అక్షరములు ప్రాసయతి మున్నగుట. "వెస మనిచెడు దొర, ఓసరుహనయన య, నిసతము వేడ్క- భజింతు న్వినుతింతు న్సత్కీర్తిచలంతున్", చూ, వృత్తము. 1; అం. 2. చూ, జన్యతాళములు,

త్రిభండి, సం. వి. ఈ. స్త్రీ. తెల్లతెగడ*: చూ, సర్వానుభూతి.

త్రిభద్రకము, సం. వి. అ. న. రతి: చూ, సంయోగము.

త్రిభద్రము, —పై.—;

త్రిభిన్నము, అం. 1; చూ, జన్యతాళములు; 2: చూ, గమకములు.

త్రిముఖ, సం. వి. ఆ. స్త్రీ. బుద్ధుని తల్లి. చూ, బుద్ధుడు. 1.

త్రిమూర్తి, స. వి. ఇ. పుం. 1. బ్రహ్మ విష్ణువు మహేశ్వరుడు అను పేళ్ళుగల మూడుశరీరములు గలవాడు: 2; చూ, బుద్ధుడు. 1.

త్రిమూర్తులు, అం, బ్రహ్మవిష్ణుమహేశ్వరులు.

త్రిమ్మట, దే. వి. 1; చూ. రూ-త్రిప్పట, 2. ఆపద: చూ, విపత్తు.

త్రిమ్మటకాడు, దే. విశ: చూ, త్రిప్పరి. భార. ఉద్యో. 4, అ. 213.

త్రిమ్మరి, —పై.—

త్రిమ్మరీడు, (త్రిమ్మరి + ఈడు) —పై.—వసు. 3. అ. 137,

త్రిమ్మరు, దే. అ. క్రి. 1: చూ, సంచరించు; స. క్రి. 2. చుట్టి వచ్చు.* భార. ఆర. 3, అ. 23: చూ, వలగొను.

త్రియంబకుడు, సం. వి. అ. పుం: చూ. రూ-త్ర్యంబకుడు. (వాడుక.)

త్రియామ, సం. వి. ఆ. స్త్రీ. 1. రాతిరి: చూ, రాత్రి; 2. వసువు: చూ, వర్ణము. 6; 3. యమునానది: చూ, నది.

త్రిరాత్ర, సం. వి. ఆ. స్త్రీ. ముట్టుది: చూ, రజస్వల,

త్రిరాత్రకృచ్ఛ్రము, అం. మూడుదినము లుపవసించుట. చూ, కృచ్ఛ్రము.

త్రిరాత్రము, సం. వి. అ. న. 1. మూడురాత్రులు. చూ, రాత్రి: పుం. 2. ఒకానొక యాగము: చూ, యజ్ఞము; 3. పట్టణమునందలి వెదురుపొద,

త్రిరేఖాస్వితగ్రీవ, అం. రాజుభార్యయయ్యెడు మగువకు గురుతు: చూ, లక్షణము. 1.

త్రిలక్షణములు, అం. జహల్లక్షణము, అజహల్లక్షణము, జహదజహల్లక్షణము.

త్రిలింగము, సం. వి. అ. పుం. 1= తెలుగు: చూ, తెనుగు; అం. 2: చూ, దేశములు.

త్రిలింగములు, అం. స్త్రీలింగ పుంలింగ నపుంసకలింగములు (3).

త్రిలోకములు, అం. స్వర్గమర్త్యపాతాళములు.

త్రిలోకి, సం. వి. ఇ. పుం: చూ, త్రైలోక్యము,

త్రిలోచన, సం. వి. ఆ. స్త్రీ. బౌద్ధదేవి: చూ, స్వాహా. 2,

త్రిలోచనుడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుడు. (ఇట్లు త్రినేత్రుడు.)

త్రివత్సము, సం. వి. అ. పుం. మూడేండ్లకోడెదూడ: చూ, వృషభము. 1.

త్రివర్గము, సం. వి. అ. పుం. 1 ధర్మార్థకామములు : చూ, త్రయము; 2 సత్త్వరజస్తమములు: చూ, త్రియము;

3 క్షయస్థానవృద్ధులు: చూ, త్రయము; 4. త్రికటుకములు: చూ, త్రయము; 5. త్రిఫల: చూ, త్రయము.

త్రివర్ణము, అం. (చూ, అలంకారము. 3): చూ, ఆరోహికవర్ణ గరాలంకారములు.

త్రివిక్రమాయనమః, అం. (త్రివిక్రమః = త్రిలోకాన్ విశేషేణ క్రామతి = వ్యాప్నోతి) సకలజగత్తును వ్యాపించియుండు వస్తువు కొఱకు నమస్కారము: చూ, ఓమ్.

త్రివిక్రమము. అం. చూ, ఉత్తాన కరణబంధములు.

త్రివిక్రముడు, సం. వి. అ. పుం. మూడు లోకము లను మూడు అడుగులుగా కొలిచిన విష్ణువు: చూ, విష్ణువు. 1.

త్రివిష్టపము, సం. వి. అ. న: చూ, స్వర్గము.

త్రివృత, సం. వి. ఆ. స్త్రీ = తెగడ. రూ-త్రివృత్తు. తెల్లతెగడ*: చూ, సర్వానుభూతి.

త్రివృత్తు, సం. వి. త్. స్త్రీ —.పై.—

త్రివేణి, సం. వి. ఈ. స్త్రీ. గంగ: చూ, నది.

త్రివేత్రుడు, సం. వి. అ. పుం: చూ, శివుడు.

త్రిశంకువు, సం. వి. ఉ. పుం. 1. ఒకానొకరాజు: చూ, రాజు. 1; 2 పిల్లి. చూ, మార్జాలము; 3. మిడుత: చూ, శలభము.

త్రిశంకుస్వర్గము, లో. రెంటివిధములుగా చెడినవానియెడ వాడుదురు.

త్రిశంకుజుడు, సం. విశ. హరిశ్చంద్రమహారాజు: చూ, రాజు 1.

త్రిశరణుడు, సం. వి. అ. పుం: చూ, బుద్ధుడు. 1.

త్రిశిఖము, సం. వి. అ. న. 1. త్రిశూలము: చూ, ముమ్మొనవాలు; 2. కిరీటము: చూ, భూషణము. 2.

త్రిశిఖుడు, సం. వి. అ. పుం. త్రిశిఖుడను రక్కసుడు: చూ, రాక్షసుడు. 1.

త్రిశిరఃపురి, సం. వి. ఈ. స్త్రీ. = తిరిచినాపల్లె ఒకపట్టణము: చూ, దేశము.

త్రిశిరుడు, సం. వి. అ. పుం. కుబేరుడు: చూ, శ్రీదుడు.

త్రిశూలము, సం. వి. అ. న. 1: చూ, త్రిశిఖము. 1; అం. 2. (ముమ్మొనవాలు): చూ, ముప్పదిరెండాయుధములు: (చూ, బాణము. 1); 3: చూ, అసంయుతహస్తములు; 4: చూ, దిక్పాలాయుధములు.

త్రిశూలిని, సం. వి. ఈ. స్త్రీ. గంజాయి*: చూ, బంగి.

త్రిశృంగము, సం. వి. అ. పుం. పరికెగడ్డ: చూ, శృంగాటకము. 2.

త్రిశ్రము, అం: చూ, తాళజాతులు.

త్రిషవణము, అం. 1. మూడుసవనములు (ప్రాతస్సవనము, మధ్యందినసవనము, సాయంసవనము: (చూ, త్రయము): చూ, సవనము; 2. మూడుకాలములు: చూ. త్రయము,

త్రిష్టుప్పు, సం. వి. భ్. స్త్రీ. రూ-త్రిష్టుక్కు-త్రిష్టుభము. 11 వ ఛందస్సు: చూ, ఛందస్సులు.

త్రిసంధ్యము, సం. వి. అ. న. పూర్వాహ్ణమధ్యాహ్నాపరాహ్ణ సంధ్యలు: చూ, సంధ్యలు.

త్రిసర, సం. వి. ఆ. స్త్రీ నువ్వులు ఓయ్యాను ఉద్దులుపోసి చేసిన పులగము: చూ, సాదము. (1).

త్రిసీత్యము, సం. విశ. మూడుచాళ్ళు దున్నినది (పొలము): చూ, భూమి. 1,

త్రిసూత్రము. సం. వి. అ. న. 1. బ్రహ్మసూత్రము చూ, సూత్రము. 1; పుం. 2. పద్మమువలె అఱురేఖలుగల వైదూర్యము: చూ, రత్నము. 1.

త్రిస్థానగమకప్రౌఢి, అం. చూ, సుగుణములు.

త్రిస్రోత, సం. వి. స్. స్త్రీ. 1. (మూఁడు ప్రవాహములుగలది) గంగానది: చూ, నది; 2. ఒకానొకనది: చూ, నది.

త్రిస్వరములు, అం. ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము. (3): చూ, త్రయము.

త్రిస్వరయుక్త రాగములు, అం. సామికములు: చూ, రాగములు

త్రిహల్యము, సం. విణ: చూ, త్రిసీత్యము.

త్రిహాయణి, సం. వి. ఈ. స్త్రీ మూఁడేండ్లపెయ్య: చూ, ధేనువు

## త్రు

త్రుగు, దే అ. క్రి. 1. చచ్చు. సాంబ. మా. 36. చూ, సమయు; 2. తునుకలగు. భార ద్రో. 5. ఆ. 339: చూ, వ్రక్కలౌ; 3: చూ, నశించు.

త్రుగుట. దే వి: చూ, (సాపు.) అం, భా. ద్వి 225.

త్రుంగుడు, దే. వి. 1. ప్రళయము: చూ, సంవర్తము. 1; 2. నాశము: చూ, రుత.

త్రుఁగుడువడు, ద్వ. అ. క్రి: చూ, నశించు.

త్రుంచు, దే స క్రి. 1. చంపు. అం, భా. తృ. 123: చూ, సంహరించు; ప్రే. 2. తునుకలుచేయు; 3. చంపు: చూ, సంహరించు; 4. ఉత్తరించు: చూ, ఛేదిల్లు.

త్రుంచుట, దే వి. హింస. అం, భా. ద్వి. 224: చూ, వధము.

త్రుంపు, వై. వి. = త్వష. తునుక. రూ-త్రుంపుడు జై 5, ఆ. 192: చూ, శకలము. 4 (దేశ్యమని శ. ర.)

త్రుంపుడు, —వై.— (దేశ్యమని శ. ర.)

త్రుళ్ళు, దే. వి. 1. త్రుళ్ళు, గర్వము: చూ, హంకారము; 2. చిలుము: చూ, లోహము. 1.

త్రుటనము, సం. వి. అ. న. తెగుట, చచ్చుట: చూ, మరణము

త్రుటి, సం. వి. ఇ. స్త్రీ 1. లఘ్వక్షరముయొక్క చతుర్థభాగోచ్చారణము చేయునంతటి కాలము: చూ, కాలము; 2. ఇంచుక: చూ, స్వల్పము; 3: చూ, సంశయము; 4 చిట్టేలకి*: చూ, పత్రలు.

త్రుటితము, సం. విణ. తెగినది: క్రోధము.

త్రుట్టియ, దే. వి. రూ-త్రుట్టె. వర్గము: చూ, సమూహము,

త్రుట్టె, —వై.— (త్రుట్టెలుగట్టి=గుమిగూడి)పాంచు. 5, ఆ. 2:6,

త్రుప్పు, దే. వి. 1. రూ-తుప్పు. ఇనుముమీఁది ముటికి. పాడు. 1, ఆ. 182: చూ, లోహము. 1; 2. రుచిలేమి. స్వా. 2, ఆ. 11: అరుచి, అరోచకము.

త్రుప్పుడు, దే. వి. పశుపక్ష్యాదుల మేని రోమము, ఉన్ని. భార. విరా. 5, ఆ. 239; జై. 1, ఆ 45: చూ, వెండ్రుక. 1.

త్రుమ్మ, దే. వి. రూ- తుమురు- త్రుమ్మ- దుమారము, ధూళి: చూ, రేణువు. 1.

త్రుస్సు, దే వి నీళ్ళుచిమ్ముటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

త్రుళుమింత, వ్యా. వి. పెరుగుట: రూ-త్రుళ్ళుమింత- త్రుళ్ళగింత.

త్రుళ్లగించు, దే. అ. క్రి. ఎగురు: చూ, లంఘించు.

త్రుళ్లగింత, దే. వి: చూ, రూ-త్రుళుమింత.

త్రుళ్లడంచు, దే. స. క్రి. చంపు: వేం. అం. 52: చూ, సంహరించు.

త్రుళ్ళాట, వా. వి క్రీడ: చూ, విలాసము. 1.

త్రుళ్లింత, దే. వి. 1. ఎగిరిపాటు: చూ, విజృంభణము; 2. గర్వము: చూ, హంకారము.

త్రుళ్ళియాడు, దే. అ. క్రి. 1. ఎగిరిపడు: చూ, లంఘించు; 2. గర్వించు: చూ, హంకరించు. (స్వార్థమున ఆడు.)

త్రుళ్ళు, దే. వి. 1. గర్వము. చూ, హంకారము; 2. ఎగిరిపాటు: చూ, విజృంభణము; అ. క్రి. 3 గర్వించు: చూ, హంకరించు; 4. ఎగిరిపడు: చూ, లంఘించు; 5. చచ్చు. సాంబ. మాన. 36: చూ, మరణించు.

త్రుళ్లుఁబోతు, దే. విణ త్రుళ్లునట్టి స్వభావముగలవాఁడు.

త్రుళ్ళుపిండి, ద్వ. వి. స్ఫోటకము కనిపించినప్పుడు పోలేరమ్మకు కొట్టిపెట్టెడు పిండి; చూ, సాదము. (1).

త్రుళ్ళుమింత, దే. వి: చూ, రూ-త్రుళుమింత.

## త్రె

త్రెంచు, దే. ప్రే: చూ, రూ—తెంచు.

త్రెంపు, —వై.—

త్రెక్కొట్టు, దే. అ. క్రి. ఎగఁదట్టు.

త్రెక్కొను, దే. స. క్రి. 1. చెరచు—రూ చెఱచు. తొలఁగు. భార. అర. 6, ఆ. 192; 2. చంపు. భార. భీష్మ. 3, ఆ. 306; చూ, సంహరించు; 3. కలఁచు, కలఁచియాడు, కలగుండువెట్టు, చోపు, తటమటించు. జై. 5, ఆ 169; 4 కబళించు: చూ, మ్రింగు; 5: చూ, త్రాగు. భార. విరా. 5, ఆ. 58.

త్రెక్కోలు, దే. వి. త్రెక్కొనుట.

త్రెక్కోలుకొను, దే. స. క్రి చంపు: చూ, సంహరించు.

త్రెగు, దే. అ. క్రి: చూ, రూ-తెగు.

త్రెడ్డు, వై. వి =: చూ, రూ-తెడ్డు.

త్రెయ్యు, దే. అ. క్రి: చూ, రూ-తెగు.

త్రెవ్వన, దే వి. చక్కన: చూ, సౌందర్యము.

త్రెవ్వు, దే. అ. క్రి. రూ-తెగు ఖండితమగు: చూ, వ్రక్కలౌ.

త్రెళ్లు, దే అ. క్రి. 1: చూ, మరణించు; 2. పడు. భార. సభా. 2, ఆ. 69; చూ, దొరలు.

త్రెళ్లుట, దే వి. చూ, మరణము.

## త్రే

త్రేంచు, దే. అ. క్రి: చూ, రూ-త్రేనుచు. స్వా. 6, ఆ. 28.

త్రేఁచు, —వై.—

త్రేఁపు, దే. వి: చూ, రూ-త్రేనుపు.

త్రేగుడు, దే. వి. బిగటపాటిన యెంగిలి లోనగునది: రూ-త్రేవుడు.

త్రేతాగ్నులు, అం. 1. దక్షిణాగ్ని, గార్హపత్యము, ఆహవనీయము: (చూ, అగ్నులు, త్రయము); చూ, వహ్ని. 1; 2. చూ, శుభావర్తములు.

త్రేతాయుగము, అం. 1. యుగములు నాలుగింటిలో నొకటి: చూ, యుగములు; పా. 2. త్రేతాయుగంబున జనోదయ లగ్నమే జన్మలగ్నము.

త్రేంచు, దే. అ. క్రి. రూ-త్రేంచు-త్రేంచు-త్రేన్చు. (సం. ప.)- ఉద్గారించు.

త్రేనుపు, దే. వి. రూ-త్రేంపు-తేప్పు-తేణుపు (సం. ప.)— అమ్లిక, ఉద్గరణము-రూ-ఉద్గారము.

త్రేన్చు, దే. అ. క్రి: చూ, రూ-త్రేనుచు.

త్రేప్పు, దే వి. చూ, రూ-త్రేనుపు.

త్రేవుడు, దే వి: చూ, రూ-త్రేగుడు.

## త్రై

త్రైగుణ్యము, సం. వి. అ. న. 1. సత్వరజస్తమోగుణములు: చూ, త్రయము; 2. శైత్యసౌగంధ్య మాంద్యములు: చూ, త్రయము.

త్రైగుణికుడు, సం. విణ. మూడురెట్టింపుల వడ్డికి ఇచ్చెడు వాడు.

త్రైలింగుడు, సం. విణ.=తెలగ. త్రిలింగదేశ స్థుడు: చూ, తెలగ. (కాపు అని వాడుక.)

త్రైలోక్యము, సం. వి. అ. న. రూ-త్రిలోకి. త్రిలోకముల సమాహారము.

త్రైలోక్యమోహనము, అం. చూ, ఓ-థ-హీనతానములు: (చూ, సర్వతానములు.)

త్రైవర్గికుడు, సం. విణ. ధర్మార్థకామములయందిచ్ఛగలవాడు.

త్రైవిద్యుడు, సం. వి. అ. పుం. వేదము తెలిసినవాడు: చూ, వేదాంతి. 1:

## త్రొ

త్రొక్కట, దే. వి రూ-త్రొక్కటము; చూ, రూ-తొక్కట.

త్రొక్కటపడు, ద్వ. అ. క్రి: చూ, రూ-తొక్కటపడు.

త్రొక్కటపాటు, ద్వ. వి: చూ, రూ-తొక్కటపాటు.

త్రొక్కటము, దే. వి: చూ, రూ-త్రొక్కట.

త్రొక్కు, దే. వి. 1. త్రొక్కుడు. లక్ష్మీ. 3, ఆ. 86: చూ, సంయోగము; స. క్రి. 2. పాదములతోనదుము; 3. (అంటు) త్రొక్కు: అంటుకట్టు, అంటుత్రొక్కు, ఒత్తు, కదియకట్టు, మట్టు, మెట్టు.

త్రొక్కుడు, దే. వి. 1: చూ, త్రొక్కు. 1. భాగ. 6, స్కం. 342: 2. పక్షిరతము. చూ, సంయోగము; 3. ఆపద; చూ, విపత్తు.

త్రొక్కుడుగమ్మి, ద్వ. వి: చూ. రూ-తొక్కుడుగమ్మి.

త్రొక్కుడుపట్టె, 1.—పై.—; బ. 2. సాలెవాడు నేయునప్పుడు త్రొక్కెడుచెక్కలు.

త్రొక్కుడుపలక, ద్వ. వి. డాక్కసనివాని క్రిందిపలక.

త్రొక్కుడుబిళ్ల, దే. వి: చూ, బాలక్రీడ.

త్రొక్కుడువడు, ద్వ. అ. క్రి. సంగుడువడు: చూ త్రొ క్కువడు.

త్రొక్కువడు, —పై.—

## త్రో

త్రోచు, దే. స. క్రి. 1. చంపు: చూ, సంహరించు; 2. త్రోయు: చూ, నిషేధించు; 3. అశ్రద్ధచేయు. భార. ఉద్యో. 4, ఆ, 302: ఒప్పుకొంచు, కన్నడించు, తరితీపుచేయు. (సం. ప.)- ఉపేక్షించు; అ. క్రి. 4. వేగముగలుగు: చూ, పదిగొను; 5. పూను. ఉత్సహించు: చూ, యత్నించు; 6. నడచు: చూ, వెళ్లు 3; 7. కపియు: చూ, వ్యాపించు; 8. మీఱు వై. 1, ఆ. 89: చూ, ముమ్మరించు.

త్రోటి, సం. వి. ఈ. స్త్రీ. 1. పక్షిముక్కు: చూ, ముక్కు; 2 చేపముక్కు: చూ, ముక్కు; 3. పేడు*: చూ, బారంగి.

త్రోటిక, అం. నాటికలు 18 లో నొకటి. (5-7-8-9 అంకములు దేవమనుష్యమిశ్రితము): చూ, నాటికలు.

త్రోతలము, అం. చూ, తంత్రములు.

త్రోతలోత్తరము, అం.—పై.—

త్రోత్రోపు, దే. వి. (త్రోపు+త్రోపు) మిక్కిలిత్రోపు: చూ, అవహేళనము.

త్రోత్రోపులాడు, దే. స. క్రి. (త్రోత్రోపులు+ఆడు) మిక్కిలి త్రోయు; చూ, నిషేధించు.

త్రోపడు, ద్వ. అ. క్రి. (త్రోపు+పడు) త్రోయబడు: చూ, రూ-త్రోపువడు. స్వా. 3. ఆ. 23.

త్రోపనంగొలవి, దే. వి. 1. ఉభయభ్రష్టుడు: చూ, వెలివాడు. 1; విణ. 2. ఉభయభ్రష్టురాలు: చూ, వెలికత్తె.

త్రోపరి, దే. విణ. (త్రోపు+అరి): చూ, నిరాకరిష్ణువు.

త్రోపాటు, ద్వ. వి. త్రోవడుట, త్రోపు: చూ, విఘ్నము.

త్రోపాడు, దే. స. క్రి. త్రోపు+ఆడు): చూ, త్రోయు. భార. విరా 2, ఆ. 343.

త్రోపు, దే. వి. 1. త్రోయుట. భార. సభా. 2, ఆ 41; చూ, త్రోపాటు; 2. తిరస్కారము: చూ, అవహేళనము; 3; చూ, నిషేధము.

త్రోపుడు, దే. వి 1. త్రోపు; చూ, నిషేధము; 2: చూ, చిత్రిక.

త్రోపుడు పెట్టు, దే. స. క్రి. చిత్రికతో మ్రాను నునుపుపరుచు.

త్రోపుడువల, దే. వి. ఒకరకమువల; చూ, వల, 1.

త్రోపువడు, ద్వ. అ. క్రి; చూ, రూ-త్రోపడు.

త్రోపుసేయు, ద్వ. స, క్రి; చూ, తిరస్కరించు.

త్రోముడు, దే. వి: చూ, రుద్ధుడు.

త్రోయు, దే. స. క్రి. చూ, నిషేధించు.

త్రోయువాడు, దే. విణ: చూ, త్రోపరి.

త్రోలు, దే. స. క్రి: చూ, రూ-తోలు. 2.

త్రోలుట. వా. వి. 1. యుద్ధమువలనఁ బాఱుట, చోదనము, ఆం, భా. ద్వి. 220: చూ, విద్రావము; 2. పసులు లోనగు వానిని నడిపించుట. (తోలుట.)
త్రోవ, దే వి. దారి: చూ, మార్గము. 1.
త్రోవనడచుట, అం: చూ, అష్టకష్టములు.
త్రోవరి, దే. విణ. (త్రోవ + అరి): చూ, పాంథుఁడు.

## త్ర్య

త్ర్యంకటము, సం. వి. అ. న. = ; చూ, త్రాసు.
త్ర్యంగటము, సం. వి. అ. న. ఒకరకము చిక్కము: చూ, శిక్యము. 1.
త్ర్యంగటుఁడు, సం. వి. అ. పుం: చూ, శివుఁడు.
త్ర్యంబకసఖుఁడు, సం. వి. అ. పుం: ముక్కంటిచెలి, కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు.
త్ర్యంబకుఁడు, సం. వి. అ. పుం. రూ-త్రియంబకుఁడు (అనికొందఱు), ముక్కంటి: చూ, శివుఁడు. 1.
త్ర్యక్షరి, అం. చూ, శబ్దాలంకారములు (చూ, హేతువు. 2.)
త్ర్యక్షరుఁడు, సం. వి. అ. పుం. మనువు కుదుర్చువాఁడు: చూ, నాగవీటుఁడు.
త్ర్యక్షుఁడు, సం. వి. అ. పుం: చూ, శివుఁడు.
త్ర్యబ్ది, సం. వి. ఆ. స్త్రీ. మూడేండ్లపెయ్య: చూ, ధేనువు.
త్ర్యశ్యము, అం: చూ, జాతిక్రియలు.

## త్ర్యు

త్ర్యుషణము, సం. వి. అ. న: చూ, రూ-త్ర్యూషణము.

## త్ర్యూ

త్ర్యూషణము, సం. వి. అ. న. సొంటి, పిప్పలి, మిరియాలు: చూ, రూ-త్ర్యుషణము: చూ, త్రికము. 3: చూ, త్రయము.

## త్వ

త్వమ్, సం. స. 1. (యుష్మత్) నీ శబ్దమునకు ప్రథమైకవచనము; చూ, నీవు: అవ్య. 2. నీవు అనుట: చూ, అని. 2.
త్వక్కండురము, సం. వి. అ. న: చూ, వ్రణము.
త్వక్కు, సం. వి. చ్. స్త్రీ. రూ-త్వచము. = తొలుక-తొక్క. 1. తోలు; చూ, బెరడు; 2. చెట్టుపట్ట; చూ. బెరడు; 3. రూ-త్వచము. లవంగపువట్ట: చూ, వరాంగకము; 4. నార: చూ, బెరడు: 5. = చెక్క. (కొంత లోపలి భాగము కొంత వెలుపలి భాగము గల (మానితుండులోని) పొరాటు చెక్క: చూ, బెరడు; అం. 6 జ్ఞానాదిపంచేంద్రియములలో నొకటి: చూ, ఇంద్రియములు; 7. త్వగాదిసకేంద్రియములలో నొకటి: చూ, ఇంద్రియములు.
త్వక్పత్రము, సం. వి. అ. న. 1. లవంగపుపట్ట, చూ, వరాంగకము; 2. ఇంగువాకు: చూ, పర్ణము. 1.
త్వక్పుష్పము, సం. వి. అ. పుం: చూ, రోమాంచము.
త్వక్పుష్పిక, సం. వి. ఆ. స్త్రీ. శోభి: చూ, సిధ్మము.
త్వక్సుగంధకము, సం. వి. అ. పుం. నారింజ* చూ, శర్కరాంకము.
త్వక్షీర, సం. వి. ఆ. స్త్రీ. (రూ-త్వక్షీరము-త్వక్షీరి-తుకాక్షీరి-తుగాక్షీరి-కవాక్షీరి-తవక్షీరి)*: చూ, వంశరోచన.
త్వక్షీరము, సం. వి. అ. న.—పై.— (ఇది ఆకారాంత స్త్రీలింగమును, ఈకారాంత స్త్రీలింగమును అగును.)
త్వక్సారము, సం. వి. అ. పుం. రూ-త్వచసారము. వెదురు*: చూ, వేణువు.
త్వగంకురము, సం. వి. అ. పుం: చూ, త్వక్పుష్పము.
త్వచము, సం. వి. అ. న. 1: చూ, రూ-త్వక్కు. పా. 2. త్వచములు,— అవరణత్వచము, ఆగంతుకత్వచము, తాంతవత్వచము, శ్లేష్మత్వచము, రక్తజలత్వచము మొ.
త్వచిసారము, సం. వి. అ. పుం: చూ, రూ-త్వక్సారము.
త్వచిసుగంధ, సం. వి. ఆ. స్త్రీ: ఏలకి*; చూ, పత్రల.
త్వర, సం. వి. ఆ. స్త్రీ. = తరవు-తుట్టు-తొర-దురము. 1. శీఘ్రము, వేగిరపాటు: చూ, స్యదము. 1, 2; చూ, సంభ్రమము. (త్వరత్వర = దురదుర, అతివేగము.)
త్వరపడు, మి. అ. క్రి: చూ, సంభ్రమించు.
త్వరితము. సం. క్రి. విణ. . అన. = తురుతు. 1. శీఘ్రము: చూ, వేగము. ౪; విణ. 2 వడిగలది: చూ, వేగము. ౩.
త్వష్ట, సం. వి. ఋ. పుం. 1. = తట్రి. వడ్లవాఁడు. త్వష్ట్రి (అనికొందఱు): చూ, స్వర్ణకారుఁడు; 2. = తుండు-తుంపు-తునుక: చూ, శకలము. 1; విణ. 3, చెక్కఁబడినది, చూ, రుషితము; అం. 4: చూ, ఆదిత్యులు.

## త్వా

త్వాదృశము, సం. విణ. నీవంటిది.
త్వాష్ట్రము, వా. వి. 1: చూ, తఱుటు. 2; 2. మోటువాఁడు, మోటుది, మొద్దు (తాష్ట్రము అనియు.)
త్వాష్ట్రి, సం. వి. ఈ. స్త్రీ. రధి, లఘ్వి, తేలికగాఁ బోవు రథము: చూ, శకటము. 1.
త్వాష్ట్రికము, అం: చూ, అస్త్రములు. (చూ, బాణము. 1.)
త్వాష్ట్రుఁడు, సం. వి. అ. పుం. 1. వృత్రాసురుఁడు; చూ, వృత్రుఁడు. వా. 2; నిష్క్రియోజకుఁడు: చూ, వ్రాజె.

## త్వి

త్విట్టు, సం. వి. ష్. స్త్రీ. రూ-త్విష-త్విషి. 1. కిరణము, జిగి (అనికొందఱు): చూ, హాయనము. 2; 2. మంట: చూ, వహ్ని. 1; 3. వెలుఁగు (ఇది త్విష అనిన ఆ. స్త్రీ. అగును): చూ, వెలుతురు. 1.
త్విషాంపతి, సం. వి. ఇ. పుం. వెలుఁగుతేఁడు. చూ, సూర్యుఁడు.

## త్స

త్సరువు, సం. వి. ఉ. పుం. కత్తిలోనగువాని పిడి: చూ, పిడి. 2.

## థ

థ, ఒక యక్షరము సం. వి. అ. పుం. 1. కొండ: చూ, పర్వతము; 2. దంపమూపు: చూ, హిమాంశువు: 3. అగ్ని: చూ, పిచి. 1; 4. భయమును పాఱవోలుట: చూ, రక్షణము; 5. ఒకరోగము: చూ, రోగము. 1; 6. భయమునకు గుఱుతు: చూ, లక్షణము. 1; 7. తినుట: చూ, భుక్తము. 1; అ. స్త్రీ. 8. ఏఱు: చూ, నది; 9 భయమును పాఱవోలుట: చూ, రక్షణము; విశ. 10. తెలుపుగలది. చూ, వర్ణము. 6; 11. నలుపుగలది. చూ, వర్ణము. 8; 12. పెద్దది: చూ, విపులము; అం. 13. తవర్గమునందలి రెండవ యక్కరము: చూ, కవర్గము; ("థ" వర్తు.— "స" అను నక్షరముక్రింద "థ" అనునదిగాని "ధ" యెన్నఁడు నుండదు. ఉదా.— అస్థి, అస్థికము, ప్రస్థము, వ్యవస్థ, స్థానము, స్థితము, స్థిరము మొ.)

## థు

థుత్కారము, సం. వి. అ. పుం. ఉమియుట లోనగువాని యందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

థూథూ, సం. అవ్య.—పై.—

థైథై, సం. అవ్య. వాద్యానుకరణ శబ్దవిశేషము: చూ, హూహూ.

## ద

ద, ఒకయక్షరము సం. వి అ. పుం. 1. ఈశ్వరుఁడు: చూ, శివుఁడు; 2. గురుఁడు: చూ, సురాచార్యుఁడు; 3. త్రాగుడు: చూ, పానము. 1; 4. రాగములేమి: చూ, విరక్తి; 5. చూపు: చూ, వీక్షణము; 6. పెండ్లాము: చూ, భార్య; 7. సరిగమ పదనిస యను సప్తస్వరములలో నొకయక్షరము: చూ, స్వరము. 2; అం. 8. సరళాక్షరములలో నొకటి: చూ, సరళములు; 9. తవర్గమునందలి మూఁడవ యక్కరము: చూ. కవర్గము; వా. వి. 10. దా, పిలుపు.

దమ్, సం. అవ్య. పెండ్లాము: చూ, భార్య.

దంగు, దే. అ. క్రి. రూ-డంగు: చూ, మెదుగు.

దంపుడు, దే. విశ. దంచినది. "దంపుడు బియ్యము."

దంగుడులు, దే. వి. బ. రూ-దంగుళ్లు: చూ, చేరుడుబియ్యము.

దంచెన, దే. వి. రూ-దంచనము- దంచెనము- డెంచనము, పెద్ద ఫిరంగి; చూ, బాణము. 1. (చూ, బాణాసంచు)

దంచెనము, —పై.—

దంజావరిబ్రాహ్మణులు, అం. నేపాళదేశపు బ్రాహ్మణులలో నొ- తెగవారు: చూ, బ్రాహ్మణులు.

దంట, దే. వి. 1. = దండ. రూ-జంట. "దంటమోముల వేలుపు."; చూ, రెట్టి. 1; వై. విశ. 2. నే ఎరి. కా. 5, అ. 39; చూ, సమర్థుఁడు; 3. = ధృష్టః. దిట్టతనము గలవాఁడు. అచ్చ. సు, కాం, 147: చూ, దిట్టఁడు; 4. = దండః ద్వంద్వము: చూ, సంగడిక.

దంటపోరు, ద్వ. వి ఎక్కటికయ్యము: చూ, యుద్ధము.

దంటమోములదేవర, ద్వ. వి. అగ్ని. అచ్చ. యు, కాం. 280: చూ, వహ్ని. 1.

దంటు, వై. వి. = దండః. 1. జొన్న లోనగువాని కఱ్ఱ: చూ, సస్యము; 2. సస్యదండము. ఆ, భా. ద్వి. 238: చూ, సస్యము; 3. యావనాళాదిదండము. ఆం, భా. ద్వి. 76: చూ, సస్యము; వా. 4. సారములేమి. "చొప్పదంటుప్రశ్నలు."; 5. దంటు ఇంటిపేరుగాఁ గలవారు.

దండ, అం. 1. ఆకాశచారులలో నొకఁడు: చూ, ఆకాశచారులు: వై. వి (1) హారము: చూ, భూషణము. 2; దే. వి. (2) దగ్గఱ. చూ, సమీపము. 1; (3) అండ. హరిశ్చ. 4, అ. 97: చూ, ప్రాపు. 2; (4) ఎప్పుడుద్దేశించు ముల్లుకోలతో పొడుచుటగా నేర్పడినమచ్చ: చూ, చారును. 6; (5) రోలు సిద్దెమూతి చెప్పు: దట్టి-రూ-దట్టా; (6) ముష్టియుద్ధము యొక్క మొదటిగలి: చూ, యుద్ధము.

దండకడియము, వై. వి. సందదండ: చూ, భూషణము. 2.

దండకము, సం. వి. అ. పుం. 1. దండకారణ్యమను అడవి; చూ, విపినము (ఇది ఆ స్త్రీ అగును.): 2. దండకమను దేశము: చూ, దేశములు; 3. ప్రార్థన. "శ్యామలా దండకము, ఆంజనేయదండకము"; 4. చెట్టువోదె: చూ, మ్రాను; విశ 5. మోసము: చూ, వంచన: అం. 6. మాలికావృత్తములు అయిదింటిలో నొకటి. ఉదా.—న, స, హ, తగణములం దేదైన నొకటి యాదినుంచి పిమ్మట దుదిదాఁకఁ దగణములంగూర్చి గురువుతో సమాప్తి నేయునది. "శ్రీరామ, నారాయణా వాసు, దేవా జి, గన్నాయ, కా భక్త, చింతామ, ణీ కృష్ణ, విష్ణూ ద, యాహా న, మస్తే న, మః: చూ, వృత్తము. 1. (చూ, గద్య): 7. కావ్యలక్షణమున.—చాటువు అనఁగా నప్పటికప్పుడు కవి చెప్పిన పద్యములు. ఇవి గ్రంథస్థములు గావు. ఇవి సంఖ్యాబద్ధము అసంఖ్యాబద్ధము అని యిరుతెఱఁగులు. (అసంఖ్యాబద్ధములో దండక మొకటి): చూ, మహాకావ్యము.

దండకవిలియ, ద్వ. వి. ప్రాఁత లెక్కపుస్తకపుకట్ట: చూ, పుస్తకము.

దండగోల, దే. వి. (దండ + కోల) ఊఁత. జై. 1, అ. 100: చూ, ప్రాపు. 2.

దండచక్రము, అం. చూ, అస్త్రములు: (చూ, బాణము. 1.)

దండచే. వై. వి. = ధృష్టశయ- దృఢశయ. రూ-దండచేయి. ప్రగండము: చూ, సందిలి.

దండచేయి, వై. వి. = —పై.—

దండచేరు, ద్వ. వి. సందిటఁగట్టుకొనెడు తోరము: చూ, సూత్రము. 1.

దండత్రయము, అం. వధము, అర్థహరణము, పరిక్లేశము: (చూ, త్రయము.)

దండధరుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, యముఁడు; 2: చూ, రాజు. 1.

దండనము, సం. వి. అ. న. దండించుట: చూ, శిక్ష. 2.
దండనాయకుఁడు, సం. వి. అ. పుం: చూ, సైనికుఁడు.
దండనిలుకడ, అం: చూ, ఉపవీతములు.
దండనీతిశాస్త్రము, పా. (కామందకార్థశాస్త్రము) అర్థశాస్త్రము నీతిశాస్త్రమును రాజనీతియను దండనీతియును అని పాడఁబడు చున్నది. అందు దండనీతి యొకటి. దీనిచేత గ్లానిఁ బొందింపఁ బడును. గనుక సామదానాదులలో నాలవ యుపాయము దండము. అది దీనిచేత ప్రధానముగాఁ బ్రతిపాదింపఁ బడును.) (చతురంగబలము లనునయించుట. ఇది రాజవిద్య లగు అన్వీక్షకి, త్రయీ, వార్త, దండనీతియను నాలుగింటి లోను ఒకటి: చూ, రాజవిద్యలు; (చూ, విద్యలు): (చూ, ప్రకరణములు; (చూ, దండము.)
దండపడు, ద్వి. అ. క్రి. 1: చూ, సమీపించు; 2. ఎద్దు ముద్ది మీఁద మల్లుకోలతో పొడుకఁగా బొరుసుగా నేర్పడు.
దండపక్షము, అం. 1. చూ, నృత్తహస్తములు; 2. చూ, కరణములు.
దండపరుషము, అం. 1: చూ, క్రోధజములు; 2. చూ, వ్యవహారపదములు.
దండపాటు, ద్వి. వి దండపడుట, సమీపించుట: చూ, సమీపము. 1.
దండపాదము, అం. 1. చూ, ఆకాశమండలములు; 2: చూ, కరణములు.
దండపాలము, సం. వి. అ. న. తిమింగిలభేదము. చూ, మత్స్యము. 1.
దండపాశకుఁడు, సం. వి. అ. పుం రక్షకభటుఁడు: చూ, పోలీసు.
దండపోరు, వా. వి. ఎక్కటికయ్యము. ఆం. పదా. నర. 43. చూ, యుద్ధము.
దండప్రధానహేతుకము, అం. చూ, శత్రువుతోడి సంధులు.
దండము, సం. వి. అ. పుం, న. 1.= కడ్డు. కఱ్ఱ: చూ, వేత్రము. 1; పుం. 2.= దండుగ: చూ, సేగి. 4; 3 చెట్టు బోదె; చూ, మ్రాను; 4 = దంటు. కాఁడ. ఆకుల యీనెలు (అడికొందఱు: చూ, పర్వణీణము; 5. కవ్వము; చూ, మథనము. 6. వాద్యమువాయించెడి కొడుపు,కొడుపు,కోణము: చూ, వీణె; 7. = దండు: చూ, సేన 1; 8. గర్వము: చూ, అహంకారము; 9. అదుముడు: చూ, పీడనము; 10 కొల: చూ, వధము; 11. బారు: చూ, వ్యామము; 12. కట్టువా, సాధారణగుఱ్ఱము: చూ, హయము; 13. తోఁకతెగనియెద్దు. చూ, వృషభము. 1; 14 హారమునందలిపేట: చూ, భూషణము. 2; 15. కప్పము: చూ, లంచము; 16. = దంట— దొంతు. జత: చూ, దంట. 1; 17. గుంపు: చూ, సమూహము; 18. రాజశిక్ష, దండన: చూ, శిక్ష 2; 19. జొన్న లోనగుకఱ్ఱ: చూ, సస్యము; 20. సస్యదండము: చూ, సస్యము; 21. యావనాళాదిసందము: చూ, సస్యము; అం. 22: చూ, ఉద్ధతము; 23: చూ, ముప్పదిరెండాయుధములు: (చూ, బాణము. 1); 24: చూ, ఆసనములు; 25: చూ, దిక్పాలాయుధములు; 26: చూ, ఉపాయములు; 27: చూ, ఉపాయములు; 28. "దండాదయః యుధిభేదాః"= యుద్ధమందుఁజేయఁబడు దండము మొదలైనవి వ్యూహభేదములు. బలము నడ్డముగాఁదీర్చుట వ్యూహము. దే. వి. (1): చూ, నమస్కారము; (2) దండు: చూ, సేన.
దండములు, అం. వధించుట, ధనము హరించుట, పీడించుట.
దండయాత్ర, సం. వి. అ స్త్రీ 1. దిగ్విజయము: చూ, విజయము. 2 యుద్ధయాత్ర: చూ, యుద్ధము; 3 అధ్వరయాత్ర (నిదుర లోనగుసమయములందు శత్రువులపైఁబడుట): చూ, యుద్ధము.
దండలాసకము, అం. నృత్యవిశేషము, కోలాటము: చూ, ఉద్ధతము.
దండలు, అం. మల్లశాస్త్రములోనివి — సమము (సమదండ), గజము (గజదండ) భృంగి (భృంగిదండ), ఎడమవరభృంగి (ఎడమవరదండ), కుడివరభృంగి (కుడివరదండ), భృంగి వలలము, వయివరము (వేవరిపుదండ), సింగము (సింగపు దండ), పొదలిక (పొదలికదండ), అడుగడుగు పొదలిక (అడుగడుగు పొదలికదండ), మద్దెలసంచు (మద్దెలసంచు దండ), కుక్కుటము (కుక్కుటపు దండ) (12).
దండవాక్పారుష్యము, అం చూ, వివాదములు.
దండవిష్కంభము, సం. వి. అ. పుం. చల్లగాడు: చూ, స్తంభము. 1.
దండవ్యూహములు, అం. 1. ప్రదరము, దృఢకేశము, శ్వావత్తు, శ్వాకుక్షి, ప్రతిష్ఠము, సుప్రతిష్ఠము, ధ్యానము, విజయము, సంజయము, విశాలము, అవిజయము, సూచి, స్థూణాకర్ణము, చమూముఖము, ఝషాస్యము, వలయము, దుర్జయము (17); 2: చూ, ప్రకృతివ్యూహములు.
దండసిలు, దే. అ. క్రి రూ-దండసిల్లు. 1. చూ, మఱుఁగుపడు; 2. చూ, పీడితమగు.
దండసిల్లు, దే. అ. క్రి. —పై.—
దండాగొండెము, వా. వి. లంకె.
దండాట, ద్వి. వి. (దండ + ఆట): చూ, దేగాట.
దండాపూపన్యాయము, న్యా. చిలుకకొయ్యను గారెలు తగిల్చిరి. అచిలుకకొయ్యను ఎలుక కొట్టివేసినది అని చెప్పినతర్వాత గారెలు తిన్నదని వేఱేచెప్పనేల? దీనినే "కైముత్యన్యాయ" మందురు.
దండాపూపికాన్యాయము, న్యా. —పై.—(అపూపికములు = అప్పచ్చులు.)
దండాభావన్యాయము, న్యా. కఱ్ఱలేనివానిని గొఱ్ఱె కఱచినదనురీతి.
దండాయుధాంశము, అం. షష్ఠ్యంశములలో నొకటి: చూ, షష్ఠ్యంశములు.
దండాహతము, సం. వి. అ. న: చూ, మజ్జిగ.
దండి, సం. వి. న్. పుం. 1. దండియనుకవి; 2: చూ, యముఁడు; 3. ద్వారపాలకుఁడు: చూ, ప్రతిహారుఁడు; 4. పూర్వజైనవిశేషము: చూ, బుద్ధుఁడు. 1; విణ. 5. దండము గలవాఁడు; దే. వి. (1) వీరము: చూ, శౌర్యము. 1; (2) కోశబలమువలన గలిగిన తేజము: చూ, ప్రతాపము. 1; విణ. (3): చూ, ప్రతాపవంతుఁడు; (4): చూ, శౌర్యవంతుఁడు; భార. భీష్మ. 1, ఆ. 192; (5) సమృద్ధము: చూ, సమృద్ధి; (6) గొప్ప: చూ, మహితము.

దండించు, సం. స. క్రి: చూ, శిక్షించు.
దండిక, సం. వి. అ. స్త్రీ. 1.= దండె. కిన్నర: చూ, వీణ; 2. హారములందలి పేట: చూ, భూషణము. 2; 3.= దన్నెము. జట్టిబవేయువదెము: చూ, దండియ. 8.
దండితుఁడు, సం. విణ దండింపఁబడినవాఁడు: చూ, శిక్షితుఁడు.
దండియ, వై. వి, రూ-దండె. 1.= దండికా. వీణ: చూ, వీణ; 2 = దండికా. తుంబుర: చూ, వీణ; 3.= దండికా. కిన్నెర; చూ, వీణె; 4.= దండికా. పల్లకీబొంగు, కొమ్ము: చూ, బొంగు; 5. గ్రామకోల; చూ, తునికోల; 6. పసుగు నేల రామకొనకుండ మగ్గపుగుంత కెదుట అడ్డముగా పాతిన కొయ్య; 7. ఏకపుకడవకు మీఁద నడ్డముగానుంచి కట్టెడు కొయ్య; 8.= దండికా. జట్టిబవేయు దండెము (త్రాడు లేక వెదురులోనగునది), దండియము-రూ-దండెము - దట్టెము - దన్నెము: చూ, సూత్రము. 1.
దండియము, వై. వి. రూ-దండెము. 1.= దండికా.—వై.— పాండు. 4, ఆ. 287; 2. కానొర గరిడిసాధనము. "దండి యములు తీయుట."
దండు, వై. వి. 1: చూ, సమూహము. అచ్చ. బాల, కాం. 162; 2.= దండః: చూ, సేన. 1.
దండుఁడు, సం. వి. అ. పుం. 1. సూర్యునకుఁ బరిచర్యసేయు విం(ద్రా)దులు 18 లో క్రమముగా ముఖ్యులగు ముగ్గురిలో దండుఁడొకఁడు, (దండుఁడు, పింగళుఁడు, మాఠరుఁడు అని వీరు ముగ్గురు. సూర్యుఁడు దైత్యులతు వధమియ్యుక విష్ణుముచేయుటకు రుద్రాగ్నియములు క్రమముగా వైమూఁడునామములతో వర్తింతురు.); 2: చూ, యముఁడు; 3. దండించువాఁడు; చూ, శిక్షితుఁడు. 1.
దండుకొను, వా. స. క్రి. అడుగుకొను. "పిల్లలు భోగిముందు రోజున పిడుకలు దండుకొందురు."); చూ, యాచించు.
దండుగ, వై. వి.= దండ. (రూ-దండువ-దండుగు-దండువు.) 1. రాజు ధనవంతుని బలాత్కారముచేసి పుచ్చుకొనెడు ధనము: చూ, వడుసుడి; 2. జరిమానా: చూ, వడుసుడి; 3. నష్టము: చూ, నేగి.
దండుగిచ్చు, వా. స. క్రి; చూ, అచ్చు. 22.
దండుగు, వై. వి.= : చూ, రూ-దండుగ.
దండుదారి, దే. వి. తెట్టతెన్ను: చూ, మార్గము. 1.
దండుదారి, దే. వి. తెట్టతెన్ను: చూ, మార్గము. 1.
దండుదివియ, వై. వి.= దీపదండ, దీపపునెమ్మె: చూ, నెమ్మె.
దండుబాట, ద్వ. వి: చూ, దండుదారి.
దండుముండ, ద్వ. వి: చూ, దండులంజె.
దండులంజె, వై. వి.= ధృష్టలంజా. బజారి, గట్టివా: చూ, స్త్రీ.
దండువ, వై. వి.= దండ: చూ, రూ-దండుగ.
దండువు, వై. వి.= —వై.—
దండూరా. వా. వి. టముకము: చూ, సాటింపు.
దండె, వై. వి: చూ, రూ-దండియ.
దండెత్తు, ద్వ. అ. క్రి. (దండు + ఎత్తు) యుద్ధప్రయత్నము చేయు. ఎత్తు-రూ-ఎత్తుదెంచు, దాడిచేయు.
దండెపుఁబీటలు, వై. వి. బ. (దండెము + పీటలు) గడచీల తగులుటకు దండెకునడుమ గ్రుచ్చినరంధ్రములుగల రెండు పీటలు.
దండెము, వై. వి.= : చూ, రూ-దండియము. శశాం. 1, ఆ. 17.
దండెములు, అ. కన్నాతలు. అం, భా. ద్వి. 207: చూ, విన్నాణములు.
దండో దశగుణో భవేత్, న్యా. (స్పష్టము.)
దండోరా, వా. వి: చూ, రూ-దండూరా.
దండ్యుఁడు, సం. విణ. దండింపఁదగినవాఁడు: చూ, శిక్షితుఁడు. 1.
దంతక్షతములు, అం. 1. ఉచ్ఛూనకము-కోలచర్చితము - ఖండా భ్రకము - ప్రవాళమణి - బిందుకము - మణిబిందుమాలిక - మూథకము. (చూ, కామము. 8); 2: చూ, వాతెరకెంపు.
దంతధావనము, సం. వి. అ. న. 1: చూ, పలుదోముట; పుం. 2. చంద్ర*: చూ, వెలిచంద్ర.
దంతభాగము, సం. వి. అ. పుం. ఏనుఁగు ముందటిభాగము: చూ, హస్తి.
దంతమధ్యము, సం. వి. అ. పుం: చూ, కటము. 12: (చూ, శంఖము. 2.)
దంతమలము, సం. వి. అ. పుం, న: చూ, పంట్లపాంచి.
దంతము, సం, వి. అ. పుం. 1. రదనము: చూ, పల్లు. 1—2; 2. కొండనడుము: చూ, పర్వతము; 3. పొదరిల్లు: చూ, సదనము. 1; 4. పొడవుడాయి: చూ, రాయి.
దంతములు, అం. దీనికి ఉపమానములు. — మొల్లలు, ముత్యములు, దాడిమీబీజములు, వజ్రపుముక్కలు, కేసరములు, నక్షత్రములు; అం. 2. పురుష లక్షణాంగములలో నొకటి (మల్లెమొగ్గలవలె నున్న రాజగు, రక్తోపారపంతముతైన నిత్య మాంసలిపిప్రియుఁ గలవాఁడగు. ముప్పదిరెండైన రాజును భోగియునగు.: చూ, లక్షణాంగములు; 3. స్త్రీలక్షణాంగములలోనొకటి (దంతములు సమములై తెలుపుగలిగిన శుభప్రదము. దానిమ్మగింజలవలె నున్న రాజపత్నియగు. సన్నగనున్న సుఖవతియగు. విషమములైన దొంగదగు. స్థూలములైన దుఃఖియగు. కాలిసరితినున్న మగని విడుచును. వికశములైన స్వల్పసుఖము దుఃఖము గలుగును): చూ, స్త్రీలక్షణాంగములు.
దంతరోగములు, అం. దాలనము, క్రిమిదంతము, దంతహర్షము, కరాళము, దంతచాలనము, దంతశర్కర, అధితము, శావ దంతము, దంతభేదము, కలిపాకము.
దంతశర, సం. వి. ఆ. స్త్రీ: చూ, పులిచింత*.
దంతశఠము, సం. వి. అ. పుం. 1: చూ, నిమ్మ*, 2: చూ, వెలఁగ*; 3. చింత*; చూ, బహుపత్ర; 4. నారింజ*; చూ, శర్కరాంకము.
దంతావళము, సం. వి. అ. పుం. ఏనుఁగు (దంతములుగలది): చూ, హస్తి.
దంతి, సం. వి. ఈ. స్త్రీ. 1.= దంతి-దంతె. జాంబవతి*: చూ, విశల్య. 5; న్. పుం. 2. ఏనుఁగు: చూ, హస్తి; 3. కొండ. చూ, పర్వతము; 4: చూ, ముకూలకము*; విణ. 5. కోఱ పంటివాఁడు; వై. వి. (1).= దంతి. జాంబవతి*: చూ, విశల్య. 5: (చూ, దంతి. 1.); వా. వి. (2) వండ్లకట్టు.

(వ్యవసాయపు పనిముట్టు. చెత్తచెదారములను నొల్లి చదునుగను గుల్లగను చేయును.)

దంతియ, వై. వి. రూ-దంతె. 1. = తండకః, మిద్దెటింటికి అడ్డముగా వేసెడుపట్టె (దూలము): చూ, మదనచేతులు; 2. అచ్చుకట్టుదంతె; వా. 3. కలుపు పోవునటుల దున్ను పనిముట్టు.

దంతురము, సం. విణ. ప్రక్కఁ-అణఁగి నడుము పొడవైనది: చూ, సోగ. 2.

దంతురుఁడు, సం. విణ: చూ, మిడిపండ్లవాఁడు.

దంతులు, వా. వి. మూఁడు చిన్నచిన్న గుంటలచే (మూఁడు గుంటకలును ఒకకాఁడికే కట్టఁబడి ఒకజత ఎడ్లచేత నే లాగఁబడును.)

దంతె, వై. వి. 1. = : చూ, రూ-దంతి. 1. (1): 2. = తండకః; చూ, రూ-దండియ. 1; 3. చూ, రూ-దంతియ. 1; 4: చూ, రూ-దంతియ. 2; 5: చూ, రూ-దంతియ. 3.

దంత్యము. సం. విణ. దంతమునందు పుట్టినది.

దందడి, దే. వి. 1. అరుపోరు: చూ, యుద్ధము; 2. తఱచు: చూ, మొత్తము; విణ. 3. తఱచైనది. భార. అర. 4, అ. 169: చూ, మొత్తము.

దందడించు, దే. అ. క్రి. తఱచగు. భార. అర. 7, అ. 28: క్రందుకొను, జామకొను, జీబుకొను.

దందడివెట్టు, దే. స. క్రి. ఘర్షించు. భార. విరా. 4, అ. 184: చూ, రాయిడిచేయు.

దందన, వై. వి. 1. = దంధన. గారడము: చూ, మాయము. 1; విణ. 2. అలస్యము: చూ, విలంబము. 1. (రూ-దందనము.)

దందనకత్తియ, వై. విణ. రూ-దందనకత్తె. జాలముచేయునది: చూ, స్త్రీ.

దందనకాఁడు, ద్వ. విణ. జాలముచేయువాఁడు.

దందశూకము, సం. వి. అ. పుం: చూ, సర్పము.

దందశూకుఁడు, సం. వి. అ. పుం. దందశూకఁడను రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

దందనము, సం. వి. విణ. = : చూ, రూ-దందన.

దంప, వా. వి. సాగుబడినేల "దంపతడిసినది."

దంపకఱ్ఱ, ద్వ. వి. (దమ్ము + కఱ్ఱ): చూ, దంపనాఁగలి.

దంపతులు, సం. వి. ఇ. పుం. ద్వి. = జంపతులు. ఆలుమగలు-రూ-ఆమ్మగలు. (వధూవరులు.)

దంపనాఁగలి, వై. వి. (దమ్ము + నాఁగలి) అడుసున దున్నెడు నాఁగలి. (ఇందలి భాగములు -నాఁగటిదుంప, కఱుకోల, ఏడికోల, మేడి, పిడిసీల): చూ, లాంగలము. 1: (చూ, ఇనుపనాఁగలి, క్లైమాక్సునాఁగలి) (దక్షిణ కన్నడపు నాఁగలియు ఇట్లేయుండును.)

దంపు, దే. వి. 1: చూ, దంపుడు; ప్రే. 2. చూ, దంచు. భాగ. 6, స్కం. 370.

దంపుటిల్లు, దే. వి. (దంపు + ఇల్లు) దంచునట్టియిల్లు: చూ, పదనము. 1.

దంపుడు, దే. వి. దంచుట: రూ-దంపు, కొట్టుము, (సం. ప.)- అవహననము.

దంపుడుబియ్యము, వా. వి. బ: చూ, దంగుడులు.

దంపుడ్చు, వా. వి. బ.—పై.—

దంబుగము, దే. వి. రూ-తంబుర (బు): చూ, వీణె.

దంభము, సం. వి. అ. పుం. 1. = డంబు దబ్బ- కపటము: చూ, వ్యాజము 1; 2. = తప్పు: చూ, నేరము; అం. 3: చూ, హేయగుణములు.

దంభోళి, సం. వి. ఇ. పుం వజ్రాయుధము, డాలివాలు: చూ, బాణము. 1.

దంశనము, సం. వి. అ. న. రూ-దంసనము. 1; రూ-దశము-దంసనము. (తె. ప.)— కఱచుట, కాటు; 2. కవచము: చూ, వారవారణము; పుం. 3. రూ-దంసనము: చూ, పల్లు. 1—2.

దంశము, సం. వి. అ. పుం. 1. అడవియీఁగ: చూ, మక్షిక; 2. కాటు: చూ, దంశనము. 1; 3. కవచము: చూ, వారవారణము.

దంశి, సం. వి. ఈ. స్త్రీ దోమ: చూ, మశకము.

దంశిక, సం. వి. ఆ. స్త్రీ పటుకాఱు: చూ, సంద శము.

దంశితుఁడు, సం. విశ. 1. కాటుపడ్డవాఁడు; 2. కవచము [illegible]కినవాఁడు.

దంష్ట్రి, సం. వి. ఆ. స్త్రీ కోఱపల్లు: చూ, పల్లు. 1.

దంష్ట్రాయుధము, సం. వి. అ. పుం. పంది అడవిపంది (అని కొందఱు:) చూ, సూకరము.

దంష్ట్రి, సం. వి. న్. పుం.—పై.—

దంసనము, సం. వి. అ. న: చూ, రూ-దశనము.

దక్కించు, వా. స. క్రి. చెల్లించు. "నాకు మాటదక్కించును."

దక్కినంపుఁద్రోవ, దే. వి. దక్షిణాయనము: చూ, అయనము.

దక్కినంపురాయఁడు, వై. వి. (దక్కినము + రాయఁడు): చూ, యముఁడు (ఇట్లు దక్కినపుదేఁడు మొ)

దక్కినము, వై. వి. = దక్షిణా. దక్షిణపుదిక్కు: చూ, హరిత్తు.

దక్కు, దే. విశ. 1. అనుభవయోగ్యము. పా. 4, అ. 56; అ. క్రి. 2 = దక్కు. అనుభవయోగ్యమగు: దక్కు; వా. 3. మాటదక్కు: (చూ, దక్కించు.)

దక్కొను, దే. అ. క్రి. (దక్కు + కొను) స్వకంత్రుఁడగు. భార. ఆది. 4, అ. 79: చూ, రూ-తక్కొను.

దక్కోలు, దే. వి. 1. దక్కొనుట; విణ. 2: చూ, వశము. 1.

దక్షకన్య, సం. వి. ఆ. స్త్రీ: చూ, పార్వతి. 1.

దక్షప్రజాపతి, సం. వి. ఇ. పుం. చూ, అజముఖుఁడు.

దక్షస్మృతి, అం. చూ, స్మృతులు: (చూ, మూలస్మృతులు)

దక్షయ్యము, సం. వి. అ. పుం: చూ, రూ-దాక్షాయ్యము.

దక్షిణ, సం. వి. ఆ. స్త్రీ. 1. యజ్ఞము లోనగు వానియందు ఋత్విజులు లోనగువారికి ఇచ్చెడుసొత్తు: చూ, సంభావన; 2. = దక్కినము. కుడిదిక్కు: చూ, హరిత్తు; అం. 3: చూ, మూర్ధర్యపాంగములు: (చూ, అంగము. 9.)

దక్షిణకన్నడపు నాఁగలి, వా. వి: చూ, దంపనాఁగలి.

**దక్షిణధ్రువము**, అం. 1. ధ్రువములు రెండింటిలో నొకటి (భూమి యొక్క దక్షిణపుకొన): చూ, ధ్రువములు, (దక్షిణ మహా సముద్రమునకు క్రిందనున్నది.)

**దక్షిణనేత్రము**, అం: చూ, నేత్రములు.

**దక్షిణపాదము**, అం: చూ, పాదములు.

**దక్షిణమహాసముద్రము**, అం: చూ, సముద్రములు.

**దక్షిణము**, స. విశే. 1. కుడి: చూ, వలపల: (బలముగలిగిన దగుటచే వృద్ధిబొందునది); 2. కుడిదిక్కునది: చూ, హరిత్తు; వి. 3 కుడిదిక్కు: చూ, హరిత్తు: అం. 4: చూ, మార్గ ప్రాణములు: (చూ, తాళమార్గములు); 5: చూ, తంత్రములు; 6: చూ, ఓశలు; 7: చూ, దిక్కులు; 8: చూ, ఓశలు.

**దక్షిణసముద్రము**, అం: చూ, సముద్రములు.

**దక్షిణస్థుడు**, సం. వి. అ. పుం. తేరుగడపువాడు: చూ, సారథి.

**దక్షిణహస్తము**, అం: చూ, హస్తములు.

**దక్షిణాంతిక**, అం. వైతాళీయజాతివృత్తములలో నొకటి. బేసి పాదములందు స, న, జ, గురువులును, సరిపాదములందు స, భ, ర, వ గణములను గలిగి బేసిచరణంబులయం దాఱింటను, సరిచరణంబులం దేడింటను యతిగల వృత్తము: (చూ, వైతాళీయము:) చూ, వృత్తము. 1.

**దక్షిణాగ్ని**, అం: (చూ, అగ్నులు): చూ, వహ్ని. 1.

**దక్షిణాపథము**, సం. వి. అ. పుం. వింధ్యపర్వతము మొదలు కొని సేతువువఱకు గల దేశము. చూ, దేశములు

**దక్షిణాయనము**, అం. 1. కర్కాటక సంక్రాంతి మొదలు ఆఱు నెలల కాలము: చూ, అయనము; 2. అయనములు రెండిటిలో నొకటి: చూ, అయనములు.

**దక్షిణార్హుడు**, సం. విశే: చూ, దక్షిణ్యుడు.

**దక్షిణీయుడు**, —పై.—

**దక్షిణుడు**, సం. విశే, రూ-దాక్షిణ్యుడు. 1. కుటిలుడుగాక చక్కనైన మనస్సుకలవాడు: చూ, సరళుడు; 2. దయ కలవాడు; చూ, సురతుడు; 3. నేర్పరి: చూ, సమర్థుడు; అం. 4; (అనేకనాయికల యందు సమస్నేహపర్తి): (చూ, పతులు): చూ, శృంగార నాయకులు.

**దక్షిణేయుడు**, సం. విశే: చూ, రూ-దక్షిణ్యుడు.

*__దక్షిణేర్మము__, సం. వి. న. పుం. వేటకానిచేత కుడిదిక్కున గాయముచేయబడిన మృగము.

**దక్షిణ్యుడు**, సం; విశే. దక్షిణకు దగినవాడు: రూ-దాక్షిణ్యుడు- దాక్షిణేయుడు-దక్షిణార్హుడు- దక్షిణీయుడు- దక్షిణేయుడు.

**దక్షుడు**, సం. వి అ. పుం. 1. కల్యుడు. నవబ్రహ్మలలో నొక బ్రహ్మ: చూ, బ్రహ్మ: 1; 2. ఒకానొకముని: చూ, నన్నెచ్ఛవి 1. విశే. 3 నేర్పరి: చూ, సమర్థుడు.

**దఖల**, వా. వి. వశము. "నాకు దఖలు కాబడినది."

**దగ**, వై. వి 1.=దాహము. దప్పి. ప్వా. 4, అ. 58; చూ, పిపాస; 2. తాపము: చూ, సంతాపము.

**దగదగ**, వై. వి =ధగద్ధగ. (దేశ్యమని శ. ర.) మెఱయుట లోనగువాని యందగు ననుకరణము: చూ, హూహూ.

**దగదగమను**, ద్వి. అ. క్రి. దగదగ యని ప్రకాశించు: చూ, హవణిల్లు.

**దగర**, దే వి. 1. పిశాచము: చూ, రూ-దగర. 1; విశే. 2. గండు: చూ, రూ-డగర. 2.

**దగరము**, దే. వి. అశుభము: చూ, హాని. 2.

**దగరు**, దే. వి. యుద్ధసాధనములలో నొకటి: చూ, యుద్ధము.

**దగులుబాజీ**, వా. వి. (రూ-దగులుబాజీ దగుల్బాజీ.) మిథ్యోద్దేశము గలవాడు.

**దగా**, వా. వి కవచము: చూ, వారవాణము.

**దగా**. వా. వి. మోసము.

**దగాకోరు**, వా. వి. మోసగాడు.

**దగ్గఱ**, దే. వి రూ-డగ్గఱ: చూ, సమీపము. 1.

**దగ్గఱవాడు**, వా. వి. 1 అంతేవాసి. చూ, సన్నిహితుడు; 2. దగ్గఱచుట్టము: చూ, సన్నిహితుడు; 3. జ్ఞాతి: చూ, సన్నిహితుడు.

**దగ్గఱించు**, దే. అ. క్రి: చూ, రూ-డగ్గఱించు.

**దగ్గఱు**, దే. అ. క్రి —పై.—(రూ-డగ్గఱు)

**దగ్గు**, దే. వి. 1; రూ-డగ్గు, ఉక్కిస, ఉబ్బసము. కక్కవాయి, కుముకు, గస. (సం. వ.)—కాశము-రూ-కాసము, క్షయ థువు- క్షవథువు, క్షయము, క్షవకము-క్షవము, ? చార్ చి; తద్వ.—పొడిదగ్గునకు, (చూ, రోగము. 1): అ. క్రి 2. చూ, రూ-డగ్గు. 2.

**దగ్ధ**, సం. వి. ఆ. స్త్రీ 1. సూర్యుడున్నదిక్కు; చూ, హరిత్తు: 2; కర్కాటకదళము; విశే. 3. కాల్చబడినది; చూ, ప్లుష్టము.

**దగ్ధపటన్యాయము**, న్యా. మడతపెట్టినబట్ట కాలిపోయిన మడతలు మడతలుగాను నూలిపోగులు స్పష్టముగాను గాన్పించును. కాని చేతితో బట్టికొనిన విడిపోవుననురీతి.

**దగ్ధపదమార్జాలన్యాయము**, న్యా. నలుగురు దూది వర్తకులు పిల్లినిఁ బెంచిన కథ. అందు న్యాయాధికారి తీర్పురీతి. (కాలుకాలిన పిల్లివలె.)

**దగ్ధబీజన్యాయము**, న్యా. కాలిన లేక వేగిన విత్తనము మొలకెత్తని విధము.

**దగ్ధమగు**, మి. అ క్రి. ఎరియు: చూ, మండు. 1.

**దగ్ధము**, సం. విశే. కాల్చబడినది: చూ, ప్లుష్టము.

**దగ్ధిక**, సం. వి అ స్త్రీ. మాడినవంటకము, మాడు: చూ, పాదము. (1).

**దచ్చి**, దే. స. ఎనిమిది. సారం. 1, ఆ. 37: ఇరునాలుగు, ఎనిమిది రూ-ఎన్మిది, దచ్చవుక-రూ-దచ్చొక. (సం. ప.) — అష్టకము, ఆయువు, గణము.

**దచ్చికవలు**, ద్వి. వి. ఎనిమిది దిక్కులు.

**దచ్చికాళ్ళమెకము**, ద్వ వి. చూ, శరభము. 1.

**దచ్చియడుగుల మెకము**, —పై.— సాంబ తిర్య. 4.

**దచ్చవుక**, వై. స. రూ-దచ్చొక (దంట + చవుకము): చూ, దచ్చి. కళా. 3, ఆ. 131.

**దచ్చొక**, —పై.— "మ....దచ్చొక చౌవంచి యి, త్రిగబారాడుగ" కళా. 3, ఆ. 31; "ద్వి....దచ్చొక, మసిదాయ మాడు." పండితా. పురాతన. 125. పుట.

దజిబ్రాహ్మణులు, అం: చూ, బ్రాహ్మణులు.
దట్టి, దే వి రూ-దట్టా. అంశ. ఆం, భా. ద్వి. 243: చూ, దండ.6.
దట్టన, దే. వి: చూ, తర్జనము.
దట్టమగు, వా. అ. క్రి. ఘనమగు; చూ, వ్యాపించు.
దట్టము, దే. వి. 1, పావడ. స్వా. 6. అ. 8: చూ, వస్త్రము; 2. తటము: చూ, మొత్తము: విణ. 3 తఱచైనది. "దట్టకెంపు": చూ, మొత్తము; 4. చిక్కదనము: చూ. సాంద్రము. 2; 5. విశేషము. భార. విరా, 3, అ; 16; చూ, వెలితి. 1.
దట్టా, దే. వి: చూ, రూ-దట్ట.
దట్టీ, వై వి = ధటీ. రూ-దట్టీ. 1. డిండు, కాసె. చూ, వస్త్రము; వా. 2. నడికట్టు, కాసెకోక: చూ, వస్త్రము; 3. చలాపము. చూ, వస్త్రము.
దట్టించు, వై. స. క్రి 1: చూ, దట్టిగట్టు; దే. 2: చూ, కట్టించు భాగ. 7, స్కం. 144.
దట్టింపు, వై. వి. దట్టించుట; చూ, ఘ. 5.
దట్టిగట్టు, వా. అ. క్రి: చూ, కచ్చించు. 2.
దట్టీ, వై వి = చూ, రూ-దట్టి. కళా. 3, అ. 285.
దట్టుడు, వై. వి = ధృష్టః. ధీరుడు. భార. అర. 5, అ 223, చూ, దిట్టడు.
దడ, వై. వి. 1. = ధటః. కంపము (దేశ్యమని శ. ర): చూ, లోలము; 2. = ధటః: చూ, దాళా; 3. = ధటః. కొయ్య త్రాసు: చూ. త్రాసు.
దడకట్టు, ద్వ. స. క్రి. పాత్రాదులను సరియెత్తు తాటితో దడ తట్టనుంచి తూచు; చూ, పడికట్టు. 4.
దడదడ, దే. వి 1. దబదబ, శీఘ్రము. ఆం, భా. ప్ర. 65: చూ, స్యదము; 2. నియమము లేనివడి: చూ, వేగము. 3; 3. ఆకోపము; చూ, సంభ్రమము. 1; క్రి. విణ. 4. (నియమము లేనిది) వడిగా.
దడదడమను, దే. అ. క్రి. దడదడకొట్టుకొను.
దడబడ, దే. వి: చూ, సంభ్రమము. 1.
దడబిడ, —వై.— "దడబిడ లగ్నము, తాతకుపెండ్లి."
దడము, దే. విణ. 1. దట్టము; చూ, సాంద్రము. 2; వై. వి. 2. = దళ: చూ, సేన, 1: 3. గుంపు. భార. ఉద్యో. 1, అ. 220: చూ, సమూహము; 4. లోహదళము: చూ, లోహము. 1
దడారి, వా. విణ అనాయాసముగా సంపాదించువాడు.
దడారిబేరము, వా. విణ. అనాయాసముగా లభించిన బేరము.
దడి, దే. వి. తడిక-రూ-తడుక-తడక-తడికె: చూ, మఱుగుగోడ: (చూ, వాకిలి.)
దడిగ, దే. వి. ఖేటకము. చూ, హరిగ.
దడిబము, వై. వి. = తలిమ. (రూ-దడిమము - దడివము - దలిమము)-తలిమము - తలివము: చూ, శయ్య. 1.
దడిమము, —వై —; దే. విణ. 2. సన్నము. కళా. 7, అ. 65: చూ, సూక్ష్మము. 4.
దడియ, దే. వి. ఉపత్యక, కొండచేరువనేల: చూ, భూమి. 1.
దడియంబడు, ద్వ. అ. క్రి. (దడియన్ + పడు) రూ-దడియగఁబడు. దడియు. లక్ష్మీ. 1, అ. 80: చూ, వణకు. 2,
దడియము, దే. వి. (రూ-దడెము-దద్దియము-దద్దెము) 1. పదినేరుల యెత్తు, అయిదునేరుల యెత్తు (అని కొందఱు); 2. పీసెపట్టు.
దడియు, దే. అ. క్రి: చూ, దడియఁబడు.
దడివము, వై. వి. 1. = తలిమ: చూ, రూ-దడిమము. 1; దే. విణ. 2: చూ, రూ-దడిమము. 2.
దడెము, దే. వి: చూ, రూ-దడియము.
దద్దియము, —వై.—
దద్దెము, 1.—వై.—; 2. మట్టికంచము, సానె: చూ, పాత్రము. 6. (రాయలసీమయందువాడుక.)
దణా, వై వి = దళ; చూ, సేన. 1.
దణాయకుఁడు, వై. వి. = ధన్వీ: చూ, సైనికుడు.
దణాయించు, వా. వై. అ. క్రి. నిండు, క్రిక్కిఱియు, కూర్చుండి కదలరు.
దణి, వై. వి = ధన్వి. (రూ - దణియ - దణె - దణాయకుఁడు.) 1. జేండు. చూ, ప్రభువు 2; 2. చూ, దణాయకుడు.
దణియ, —వై.—
దణె, —వై.—
దణ్ణము, వా. వి. నమస్కారము "దణ్ణమండి."
దణ్ణెము, వై. వి. = దండికా; చూ, దండియ. 8. (దణ్ణెము అని కొందఱు.)
దత్తకుఁడు, సం. వి. అ. పుం దత్తపుత్త్రుఁడు: చూ, పుత్త్రుఁడు. 1.
దత్తత, సం. వి అ. స్త్రీ. = దత్తం. 1. అంగీకారము: చూ, సమ్మతము. 1; 2. పెంపు: చూ, పెంపకము. (వాడుకలోనిది.)
దత్తపుత్త్రశోకము, జా. దత్తుని చావునకేడ్చుట. (తెచ్చిపెట్టుకొనిన దుఃఖము.)
దత్తప్రదానికము, అం: చూ, వ్యవహారములు
దత్తబ్రాహ్మణులు, పా: చూ, కపూరియేబ్రాహ్మణులు: (చూ, బ్రాహ్మణులు.)
దత్తము, సం. వి. అ. న. 1. ఈవి: చూ, వితరణము; విణ. 2. ఇయ్యఁబడినది: చూ, ఇష్టము. 6. అవసృష్టము, ఉత్సృష్టము.
దత్తి, సం. వి ఇ స్త్రీ: చూ, దత్తము. 1.
దత్తిలుఁడు, అం. చూ, శాస్త్రప్రవర్తకులు,
దత్తు, వై. వి. = : చూ, దత్తత. 1—2.
దత్తుఁడు, సం. వి. అ. పుం. 1. ఒకానొకరాజు: చూ, రాజు. 1; 2. దత్తాత్రేయుఁడు; విణ. 3. తాకట్టుపెట్టఁబడినవాఁడు; 4 = దత్తు. దత్తపుత్త్రుఁడు; చూ, పుత్త్రుఁడు. 1; 5. పురుష జాతి చతుష్టయమునందొకఁడు: చూ, పురుషజాతులు; 6. చూ, పుత్త్రులు.
దద్దడము, దే. వి. రూ-దద్దళము. 1. అల్పదేవాలయము: చూ, సదనము. 1; 2 బోడిమిద్దె: చూ, సదనము. 1. (రాయలసీమలోని యిండ్లు చాలవఱకు దద్దడములే.)
దద్దరిల్లు, దే. అ. క్రి. రూ-దద్దిర్లు. తబ్బిబ్బుపడు, కళా. 5, అ. 24; చూ, భయపడు.
దద్దఱు, దే. అ. క్రి.—వై.—

దద్దళము, దే. వి: చూ, రూ-దద్దడము.
దద్దిల్లు, దే. అ. క్రి: చూ, రూ-దద్దరిల్లు.
దద్దు, వై. వి. రూ-దద్దుర.＝దద్రూ. చీమకుట్టుట లోనగువానిచే గలిగెడు బొబ్బ: చూ, దద్రువు.
దద్దుర, వై వి.＝—పై.—
దద్దుపోయిన పోనీ దుర్గనివారణమైనది, లో. ఒకపనిచేయుటచే కష్టము గలిగినపుడు, 'కష్టమువచ్చిన రానీ' ఆ పనిచేయలేదే అను అతృప్తిలేమి అనుపట్ల యీసామెత వాడెదరు.
దద్రుఘ్నము, సం. వి. అ. పుం. తగిరిస*; చూ, ప్రపున్నాటము.
దద్రుణుఁడు, సం. విశే. రూ-దద్దుణుఁడు, (దద్రువనుకుష్ఠరోగముగలవాఁడు) దద్రురోగి.
దద్రురోగి, సం. విశే.—పై.—
దద్రువు, సం. వి. ఉ. పుం.＝దద్దురు: గ్రంధి. (తె. ప.)—ఆకిమ-రూ-ఆకె-ఆకెము-ఆకియ-ఆనె. కంతి-రూ-కడఁతి-కణఁతి, దద్దు-రూ-దద్దురు, దొరను. తద్వి.— చీమలోనగునవి కుట్టిన దద్దురు.—(తె. ప.) కంతి: (చూ, మండలము. 3,) (దద్రువు కుష్ఠరోగజాతిలోనిది.)
దధి, సం. వి. ఇ. న. 1; చూ, పెరుఁగు. (దధిభేదములు.— అర్శోఘ్నము, ప్రాగ్రాటము, అఘనము.); 2. సరళమను ధూపద్రవ్యము; చూ, రాజాహ్వము; 3; చూ, మద్ది*.
దధిచారము, సం. వి. అ, పుం. కవ్వము: చూ, మంథానము.
దధిత్థము, సం. వి. అ, పుం. 1. మిసిమి; చూ, వెన్న; 2: చూ, వెలగ*.
దధిఫలము, —పై.—
దధిబుసము, సం. వి. అ. న. మీఁగడతీసిన పెరుఁగు. (మీఁగడ పెరుఁగు అర్శోఘ్నము); చూ, పెరుఁగు.
దధిమథము, సం. వి. అ. న. చిలుకుట: చూ, మథనము.
దధిసారము, సం. వి. అ. పుం: చూ, దధిత్థము.
దధిసముద్రము, అం. (పెరుఁగుసంద్రము): చూ, సముద్రములు.
దధివ్రీహిన్యాయము, న్యా. పెరుఁగును వడ్లును గలసినట్లుగా నేమియుపయోగకరము కాక యుండెననురీతి.
దధీచి, సం. వి. ఇ. పుం. దధీచియనుముని: చూ, ముని. 1.
దధీచిబ్రాహ్మణులు, అం. యజుర్వేదులు. వీరు గురువులుగను పైరుపెట్టెడి వారుగను యాచకులుగను ఉన్నారు. వీరికిపేరు దధీచియను ఋషినిఁబట్టి గలిగినది: చూ, బ్రాహ్మణులు.
దధ్యాకరము, సం. వి. అ. పుం: చూ, దధిసముద్రము.
దధ్యర్ణవము, —పై.—
దధ్యుదము, —పై.—
దనము, వై. వి＝ధనః. ఆస్తి, సొత్తు: చూ, విత్తము. 1.
దనియము, వై. వి＝ధన్యా. కొతిమిరి*. (తాపమును వాంతిని శ్వాసమును త్రిదోషములను పోఁగొట్టును. పచ్చిదనియాలు మాత్రము నధికపఱచును.): చూ, వితున్నకము. 1.
దనియాలు, వై. వి. బ.＝ధనికా-ధాన్యాక. కొత్తిమిరివిత్తులు. (విత్తులు చెప్పుతోరాచినగాని మొలకలెత్తవు. "దనియాల జాతి"): చూ, వితున్నకము. 1.
దనియు, దే. స. క్రి. కూడు: చూ, సంగమించు.
దనివు, దే. వి. కూడిక, సంగమము: చూ, సంయోగము.
దనుక, దే. ద్ర. రూ-దాఁక. పర్యంతార్థకము; చూ, వఱకు.

దనుకు, దే. స. క్రి. రూ-దన్కు. 1. రాఁకు: చూ, స్పృశించు: 2. పొందు, సక్తమగు: చూ, ప్రాపించు.
దనుజుఁడు, సం. వి. అ. పుం. రక్కసుఁడు (కశ్యపునకు దను భార్యయందుఁ గల్గిన సంతతి): చూ, రాక్షసుఁడు. 1.
దన్కు. దే. స. క్రి: చూ, రూ-దనుకు.
దప్పము, దే. విశే. దట్టము: చూ, సాంద్రము. 2.
దప్పళము, దే. వి. చూ, పులుసు.
దప్పి, దే వి. 1, రూ-డప్పి- దప్పిక, నీరుపట్టు. భార అర, 7 ఆ. 143. చూ, పిపాస; 2. అలసట: చూ, శ్రమము. 1.
దప్పిక, —పై. —(స్వార్థమున కప్రత్యయము.)
దఫా, వా. వి, తడవ, మరల.
దబకాయించు వా. స. క్రి. అదుము. గదమాయించు దబాయించు, బుకాయించు.
దబదబ, దే. వి తలుపులోనగునవి తట్టుట, పరుగెత్తుట, దాఁటుట, మొత్తుట లోనగువానియందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.
దబము, వై. వి.＝తపస్: చూ, తపస్సు.
దబరా, వా. వి. వెడల్పయినగిన్నె, దొగిడి: చూ, పాత్రము. 6.
దబాదిబ, దే. వి: చూ, రూ-దబదబ.
దబాయించు, వా. స. క్రి; చూ, దబకాయించు.
దబాలున, వా. ద్ర. ఒక్కమాఱుగా, దబుక్కున, డిబుక్కున, దిబ్బున; చూ, వేగము. 3.
దబుక్కున, —పై.—
దబ్బ, వై. వి. 1.＝దర్భ:* చూ, తృణము. 1; 2. కాఁడిబద్ద: చూ, బద్ద. 3; 3. వెదురుబద్ద: చూ, బద్ద, 2: దే. వి. 4. నాగరంగము* (దీనిభేదములు:—కోలదబ్బ, తియ్యదబ్బ, దూడిదబ్బ, పుల్లదబ్బ, నారదబ్బ మొ.): చూ, శర్కరాంకము.
దబ్బకము, దే. వి. 1, రూ-దబ్బు-దబ్బకు, మూఁకుడు, సిబ్బి (మూఁతకనియు): చూ, పాత్రము. 6; వా. వి. 2: చూ, రూ-దబ్బనము.
దబ్బడించు, దే. స. క్రి. 1: చూ, బోరలించు; 2. చేతులతో చఱచు: చూ, పటుకరించు.
దబ్బనము, దే. వి. రూ-దబ్బకము. గోనెకుట్టెడుసూది, బృహత్సూచి: చూ, సూది.
దబ్బయుంగరము, ద్వ. వి. పవిత్రపుముడివలె బంగారుతో చేసిన యుంగరము: చూ, భూషణము. 2.
దబ్బర, దే. వి. అరివాణము: చూ, పాత్రము. 6.
దబ్బఱ, దే. వి 1. (రూ-డబ్బఱ-దబ్బు-డబ్బ-కబ్బు.) బొంకు: చూ, వితథము; వై. వి. 2.＝దభ్ర. (దేశ్యమని శ. ర.) మోసము. అచ్చ. బాల, కాం. 172; చూ, వంచన; దే. వి. 3. ఆపద: చూ, విపత్తు; 4. తప్పు: చూ, నేరము; విశే. 5. కల్లరి: చూ, బొంకుకాఁడు; 6. మోసకాఁడు: చూ, వంచకుఁడు. 1.
దబ్బఱకత్తియ, ద్వ. వి: దబ్బఱలాడునది. దబ్బఱి: చూ, స్త్రీ. (రూ-దబ్బఱకత్తె.)

**దబ్బులకాఁడు**, దే. విశే. 1. కల్లరి: చూ, బొంకులాఁడు; 2. మోసకాఁడు: చూ, వంచకుఁడు. 1.

**దబ్బులి**, దే. విశే. (దబ్బుల + ఇ) 1; చూ, దబ్బులకాఁడు. 1; 2: చూ, దబ్బులకాఁడు. 2; 3; చూ, దబ్బులకత్తియ.

**దబ్బువాఁడు**, ద్వ. వి. మేదరవాఁడు; చూ, వేణులావకుఁడు.

**దబ్బుప్రేలు**, ద్వ. వి. పవిత్రపుప్రేలు: చూ, వెలు. 2.

**దబ్బాటు**, దే. క్రి. విశే: చూ, రూ-డబ్బాటు.

**దబ్బిచిప్ప**, దే. వి. కొబ్బరి, తాటి లోనగువాని తుండ్లను బ్రద్దలు చేసెడి పనిముట్టు.

**దబ్బిలి**, దే వి: చూ, ధూర్త. 1—2.

**దబ్బు**, దే. వి. 1. వచనము. సా. 1, ఆ. 71; చూ, శబ్దము, 2; వై. వి. 2. = దంభ (దేశ్యమని శ. ర.) బొంకు: చూ, వితథము; దే. వి. 3: చూ, రూ-దబ్బడము; 4. చఱచుటలోనగు వానియందగు ధ్వన్యనుకరణము, దిబ్బు: చూ, హూహూ; స. క్రి. 5. అను: చూ, వచించు.

**దబ్బుడు**, దే. వి. మూఁత: చూ, దబ్బడము.

**దబ్బున**, దే. ద్ర. క్రి. విశే. శీఘ్రముగా: చూ, వేగము. 3.

**దబ్బర**, దే. వి: చూ, రూ-డబ్బర.

**దబ్బువెట్టు**, దే. స. క్రి. కప్పు: చూ, మూయు

**దభ్రము**, సం. విశే. 1. = దబ్బర, మోసము: చూ, వంచన; 2. సన్ననినూలుపోఁగు: చూ, పోఁగు. 1.

**దమథము**, సం. వి. అ. పుం. 1. క్లేశము నోర్చుతనము, (బ్రహ్మచర్యాది క్లేశమును సహించుట): దమము, దాంతి; 2. దండనము: చూ, శిక్ష. 2.

**దమనము**, సం. వి. అ. న. 1. అణఁచుట: దమము; పుం. 2. = దవనము. రూ-దవనము (అని కొందఱు): చూ, రుచి. (వాసనమొక్క): అం. 3: చూ, అస్త్రములు: (చూ, బాణము. 1.); వా. 4. వ్యవహారమున — యజ్ఞాదిక్రతువులకు చేయు ధర్మము. "దానదమనవిక్రయాద్యధికారములు."

**దమనుఁడు**, సం. వి. అ. పుం. 1. ఒకముని: చూ, ముని. 1; 2. శూరుఁడు: చూ, హంవీరుఁడు. 2; విశే. 3. అణఁచువాఁడు: దమి.

**దమము**, సం. వి. అ. పుం. 1. దండోపాయము: చూ, దంతము. 26; 2. చూ, దమథము. 1; 3. బ్రహ్మచర్యాది క్లేశములనోర్చుట: దాంతి. (ఇంద్రియనిగ్రహము): 4: చూ, దమనము. 1; 5. = దమ్మ, అడుసు. నీరుపెట్టి దున్నిననేల అనియు): చూ, బురద; అం. 6: చూ, మానసిక పూజా కుసుమములు.

**దమయంతి**, వా. నలునిభార్య (తనయందముచేత నితరులను దమింపఁజేయునది: చూ, భార్య.

**దమి**, సం. విశే. చూ, దమనుఁడు. 3.

**దమించు**, సం. స. క్రి. అణఁగఁద్రొక్కు: చూ, పిసుకు. 3. (రూ-దమియించు అనియు.)

**దమితుఁడు**, సం. విశే. అణపఁబడినవాఁడు. (ఆచార్యాదులచేత శిక్షింపఁబడిన శిష్యుఁడు.): దాంతుఁడు.

**దమునసుఁడు**, సం. వి. స. పుం. అగ్నిహోత్రుఁడు: చూ, వహ్ని. 1.

**దమ్మఁడు**, వై. విశే. = ధార్మిక. కపటములేనివాఁడు. హరిశ్చం. 4, ఆ. 101: చూ, నిష్కపటి. 2.

**దమ్మము**, వై. వి. 1. = ధర్మమ్: చూ, పుణ్యము. 1; దే. వి. 2. నాలుగుకాసుల నాణెము: చూ, తారము. (1).

**దమ్మిడి**, దే. వి. 1. పైస, అణాలో పంద్రెండవవంతు, అయిదుకాసుల నాణెము; చూ, రువ్వ. 1; 2. రెండుకాసుల నాణెము: చూ, రువ్వ. 2.

**దమ్ము**, వై. వి. 1. = దమః. అడుసు; చూ, బురద, 2. నీరుకట్టి దున్నినదుక్కి: (చూ, బురద.)

**దమ్ముకొను**, ద్వ. అ. క్రి. అడుసగు, పంకిలమగు.

**దమ్ముపలక**, వా. వి. అడపట్టె-రూ-అడ్డపట్టె.

**దమ్యము**, సం. వి. అ. పుం. వత్సతరము; చూ, వృషభము. 1.

**దయ**, సం. వి ఆ. స్త్రీ. 1: అనుకంప - రూ - అనుకంపము (దయారసము), అనుక్రోశము, అర్తనము. అహోబత, ఊ, ఓ, కరుణ, కారుణ్యము, కారుణ్యము, కృప, ఖంబు, ఖమ్, ఘృణ, జనని, జుగుప్స, ణ, తా, ప్రేమ-రూ-ప్రేమము. (తె. ప.).—అక్కటిక-రూ-అక్కటికము, అక్కసము, ఉబలాటము, ఒగచదము, కనికరము, జాలి, నిబ్బరము: (చూ, రసములు). (చూ, ప్రేమము); అం. 2. దీనికి ఉపమానములు, విష్ణుమూర్తి, బుద్ధుఁడు; అం. 3. చూ, యోగయమాంగములు: (చూ, అంగము. 9 )

**దయచేయు**, మి. అ. క్రి. 1: కరుణించు పాండు. 5, ఆ. 154: చూ, రూ-దయసేయు; స. క్రి. 2. అందించు-అందిచ్చు, అందియిచ్చు, అందఁజేయు, అచ్చు, అచ్చుకొను, ఇచ్చు, ఇచ్చు, ఒసఁగు, ఒసవు. నిర్వ. 3, ఆ. 81: చూ, పెట్టు. 8; వా 3. కూర్చుండు; 4. రండు, రా. 5. పొండు, పో.

**దయసేయు**, మి. అ. క్రి: చూ, రూ-దయచేయు. (కరుణించుటకు.—అక్కటికించు, కనికరించు, దయచేయు, దయసేయు, నిబ్బరికించు. (సం. ప.): కరుణించు.

**దయాపరము**, సం. విశే: చూ, కరుణాపరము.

**దయాపరుఁడు**, సం. విశే. దయాళువు: చూ, సురతుఁడు.

**దయావతి**, అం. చూ, శ్రుతులు.

**దయాళువు**, సం. విశే. ఉ. చూ, దయాపరుఁడు.

**దయిత**, సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రియురాలు: చూ, స్త్రీ: 2. ఆఁడుది. చూ, స్త్రీ.

**దయితము**, సం. విశే. కోరఁబడినది: చూ, వాంఛ.

**దయితుఁడు**, సం. వి. అ. పుం. 1. ప్రాణనాథుఁడు: చూ, ప్రియుఁడు; విశే. 2. ఇష్టుఁడు: చూ, స్నేహితుఁడు. 1.

**దయివాఱు**, దే. అ. క్రి. రూ-దైవాఱు. 1. అతిశయించు. చూ, ముమ్మరించు; 2: చూ, పొరలిపాఱు.

**దయ్యపుకంటికిఁ బేలపుగింజ పెద్దది**, లో. ఉదా. "అక్కటకటా! దయ్యంబ నీకంటకిం బేలపుగింజయుం బెద్దదయ్యనే."(శృంగార నైషధము.)

**దయ్యము**, వై. వి. 1 = దైవమ్. పిశాచము. రాఘ. 3, ఆ. 23; చూ, భూతము; 2. = దైవమ్. దేవుఁడు. రాఘ. 3, ఆ. 23; చూ, వేలుపు; 3. విధి: చూ, బ్రహ్మ. 1. (అని కొందఱు.) (ఇది విచార్యము.)

దయ్యు, దే. అ. క్రి. 1. రూ-దయ్యు. బలహీనమగు: చూ, వలియు; 2. కృశించు: చూ, శోషించు.

దర, వై. వి.=ధర: చూ, వెల. 1. (కొనఁదలఁచి ధర తెలిసి కొనుట.)

దరఖాస్తు, వా. వి. విన్నపము "వారంటు దరఖాస్తు, నీటి దరఖాస్తు, పరీక్షదరఖాస్తు" మొ

దరణము, వై. వి.=ధరణము. ఎనిమిది డబ్బుల నాణెము. (దేశ్యమసి శ. ర.)

దరదము, సం. వి. అ. న. రూ-పారదము. ఇంగిలీకము: చూ, హింగుళము.

దరము, సం. వి. అ పుం, న. 1. భయము: చూ, వెఱపు; 2. శంఖము చూ, సంక; 3. గొయ్యి, గుంట: చూ, రంధ్రము. 1; అవ్య. 4. ఇంచుక "దరహాసము"; చూ, స్వల్పము.

దరహాసము, సం. వి అ. పుం. చిఱునవ్వు: చూ, హాస్యము. 1.

దరి, సం. వి. ఈ. స్త్రీ. 1. గుహ. కృత్రిమమైన (మనుజులు త్రవ్విన) గృహాకారమైన పర్వతబిలము: చూ, రంధ్రము. 1. (చూ, పర్వతము); వై వి. (1)=తీరమ్. గట్టు. పాండు 4, ఆ. 40. చూ, రోధస్సు; (2)=తీరమ్. దగ్గఱ సా. 3,ఆ. 232: చూ, సమీపము. 1; (3) మేర: చూ, సీమ. 1.

దరికొను, దే. అ క్రి. 1. ఎరియు, కాలు (అని కొందఱు): చూ, మండు. 1; ప్రే. 2. దరికొలుపు.

దరిజీ, వా. వి కుట్టుపువాఁడు: చూ, సౌచికుఁడు.

దరితుఁడు, సం విశే. భయపడినవాఁడు: చూ, వెఱపరి.

దరిద్రము, సం. వి అ. న. లేమి: చూ, బీదతనము.

దరిద్రుఁడు, సం. విశే: చూ, బీదవాఁడు.

దరిలేని, దే. వి. దైన్యముగలవాఁడు. దీనుఁడు. జై. 5, ఆ. 186; చూ, ప్రాయిడి.

దరిమిలా, వా. క్రి విశే. తరువాత. "దరిమిలా యీనామము", "దరిమిలా సంగతులు."

దరియాప్తు, వా. వి రూ-దర్యాప్తు. విచారణ.

దరిసించు, వై. స. క్రి. 1.= దర్శ. చూచు: చూ, వీక్షించు; 2. కానుకగానిచ్చు: చూ, పెట్టు 6; వా. 3. (కోపాతిశయముచేత) ఉచితముగానిచ్చు. "నీకేమి? నేను వానికిదరిసించుకొనెదను."

దరిసెనము, వై. వి.=దర్శనమ్. రూ-దర్సెనము. చేదరిసెనము, చేకానుక: చూ, లంచము.

దరుజు, దే. వి. 1. గోడలకు పూయు సున్నపుగచ్చు: చూ, లేపనము. 2; 2. సున్నము తాళ్ళతో కలుపుట.

దరుమము, వై. వి.=ధర్మమ్. న్యాయము: చూ, సత్యము. 1.

దరువు, వై. వి. 1. గీతివిశేషము; 2.=ధృవ. (సూళాది సప్త తాళములలో నొకటి: చూ, సూతకములు; వా. వి. 3. శరీరమందలి కండరాపుష్టి బలము. "నీకు మునుపటివలె లేదు. ఒడలంతయు దరువుతీసినది"; 4. కొట్టుట. "పాఠము రానందున పంతులు పిల్లవాని నొక్క దరువుతీసినాడు".

దరువుచేయు, వై. అ. క్రి: చూ, తాళగించు.

దరేఖానా, వా. అవ్య. 1. దిక్కులేక; 2. అంతులేని; 3. లెక్కలేని.

దరోబస్తు, వా. వి. సర్వము.

దర్జీ, వా. వి: చూ, రూ-దరిజీ.

దర్దుర, సం. వి. అ స్త్రీ దుర్గ: చూ, పార్వతి 1.

దర్దురము, సం. వి. అ. పుం. 1. కప్ప: చూ, మండూకము. 1; 2. మబ్బు: చూ, మేఘము. 1.

దర్దురా యత్ర వక్తారస్తత్ర మౌనంహి శోభనమ్, న్యా. కప్పలు మాటకారు లయినచో మాట్లాడకుండుటయే శోభ. అట్లే నీచులు ప్రభువులయినచోట మౌనావలంబనముయే మంచిది.

దర్పకుఁడు, సం. వి. అ. పుం. దుర్గతిని బొందువాఁడు: చూ, మన్మథుఁడు.

దర్పణము, సం. వి. అ. పుం. 1. అద్దము: చూ, ముకురము; అం. 2: చూ, జన్యతాళములు.

దర్పము, సం. వి. అ. పుం. 1. గర్వము: చూ, హంకారము; 2. కస్తూరి: చూ, మృగమదము; అం: చూ, అష్టఘుము.

దర్పించు, సం అ. క్రి. గర్వించు: చూ, హంకరించు.

దర్బారు, వా. వి. 1. కచ్చేరి, కొలువుకూటము: చూ, సభ 2; 2. దర్బారు అను రాగము: చూ, స్వరము. 2.

దర్భ, సం. వి అ. పుం. 1.=దబ్బ. కుశము, పవిత్రము, కుశము: చూ, తృణము. 1; అం. 2: చూ, అర్ఘ్యములు.

దర్భముద్రిక, సం. వి. ఆ. స్త్రీ దర్భయుంగరము. పాండు. 3,ఆ. 60: చూ, భూషణము. 2.

దర్భలు, అం. కుశము, కాశము, యవము, దూర్వము, విశ్వామిత్రము, ఉశీరము, కుందురము, గోధూమము, వ్రీహి, ముంజము (10.)

దర్యాప్తు, వా. వి: చూ, రూ-దరియాప్తు.

దర్వి, సం. వి. ఈ. స్త్రీ. 1. మిక్కిలి చిన్నగరిఁటె, మిళ్ళి, ఖజపము: చూ, పాత్రము. 6; తద్వి.— గరిఁటెను, చిల్లులగరిఁటెకు. కట్టిరిఁటెకు—: చూ, పాత్రము. 6; 2. పాము పడగ: చూ, సర్పము.

దర్వీకరము, సం. వి. అ. పుం. పాము: చూ, సర్పము.

దర్వీపాకరసన్యాయము, న్యా. గరిఁటె సమస్తవస్తువులలోను మెలఁగుచున్నను ఆవస్తువుల రుచి దానికిఁ దెలియదనురీతి.

దర్శకుఁడు, సం. వి. అ. పుం. చూచువాఁడు, ద్వారపాలకుఁడు: చూ, ప్రేక్షకుఁడు; విశే. 2. చూపెడువాఁడు: దర్శయిత; 3. నేర్పరి: చూ, సమర్థుఁడు.

దర్శనము, సం. వి. అ. న. 1. చూపు: చూ, వీక్షణము; 2. కన్ను: చూ, లోచనము; 3. అద్దము: చూ, ముకురము; 4. తెలివి: చూ, బుద్ధి; 5. కల: చూ, స్వప్నము; 6. శాస్త్రము: చూ, శాస్త్రములు; 7. ధర్మము: చూ, పుణ్యము. 1; 8.=దరిసెనము, కానుక; చూ, లంచము; అం. 9: చూ, దశావస్థలు; 10: చూ, ద్వాదశావస్థలు.

దర్శపూర్ణమాసేష్టి, అం: చూ, హవిర్యజ్ఞములు.

దర్శని, సం వి ఈ. స్త్రీ: చూ, రూ-దర్శని.

దర్శనీయము, సం. విశే చూడఁదగినది: చూ, వీక్ష్యము. 2.

దర్శము, సం. వి అ. పుం. 1. అమావాస్య: చూ, సూర్యేందు సంగమము (చూ, తిథులు); 2. అమావాస్యనాఁడు చేయఁ

దగినయిష్టి. చూ, యజ్ఞము; 3. చూపు: చూ, వీక్షణము; అం. 4. స— మ—హీనతానములు 7 లో నొకటి: చూ, స—మ—హీనతానములు: (చూ, సర్వతానములు.)
దర్శయిత, సం. విణ. చూపువాఁడు; దిక్కుచూపు.
దర్శవిపత్తు, సం. వి. ద్వి. పృ. చందమామ: చూ, హిమాంశువు.
దర్శించు, సం. స. క్రి. = పరిసించు. చూచు: చూ, వీక్షించు.
దర్శితము, సం. విణ చూపఁబడినది: చూ, వీక్షితము.
దర్శి, సం. వి. ఈ. స్త్రీ. 1. ఉపరత్న: చూ, మార్గము. 1, వా. 2. చూపెడు ఒకానొక యంత్రము. "దూరదర్శిని".
దర్సెనము, వై. వి = ; చూ, రూ-దరిసెనము.
దలపము, సం. వి. అ. పుం. ముఖత్రాణము: చూ, వారవారణము: (చూ, తనుత్రాణము.)
దలారి, దలాలి. వా. వి. తరగరి.
దలినము, వై వి. 1. = దలిమ; చూ, రూ-దడిబము; దే. విణ. 2. సన్నము: చూ, సూక్ష్మము. 4.
దల్లు, వై. వి. = జల: చూ, రూ జల్లు.
దవ, దే. వి. 1. చెఱకుకొన: చూ, తలవాడి; 2. ధూళి. ఆంధ్రభా. ద్వి. 220: చూ, రేణువు 1.
దవంత్రి, దే. వి. అగడిత: చూ, పరిఖ.
దవగము, వా. వి. ఎండాకు; చూ, సొరుగాకు.
దవడ, వై వి. = ; చూ, రూ-దవుడ.
దవనము, వై. వి. = దమనకః. వాసనగల మూలిక * చూ, దవి.
దవము, సం. వి. అ. పుం. రూ-దావము. 1. కార్చిచ్చు: చూ, వహ్ని 1; 2. అడవి: చూ, విపినము.
దవసము, వై వి = దాస్యమ్ కొలుచు. సినువసికము. (దేశ్య మని శ. ర.): చూ, సేవ. 1.
దవాగ్ని, సం. వి. ఇ. పుం. ఎరగలి: చూ, వహ్ని. 1.
దవాడబ్రాహ్మణులు, అం. నేపాళదేశపు బ్రాహ్మణులలో నొక తెగవారు: చూ, బ్రాహ్మణులు.
దవిష్ఠము, సం. విణ. మిక్కిలిదవ్వైనది: చూ, సుదూరము: (చూ, విప్రకృష్టము).
దవీయము, సం. విణ. = దవ్వు—వై.—
దవు, వై. విణ. = దవీయ: చూ, రూ-దవ్వు.
దవుడ, వై. వి = హాడా. తాలువు. (రూ-దవడ-దాఁవ-దౌడ.) బుగ్గలోపలిభాగము. (దేశ్యమని. శ. ర.): చూ, నెటవి.
దవుడసికాలుపట్టుకొను, దే. అ. క్రి: చూ, పణతిలపడ. అం, భా. ద్రో. 104.
దవుడు, వై. వి. = రూ-దౌడు. ధౌరితకమ్. అశ్వగతి: చూ, హయము; 2. = ధావనమ్: చూ, పరుగు. 2: 3. దండ యాత్ర; చూ, యుద్ధము.
దవురు, దే వి. రూ-దౌరు. కాంతి: చూ, వెలుతురు. 1.
దవురుగల్లి, వా. వి. మెడగగ: చూ, భూషణము. 2.
దవ్వ, దే వి. బ్రూనుండిమి మెత్తనిభాగము.
దవ్వు, వై. విణ.=దవీయము. (రూ-దవు-దౌ-దౌవు.) భార. అర. 2, ఆ 169. చూ, రూ-దవు.
దశ, సం. వి. ఆ. స్త్రీ. 1. = దెస. కాలకృతావస్థితి "శుక్ర మహాదశ మహారాజయోగమును ఇచ్చును.": 2. దీపపువత్తి: చూ, వత్తి. 2; బ. 3. బద్దె: చూ, వత్తె.
దశకంఠుఁడు, సం. వి. అ. పుం. పదికంఠములవాఁడు: చూ, రావణుఁడు.
దశకము, సం. స. ఈరేను: చూ, పది.
దశకోటి, అం: చూ, సంఖ్యాభేదములు.
దశదానములు, అం: చూ, దానములు.
దశనము, సం. వి. అ. న. 1. కవచము: చూ, వారవారణము, పు. 2 దంతము. (దీనిచేత వనితలయధరమును గొఱుకుదురు: చూ, పల్లు. 2; 3 శిఖరము: చూ, సుద. 3.
దశనవాసస్సు, సం. వి న్. న. పలువలువ: చూ, పెదవి
దశబలములు, అం. బుద్ధి, శక్తి, వీర్యము, ధ్యానము, జ్ఞానము, కృప, శీలము, బలము, దానము, ఉపేక్ష.
దశబలుఁడు, సం. వి. అ. పుం: చూ, బుద్ధుడు. 1.
దశభూమీశుఁడు, సం. వి. అ. పుం: చూ, దశార్హుఁడు.
దశమాతా హరీతకీ, న్యా. కరకకాయ పదిమందితల్లులపెట్టు
దశమి, సం. వి. ఈ. స్త్రీ. 1. పక్షమునందు పదియగుతిథి. "విజయదశమి"; చూ, తిథి: (చూ, తిథులు); విణ. న్. 2. మిక్కిలి వృద్ధుఁడు: చూ, వృద్ధుఁడు: 1; విణ. 3. పదియవది.
దశమీస్థుఁడు, సం. విణ. 1. నష్టవీర్యుఁడు; 2. ముదుసలి: చూ, వృద్ధుఁడు. 1.
దశము, అం; చూ, సంఖ్యాభేదములు.
దశరంధ్రములు, అం. (2 ముక్కు, 2 కన్ను, 2 చెవి, 2 మూత్ర-మలద్వార, నోరు, బ్రహ్మరంధ్రములు; స్త్రీలకు స్తనరంధ్రములు 2, గర్భమార్గమునంబొకటి అధికముగ గలవు.)
దశరథుఁడు, సం. వి. అ. పుం. సూర్యవంశపురాజు (పదిదిక్కులను రథములుగలవాఁడు : చూ, రాజు. 1.
దశరూపకముల లక్షణములు, అం. ౧ నాటకము, ౨. ప్రకరణము, 3. భాణము, ౪. ప్రహసనము, ౫ డిమము, ౬. వ్యాయోగము, ౭. సమవాకారము, ౮. అంకము, ౯. వీథి, ౧౦ ఈహామృగము, (వీనిలక్షణము లాయా పదములకింద వివరింపఁబడియె): చూ, రూపకములు.
దశరూపభృత్తు, సం. వి. ద్. పుం. వెన్నుఁడు; చూ, విష్ణువు. 1.
దశలక్ష, అం. చూ, సంఖ్యాభేదములు.
దశలు, అం. 1. బాల్య, యౌవన, కౌమారములు, మఱియు వార్ధక్యము: చూ, అవస్థలు; 2. రవి, చంద్ర, అంగారక, బుధ, బృహస్పతి, శుక్ర, శని, రాహు, కేతు దశలు (9).
దశవిధకావ్యగుణములు, అం. శ్లేషాది: చూ, కావ్యగుణములు.
దశవిధగమకములు, అం. ఆరోహణము, అవరోహణము, ఢాలు, స్ఫురితము, కంపితము, ఆహతము, ప్రత్యాహతము, త్రిపుచ్ఛము, ఆందోళము, మూర్ఛన. (10): (చూ,) ౧౫. గమకములు.)
దశవిధధాతువులు, అం: చూ, ధాతువులు.
దశవిధనాడులు, అం: చూ, నాడులు.
దశవిధనాదములు, అం: చూ, నాదములు,
దశవిధనియమములు. అం; చూ, నియమములు.
దశవిధప్రళయములు, అం: చూ, ప్రళయములు.
దశవిధప్రాణపురి, అం: చూ, పురులు,

దశవిధబ్రాహ్మణులు, అం. "దేవో ముని ర్ద్విజో రాజా వైశ్యశూద్ర బిడాలకః। పశుర్మ్లేచ్ఛశ్చ చండాలో దశవిప్రాః ప్రకీర్తితాః॥" ద్రావిడ గౌడాది భేదములచే నేర్పడుచుండు బ్రాహ్మణశాఖలవారియందుగల గుణధర్మాదుల ననుసరించి దేవ, ముని, ద్విజ, క్షత్రియ, వైశ్య, శూద్ర, బిడాలక, పశు, మ్లేచ్ఛ, చండాలు రను భేదములుగలవా రగుచుండిరని స్మృతికర్తలు నిర్ణయించిరి: చూ, బ్రాహ్మణులు.

దశవిధమన్మథావస్థలు, అం: చూ, దశావస్థలు.

దశవిధశాస్త్రలక్షణములు, అం: చూ, శాస్త్రలక్షణములు.

దశవిధసద్గుణములు, అం: చూ, సద్గుణములు.

దశశీర్షము, అం: చూ, శస్త్రములు.

దశసహస్రము, అం: చూ, సంఖ్యాభేదములు.

దశాకర్షి, సం. వి. న్. పుం. దివ్వె: చూ, స్నేహాశము.

దశాక్షము, అం: చూ, శస్త్రములు.

దశానామేకాదశన్యాయము, న్యా. ఏదియో కొంతమట్టుకు ఖర్చు చేయవలసి వచ్చినపుడు ఇంకొక కొంచెము సహింపవలెను. పదిలో పదునొకండు అనుకీతి.

దశార్హుడు, సం. వి. అ. పుం: చూ, బుద్ధుడు. 1.

దశాలి, సం. వి. ఈ. స్త్రీ. కంచెకోట: చూ, వెలుగు. 1.

దశావతారములు, అం: చూ, అవతారములు.

దశావతారుడు, సం, వి. అ. పుం. వెన్నుడు: చూ, విష్ణువు 1.

దశావస్థలు, అం. దర్శనము (చూచుట), మనస్సంగమము (తలచుట), సంకల్పము (కోరిక), జాగరము, కార్శ్యము (అరుచి), అరతి (చిక్కుట), అలజ్జ (సిగ్గువిడుచుట), ఉన్మాదము (అఱచుట), మూర్ఛ, మరణోద్యమము (చచ్చుట) (10): చూ, అవస్థలు: (చూ, కామము. 8.)

దశాహము, సం. వి. అ. పుం. మృతిపొందినవానికి బదియవ వాడు జేయు శ్రాద్ధము: చూ, శ్రాద్ధము.

దశేంద్రియములు, అం. నేత్రాది.—: చూ, ఇంద్రియములు.

దశోపనిషత్తులు, అం: చూ, ఉపనిషత్తులు.

దష్టము, సం. విశే. కఱవబడినది.

దసరా, వై. వి. = దశరాత్ర. దేవీనవరాత్రములు.

దసిలీ, దే. వి. 1. ఒకరకముపట్టు. కళా. 2, ఆ. 15: చూ, మొగ్గపట్టు: (చూ, పట్టు 17); 2. వదలు, పరిత్యాగము: చూ, విమోచనము.

దసువంది. దే. వి. గ్రుద్దులాటకు జెట్టీలను గూర్చువాడు.

దసెవ, దే. వి. ఒకానొకఆయుధము; చూ, బాణము. 1.

దస్కతు, వా. వి: చూ, సంతకము.

దస్తరము, వా. వి: చూ, రూ-దస్త్రము.

దస్తా. వా. వి. 1. ఇరువదినాలుగు కాగితములు (తావులు); చూ, పటపత్రము; 2. ఇరువదినాలుగు బాణములకట్ట; చూ, బాణము. 1.

దస్తావేజు, వా. వి. వ్రాతపూర్వకమైన సాధనము; చూ, పత్రము.

దస్తు, వా. వి. 1. పోగుచేసినసొమ్ము. చూ, విత్తము. 1; 2. వసూలయిన సొమ్ము: చూ, విత్తము. 1; 3. ధనము: చూ, విత్తము. 1.

దస్తూరీ, వా. వి. 1. చేవ్రాత: చూ, వ్రాలు; 2. ఇతరులవ్రాత; చూ, వ్రాలు, 3. చేవ్రాలు: చూ, సంతకము.

దస్యుడు, సం. వి. అ. పుం. 1. పగతుడు: చూ, శత్రువు. 1; 2. దొంగ: చూ, హారకుడు. 1.

దస్రులు, అం. అశ్వినీదేవతలు (రోగములను క్షయింపజేయువారు): చూ, అశ్వులు.

దస్త్రము, వా. వి: చూ, రూ-దస్తరము.

దహనము, సం. వి. అ. న. 1. కాల్చుట: ఓషము: చూ, ప్లోషము; పుం. 2. చిత్రమూలము*; చూ, వహ్నిసంజ్ఞము; 3. జీడి*: చూ, భల్లాతకి

దహనసంస్కారము, వా. వి: చూ, అగ్నిసంస్కారము.

దహనుడు, సం. వి. అ. పుం. 1. అగ్ని: చూ, వహ్ని. 1; విశే. 2. దుష్టుడు: చూ, వ్యాధుడు. 2.

దహించు, సం. స. క్రి. కాల్చు: చూ, వెలుగు. 5.

దళకొను, దే. అ. క్రి. రూ-దళముకొను, దళగించు, అధికమగు: చూ, హెచ్చు. 3.

దళగించు, —.పై.—

దళనము, సం వి. అ. న. 1. ఖండించుట: చూ, హతి; 2. చీల్చుట, భేదించుట: చూ, విదారణము. 1.

దళము, సం. వి. అ. న. 1. ఆకు: చూ, పర్ణము. 1; 2 = దడము-దణా. దండు; చూ, సేన. (తెనుగు అని కొందఱు; 3: చూ, హరిదళము; 4. భాగ్యము, అదృష్టము: చూ, సంపత్తి; దే. వి (1) ఆధిక్యము; చూ, హెచ్చు. 2; విశే. (2) అధికము. స్వా. 5, ఆ. 51: చూ. హెచ్చు. 1; (3) తఱచు, ఒత్తడము, చూ, మొత్తము; (4) దట్టము: చూ, సాంద్రము. 2.

దళముకొను, దే. అ. క్రి. 1; చూ, రూ-దళకొను; ప్రే. 2. దళముకొలుపు.

దళవరి, దే. వి. (దళము + వరి) 1. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము; వై. వి. 2. = దళవాహి. సేనాధిపతి, చూ, సైనికుడు.

దళవాయి, వై. వి. 1 = దళవాహి. (రూ-దళ్వాయి దళవరి): చూ, సైనికుడు; 2. రూ-దళ్వాయి. సుంకరిసహాయుడైన యుద్యోగస్థుడు.

దళవాహి, సం. వి. ఇ. పుం. = దళవాయి - దళవరి: చూ, సైనికుడు.

దళసంచు, దే. వి. (దళము + సంచు) దళముజాతి.

దళసరి, ద్వ. వి. (దళము + సరి) 1. ఘనత: చూ, సాంద్రము. 2; విశే. 2. తఱచు: చూ, దళము (3); 4. మందము, జాగు: చూ, విలంబనము. 1; వా. 5. మందము, (పొడవు వెడల్పు ఎత్తు అను మూడింటిలో నొకటి). "ఆ కమ్మి అడుగున్నర దళసరికలదు." 6. చిక్కన. "ఆ కాగితము దళసరి."

దళసూచి, సం. వి. ఈ. స్త్రీ. ముల్లు: చూ, సితాగ్రము.

దళస్నుహి, సం. వి. ఈ. స్త్రీ: చూ, సుఖవిరేచని.

దళించు, సం. స. క్రి. 1. ఖండించు: చూ, సెలగు; 2. విచ్ఛేదించు: చూ, భేదించు.
దళితము, సం. విశ. 1. భేదింపఁబడినది. (ఖండింపఁబడినది (అనియ్యు: చూ, విచ్ఛిన్నము. 3; 2. వికసించినది: చూ, హసితము. 1.
దళుఁకు, దే. వి. భయము: చూ, వెఱపు.
దళ్వాయి, వై. వి. = దళవాహి. చూ, రూ-దళవాయి.

## దా

దా, దే. విశ. 1. రూ-డా: చూ, సవ్యము. 1; వా. అవ్య. 2. రా, రమ్ము (ఉత్తరసర్కారులలో వాడుక.)
దాంతి, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-దమము. 3.
దాంతుఁడు, సం. విశ. రూ-దమితుఁడు. 1. గురు శిక్షితుఁడు: చూ, శిష్యుఁడు; 2. అడపఁబడినవాఁడు; 3. తపఃక్లేశము నోర్చువాఁడు.
దాంపత్యము, సం. వి. అ. న. ఆల్మగలభావము.
దాంభికుఁడు, సం. విశ = దాంభికుఁడు: చూ, ప్రాతిహారకుఁడు.
దాఁక, దే. ద్ర: చూ, రూ-దనుక.
దాఁకొను, దే. అ. క్రి. (దాఁపు + కొను): చూ, మఱుఁగుపడు.
దాఁగనమ్ముచ్చులు, దే. వి. బ: చూ, రూ-డాఁగిలిమ్రుచ్చులు.
దాఁగర, దే. వి. సేనావిశేషము: చూ, స్యోనము. చూ, సజ్జ
దాఁగినవాఁడు, దే. విశ: చూ, ఛ. 1.
దాఁగిలిమూఁతలు, దే. వి బ: చూ, రూ-దాఁగనమ్ముచ్చులు.
దాఁగిలిమ్రుచ్చులు, —పై.—
దాఁగు, దే. అ. క్రి. చూ, రూ-డాఁగు.
దాఁగుకొను, —పై.—
దాఁగురించు, దే. స. క్రి. 1. దాఁచు: చూ, మఱుఁగు; 2: చూ, వంచించు.
దాఁగురింత, దే. వి. దాఁగురించుట.
దాఁగురింతలు, దే. వి బ: చూ, రూ-దాఁగనమ్రుచ్చులు.
దాఁగురుమూఁతలు, —పై.—
దాఁచియుంచు, వా. అ క్రి: ఇల్లడయిడు.
దాఁచు, దే. ప్రే: చూ, రూ-దాఁగురించు. హరిశ్చ. 3, ఆ. 20
దాఁచుట, వా. వి: దాఁపతికము, దాఁపుడు, దాఁపురము, ఐందు (సం. ప.) — ఉపగూహనము, గుప్తి, గూహనము, గోపనము: (చూ, ఐందు.)
దాఁటడుగుపరువడి, అం: చూ, వినశాలు.
దాఁటడుగుమొన, అం. 1. —పై.—; 2; చూ, మొనలు.
దాఁటరి, దే. వి. కప్ప: చూ, మండూకము. 1.
దాఁటించువాఁడు, వా. విశ; చూ, ఉత్తారకుఁడు.
దాఁటు, వై. వి 1. వర్గము: చూ, సమూహము; ద్వ. వి. 2. ప్లుతగతిభేదము: చూ, హయము; దే. వి. 3. లంఘనము; చూ, లంఘు; వై. వి. 4. = ధాటీ. దండయాత్ర: చూ, యుద్ధము; 5. = ధాటీ దండు: చూ, సేన. 1; వా. 6. తప్పించుకొనిపోవుట; అ. క్రి. స. క్రి. హద్దునతిక్రమించు, అడుగుదాఁటు. అ. క్రి. 7: చూ, లంఘించు; స. క్రి. 8; చూ, తరించు: 9: అంగవించు, అడుగుపోఁటు, అతకరించు, అవషశించు, ఒత్తరించు, కడచు, గుంపించు, జవదాఁటు, తప్పు, తవియు, తిలకడచు, తుటారించు, మీఱు, మేర మీరు, వాలు. (సం. ప.)—అంతరించు, అతిక్రమించు, ఉల్లంఘించు, క్రమించు; (చూ, వాలు 12.)
దాఁటుకట్టు, ద్వ. అ. క్రి. గుంపుగూడు: చూ, సంతనకట్టు. 1.
దాఁటుకొను, దే. అ. క్రి; చూ, లంఘించు.
దాఁటుట, వా. వి: చూ, లంఘు.
దాఁటుడువల, దే. వి. ఒకానొకవల: చూ, వల. 1.
దాఁటుపరువడి, అం: చూ, పదవఘ్ల.
దాఁటులు, వా. వి. బ. పేరెములు; చూ, లంఘు.
దాఁపన, దే. వి. దాఁచుట.
దాఁపరము, దే. వి రూ-దావరము. దొంగిలించుట:చూ, హరణము.
దాఁపరించు, దే. స. క్రి. 1. దొంగిలించు: చూ, సడవు; వా. 2. తగులుకొను, వెంబడిఁచు. (వీఁడునాకుదాఁపరించినాఁడు.)
దాఁపరీఁడు, దే. వి. (దాఁపరము + ఈఁడు) దొంగ: చూ, హారకుఁడు. 1.
దాఁపతికము, దే. వి (దాఁపన + తికము): చూ, దాఁచుట.
దాఁపు, దే. ప్రే: చూ, రూ-దాఁచు.
దాఁపుడు, దే. వి: చూ, దాఁచుట.
దాఁపురము, 1.—పై.— కా. 6, ఆ. 256; 2. దాఁచినసొమ్ము. సా. 2, ఆ. 186; చూ, విత్తము. 1.
దాక, వై. వి. 1. = ద్రాక్ష: చూ, స్వాదుఫల; దే. వి. 2. బోగిణి: చూ, పాత్రము. 6; 3. వెడల్పునోరుగల అటిక: చూ, పాత్రము. 6.
దాకలి, దే. వి. (దాయి + కలు): చూ, రూ-డాకలి.
దాకల్లు, దే. వి. (దాపు + కల్లు) 1.—పై.—; 2. బండికంటి కడకమ్మి: కమ్మి. (సం. ప.) నేమి.
దాకొను, దే. అ. క్రి. (దాఁపు + కొను): చూ, సమీపించు.
దాక్షాయణి, సం. వి. ఈ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. రోహిణీనక్షత్రము: చూ, రిక్క. 1—౪; 3. అశ్విన్యాది నక్షత్రములు: చూ, రిక్క. 1; 4. నేల: చూ, భూమి. 1.
దాక్షాయ్యము, సం. వి అ. పుం. గ్రద్ద; బోరువ: చూ, హరివాహనుఁడు. (సంపాతి తమ్ముఁడు — అరుణాత్మజుఁడు, జటాయువు, జరాయువు; (చూ, హరివాహనుఁడు.)
దాక్షిణాత్య, అం. 1: చూ, పంచమజభాషలు: (చూ, భాష. 1); 2: చూ, భిన్నషడ్జకజభాషలు: (చూ, భాష. 1.)
దాక్షిణేయుఁడు, సం. విశ: చూ, రూ-దక్షిణ్యుఁడు.
దాక్షిణ్యము, సం. వి. అ. న: చూ, మొగమాటము.
దాక్షిణ్యుఁడు, సం. విశ: చూ, రూ-దక్షిణ్యుఁడు.
దాగలి, దే. వి; చూ, రూ-డాకలి.
దాచిని, వా. వి: చూ, రూ-దాల్చిని.
దాజపందాబ్రాహ్మణులు, అం. సామవేదులు. చండప్రచండులను నామాంతరముసయితముకలదు. వీరు గోభిల, ద్రాహ్యాయణ సూత్రముఁకుఁ జెందినవారు. కొందఱిపుడు కృష్ణయజుర్వేదము నవలంబించుచున్నారు: చూ, ఉత్కలులు (చూ, బ్రాహ్మణులు.)

దాపరించు, దే. అ. క్రి: చూ, సిద్ధించు.

దాపల, దే. వి. రూ-డాపల: చూ, సవ్యము. 1.

దాపలించు, దే. అ. క్రి. రూ-డాపలించు. 1. చుట్టివచ్చు. భార శల్య. 2, ఆ. 267: చూ, వలగొను; 2. చుట్టుకొను: చూ, వేష్టించు.

దాపించు, దే. అ. క్రి: చూ, సమీపించు.

దాపికుఁడు, సం. విణ. రూ-దాయికుఁడు. చూ, సాక్షితుఁడు.

దాపు, దే. వి. 1. భయము; చూ, వెఱపు: 2. ఎగ్గు: చూ, సమీపము. 1; స. క్రి. 3. చెక్కు: చూ, దాఁచు. 1.

దాపురమగు, దే. అ. క్రి: చూ, సిద్ధించు.

దాపురము, దే. వి: చూ, రూ-దాపురము.

దాప్యము, సం. విణ. దండుగఁగొనఁదగినది.

దాబి, వా. వి. ఒకానొకపిట్ట: చూ, పక్షి.

దామని, సం. వి. ఈ. స్త్రీ = దామెన: చూ, సూత్రము. 1.

దామము, సం. వి న్. పుం. న. 1. తలుగు: చూ, సూత్రము. 1; 2. హారము: చూ, భూషణము: 2

దామర, దే. వి. 1. ఉరిత్రాడు. వసు. 4, ఆ. 132: చూ, సూత్రము. 1; 2: చూ, రూ-దామెర.

దామెన, వై. వి = దామనీ. పెక్కు తలుగులుగల నిడివిత్రాడు; చూ, సూత్రము. 1.

దామెర, దే. వి. రూ-పలుదామ్మెర. మండలాకార కుష్ఠవ్యాధి: చూ, మండలము. 3.

దామోదరాయనమః. అం. శమదమాదిషట్కసంపత్తివలన సంస్కరింపఁబడిన శుద్ధమనస్సుచేఁ బొందఁదగిన వస్తువు కొఱకు నమస్కారము: చూ, ఓమ్.

దామోదరుఁడు, సం. వి అ. పుం. వెన్నుఁడు. (తులసిమాలిక యుదరమందు గలవాఁడు : చూ, విష్ణువు. 1.

దాయ, వై. వి. = దాయాదః 1. సగోత్రుఁడు: చూ, సగంధుఁడు. 2 పగతుఁడు: చూ, శత్రువు.

దాయఁగట్టు, దే. స. క్రి: చూ, ఉట్టుకట్టు.

దాయము, సం. వి. అ. పుం. 1. పంచుకొనఁదగిన తండ్రిసొత్తు: చూ, విత్తము. 1; 2. ఈవి: చూ, వితరణము; 3. అరణము; చూ, హరణము: 4. కట్నము; చూ, లంచము, 5. ఉల్లికుట్టుమాట: చూ, శబ్దము, 2; దే. వి. (1) ఆపద: చూ, విపత్తు; (2) పాచికలు గవ్వలు మొదలైనవానియందలి పందెము: చూ, వ్యవహారము, 4; (3) గవ్వలాట: చూ, వ్యవహారము. 4.

దాయాదుఁడు, సం. వి. అ. పుం. = దాయ. 1. జ్ఞాతి: చూ, సగంధుఁడు; 2. కొడుకు: చూ, సూనుఁడు, 1.

దాయి, సం. విణ. (న్. ఈ. న్.) 1. ఇచ్చువాఁడు: చూ, వదాన్యుఁడు; దే. వి. (1): చూ, డాకలి: వై. వి. (2). = ధాత్రీ: చూ, రూ-దాది; వా. క్రి. (3) దాఁచు.

దాయు, దే. అ. క్రి: చూ, రూ-డాయు.

దార, సం. వి. ఆ. పుం. బ. 1. అగ్నిసాక్షిగా వివాహమాడిన పెండ్లాము: చూ, భార్య: వై. వి. = ధారా. (1) త్యాగము: చూ, వితరణము; (2) కత్తియంచు: చూ వాదర; (3): చూ, సీటిచాలు. పా. 4, ఆ. 16, దే. వి. (4) క్రమము: చూ, విధము. 1.

దారకర్మ, సం. వి న్. న: చూ, వివాహము.

దారకుఁడు. సం వి అ. పుం. 1. బాలకుఁడు: చూ, శిశువు: 2. కృష్ణుని సారథి: చూ, సారథి; విణ 3. చీల్చువాఁడు: చూ, విదారకుఁడు

దారణ, వై. వి. = ధారణ. క్రయము: చూ, వెల, 1.

దారణము, సం వి. అ. న. చీల్చుట: చూ, రూ-విదారణము.

దారదము, సం. వి అ. పుం. 1. స్థావర, విషభేదము: చూ, హాలాహలము; 2. పాదరసము: చూ, సూతము; 3. ఇంగువ: చూ, హింగువు; 4. కడలి: చూ, సముద్రము; 5. రూ-దరదము: చూ, హింగుళము.

దారబంధము, వై. వి. = ద్వారబంధః. రూ-దోరము-దువారము: చూ, వాకిలి.

దారము, దే. వి. 1. చౌర్యము: చూ, ప్రుచ్చిలి; 2. నూలిత్రాడు: చూ, సూత్రము. 1.

దారముగట్టుట, జా. నాఁడనావనిన వానింగూర్చి నీవే దారముఁ గట్టితివా యనుట (నీవే పుస్తెకట్టితివా యనుట. పుస్తె = దారముతోఁ గూడినది, మంగళసూత్రము), స్వాధీనముచేసికొనుట, మంగళసూత్రము గట్టుట. "ఎవారును మనము దారము గట్టితిమని మీఁదిచూపు చూడరాదు." (ధర్మజ రాజసూయము )

దారి, వై. వి 1. = ద్వార్, చనుప: చూ, మార్గము. 1; 2. = ధారా. రూ-దోరి. కత్తియంచు: చూ, వాదర; 3. = ధారి. ధరించువాఁడు; 4. రూ తారి. చూ, సూత్రధారుఁడు; వా. 5. గతి, దిక్కు. "నాకేమిదారి."

దారించు, సం. స. క్రి. చీల్చు: చూ, విదారించు.

దారితము, సం. విణ. విదారితము, చీల్పఁబడినది: చూ, విచ్ఛిన్నము. 3.

దారితెన్ను. వా. వి. మంచిచెష్ట.

దారిదొంగ, వా. వి. ఎదత్రోవకాఁపరి: చూ, హారకుఁడు.

దారిద్ర్యము, సం వి. అ. న: చూ, పేదతనము.

దారిపన్ను, వా. వి: చూ, పన్ను. 1.

దారిలేమి, వా. వి. అధ్వానము, అమార్గము, నిర్జనత్వము.

దారుకీటము, సం. వి. అ. పుం. ఘుణము: చూ, పురుగు.

దారుణము, సం. వి. అ. పుం. 1. భయానకరసము: చూ, రసములు; విణ. 2. భయంకరము: చూ, రసములు; వా. 3. చెప్పనలవికానిది; 4. ఊహింపతరముకానిది; వ్రాయనలవి కానిది.

దారున, దే. ద్ర. క్రి. విణ. తటాలున. కళా. 5. ఆ. 87: చూ, స్వరము. 1.

దారుపురుషన్యాయము, న్యా. కట్టెమొద్దునుజూచి మనుష్యుఁడని భ్రమపడినరీతి.

దారువు. సం. వి ఉ. న. 1. కొయ్య: చూ, వంటచెఱకు; 2. దేవదారువు: చూ, సూక్ష్మదారువు; 3. ఇత్తడి: చూ, లోహము. 1.

దారుహరిద్ర, సం. వి. ఆ. స్త్రీ: చూ, మ్రానిపసుపు

దూష్యము, సం. వి. అ. న. 1. రాజగృహము: చూ, సదనము. 1; 2. బట్ట: చూ, వస్త్రము; విణ. 3. దూషింపఁదగినది: చూ, హీనము. 2.
దూసర, దే. వి: చూ, రూ-దుస్సర *.
దూసరి, దే. వి. 1. అపవాదము: చూ, నింద. 1; 2. దూసరి గడ్డి*: చూ, తృణము. 1.
దూసరులు, దే. వి. బ: చూ, ధాన్యము.
దూసిపోవు, వా. అ. క్రి: చూ, రూ-దుస్సిపోవు.
దూళి, వై. వి = ధూళి: చూ, రేణువు. 1.

## దృ

దృంభువు, సం. వి. ఊ. స్త్రీ: చూ, సర్వము. జై 1, ఆ. 10.
దృకు్క, సం. వి. చ్. స్త్రీ. రూ-దృశ. 1: చూ, లోచనము; 2: చూ, వీక్షణము; 3: చూ, బుద్ధి; విణ. 4. చూచువాఁడు.
దృగాయుధుఁడు, సం. వి. అ. పుం: చూ, శివుఁడు 1.
దృగ్ణము, సం. విణ. కూర్పఁబడినది: చూ, సంయోజితము.
దృఢదేశము, అం: చూ, దండవ్యూహములు.
దృఢనాభము, అం: చూ, శస్త్రములు.
దృఢము, సం. క్రి. విణ. అ. న. 1. అత్యంతము: చూ, హెచ్చు. 2; విణ. 2. అధికము: చూ, హెచ్చు. 1; 3. = దిటము. దిటవుగలది: చూ, స్థైర్యము; 4. = దిటము. గట్టిది: చూ, బెడిదము; 5. బలిసినది: చూ, స్థూలము. 2.
దృఢసంధి, సం. వి. ఇ. పుం. (దృఢమైన కీలుగల హస్తావ్యవయవము): చూ, సంహతము.
దృతము, సం. విణ. ఆదరింపఁబడినది: చూ, ప్రతీతము.
దృతి, సం. వి. ఇ. పుం. = తిత్తి. కొలిమితిత్తి, తోలుతిత్తి (అనియు): చూ, భస్త్రి.
దృతాఖ్యము, అం: చూ, ఉద్ధితకరణబంధములు.
దృప్తుఁడు, సం. విణ: చూ, పొగరుఁబోతు.
దృబ్ధము, సం. విణ. గ్రువ్వఁబడినది: చూ, స్యూతము.
దృశ, సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-దృకు్క.
దృశత్తు, సం. వి. చ్. స్త్రీ: చూ, రూ-దృషత్తు.
దృశ్యము, సం. విణ. 1. చూడఁదగినది: చూ, వీక్ష్యము. 1; అం. 2. కావ్యము.— దృశ్యము, శ్రవ్యము అని ద్వివిధము. అందు దృశ్యము (చూడఁదగినది), నాటకము (మురారి- శాకుంతలము లోనగునవి.) (దీనికే రూపకమని నామాంతరము): (చూ, అనూద్యము): చూ, కావ్యము. 4: (చూ, నాటకము. 1.)
దృషత్తు, సం. వి. ద్. స్త్రీ రూ-దృశత్తు. 1. శిల: చూ, రాయి; 2. సన్నెకల్లు: చూ, రాయి.
దృషత్పుత్రి, సం. వి. ఈ. స్త్రీ. పొత్రము: చూ, రాయి.
దృషద్వతి, సం. వి. ఈ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి. 1.
దృష్టం కిమపి లోకేఽస్మిన్ న నిర్దోషం ననిర్గుణమ్, న్యా. కేవలము నిర్దోషమైనదియు, కేవలము నిర్గుణమైనదియు, యేదియును ఈ లోకములో కనఁబడదు. అట్లే ప్రతివస్తువునందును గుణ దోషములు రెండును ఉండును.

దృష్టము, సం. వి. అ. న. రాజునకు తనబలము వలనను, పగవారివలనను పుట్టినబలము: చూ, శక్తి. 1; విణ. 2: చూ, వీక్షితము; అం. 3: చూ, దృష్టులు; 4. కావ్యలక్షణ-బన. — ధనయశఃప్రభృతులు: చూ, అదృష్టము.
దృషద్రజ, సం. వి. స్. స్త్రీ: చూ, రజస్వల.
దృష్టాంతము, సం. వి. అ. పుం. 1: చూ, ఉదాహరణము; 2. శాస్త్రము: చూ, శాస్త్రములు; 3: చూ, సావు; అం. 4. ఒక యర్థాలంకారము (వాక్యసాధర్మ్యము. ఉపమానోపమేయముల సాధారణ ధర్మములను బింబప్రతిబింబములవలె భిన్నవాక్యములతోఁ జూపుట): చూ, అలంకారము 3.
దృష్టాంతీకరించు, సం. స. క్రి: చూ, ఉదాహరించు.
దృష్టి, సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, వీక్షణము; 2. కన్ను: చూ, లోచనము (తద్వి.— దోషముచేత క్రూరమైనచూపునకు.— అదృష్టి.); 3: చూ, బుద్ధి; అం. 4: చూ, నాట్యోపయోగములైన యంగములు: (చూ, అంగము. 9.)
దృష్టించు, సం. స. క్రి: చూ, వీక్షించు.
దృష్టిక్రియలు, అం. సమము, ఆలోకితము, సాచి, ప్రలోకితము, ఉల్లోకితము, ఆవలోకితము, అనువృత్తము, విలోకితము, పార్శ్వగతము, యాతము, నిమీలితము, అర్ధనిమీలితము, ఉన్మీలితము, అధస్థలము, కంపితము, అంతర్మీలితము, ఊర్ధ్వతలము, వ్యావర్తము. (18): చూ, దృష్టిభేదములు: (మఱియు ఇందుకు సంబంధించినవి: చూ, రసదృష్టులు 8. దృష్టులు 8, సంచారీభావమునఁ బుట్టిన దృష్టులు 20.)
దృష్టిదోషము, సం. వి. అ. న: చూ, కనుఁబాటు.
దృష్టిభేదములు, అం. సమము, ఆలోకితము, సాచి, ప్రలోకితము, నిమీలితము, ఉల్లోకితము, అనువృత్తము, అవలోకితము (అనికొందఱు) (8): చూ, దృష్టిక్రియలు.
దృష్టిలక్షణావీక్షణము, అం: చూ, ప్రమేయములు.
దృష్టులు, అం. స్నిగ్ధము, హృష్టము, దీనము, క్రుద్ధము, దృష్టము, సభయము, జుగుప్స, విస్మితము (8).

## దె

దెంచనము, దే వి: చూ, రూ-దంచన.
దెందము, దే. వి: చూ, రూ-డెందము.
దెత్తి, వా. వి: చూ, భూతము.
దెప్పము, దే. వి. లెప్పము: చూ, లక్ష్యము 1.
దెప్పర, దే. వి రూ-దెప్పర. 1. అశుభము: చూ, హాని. 2; 2. అశక్యము: చూ, లావు. 7.
దెప్పరము, దే. వి. రూ-డెప్పరము. 1. అశుభము: చూ, హాని. 2; 2. చూ, విపత్తు; విణ. 3. అశక్యము: చూ, లావు. 7; 4. దుస్సహము: చూ, వెక్కసము. 4; వా. 5. దుర్లభము: చూ, రూ-డెప్పరము. 6.
దెప్పరములు, దే. వి. బ. దుస్సహవచనములు. భార. సభా. 2, ఆ. 255.
దెప్పరిలు, దే. అ. క్రి: రూ-దెప్పరిల్లు; చూ, బాధపడు.
దెప్పరిల్లు, దే. అ. క్రి.— ప్రై.—

దెప్పటికము, దే. వి. (దెప్పరము + టికము) దుస్సహత్వము: చూ, హెచ్చు. 1.
దెప్పిపొడుచు, వా. స. క్రి: ఒత్తిపొడుచు, దెప్పు-దెప్పు.
దెప్పు, దే. వి 1. ఎత్తిపొడుపు: చూ, సోత్ప్రాసము; స. క్రి. 2; చూ, రూ-దెప్పు.
దెప్పుడు, దే. వి: చూ, దెప్పు. 1. (బ, దెప్పులు)
దెబ్బ, దే. వి. కొట్టు: చూ, మొత్తు. 1.
దెబ్బసరులు, అం: చూ, ధాన్యము.
దెబ్బాటు, దే. వి. (దెబ్బ + ఆటు) బలిష్ఠమైనవాన: చూ, వాన. 2.
దెబ్బున, దే. ప్ర క్రి. విశే: చూ, వేగము. 3.
దెయ్యము, వా. వి. చూ, రూ-దయ్యము.
దెస, వై. వి. 1. = దిశా, దిక్కు. భార. ద్రో. 2, ఆ. 57; చూ, హరిత్తు. 1; 2. వైపు: చూ, పార్శ్వము. 2; 3. = దశా. అవస్థ: చూ, పాటు. 7; 4. = దశా. దురవస్థ: చూ, పీనుఁగుపెంట; 5: చూ, రక్షణము; 6. అండ: చూ, ప్రాపు. 2.

# దే

దేంద్ర, దే. వి: చూ, జేంద్ర.
దేంద్రవాఁడు, దే. వి: చూ, రూ-జేంద్రవాఁడు.
దేకి, వై. వి. = శ్రీకృష్ణునితల్లి, దేవకి: చూ, మాత. 1.
దేకిస, వా. వి: చూ, రూ-దేగిస.
దేకు, దే. స. క్రి: చూ, రూ-దేకు.
దేనము, వై. వి. = ధ్యాన. తలంపు: చూ, స్మృతి. 1.
దేబె, దే. విశే: చూ, ప్రాయిడి
దేమము, సం. విశే. ఇయ్యఁదగినది: చూ, హీనము. 3.
దేరిజ, దే. వి. రూ-దేరీజ: చూ, సదనము. 1.
దేరీజ, దే. వి.—పై.—
దేవఋణము, అం; చూ, ఋణత్రయము.
దేవకము, సం. వి. అ. పుం. రూ-దేవనము. 1: చూ, పాచిక; 2. గెలువనిచ్ఛ: చూ, వాంఛ.
దేవకాంచనము, సం. వి. అ. పుం. ఆస్ఫోటము. చూ, కాంచనము. 5.
దేవకీనందనుఁడు, సం వి. అ. పుం కృష్ణుఁడు. చూ, విష్ణువు. 1.
దేవకులోద్భవము, సం. వి. అ. పుం: చూ, కాచిమము *
దేవకుసుమము, సం. వి. అ. న: చూ, లవంగము.
దేవకృతి, అం: చూ, గౌడకృతి.
దేవఖాతకము, సం. వి. అ. న: చూ, పరిఖ.
దేవగంగ, సం. వి. ఆ స్త్రీ. ఆకాశగంగ: చూ, నది. 1.
దేవగంధ, సం. వి ఆ. స్త్రీ: ఆరామశీతలము, కుక్కుటమర్దకము, గంధాఢ్య. (తె. ప). — గొడసాల.*
దేవగద్దలి, సం. వి. ఈ. స్త్రీ. పెద్దబోడతరము*: చూ, ముండిని.
దేవగణవిశేషము, అం: చూ, దేవతాభేదము.
దేవచ్ఛందము, సం. వి: అ. పుం. నూఱుపేటల హారము: చూ, భూషణము. 2.
దేవజగ్ధకము, సం. వి అ. పుం. కామంచిగడ్డి*; చూ, తృణము. 1.
దేవజగ్ధిక, సం. వి. ఆ స్త్రీ —పై.—
దేవత, సం. వి. ఆ. స్త్రీ. దేవుఁడు: చూ, వేలుపు.
దేవతరువు, సం. వి. ఉ. పుం. 1; చూ, వేల్పుచెట్టు; 2: చూ, రచ్చ *.
దేవతరువులు, అం: చూ, దేవవృక్షములు.
దేవతలు, అం: చూ, దేవత. 1. (బ).
దేవతాడి, వై వి. = దేవతాళము. డావరడంగి*: చూ, విషనాళని.
దేవతాస-డాబ్రాహ్మణులు, అం. కృష్ణయజుర్వేదులు. శ్రీకృష్ణాది విష్ణ్వాలయ రోధకులైయున్నారు: చూ, ఉత్కళులు (చూ, బ్రాహ్మణులు)
దేవతాభేదములు, అం. (దేవతలవలనఁబుట్టినవారు) విద్యాధరుఁడు, అప్సరసలు, (తె) అచ్చర. (ఊర్వశీప్రభృతులు), యక్షులు (కుబేరాదులు), రక్షస్సులు (విభీషణాదులు), గంధర్వులు (హాహాహూహూప్రభృతులు), కిన్నరులు (గుఱ్ఱపు మోముగలవారు), పిశాచములు (మాంసాశనులు, కుబేరానుచరులు), గుహ్యకులు (మాణిభద్రుఁడు మొదలైన నిధిపాలకులు), సిద్ధులు (విశ్వావసుప్రభృతులు), భూతములు (ఇష్టము నొందెడి బాలగ్రహములు); తద్విశేషములు-కింపురుషుఁడు-కింపూరుషుఁడు, ద్రుమణుఁడు, ద్రుముఁడు, క్షేత్రపాలుఁడు, క్రతువు, కుష్మాండుఁడు, కువేరుఁడు, కాలకికాలుఁడు, ఖేచరుఁడు: (తె. ప.)— ఒక్కిమోరవేలుపు. (మిగత విశేషాదులకు: చూ, వేలుపు.)
దేవతాళము, సం. వి. అ. పుం. = : చూ, రూ-దేవతాడి*.
దేవదత్తము, సం. వి అ. పుం. 1. ఒకఉపవాయువు (జృంభప్రవర్తమానవాయువు): చూ, వాయువు; 2. అర్జునుని శంఖము: చూ, సంకు. 1.
దేవదారి, వై. వి. = దేవదారువు*: చూ, సూక్ష్మదారువు. (చర్మరోగములలో దీని తైలమును వాడెదరు)
దేవదారువు, సం. వి. ఉ. పుం. = దేవదారి. —పై.—
దేవదాలి, సం. వి. ఈ. స్త్రీ: చూ, లత. 1.
దేవదూతలు, వా. వి. దేవతలదూతలు.
దేవద్రయక్కు, సం. విశే. 1. దేవతలనుగూర్చి బోవువాఁడు; 2. దేవపూజకుఁడు; చూ, పూజారి
దేవనము, సం. వి. అ. న. 1. క్రీడ: చూ, విలాసము. 1; 2. జూజము: చూ, వ్యవహారము. 4; 3. గెలువనిచ్ఛ: చూ, వాంఛ; 4. వ్యవహారము: చూ, సత్యము. 1; పుం. 5. పాచిక. చూ, వ్యవహారము. 4.
దేవనాయకుఁడు, అం: చూ, నాయకత్రయము.
దేవనాళము, సం. వి. అ. పుం. అడవి కిక్కసకసవు*: చూ, తృణము. 1.
దేవబ్రాహ్మణులు, అం. ఉంఛవృత్తిచే సాత్త్వికమగు మితాహారము భుజింపుచు సంతుష్టికలిగి ఇంద్రియ నిగ్రహులై వేదశాస్త్రములయందలి యథార్థజ్ఞానము గలవారై తత్త్వజిజ్ఞాస గలవారగువారే దేవబ్రాహ్మణులు. (వీరు దశవిధబ్రాహ్మణులలోనివారు); చూ, బ్రాహ్మణులు.
దేవభూయము, సం. వి. అ. న. దేవత్వము; చూ, సాయుజ్యము.
దేవమణి, సం. వి. ఇ. పుం. 1. కౌస్తుభము; చూ, రత్నములు; 1. 2: చూ, శివుఁడు; 1; 3. గుఱ్ఱము మెడసుడి: చూ. సుడి. 1.

దేవమాత, సం. వి. ఋ. స్త్రీ: చూ, మాత. 1.
దేవమాతృకము, సం. వి. అ. పుం. వానచే పండెడు దేశము: చూ, దేశము.
దేవమానము, సం. వి. అ. పుం. గర్భాష్టమమానము: చూ, మానము. 1.
దేవయజ్ఞము, సం. వి. అ. పుం. 1: చూ, హోమము; అం. 2: చూ, యజ్ఞములు.
దేవయోనివిశేషము, అం: చూ, దేవతాభేదము.
దేవర, వై. వి.＝దేవః. 1. ఎకిమీడు: చూ, ప్రభువు. 2; 2. చూ, వేలుపు.
దేవరన్యాయము, న్యా దేవరుడనఁగా భర్తయొక్క అన్న సంతతి నిర్వంశమగుచుండఁగా దేవరుడు మఱఁదలియందు సంతానముఁగని వంశము నిలుపవచ్చును పాండుధృతరాష్ట్రులు దేవరన్యాయమున వ్యాసునివలన విచిత్రవీర్యుని భార్యలగు అంబికాంబాలికలయం దుదయించిరి. ఇట్టివిధము.
దేవరింపు, దే. వి. బతిమాలడము. అం. భా. ప్ర. 116: చూ, వాచాపము.
దేవరుఁడు, సం. వి. అ. పుం. రూ-దేవృఁడు, మగని తోఁబుట్టువు: చూ, సహోదరుఁడు.
దేవరుకబ్రాహ్మణులు, అం. అథర్వణవేదములో దేవర్షిశాఖకుఁ జెందినవారు. రత్నగిరిజిల్లాలోను, ఉత్తరకొంకణ దేశములోను, బరోడాలోను కానంబడుదురు వీరు కృష్ణయజుర్వేదులలో నొకశాఖవారు. హిరణ్యకేశాయన సూత్రము: చూ, బ్రాహ్మణులు.
దేవలుఁడు, సం. వి. అ పుం: చూ, అర్చకుఁడు. 1-2-3.
దేవలోకము, సం. వి. అ. పుం: చూ, స్వర్గము.
దేవవల్లభము, సం. వి. అ. పుం. చూ, పొన్న.*
దేవవృక్షములు, అం. (దేవతరువులు) మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము.
దేవసత్వ, అం: చూ, ద్వాదశసత్వలు.
దేవసరులు, దే. వి. బ: చూ, ధాన్యము.
దేవసాయుజ్యము, సం. వి. అ. న: చూ, దేవభూయము.
దేవస్సర్గము, అం: చూ, సృష్టిసర్గములు.
దేవళము, వై. వి.＝దేవాలయః: చూ, సదనము 1.
దేవళ్లు, వై. వి. బ.＝దేవాః దేవతలు: చూ, వేలుపు.
దేవాంగి, దే. వి: చూ, జేంద్ర-దేంద్ర. (దేవాంగులు సంస్కృతమని శ. ర.)
దేవాజీవి, సం. వి. న్. పుం: చూ, దేవలుఁడు.
దేవాజీవుఁడు, సం. వి. అ. పుం. - పై.—
దేవాదివర్ధని, అం: చూ, టక్కజవిభాషలు: (చూ, భాష 1.)
దేవానాంప్రియము, సం. వి. అ. పుం. 1. మేఁక: చూ, మేషము. 1; 2. మేఁకపోతు: చూ, మేషము. 1.
దేవానాంప్రియుఁడు, సం. విశ: చూ, మూర్ఖుఁడు. రాఘ. 1, ఆ. 5.
దేవాలయము, సం. వి. అ. న.＝: చూ, దేవళము.
దేవావాసము, సం. వి. అ. పుం; చూ, రచ్చ*.

దేవి, సం. వి. ఈ. స్త్రీ (క్రీడించునది) 1. దుర్గ: చూ, పార్వతి. 1; 2.＝దేవేరి. రాణి: చూ, రాజ్ఞి; 3. చాగ*: చూ, ప్రవ; 4. పిక్క*: చూ, స్పృక్కు.
దేవిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, దావికము.
దేవిడీ, వా. వి కోటవాకిలి.
దేవిడీమన్నా, వా. వి. కోటవాకిలికి రాకూడదను ఉత్తరువు.
దేవీకోట, అం. శోణితపురము: చూ, దేశము.
దేవీమతము, అం: చూ, తంత్రములు.
దేవు, దే. స. క్రి. 1. నీటిలోనగువానియందుండి తడవియెత్తు; 2: చూ, వెతకు. అచ్చ. సుం, కాం. 8.
దేవృఁడు, సం. వి. అ. పుం. 1.＝దేవర: చూ, వేలుపు; వా. 2. (నాట్యపరిభాషయందు) రాజు. భట్టారకుఁడు; చూ, రాజు. 1.
దేవునిదర్శనము, అం: చూ, శకునరహితములు.
దేవురించు, దే. అ. క్రి; చూ, వాచాపు. హరిశ్చ 4, ఆ. 103.
దేవురింపు, దే. వి; చూ, రూ-దేవరింపు.
దేవుడు, —పై.—
దేవుడుగొట్టు, దే. విశ: చూ, దేబె.
దేవులాడు, దే. స. క్రి. (దేవులు＋ఆడు) 1: చూ, వెదకులాడు; వా. 2. విచారించు.
దేవృఁడు, సం. వి. ఋ. పుం: చూ, రూ-దేవరుఁడు.
దేవెరి, వై. వి＝దేవి. రూ-దేవేరి. 1. రాణి: చూ, రాజ్ఞి; వా. 2. దొరసాని: చూ, రాజ్ఞి.
దేవేరి, 1.—పై.—; 2.—పై—పాండు, 1, ఆ. 239.
దేశకాలవిభజనము, అం: చూ, అంగపంచకము. (చూ, అంగము. 9).
దేశకుఁడు, సం. విశ: చూ, అవ్యవసాయవంతుఁడు.
దేశజధర్మములు, అం: చూ, ధర్మములు.
దేశము, సం. వి. అ. పుం. 1. అనేక పట్టణములుగల గొప్ప భూభాగము: ఉపవర్తనము, జ, జనపదము, జనాంతము, జానపదము, ద, ఞ, ప్రదేశము. మండలము, రాష్ట్రము, విషయము. (తె. ప.)—ఆణియము-ఆణెము, ఆఱువ, ఊరు, ఏఱువ, కలంక, నాడిక, నాడు, నాణిమ, మాగాణి-మాగాని, విలాతి, సీమ: చూ, దేశములు; అం. 2: చూ, వింశతి విగ్రహములు; 3: చూ, రాగాంగములు: (చూ, అంగము. 9.)
దేశములు, అం. ప్రధానమైన దేశములు, ౫౬: ౧ అంగము; ౨ వంగము, పుండ్రము; ౩ కళింగము-కలింగము; ౪ కర్ణాటము; ౫ కేరళము-కేరలము; ౬ కామరూపము; ౭ గౌడము-గడము, పుండ్రము, వరేంద్రి; ౮ వనవాసము; ౯ కుంతలము; ౧౦ కోంకణము-కోంకణకము; ౧౧ మగధము, కీకటము; ౧౨ సురాష్ట్రము; ౧౩ మాళవము-మాలవము; ౧౪ లాటము; ౧౫ భోటము; ౧౬ వరాటము; ౧౭ శబరము; ౧౮ కుకురము; ౧౯ కురువు, కురుక్షేత్రము, గమిష్ఠువు, ధర్మక్షేత్రము, వినశనము; ౨౦ అవంతయము-అవంతి, ఉజ్జయని, విశాల. (తె. ప.)—ఉజ్జని; ౨౧ పాండ్యము; ౨౨ మద్రము; ౨౩ సింహళము; ౨౪ ఘూర్జరము, (తె. ప.)—గుజరాతి-గుజరి-గుజరు-గుజరాతి-గుజ్జరి; ౨౫ పారశీకము; ౨౬ మిథిలము; ౨౭ పాంచాలము; ౨౮ శూరసేని;

౨౯. గాంధారము; ౩౦. బాహ్లికము-బాహ్లీకము; ౩౧. హైహయము; ౩౨. తాళవము; ౩౩. సాల్వము-శాల్వము, కారకుక్షీయము; ౩౪. పుండ్రకము; ౩౫. ప్రాగ్జ్యోతిషము; ౩౬. మత్స్యము; ౩౭. చేది-చైద్యము-చేదయము, దాహాలము; ౩౮ బర్బరము; ౩౯ నేపాళము; ౪౦. గౌళము; ౪౧. కాశ్మీరము-కశ్మీరము, కీరము, శాస్త్రశిల్పనము; ౪౨. కన్యాకుబ్జము-కన్యాకుబ్జ-కాన్యాకుబ్జము, కుశస్థలము, కౌశము, గాధిపురము; ౪౩ విదర్భ-విదర్భము; ౪౪. ఖురసాణము; ౪౫. మహారాష్ట్రము; ౪౬. కోసలము; ౪౭. కేకయము; ౪౮. అహిచ్ఛత్రము; ౪౯. త్రిలింగము, త్రిలింగక్షేత్రము, అంధ్రము-ఆంధ్రము, అంధ్రకోసలము-ఆంధ్రకోసలము, అంధ్రమండలము - ఆంధ్రమండలము (తె. ప.)—తెనుఁగు-తెలుఁగు; ౫౦. ప్రయాగము; ౫౧. కరహాటకము; ౫౨. కాంభోజము-కంభోజము-కంబోజము; ౫౩. భోజము; ౫౪. చోళము- చోలము-చోడము; ౫౫ హూణము; ౫౬. కాశి, అవిముక్తము, ఆనందకాననము, కాశము, కాశిక, జిత్వరి, తపస్థలి, తీర్థరాజి, వారణాసి. (తె. ప.)—బనారసు ఇత్యాదీ; 2, మఱికొన్ని ముఖ్యదేశములు. ౫౭ ౧. అంగల దేశము, అంగలభూమి-అంగలభూమి; ౨. అంబష్ఠము; ౩ అధిష్ఠానము; ౪. అరేబియా-హారబ్బి; ౫ అలక-అళక; ౬. ఆంధతి; ౭. ఆకరి; ౮. ఆభీరము; ౯. ఆరట్టము; ౧౦. ఆర్యావర్తము, కర్మభూమి, పుణ్యభూమి; ౧౧. ఆశ్రయము; ౧౨. ఉత్కలము, ఒరిస్సా, ఓఢ్రదేశము, ఓఢ్రము; (తె. ప.)—ఒడ్డాది; ౧౩. ఉదీచ్యము; ౧౪. ఉపవర్తనము; ౧౫. ఉరుమంజీ-హూరుముంజి - హూరుముంజీ - హూరుమ్మంజీ; ౧౬. కచ్ఛ; ౧౭. కరూశము-కారూశము; ౧౮.కాంపిలము-కాంపీల్యము; ౧౯. కామరూపము; ౨౦.కీకటము-కీకటాను; ౨౧. కుండినము; ౨౨. కుకురము; ౨౩. కుణాలము; ౨౪. కుముద్వంతము - కుమూవాసము - కుముద్వాన్; ౨౫. కురాసాని; ౨౬. కొట్టాము; ౨౭ కోదండము; ౨౮. కోమలము; ౨౯. కోలాంశము; ౩౦. కొంగము; ౩౧. కౌశాంబి, వత్సపత్తనము; ౩౨. ఖశము, ఖశయష్ఠ్రిస్కము; ౩౩. గర్తము; ౩౪. గోండము; ౩౫. ఘోట్టాణము; ౩౬ చీనము; ౩౭. జవనము-యవనము; ౩౮. తక్షశిల; ౩౯. తామలిప్తము-తామలిప్తి, వేలాకూలము; ౪౦. తురుష్కము; ౪౧. త్రిగర్తకము; ౪౨. దండకము; ౪౩. దక్షిణాపథము; ౪౪. దశార్ణము, కుక్కురము, యదవము, సాత్వతము; ౪౫. దాశేరకము; ౪౬. దేవమాతృకము; ౪౭. నడ్వంతము-నడ్వలము; ౪౮. నదీమాతృకము; ౪౯. బ్రహ్మావర్తము, తపోవటము; ౫౦. మందిరము; ౫౧. మరుభువ; ౫౨. మలయము; ౫౩. లంపాకము; ౫౪. శకము; ౫౫. సింధువు; ౫౬. సౌవీరము, కుమాలికము; ౫౭. ద్రోణి. మఱియు, అచ్చి, అచ్చిమట్టము, కలంక, కోన ఇత్యాది: చూ, సీమ. 1. ౫; ౫౮. 3. ప్రధానమగు పుణ్యనగరములు:— ౧. అయోధ్య, కోశలము-కోషల-కోసల-కోసలము. (తె. ప.) — అయోధ్య; ౨. మధుర; ౩. మాయ, ౪. కాశి; ౫. కాంచి. (తె. ప.)—కంచి; ౬. అవంతి-అవంతిక, ఉజ్జయిని విశాల. (తె. ప) — ఉజ్జని; ౭. ద్వారవతి; ౫౯. 4. మఱికొన్ని ముఖ్యనగరములు. ౧. గయ; ౨. చంప; ౩. ప్రాగ్జ్యోతిషము, కామరూపము; ౪. అశ్మంతము, అశ్మనగరము; ౫. ఉపపట్టణము, గుహ్య-గుహ్యము-గృహ్య. (తె. ప.)—పెంట-పేఁట; ౬. రాజధాని, కటకము. (తె. ప.)-రాచవీడు ఇత్యాది; చూ, సీమ. 1-౬౦; 5: పట్టణమునకు.— కర్వటము, కోట్టము, ఖమ్-ఖంబు, నగరము—నగరి, పట్టణము, పురము. (తె.ప.) — పట్టము-పట్నము, ప్రోలు, సీమ; 61. ప్రసిద్ధికెక్కిన పట్టణములు.— ౬౧-(౪) ౧. అపిస్థలము, అధిష్ఠానము; ౨. అమర, అవరోహము, అమరము, ఇంద్రనగరి, ఇంద్రలోకము, సుదర్శనము. (తె. ప.)— అమరావతి; ౩. అలక, కాంతిమతి; ౪ ఐశాని, ఐశి; ౫. కుసుమపురము; ౬. ఖపురము; ౭ ఖర్పణ. (తె.ప.)—కసుబా; ౮. గంధవతి, ౯. చంప, పుష్ప, మాలి; ౧౦. త్రిపురము; ౧౧. దుర్గము, కోట్టము. (తె. ప.) —కోట; ౧౨.ధార; ౧౩. బాణపురము, బాణరాజనగరము, ఉషావనము, కోటివర్షము-కోటీవర్షము-కోట్టవీపురము, దేవికోట, శోణితము, ౧౪. బ్రహ్మపురి, అజాపత్య, అత్రి. ఆనందిని; ౧౫ మాహిష్మతి, కథ; ౧౬. ఇరావతి, యమపురి, చిత్రితాకరి; ౧౭. (తె. ప.) — రేవు (కరవాకపట్టణము); ౧౮. వైకుంఠము; ౧౯. శంభపురి-శంభుపురి, ఏకచక్రము, హరిగృహము; ౨౦.హస్తినాపురము-హస్తినపురము-హస్తిని-హస్తిపీపురము; గజసాహ్వయము-గజాహ్వ-గజాహ్వము - గజాహ్వయము; ౨౧. తిరిచినాపల్లి (త్రిశిరఃపురి) ఇత్యాది: (చూ, సీమ. 1); ౬౨. 7. దిక్పాలపట్టణములు. — అమరావతి, అలక, కృష్ణాంగన, గంధవతి, తేజోవతి, యశోవతి, శ్రద్ధావతి, సంయమని; (౬)-౬౩. 8. గ్రామాదులు.—౧. పట్టణమునకు దగ్గఱ ఊరు-ఉపపట్టణము; ౨. గ్రామము — ఉపవసథము, కసీతము, కీరము, కులము; గ్రామటిక, గ్రామము, జనపదము, జానపదము, నివృత్తు-నీవృతి. (తె. ప.) — ఊరు, కుప్పము, కొటిక-కొట్టిక, గామము, పల్లియ - పల్లె, పాడు, పాలెము, పొలము; ౩. బ్రాహ్మణుల ఊరు.—అగ్రహారము, విప్రపురి. (తె. ప.)—నల్లిండ్లు; ౪ వర్తకులపేఁట—ఖేటము; ౫. పంటకాఁపులపల్లె—ఖేటము; ౬. గొల్లపల్లె —ఆభీరపల్లి, కర్వటము-ఖర్వటము-ఖర్వటము, ఖేటకము-ఖేటము, గ్రామప్రధానము, ఘు, ఘోషము. (తె. ప.) గొల్లపల్లె, మంద, వ్రేపల్లె; ౭. బోయపల్లెకు.-కశ్మలము, నిషాదము, శబరాలయము. (తె. ప.)—పక్కణము, బోయపల్లె; ౮. సాలెపేఁటకు — తరలము; ౯. కమ్మరి వడ్రంగుల పల్లె.—కర్వటము— ఖర్వటము—ఖర్వటము; ౧౦. కొండప్రక్కపల్లె— కర్వటము—ఖర్వటము—ఖర్వటము; ౧౧. నన్నూఱు గ్రామములు గల పరగణాకు ముఖ్యగ్రామము.— కర్వటము—ఖర్వటము—ఖర్వటము; ౧౨. నగరమునకు దగ్గఱనున్న గ్రామము. — గృహ్య; ౧౩. మంగలిపల్లె —కలింజనము; ౧౪. చిన్నపల్లె.—ఖండిక—ఖండ్రిక; ౧౫. అడవిలోని ఊరు.— అడవిపల్లె, కారూరు; ౧౬. మాలపల్లె.—గ్రామాంతము. (తె.ప.) — మాలపల్లె; ౧౭. 9. గ్రామముల గుంపు.—గ్రామత, చక్రము; (తె. ప.) ఒంటు; ౧౮. గ్రామవిశేషము.— ఖేటకము; ౧౯. చెంబడిపల్లె. — (తె. ప.)—కుప్పము; ౨౦. పల్లెటూరు.—జనపదము; ౨౧. మండలము, జనపదము ఇత్యాది; (2); ౬౪. 10. మఱికొన్ని విశేషములు. —౧. చంద్రలోకము —

ఆనందాలయము; ౨. ఇహము, ఇహలోకము ఇత్యాది: (చూ, లోకములు); ౩. ఐరావతమను ఖండము.— ఐరావతము; ౪. ఖండములు.— (చూ, ఖండములు 1.); ౫. తనదేశము కాని దేశము.— దేశాంతరము: ఉ; చూ, అనర్థము. 4 ఇత్యాది: (చూ, దేశము. 1); చూ, సీమ. 1.

దేశరూపము, సం. వి. అ. న. న్యాయము: చూ, సత్యము. 1.

దేశపాండ్య, వా. వి. చిన్నజమీనాదారుడు.

దేశస్థబ్రాహ్మణులు, అం. ఋగ్వేదులు.—కొందఱు సామవేదులు కొందఱు అధర్వణవేదులు. ఈ రెండుశాఖలవారు ఋగ్వేదు లతో చుట్టఱికము చేయుచున్నారు. వీరిలో దక్షిణ పరి గ్రహించువారు భిక్షులనియు తదితరులు గృహస్థులనియుం జెప్పుదురు. వీరిలో రావు, పంట్, దేశాయి, దేశ పాండి, దేశముఖి, కులకరణి, పటేల్ ఇత్యాదులు వీరి బిరుదములు: చూ, బ్రాహ్మణులు.

దేశాంతరము, అం. తనదేశముకాని దేశము: చూ, ఊరు. 3.

దేశాటనచాతుర్యము, అం: చూ, సుగుణములు.

దేశి, అం: చూ, రాగాంగములు.

దేశికుడు, సం. వి. అ. పుం. 1. గురుపు: చూ, పంతులు 1; 2. దేశముతిరుగువాడు.

దేశియ్యము, అం. చూ, ఉద్ధతము. 2.

దేశీయక్రియలు, అం. ధృవక, సర్పిణి, కృష్య, పద్మిని, విసర్జిత, విక్షిప్త, పతాక, పతిత. (8).

దేశీయము, పా: చూ, జాతీయము. (ఇడియము)

దేశ్యక్రియలు, అం. 1: చూ, తాళక్రియలు; 2. ధ్రువకము, సర్పిణి, కృష్యము, పద్మిని, విసర్జిత, విక్షిప్త, పతాకము, పతిత (8): చూ, దేశీయక్రియలు.

దేశ్యము, సం. విణ. దేశమునవాడబడునది: చూ, గ్రామ్యము. 10: (చూ, దేశ్యములు.)

దేశ్యములు, అం. 1. ఎ ఒ ౘ ౙ అ ఈ యక్షరంబులుగల పదంబులు దేశ్యంబులు. ఉదా.—ఎవడు, ఒకడు, కొన, అనటి, చావడి, జాలు, చెఱుకు; 2. స్వార్థేంచుగాగమంబు లేని క్రియలు దేశ్యములు. "ఉదా.—పండు, చేయి; 3. రేఫము ద్విత్వముగలవి దేశ్యములు. ఉదా.—అఱ్ఱు, ఇఱ్ఱి, కుఱ్ఱ; 4. సర్వనామములును, కృత్తద్ధితాంతములును దేశ్యములు; 5. ఔపవిభక్తికములు దేశ్యములు. ఉదా.—కిన్ను, ముల్లు, బాయి, పేను; 6. డువర్ణమునకు వెనుక ఉత్వములేని పద ములు, దేశ్యములు. ఉదా.—కర్తలడు, వెంకడు; 7. ప్రథమ వచనైక లోపంబుగల పున్నపుంసకంబులగు అకారాంతము లును, అన్ని యాకారాంతపదములును దేశ్యములు. ఉదా.— అన్న, పాలు, బల్లమొ; 8. హ్రస్వాంతముల బహువచనము రువర్ణంబాయెనేని యవి దేశ్యములు. ఉదా.—అల్లురు, పగతురు; 9. సంయుక్తవర్ణంబు బహువచనంబగు పదంబులు దేశ్యం బులు. ఉదా.—అంద్రు, త్రాళ్లు, కోమట్లు, పైర్లు, అటకంప్లు; ౧౦ అయి, అవు, గ, డొ, మొదలగునవి ఆదేశముగాగలవి దేశ్యములు. ఉదా.—ఐతి = అయితి; ఔదు = అవుదు; కాకి తము = కాగిదము; పోడిమి=పోణిమి; పగలు=పవలు మొ.)

దేసము, వై. వి.= ద్వేష: చూ, విరోధము. 1.

దేహగంధము, అం. స్త్రీలక్షణాంగములలో నొకటి. (సంపెంగ కలిగొట్టు పుష్పులవాసన గలిగిన సౌభాగ్యముగలిగి పతి వశయై యుండును. క్షీరగంధ, కటుగంధ, రక్తగంధములు దుఃఖప్రదములు. ధాన్యగంధము, వేపగంధము, గోమూత్ర గంధము, హరిదళగంధము, దుష్టగంధము, గంధమూషికా గంధము (చుంచువాసన), మత్స్యగంధము, ఉగ్రగంధము లైన విధవ వలెను): చూ, స్త్రీలక్షణాంగములు.

దేహపావనము, అం: చూ, ఉపవీతములు.

దేహబాధ, వా. వి. 1. మలవిసర్జనమునకు వెడలుట; 2 శరీ రాయాసము.

దేహము, సం. వి. అ పుం. న. 1. మేను: చూ, శరీరము; పా. 2. దీనికి ఉపమానములు.—శ్రీగె, శంపాలత: అం. 3. పురుషలక్షణాంగములలో నొకటి. (శరీరము, అంగము.— మిక్కిలిపొడవుగాక మిక్కిలిపొట్టిగాక మిక్కిలిలావుగాక మిక్కిలి సన్నముగాక యున్నం బ్రశస్తము. భోజనము, నిదుర, రతి శీఘ్రకాలమునంజేయుచు స్నానము ఆలస్యముగం జేయుట ఆయుర్వృద్ధి. 108 అంగుళముల పురుషుడైన దివ్యపురుషుండగు): చూ, లక్షణాంగములు; 4. స్త్రీలక్ష ణాంగములలో నొకటి. (లావుగాక, సన్నముగాక, పొడవు గాక,పొట్టిగాకయున్న శ్రేష్ఠము. మృదువైన భోగియగు. విరివి యైన నల్పాయువగు). చూ, స్త్రీలక్షణాంగములు; 5. (దేహము): చూ, ఐక్కటిబాషలు: (చూ, భాష. 1.)

దేహయాత్ర, సం. వి. అ. స్త్రీ. 1. చూ, సాపాటు, 2: చూ,సావు.

దేహరోమము, అం. 1. పురుషలక్షణాంగములలో నొకటి (రోమము.— ఒక్కటియైనరాజగు. రెండైన ధనవంతుడగు. మూడైన పండితుడగు. బహురోమమైన దరిద్రుడగును): చూ, లక్షణాంగములు; 2. స్త్రీలక్షణాంగములలో నొకటి. (రోమము.—సూక్ష్మములైన సుఖవతియగు. రూక్షములైన బిడ్డలు లేనిదగు): చూ, స్త్రీలక్షణాంగములు.

దేహళి, సం వి. ఈ. స్త్రీ): గేహళి, ఉదుంబరము, కుతుపము, గృహావగ్రహణి (తె. ప.)-కడప-గడప: (చూ, వాకిలి).

దేహళీదీపన్యాయము, న్యా. (దేహళీదత్తదీపన్యాయము) గడపం మీద దీపముబెట్టిన యింటిలోనం బైటంగూడ నుపయోగించు ననురీతి.

దేహి, సం. విణ. 1. దేహము కలవాడు: చూ, శరీరి; వా. 2. జీవాత్మ: చూ, హంసుడు. 2; వా. 3. బిచ్చమెత్తువాని ప్రార్థనయందలి విధేయతను సూచించు శబ్దము. "భవతు భిక్షాం దేహి."

# దై

దైతేయుడు, సం. వి. అ. పుం. రూ-దైత్యుడు. (బ. దైతే యులు = కశ్యపునకు దితియందుం గల్గిన సంతతి): చూ, రాక్షసుడు. 1.

దైత్య, సం. వి. ఆ. స్త్రీ). కల్లు: చూ, సుర. 2.

దైత్యగురువు, సం. వి ఉ. పుం: చూ, శుక్రుడు.

దైత్యము, అం: చూ, శస్త్రములు.

దైత్యారి, సం. వి. ఇ. పుం. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. దేవుఁడు: చూ, వేలుపు.
దైత్యుఁడు, సం. వి. అ. పుం: చూ, రూ-దైతేయుఁడు.
దైన్యపడు, మి. అ. క్రి: చూ, వాచారు.
దైన్యపాటు, మి. వి: చూ, వాచారపము.
దైన్యము, సం. వి. అ. న. 1.—పై.—; అం. 2. సంచారీభావములు 33 లో నొకటి (ఓ మన్మథుఁడా! పురవైరికిందిరము దప్పించిన నీకీ విఱిబోడియన నెంత? కరుణఁజూచి రక్షింపుము): చూ, సంచారీభావములు.
దైర్ఘ్యము, సం. వి. అ. న. నిడుపు: చూ, పొడవు. 2.
దైవఘటన, 1. భగవంతుని యేర్పాటు: చూ, సంధానము; అం. 2. అగ్ని జలాదులవలనఁ బుట్టెడు కీడులలో నొకటి: చూ, అదృష్టము.
దైవజ్ఞ, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, సోదెకత్తె; 2: చూ, బల్లి.
దైవజ్ఞుఁడు, సం. వి. అ. పుం. 1. జోస్యుఁడు: చూ, సాంవత్సరుఁడు: 2. గణకుఁడు: చూ, పంజీకరుఁడు.
దైవతభూషణ, అం: చూ, భిన్నపంచమజభాషలు: (చూ, భాష. 1)
దైవతము, సం. వి. అ. పుం. న. 1: చూ, వేలుపు; 2. దేవతాది.
దైవత్వము, సం. విణ. ఈశ్వరత్వము: చూ, అనిమిషత్వము.
దైవప్రశ్నము, సం. వి. అ. పుం. ఉపశ్రుతి: చూ, వినికిడి.
దైవస్య చిత్రా గతిః, న్యా. దైవగతి చిత్రమైనది.
దైవమత్రాతిరిచ్యతే, న్యా. అన్నింటిని దైవ మతిశయించును.
దైవము, సం. వి. అ. న. 1. భాగ్యము: చూ, అదృష్టము; 2. దయ్యము, పిశాచము: చూ, భూతము; 3: చూ, వేలుపు; పుం. 4. జ్యోతిష్టోమాది యాగము ప్రారంభింపఁబడినప్పుడు యథావిధిగా తత్కర్మము నడపిన ఋత్విజుని నలంకరించి కన్యనిచ్చి చేయు వివాహము: చూ, వివాహము; అం. 3: చూ, విగ్రహములు.
దైవాఱు, దే. అ. క్రి: చూ, రూ-దయివాఱు. (అతిశయించుటకు.—లక్ష్మి. 5, ఆ. 95.)
దైవికము, సం. విణ. దైవమువలనఁగలిగినది: చూ, గ్రుడ్డివాటు.
దైశికరాగజ్ఞానము, అం: చూ, సుగుణములు.

## దొ

దొంకెన, ద్వ. వి: చూ, రూ-దొంకెన.
దొంగ, దే. వి. 1. రూ-దొంగ: చూ, ముచ్చు. 1; 2. అరఁటి పువ్వులోనికాడ: చూ, ముచ్చు. 2; విణ. 3: చూ, వంచనము. (దొంగచూపు, దొంగనిద్ర, దొంగభక్తి, దొంగ కూడు మొ.)
దొంగతనము, దే. వి. (దొంగపని, దొంగతికము): చూ, ముచ్చిలి.
దొంగతొత్తులు, దే. వి. బ. 1: చూ, బాలికాక్రీడ; వా. 2. దొంగబుద్ధి కలవారు.
దొంగపని, దే. వి: చూ, దొంగతనము.
దొంగతికము, —పై.—
దొంగిలించు, దే. స. క్రి. (రూ-దొంగిలు): చూ, ముచ్చిలించు.
దొంగిలు, —పై.—
దొంగు, దే. అ. క్రి. —పై.—
దొంగు, చూ, రూ-దొంగు.
దొండ, వై. వి. ౧. = తుండి.* (దీనిభేదములు.— అడవిదొండ, కాకిదొండ, చేఁదిదొండ, నాగదొండ, నీటిదొండ, పాము దొండ, పిండిదొండ, లింగదొండ, మరుదొండ (లేక) మర్ల దొండ మొ): చూ, రక్తఫల.
దొండి, దే. వి. తూఁటు: చూ, రంధ్రము. 1.
దొందు, దే. వి. ఒకానొక చేప: చూ, మత్స్యము. 1.
దొంతకత్తియ, దే. వి. రూ-దొంతకత్తె. కుట్టని: చూ, శంఖళి.
దొంతర, ద్వ. వి. (దొంతి + తరఁగ) 1. దొంతి. విజ. 3, ఆ. 196: చూ, దోర. 1; 2. పరంపర. విజ. 1, ఆ. 114; విణ. 2. పరంపరయైనది. కళా. 8, ఆ. 96: వా: 4. ఇరువది రూపాయలు. "ఒక దొంతర లంచము ఇచ్చినాను."
దొంతరముద్దు, ద్వ. వి. ఒకరకము ముద్దు: చూ, ముద్దు. 3.
దొంతరవణులు, ద్వ. వి. బ: చూ, అంకెలు. 2.
దొంతి, దే. వి. రూ-దొంతర-దోర. 1. ఒకటిమీఁద నొకటిగా నుంచిన కుండలు లోనగువాని వరుస: చూ, దోర. 1; 2. పంక్తి. లక్ష్మి. 4, ఆ. 141: చూ, వరుస. 1; విణ. 3. దొంతియైనది. అం, భా. ద్వి. 34.
దొంతిగనిడు, వా. స. క్రి: చూ, అడుకు. 3.
దొందడి, ద్వ. వి. (దొందు + దడి.) 1. సందడివలనగలుగు ధ్వని: చూ, స్వరము. 2; 2. రాసికొను జనసమూహము. భార. ద్రో. 4, ఆ. 129: చూ, సందడి. 1.
దొందడించు, దే. అ. క్రి: చూ, సందడించు.
దొందము, వై. వి. = ద్వంద్వ. 1. ద్వంద్వరోగము: చూ, రోగము. 1; వా. 2, జత: చూ, సంగడి. 5.
దొందు, వై. వి = దండ-ద్వంద్వము. జత: చూ, సంగడి. 5.
దొంపు, దే. వి. 1. మళ్ళవరుస: చూ, భూమి. 1; 2: చూ, తలనట్టు.
దొంబులిగొట్టు, ద్వ. వి. (దొందు + పులి + కొట్టు) (వ్యతిరేక లక్షణచే) పిఱికి (రెండుపులులను గొట్టువాఁడు అని శబ్దార్థము): చూ, వెఱపరి.
దొగ్గలి, దే. వి: చూ, రక్తబాష్పము.*
దొడదొడ, దే. వి. కాఱుట లోనగువానియందగు ననుకరణము: చూ, హూహూ.
దొడవ, దే. విణ. కురిపి. (సం. వ.)—కురూపి, అనాకారి.
దొడ్డ, దే. విణ. రూ-దొడ్డు. గొప్ప. "దొడ్డమ్మ, దొడ్డవాఁడు": చూ, మహితము.
దొడ్డతనము, దే. వి. 1. గొప్పతనము: చూ, యోగ్యత. 1; 2. మంచితనము: చూ, యోగ్యత. 2.
దొడ్డయడవి, దే. వి. పెద్దయడవి: చూ, విపినము.
దొడ్డయెద్దు, దే. వి. మహోక్షము: చూ, వృషభము. 1.
దొడ్డవాఁడు, వా. వి: చూ, శ్రేష్ఠుఁడు.
దొడ్డి, వై. వి. = ద్రోణి. 1. పసులగొట్టము: చూ, సదనము. 1; 2. పసులు మేయుకంచె: చూ, వివీతము; 3: చూ, పెరడు; వా. 4: చూ, మఱుఁగుదొడ్డి; 5. పొందుదొడ్డి.
దొడ్డికట్టు, ద్వ. వి. చుట్టుకొల్లారు: చూ, సదనము. 1.

దొడ్డికాళ్ళవాఁడు, ద్వ. వి: చూ, సంజ్ఞువు.
దొడ్డికాళ్ళు, ద్వ. వి. బ. పంగటికాళ్లు: చూ, ముడికాళ్లు.
దొడ్డివల, ద్వ. వి. ఒకరకము వల: చూ, వల. 1.
దొడ్డివాకిలి, ద్వ. వి. పెరటిద్వారము: చూ, వాకిలి: (చూ, సదనము. 1.)
దొడ్డు, దే విణ: చూ, రూ-దొడ్డ.
దొడ్డువాఱు, దే. అ. క్రి. అధికమగు: చూ, హెచ్చు 3.
దొత్త, దే. విణ. వ్రేలాడునది.
దొద్ద, దే. వి కొల్ల చూ, లూటీ. 4.
దొద్దకత్తె, ద్వ. విణ. కొల్లపెట్టుఆఁడుది: చూ, ముచ్చు. 1: (చూ, స్త్రీ)
దొద్దకాఁడు, దే. వి: చూ, దొంగ. 1.
దొద్దగొను, దే. స. క్రి. కొల్లగొను: చూ, హరించు.
దొద్దవోవు, దే. అ. క్రి. కొల్లవోవు: చూ, పఱివోవు.
దొద్దు, వై. విణ. = తుందీ. పెనుబొజ్జవాఁడు: చూ, బొజ్జవాఁడు.
దొన, వై. వి. 1: చూ, తూము. 3; 2. = ద్రుణ. దోని. కొండమీఁది పల్లము: చూ, రంధ్రము. 1; 3. = తూణ - ప్రోజీ. అంబులపొది: చూ, బాణము. 1; 4. ఈఁద్రవాని కత్తిపిడక.
దొనకు, దే. వి. కీడు: చూ, హాని. 2.
దొనదొనమను, దే. అ. క్రి. దొనదొనమనికూయు.
దొనయుప్పు, ద్వ. వి. (దొన + ఉప్పు) సంభరి దేశము నందలి రుమ యనెడు గనియందు కట్టెఁవలనఁ గలుగు ఉప్పు. రౌమకము. చవుటియుప్పు (అనికొందఱు): చూ, లవణము.
దొనరు, వా. వి: చూ, యోగ్యత.
దొనుకు, వా. వి. 1. దుఃఖము: చూ, శోకము; 2. విచారము: చూ, సంతాపము.
దొన్నియ, వై. వి. = ద్రోణికా. (రూ-దొన్నె-దొప్ప-దొప్ప) పత్రచషకము: చూ, పాత్రము. 6.
దొన్నె, —పై.—
దొప్ప, —పై.—
దొప్పదొప్ప, దే. వి. అడిచికొన టయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.
దొబ్బ, దే.వి. రూ-ద్రొబ్బ 1. నంజుడుముక్క: చూ, మాంసము; 2. నెత్తురుముద్ద; చూ, రక్తము. 1; 3. పిండము: చూ, ముద్ద. 2.
దొబ్బలగొట్టు, దే. వి. అదురుగుండియ: చూ, వెఱపరి.
దొబ్బు, వా. స. క్రి. ద్రొబ్బు: 1. పడఁద్రోయు; 2. అపహరించు.
దొబ్బుడాయి, వా. వి. 1. గరువము; 2. పెంకితనము.
దొబ్బుతెగులు, వా. వి. మూర్ఖపుపట్టుదల గలవాని స్వభావము.
దొమ్మ, దే. వి. 1: చూ, పశురోగము; 2. అవయవవిశేషము. అచ్చ. యు, కాం. 134: చూ, విశేషము. 3.
దొమ్మదోలు, దే. వి. చూ, పెన్నేరు.*
దొమ్మర, దే. వి. గడకట్టియాడి జీవనముచేసెడి యొకానొకజాతి.
దొమ్మరవాఁడు, దే. వి: చూ, వంశనర్తి.
దొమ్మరి, (దొమ్మర + ఇ) —పై.—
దొమ్మి, వై. వి. = తుముల. 1. అందఱు కలియఁబడిచేయు యుద్ధము. జై. 7, ఆ. 178; చూ, యుద్ధము; 2. అందఱు కలియఁబడుట; 3. సందడి: చూ, స్వరము. 2.
దొమ్మికాయు, ద్వ. అ. క్రి. (దొమ్మి + ఆయు) 1. దొమ్మియుద్ధముచేయు; 2. పెనఁగొను: చూ, వెంటిగొను.
దొర, దే. వి. 1. రాజు: చూ, ప్రభువు 2; 2: చూ, శ్రేష్ఠుఁడు. 3: చూ, యోధవరుఁడు. భార. విరా. 3, ఆ. 122; విణ. 4 సామ్యము: చూ, సమానము 2; 5: చూ, విభుఁడు; 6. సమసంఖ్య: చూ, సంఖ్య. 1; 7: చూ, సమానుఁడు. భార కర్ణ. 3, ఆ. 23; వా. వి. 8. జమీన్‌దారు; 9. పద్మనాయకుఁడు: చూ, వెలమ; 10. ఐరోపాదేశస్థుఁడు: 11. ఐరోపా నుండి వచ్చినవాఁడు.
దొరఁకు సన్నాసి, ద్వ. వి. రూ-దొరకోలు సన్నాసి నమ్మించి మోసపుచ్చి దొంగిలించుకొనిపోయెడు దొంగ, విజ. 3, ఆ. 183. (దొరఁకు = యత్నించు): చూ, ముచ్చు. 1.
దొరకొను, దే. అ. క్రి. 1: చూ, యత్నించు. దాగ. 1. స్కాం. 7; స. క్రి. 2. మొదలుకొను, చూ, వహించు.
దొరకు, దే. అ. క్రి. 1 చిక్కు. రాఘ. 2, ఆ. 69: చూ, సిద్ధించు; ప్రే. 2. దొరకించు.
దొరకువడు, ద్వ. అ. క్రి. చిక్కుకొను: చూ, లోఁబడు.
దొరకొను, దే. అ. క్రి. (దొరకు + కొను) 1. లభించు. భార. అర. 6, ఆ. 137; భార. విరా. 4, ఆ. 77: చూ, సిద్ధించు; 2. పుట్టు. భార. సభా. 2, ఆ. 133: చూ, సంభవించు; వా. 3. పట్టుకొను. (దొరకొని = దొరకఁబుచ్చుకొని.)
దొరకోలు, దే. వి: చూ, ఉపక్రమము (1 మొదలు 7 వఱకు.)
దొరకోలుసన్నాసి, ద్వ. వి: చూ, రూ-దొరఁకుసన్నాసి.
దొరగడము, దే. వి. (దొరఁకుకడలు) గొప్పఅల; చూ, వీచి. 1.
దొరతనము, దే. వి: చూ, ప్రభుత్వము.
దొరయు, దే. అ. క్రి. 1. అంటు: చూ, లంకించు. 1; 2. సమానమగు భార. కర్ణ. 1, ఆ. 251: చూ, సరిపోవు. 1; 3. కలుఁగు: చూ, పుట్టు. 2; 4. జరుగు: చూ, సాగు; స. క్రి. 5. పోలు: చూ, సరిపోవు. 1.
దొరలు, దే. అ. క్రి. 1. రూ-దొర్లు: చూ, పొరలఁబడు: 2. కూలఁబడు: (చూ, చతికిలపడు.) స్వా. 5, ఆ. 40: చూ, పడు. 5; 3. కలయు: చూ, మేళగించు. 1; 4. మాఱుకొను: చూ, ప్రతిఘటించు; స. క్రి. 5. అనుభవించు; చూ, భుజించు.
దొరవి, దే. వి. రూ-దొరువు. కొలను. జై. 5, ఆ. 97: చూ, సరస్సు. 1.
దొరసాని, ద్వ. వి. 1. రాజుభార్య: చూ, రాజ్ఞి; 2. అంతఃపురస్త్రీ: చూ, స్త్రీ; వా. 3. ఐరోపాదేశపు స్త్రీ; 4. వెలమకులజుని భార్య.
దొరుగండి, దే. వి. (దొరువు + గండి) నిండినప్పుడు నీళ్ల వెలుపలకు పోవుటకై యేర్పఱచిన దొరువు తూము: చూ, మరిగొమ్మ.
దొరువు, దే. వి. 1: చూ, రూ-దొరవి. రాఘ. 2, ఆ. 6; 2. నడబావి: చూ, సరస్సు. 1.
దొరువుపట్టెడ, దే. వి. గంతయెద్దుల తోఁక క్రిందఁ దగిలించెడు పట్టెడ.
దొర్లు, దే. అ. క్రి: చూ, రూ-దొరలు.
దొఱట, దే. వి. రూ-దొఱ్ఱట. కోటరము: చూ, రంధ్రము. 1.
దొఱయు, దే. స. క్రి. పొందు: చూ, ప్రాపించు.

దొఱ్ఱట, దే. వి: చూ, రూ-దొఱట.
దొఱవు, దే. క్రి. దొర్లఁజేయు.
దొఱవుగమ్మి, వా. వి. ఇసుకపయి దొఱవుకట్టు.
దొసఁగు, వై. వి. 1. = దోష. రూ-దొసఁగు-దొసవు: చూ, పాపము (దేశ్యమని శ. ర.); దే. వి. 2. రూ-దొసవు, ఆపద: చూ, విపత్తు; 3. రూ-దొసవు, అడ్డు. అచ్చ. బాల, కాం. 7: చూ, విఘ్నము.
దొసవు, —పై.—

## దో

దో, సం. వి. న్. పుం. న. భుజము: చూ, స్కంధము. 1.
దోఃకరము, అం. = : చూ, దొక్కరము.
దోఁకిస, దే. వి. దోఁకుట, దోఁకుడు.
దోఁకు, దే. స. క్రి. 1. నేలను ఎదురుగ చెక్కు: చూ, వాయు. 1; వా. 2. దోఁకు. (వాంతి)
దోఁకుడు, దే. వి: చూ, దోఁకిస.
దోఁకుడుఁబాఱ, దే. వి: చూ, కోఁకుడుపాఱ.
దోఁకుడుబార, వా. వి: చూ, బాలక్రీడ.
దోఁగాడు, దే. అ. క్రి. (దోఁగి + ఆడు) బిడ్డ నేలఁ జేతులూఁది మోఁకాళ్ళతో నడచు. రూ-దోగియాడు: చూ, రూ-డోఁగాడు.
దోఁగియాడు, —పై.—
దోఁగిపోవు, దే. అ. క్రి: చూ, ఒరసికొనుపోవు.
దోఁగు, దే. అ. క్రి. 1. మేని తోలొలయు; 2: చూ, రూ-దోఁగాడు.
దోఁగుడు, వై. వి. దొంగతనము: చూ, ముచ్చిలి.
దోఁచు, దే. స. క్రి. 1. అపహరించు: చూ, ముచ్చిలించు; 2. దొంగిలించు: చూ, ముచ్చిలించు; వా. 3. బలవంతముగా దొంగిలించు: చూ, ముచ్చిలించు.
దోఁటముముక్కర, ద్వి. వి. దోఁటివంటి ముంగర: రూ-దోఁటి ముక్కర.
దోఁటమ్ము, ద్వి. వి. (దోఁటి + అమ్ము) దోఁటివంపైనఅలుఁగు గల బాణము, కర్ణిశరము: చూ, బాణము. 1.
దోఁటి, దే వి. అందనిపండ్లు కోసెడు వంకర చిల్లదోఁపిన కోల.
దోఁటిముక్కర, ద్వి. వి: చూ, రూ-దోఁటము ముక్కర.
దోఁటు, దే స. క్రి. ఇచ్చు: చూ, పెట్టు. 8.
దోఁపరి. దే. వి. (రూ-దోఁపిడికాఁడు-దోఁపుకాఁడు - దోఁపుడుకాఁడు-ద్రోఁచువాఁడు.) (ద్రోఁపు + అరి) 1. దొంగ: చూ, ముచ్చు. 1; 2. కొల్లకాఁడు: చూ, ముచ్చు. 1.
దోఁపిడి, దే. వి: చూ, రూ-దోఁపు.
దోఁపిడికాఁడు, దే. వి: చూ, రూ-దోఁపరి.
దోఁపు, దే. వి. (రూ - దోఁపడము. దోఁపిడి-దోఁపుడు.) 1. దోఁచుకొనుట; 2. కొల్ల: చూ, లూటీ. 4; 3. దోఁపిడి: చూ, ముచ్చిలి; 4. అలుకలదోఁపు: చూ, పూర్ణానకము. 1; స. క్రి. 5; కూరుకొను-కూర్కొను, క్రుక్కు, చొనుపు - చొప్పు, చొప్పరించు-చొప్పించు-చొప్పపఱచు-చొప్పఱచు.
దోఁపుకాఁడు, దే. వి: చూ, రూ-దోఁపరి.

దోకెన, వా. వి. నీరుతోడు పనిముట్టు.
దోగ్ధ, సం. వి. ఋ. పుం. 1. గొల్లవాఁడు: చూ, మహాశూద్రుఁడు; 2. దూడ: చూ, ధేనువు; 3. కవిత్వముజెప్పి జీవించెడుకవి: చూ, మూటకట్టువాఁడు; విణ. 4: చూ, పిదుకువాఁడు.
దోగ్ధ్రి, సం వి. ఈ. స్త్రీ ఈనినఆవు: చూ, ధేనువు.
దోణము, దే. వి. (రూ-దోణము-ద్రోణము-ద్రోణాము-దోనము.) 1. భుజమునకు బలము వచ్చుటకై త్రిప్పెడుబెట్టివాని యుపకరణ విశేషము; 2. మ్రాను సుకరముగా చీలుటకై యక్కడక్కడ చెక్కిన మేకులను దిగఁ గొట్టెడి యుపకరణ విశేషము.
దోణాము, దే. వి: చూ, రూ-దోణము.
దోదకము, అం. (పాదపవృత్తము) ఒకానొక వృత్తము. ఒక్కొక్కపాదంబున భ, భ, భ, గ, గణములుగలిగి ఏడింట యతిగల పదునొకండవ ఛందస్సునందుఁబుట్టిన వృత్తము: చూ, వృత్తము. 1.
దోదమ్మి, దే. వి. (రూ-దోదుమి-దోదుమ్మి.) పట్టా, పట్టాకత్తి, సైఖ, ఉభయపార్శ్వధారాసి: చూ, బాణము. 1.
దోదసి, వై. వి. = ద్వాదశి, పక్షమునందు పండ్రెండవతిథి: చూ, సూర్యేందుసంగమము: (చూ, తిథి)
దోదుమి, దే. వి: చూ, రూ-దోదమ్మి.
దోదుముదారి, దే. వి. ఒకరకము బాణము: చూ, బాణము. 1.
దోదుమ్మి, దే. వి: చూ, రూ-దోదమ్మి.
దోనము, దే వి: చూ, రూ-దోణము.
దోనమ్ము, ద్వి. వి. (దోని + అమ్ము) అల్పశరము: చూ, బాణము. 1.
దోని, వై. వి. 1. = ద్రోణీ. నావ: చూ, హోడము; 2: చూ, దొన. 2; 3. కాటువతూము. పా. 2, ఆ. 33: చూ, మరిగొమ్ము; 4. అల్పము: చూ, స్వల్పము.
దోనియ, వై. వి. రూ-దోనె = ద్రోణీ. 1. పడవ: చూ, హోడము; 2. చిన్నపడవ: చూ, హోడము; 3. జలమీఁదుగువాని సాధనము; 4. సాలెవాఁడు చాఁపు చుట్టెడుమ్రాను.
దోనె, —పై.—
దోఁపడము, దే. వి. దోఁచుకొనుట: చూ, ముచ్చిలి.
దోఁపుఁబోవు, దే. అ. క్రి: చూ, ముచ్చిలించు.
దోబూచి, వా. వి: చూ, రూ-దూబూచి.
దోమ, దే. వి: చూ, మశకము.
దోమటి, దే. వి. అన్నము: చూ, సాదము. (1).
దోమతెర, ద్వి. వి. దోమలుచొరకుండ మంచమునంటి పందిరి చుట్టువేయు వలగుడ్డ: చూ, చతుష్కి. 2.
దోము, దే. వి. అజీర్తిచే పాఱుకొనుట: చూ, రోగము. 1.
దోయి, వై. వి. = ద్వయీ-ద్వంద్వము. జత, భార. ద్రోణ. 2, ఆ. 291: చూ, సంగడి. 5.
దోయికట్టు, ద్వి. అ. క్రి. జతకూడు: చూ, సంధించు. 3.
దోయిడి, దే. విణ. రిక్త. జై. 2, ఆ. 17: చూ, శూన్యము. 1.
దోయిలి, వై. వి. = ద్వయీ. వంపఁబడిన రెండుచేతుల చేరిక: చూ, రూ-దోసిలి.

దోయిలించు, వై. వి. స. క్రి: చూ, రూ-దోసిలించు.
దోర, దే వి. 1. దొంతర, దొంతి, అడుకు. (సం. వ.)— ఉత్పంక్తి [ఆం, భా ద్వి. 34): 2. రాసి: చూ, రాశి. 1: విణ. 2. రాసి: చూ, రాశి. 1; విణ. 2. ఎఱ్ఱపాఱినది. "దోరగాయ, దోరకాఁగినపాలు"; 4. ఒఱగినది. "దోరపాక".
దోరగలు, దే. వి. రూ-దోరగల్లు: చూ, పాటుపడుట.
దోరగలువడు, ద్వి. అ. క్రి. రూ-దోరగల్లువడు: చూ, పాటుపడు.
దోరగల్లు, దే. వి: చూ, రూ-దోరగలు.
దోరగల్లువడు, దే. వి: చూ, రూ-దోరగలువడు. స్వా. 5, ఆ. 35.
దోరగాయ, దే. వి. ఎఱ్ఱపాఱి ఫలరసమును పూరించుకొనుచున్న కలాయువు. చూ, కలాయువు. 2.
దోరగిలు, దే. అ. క్రి. రూ-దోరగిల్లు 1. ఎఱ్ఱవాఱు: చూ, వన్నెటిల్లు; 2. ఒరగు: చూ, వ్రాలు. 3.
దోరగిల్లు, —వై.—
దోరణ, వై. వి = తోరణమ్ రూ-దోరణము. కళా. 3, ఆ 7: చూ, తోరణము.
దోరణపుఁగమ్మి, వై. వి. (దోరణము + కమ్మి): చూ, లప్పికమ్మి.
దోరణపుఁబల్లె, వై వి. కవిలె విల్లుక్రింది యడ్డపల్లె.
దోరణపుసాటిరిక్క, ద్వి. వి. చెలిమిచుక్క, అనూరాధ: చూ, రిక్క. 1.
దోరణము, వై. వి.= తోరణమ్: చూ, రూ-దోరణ.
దోరపాక, దే వి ఓరపాక: చూ, సదనము. 1.
దోరము, వై. వి = ద్వారమ్. గుమ్మము: చూ, వాకిలి: (చూ, సదనము. 1.)
దోరు, దే అ. క్రి 1. చచ్చు. సా. 1, ఆ. 107: చూ, సమయు; 2. ఒరగు: చూ, వ్రాలు. 3.
దోరుచు, దే. ప్రే. 1. చావఁజేయు: చూ, మరణించు; 2. వ్రాల్చు. పాండు. 3, ఆ. 92.
దోర్చు, —వై.—
దోరు, వా. వి. ఒకరకముపిట్ట: చూ, పక్షి.
దోరెము, దే. వి: చూ, రూ-తోరెము. స్వా. 4, ఆ. 27.
దోర్మధ్యము, సం. వి. అ. న: చూ, పిడికిడిపోటు.
దోర్మూలము, సం. వి. అ. పుం. చంక: చూ, మడిసంది.
దోల, సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-డోల.
దోవతి, వై. వి = ధౌత, ఉదికినబట్ట. 1. మగవానికట్టుబట్ట: చూ, వస్త్రము; 2. అంకుదానికట్టుకోకజేబు; చూ, వస్త్రము. (దేశ్యమని శ. ర.); వా. 3. మడిబట్ట: చూ, వస్త్రము.
దోష, సం. వి. ఆ. స్త్రీ. 1. భుజము: చూ, స్కంధము. 1; 2: చూ, రాత్రి.
దోషకము, సం. వి. అ. పుం.= దోసె; చూ, భక్ష్యము.
దోషకారి, సం. విణ.= దోసకారి. పాపి: చూ, వ్యాధుఁడు. 2.
దోషగ్రాహము, సం. వి. అ. పుం. ఇండుపుఁజెట్టు: చూ, సల్లకి.
దోషజ్ఞుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, విద్వాంసుఁడు; 2: చూ, వైద్యుఁడు; విణ. 3. దోషమును ఎఱిఁగినవాఁడు.

దోషము, సం. వి. అ. పుం.= దొసఁగు-దోసము. 1. తప్పు: చూ, నేరము; 2: చూ, పాపము; వా. వి. 3. (జ్వరాదుల యందలి) సంధి.
దోషములు, అం. 1. కావ్యదోషములు త్రివిధము.—పదదోషములు, వాక్యదోషములు, అర్థదోషములు.— అందు పదదోషములు (17); వాక్యదోషములు (24); అర్థదోషములు (18); (పదదోషములకు.—: చూ, కావ్యదోషములు; వాక్యదోషములకు.—: చూ, వాక్యదోషములు; అర్థదోషములకు.—: చూ, అర్థదోషములు; 2. సంధిదోషములు (15).— ఉక్తసంధ్యాది: చూ, సంధిదోషములు.
దోషరహితము, అం: చూ, కావ్యస్వరూపము.
దోషాకరుఁడు, సం. వి. అ. పుం. చంద్రుఁడు, రేతేఁడు: చూ, హిమాంశువు.
దోషాచరుఁడు, 1.—వై.— 2: చూ, రాక్షసుఁడు. 1.
దోషి, సం. విణ.= దోసి: చూ, దోసి.
దోషించు, సం. అ. క్రి. 1. దోషముపుట్టు; వా. 2. జ్వరాదుల యందు వీర్యము స్ఖలనమగు; 3. సంధిచూపు; 4. సంధించు.
దోస, దే. వి. కర్కటిక (దీనిభేదములు.-చేఁతి దోస, తియ్యదోస, నక్కదోస, నూఁగు దోస, ములుదోస మొ): చూ, హరివాలుకము.
దోసకారి, వై. విణ.= దోషకారి. 1. కుజనుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 2. దుష్టుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 3. పరస్త్రీగమనాది దోషములచే దూఱఁబడినవాఁడు: చూ, పాపిష్ఠుడు; 4. కుత్సితస్త్రీ: చూ, స్త్రీ; 5. దుష్టురాలు, వెంబర: చూ, స్త్రీ.
దోసఁగు, వై వి.= దోష. కసటు: చూ, పాపము.
దోసము, 1.—వై.—; 2 తప్పు: చూ, నేరము.
దోసి, వై. విణ.= దోషీ. 1. తప్పుగలవాఁడు: చూ, దోసకారి. 3; 2. మిక్కిలిపాపి; చూ, దోసకారి. 3; 3. దుష్టుఁడు: చూ, వ్యాధుఁడు 2; 4. తప్పుగల అంగుది: చూ, స్త్రీ; 5. పాపిష్ఠురాలు: చూ, స్త్రీ.
దోసియ, వై. వి.= దోషకా. రూ-దోసె: చూ, భక్ష్యము.
దోసిలి, వై. వి. = ద్వయి. రూ-దోయిలి; అంజలి - అంజలికి. (సం వ.) —ఇమ్. అంజలి. తద్వి. దొప్పదోసిలికి- (సం) అంజలిపుటము.
దోసిలించు, వై. స. క్రి : చూ, రూ- దోయిలించు.
దోసె, వై. వి.= : చూ, రూ-దోసియ.
దోసెడు, వా. వి. అంజలిపరిమాణము.
దోహదము, సం. వి. అ. న. 1. ఇచ్ఛ: చూ, వాంఛ; 2. గంటులము. గర్భిణికి గల వేవిళ్లు : చూ, వేవిళ్లు; 3. ఎరువు : చూ, పిడక; 4. తరుగుల్మలతాదులకు అకాలమునందు పుష్పాదులను బుట్టించెడు స్త్రీలపాదతాడనాది క్రియ. (అశోకమునకు దోహదము పాదతాడనము, పొగడకు ముఖసీధువు, గోరంటకు ఆలింగనము, బొట్టుగునకు వీక్షణము, మామిడికి కరస్పర్శము, సంపెఁగకు ముఖరాగము, కొండగోఁగునకు సల్లాపము, వావిలికి ఊర్పు, మొల్లటికి పాట, సురపొన్నకు నవ్వు.)

**దోహదవతి**, సం. వి. ఈ. స్త్రీ. రూ-దోహళవతి వేవిళ్లుగల ఆఁడుది : చూ, స్త్రీ.
**దోహదలక్షణము**, సం. వి. అ. న. స్త్రీలవయస్సంధి; 2. గర్భము: చూ, భ్రూణము. 1.
**దోహదశాస్త్రము**, అం. ఆయుర్వేదము (ఋగ్వేదోపవేదము) నందుఁ జెప్పఁబడినది. వృక్షలతాదు లకాలమునందుఁ ఫలించుటకుఁ జేయు క్రియ.
**దోహనము**, సం. వి. అ. న. పాలుపిదుకుట.
**దోహలము**. సం. వి. అ. పుం. ఉత్సాహము : చూ, యత్నము.
**దోహళవతి**, సం. వి. ఈ. స్త్రీ : చూ, రూ-దోహదవతి.

## దౌ

**దౌ**, దే. విణ : చూ, రూ- దవు.
**దౌడ**, వై. వి = దాఢా. (దేశ్యమని శ. ర.) (రూ-దవడ-దవుడ-దాళువ.) బుగ్గలోపలిభాగము : చూ, సెలవి.
**దౌడపల్లు**, వా. వి. పార్శ్వదంతములు : చూ, పల్లు. 1.
**దౌడు**, వై. వి. : చూ, రూ- దవుడు.
**దౌత్యము**, సం. వి. అ. న. : రూ- దూత్యము.
**దౌరాత్మ్యము**, సం. వి అ. న. దురాత్మభావము, చెడ్డతనము: చూ, వ్యళీకము. 2.
**దౌరు**, దే. వి : చూ, రూ- దవురు. రా. వి. 5, ఆ. 35.
**దౌర్జన్యము**, సం. వి. అ. న. దుర్జనభావము: చూ, దౌరాత్మ్యము.
**దౌర్భాగ్యము**, సం. వి. అ. న. దుర్భగభావము : చూ, దురదృష్టము.
**దౌర్భాగ్యుఁడు**, వా. సం. విణ. చూ, దుర్భాగ్యుఁడు.
**దౌర్వాసము**, అం : చూ, ఉపపురాణములు.
**దౌవారికుఁడు**, సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు : చూ, ప్రతిహారుఁడు.
**దౌవు**, వై. విణ = దవీయః : చూ, రూ- దవ్వు- జై. 2, ఆ. 51.
**దౌష్ట్యము**, సం. వి. అ న. = దుండగము : చూ, దౌరాత్మ్యము
**దౌహిత్రుఁడు**, సం. వి. అ. పుం. దుహితకొడుకు : చూ, మనుమఁడు.
**దౌహృతము**, సం. వి. అ. న: చూ, దోహదము. 2.
**దౌహ్య**, అం : చూ, టక్కజభాషలు: (చూ, భాష. 1)

## ద్యా

**ద్యావాపృథువులు**, సం. వి. ఈ. స్త్రీ. ద్వి. మిన్నుమన్ను : చూ, దరోసి, (ఇట్లు ద్యావాభూములు. ఇ. స్త్రీ.)

## ద్యు

**ద్యుతి**, సం. వి. ఇ. స్త్రీ. 1. కాంతి : చూ, వెలుతురు. 1; 2. వెలుఁగు: చూ, హాయనము. 2.
**ద్యుమణి**, సం. వి. ఇ. పుం. పగలుమానికము : చూ, సూర్యుడు.
**ద్యుమ్నము**, సం. వి. అ. న. 1. ధనము ; చూ, విత్తము. 1: 2. బలము : చూ, శక్తి. 1.

## ద్యూ

**ద్యూతకారుఁడు**, సం విణ : చూ, పందెకాఁడు.
**ద్యూతము**, సం వి. అ. పుం. రూ- ద్యూతి. 1.=జూజము (ఇండ్లిజగడము అక్షద్యూతికము): చూ, వ్యవహారము. 4; అం. 2: చూ, కామజంబులు (జూదమాడుట): చూ, సప్తవ్యసనములు; 4. ద్యూతము.— ప్రాణిద్యూతము అప్రాణిద్యూతము. అని ద్వివిధము.
**ద్యూతసమాహ్వయము**, అం: చూ, వ్యవహారపదములు.

## ద్యో

**ద్యోతకము**, సం. విణ. ప్రకాశింపఁజేయునది: చూ, శోభితము. 5.
**ద్యోతనము**, సం. వి. అ. న. ప్రకాశించుట: చూ, వెలుతురు. 1.
**ద్యోతమానము**, సం. విణ. ప్రకాశించుచున్నది; చూ, శోభితము. 5.
**ద్యోతము**, సం. వి. అ. పుం = జోతము. ప్రకాశము, ఎండ: చూ, వెలుఁగు. 3.
**ద్యోతించు**, సం. అ. క్రి. ప్రకాశించు: చూ, హావణిల్లు.
**ద్యోతితము**, సం విణ. ప్రకాశితము: చూ, శోభితము. 5.

## ద్ర

**ద్రగడము**, సం. వి. అ. న: చూ, తూర్యగణము.
**ద్రప్సము**, సం. వి. అ. న. 1. ఆనుగుపెరుఁగు చూ, పెరుఁగు. 1; 2. మీఁదిపెరుఁగు: చూ, పెరుఁగు. 1; 3. నీళ్ళుకలిసిన పెరుఁగు; చూ, పెరుఁగు. 1; పుం. 4. నీటిబొట్టు; చూ, బొట్టు. 1.
**ద్రబ్బెడ**, దే. వి: చూ, భక్ష్యము.
**ద్రమిడుఁడు**, సం. విణ. (రూ-ద్రమిళుఁడు - ద్రామిడుఁడు - ద్రామిళుఁడు-ద్రావిడుఁడు.) ద్రవిడదేశస్థుఁడు. (చూ, అఱవలు): చూ, ద్రావిడులు: (చూ, బ్రాహ్మణులు.)
**ద్రవంతి**, సం వి. ఈ స్త్రీ. ఎలుకజీడి*: చూ, భల్లాతకి.
**ద్రవము**, సం. వి. అ. పుం. 1. తడి; చూ, స్నేహము; 2. పరిహాసము: చూ, విలాసము. 1; 3: చూ, పరుగు; 4. యుద్ధమువలనఁబాఱుట: చూ, పలాయనము.
**ద్రవించు**, సం. అ. క్రి. కాఱు, చేఁపు; చూ, స్రవించు.
**ద్రవిడప్రాణాయామము**, రూ—ద్రావిడప్రాణాయామము, న్యా. ద్రావిడులు ప్రాణాయామము చేయునపుడు చేతితో ముక్కును సూటిగాఁ బట్టుకొనక తలచుట్టును ద్రిప్పిపట్టుకొందురు. చెప్పవలసినదానిని సరిగాఁజెప్పక త్రిప్పిత్రిప్పి చెప్పుచున్నపుడు దీని నుపయోగింతురు.
**ద్రవిడము**, అం. ద్రవిడదేశము. (తెలుఁగుదేశమునకును మైసూరునకును దక్షిణముగా నుండునట్టియు, కొచ్చిరాజ్యమునకును మళయాళదేశమునకును తూర్పుగానుండునట్టియు దేశమునకు ద్రవిడదేశమనిపేరు; చూ, దేశములు.

ద్రవిణము, సం. వి. అ. న. 1. ధనము: చూ, విత్తము. 1; 2. బంగారు: చూ, లోహము. 1; 3. = త్రాణ. బలము: చూ, శక్తి. 1.
ద్రవ్యము, సం. వి. అ. న. 1. ధనము: చూ, విత్తము. 1; 2. ఇత్తడి: చూ, లోహము. 1; 3: చూ, పూఁత; 4. మంద బుద్ధి: చూ, హ్యాల్లేఖము. 2; 5: చూ, లక్క; విణ. 6. భవ్యము, శుభమైనది: చూ, శుభము; 7. ద్రవికారము; అం. 8. పృథివ్యాది: చూ, ద్రవములు.
ద్రవ్యములు, అం. పృథివి, అప్పు, తేజము, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు. (9).
ద్రవ్యాంగము, సం. వి. అ. న: చూ, ద్రవ్యము. 4.

## ద్రా

ద్రాక్, సం. అవ్య శీఘ్రముగ: చూ, వేగము. 3.
ద్రాక, వై. వి. = ద్రాక్ష. గోస్తని*: చూ, స్వాదుఫల.
ద్రాక్ష, సం. వి. ఆ. స్త్రీ. = దాక. ద్రాక. —పై—
ద్రాక్షపండ్లుపుల్లనివి, లో. ఒకమనుష్యుఁడు తానుకోరినది లభింపనపుడు, దానితో తనకు ఆవశ్యకము లేనట్లు నటించును. అట్టిసమయమున చూచినవారు 'ద్రాక్షపండ్లు పుల్లనివి' అన్నట్లున్నదని యెత్తి పొడుతురు.
ద్రాక్షాపాకము, అం. (అర్థగాంభీర్యము పాకమనంబడును. అది రెండు విధములు: ౧. ద్రాక్షాపాకము, ౨. నారికేళపాకము అని.) వెలుపలను లోపలను స్ఫురించుచున్న రసము గలది ద్రాక్షాపాకము. ఉదా.—"వీనులవిందై యమృత పుం సోనల బొందై యమందసుమచలదళినీ । గానముక్రందై యాస్వన । మానంద బ్రహ్మమైన నధిపతి పలికెన్." (వసు. 2, ఆ. 14.): (చూ, నారికేళపాకము): చూ, పాకములు.
ద్రాక్షారామము, అం: చూ, త్రిలింగము:(చూ, ఆ ధ్రమండలము.) గోదావరీమండలములోని యొకానొక పుణ్యక్షేత్రము.
ద్రాఘిష్ఠము, సం. విణ. మిక్కిలి దీర్ఘమైనది; చూ, మూల. 2.
ద్రాబ, దే. విణ. 1. అసారము: చూ, ఫల్గువు. 2; 2. అపారుఁడు: చూ, వ్రాజె; 3. అధముఁడు: చూ, హీనుఁడు. 2; 4. అధమము: చూ, హీనము. 1.
ద్రావకము, సం. వి. అ. పుం. 1. గంధకపాషాణాదులయందు తీసెడు రసవిశేషము, ఆరఖు; 2. బరువైనరాయి: చూ, రత్నములు; విణ. 3. నేర్పరి: చూ, సమర్థుఁడు. (శ. ర.); 4. మోసకాఁడు: చూ, వంచకుఁడు. (శ. ర.)
ద్రావిడ, అం: చూ, ఘూర్జరుప్యాంగములు: (చూ, అంగము. 9.)
ద్రావిడకము, సం. వి. అ. పుం. కచ్చూరము*: చూ, షడ్గ్రంథ.
ద్రావిడప్రాణాయామము, జా. సుకభముగానిపని. (ద్రవిడ ప్రాణాయామమనియు.)
ద్రావిడము, సం. వి. అ. న. 1. ద్రవిడభాష; చూ, భాష. 1; పుం. 2: చూ, ద్రావిడకము*.
ద్రావిడవరాటి, అం: చూ, వరాట్యుపాంగములు.
ద్రావిడి, అం. ఉత్కల కైశికిజభాష: చూ, భాష. 1.
ద్రావిడుఁడు, సం. విణ; చూ, రూ-ద్రమిడుఁడు.
ద్రావిడులు, అం. ద్రవిడదేశమున నివసించు బ్రాహ్మణులు ద్రావిడులు. వీరి భాష ద్రావిడము. వీరిలో కోనసీమ ద్రావిడులు; తుమ్మగుంట ద్రావిడులు; పుదూరి ద్రావిడులు; చోళవాండ్లు తన్నాయిరము తిల్లమవ్వాయిరము అను బ్రాహ్మణులు; శ్రీవైఖానస బ్రాహ్మణులు: శ్రీపాంచరాత్ర బ్రాహ్మణులు; శ్రీవైష్ణవ బ్రాహ్మణులు; భాగవత బ్రాహ్మణులు; బృహచ్చరణ బ్రాహ్మణులు, వడమ బ్రాహ్మణులు; మాధ్వబ్రాహ్మణులు కలరు: చూ, బ్రాహ్మణులు: (చూ, అజవలు. 1.)
ద్రాహ్యాయణము, అం: చూ, కల్పసూత్రము, కల్పము.

## ద్రి

ద్రిండు, దే. వి: చూ, రూ-డిండు.
ద్రిమ్మరి, వా. వి: చూ, రూ-త్రిమ్మరి.
ద్రిమ్మరీఁడు, —పై.—

## ద్రు

ద్రుంగు, దే. స. క్రి: చూ, రూ-త్రుంగు.
ద్రుకిలిమము, సం. వి అ. పుం: చూ, కిలిమము*.
ద్రుఘణము, సం. వి. అ. పుం. 1. ఇనుపగుదియ: చూ, ముద్గరము; 2. గండ్రగొడ్డలి: చూ, ముద్గరము.
ద్రుఘణుఁడు, సం. వి. అ. పుం. నలువ: చూ, బ్రహ్మ. 1.
ద్రుడ్డు, వై. వి. = దండ: చూ, రూ-మడ్డు. అచ్చ. యు, కాం. 237.
ద్రుణము, సం. వి. అ. న. 1. కత్తి: చూ, రిష్టి. 2; 2. విల్లు, చూ, బాణము. 1; పుం. 3. ఒకరకము తుమ్మెద: చూ, షట్పదము; 4. (రూ-ద్రుణి-ద్రూణము-ద్రోణము) తేలు: చూ, వృశ్చికము. 1; 5. = దొన. అంబులపొది: చూ, బాణము. 1.
ద్రుణి, సం. వి. ఇ. స్త్రీ: చూ, రూ- ద్రుణము. 4.
ద్రుతప్రకృతికసంధి, అం: చూ, సంధిదోషములు.
ద్రుతము, సం. క్రి. విణ. అ. న. 1. త్వరితము: చూ, వేగము. 3; విణ. 2. వడిగలది: చూ, వేగము. 3; 3. కరఁగినది: చూ, లీనము 2; 4. చీలినది: ౧ తద్వి-చీల్పఁబడినది. అవదీర్ణము; వ్యా. 5. 'న' కారము ద్రుతము. చూ, ను. 13; అం. 6: చూ, కాలప్రాణములు; 7: చూ, ప్రహారములు; 8: చూ, లయప్రాణములు; 9: చూ, అంగప్రాణములు.
ద్రుతమేరునష్టము, అం: చూ, ప్రస్తార ప్రత్యయ ప్రాణములు (ఇట్లు ద్రుతమేరువు-ద్రుతమేరూద్దిష్టము.)
ద్రుతవిలంబితము, అం. పద్యవిశేషము. ఒక్కొకపాదమున న-భ-భ రగణములు గలిగి ఏడిట యతిగల పండ్రెండవ ఛందస్సునందుఁబుట్టిన వృత్తము: (చూ, జాతులు): చూ, వృత్తము. 1.
ద్రునఖము, సం. వి. అ. పుం. ముల్లు: చూ, సితాగ్రము.
ద్రుపదము, సం. వి. అ. న. బొండకొయ్య: చూ, బోను.
ద్రుమము, సం. వి. అ. పుం. 1. రూ-ద్రువు. చెట్టు: చూ, వృక్షము; 2. పారిజాతము*: చూ, సూక్ష్మదారువు; 2. అంజూరు*: చూ, మేడి.

ద్రుమముఁడు, సం. వి. అ. పుం. రూ-ద్రుముఁడు. 1 : చూ, కింపురుషుఁడు; 2. శిశుపాలుని స్నేహితుఁడు : చూ, ద్రుముఁడు.
ద్రుమరము, సం. వి అ పుం : చూ, ద్రునఖము.
ద్రుమామయము, సం. వి అ. పుం : చూ, లక్క.
ద్రుముఁడు, సం. వి. అ. పుం : చూ, రూ- ద్రుమముఁడు.
ద్రుమోత్పలము, సం. వి. అ. పుం. కొండగోఁగు * : చూ, మృదుద్రుమము.
ద్రువయము, సం. వి. అ. న. త్రాసు మూర తూము లోనగు మానము : చూ, మానము.
ద్రువు, సం. వి. ఉ. పుం : చూ, రూ-ద్రుమము. 1.
ద్రుహణుఁడు, సం. వి. అ. పుం. = దుగిణుఁడు : చూ, రూ-ద్రుహిణుఁడు.
ద్రుహిణుఁడు, సం. వి. అ. పుం — పై —

## ద్రూ

ద్రూణము. సం. వి. అ. పుం. రూ- ద్రుణము. 1. ఎఱ్ఱతేలు : చూ, వృశ్చికము. 1; 2. తేలు : చూ, వృశ్చికము. 1.

## ద్రే

ద్రేక్కాణము, అం. షోడశవర్గునందొకటి (లగ్నమును మూఁడు సమభాగములు చేసిన యెడల ద్రేక్కాణము అను సంజ్ఞ కలుగుచున్నది. అట్లుచేయఁగా లగ్నముయొక్క మొదటి భాగమునకు లగ్నాధిపతియును, ద్వితీయభాగమునకు నాలగ్నమునకుఁ బంచమాధిపతియు, తృతీయభాగమునకు నాలగ్నమునకు నవమాధిపతియును ద్రేక్కాణాధిపతు లగుదురు): చూ, షోడశవర్గు.
ద్రేక్కాణలగ్నము. అం: చూ, ద్రేక్కాణము. (జన్మలగ్న ప్రమాణము ÷ 3; అట్లుచేయఁగా వచ్చిన 3 భాగములలో ప్రథమభాగములో జాతకుఁడు జననమైనయెడల జన్మలగ్నమే ద్రేక్కాణలగ్నము. ద్వితీయభాగములో జననమైన యెడల జననలగ్నమునకుఁ బంచమరాశి ద్రేక్కాణలగ్నము. తృతీయభాగములో జననమైన యెడల జననలగ్నమునకు నవమరాశి ద్రేక్కాణలగ్నము.)

## ద్రొ

ద్రొబ్బ, దే. వి : చూ, రూ- దొబ్బ.
ద్రొబ్బు, దే. స. క్రి : చూ, రూ- దొబ్బు; వా. 2. త్రోయు (రాయలసీమలో వాడుక.)

## ద్రో

ద్రోఁచువాఁడు, వా. వి : చూ, దోఁపిడికాఁడు.
ద్రోడాఢకము, పా. (32 కుంచములు ద్రోణము, 2 కుంచములు ఆఢకము.)
ద్రోణక్షీర, సం. వి. ఆ. స్త్రీ. 1. ఇద్దుము పాలపిండెడు ఆవు [ఇద్దుము = రెండుతూములు. (అమరము): 2. తూమెడు పాలు పిదికెడు ఆవు. తూము = నాలుగుకుంచములకొలఁది శ. ర.]
ద్రోణదుఘ. సం. వి ఆ. స్త్రీ — పై. —
ద్రోణము, సం. వి. అ. పుం. న. 1. తూము; 2. నల్లుము; పుం. 3. ఒక కొండ : చూ, పర్వతము; 4. తుమ్మికూర* : చూ, స్ఫూర్జకము; 5. తేలు : చూ, వృశ్చికము. 1; 6. ఎఱ్ఱతేలు : చూ, వృశ్చికము. 1 : 7. మాలకాకి : చూ, వాయసము; దే వి. (1) : చూ, రూ-దోణము.
ద్రోణముఖము, సం. వి. అ. న. 400 గ్రామముల మధ్యనున్న గ్రామము : చూ, దేశము.
ద్రోణాము, దే. వి: చూ, రూ- దోణము.
ద్రోణి, సం. వి. ఈ స్త్రీ. 1. = దోనె. చిన్నయోడ : చూ, పోతము; 2. పసులు మేయు కంచె : చూ, వివీతము; 3 = దొన-దోని. కొండపల్లము : చూ, రంధము. 1; 4. దొన్నె-దొప్ప: చూ, పాత్రము. 6; 5. = దోనె. అరిణ: చూ, పోతము; 6 = దోనియ-దోనె. జలగడుగువాని సాధనము: చూ, దోనియ. 3; 7. ఒకదేశము : చూ, దేశము; 8. నీలి *: చూ, రంజని; 9. = దొడ్డి: చూ, పెరడు; 10. = దొన. అంబులపొది: చూ, బాణము. 1.
ద్రోణుఁడు, సం. వి. అ. పుం. 1. ద్రోణాచార్యుఁడు: ఆచార్యుఁడు, కీర్తిభాజుఁడు, కుంభజుఁడు, కుంభయోని, కుంభసంభవుఁడు, గురువు; 2. గురువు: చూ, పంతులు. 1.
ద్రోపది, వై. వి. 1. = ద్రౌపది. రూ-ద్రోవది. పార్వతి, పాంచాలి, ద్రుపదరాజుకూఁతురు: చూ, పుత్రిక; 2. అంగన, కృష్ణ.
ద్రోయువాఁడు, వా. వి. దొంగ. చూ, హారకుఁడు.
ద్రోవది, వై. వి. = ద్రౌపదీ. రూ-ద్రోపది: చూ, పార్వతి. 2.
ద్రోహము, సం. వి. అ. పుం. 1. చంపనిచ్ఛ: చూ, వాంఛ: 2. కీడు తలఁపు: చూ, వ్యళీకము. 2; 3. కలవాఁడు: చూ, వ్యాధుఁడు. 2.
ద్రోహి, సం॰ విశే. (న్. ఈ. న్.) ద్రోహము.

## ద్రౌ

ద్రౌణాయనుఁడు, సం. వి. అ. పుం: చూ, అశ్వత్థామ.
ద్రౌణికము, సం. విశే. నల్లుము విత్తులు విత్తఁదగిన(పొలము): చూ, భూమి. 1.
ద్రౌపది, సం. వి. ఈ. స్త్రీ. = : చూ, రూ-ద్రోపది.

## ద్వ

ద్వంద్వము, సం. వి. అ. న. 1. = దొందము స్త్రీపురుషులజత. చూ, సంగడి. 5; 2. ఇద్దఱొకరితో నొకరు చేయుయుద్ధము: చూ, యుద్ధము; 3. ఏకాంతము: చూ, రహస్యము. 1; 4. శీతోష్ణాదులు; 5: చూ, రెండు; పా. 6. ఉభయపదార్థ ప్రధానము ద్వంద్వము; ద్విపద ద్వంద్వము.— "తల్లిదండ్రులు"; బహుపద ద్వంద్వము.— "రామలక్ష్మణ భరత

శత్రుఘ్నులు; సమాహారద్వంద్వము.–"రథగజతురగపదాతి" అయినను నపుంసకమవచ్చునది కర్మధారయము. విభక్తులలో సమసించునది తత్పురుష. చివర కలవాఁడు వచ్చునది బహువ్రీహి. విశేషంబు లూహ్యంబులు; చూ, సమాసము.

ద్వయము, సం. వి. అ. న. = దోయి. 1. జత: చూ, సంగడి. 5; 2; చూ, రెండు.

ద్వయాతిగుఁడు, సం. వి. అ. పుం. రజస్తమోగుణరహితుఁడు. రూ-ద్వయాతిగుఁడు.

ద్వయి, సం. వి. ఈ. స్త్రీ. = దోయి. (రూ - ద్వయము - ద్వంద్వము - ద్వితీయము - ద్వైతము) జత; చూ, సంగడి. 5.

## ద్వా

ద్వాదశకము, సం. స. అ. న. బారా. పండ్రెండు: చూ, ముచ్చొకము: (చూ, పండ్రెండు.)

ద్వాదశజ్యోతిర్లింగములు, అం: (చూ, జ్యోతిర్లింగములు.) సోమనాథము, మల్లికార్జునము, మహాకాళము, ఓంకారము, వైద్యనాథము, భీమశంకరలింగము, రామేశలింగము, నాగేశలింగము, విశ్వేశలింగము, త్ర్యంబకలింగము, కేదారలింగము, ఘృష్ణేశలింగము.

ద్వాదశాదిత్యులు, అం: చూ, ఆదిత్యులు.

ద్వాదశభావములు, అం: చూ, భావములు.

ద్వాదశము, సం. విణ. 1, పండ్రెండవది; ద్వాదశి; అం. 2. లగ్నకారకత్వములు 12 లో నొకటి (పాప, మోక్ష, నరక, చిత్తవికల, మనోవ్యధ, వామనేత్ర, వ్యయ, జారత్వ, వివాహనష్ట, శయన, శత్రు, శృంఖల: అన్యదేశగమనములు.): చూ, లగ్నకారకత్వములు.

ద్వాదశరాజమండలము, అం. అరి, మిత్రుఁడు, మిత్రమిత్రుఁడు, అరిమిత్రమిత్రుడు, పార్ష్ణిగ్రాహుఁడు, ఆక్రందుఁడు, ఆక్రందాసారుఁడు, పార్ష్ణిగ్రాహాసారుఁడు, విజిగీషుఁడు, మధ్యముఁడు, ఉదాసీనుఁడు. (12).

ద్వాదశసత్వలు, అం. దేవ, మనుజ, నాగ, యక్ష, గంధర్వ, పిశాచ, కాక, వానర, గార్ధభ, ముని, రాక్షస, కిన్నరసత్వలు. (12): (చూ, సత్వలు.)

ద్వాదశాంగుళము, సం. వి. అ. పుం: చూ, జేన. (శ. ర.) (వాడుకయందు 12 అంగుళములు లేక అడుగు.): చూ, వితస్తి.

ద్వాదశాంశ, అం. షోడశవర్గునందొకటి (లగ్నమును 12 భాగములు చేయుటచే ద్వాదశాంశ యనఁబడును ద్వాదశాంశ కనుఁగొనవలసిన గ్రహ మేరాశియందెన్నవ భాగమునందున్నదో కనుఁగొనవలెను. ద్వాదశాంశ కనుఁగొనవలసిన గ్రహమున్న రాశిమొదలు పండ్రెండు రాశ్యధిపతులును ద్వాదశాంశాధిపతులగుదురు. పైనఁజెప్పిన ప్రకారము గ్రహ మేరాశియం దెన్నవభాగమం దున్నదని కనుఁగొనబడెనో యా గ్రహమున్నరాశి మొదట నన్నవరాశి ద్వాదశాంశ యనఁబడును. ఆరాశ్యధిపతియే ద్వాదశాధిపతి): చూ, షోడశవర్గు.

ద్వాదశాఖ్యుఁడు, సం. వి. అ. పుం: చూ, బుద్ధుఁడు. 1.

ద్వాదశాత్ముఁడు, సం. వి. న్. పుం: చూ, సూర్యుఁడు.

ద్వాదశావస్థలు, అం. చక్షుఃప్రీతి, మనస్సంగము, సంకల్పము, ప్రలాపము, జాగరము, కార్శ్యము, అరతి, లజ్జాత్యాగము, సంజ్వరము, ఉన్మాదము, మూర్ఛ, మరణము (12): చూ, అవస్థలు.

ద్వాదశాహము, అం. 1: చూ, రహీనతానములు; (చూ, కూటతానములు); సం. వి. న్. న. 2. = బారసాల, నామకరణము: చూ, బారసాల; వా. 3. పండ్రెండవపనాటి కర్మము.

ద్వాదశాక్షర్వారులు, అం: చూ, ఆళ్వారులు.

ద్వాదశి, సం. వి. ఈ. స్త్రీ =. చూ, దోదసి; విణ. 2. పండ్రెండవది: చూ, ద్వాదశము.

ద్వాపరము, సం. వి. అ. పుం. 1. చూ, సంశయము; అం. 2: చూ, యుగములు.

ద్వాపరయుగము, అం. 1: చూ, ద్వాపరము. 2; 2. జ్యోతిష.– ద్వాపరయుగంబున శీర్షోదయలగ్నమే జన్మలగ్నము: చూ, జన్మలగ్నసమయములు.

ద్వారక, అం. క్షేత్రములు 24 లో నొకటి: చూ, క్షేత్రములు.

ద్వారకంటకము, సం. వి. అ. న. తలుపు: చూ, వాకిలి.

ద్వారపాలకుఁడు, సం. వి. అ. పుం: చూ, ప్రతిహారుఁడు.

ద్వారబంధము, సం. వి. అ. పుం. = దారబందము: చూ, వాకిలి.

ద్వారము, సం. వి. అ. న. 1. = దువారము. — పై. —; 2 = ఉపాయము: చూ, వెరవు; 3. = దారి: చూ, మార్గము. 1.

ద్వారములు, అం. పాణి, ఉపస్థ, పదము, వాణిద్వారము.

ద్వారవతి, అం; చూ, పుణ్యనగరములు (రూ-ద్వారావతి-ద్వారకాపురము.)

ద్వార్థ్సిఁడు, సం. వి. అ. పుం: చూ, ద్వారపాలకుఁడు.

ద్వాస్థుఁడు, సం. వి. అ. పుం —పై.—

## ద్వి

ద్వికము, సం. వి. అ. న. 1. = దుగ: చూ, రెండు; వి అ. పుం. 2. కాకి: చూ, వాయసము; 3. జక్కవ: చూ, బటువుగువ్వ: అం. 4. సంఖ్యాబద్ధములగు ముక్తకాదికములలో నొకటి; చూ, త్రికము. 7.

ద్వ్యక్షరములు, అం. సర్జక్షారము, యవక్షారము.

ద్విగుణము, వా. = దుగుణము: చూ, రెట్టింపు.

ద్విగుణాకృతము, సం. విణ. రెండుచాళ్లు దున్నినది (పొలము): చూ, భూమి. 1.

ద్విగువు, పా. సంఖ్యాపూర్వపదము ద్విగువు. "మూఁడు లోకములు": చూ, సమాసము.

ద్విజ, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, బారంగి *; 2. రేణుకయను గంధద్రవ్యము: చూ, రాజార్హము.

ద్విజబ్రాహ్మణులు, అం. షట్కర్మనిరతులై యెల్లప్పుడును దేవతలను అతిథులను పూజింపుచు వేదాధ్యయననిరతులై సత్ప్రవర్తనము గలవారు ద్విజబ్రాహ్మణులు. (వీరు దశవిధబ్రాహ్మణులలోనివారు): చూ, బ్రాహ్మణులు.

ద్విజము, సం. వి. అ. పుం. 1. పిట్ట: చూ, పక్షి; 2. దంతము: చూ, పల్లు. 1; 3. పాము: చూ, సర్పము.
ద్విజన్మము, సం. వి. న్. పుం: చూ, ద్విజము. 1—2.
ద్విజన్ముఁడు, సం. వి న్. పుం. 1: చూ, బ్రాహ్మణుఁడు; 2. క్షత్రియుఁడు: చూ, రాయి. 1; 3. కోమటి: చూ, వైశ్యుఁడు.
ద్విజరాజు, సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు: చూ, హిమాంశువు; 2. గరుత్మంతుఁడు: చూ, హరివాహనుఁడు; 3. శేషుఁడు: చూ, సర్పము.
ద్విజాతి, సం. వి. ఇ. పుం. 1. పక్షి పాము లోనగునవి; 2: చూ, బ్రాహ్మణుఁడు.
ద్విజిహ్వము, సం. వి. అ. పుం. పాము : చూ, సర్పము. 1.
ద్విజిహ్వుఁడు. సం. విణ. కొండెగాఁడు: చూ, సూచకుఁడు.
ద్విజుఁడు, సం. వి. అ. పుం: చూ, ద్విజన్ముఁడు.
ద్వితయము, సం. స. అ. న. 1. జత : చూ, సంగడి. 5; వా. 2: చూ, రెండు.
ద్వితలము, అం : చూ, ఉద్ధితకరణబంధములు.
ద్వితీయ, సం. వి. ఆ. స్త్రీ. 1. పెండ్లాము : చూ, భార్య; 2.= విదియ: చూ, తిథి, తిథులు; (చూ, సూర్యేందుసంగమము); విణ. 3. రెండవది.
ద్వితీయకము, అం : చూ, జన్యతాళములు.
ద్వితీయము, వా. వి. రెండవపెండ్లి; అం.2 : చూ, అసంహత వ్యూహములు.
ద్వితీయాకృతము, సం. విణ: చూ, ద్విగుణాకృతము.
ద్వితీయుఁడు, సం. వి. అ. పుం. 1. కొడుకు : చూ, పుత్రుఁడు. 1. విణ. 2. రెండవవాఁడు.
ద్వితీయోత్థ్యము, అం : చూ, క్రతుచతుష్టయము.
ద్విత్వము, పా. ఏకవిధమైన హల్లులకూడిక.
ద్విదేహుఁడు, సం. వి. అ. పుం. గణపతి: చూ, వినాయకుఁడు. 1.
ద్విపటము, సం. వి. అ. న. కప్పడు దుప్పటి:
ద్విపటి, సం. వి. ఈ. స్త్రీ.= దుప్పటము —పై.—
ద్విపద, పా. 1. ఒకానొక పద్యభేదము. మూఁడు ఇంద్రగణములు, తుద సూర్యగణము. మూఁడవగణాదిని యతి (రెండు పాదములె.): చూ, వృత్తము. 1;2. చిత్రకవిత్వములో నొకటి: చూ, వృత్తము. 1;3. కావ్యలక్షణమున. -: చూ, అసంఖ్యా బద్ధము.
ద్విపము, సం. వి. అ. పుం. రెంటఁద్రావుడు, ఏనుఁగు : చూ, హస్తి.
ద్విపలి, సం. వి. ఈ. స్త్రీ. చూ, ఇరుపేఁము
ద్విపాదపశువు, జా. పనికిమాలినవాఁడు.
ద్విపాద్యము, సం. వి. అ. పుం. తగినదండుగకంటె రెట్టింపు దండుగ: చూ, సేగి.
ద్విపార్శ్వ, అం : చూ, త్రిపాస.
ద్విభల్లకము, అం : చూ, బాణాగ్రములు.
ద్విభాషి, సం. వి. న్. పుం. = తుపాసి-దుబాసి - రెండుభాషలు తెలిసినవాఁడు.
ద్విముఖాహి, సం. వి. ఇ. స్త్రీ. రెండుతలల పాము: చూ, సర్పము.
ద్వియాతిగుఁడు, సం. వి. అ. పుం : చూ, ద్వయాతిగుఁడు.
ద్విరదగతి, అం. నవవిధరగడలలో నొకటి (ఇరువది మాత్రలు గలిగి పదునొకొండవ మాత్రయే యతిగాఁగల వృత్తము): చూ, రగడ: (చూ, వృత్తము. 1.)
ద్విరదము, సం. వి అ. పుం : చూ, ద్విపము.
ద్విరసనము, సం. వి అ. పుం : చూ, ద్విముఖాహి.
ద్విరేఫము, సం. వి అ. పుం. తుమ్మెద: చూ, భ్రమరము.
ద్విలవణములు, అం : చూ, లవణములు.
ద్విషత్తు, సం. వి. త్. పుం. (రూ-ద్విషంతుఁడు - ద్విషదుఁడు - ద్విషుఁడు - ద్వేషణుఁడు) పగవాఁడు : చూ, శత్రువు.
ద్విషుఁడు, సం. వి. అ ష్. పుం. —పై.—
ద్విసీత్యము, సం. విణ. రెండుచాళ్లు దున్నినది (పొలము): చూ, భూమి. 1.
ద్విహల్యము, —పై.—
ద్విహాయని, సం. వి. ఈ. స్త్రీ. రెండేండ్లప్రాయముగల పెయ్య (ఇట్లు ద్వివర్ష. ఆ. స్త్రీ): చూ, ధేనువు.
ద్విస్వరయుక్తరాగములు, అం. గాధికములు: చూ, రాగములు.

## ద్వీ

ద్వీపము, సం. వి. అ. పుం. 1. పులితోలు: చూ, బెరడు; పుం, న. 2. = దీవి: చూ, లంక. 1.
ద్వీపములు, అం. జంబు, ప్లక్ష, కుశ, క్రౌంచ, శాక, శాల్మలి, పుష్కరద్వీపములు (7).
ద్వీపవతి, సం. వి. ఈ. స్త్రీ. ఏఱు: చూ. నది.
ద్వీపి, సం. వి. న్. పుం. 1. పులి: చూ, శార్దూలము. 1; 2. = దువ్వి, చిఱుతపులి: చూ, శార్దూలము. 1: 3. కడలి; చూ, సముద్రము.

## ద్వే

ద్వేషణుఁడు, సం. వి. అ. పుం : చూ, ద్విషత్తు.
ద్వేషము, సం. వి. అ. పుం. = దేసము, పగ: చూ, విరోధము. 1.
ద్వేషి, సం. విణ : చూ, ద్విషత్తు.
ద్వేషించు, సం. అ. క్రి: చూ, విరోధించు.
ద్వేష్ట, సం. విణ. (ద్వేషించువాఁడు): చూ, ద్విషత్తు.
ద్వేష్యుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, ద్విషత్తు: విణ. 2. పగఁగొనఁదగినవాఁడు : చూ, ద్విషత్తు.

## ద్వ్య

ద్వ్యక్షరము, అం : చూ, శబ్దాలంకారములు.
ద్వ్యక్షరి, అం. —పై—
ద్వ్యష్టము, సం. వి. అ. న. రాగి : చూ, లోహము. 1.

## ద్వై.

ద్వైతము, సం. వి. అ. న. 1. ఒకానొక వనము : చూ, విపినము; వా. 2. జత : చూ, సంగడి. ర; అం. మతత్రయమునందొకటి. (జీవాత్మ పరమాత్మలకు భేదముచెప్పెడి యొక మతము): చూ, మతములు :(చూ, త్రయము.)

ద్వైధము, అం. (భేదము) షడ్గుణములలో నొకటి. (ఇది త్రివిధము. — బలవంతులగు నిద్దఱు శత్రువుల నడుమ నుండెడువాఁడు వారిరువురతో ప్రత్యేకముగా సేవాదికము చెప్పుట, అందొకనితో సంధిచేసికొనుట, ఒకనితో కలహించుట): చూ, గుణములు 3.

ద్వైధీభావము, అం.—పై.—

ద్వైధీభావద్వయము, అం. స్వతంత్రము, పరతంత్రము. (2).

ద్వైపము, సం. విశే. 1. ద్వీపిచర్మముచే కప్పఁబడినది (రథము): చూ, శకటము. 1; 2. ద్వీపిసంబంధమైనది; 3. ద్వీపసంబంధమైనది)

ద్వైపాయనుఁడు, సం. వి. అ. పుం : చూ, వ్యాసుఁడు.

ద్వైమాతురుఁడు, సం. వి. అ. పుం. 1. గణపతి : చూ, వినాయకుఁడు. 1 : 2 జరాసంధుఁడు : చూ, బార్హద్రథి.

## ధ.

ధ, ఒక యక్షరము.

ధగిడిమియ్యా, వా. వి. అడ్డుగా కూర్చుండుట

ధగిడీ, వా. వి. నీచురాలు.

ధ., సం. వి ఆ. స్త్రీ.= దణ. పణఁకు : చూ, శోలము.

ధలము, సం. వి. అ. పుం. కొయ్యతాసు : చూ, త్రాసు.

ధటి, సం. వి. ఈ. స్త్రీ. 1. దట్టి : చూ, వస్త్రము; 2. గోఁచి : చూ: బొట్టము.

ధటిని, సం. వి ఈ స్త్రీ నూలిమొలత్రాడు : చూ, సూత్రము 1.

ధట్టి, సం. వి. ఆ. స్త్రీ. దండు : చూ, సేన. 1.

ధట్టము, సం. వి ఆ. పుం. = తెట్టె : చూ, సమూహము.

ధనంజయము, సం. వి. అ. పుం. ఒకానొక ఉపవాయువు (శవశరీరప్రవర్తమానవాయువు) : చూ, వాయువు; 2. ఒక జాతిపాము : చూ, సర్పము; 3 : చూ, మద్ది. *.

ధనంజయుఁడు, సం. వి. అ. పుం. 1. అర్జునుఁడు : చూ, విజయుఁడు, 1; 2 అగ్ని : చూ, వహ్ని. 1.

ధనందద, సం. వి. ఆ. స్త్రీ. బౌద్ధదేవి : చూ, స్వాహా, 2.

ధనకేలుఁడు, సం. వి. అ. పుం. కుబేరుఁడు : చూ, శ్రీదుఁడు.

ధనక్షయే వర్ధతి జాఠరాగ్నిః, న్యా. ధనముపోఁగా నాఁకలి పెరుగును. "ఎరిఁదుని కాఁకలి యెక్కువ" తెలుఁగుసామెత.

ధనగతులు, అం. దానము, భోగము, నాశము (3): చూ, త్రయము.

ధనగ్రాహకుఁడు, సం. విశే. 1. అప్పు పుచ్చుకొనువాఁడు: అధమర్ణుఁడు, ఋణగ్రస్తుఁడు, ఋణి, ఋణికుఁడు, ఖాతకుఁడు - ఖాదకుఁడు. (తె.ప.) — అప్పులకొఁవు, అప్పులపోతు, అరవరి - అడువరి, తద్భి— అప్పులేనివాఁడు: అఋణి - అనృణి.

ధనదాయాదులు, అం. ధర్మము, అగ్ని, రాజు, దొంగ. (4.)

ధనదుఁడు, సం. వి అ. పుం. 1. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు; విశే, 2. దాత : చూ, వదాన్యుఁడు.

ధనధాన్యము, అం. 1 : చూ, శస్త్రములు; వా. 2. సొమ్మును ధాన్యమును "ధనధాన్యాభివృద్ధిరస్తు" (ధనధాన్యాదులు)

ధననిక్షేపము, అం : చూ, సప్తసంతానములు.

ధనమదము : అం : చూ, అష్టమదము.

ధనము, సం. వి. అ. న. 1.= ధనము : చూ, విత్తము. 2. అవులమంద : చూ, ధేనువు; 3.= దనియము. కొత్తిమెర (ఇట్లు ధనీ - ధనిక - ధనికా - ధానా - ధానక - ధానేయక - ధానేయకా - ధాన్య - ధాన్యాక - ధన్యాకి - ధన్యా - దానీ - దానీక :చూ, విషున్నికము. 1, పా. 4. దీనికి ఉపమానసము.- కుబేరుఁడు; అం. 5 : -చూ, అష్టైశ్వర్యములు; ఐశ్వర్యములు: వా. వి. 6. పశుధనము.

ధనముకొల్లపోవుట, అం : చూ, నష్టములు.

ధనమూల మిదం జగత్, న్యా. జగత్తునకు ధనమే ప్రధానము.

ధనవంతుఁడు, సం. విశే. అచ్చుకుప్పు : చూ, సంపన్నుఁడు.

ధనవృద్ధులు, అం. కాయికవృద్ధి, కాలికవృద్ధి, కారితవృద్ధి, చక్రవృద్ధి (4).

ధనహరి, సం. వి. ఈ స్త్రీ. 1. నల్లకచోరము *: చూ, షడ్గ్రంధ 2: చూ, బలురక్కెస. *.

ధనాధిపుఁడు, సం. వి. అ. పుం. పైఁడితేఁడు : చూ, శ్రీదుఁడు.

ధనాపహారము, అం : చూ, వింశతివిగ్రహములు.

ధని, సం. విశే, రూ - ధనికుఁడు : చూ, సంపన్నుఁడు.

ధనిక. సం. వి. ఆ. స్త్రీ 1. మంచి ఆఁడుది: చూ, స్త్రీ; 2. యౌవనముగల ఆఁడుది : చూ, స్త్రీ.

ధనికము, సం. వి. అ. పుం. = దనియాలు : చూ, ధనము. 3.

ధనికుఁడు, సం. విశే. 1 : చూ, రూ - ధని; 2 : చూ, సజ్జనుఁడు; 3. అప్పులవాఁడు.

ధనియము, వా. సం. వి. అ. పుం. = దనియము : చూ, ధనము. 3.

ధనిష్ఠ, అం : చూ, నక్షత్రము. 1.

ధనుఃపటము, సం. వి. అ. పుం. (రూ - పటము - ధనువు) మోరటి *: చూ, ప్రేంకణము.

ధనుష్పూర్వాధరభాగనిర్ణయము, అం : చూ, ప్రమేయములు.

ధనుర్ద్వయనామోద్దేశము, అం. —పై. —

ధనుర్ధరుఁడు, సం. విశే : చూ, విలుకాఁడు.

ధనుర్ధారి, సం. విశే ; చూ, దునెదారి.

ధనుర్నిర్మాణాదివిశేషము, అం : చూ, ప్రమేయములు.

ధనుర్బంధము, అం : చూ, ఉత్తానకరణబంధము.

ధనుర్విద్యావిలాసము, అం : చూ, ధనుర్వేదము.

ధనుర్వేదము, అం. ఉపవేదములు ౪లో నొకటి.

ధనుర్వేదాంగములు, అం. చారి, స్థాన, న్యాస, ప్రవిచార, సౌష్ఠవ, కరణ, వ్యాయామ, మండల, గతి, ఆసనములు. (10).

**ధనువు,** సం. వి. న్. పుం. న. (రూ - ధనుస్సు - ధన్వము.) 1. విల్లు : చూ, బాణము. 1. 2. నాలుగు మూరలకొలఁది; పుం.3. మోరటి *: చూ, ప్రేంకణము; విశ. 4: చూ, విలుకాఁడు;అం. పన్నెండింటి రాసులలో నొకటి: చూ, రాసులు; 6: చూ, కార్ముకము.

**ధనుశ్శరపూజాయోజనము,** అం: చూ, ప్రమేయములు.

**ధనుశ్శ్రేణి,** సం. వి. స్త్రీ. చాఁగ *: చూ, స్రవ.

**ధనుష్మంతుఁడు,** సం. విశ: (చూ, విలుకాఁడు.)

**ధనుస్సు:** చూ, రూ-ధనువు.

**ధమూరాకర్షణ కౌశకోపన్యాసము,** అం: చూ, ప్రమేయములు.

**ధన్నన్వోత్రిబ్రాహ్మణులు,** అం: చూ, కపూరియబ్రాహ్మణులు: (చూ, బ్రాహ్మణులు.)

**ధన్య,** సం. వి. అ. స్త్రీ. 1. ఉసిరిక*: చూ, శ్రీఫలి; 2. ఉపమాత: చూ, దాది: (చూ, మాత. 1.). 3 = పసియము: చూ, ధనము. 3; విశ. 4. ధన్యురాలు: చూ, స్త్రీ.

**ధన్యాసి,** అం: చూ, రాగాలు.

**ధన్యుఁడు,** సం. విశ: చూ, సుకృతి.

**ధన్వంతరము,** సం. వి. అ. న: చూ, వింటిపటు.

**ధన్వంతరి,** సం. వి. ఇ. పుం. 1. దేవవైద్యుఁడు: చూ, వైద్యుఁడు : (చూ, ఉపవిద్యలు); 2: చూ, సూర్యుఁడు; 3: చూ, శివుఁడు.

**ధన్వము,** సం. వి న్. న. 1. మెట్టనేల: చూ, భూమి. 1;2. విల్లు: చూ, రూ-ధనువు. 1; పుం. 3. నిర్జలభూమి: చూ, భూమి. 1.

**ధన్వయాసము,** సం. వి. అ. పుం. తీఁటకసింద*: చూ, సముద్రాంత.

**ధన్వి,** సం. వి.న్. పుం. 1. ఏఱుమద్ది*: చూ, మద్ది; 2. అర్జునుఁడు: చూ, విజయుఁడు. 1: విశ 3: చూ, విలుకాఁడు; 4. చూ, సమర్థుఁడు; 5 = దణీ: చూ, సైనికుఁడు.

**ధమనము,** సం. వి. అం. పుం. కిక్కిసకసవు. చూ, తృణము. 1

**ధమని,** సం. వి. ఈ. స్త్రీ. 1. నాడి: చూ, నరము 1; 2. నఖమనెడు గంధద్రవ్యము. చూ, రాజార్హము; 3: చూ, మెడ; 4. అగసాలెవానిగొట్టము; 5. గువ్వగుత్తిక *: చూ, రాజార్హము; వా. 6. శుద్ధరక్తవాహిని. (ధమనులు.— యకృద్ధమని, పుప్పుసధమని, ధమనీవ్యూహము. మొ.)

**ధమనుఁడు,** సం. వి. అ. పుం. 1. అగ్ని : చూ, వహ్ని. 1; విశ. 2. కొలిమితిత్తి నూఁదువాఁడు; 3. క్రూరుఁడు: చూ, నిర్దయుఁడు.

**ధమ్మల్లము,** సం. వి అ. పుం. రూ - ధమ్మిల్లము. కొప్పు. చూ, వేనలి.

**ధమ్మిల్లము,** —పై—

**ధర,** సం. వి. ఆ. స్త్రీ 1. (రూ - ధరణి - ధారణి - ధరణీ - ధారుణి) నేల : చూ, భూమి. 1; 2. జరాయువు: చూ, మావి. 2; 3: చూ, మెదడు; వా. 4 = దర: చూ, వెల, 1.

**ధరణము,** సం. వి. అ. న. ధరించుట: చూ, పెట్టుకోలు: 2 : = చూ, దరణము.

**ధరణా,** వా. వి. సొమ్ముఇమ్మని కూర్చుండుట.

**ధరణి,** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. నేల : చూ, ధర. 1; అం 2. ఒకానొకవృత్తము. (మొదటిపాదము పండ్రెండవదగు జగతీ ఛందస్సునందలి తోటకవృత్తచ్ఛాయను, కడవ మూఁడుచరణములును కవికల్పితములై నడచును.) అప్ప 4, ఆ. 205 : చూ, వృత్తము 1,

**ధరణిధరగతి,** అం ఒకానొకవృత్తము ఒక్కొక్క పాదమునందు, న, న, న, న, న, న, న, న గురువుఁగలిగి ఎనిమిదింటఁ బదునాటింట యతిగల పంచవింశచ్ఛందస్సునఁ దుద్భవించిన వృత్తము : చూ, వృత్తము. 1,

**ధరణీకందము,** సం. వి. అ. పుం. పాటికంద* : చూ, సూరణము.

**ధరణీధరము,** సం. వి. అ. పుం. కొండ, నేలతాల్పు : చూ, పర్వతము.

**ధరణీధరుఁడు,** సం. వి. అ. పుం. 1. పుడమిరా : చూ, విష్ణువు. 1; 2. శేషుఁడు : చూ, సర్పము; 3. రాజు : చూ, రాజు. 1.

**ధరణీప్లవము,** సం. వి. అ. న. చూ, సముద్రము.

**ధరణీశ్వరుఁడు,** సం. వి. అ. పుం. 1 : చూ, ధరణీధరుఁడు. 3; 2 : చూ, శివుఁడు.

**ధరము,** సం. వి. అ. పుం. 1. కొండ : చూ, పర్వతము; 2. తాఁబేటిఱేఁడు; 3 : చూ, ప్రత్తి; 4 = దర: చూ, ధర. 4.

**ధరాధరము,** సం. వి. అ. పుం. కొండ : చూ, పర్వతము; 2. తాఁబేలు : చూ, వృత్తము. 4.

**ధరామరుఁడు,** సం. వి. అ. పుం. నేలవేలుపు : చూ, బ్రాహ్మణుఁడు.

**ధరావతు,** వా. వి. హామీసొమ్ము.

**ధరించు,** సం. స. క్రి. తాల్చు: చూ, హవణించు. 2.

**ధరిత్రి,** సం. వి. ఈ. స్త్రీ. రూ-దారయిత్రి, నేల: చూ, భూమి. 1.

**ధర్త,** సం. విశ. ధరించువాఁడు.

**ధర్తవ్యము,** సం. విశ. ధరింపఁదగినది : చూ, హితము. 2.

**ధర్మకర్త,** వా. ఆలయములు, సత్రములు లోనగు వానియందలి కార్యనిర్వాహకాధ్యక్షుఁడు.

**ధర్మకాయుఁడు,** సం. వి. అ. పుం : చూ, బుద్ధుఁడు. 1.

**ధర్మచక్షుఁడు,** సం. వి అ. పుం. —పై.— (ధర్మచక్షువు.)

**ధర్మచింత,** సం. వి. ఆ స్త్రీ. ధర్మమును చింతించుట : ఉపాధి.

**ధర్మజ్ఞుఁడు,** సం. విశ. ధర్మము నెఱిఁగినవాఁడు.

**ధర్మదాత,** వా. సం. విశ. ధర్మమందే బుద్ధినిలిపినవాఁడు, ఎల్లప్పుడును ధర్మము చేయువాఁడు.

**ధర్మదేవతకు పాదములు,** అం. అహింస, సత్యము, దయ, శాంతి. (4).

**ధర్మద్రవి,** సం. వి ఈ. స్త్రీ. ఆకాశగంగ : చూ, నది.

**ధర్మధాతువు,** సం. వి. ఉ. పుం : చూ, ధర్మకాయుఁడు.

**ధర్మధ్వజి,** సం. వి. న్. పుం ; చూ, తాఁటదమ్మఁడు.

**ధర్మపత్ని,** సం. వి. ఈ. స్త్రీ అగ్నిసాక్షిగఁ బెండ్లాడిన పెండ్లాము : చూ, భార్య.

ధర్మపాశము, అం. (కాలపాశము, వరుణపాశము) అస్త్రములు 50 లో నొకటి; చూ, అస్త్రములు: (చూ, బాణము. 1.)
ధర్మపుత్రుఁడు, సం. వి. అ. పుం: చూ, అజమీఢుఁడు.
ధర్మపురి, అం: చూ, క్షేత్రములు.
ధర్మము, సం. వి. అ. పుం. న. 1. పుణ్యము. రూ-ధమ్మము: చూ, సుకృతము. 1; 2. = దమ్మము-దరువము-న్యాయము: చూ, సత్యము. 1; 3. పోలిక, సమత్వము: చూ, సామ్యము; 4. స్వరత్నము: చూ, స్వభావము; 5. ఆచారము: చూ, వర్తనము. 1; 6: చూ, అహింస; 7. వేదోక్తవిధి: చూ, ఉపనిషత్తు. 2; 8. వేదాంతము: చూ, ఉపనిషత్తు. 1; 9. క్రతువు. చూ, యజ్ఞము; పుం. 10. విల్లు: చూ, బాణము; 11. పా. దీనికి ఉపమానములు—ధర్మరాజు, యమధర్మరాజు; అం. 12: చూ, ఉపాంగము. 5; 13: చూ, పురుషార్థములు.
ధర్మములు, అం. 1. ధర్మశాస్త్రములోనివి — జాతిధర్మములు, దేశజధర్మములు, కులధర్మములు, గుణధర్మములు, ఆపద్ధర్మములు (విపద్ధర్మములు) (5 ; వా. 2. ధర్మబుద్ధిగలవారను ప్రసిద్ధిపొందినవారగుటచే "ధర్మాల" అను ఇంటిపేరు గలవారైరి.
ధర్మరాజు, సం. వి. అ. పుం. 1. పాండురాజు పెద్దకొడుకు: చూ, యుధిష్ఠిరుఁడు; 2: చూ, యముఁడు; 3. బుద్ధదేవుఁడు: చూ, బుద్ధుఁడు. 1.
ధర్మవాహనుఁడు, సం. వి. అ. పుం: చూ, శివుఁడు.
ధర్మశాస్త్రము, అం. శాస్త్రములలో నొకటి. (ధర్మము అనఁగా యజమానుని మనస్సహితాత్మయందు సంస్కారరూపమున ధరింపఁబడు గుణమనుట. దానికి సాధనముగ శ్రుతిస్మృతులచేత విధింపఁబడిన క్రియకూడ ధర్మమనఁబడును. బ్రహ్మ హృదయములోనుండి వినిపించిన శ్రుతుల తాత్పర్యమునకు విరోధము రాకుండఁగ తనకు విధేయులగు ప్రజానులవంటి స్వాయంభువమనువు మొదలుగాఁగల ౧౮ గురు ఋషుల హృదయములలో నుండి స్మరింపఁజేసిన గ్రంథములు స్మృతులనియును, ధర్మసంహితలనియును, వానిననుసరించి కొందఱు మునులు స్మరించినవి ఉపస్మృతులనియును వాడఁబడుచున్నవి.
ధర్మసంహిత, సం. వి. ఆ. స్త్రీ. మన్వాది ధర్మశాస్త్రము, స్మృతి: చూ, ధర్మశాస్త్రము.
ధర్మస్య త్వరితా గతిః, న్యా. ధర్మగతి వేగము గలది. అనఁగా ధర్మాచరణమున కాలస్యము గూడదు.
ధర్మాత్ముఁడు, సం. విణ. న్: చూ, సుకృతి.
ధర్మాధికరణము, సం. వి. అ. న. న్యాయవిచారణ స్థలము: చూ, సభ. 2.
ధర్మాధికృతుఁడు, సం. వి. అ. పుం. న్యాయము విచారించువాఁడు: చూ, న్యాయాధికారి.
ధర్మాసనము, సం. వి. అ. న. ధర్మాధికారి కూర్చుండు పీఠము: చూ, పీఁట.
ధర్మి, సం. విణ. ధర్మముగలది.
ధర్మితము, సం. వి. అ. న. రతి: చూ, సంయోగము.
ధర్ముఁడు, సం. వి. అ. పుం. 1: చూ, యముఁడు; 2: చూ, సోమయాజి. 1; 3. ఒక వసువు: చూ, వసువులు.
ధర్మ్యప్ప, సం. వి. ఉ. పుం: చూ, రూ-ధర్మము. 1.
ధర్మేణహీనాః పశుభిస్సమానాః, న్యా. ధర్మహీనులు పశు సదృశులు.
ధర్మో జయతి, న్యా. (స్పష్టము)
ధర్మ్యము, సం. విణ. ధర్మమువలన తొలఁగనిది.
ధర్షణము, సం. వి. అ. న. 1: చూ, వహేలనము; 2. ధర్షించుట.
ధర్షణి, సం. వి. ఈ. స్త్రీ. రూ-ధర్షణి: చూ, బంకులాడి.
ధర్షించు, సం. స. క్రి. 1. తిరస్కరించు: చూ, భంగించు; 2. ధర్షణముచేయు.
ధవము, సం. వి. అ. పుం. 1. ఉమ్మెత్త*: చూ, హాలాపుష్పము; 2. చంద్రః: చూ, వెలిచంద్ర.
ధవళ, సం. వి. ఆ. స్త్రీ. ఆవు: చూ, ధేనువు.
ధవళకైరవము, సం. వి. అ. న. = తెల్లగలువ*: చూ, పద్మము. 1.
ధవళగ్రహము, సం. వి. అ. పుం. = తెలిగాము: చూ, శుక్రుఁడు. 1.
ధవళపక్షము, సం. వి. అ. పుం. = తెలిపక్కము: చూ, పక్షము. 1.
ధవళపత్త్రణ (న్ను), సం. వి. న్. పుం. = తెలిపిట్ట: చూ, హంస.
ధవళము, సం. వి. అ. పుం. = తెలుపు. రూ-ధవళి: చూ, వర్ణము. 6; 2. ఆఁబోతు: చూ, వృషభము. 1; విణ. 3. తెల్లనిది: చూ, వర్ణము. 6; 4. చక్కనిది: చూ, హృద్యము; పా. 5. ఒకానొక వృత్తము: చూ, వృత్తము. 1.
ధవళములు, వా. వై. వి. బ. ఒకరకముపాట: చూ, స్వరము. 2.
ధవళమృగము, సం. వి. అ. పుం. = తెలిమెకము: చూ, సింహము.
ధవళిమ, సం. వి. న్. పుం. = తెలుపు. రూ - ధవళిమము: చూ, వర్ణము. 6.
ధవళిమము, సం. వి. అ. పుం. = —పై.—
ధవిత్రము, సం. వి. అ. న. యాగమునందు అగ్నిని ప్రజ్వలింపఁజేయుటకు కృష్ణాజినముతో చేయఁబడిన విసనకఱ్ఱ. యాగమునందు ఉష్ణపదార్థమందుఁగల యుష్ణత్వమును చల్లార్చుటకొఱకు కృష్ణాజినముతో చేయఁబడిన విసనకఱ్ఱ (అని కొందఱు): చూ, సురటి.
ధవుఁడు, సం. వి. అ. పుం. 1. పెనిమిటి: చూ, భర్త. 1; 2. రాజు: చూ, రాజు. 1; 3: చూ, మనుష్యుఁడు.

## ధా

ధాటి, సం. వి. ఈ. స్త్రీ. 1. = దాడి. దండయాత్ర: చూ, యుద్ధము; 2. = దాఁటు. దండు: చూ, సేన. 1; వా. 3. ధైర్యము; 4. శక్తి. "నీ ధాటికి నిలువలేరు."
ధాణు, అం: చూ, విసరులు.
ధాణుకపాలు, అం. —పై.—
ధాణుధాక, అం. —పై.—

ధాఋధాప, అం. —పై—

ధాత, సం. వి ఋ. పుం. 1 = శాశ్. సేబుష్ : చూ, బ్రహ్మ. 1; విణ. 2. ధరించువాఁడు; 3 : చూ, రక్షకుఁడు; అం. 4. ఆదిత్యులు 12 లో నొకఁడు: చూ, ఆదిత్యులు; 5.(రూ-ధాతృ-ధాతృ) : చూ, సంవత్సరములు.

ధాతకి, సం. వి ఈ. స్త్రీ. ఆరె* : చూ, సుభిక్ష.

ధాతుపుష్పిక, సం. వి అ. స్త్రీ. —పై.—

ధాతుసము, వా. అన్నరసము.

ధాతుభృత్తు, సం. వి త్. పుం. కొండ : చూ, పర్వతము.

ధాతువాది సం. వి. న్. పుం. కారంధమి : చూ, రసవాది.

ధాతువిచక్షణత్వము, అం : చూ, సుగుణములు.

ధాతువు, సం. వి. ఉ పుం. వాతములోనగునది. (వాత. పిత్త శ్లేష్మములు అను నాడులు); 2 వసలోనగునది (వస, అసృక్కు, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్లము అని ఇవి యేడు. పక్షాంతరమున రోమత్వఙ్మాంసాస్థిస్నాయు మజ్జాప్రాణములు ; 3. మణిశిలలోనగు శిలావికారము 4. = జాజువు. కావి, గైరిక ధాతువు : చూ, వర్ణము. 6; 5. పృథివిలోనగునది : (చూ, భూతములు); 6 శబ్దము లోనగునది : (చూ, గుణములు ; 7. త్వక్కులోనగునది : (చూ, ఇంద్రియములు ; 8. భూధాతువులోనగునది; 9. క్రియ : (చూ, ధాతువులు. 3, క్రియ క్రియలు); పా. 10. కణసంహతి. (కణసమితి; కణజాలము; ఘటకధాతువు; పేశీజాలము; పేశీసంఘాతము.)

ధాతువులు. అం. 1. శల్యములు, మాంసము, శోణితము, చర్మము, మెదడు, మజ్జము, శుక్లము (7 ; 2. దశవిధధాతువులు—భ్వాది, అదాది, జుహోత్యాది, దివాది, స్వాది, తుదాది రుధాది, తనాది, క్ర్యాది, చురాది (10); 3 అకర్మకములు (శ్లో. వృద్ధిక్షయ భయ జీవిత మరణం లజ్జాసత్తాస్థితి జాగరణం శయన క్రీడా రుచి దీప్త్యర్థం ధాతుగణం తమకర్మకమాహుః, సకర్మకములు (పూర్వోక్త అకర్మకభిన్న ధాతువులు); 4. (లడాదులు) లట్ - లిట్ - లృట్ - లుట్ - లేట్ - లోట్ లఙ్ - లిఙ్ - లుఙ్ - లృఙ్. (ఇందు లేట్ వేదసంబంధము) (10); అం. 5. బంగారు, వెండి, రాగి, వంగము, సీసము, యసదము, లోహము (7) : చూ, లోహము. 1.

ధాతూపలము, సం. వి. అ. న. జేగురురాయి: చూ, రాయి.

ధాత్రి, సం. వి. ఈ. స్త్రీ. 1. నేల : చూ, భూమి 1.2. = దాది ఉపమాత: చూ, దాది : (చూ, మాత. 1); 3. తల్లి: చూ, మాత. 1; 4 ఉసిరిక *. చూ, శ్రీఫలి; విణ. 5. ధరించునది: హితము. 2; 6. ధరింపఁజేయునది: చూ. హితము. 2.

ధాత్రేయి, సం. వి. ఈ. స్త్రీ. 1. నేల : చూ, భూమి. 1; అం. 2. నాయికలకు సహాయురాలు : చూ, నాయికలు.

ధాన, సం. వి ఆ. స్త్రీ. 1. = దనియాలు *: చూ, ధనము. 3; 2. ముకుళము : చూ, మొగ్గ. 1; బ. 3 : బొరుగులు - రూ. బొరువులు - బోరులు.

ధానుష్కుఁడు, సం. విణ : చూ, విలుకాఁడు.

ధాన్యకృతి, అం : చూ, క్రియాంగములు: (చూ, అంగము. 9.)

ధాన్యపంచకము, అం. మారేడు పిందెలు, వట్టివేరు, ధనియాలు, శొంఠి, తుంగముస్తెలు. (5).

ధాన్యము, సం. వి. అ. న. 1. వడ్లు. (ఏ. హరి) : అక్షతము-అక్షతలు, ధర్మము, తండులీయము, వ్రీహి, స్తంబకరి. (తె. ప). — కొలుచు, వడ్లు: (చూ, స్తంబకరి); ధాన్య విశేషములు.— అవసరదాళ్లు, ఆంపసీయము, ఆర్య, ఆశువు, ఈశ్వరప్రియములు, ఓడిక, కురువిందము, ఖండికము, ఖర్జూరము, గౌరము, పతంగము, పారిజాతము, మదనగంధులు, మన్మథబాణాలు, మల్లెశ్రీగంధులు, మోహనపు సరులు, రత్నసరులు, రామబాణాలు, రామసాగరములు, హాయనము. (తె. ప). — అక్కుళ్లు, అట్రికడాలు - అట్రగడములు-అట్రగడలు, అలుగురాజనములు, ఆకుసన్నములు, అరుగులు-అరెవడ్లు, ఇప్పపూరాజనములు, ఉద్దులు, ఉండరలు, ఎద్దుకొమ్ములవంకెలు, ఎఱ్ఱాలు, ఏనుఁగుకొమ్ములు, ఏలికిరాజనములు, ఒడివిరిప్రాలు, కంటసరులు, కంబులు, కపుకసరులు, కన్నెసరులు, కప్పురభోగులు, కస్తురిపట్టియలు - కస్తూరిపట్టెలు, కస్తూరివిగరాలు, కాకిరెక్కలు, కురవడాలు, కేసరులు, కొండజొన్నలు, కోడిబుడములు, కోదండరామములు, కేడి, గంగాజలంబులు, గందసరులు, గంబూరరాజనాలు, గరుడసరులు గవ్వసరులు, గాజుకప్పెరలు, గుత్తిమల్లెలు, గుత్తులగుత్తులు, గుత్తులు, గొజ్జఁగిబ్రాలు, గొబ్బికాయలు, గొలివెలు, గోరురాజనాలు, గోరుకుంకుమలు, చందురవంకలు - చంద్రవంకలు - చెంద్రవంకలు, ఛిటిముత్తెము, చిలుకముక్కులు, చెనఁగులు-చెన్నఁగులు, చేమపూరాజనములు, జవలు, జవ్వాజివంకెలు, జాజిరాజనములు, డిలకఅజనములు, డిలమలు, జీనిసరులు, జీనువముక్కులు, జున్నుఁబాలు, జొన్నలు, తావి, తిరువరంగములు, తీఁగమల్లియలు-తీఁగమల్లెలు-తీఁగెమల్లియలు, తీఁగసరులు-తీగెసరులు-తీవెసరులు, తుమ్మపూరాజనాలు, తెల్లచెన్నంగులు, తెల్లబుడమలు, దినసరులు, దెబ్బసరులు, దేవసరులు, నక్కతోకబియ్యము, నల్లచెన్నంగులు, నల్లబుడమలు, నల్లయారెలు, నాగమల్లెలు, నీరుకావులు, నెమిలికడ్లు, పగడంపుతీఁగెలు, పచ్చకప్పురపు సరులు, పచ్చగన్నేరు, పచ్చసరులు, పాలకన్నె, పాలమీఁగడలు, పొనఁగు, పిచ్చుకగోళ్లు, పునాసలు, పునాసాటకడాలు, పునుఁగు, పునుఁగురాజనాలు, పులిగోళ్లవంకెలు, పూబాళలు, పూతేపలు, పొంగుప్రాలు, పొన్నశ్రీరాజనాలు, పోతుగంటరాజనములు, ప్రయాగలు, బంగారుతీఁగెలు, బలరామభోగులు, బలుగుత్తులు, బసగులు, బాసిత సేసలు, బాహుపురులు, బీటిసరులు, బుడమలు, బొడసరులు, మంకెనలు, మండిగండ్రలు, మణిసరులు, మల్లెలు, మామిడి గుత్తులు, ముత్తెసరులు, మదుకసరులు ముద్దుప్రాలు, మైపాలలు, మొలగులికలు, మోదుగుతొడిమెలు, మోదుగుమాడలు, రణపెండ్లికొడుకులు, రసంగులు, రాజనములు-రాజనాలు, రెడ్డి పాలవంకెలు, లెక్కపాయలు, లత్తుకబొత్తులు, వంకసన్నములు, వంగాకుబుడమలు, వజ్రంపుదళుకులు, వట్టిసరులు, వన్నెపూలు, వరగలు, వాసనరాజనాలు, వెదురుబియ్యము, వెన్నముద్దలు, వెలువడములు, సంపంగిపూవడ్లు, సంపెఁగలు, సంబాపులు, సన్నమందెగలు, సగ్గుబియ్యము, సాలంకలు, సీతాభోగసరులు, సుకభోగులు మొ: (చూ, స్తంబకరి); (చూ, సస్యము. 1); ౧. అళ్లు,— కుద్రపము - క్రోద్రవము,

చూ, దేశము: వా. 10. = దార. ఈవి: చూ, వితరణము; 11. = దార. అశుకవిత్వము; చూ, మూటలల్లుట.
ధారకపాలు, అం: చూ, విసరులు.
ధారణ, సం. వి. అ. స్త్రీ. 1. మేర, ఎల్ల (అనికొందఱు): చూ, సన్మానము; 2. క్రయము: చూ, వణము. 6; అం. 3. అంగ యోగములు 8 లో నొకటి. (భగవంతునిఁదప్ప మఱియొకటి నెఱుఁగమి): చూ, యోగాంగములు: (చూ, అంగము. 9)
ధారణము, సం. వి. అ. న. 1. ధరించుట; 2. = దారణ. వెల: చూ, వెల. 1.
ధారణి, సం. వి. ఈ. స్త్రీ. రూ-ధరణి: చూ, భూమి. 1.
ధారపోయు, మి. స. క్రి. చేతినీళ్ళుపోసికొని దత్తముచేయు.
ధారమల, సం. వి. అ. పుం. 1. అప్పు: చూ, బాకి. 2; 2. ఒక కొండ: చూ, పర్వతము.
ధారాకదంబము, సం. వి. అ. పుం. నీరుకడిమి*: చూ, హలిప్రియము.
ధారాటము, సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము: చూ, హయము; 2: చూ, వానకోయిల.
ధారాదత్తము, వా. మంత్రపూర్వకముగా దానముచేయఁబడినది.
ధారాధరము, సం. వి. అ. పుం. 1. మబ్బు: చూ, మేఘము. 1; 2. ఖడ్గము: చూ, రిష్టి. 2.
ధారావని, సం. వి. ఇ. పుం. గాలి: చూ, వాయువు. 1.
ధారాసంపాతము, సం. వి. అ. పుం. జడివాన: చూ, వాన. 1.
ధారాళము, సం. విణ. అడ్డుపాటులేనిది: చూ, విశృంఖలము.
ధారాళి, అం: చూ, భిన్నషడ్జ విభాషలు: (చూ, భాష. 1.)
ధారి, సం. వి. ఈ. స్త్రీ. కోరింద*: చూ, ముర్మురి.
ధారిక, సం. వి. అ. స్త్రీ. 1. చెవిజొరుపాము: చూ, సర్పము; 2. జెట్టి: చూ, సర్పము.
ధారు, అం: చూ, విసరులు.
ధారుధాణ, అం.—పై.—
ధార్తరాష్ట్రము, సం. వి. అ. పుం. నల్లని ముక్కు కాళ్ళుగల హంస: చూ, హంస.
ధార్తరాష్ట్రుఁడు, సం. వి. అ. పుం. 1. ధృతరాష్ట్రుని కొడుకు: చూ, సూనుఁడు. 1; 2. ఒకానొకపాము: చూ, సర్పము. 1.
ధార్మపత్తనము, సం. వి. అ. న: చూ, మిరియము.
ధార్మికత, అం: చూ, నాయకగుణములు.
ధార్మికుఁడు, సం. విణ. 1. = దమ్మఁడు. పుణ్యాత్ముఁడు: చూ, సుకృతి; 2: చూ, ధానుష్కుఁడు.
ధార్య, సం. వి. అ. స్త్రీ. 1: చూ, దాయ్య; 2. కోరింద*: చూ, ముర్మురి; విణ. 3. ధరింపఁదగినది: చూ, హితము. 2.
ధార్ష్ట్యము, సం. వి. అ. న. దిట్టతనము: చూ, శక్తి. 1.
ధావనము, సం. వి. అ. న. 1. = ధవుదు: చూ, పరుఁగు. 2; 2. శుద్ధి: చూ, శోధనము. 1.
ధావనమొనర్చు, మి. అ. క్రి: చూ, పరుగెత్తు.
ధావని, సం. వి. ఈ. స్త్రీ. నక్కతోకపొన్న*: చూ, సృగాలవిన్న.
ధావళ్యము, సం. వి. అ. న: చూ, రూ-ధవళిమము.

## ధి

ధిక్కారము, సం. వి. అ. పుం. తిరస్కారము. ఛీ; చూ, వహేలనము.
ధిక్కృతము, సం. విణ. ధిక్కరింపఁబడినది: చూ, వహేలనము.
ధిక్కృతుఁడు, సం. విణ: చూ, వెలివాఁడు.
ధిక్క్రియ, సం. వి. ఆ. స్త్రీ: చూ, ధిక్కారము.
ధిమి, అం: చూ, కిట.
ధియాంపతి, సం. వి. ఇ. పుం. పూర్వజైన విశేషము: చూ, బుద్ధుఁడు. 1.
ధిషణ, సం. వి. అ. స్త్రీ. బుద్ధి: చూ, హృల్లేఖము. 2.
ధిషణుఁడు, సం. వి. అ. పుం. బృహస్పతి: చూ, వేలుపుటొజ్జ.
ధిష్ణ్యము, సం. వి. అ. న. 1. ఇల్లు: చూ, సదనము. 1; 2. చోటు; చూ, స్థానము. 1; 3. బలము; చూ, శక్తి. 1; 4: చూ, రిక్క.

## ధీ

ధీ, సం. వి. ఈ. స్త్రీ: చూ, ధిషణ.
ధీంద్రియము, సం. వి. అ. న: చూ, జ్ఞానేంద్రియములు.
ధీమంతుఁడు, సం. వి. త్. పుం. 1: చూ, విద్వాంసుఁడు; 2: చూ, ధిషణుఁడు.
ధీర, అం. 1. మధ్యాప్రగల్భలు ధీర, అధీర, ధీరాధీరలను మూఁడుతెఱఁగులు (ధీర ఇతరస్త్రీసఁ బొంది వచ్చినపిదప పతినిఁజూచి దండించునది): చూ, స్వీయ. (ధీర, అధీర, ధీరాధీరలు జ్యేష్ఠ కనిష్ఠ భేదంబులచే నిరుదెఱంగు లైరి.); 2: చూ, తంత్రములు.
ధీరము, సం. వి. అ. న. రూ - దీరము. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము. 1.
ధీరలలిత, అం. (ధీరలలితుఁడు) (సుఖియైనవాఁడు): చూ, నాయకులు.
ధీరశాంత, అం. (ధీరశాంతుఁడు) (శాంతుఁడు నైనవాఁడు): చూ, నాయకులు.
ధీరాధీర, అం. (ధీరాధీర పతి నన్నివిధముల దండించునది): చూ, ధీర. 1.
ధీరుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, విద్వాంసుఁడు; విణ. 2: చూ, దిట్టరి; 3: చూ, స్వతంత్రుఁడు.
ధీరోదాత్త, అం. (ధీరోదాత్తుఁడు) (ధైర్యము కలిగి శాంతుఁడై సర్వమెఱింగి దయాశాలియైనవాఁడు): చూ, నాయకులు.
ధీరోద్ధత, అం. (ధీరోద్ధతుఁడు) (గర్వాసూయాదంభమాయా క్రోధాదులు గలవాఁడు): చూ, నాయకులు.
ధీవరుఁడు, సం. వి. అ. పుం. = తీవరుఁడు. జాలరి: చూ, వలఱేఁడు.
ధీసచివుఁడు, సం. వి. అ. పుం: చూ, మంత్రి. 1.
ధీహరుఁడు, సం. విణ. = దిమ్మరి, మందుఁడు: చూ, సోమరి.

## ధు

ధుంధుం, వా, అవ్య, కోపమునందలి ధ్వన్యనుకరణము: చూ, హూహూ.
ధుంధుమారము, సం. వి. అ. పుం. 1. కఱుమూపము: చూ, పొగ; 2. పట్టుపురుగు: చూ, పురుగు.
ధుతము, సం. విణ. రూ-ధూతము. 1. కదలింపఁబడినది: చూ, వేల్లితము; 2. విడువఁబడినది: చూ, సముజ్ఝితము; అం. 3: చూ, శిరఃక్రియలు.
ధుత్తూరము, సం. వి. అ. పుం. (రూ-ధుస్తూరము.| ధుస్తూరము. ఉమ్మెత్త*: చూ, హలాపుష్పము.
ధుని, సం. వి. ఈ. స్త్రీ. ఏఱు: చూ, నది.
ధుర, సం. వి. ఆ. స్త్రీ రూ-ధురి. బరువు: చూ, భారము. 1.
ధురంధరము, సం. వి అ. పుం. (రూ-ధురీణము - ధుర్యము - ధూర్వహము-ధౌరేయము.) 1. బరువు మోసెడు ఎద్దు: చూ, వృషభము. 1; విణ. 2. బరువుమోయునది: చూ, వృషభము. 1.
ధురంధరుఁడు, సం. విణ. (రూ-ధుర్యుఁడు-ధురీణుఁడు-ధూర్వహుఁడు-ధౌరేయుఁడు) బరువుమోయువాఁడు; చూ, భారవాహుఁడు.
ధురి, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-ధుర.
ధురీణము, సం. వి. అ. పుం. విణ: చూ, రూ-ధురంధరము.
ధురీణుఁడు, సం. విణ: చూ, ధురంధరుఁడు.
ధురీన, మి. ద్ర: చూ, యుగపత్.
ధురీలన, —పై.—
ధుర్తూరము, సం. వి. అ. పుం: చూ, రూ-ధుత్తూరము.*
ధుర్యము, సం. వి. అ. పుం. విణ: చూ, రూ-ధురంధరము.
ధుర్యుఁడు, సం. విణ: చూ, ధురంధరుఁడు.
ధుస్తూరము, సం. వి. అ. పుం: చూ, రూ-ధుత్తూరము.*

## ధూ

ధూంక్ష్మము, సం. వి. న్. పుం. తెల్లకాకి: చూ, వాయసము. 1.
ధూంగియాలబ్రాహ్మణులు, అం. నేపాళదేశపు బ్రాహ్మణులలో నొకతెగవారు: చూ, నేపాళదేశపు బ్రాహ్మణులు: (చూ, బ్రాహ్మణులు.)
ధూతము, సం. విణ: చూ, రూ-ధుతము.
ధూననము, సం. వి. అ. న. కదలించుట.
ధూనము, అం: చూ, హస్తక్రియలు.
ధూపము, సం. వి. అ. పుం. = దూపము. 1. వాసనగల (సాంబ్రాణి, గుగ్గిలములోనగువాని) పొగ: చూ, పొగ; అం. 2: చూ, ఉపచారములు. 5.
ధూపాయితము, సం. విణ. తపింపఁజేయఁబడినది: చూ, సంతప్తము.
ధూపితము, సం. విణ. 1. ధూపమువేయఁబడినది; 2: చూ, ధూపాయితము.
ధూమకదంబము, సం. వి. అ. పుం. బట్టకడిమి*: చూ, హరిప్రియము.
ధూమకేతువు, సం. వి. ఉ. పుం. 1. = పొగగల కేతు. తోఁకచుక్క: చూ, రిక్క; 2. అగ్ని: చూ, వహ్ని. 1.
ధూమధ్వజుఁడు, సం. వి. అ. పుం. అగ్ని: చూ, వహ్ని. 1.
ధూమనాళిక, వా. వి. పొగగొట్టము.
ధూమయోని, సం. వి. ఇ. పుం. మబ్బు: చూ, మేఘము. 1.
ధూమలము, సం. వి. అ. పుం. 1. నలుపుమించఁ గలసిన యెఱుపు: చూ, వర్ణము. 6; విణ. 2. నలుపుమించఁ గలిసిన యెఱుపుఁ గలది: చూ, వర్ణము. 6.
ధూమశకటము, వా. వి. పొగబండి: చూ, శకటము. 1.
ధూమిక, సం. వి. ఆ. స్త్రీ. మూడమంచు: చూ, హిమము.
ధూము, వా. వి. కలత. జాడ్యము.
ధూమ్య, సం. వి. ఆ. స్త్రీ. ధూమముల గుంపు.
ధూమ్యాటము, సం. వి. అ. పుం. రూ-ధూమ్రాటము. కూఁకటిమూఁగ: చూ, భృంగరాజము. 3.
ధూమ్రపత్త్రిక, సం. వి. ఆ. స్త్రీ. పొగచెట్టు.
ధూమ్రము, సం. వి. అ. పుం. విణ: చూ, ధుమలము.
ధూమ్రశూకము, సం. వి. అ. న: చూ, లొట్టిపిట్ట.
ధూర్జటి, సం. వి. ఇ. పుం. 1 : చూ, శివుఁడు; 2. కాళహస్తి మాహాత్మ్యము వ్రాసినకవి.
ధూర్తము, సం. వి. అ. న. 1. ఒకరకము ఉప్పు: చూ, లవణము. 1; పుం. 2. ఉమ్మెత్త*: చూ, హలాపుష్పము.
ధూర్తు, సం. వి. అ. పుం. రూ-ధూర్తుఁడు. 1: చూ, పందెకాఁడు; విణ. 2 : చూ, వంచకుఁడు.
ధూర్తుఁడు, సం. వి. అ. పుం. విణ. —పై.—
ధూర్వహము, సం. వి. అ. పుం. విణ: చూ, ధురంధరము.
ధూర్వహుఁడు, సం. విణ: చూ, ధురంధరుఁడు.
ధూళిధ్వజుఁడు, సం. వి. అ. పుం. గాలి; చూ, వాయువు. 1. (ధూళిధ్వజుఁడు.).
ధూళి, సం. వి. ఈ. స్త్రీ. రూ-ధూళి: చూ, రేణువు. 1.
ధూళికదంబము, సం. వి. అ. పుం: చూ, ధూమకదంబము.
ధూసరము, సం. వి. అ. పుం. 1. బూడిదరంగు: చూ, వర్ణము. 6; 2. గాడిద: చూ, రాసభము; విణ. 3. బూడిదరంగుగలది: చూ, వర్ణము. 6.
ధూళిపూడి, వా. వి. ఇది యొక గ్రామము. దీనిని యింటిపేరుగాఁ గలవారు కలరు. (కలవలపూడి, ద్వారపూడి ఇత్యాదులూహ్యంబులు.)

## ధృ

ధృతపూర్ణము, సం. వి. అ. పుం. కానుఁగు*: చూ, జారంగి.
ధృతమధ్య, పా. ఒకానొకవృత్తము. ఇది దోదకవృత్తచ్ఛాయను బేసిపాదంబులున్ను తోదకవృత్తచ్ఛాయను సరిపాదంబులున్ను నడచును : చూ, వృత్తము. 1.
ధృతము, సం. విణ. ధరింపఁబడినది.గృహీతము:చూ,హితము.2.
ధృతరాష్ట్రిపది, సం. వి. ఈ. స్త్రీ: చూ, హంసపాది*.
ధృతరాష్ట్రుఁడు, సం. వి. అ. పుం. 1. దుర్యోధనుని తండ్రి: చూ, పిఱుఁడు; 2. ఒకానొకపాము: చూ, సర్పము; 3. రాజు: చూ, రాజు. 1.

దూడ, పెయ్య- పేయ, లేఁగ; ౩౦. రెండేండ్లపెయ్య.— ద్విహాయని, ద్వివర్ష; ౩౧. మూఁడేండ్లపెయ్య.— త్రిహాయని, త్ర్యబ్ద; ౩౦. నాలుగేండ్లపెయ్య.— చతురబ్ది, చతుర్హాయని; ౩౧. వత్సతరి. (తె).— తరిపిదూడ. తరుపు- తఱపి- తఱుపు; ౩౨. పాలచేఁపునకు విక్రయించిన ప్రాణములేని తోలుపెయ్య. (తె)— చేటపెయ్య— చేతిపెయ్య. ౩౩. అవిశ్వాస. ౩౪. ఆవు గేదె లోనగునది: పాడిబంధనము. (మిగిలియున్న విశేషాదులకు "శౌరభేయి" చూడుము.)

ధేనుష్య, సం. వి. అ. స్త్రీ. 1. బందెవద్దయావు. కుదువఁ బెట్టిన యావు (అనికొందఱు): చూ. ధేనువు. ౨౧; 2. బందెవద్దయెనుము, కుదువఁబెట్టినయెనుము, (అని కొందఱు): చూ, మహిషి.

## ధై

ధైనుకము, సం. వి. అ. న. ఆవులమంద: చూ, ధేనువు. ౩౪.

ధైర్యం సర్వత్ర సాధకమ్ న్యా. ఎల్లెడల ధైర్యము కార్యసాధకము.

ధైర్యము, సం. వి. అ. న. 1. ధీరత్వము, దీమసము: చూ, సైర్యము. 1: అం. 2. దీనికి ఉపమానములు.— పర్వతము (మేరువు); అం. 3; చూ, శృంగారచేష్టలు.

ధైర్యశాలి, సం. వి. ఇ. పుం: చూ, దిట్టఁడు.

ధైర్యే సాహసే చ లక్ష్మీః, న్యా. ధైర్యమునందును సాహసము నందును లక్ష్మి నివసించును

ధైవతము, అం. (నాభ్యాదిస్థానములవలనఁ బుట్టినది. బుద్ధిమంతులచేఁ బాడఁబడునది :చూ, సప్తస్వరములు, స్వరము 2: (చూ, ఉచ్చతమము).

ధైవతి, అం: చూ, శుద్ధజాతులు: (చూ, అంశములు).

## ధో

ధోడ, అం: చూ, విసరులు.

ధోరణము, సం. వి. అ. న. ఎక్కఁదగిన యేనుఁగు లోనగునది: చూ, వాహనము.

ధోరణి, సం. వి. ఇ. స్త్రీ. 1. పద్ధతి: చూ, విధము. 1; 2. పంక్తి: చూ, వరుస.

ధోళ, సం. వి. అ. స్త్రీ: చూ, సవారి.

## ధౌ

ధౌతము, సం. విణ. కడుగఁబడినది: చూ, పరిక్షాళితము.

ధౌరంధర్యము, సం. వి అ. న. ధురంధరత్వము.

ధౌరేయము, సం. వి. అ. పుం. విణ: చూ, ధురంధరము.

ధౌరేయుఁడు, సం. విణ: చూ, ధురంధరుఁడు.

ధౌర్త్యము, సం. వి. అ న. ధూర్తత్వము.

## ధ్యా

ధ్యాత, సం. విణ ధ్యానించువాఁడు.

ధ్యాతము, సం. విణ. ధ్యానింపఁబడినది.

ధ్యాతవ్యము, సం. విణ. ధ్యానింపఁదగినది: ధ్యేయము.

ధ్యానము, సం. వి. అ. న. = దేనము. 1. తలఁచుట: చూ, స్మృతి. 1; అం. 2. (చాంచల్యము లేక భగవంతుని మనసునను తలఁచుట): చూ, యోగాంగములు: (చూ, అంగము. 9); 3 (అమ్మహామహు డగు రాఘవేంద్రుండు నాకన్నులకుఁ గల నివ్వచ్చరం బెట్లు తీర్చును ? ఎప్పుడు నామనంబున కార్యాసంబు గలుగు. ఇది యెన్నఁడేని చేకూరునో!): చూ, సంచారిభావములు.

ధ్యానించు, సం. స. క్రి. ఆవధరించు: చూ, తలఁచు. 2.

ధ్యామము, సం. వి. అ. న. 1. రూ-ధ్యామమము, కామంచిగడ్డి*: చూ, తృణము. 1; 2. దవనము*: చూ, రుచి. 1; విణ. 3. నల్లనిది: చూ, వర్ణము. 6.

ధ్యాయము, సం. వి. అ. న: చూ, రూ-ధ్యామము. 1.

## ధ్యే

ధ్యేయము, సం. విణ: చూ, ధ్యాతవ్యము.

## ధ్రు

ధ్రుతి, అం. (ధృతి అని కొందఱు) (ఆంజనేయా: ఇంక నా జన్మమునకు రాము నొకసారి కన్నులం గాంచినం జాలు): చూ, సంచారిభావములు.

ధ్రువ, సం. వి. అ. స్త్రీ. 1. స్రుగ్భేదము: చూ, స్రువము; 2. గుజ్జుపుసుడి: చూ, సుడి. 1;3 గుజ్జుపుసుడియుండు చోటు; 4. చాఁగ*; చూ, స్రవ; 5. ముయ్యాకుపొన్న*: చూ, సాలపర్ణి; అం. 6. = దరువు: చూ, నూడకములు.

ధ్రువము, సం. వి. అ. న. 1. ఊహ: చూ, యోచన; 2. నిశ్చయము: చూ, సత్యము. 1; పుం. 3: చూ, మట్టి*; 4. మోడు: చూ, వృక్షము; 5. గనిక: చూ, శూలము. 3; 6. పదునాలుగక్షరములు గల తాళవిశేషము: చూ, స్వరము. 2; విణ. 7. ఎడతెగనిది: చూ, సతతము; 8. కదలనిది: చూ, స్థావరము; 9. నిలుకడగలది: చూ, స్థిరము; అం 10: చూ, యోగములు.

ధ్రువుఁడు, సం. వి. అ. పుం. 1. ధ్రువనక్షత్రము: చూ, రిక్క; 2. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 3: చూ, శివుఁడు; అం. 4: చూ, వసువులు. (ధృవుఁడు అని కొందఱు.)

## ధ్వ

ధ్వంసము, సం. వి. అ. పుం. నాశము: చూ, చత్త.

ధ్వంసించు, సం. స. క్రి: చూ, పాడుసేయు.

ధ్వంసితము, సం. విణ. ధ్వంసముచేయఁబడినది.

ధ్వజము, సం. వి. అ. పుం. న. 1. టెక్కెము: చూ, సిడము; 2. టెక్కెపుకంబము; 3 గుఱుతు: చూ, లక్షణము. 1; 4. మగగుఱి చూ, శిశ్నము; 5: చూ, హంకారము; అం. 6: చూ, ప్రధానవ్యూహములు.

ధ్వజముఁడు, సం. వి. అ. పుం. కల్లమ్మెడువాఁడు: చూ, సురాజీవి.
ధ్వజని, సం. వి. ఈ. స్త్రీ. దండు: చూ, సేన. 1; 2. సీమా భేదము.
ధ్వని, సం. వి. ఇ. పుం. 1. మ్రోఁత, శబ్దము: చూ, స్వరము. 2; 2. వ్యంగ్యప్రధానపద్యము: చూ, స్వరము. 2.
ధ్వనించు, సం. అ. క్రి. 1. మ్రోయు: చూ, శబ్దించు; 2. కూయు: చూ, శబ్దించు.
ధ్వనిగ్రహము, సం. వి. అ. న. చెవి: చూ, శ్రోత్రము.
ధ్వనితము, సం. విశ. మ్రోయునది. రపణము. 2.
ధ్వనిద్వేణువు, సం. వి. ఉ. పుం: చూ, కణాదిబొంగు.
ధ్వన్యనుకరణము, అం. ధ్వన్యనుకరణంబులు ద్వి - త్రి - చతుష్కంబులు నగు: చూ, హూహూ.
ధ్వస్తము, సం. విశ. 1. నశించినది: అంతరితము; 2. జారినది: చూ, స్రస్తము.

# ధ్వా

ధ్వాంక్షపుష్టము, సం. వి. అ. పుం. కోయిల: చూ, సాఁకుడు పులుఁగు.
ధ్వాంక్షము, సం. వి. అ. పుం. 1. కాకి: చూ, వాయసము; 2. కొక్కెర: చూ, బకము.
ధ్వాంతము, సం. వి. అ. న. చీఁకటి: చూ, మేచకము.
ధ్వానము, సం. వి. అ. పుం: చూ, ధ్వని. 1.

# న

న, ఒక యక్కరము. సం వి. అ. పుం. 1. పిశ్శారి: చూ, వినాయకుఁడు. 1; 2. కయ్యము: చూ, యుద్ధము; 3. దానము: చూ, వితరణము; 4. మేలు: చూ, శుభము. 1; స్త్రీ. 5. పొక్కిలి: చూ, బొడ్డు. 1; 6. తెలివి: చూ, బుద్ధి. 1; 7. వాద్యము: చూ, స్వరము. 2; విశ. 8. గొడ్రాలు: చూ, స్త్రీ; 9. కొంచెపుది: చూ, స్వల్పము; 10. మిక్కిలి కష్టమైనది; 11. వేఱయినది: చూ, విభాజితము. 1; 12. సుందరమైనది: చూ, హృద్యము; 13. కఠినమైనది: చూ, బెడిదము; 14. కోరికల వీడేర్చుకొనునది (పరి); అప్య. 15. అభావార్థకము: చూ, శూన్యము. 1; 16. నఞర్థకము: చూ, లేమ. 2; 17. నిషేధార్థకము: చూ, వద్దు; 18. ఈషదర్థకము: చూ, స్వల్పము; పా. 19. సాధారణముగా నన్నిమంత్రములయంం దిమిడి యుండెడు ఒకానొకయక్కరము: చూ, మంత్రము. 1; అం. 20: చూ, కవర్గము; దే. అప. (1) సప్తమ్యేక వచనమునందు వచ్చెడి యొకానొక ప్రత్యయము "వనమున".
నఞ్, సం. అవ్య. 1. పోలిక: చూ, సమానము. 2; 2. కొంచెము: చూ, స్వల్పము; 3. విరోధార్థకము: చూ, విరోధము; 4. నిషేధార్థకము: చూ, వద్దు; 5. మఱియొకయర్థము; 6. అభావార్థకము: చూ, శూన్యము. 1.
నంకు, దే. వి. 1: చూ, వస్తు; స. క్రి. 2: చూ, కోరాడు.
నగ, దే. విశ. రూ-నంగనాచి, గడుసుది: చూ, స్త్రీ.
నంగనాచి, 1.—పై.—; వి. 2: చూ, వడ్లచిలుక.
నంగి, దే. వి. ముక్కుతో మాటాడఁబడుమాట: చూ, శబ్దము.2.
నంగిమాట, —పై.—
నంగు, దే. అ. క్రి. ముక్కుతో మాటాడు.
నంచు, వా. స. క్రి: చూ, రూ-నంజు. 3.
నంజ, వా. వి. 1. మాగాణి: చూ, పొలము:(చూ, భూమి. 1.); 2: చూ, పచ్చడి.
నంజ, వా. వి.—పై.—(రూ-నంజు).
నంజు, దే. వి. 1 విషము. స్వా. 5, అ. 50: చూ, విసము. 1; 2: చూ, రూ-నంజ; 3. నెత్తురు చచ్చి తెల్లపాఱుట. నజు; స. క్రి. 4. రూ-నంచు. కూరలు లోనగు వ్యంజనములను తిను: చూ, సాపడు.
నంజుడు, దే. వి. ఎఱచి. భార. అను. 4, అ, 379: చూ, శుక్తము. 2.
నంజుడుదిండి, దే. వి. 1: చూ, రాక్షసుఁడు. 1. అచ్చ. సుం. కాం. 158; విశ. 2. మాంసమును దినువాఁడు.
నంజుడుముక్క, వా. వి: చూ, శుక్తము. 2.
నంజువాఱు, దే. అ. క్రి. (నంజు + పాఱు) నెత్తురుచచ్చి తెల్లపాఱు.
నంటు, దే. వి. 1. రూ-అంటు: చూ, స్నేహము. వసు. 4, అ. 36; విశ. 2: చూ, స్నేహితుఁడు. శశాం. 1, అ. 33.
నంటుకత్తె, గ్వా. విశ: చూ, రూ-అంటుకత్తియ.
నంటుకాఁడు, దే. విశ: చూ, రూ-అంటుకాఁడు.
నంద్రకాయ, వా. వి: చూ, పీత.
నంద, సం. వి. అ. స్త్రీ. 1. కొన్నితిథులు కలిసిన తిథి: చూ, తిథి; 2. ముంత: చూ, పాత్రము. 6; 3. కలిమి: చూ, సంపత్తి; పా. 4. ఒకానొక వృత్తము. ఒక్కొక్క పాదము తగణ లగములతోఁ గూడినదై ఐదవఛందస్సు నందుఁ బుట్టిన వృత్తము: చూ, వృత్తము. 1; అం. 5: చూ, గాంధారగ్రామ గత మూర్ఛనలు.
నందకము, సం. వి. అ. పుం. 1. విష్ణుఖడ్గము (దేవతలను సంతోషపెట్టునది): చూ, రిష్టి. 2; విశ. 2. సంతోషించునది: చూ, హ్లాదనము.
నందన, సం. వి. ఆ. స్త్రీ. 1. కూఁతురు: చూ, పుత్రిక; అం. 2: చూ, సంవత్సరములు.
నందనము, సం. వి. అ. న. 1. ఇంద్రుని యుద్యానవనము: చూ, వనము. 2; 2. ఉద్యానవనము: చూ, వనము. 2; అం. 3: చూ, జన్యతాళములు.
నందనవనము, సం. వి. అ. న: చూ, నందనము. 1—2.
నందనాస్త్రము, అం: చూ, అస్త్రములు.
నందనుఁడు, సం. వి. అ. పుం. 1. కొడుకు: చూ, సూనుఁడు. 1; విశ. 2: చూ, హృష్టుఁడు.
నందపుత్రి, సం. వి. ఈ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి. 1.

నందబ్రాహ్మణులు, అం. ఉత్కళులలో నొక తెగవారు. శుక్ల యజుర్వేదులు. మాధ్యందిన శాఖ: చూ, ఉత్కళ బ్రాహ్మణులు: (చూ, బ్రాహ్మణులు.)
నందయంతి, అం: చూ, అంశములు.
నంది, సం. వి. ఇ. న్. పుం. 1. శివుని వృషభము: చూ, వృషభము 1; 2. ఎద్దు: చూ, వృషభము. 1; న్. పుం. 3. కఱజువ్వి: చూ, ప్లక్షము; 4: చూ, మద్దిః; 5: చూ, నందివర్ధనము (1).
నందిని, అం. ఒక్కొక్కపాదము, భ, ర, జ, గురువులుగలిగి అతింట యతిగల దశమఛందస్సునందుఁ బుట్టిన వృత్తము: చూ. వృత్తము. 1.
నందిముఖి, సం. వి. న్. పుం: చూ, నక్కతోఁకబియ్యము.
నందివర్ధనము, సం. వి. అ. న. 1. అమావాశ్య (లేక) పున్నమ: (చూ, తిథి): చూ, సూర్యేందుసంగమము; వా. పై. వి (1) = నంద్యావర్త. గరుడవర్ధనిపూవు*. ఉ. రా. 3, ఆ. 201. (పురుషోత్తమ కవీయము.). కాలపర్ణము, కాలానుసారకము. కుణి, కుబేరకము-కుబేరము - కునేరకము, తగరము, నంది, నంద్యావర్తము. (తె. ప.)—నందివర్ధనము.
నందివర్ధనుఁడు, సం. వి. అ. పుం: చూ, శివుఁడు.
నందివృక్షము, సం. వి. అ. పుం. ఒకానొకచెట్టు: చూ, వృక్షము.
నందీశ్వరుఁడు, సం. వి. అ. పుం. (నంది): చూ, శాస్త్ర ప్రవర్తకులు.
నందుఁడు, సం. వి. అ. పుం. ఒకానొక గోపకుఁడు.
నందో రాజా భవిష్యతి, న్యా. (స్పష్టము.)
నంద్యావర్తము, సం. వి. అ. పుం. 1. పడమటఁ దక్కఁ దక్కిన మూఁడుదిక్కుల వాకిళ్లుగల రాజగృహము: చూ, సదనము. 1; 2. =: చూ, నందివర్ధనము (1)*; అం. 3: చూ, ఏకవింశతి స్థానములు.
నంబరు, వా. వి. 1. సంఖ్య; 2. గుఱుతు; 3. దావా; 4. ఇండ్లు భూములు లోనగువాని వరుసనంఖ్య.
నంబి, దే. వి. విష్ణుపూజకుఁడు: చూ, పూజారి.
నంబెరుమాళ్ళు, వా వి. బ. (నమ్ + పెరుమాళ్ళు): చూ, శ్రీరంగఁడు.
నకనకఁబడు, ద్వ. అ. క్రి. (నకనక + పడు) కృశించు: చూ, సొటసొటవోవు.
నకనకలాడు, దే. అ. క్రి. —పై.—
నకనకలు, దే. వి బ: చూ, సొటసొట. స్వా. 3, ఆ. 28.
నకనకలుగుడుచు, దే. అ. క్రి: చూ, నకనకఁబడు. కళా. 4, ఆ. 105. (రూ-నకనకల్గుడుచు.)
నకలు, వా. వి. 1. మాతృకనుచూచి వ్రాసిన పత్రిక, ఆదర్శము: చూ, ప్రతి. 2; విణ. 2. ఒకదానినిఁజూచి అదేమాదిరిగ వ్రాసినది.
నకామవృత్తిర్వచనీయమీక్షతే, న్యా. కాముకుఁడు లోకాపవాదమును గణింపఁడు.
నకాషాయైర్భవేద్యతిః, న్యా. కాషాయవస్త్రధారణముచే సన్న్యాసి కాఁజాలఁడు. "తలబోడులైన, దలఁపులుబోడులా" అని యేతత్సజాతీయము.
నకిలీ, వా. విణ. 1. కపటముతోఁ గూడినది; 2. కలుషమైనది. "నకిలీపని".
నకీబు, దే వి. వెండిబెత్తమువాఁడు. స్వా. 5, ఆ. 42: చూ, వేత్రహస్తుఁడు.
నకుంపలము, సం. వి అ. పుం. సీపపిల్లి: చూ, మత్స్యము. 1.
నకులము, సం. వి అ. పుం: చూ, ముంగిస.
నకులుఁడు, అం. యుధిష్ఠిరునితమ్ముఁడు: చూ, పాండవులు.
నకులేష్ట, సం. వి. అ. స్త్రీ: చూ, సర్పాక్షి.
నక్క, వై. వి. 1. = నాక - నాత: చూ, సృగాలము; విణ. 2. క్షుద్రము: చూ, సాధారణము. 2.
నక్కజిత్తులు, జా. కొంటెతనపు పనులు, అసత్యప్రాపనులు.
నక్కతోఁకకసవు, ద్వ. వి: చూ, సింహపుచ్ఛి*. (నక్కతోఁక పొన్న అని కొందఱు.)
నక్కతోఁకపొన్న, ద్వ. వి. క్రోష్టువిన్న* —పై.— (నక్కతోఁకకసవు అనియు.)
నక్కతోఁకబియ్యము, ద్వ. వి. నందిముఖి. ఒకరకమువడ్లు: చూ, ధాన్యము.
నక్కదోస, ద్వ. వి. చిర్భటము*: చూ, హరివాలుకము: (చూ, దోస.)
నక్కనడుము త్రొక్కుట: జా. శుభశకున మగుట. "మన మీ దిన మిక్కడ నక్కనడుము ద్రొక్కి వచ్చినారము". (ధర్మజ.)
నక్కనేరేడు, ద్వ. వి. కాకినేరేడు*: చూ, నేరేడు.
నక్కయెక్కడ ? నాకలోకమెక్కడ , లో. తక్కువవాఁడు ఎక్కువపదవినిఁ బొందఁజాలఁడు అని వాడెదరు.
నక్కరేఁగు, ద్వ వి. రూ-నక్కరేను-నక్కేఱు*: చూ, రేగు.
నక్కరేను, ద్వ. వి. —పై.—
నక్కవినయము, జా. 1: చూ, మోసకబ్రహ్మచర్యము; వా. వి. 2. కపటముతోఁగూడిన వినమ్రత.
నక్కవిరిగి, ద్వ. వి. క్షుద్రశ్లేష్మాతకము*. రూ-నక్కవిరిగె.
నక్కవిరిగె, ద్వ. వి. —పై.—
నక్కి, వా. వి. మోటుజరీ.
నక్కిళ్లు, ద్వ. వి. బ. (నక్కు + కీళ్ళు) ప్రక్కపళ్లకీళ్ళు.
నక్కిళ్లుపడుట, జా. మాటరాకుండ అంకిళ్లు నొక్కుకొనిపోవుట. "మారుతుం డుదారసంబై యీరసంబునఁ బోరునప్పుడు వారి నక్కిళ్లుపడును." (నీతిచంద్రిక-విగ్రహము.)
నక్కు, దే. వి. 1. ప్రమానియతుకు. "ఇది నక్కుదూఱము"; 2. బంగారపుబిల్ల: చూ, భూషణము. 2; 3. బంగారు నలుకగా నడుమ గనిపెట్టెడి నిగ్గు; 4. నాఁగటికఱ్ఱు: చూ, మడక; వా. 5. చింతగింజల అంబలి సరేసు లోనగు బంకతో బొమ్మల కీళ్ల లోనగువానికి పెట్టెడు అతుకు; 6. గోడపెట్టుట కొఱకు త్రవ్వెడు పునాదుల కిటు నటు వేయు మొక్కులు (గసికలు); అ. క్రి. 7. ఒదుగు: చూ, విరియు. 5; వా. 8, దాఁగు; 9. మూలదాఁగు.
నక్కెర, దే. వి. నక్కెర. కంది*: చూ, సురాష్ట్రిజము.
నక్కెర, —పై.—
నక్కేఱు, ద్వ. వి. (నక్క + ఏఱు) రూ-నక్కరేఁగు*.

నక్తంచరము, సం. వి. అ. పుం. గుడ్లగూబ : చూ, పకినంపుఁ బుఱుఁగు.

నక్తంచరుఁడు, సం. వి అ. పుం. రేద్రిమ్మరి : చూ, రాక్షసుఁడు. 1.

నక్తకము, సం. వి. అ. పుం. 1. చినిఁగినబట్ట : చూ, వస్త్రము; 2. మాసినబట్ట : చూ, వస్త్రము; 3. బట్ట : చూ, వస్త్రము; 4. తడిని తుడుచుగుడ్డ : చూ, వస్త్రము; 5 : చూ, నక్తంచరము.

నక్తమాల(ల)ము, సం. వి. అ. పుం. కానుగుచెట్టు : చూ, శాదప్పము.

నక్తము, సం. వి అ. న. రేయి : చూ, రాత్రి.

నక్రము, సం. వి. అ. న. అడ్డకమ్మి : చూ, లచ్చికమ్మి; 2 : తొక్కుడుగమ్మి - త్రొక్కుడుగమ్మి, త్రొక్కుడుపట్టె; పుం. 3. మొసలి : చూ, మత్స్యము. 1.

నక్షత్రపంక్తి, అం. సంఖ్యాబద్ధములగు ముక్తకాదికములలో నొకటి ; చూ, త్రికము. 7.

నక్షత్రమాల, సం. వి. ఆ. స్త్రీ. ఇరువదియేడు ముత్యములు గ్రుచ్చిన యొంటిపేటహారము ; చూ, భూషణము. 2.

నక్షత్రము, సం. వి. అ. న. నశింపనిది) 1: ఉడువు, ఋక్షము, ఋమ్, ఖంబు, గగనేచరము, జాని, జ్యోతి, తారకము, తారము, ధిష్ణ్యము, భం. (తె. వ.)—చుక్క. రిక్క; ('రిక్క' అను పదముకడ అశ్విన్యాది నక్షత్రములయొక్క పర్యాయ పదావివరములు చూచుకొనవలెను.) నక్షత్రములు దక్షప్రజాపతి కొమార్తెలు. అందువలన వీనికి దాక్షాయణులను పేరు కలిగెను.)

నక్షత్రేశుఁడు, సం. వి. అ. పుం: చూ, హిమాంశువు.

నఖంపచము సం. వి. అ. న: కోష్ణజలము. (తె.)— అత్తెసరు- ఎత్తెసరు, ఎసరు.

నఖక్షతము, అం. 1. అర్ధచంద్రము, అర్ధేందువు, ఛురితము, (తె.)— గిల్లు-గిల్లుకు, గోటినాటులు, గోటినెలవంకలు. గోటినొక్కులు, గోరువంకలు - గోర్వంకలు, గోరొత్తు, చెనకు, చందురుకూనలు, చందురువంకలు - చంద్రవంకలు, నెలకూనలు, నెలవంకలు. తద్వి - ౧. పిఱుఁదులమీఁది నఖక్షతములు.— ఉత్పల పత్రము. (తె.)— కలువరేకు- కల్వరేకు; ౨. కంఠయందుఁ జేయునఖక్షతము. (తె.)- కలువరేకు- కల్వరేకు; ౩. నఖక్షత భేదములు.— అచ్ఛురితకము, ఉత్పలపత్రకము. ఊరువు, కంఠము, కక్షము; ౪. కపోలోరుకటోపరిప్రదేశమందలివి.— (తె.)- క్రొన్నెలలు; ౫. వీఁపుమీఁదఁ జేయు నఖక్షతములు.- (తె.)— నమ్మలు 2: చూ, కళలు.

నఖక్షతములు, అం: (చూ, నఖక్షతము) వర్ణిష్ణుత, అనువినుత, మృదుత, ఉజ్జ్వలత, నిరేఖత, స్ఫుటత (6): (చూ, కామము. 8.): (చూ, రతిబంధములు.)

నఖక్షతస్థానములు, అం. చేతులు, తొడలు, చంకలు, గబ్బలు, పిక్కలు, పిఱుఁదులు, మెడ, బొమ్మ, చనులు (9): (చూ, అర్ధచంద్రము: చూ, కామము.8.): తద్వి—నఖక్షతస్థానభేదములు.— గండము, జఘనము ఇత్యాది.

నఖము, సం. వి. అ. పుం. 1: రూ-నఖరము, కరకంటకము, కరజము-ఖరజము, కరకుట్టు, కరరుహము, కరశూకము, కరవాలము, కరేటము, కరేటువు, కామాంకశము, ఖరరము, ఖురము, పునర్భవము. (తె.)— గోరు; తద్వి- బొటనవ్రేలి గోరు.— అంగుష్ఠము. 2. గంధద్రవ్యవిశేషము: చూ, రాజార్హము; 3. వీణె లోనగు వాని వాయించెడి కొడుపు, కొఱుపు: చూ, శలాక.

నఖములు, అం. దీనికి ఉపమానములు.— నక్షత్రములు, ముత్యములు, వజ్రపు పలుకులు, మొగలిరేకులు.

నఖరము, సం. వి. అ. పుం. న. 1: చూ, నఖము. 1; అం 2: చూ, ముప్పదిరెండాయుధములు: (చూ, బాణము. 1.)

నఖలు బహిరుపాధీః ప్రీతయ స్సం శ్రయంతే. న్యా. ప్రేమ బాహ్యోపాధిని నాశ్రయింపదు.

నఖరాయుధము, సం. వి అ. పుం. కోడి: చూ, పుంజు.

నఖోత్పాటని, సం. వి. ఈ. స్త్రీ. (తె.) — గోరుగల్లు, గోరుగొండి- గోర్గొండి.

నగ, దే వి. 1. తొడవు: చూ, భూషణము. 2; 2 లోహపాత్రము: చూ, పాత్రము; 6; 3. పొగాకు దూదిలోనగు వాని కంల్లపుమూట: 4. సిద్దెలజోడు; 5 అంగి: చూ, వస్త్రము.

నగగము అం. (న+గగ) "వరమలీపే": చూ, ఉపగణములు.

నగచ్ఛేద్బ్రాహ్మణాశ్రయమ్ న్యా ముప్పూరు బ్రాహ్మణు లేనికాలమున నొకస్థలము నుండి బయలువెడలరాదు.

నగణము, అం. మూఁడు లఘువులు. "నృహరి". చూ, అష్టగణలక్షణము.

నగదు, వా. వి. 1. పైకము: చూ, విత్తము. 1; 2. చేతివెల, రొక్కము: (చూ, విత్తము. 1.)

నగధరుఁడు, సం. వి. అ. పుం. గట్టుతాలుపు: చూ, విష్ణువు 1.

నగపతి, సం. వి. ఇ. పుం. కొండ: చూ, పర్వతము.

నగఁబాటు, వా. వి. 1. చూ, రూ-అగపాటు; 2: చూ, రూ- నగుఁబాటు.

నగము సం వి. అ. పుం. 1. రూ-నాగము —పై —; 2. రూ-నాగము. పాము: చూ, సర్పము; 3. చెట్టు చూ, వృక్షము; అం. 4. (న+గ) "పలుకుమీ": చూ, ఉపగణములు.

నగరబ్రాహ్మణులు, అం. కర్ణాటక బ్రాహ్మణులలో నొకతెగవారు: చూ, బ్రాహ్మణులు.

నగరము, సం. వి. అ. న. రూ-నగరి. పట్టణము: చూ, దేశము.

నగరి, సం. వి. ఈ. స్త్రీ.—పై.—

య, దే. వి. (రూ-నగరు-నవరు-నవరు.) 1. రాజగృహము: చూ, నదనము. 1.

నగలచప్పుడు, వా. వి. వస్తువుల మ్రోఁత: చూ, స్వరము. 2

నగలము, అం. (న+గల) "కరుణఁజూడు": చూ, ఉపగణములు.

నగవరి, దే. విణ. (నగవు+అరి) నవ్వుగలవాఁడు.

నగవు, దే. వి. (రూ-నగు-నవ్వు-నవ్వు) 1: చూ, హాసము; పా. 2. దీనికి ఉపమానములు.— వెన్నెల, పాలు, చంద్ర

కాంతమణులు, నురుగు, మల్లెపూవులు, వజ్రములు, కీర్తికిఁ జెప్పఁబడిన యితర వస్తువులు.

నగవైరి, సం. వి. న్. పుం. గట్టుదాయ, ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు.

నగళు, దే. వి: చూ, రూ-నగరు.

నగారిపుఁడు, సం. వి. అ. పుం. గట్టులఱేఁడు, హిమవంతుఁడు: చూ, పర్వతము.

న గాయత్ర్యాః పరం మంత్రం న మాతుః పరదేవతా, న్యా. గాయత్రీ మంత్రముకన్న శ్రేష్ఠమగు మంత్రము లేదు. తల్లిఁ న్న మించిన దేవత లేదు.

నగారా, వా. వి. పెద్దఢంకా.

నగాసు, చిత్రము.

నగిషి, అందమగు చెక్కడపుపని.

నగు, దే. వి. 1: చూ, రూ-నగవు. అప్ప. బాల. కాం. 133; అ. క్రి. 2. నవ్వు: చూ, హసించు.

నగుఁబాటు, ద్వ. వి. రూ-నగఁబాటు. నవుపాటు - నవ్వుబాటు. భార. ఆర. 6, ఆ. 30: చూ, పరిహాసము.

నగౌకసము, సం. వి. స్. పుం. 1. పిట్ట: చూ, పక్షి; 2: చూ, సింహము; 3. సెరబము: చూ, శరభము. 1.

నగ్గు, దే. వి. నుగ్గు; చూ, సుకుము.

నగ్నచ్ఛద, సం. వి. ఆ. స్త్రీ. నల్లవిష్ణుక్రాంతము*: చూ, విష్ణుక్రాంత.

నగ్నహూవు, సం. వి. ఉ. ఊ. పుం. నానాద్రవ్యములచేత చేయఁబడిన సురాబీజము. కిణ్వము: చూ, సుర. 2.

నగ్నిక, సం. వి. ఆ. స్త్రీ 1. కన్యక, సమర్తాదని పదుచు: చూ, స్త్రీ; 2. దిసమొలయాఁడుది, ఉచ్చమల్లి; చూ, స్త్రీ.

నగ్నుఁడు, సం. వి. అ. పు. 1: చూ, బుద్ధుఁడు. 1; 2. బట్టువాఁడు: చూ, వంది; విణ. 3. దిసమొలవాఁడు: చూ, బిత్తిలి.

నచాన్యార్థం ప్రకృత మన్యార్థం భవతి, న్యా. ఒక అర్థములో ప్రయోగింపఁబడిన శబ్దమునకు మఱియొకయర్థము కలుగదు. అట్లే బల్లి ప్రాఁకుచున్నదిగనుక అది ప్రాఁకే పాము కాజాలదు.

నచ్చిక, దే. వి. (రూ-నచ్చిగ, నమ్మకము-నమ్మిక-నమ్మిగ.) విసువాసము: చూ, విశ్వాసము.

నచ్చిగ, —పై.—

నచ్చినవాఁడు, వా. వి. ఆప్తుఁడు. ఆం. భా. ద్వి. 187: చూ, స్నేహితుఁడు. 1.

నచ్చుచెప్పు, వా. స. క్రి. నచ్చునటుల నుడువు.

నచ్చు, దే. వి. 1. బాధ, దుఃఖము: చూ, శోకము; 2. అలస్యము: చూ, విలంబము. 1; స. క్రి. 3. నమ్ము. భార. ఉద్యో. 4, ఆ. 234: చూ, విశ్వసించు.

నచ్చుకాఁడు, దే. విణ. 1. అలసుఁడు: చూ, సోమరి; 2. బాధకుఁడు: చూ, వేసరి.

నచ్చుకుప్ప, దే. విణ. నిచ్చుపెట్టువాఁడు: నచ్చుగొట్టు.

నచ్చుగొట్టు, —పై.—

నచ్చుపెట్టు, దే. స. క్రి. తొందరపెట్టు: చూ, బాధించు.

నచ్చుకాటు, వా. వి. నచ్చుట.

నజరానా, వా. వి. రాజులకిచ్చు కానుక.

నజిషి, —పై.—

నజ్జు, దే. వి. 1. అణువు, నుఱుజు, స్వా. 3, ఆ. 39: చూ, స్వల్పము; వా. 2: చూ, నంజు. 3; విణ. 3. మిక్కిలిఁ లఁగిన నది. గజబిజి.

నటనము, సం. వి. అ. న. రూ-నాట్యము. 1. ఆట: చూ, వ్యంజకము 1; 2. నటన, కపట ప్రవర్తనము: చూ, వర్తనము. 1; వా. 3. కపటనాటకము: చూ, వ్యంజకము 1.

నటము, సం. వి. అ పుం 1. ఇరుగుడు*: చూ, శింశుప; 2. దుండిగము*: చూ, శోణకము; 3. అశోకము*: చూ, హేమపుష్పము.

నటవాలు, దే. వి. రేచితము. రూ-నట్వాలు-నట్టువాలు: చూ, హయము.

నటి, సం. వి. ఈ. స్త్రీ. 1. నట్టువుని పెండ్లాము (సూత్రధారుని భార్య. ఇది సకల భాషలు కథలు చదివి మాటలాడఁదగినదై యుండవలెను.): చూ, భార్య; 2. కాకిదొండ*: చూ, రక్తఫల; 3. గువ్వగుత్తిక *: చూ, రాజార్హము; దే. వి. (1): చూ, వేశ్య.

నటించు, సం. అ. క్రి. 1. నర్తించు; చూ, మలపుగొను; 2. ఉండు; చూ, వర్తించు; 3. కపటముగాప్రవర్తించు; చూ, వర్తించు.

నటుఁడు, సం. వి. అ. పుం. = నట్టువుఁడు: చూ, నట్టు. 3.

నటుపెయిడు, వా. విణ. (బిరింగు) బిళ్ళలేని జాబు. (నాట్ పెయిడ్.)

నట్టు, దే. వి. బ. 1. పాశకము: చూ, వ్యవహారము. 4; అం. 2: చూ, పంచమషాడవజభాషలు: (చూ, భాష. 1.)

నట్టకనడుము, దే. వి. (నడుము + నడుము): చూ, రూ-నట్ట నడుము.

నట్టకోఁతి, వా. వి: చూ, బాలక్రీడ.

నట్టడవి, ద్వ. వి. (నడుము + అడవి) అరణ్యమధ్యము: చూ, విపినము.

నట్టనడుము, దే. వి. (నడుము + నడుము) సరిమధ్యము, ఉ. రా. 3, ఆ. 128: నట్టనడుము.

నట్టాడు, ద్వ. అ. క్రి. 1. నర్తించు: చూ, మలపుగొను; 2. చలించు: చూ, పలించు.

నట్టి, దే. వి. గర్భగృహము. రూ-నట్టిల్లు-అయివిల్లు: చూ, సదనము. 1: (చూ, రూ-నట్టు. 1-2-3.)

నట్టింటనుండి నా భాగ్యము దైవము తెచ్చునా, లో. ఉదా. — "పరగ నట్టింటనుండి నాభాగ్యమనిన, దైవ మెక్కడ గొని తెచ్చు తనకునిచ్చు." (కుచేలోపాఖ్యానము.)

నట్టిల్లు, దే. వి. (నడుము + ఇల్లు), 1: చూ, నట్టి; 2. గృహమధ్యము: చూ, సదనము. 1.

నట్టు, దే. వి. 1, రూ-నట్టి. చోటు. అప్ప. యు. కాం. 27: చూ, స్థానము. 1; 2. రూ-నట్టి. ఇల్లు చూ, సదనము. 1; 3. రూ-నట్టి. వాసస్థానము: చూ, ఏపుపట్టు: (చూ, సదనము. 1); 4. సస్యరోగము: చూ, నాసి; 5. ఆలస్యము: చూ, విలంబము. 1; 6. రూ-నెట్టు. ఉప్పురాసులుండుచోటు: చూ, భూమి. 1; 7. నిరోధము: చూ, వారణము. 1; 8. = నట-నర్తక. (రూ-నట్టువ(డు-నట్టువ్వ(డు-నట్టువకా(డు-నట్టువా(డు-నట్టువ-నట్టువు) నాటకు(డు: చూ, శైలూషు(డు; వా. 9. సీలపై బిగింపు.

నట్టుక, వా. వి: చూ, అటక.

నట్టుకొట్టు, దే. అ. క్రి. ఆలస్యముచేయు. కళా. 1, ఆ. 191: చూ, వివరించు. 3.

నట్టుకొను, దే. అ. క్రి. కుదురుకొను. స్వా. 3, ఆ. 28: చూ, మట్టుపడు.

నట్టుగు(ను, వై. వి. =: చూ, రూ-నట్టు. 8.

నట్టుపులు(గు, ద్వ. వి. రూ-నట్టువపులు(గు. కేకి: చూ, మయూరము.

నట్టువ, వై. వి. = 1: చూ, రూ-నట్టు. 8; 2. = నాట్య. నర్తనము: చూ, వ్యంజకము. 1.

నట్టువకా(డు, ద్వ. వి. (వైకృతమని కొందఱు): చూ, రూ-నట్టు. 8.

నట్టువచావడి, ద్వ. వి. నాట్యశాల: చూ, సదనము. 1.

నట్టువడు, ద్వ. అ. క్రి. (నట్టు + పడు) అంకిలిపడు, అడ్డుపడు-అడ్డివడు, అడ్డుగొను, అరిగొను, అరిపడు, అ(కపడు, నిల(బడు-నిల్వ(బడు-నిలుప(బడు, నిలుచు. నిల్చు, (మి.ప. -అభ్యంతరమగు.

నట్టుపిట్ట, ద్వ. వి: చూ, నట్టుపులు(గు.

నట్టువపులు(గు, —పై.—

నట్టువము, వై. వి. = నాట్యము: చూ, వ్యంజకము. 1.

నట్టువా(డు, ద్వ. వి. =: చూ, నట్టు. 8. (వై. అని కొందఱు).

నట్టువాలు, దే. వి. 1: చూ, రూ-నటవాలు; 2: చూ, బాలక్రీడ.

నట్టువు, వై. వి. =: చూ, రూ-నట్టువ.

నట్టువు(డు, వై. వి. =: చూ, నట్టు. 8.

నట్టువొజ్జ, వై. వి. (నట్టువ + ఒజ్జ = నాట్యోపాధ్యాయు(డు. భార. విరా. 1, ఆ. 242: చూ, పంతులు. 1.

నట్టేఱు, దే. వి. (నడుము + ఏఱు) నదీమధ్యము: చూ, నది.

నట్లొట్లు, దే. వి. బ: చూ, రూ-అట్లొట్లు. స్వా. 3, ఆ. 1 0.

నట్వాలు, దే. వి: చూ, రూ-నటవాలు.

నడ, దే. వి. గతి (రూ-నడక-నడయూట - నడత - నడపు)-నడుపు): చూ, ప్రయాణము.

నడక, 1.—పై.—; 2. నడత: చూ, సమయము. 2; 3. నడవడిక: చూ, వృత్తి. 1; పా. దీనికి ఉపమానములు.—హంస, ఏను(గు

నడగా(డు, దే. వి. (నడ + కా(డు) గుఱ్ఱము. జై. 8, ఆ. 79: చూ, హయము.

నడ(గొండ, వా. వి. జంగమపర్వతము: చూ, పర్వతము.

నడగొట్టు, దే. అ. క్రి. నిలుచు, ఉండు: చూ, వసించు.

నడచు, దే. అ. క్రి. 1. గమనించు. ఉ. హరి. 6, ఆ. 66: చూ, వెళ్ళు. 3; 2. ప్రవర్తించు: చూ, వర్తించు.

నడజోదు, ద్వ. వి. కాలిబంటు. ఉ. హరి. 4, ఆ. 229: చూ, భటు(డు. 1.

నడత, దే. వి: చూ, రూ-నడక. (రూ-నడవడి-నడవడిక-నడితి-నడ్తి-నడువడి-నడపు.)

నడతెంచు, దే. అ. క్రి. (నడచు + తెంచు) గమనించు. భార. కర్ణ. 1, ఆ. 46: చూ, వెళ్లు. 3.

నడదివియ, ద్వ. వి. దివిటీ, కరదీపము. భార. విరా. 5, ఆ. 320: చూ, స్నేహాశము.

నడపీను(గు, ద్వ. వి: చూ, ప్రాజె.

నడపు, దే. వి: చూ, రూ-నడక. 1-2-3. (ప్రయాణమునకు.—భార. విరా. 1, ఆ. 345); ప్రే. 4. నడప(జేయు: చూ, వర్తించు; 5. త్రోలు: చూ, వెలుచు.

నడపుట, వా. వి. ఉత్తేజము.

నడబావి, ద్వ. వి: చూ, దివియ.

నడమీనము, సం. వి. అ. పుం: చూ, చిలిచిమము.

నడము, సం. వి. అ. పుం. రూ-నళము. కిక్కసకసవు: చూ, తృణము. 1.

నడయాడు, దే. అ. క్రి. (నడ + ఆడు) 1: చూ, సంచరించు; 2: చూ, సలించు.

నడయూట, వా. వి: చూ, నడ.

నడవ, దే. వి. 1. సేతువిశేషము: చూ, సేతువు. 1; 2. దారి: చూ, మార్గము. 1; 3. తలవాకిటికిని నడిమివాకిటికిని నడిమిచోటు: చూ, హజారము.

నడవడి, దే. వి. రూ-నడువడి-నడవడిక. 1. ప్రవర్తనము: చూ, వర్తనము. 1; 2. చరిత్రము; చూ, సమాచారము. 2; 3. నడవడిక: చూ, వృత్తి. 1.

నడవడిక, —పై.—

నడి, దే. వి. 1. నడుమునకు వృత్తియందు( గలుగు నడిమి అను రూపమునందు మీ(దివర్ణము లోపింప(గా మిగిలినది; 2. మధ్యము. (రూ-నడిమి-నడు-నడుము): చూ, మండలము. 1; వా. 3. తాటికమ్మనుండి తీసినతడప. (బ. నళ్లు.) "చేటకు నళ్లు కట్టిరి."

నడికట్టు, దే. వి. (నడిమి + కట్టు) 1. కాసెకోక: చూ, వస్త్రము; వా. 2. దట్టి: చూ, వస్త్రము.

నడికట్టుత్రాడు, దే. వి. ఏను(గు నడుమున( గట్టెడు త్రాడు, కక్ష్య. కళా. 8, ఆ. 85: చూ, సూత్రము. 1.

నడికిరేయి, ద్వ. వి. (నడిమికి + రేయి) అర్ధరాత్రము. భార. భీష్మ. 3, ఆ. 182: చూ, రాత్రి.

నడికొప్పు, వా. వి. మొగుడు; చూ, సదనము. 1.

నడితి, దే. వి: చూ, నడవడి. 1.

నడినెత్తి, వా. వి: చూ, మాడపట్టు.
నడిపివాఁడు, వా. వి. 1. నడిమివయస్సువాఁడు; 2. ముగ్గురు అయిదుగురు లోనగు (జేసి, సోదరులలో నడిమివాఁడు.
నడిమి, దే. వి: చూ, నడి. 2.
నడిమిచోటు, వా. వి: చూ, నడి. 2.
నడిమిదిన్నె, వా. వి. ద్వీపము: చూ, లంక. 1.
నడిమివ్రేలు, దే. వి. రూ-నడివ్రేలు-నిడివ్రేలు. మధ్యమ: చూ, వేలు. 2.
నడివ్రేలు, (నడిమి + వ్రేలు)—పై.—
నడిరేయి, ద్వ. వి. (రూ-నడికిరేయి- నడురే): చూ, రాత్రి.
నడివేటు, వా. వి: చూ, అద్ద. 3.
నడు, దే. వి. 1. వృత్తియందు నడుము శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము; 2: చూ, రూ-నడి. 2.
నడుఁకు, దే. వి. కంపము: చూ, లోలము; అ. క్రి. 2. కంపించు. నిర్వ. 2, ఆ 5. చూ, వణఁకు. 2.
నడుకొన, వా. వి. మధ్యభాగము; చూ, మధ్యము. 1.
నడుకొను, దే అ. క్రి. (నడుఁకు + కొను) కంపించు. భార. విరా. 4, ఆ 84: చూ, నడుఁకు. 2.
నడుగలను, వా. వి యుద్ధభూమిమధ్యము.
నడుగుంట, ద్వ. వి (నడుము + గుంట): చూ, మాడపట్టు.
నడుచు, దే. అ. క్రి: చూ, రూ- నడచు.
నడుచుతఱి, వా. వి: చూ, వర్తమానకాలము.
నడుచొచ్చు, దే. అ. క్రి. (నడుము + చొచ్చు) నడుమ ప్రవేశించు: చూ, సోఁకు. 4.
నడుదింపు, దే. వి మాంసవిశేషము: చూ, మాంసము.
నడుదీవె, దే. వి. ద్వీపము: చూ, నడిమిదిన్నె.
నడునడు, దే. వి. నడుఁకుటయందగు ననుకరణము. చూ, హుహూహూ.
నడుపు, దే వి. 1. అరుగుట: చూ; ప్రయాణము; 2. ప్రవర్తనము: చూ, వర్తనము. 1; ప్రే. 3. క్రియలు; చూ, వర్తించు.
నడుప్రాయపుది, వా. వి. ప్రౌఢ: చూ, స్త్రీ.
నడుమ, దే. ద్ర. ఎడ: చూ, వ్యత్యయము. 1. ౨.
నడుమంతరము, మి. వి. (నడుము + అంతరము) రూ-నడుమంత్రము. 1. కవును: చూ, మధ్యము. 1; 2. మధ్యకాలము. అని. 3, ఆ. 100: చూ, సందు; విణ. 3. మధ్యకాలమునఁ గలిగినది.
నడుమంత్రపుకల్మి, జా. (నడుమంత్రపుసిరి) మధ్యకాలములో వచ్చిన యైశ్వర్యము. "క్షితినిటుగాదె యొక్కొకరికిన్ నడుమంత్రపుకల్మి గల్గినన్". (విజయవిలాసము.)
నడుమంత్రము, మి. వి: చూ, రూ- నడుమంతరము. (మధ్యకాలమునకు.— ఉ, రా, 2, ఆ. 9.)
నడుము, దే. వి. రూ-నడ్మ. 1. కవును. భార. కర్ణ. 1, ఆ. 202: చూ, మధ్యము. 1; పా. 2. దీనికి ఉపమానములు.— ఆకసము, సింహము, పిడికిలి. పేదతనము; ఏమియు లేకుండుట.

నడుముకట్టుకొను, దే. అ. క్రి: చూ, సిద్ధపడు.
నడురివలి, వా. అవ్య మధ్యమధ్యను.
నడురాతిరి, వా. వి: చూ, నడికిరేయి.
నడురా, ద్వ. వి — పై.—
నడురేయి, —పై.—
నడువడి, దే. వి: చూ, రూ-నడవడి.
నడువీధి, వా.వి. ఘంటాపథము, రెట్టతెన్ను: చూ, మార్గము. 1
నడ్డి, దే. వి. 1. వెన్నెముకయొక్క మధ్యభాగము; వీపునకు మధ్యభాగము, విణ. 2. చప్పట.
నడ్డిగుంట, ద్వ వి పిఱుందిమీఁదిగుంత, కకుందరము: చూ, పిఱు.
నడ్డిపూస, దే. వి. నడ్డియొక్కకీలు.
నడ్డిముక్కుగలాఁడు, దే. విణ; చూ, నడ్డిముక్కువాఁడు.
నడ్డిముక్కువాఁడు, దే. విణ; చప్పటముక్కువాఁడు; చూ, విగ్రుఁడు.
నడ్తి, దే. వి: చూ, రూ-నడితి.
నడ్మ, దే. వి: చూ, రూ-నడుము. (నడుకొనకు.— ఉ, హరి. 5, ఆ. 159.)
నడ్య, సం. వి. ఆ స్త్రీ. కిక్కిసపామి; చూ, తృణము. 1.
నడ్వంతము, సం. విణ. కిక్కిస కసవుగల దేశము: చూ, దేశము.
నడ్వలము, —పై.—
నతనాసిక, సం. వి. ఆ. స్త్రీ. చప్పటముక్కు: చూ, ముక్కు.
నతనాసికుఁడు, సం. విణ. చూ, నడ్డిముక్కువాఁడు.
నతము, సం. విణ. 1. వంగినది: చూ, వక్రిమము; 2. వంకరైనది: చూ, వేల్లితము. 2; 3. లోఁతైనది; స్వా. 2, ఆ. 25: చూ, లోఁతు; అం. 4: చూ, పార్శ్వక్రియలు; 5: చూ, నాసిక్రియలు; 6: చూ, జంఘాక్రియలు.
నతి, సం. వి. ఇ. స్త్రీ. 1. నమస్కారము: చూ, హణిగలు; అం. 2. నాయకుఁడు నాయికయొక్క కోపమును పోఁగొట్టునపుడు ఉపయోగించెడు ఉపాయములు 6 లో నొకటి: చూ, ఉపాయములు. 3.
నతిజోళిక్ల, వా. వి. నతివిశేషము: చూ, హణిగలు.
నత్త, దే. వి. గుల్లయందుండు పురుగు: చూ, పురుగు.
నత్తగుల్ల, ద్వ. వి. క్షుద్రశంఖము: చూ, సంకు. 1.
నత్తడి, దే. వి. రూ-అత్తడి: చూ, హయము.
నత్తి, దే. వి. తడఁబడుచు మాటాడెడు రోగము: చూ, రోగము. 1.
నత్తివాఁడు, దే. విణ: చూ, లోహలుఁడు.
నత్తు, దే. వి. 1. ముక్కుపోఁగు: చూ, భూషణము. 2; అ. క్రి. 2. తడఁబడుచు మాటాడు.
నదము, సం. వి. అ. పుం. 1. పడమరగాఁబాఱెడి యేఱు: చూ, నది; 2. పీటిమడువు: చూ, సరస్సు. 1; 3; చూ, సముద్రము; 4. రూ-నాదము. = నాదు. శ్రోత్ర: చూ, స్వరము. 2.
నదరు, వా. వి. 1. ఎదురు; 2. కానుక.

**నది**, సం. వి. ఈ. స్త్రీ. (ప్రోయునది) ఏఱు: అధ్వగ. అపగ-ఆపగ, అబ్ధి, అబ్ధివధువు, అవి, అవిషి, ఆకాశగంగ, ఉగ్రశేఖర, ఋ, ఋషికుల్య, కపింజల, కపిలధార, క్రమ, కర్షువు, కల్యాణగోత్ర, కల్లోలిని, కిరాతి, కుమారసువు, కూలంకష, కూలవతి, ఖజలము, ఖాపగ, గంగ-గంగక-గంగాక-గంగిక, గాందిని, గాధిని, గౌరి, చాంపిల, జహ్నుతనయ, జాహ్నవి, జ్యాని, ఝలవతి, తటిని, తరంగిణి, తరణి, తలోద, త్రిపథగ, త్రివేణి, త్రిస్రోత, దివ్యోదకము, దేవగంగ, ద్వీపవతి, ధర్మద్రవి, ధుని, నర్మద, నలిని, నిమ్నగ, నిర్ఝరిణి, భద్రము, భాగీరథి, భీష్మసువు, మందాకిని, రోధోవక్ర, లోకజనని, లోకమాత. వహ, వియద్గంగ, విష్ణుపది, శైవలిని, సరిత్తు, సాగరగామిని, సింధువు, సిద్ధసింధువు, సురదీర్ఘిక, స్రవంతి, స్రోతస్విని-స్రోతస్సు, సువర్ణముఖి స్వర్ణది, హైమవతి - హ్రాదిని - హ్రాదిని. (తె. ప.) — అంచలవిడిది, అచ్చరవాఁక, అడుగుపుట్టువు, ఏఱు, ఏల, కడలివెలఁది, కరకంఠుతలయేఱు, కూఁతుబిడ్డ, చదలేఱు, జక్కు, జడదారి, చెవిబుగ్గ, జాఁంచల విడిది, జాలు-జాలువు, తలయేఱు, తాతపనఁటి వెల్లి, తెగిన యఱువదివేవుర ముగితిత్రోవ, తెలియేఱు, తెలివాఁక, నేమంబుఁగన్న మన్నినితల్లి, పులుచూలి సవతితల్లి, పెరుమాళ్ళడుగుబుగ్గ, బొందామరల పంట, బంగారు తామరపంటచేను, మిన్నుకొలఁకు, మిన్నువాఁక - మిన్వాఁక, మిన్నేఱు, ముత్తెరువులాఁడి, ముత్రోవద్రిమ్మరి, ముయ్యేఱు, మెట్టుచాలు, తెప్పవేయఁ మెప్పుకేళాకూళి, విను వాఁక-విన్వాఁక, వంత-వ్రంత, వరఁత-వఱఁత-వఱఁతి, వరద, వాఁక, వెన్నునడుగుపావ, వెల్లివాఁక, వేలుపుటేఱు - వేల్పుటేఱు, సతతపనులకెంకి; తద్విశేషములు. — (౧) పంచ గంగలు — ౧ కావేరి, కనకాపగ, కవేరికన్య - కవేరిజ, అర్ధగంగ, అర్ధజాహ్నవి; ౨. కృష్ణ.— కృష్ణవేణి - కృష్ణవేణ్ణ-కృష్ణావేణి; ౩. అఖండగౌతమి-గౌతమి; ౪. తుంగభద్ర; ౫. భాగీరథి; (౨) ద్వీపములలోని మహానదులు. — (ఇవి శీర్షికాపదములు కావు). ౧. జంబూద్వీపము — అనుతప్తశిఖి, విపాశ, త్రిదివ, క్రముపు, అమృత, సుకృత (7); ౨. శాల్మలి. — శ్రోణి, తోయ, వితృష్ణ, చక్ర, శుక్ర, విమోచని, నివృత్తి (7); ౩ కుశ. — ధూతపాప, శివ, పవిత్ర, సమ్మతి, విద్యుత్తు, మహి, చాన్య. (7); ౪. క్రౌంచ.- గౌరి, కుముద్వతి, సంధ్య, రాత్రి, మనోజవ, ఖ్యాతి, పుండరీక (7); ౫. శాక. — సుకుమారి, కుమారి, నలిని, రేణుక, ఇక్షువు, దేనుక, గభస్తి (7); ౬. ప్లక్ష; ౭. పుష్కరద్వీపములో మహానదులు లేవు; (౩) నదులు: — అంతఃప్రవాహ, అంతర్వాహిని; అగోద, కరతోయ; అర్జుని-ఆర్జుని; ఆసిక్ని; ఆకాశగంగ; మందాకిని; ఉత్తరపినాకిని; ఉదుంబరావతి; ఋషికుల్య; ఇరావతి-ఐరావతి; కనక; కపిశ; కల్మాషి; కస్తూరి; కాదరి; కాలరాత్రి, భీమరథి: కిరాత, గండోలి, భద్ర, మంధాకిని, కుటిల; కుమార-కుమారి; కుముద వతి-కుముద్వతి; కుహావు; కృతమాల; కౌశికి; గండకి; గండోలి; గుండిక; గోదావరి, గోదా, గోల; తపనాత్మజ, తపని; గోమతి, వాసిష్ఠి; ఘట్టగ; ఘర్ఘరిక-ఘర్ఫరిక; చండిల; చందల; చంద్రభాగ-చంద్రభాగి; చతుష్పాటి; చర్చ; చర్మణ్వతి; చాంపిల; చిత్రరథ, చిత్రసేన, జంబాలిని; జంబువు. (తె). — జంబు-జంబేఱు-జమ్మెఱు-జమ్మేఱు, నేరటేఱు: తటిని; తపతి; తరంగిణి; తామ్రపర్ణి, తీర్థము; త్రిదివ; త్రియామ; దక్షిణ పినాకిని; దావికము, దేవిక; ద్వీపవతి; ధుని; నదము; నర్మద, మేఖలకన్యక, రేవ, సోమోద్భవ; పాతాళగంగ; భోగవతి: పాలారు; బాహుద, సైతవాహిని; బ్రహ్మపుత్ర-బ్రహ్మపుత్రము; మహానది; మాలిక, అంశుమతి, యమున, కలిందకన్య, కలిందజ, కాలానుజ, కాలింది-కాళింద, కృష్ణ, తపనతనయ, తపనాత్మజ, తాలాంక, శమనస్వస, సూర్యతనయ, (తె ప)— జమున; విపాట్-విపాశా; వేత్రవతి; శక్వరి, శతద్రువు శితద్రువు; శరావతి; శైవలిని; శోణము; సంధ్య; సరస్వతి; సింధు-సింధువు; సువర్ణముఖి, స్వర్ణది; హేల. (తె) — ఏల; హిరణ్యవాహము; హ్రాదిని-హ్రాదిని. (మిగిలియున్నవానికొఱకు "హ్రాదిని" చూడుము.); (౪) గోదావరినదిలో పుట్టిన సప్తగోదావరులు. — గౌతమి, వశిష్ఠ, కౌశిక, ఆత్రేయ (యి), తుల్య, భారద్వాజము, వైనతేయము; (౫) పీరక్షద్ర పాదమందలి నది. (తె). — కల్లేరు; (౬) నీళ్లులేని నది. (తె.) — గొడ్డేఱు; (౭) ఆమడకు మీఁద పాఱెడు ఏఱు. — నది; (౮) నదీమధ్యము. (తె). — నట్టేరు; (౯) సెలయేరు —(ఉత్సము, ప్రస్రవణము = సెలయూట) ఝరము-ఝలము-ఝూరము-ఝరి-ఝూరి, నిర్ఝరము. (తె). — కొండకాలువ, జక్కర, వాఁక, వాఁగు, వ్రంత, సెల, సెలయేఱు; (౧౦) చిన్నయేఱు. (తె). — జొల్ల; (౧౧) స్వామిపుష్కరిణి. (తె). — కొమరేఱు; చిన్న నీటికాలువ. — కర్షువు, కాలసారము, కుల్య. (తె). — అప్పసము, అవుజు-ఔజు, అవుదు-ఔదు-ఓడిక, ఔదరి, కాలవ-కాలువ-కాల్వ, కయ్య-క్రయ్య, చింక, బత్తె, వంక, వరవ; (౧౨) తూముకాలువ. — కుల్యము: (చూ, వాహనము. 2.); (మిగిలిన విశేషాదులకు "హ్రాదిని" చూడుము): (చూ, సముద్రము: చూ, సలిలము: చూ, సెలయూట, సెలయేఱు.)

**నదీనము**, సం. వి. అ పుం. మున్నీరు: చూ, సముద్రము.

**నదీప్రఘోషము**, అం. ఒకానొకవృత్తము. ఇది ప్రగ్విణీవృత్తచ్ఛాయను మొదటిచరణమున్ను, వంశస్థ వృత్తచ్ఛాయను రెండవచరణమున్ను, భుజంగప్రయాతచ్ఛాయను మూఁడవ చరణమున్ను, ఇంద్రవంశచ్ఛాయను నాలుగవచరణమున్ను నడచును: చూ, వృత్తము. 1.

**నదీమాతృకము**, సం. వి. అ. పుం. ఏటినీళ్ళచేతపండెడు పైరుగల దేశము: చూ, దేశము.

**నదీసముద్రన్యాయము**, పా. అన్ని నదులకు సముద్రుఁడే గతి యనురీతి.

**నదీసర్జము**, సం. వి. అ. పుం. ఏఱుమద్ది*: చూ, మద్ది.

**నదురు**, వా. వి. జేయము. శూ. రూ-అదురు (పునరుక్తి).

**నద్ధము**, సం. విశే 1. కట్టఁబడినది: చూ, సితము. 4; 2. పైకెత్తఁబడినది, నిక్కినది (అవి క్రొందులు): ఉన్నమితము,

నధ్రి, సం. వి. ఈ. స్త్రీ బంగువారు; చూ, వరత్ర.
నన, దే. వి. 1. చిగురు: చూ, విద్రుమము; 2. కోరకము; చూ, మొగ్గ. 1; 3. పువ్వు: చూ, సుమము.
ననంద, సం. వి. ఋ. స్త్రీ. (రూ-ననాంద-నానంద-నానాంద-ననందిని) పెనిమిటితోడఁబుట్టిన ఆఁడుది, ఆఁడుబిడ్డ: చూ, వదినె.
ననఁబోఁడి, దే. వి. (నన+బోఁడి) 1. ఆఁడుది: చూ, స్త్రీ; 2. పువ్వువలె మనోజ్ఞురాలగు ఆఁడుది: చూ, స్త్రీ.
ననకారు, ద్వ. వి. చైత్ర వైశాఖమాసములు, వసంతఋతువు: చూ, మాసద్వయము.
నననీరు, ద్వ. వి. పూఁదేనె: చూ, మకరందము.
ననయు, దే. అ. క్రి. 1. పుష్పించు: చూ, వికసించు; 2: చూ, పల్లవించు.
ననవిలుకాఁడు, దే. వి. పుష్పధన్వుఁడు: చూ, మన్మధుఁడు (ఇట్లు ననవింటివాఁడు.)
ననవిలుకానన్న, దే. వి. నలువ: చూ, బ్రహ్మ. 1.
ననవిలుతుఁడు, దే. వి: చూ, ననవిలుకాఁడు.
ననుఁబాయి, వా. వి. రూ-నన్బ్రాయి-ననుఁబ్రాయి చక్కఁగా ఉడుకని బియ్యము, నలుపుబియ్యము: చూ, బియ్యము.
ననుఁబ్రాయి, దే. వి —పై.—
ననుఁబ్రాయివడు, ద్వ. అ. క్రి. ననుఁబ్రాయియగు. జై. 8, ఆ. 198.
ననుచు, దే. అ. క్రి. 1. పూఁచు: చూ, రూ-ననయు. 1; 2. మొగ్గయెత్తు; 3: చూ, పల్లవించు; 4. అనురాగమొందు; 5: చూ, ముష్మరించు; 6: చూ, సొగియు; ప్రే. 7. ననిపించు.
ననుపు, దే. వి. 1. అనురాగము: చూ, స్నేహము. 1; 2. అతిశయము. నై. 7, ఆ. 161: చూ, హెచ్చు. 2; 3. ఇంపు: చూ, సౌందర్యము; వా. 4 పెంపు.
ననుపుకత్తె, ద్వ. విణ. 1. ప్రియురాలు: చూ, స్త్రీ; 2. చూ, అంకులాఁడి.
ననుపుకాఁడు, దే. విణ. 1. ప్రియుఁడు: చూ, స్నేహితుఁడు. 1; 2: చూ, విటుఁడు. స్వా. 2, ఆ. 73.
ననుపువడు, ద్వ. అ. క్రి: చూ, పొత్తుసేయు.
నన్న, దే. విణ. కుఱుచ: చూ, హ్రస్వము.
నన్నూఱు, దే. స. (నాలుగు+నూఱు) (400) చతుశ్శతము. కాశీ. 5, ఆ. 192.
నన్పుకాఁడు, దే. విణ: చూ, రూ-ననుపుకాఁడు.
నన్బ్రాయి, దే. వి: చూ, రూ-ననుఁబాయి.
నపాపేప్రతిపాపీస్యాత్, లో. ఇతరుఁడు తనయెడ దుష్టుఁడైనం తనె దాను నతనియెడ దుష్టుఁడు గాగూడదు.
నపీరు, వా. వి. ఊఁదు వాద్యవిశేషము: చూ. స్వరము. 2.
నప్పు, వా. వి. అబ్బి: చూ, శిశువు.
నపుంసకత్వము, సం. విణ. (ఊబ.): చూ, షండత్వము.
నపుంసకలింగము, అం: చూ, లింగములు.
నపుంసకుఁడు, సం. వి. అ. న: చూ, షండుఁడు.

నప్త, సం. వి. ఋ. స్త్రీ. 1. రూ-నప్త్రి. (కొడుకు కూఁతురు, కూఁతుకూఁతురు): చూ, మనుమరాలు; పుం. 2. పౌత్రుఁడు (కొడుకు కొడుకు): చూ, మనుమఁడు. (దౌహిత్రుఁడు = కూఁతురుకొడుకు); 3. ప్రపౌత్రుఁడు: చూ, మునుమనుమఁడు.
నప్త్రి, సం. వి. ఈ. స్త్రీ: చూ, నప్త. 1.
నప్పు, వా. స. క్రి. పచ్చీసులోనగు ఆటలలోని కాయలు నడిపించు
నబ్రూయాత్సత్యమప్రియం, లో. సత్యమైనను అప్రియవాక్యము వచింపరాదు.
నఫా, వా. వి. లాభము (నఫా అనియు)
నభప్రాణుఁడు, సం. వి. అ. పుం. గాలి: చూ, వాయువు. 1.
నభము, సం. వి. స్. న. 1. రూ-నభసము-నభస్సు, ఆకాశము: చూ, వ్యోమము. 1; 2: చూ, స్వర్గము; పుం. 3. శ్రావణమాసము: చూ, మాసము. 1; 4. మబ్బు: చూ, మేఘము. 1; 5. వర్షాకాలము (శ్రావణ భాద్రపదములు): చూ, మాసద్వయము; 6. బిసతంతువు: చూ, పద్మము. 1; 7. తమ్మపడికము: చూ, పాత్రము. 6; 8: చూ, ముక్కు.
నభసంగమము, సం. వి. అ. పుం. చూ, పక్షి.
నభస్యము, సం. వి. అ. పుం. భాద్రపదమాసము: చూ,మాసము.
నభస్వంతుఁడు, సం. వి. అ. పుం: చూ, నభప్రాణుఁడు.
నభూతో నభవిష్యతి, న్యా. (స్పష్టము.)
నభోగజము, సం. వి. అ. పుం: చూ, నభము. 4.
నమకము, పా. ప్రతిమంత్రమునకును ఆద్యంతములయందు నమశ్శబ్దమున్నందున నమక మనఁబడుచున్నది. "నమస్తే రుద్రమన్యవ ఉతోత ఇషవేనమః" ఇత్యాది; (చమకము—హెచ్చుగ చకార మకారములతోఁగూడిన ప్రార్థనమంత్రములు గలది కావున చమకము. 'వాజశ్చమే ప్రసవశ్చమే.' ఇత్యాది) (రెండును రుద్రాభిషేకమం దుపయోగింతురు గనుక చమకముగూడ నిచట తెలుపఁబడియె.)
నమనము, సం. వి. అ. న. వంగుట: చూ, భుగ్నము. 1.
నమలి, వా. వి. కేకి: చూ, మయూరము.
నమలు, దే. స. క్రి. రూ-నములు. తిను: చూ, సాపడు.
నమలుట, వా. వి. చర్వణము.
నమశ్శివాయ, పా. పంచాక్షరి: చూ, మంత్రము. 1.
నమసితుఁడు, సం. విణ. రూ-నమస్యితుఁడు. నమస్కరింపఁబడినవాఁడు: చూ, పూజితుఁడు.
నమస్కరించు, సం. స. క్రి: చూ, మ్రొక్కు.
నమస్కారము, సం. వి. అ. పుం. 1. చేమోడ్పుట; చూ, హొణిగలు; అం. 2: చూ, ఉపచారములు; 3: చూ, ఉపచారములు.
నమస్కారి, సం. వి. ఈ. స్త్రీ: చూ, సోఁకుడుముడుఁగుఫ్ఘ.
నమస్కృతి, సం. వి. ఇ. స్త్రీ: చూ, నమస్కారము. 1.
నమస్య, సం. వి. ఆ. స్త్రీ. పూజ: చూ, సపర్య.
నమస్యితుఁడు, సం. విణ: చూ, రూ-నమసితుఁడు.
నమస్సు, సం. వి. స్. న: చూ, నమస్కారము. 1.
నమాజు, వా. వి: చూ, నిమాజు.

న మాతే శపతే పుత్త్రమ్, న్యా. తల్లి పుత్త్రునిఁజావుమని శపింపదు.
నమించు, సం. స. క్రి: చూ, మ్రొక్కు. శశాం. 1, ఆ. 18.
నమితము, సం. విణ. 1. వంగినది: చూ, వక్రిమము; అం. 2: చూ, చుంబనములు.
నమిలి, దే. వి: చూ, రూ-నమలి.
నముగాములు, వా. వి: చూ, మేలుకీళ్ళు.
నముచిసూదనుఁడు, సం. వి. అ. పుం. ఇంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు.
నములు, దే. అ క్రి: చూ, రూ-నమలు.
నముహ్యేదర్థకృచ్ఛ్రేషు నచ ధర్మం పరిత్యజేత్, న్యా. మాన వులను రత్నము వెదుకదు. మానవులే దానిని వెదుకుదురు.
నమూదు, వా. వి: చూ, రూ-నమోజు-నమోదు.
నమూనా, మాదిరి. రూ-నమోనా.
నమేరువు, సం. వి. ఉ. పుం: చూ, సురపొన్న *: (దీనికి దోహదము హనితము).
నమోజు, వా. వి. పేరుచేర్పుట.
నమోదు, -పై-
నమోనా, వా. వి: చూ, రూ-నమూనా.
నమ్మకము, దే. వి: చూ, విశ్వాసము.
నమ్మదుంప, దే. వి: చూ, సుపుష్పము.
నమ్మలు, వా. వి, బ. వీఁపుమీఁదఁజేయు నఖక్షతములు: చూ, నఖక్షతములు.
నమ్మి, దే. వి. 1: చూ, నమ్మదుంప*: 2. రూ-నెమ్మి: చూ, నమలి.
నమ్మిక, దే. వి: చూ, రూ-నమ్మకము.
నమ్మిగ, -పై-భార. ఉద్యో. 1, ఆ. 315.
నమ్మినవాఁడు, వా. వి. ఆప్తుఁడు: చూ, స్నేహితుఁడు. 1.
నమ్ము, దే. స. క్రి: చూ, విశ్వసించు.
నమ్మువాఁడు, వా. వి: చూ, నమ్మినవాఁడు.
నమ్రమగు, మి. అ. క్రి: చూ, వంగు.
నమ్రము, సం. విణ: చూ, నమితము. 1.
నయ, దే. వి: చూ, సౌందర్యము.
నయగారము, దే. వి (నయము + కారము) 1. మృదుత్వము. స్వా. 1, ఆ. 135: చూ, సుకుమారము; 2. మృదువచనము: చూ, శబ్దము. 2; 3. కపటము: చూ, వ్యాజము. 1; 4. అను కూలము: చూ, స్నేహము. 1.
నయగారి, దే. విణ. (నయగారము + ఇ) 1. మృదుత్వము గలవాఁడు; 2. మృదువచనము గలవాఁడు.
నయనము, సం. వి. అ. న. 1. కన్ను: చూ, లోచనము; 2: చూ, పొందింపు.
నయపుపారువు, అం: చూ, ఉపజీవికములు.
నయము, సం. వి. అ. పుం. 1. నీతి: చూ, సత్యము. 1; 2: చూ, నయనము. 2; 3. జూదమునందలి భేదము: చూ, వ్యవహారము. 4; దే. వి. (1): చూ, లాభము; (2) నున్నపు. భార. ఉద్యో. 2, ఆ. 110: చూ, స్నిగ్ధము. 2; (3) మృదు త్వము. విర్వ. 8, ఆ. 36: చూ, నయగారము. 1; (4): చూ, సౌందర్యము; విణ. (5) వెలతక్కువ: చూ, వెల. 1; (6) నునుపైనది: చూ, స్నిగ్ధము. 2; (7) మేలైనది: చూ, శ్రైష్ఠ్యము; (8) మృదువైనది: చూ, సాంద్రము. 3; (9) అందమైనది: చూ, సౌందర్యము; వా. (10) వ్యాధి తగ్గు చున్నదనెడు సూచన. "వాని జ్వరము నిన్నటికంటె నయము": (11) సమస్త శాస్త్రములలోను పాండిత్యమును కొద్దికొద్దిగా యొకనికిమించి యొకఁడు సంపాదించినాఁడనెడు సూచన. (ప్రతివిషయమునందును "నయము" అను శబ్దము ఉపయోగింపఁబడును.) "వానికంటె వీఁడు చదువు సంధ్య లలో నయము."
నయించు, సం. స. క్రి. పొందించు: చూ, ప్రాపించు.
నర, దే. వి. 1. (రూ-నరపు-నరుపు-నెరపు): చూ, పలితము. 1; 2. ముదిమిచే తెల్లఁబాటిన వెంట్రుక: చూ, వెంట్రుక. 1.
నరకఁడు, వై. విణ. = నరకగ-నారంగ. దుష్టుఁడు: చూ, వ్యాధుఁడు. 2.
నరకజిత్తు, సం. వి. త్. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.
నరకము, సం. వి. అ. పుం. రూ-నారకము. (పాపిష్ఠులను తన సమీపమును పొందించునది) కుజము, దుర్గతి, నిరయము: చూ, నరకములు.
నరకములు, అం. తామిస్రము, లోహశంకువు, మహానిరయము, శల్మలి-శాల్మలి, రౌరవము, కుంభలము, పూతిమృత్తికము, కాలసూత్రము, సంఘాతము, లోహితోదము, సవిషము, సంప్రపాతనము, మహానరకము, కాకోలము, సంజీవనము, మహాపథము, అవీచి, అంధతామిస్రము, కుంభీపాకము, అసి పత్రము-అసిపత్రవనము, తపనము-తాపనము-(21)-ఇవిగాక మఱికొన్ని నరకములు-అంధకూపము, అంధతామిస్రము మొ. అంబరీషము, ఋజీషము, కిరాశము, కల్మషము, కుట్మలము, కేనారము, ఘనవాతము, ఘనోదధి, తప్తకుంభము, తప్త పాషాణకుండము, తప్తవాలుకము, తప్తశూర్మికుండము, తప్తసురాకుండము, తమసము, దుర్గతి, పరితాపము, మహా రౌరవము, సంహారము. (మిగతవానికి "సంహారము 2" చూడుము.)
నరకములు, వానిని అనుభవించువారు, పా. ౧. రౌరవము (కూట సాక్షి, పక్షపాతి, అసత్యవాది, భ్రూణహంత, గురుహంత, గోఘ్నుఁడు, ఉచ్ఛ్వాసనిరోధకుఁడును); ౨. శూకరము (సురా పానము, బ్రహ్మహత్య, బంగారుదొంగిలుట మొ. చేయువా రును); ౩. తప్తలోహము (క్షత్త్రియులను, వైశ్యులను, రాజభటు లను వధించువాఁడును, సోదరితోసంగమించువాఁడును, గురు తల్పగుఁడును); ౪. మహాజ్వాలము (కోడలినిగాని, కుమార్తెను గాని కూడువాఁడు); ౫. శబలము (పరదూషకుఁడు, గురు నవమానించువాఁడు, వేదమును దూషించువాఁడు, వేదవిక్ర యుఁడు, పొందరాని స్త్రీనిఁ బొందువాఁడు); ౬. విమో హము (మర్యాదహీనుఁడు, చోరుఁడు); ౭. కృమి భక్ష్యము (దేవ, బ్రాహ్మణ, పితరులను ద్వేషించువాఁడు); ౮. కృమీశము (దుష్టులనాశించి యాగాదులు చేయువాఁడు); ౯. లాలాభక్ష్యము (పితృదేవతలను, దేవతలను, అతిథులను సత్కరింపక భుజించెడివాఁడు); ౧౦. విశసనము. (శరకర్త, వేధకుఁడు, రంధ్రాన్వేషకుఁడు, ఖడ్గాది యుద్ధ సాధనము

చేయువాఁడు); ౧౧. అధోముఖము. (పట్టరాని దానమును పట్టువాఁడు, అనర్హులచే యాగములు చేయించువాఁడు, తెలియకయే జ్యోతిశాస్త్రము నెఱిఁగినట్లు నటించువాఁడు); ౧౨. కృమిపూయము. (ఒంటరిగా తినువాఁడు, లక్క-పాదరసము-మాంసము-ఉప్పు-నువ్వులు అమ్మెడు బ్రాహ్మణుఁడు); ౧౩. రుధిరాంధము. (నాటకమువలన జీవించువాఁడు, చేఁపలఁ బట్టువాఁడు, కుండలయం దన్నము తినువాఁడు, విషముపెట్టువాఁడు, కుట్టుపనివాఁడు, తనభార్య వ్యభిచారమువలన జీవించువాఁడు, పర్వములయందు స్త్రీలతో సంగమించువాఁడు, ఇండ్లకు నిప్పుపెట్టువాఁడు, మిత్రఘ్నుఁడు, శకునములు చెప్పువాఁడు, గ్రామపురోహితుఁడు); ౧౪. వైతరణి. (కల్లమ్మువాఁడు, గ్రామములను నాశనము చేయువాఁడు, తేనెపట్టులను దీయువాఁడు); ౧౫. కృమిభక్షము (రేతఃపానము చేయువాఁడు, మర్యాదను భేదించి వర్తించువాఁడు, శౌచ్యములేనివాఁడు, మోసముచే జీవించువాఁడు); ౧౬. అసిపత్రవనము. (అనవసరముగాఁ జెట్లను నఱకువాఁడు); ౧౭. వహ్నిజ్వాలము (గొఱ్ఱెలమందను బెంచెడువాఁడు, వేఁటకాఁడు); ౧౮. సందంశము. (వ్రతలోపము చేయువాఁడు, స్వాశ్రమభ్రష్టుఁడు); ౧౯. శ్వభోజనము (పగటివేళను, స్వప్నముల యందును రేతస్ఖలనముగావించు బ్రహ్మచారియు, పుత్త్రిచేఁ జదివింపఁబడు తండ్రులును); (మిగతవివరములకు "సంహారము. 2." చూడుము.)

నరకాంతకుఁడు, సం. వి. అ. పుం. కృష్ణుఁడు: చూ, విష్ణువు.1.

నరకాసురుఁడు, సం. వి. అ. పుం: చూ, మహితుఁడు.

నరకుఁడు, సం. వి. అ. పుం. ఒక యసురుఁడు; చూ, రాక్షసుఁడు. 1.

నగర, దే. వి. మడ్డువు, గిడిగి; చూ, వీణె.

నరగజము, —పై.—

నరగతి, అం: చూ, గతులు.

నరపాలుఁడు, సం. వి. అ. పుం. ఱేఁడు: చూ, రాజు. 1.

నరపు, దే. వి: చూ, నర. 1.

నరభూమి, అం: చూ, ఇలావృతము.

నరము, సం. వి. అ న. 1: చూ, రామకర్పూరము; దే. వి. (1) నాడి: చూ, సిర, 1.

నరయు, దే. అ. క్రి. ముదిమిచే వెండ్రుకలు తెలుపగు: రూ-నరియు, ఉరియు.

నరవ, దే. వి. అరవ: చూ, మార్గము. 1.

నరవాహనుఁడు, సం. వి. అ.పుం. కుబేరుఁడు:చూ, శ్రీదుఁడు.

నరసింగఁడు, వై. వి. = నరసింహ. కళా. 1, ఆ. 2: చూ, సింగఁడు. 1.

నరసింగము, 1. = —పై.—; 2: చూ, నృసింహము, నారసింహము.

నరసింహము, సం. వి. అ. పుం. = నరసింగము. —పై.—

నరాజి, దే. వి. (రూ-నరాజీ-నారాజి-నారాజీ) కత్తి: చూ, రిష్టి. 2.

నరాజీ, దే. వి: చూ, రూ-నరాజి.

నరాయణుఁడు, సం. వి. అ. పుం: చూ, రూ-నారాయణుఁడు.

నరిగి, దే. వి. ఒకరకము గొడ్డెంగు.

నరిడి, దే. వి. గుండెయుబ్బరపు పశురోగము: చూ, పశురోగము.

నరియఁడు, దే. వి. నక్క. ఉ. రా. 6, ఆ. 235: చూ, సృగాలము.

నరియు, దే. అ. క్రి: చూ, రూ-నరయు.

నరుఁడు, సం. వి. అ. పుం. రూ-నారుఁడు. 1: చూ, మనుష్యుఁడు; 2. అర్జునుఁడు: చూ, విజయుఁడు, 1; 3. ఒక ఋషి: చూ, ముని. 1.

నరుకు: చూ, రూ-నఱుకు.

నరుజో, దే. వి. చీమలబాల్పు.

నరుపు, దే. వి: చూ, రూ-నర. 1.

నరులుగననిపెద్దలు, మి. వి. బ: చూ, వేలుపు. సాం. దే. 18.

నరేంద్రుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, రాజు. 1; 2: చూ, వ్యాళగ్రాహి.

నర్కుటము, అం. (కోకిలకాకము) ఒక్కొక్క పాదమున న-బ-భ-జ-జ-వగణములు గలిగి ౧౧వ యింట యతిగలిగి సప్తదశ ఛందస్సునందుఁబుట్టిన వృత్తము: చూ, వృత్తము.1.

నర్కురము, సం. వి. అ. న. మేఁకపోతు: చూ, మేషము. 1.

నర్తకము, సం. వి. అ. న. = నాటకము' చూ' నటనము. 1.

నర్తకి, సం. వి. ఈ. స్త్రీ. 1. ఆటకత్తె; చూ, శైలూషి; 2. ఆఁడేనుఁగు: చూ, హస్తి; 3. గుప్పగుత్తిక *: చూ, రాజాష్టము.

నర్తకుఁడు, సం. వి. అ. పుం. 1. = నట్టువు (ఆటచే జీవించువాఁడు): చూ, శైలూషుఁడు; 2: చూ, వ్యాళగ్రాహి; విణ. 3. ఆడెడువాఁడు: చూ, శైలూషుఁడు.

నర్తనప్రియము, సం. వి. అ. పుం. నెమలి: చూ, మయూరము.

నర్తనము, సం. వి. అ. న: చూ, నటనము. 1.

నర్తనశాల, సం. వి. ఆ. స్త్రీ. ఆటపట్టు: చూ, సదనము. 1.

నర్తించు, సం. అ. క్రి: చూ, మలపుగొను.

నర్తిల్లు, —పై.—

నర్మద, సం. వి. ఆ. స్త్రీ· చూ, నది.

నర్మదుఁడు, సం. వి. అ. పుం. నర్మసచివుఁడు.

నర్మము, సం. వి. న్. న: చూ, పరిహాసము.

నర్మిలి, దే. వి: చూ, వాంఛ. విజ. 3, ఆ. 127.

నర్సిపర బ్రాహ్మణులు, అం. ఘూర్జర బ్రాహ్మణులలో నొకతెగవారు. ఋగ్వేదులు-శుక్లయజుర్వేదసూత్రులు-కృష్ణయజుర్వేదులునై కృష్ణదేవాలయములందు పూజారులై యుందురు. వల్లభాచార్య సంప్రదాయమువారు. ఈ తెగ ఋగ్వేదులు యజుర్వేదులు సామవేదులునునై యున్నారు. రాజపిపల, ధర్మపూరు సంస్థానపు రాజులకు గురువులు: చూ, ఘూర్జర బ్రాహ్మణులు: (చూ, బ్రాహ్మణులు).

నఱకు: చూ, రూ-నఱుకు, (ఖండించుటకు.—భార. ద్రో. 1, ఆ. 174.)

నఱకుడు, దే. వి: చూ, రూ-నఱుకు. జై. 8, ఆ. 119.

నఱకుడువడు, ద్వ. అ. క్రి: చూ, వ్రక్కవాఱు. ఉ, రా. 4,ఆ. 292.

నఱకువాఁడు, వా. వి: చూ, హింసకుఁడు,

నఱవ, దే. విః చూ, రూ-అఱవ. భార. విరా. 1, ఆ. 101.
నఱుకు, దే. వి. 1. దెబ్బ. రూ-నరుకు-నఱకు: చూ, హతి; స. క్రి. 2. ఖండించు, రూ-నరుకు-నఱకు. భాగ. 6, స్కం. 370: చూ, నెలగు.
నఱుకుడు, దే. విః చూ, రూ-నఱుకు. 1.
నఱు(రు)కుడుపరువడి, అం: చూ, విసరులు. (రూ-నఱుకు పరువడి.)
నఱుకుబియ్యము, దే. విః చూ, నసుంత్రాయి.
నఱుకులాడు, దే. స. క్రి. నఱుకుకొను.
నఱుకులు, అం. మల్లశాస్త్రములోనివి - లోవెలి నఱుకు, గుజ్జరి దుముకు, చూరణనఱుకు (3).
నఱుక్కు, దే. వి. దిగులుపడుటయందగు ననుకరణము: చూ, హూహూ.
నఱుజు, దే. వి. అణువు. అచ్చ. కిష్కిం, కాం, 105: చూ, స్వల్పము.
నఱుమాడు, దే. స. క్రిః చూ, పొడిసేయు. భార. భీష్మ. 2, ఆ. 237.
నఱుము, దే. వి. 1: చూ, సురుము; స. క్రి. 2: చూ, నఱుమాడు. భార. ద్రో. 3, ఆ. 210.
నజ్జి, దే. వి. 1. ప్రయాణముచేత పిదుకఁదగినయావు: చూ, ధేనువు; 2. ప్రయాణముచేత బండిలోనగువానికి పూన్పఁదగిన యెద్దు: చూ, వృషభము. 1.
నల, అం. 1: చూ, రూ-నళ; వై. విణ. (1) = నైల్య-నీల: చూ, రూ-నల్ల. 1; (2) (రూ-నలి) నలుసు: చూ, వట్టిగడ్డి. (ఎండుకసవు.)
నలఁక, దే. వి. రూ-నలఁకువ. 1. వ్యాధి: చూ, రోగము. 1; 2: చూ, శ్రమము; 3. బాధ: చూ, శోకము; 4. అత్యంత సూక్ష్మవస్తువు: చూ, రేణువు. 1.
నలఁకువ, —పై.—
నలఁగు, దే. అ. క్రి. 1. నలియగు: చూ, నదమదమగు; 2: చూ, పీడితమగు. ఉ, హరి. 5, ఆ. 190; 3: చూ, నశించు; 4. శ్రమపడు. కళా. 4, ఆ. 99: చూ, వేసరు. 2.
నలఁగుడు, దే. వి. 1: చూ, పీడనము; 2: చూ, శ్రమము.
నలఁగుడుపడు, దే. అ. క్రి: చూ, పీడితమగు.
నలఁగుడువెట్టు, దే. స. క్రి: చూ, పీడించు. ఉ, రా. 5, ఆ. 197.
నలఁచు, దే. ప్రే. నలఁగఁజేయు, రాఘ. 2, ఆ. 99.
నలకూబరుఁడు, సం. వి. అ. పుం. కుబేరునికొడుకు: చూ, పుత్త్రుఁడు. 1.
నలగము, అం. (న+లగ) "గరుడహయా": చూ, ఉపగణములు.
నలదము, సం. వి. అ. న. 1: చూ, వట్టివేరు; 2. పూఁదేనె: చూ, మకరందము.
నలపుట, వా. విః చూ, పీడనము.
నలబై, వా. విః చూ, రూ-నలుబది. (40).
నలము, సం. వి. అ. న. 1: చూ, రూ-నడము; 2: చూ, నలినము. 1; అం. 3. (న+ల) 'నరహరి': చూ, ఉపగణములు.
నలమేనిదొర, ద్వ. వి. కృష్ణుఁడు; చూ, విష్ణువు. 1.
నలలము, అం. (న+లల) "కరివరద.": చూ, ఉపగణములు.
నలి, సం. వి. ఈ. స్త్రీ. 1. గువ్వగుత్తిక*: చూ, రాజార్హము; దే. వి. (1) : చూ, రేణువు. 1; (2): చూ, నలఁక. 1; (3): చూ, సురుము; విణ. (4) నలఁగినది. స్వా. 1, ఆ. 37. నలినలి; విజ. 1,ఆ. 102; (5) సన్నము. లక్ష్మీ. 2, ఆ. 85: చూ, సూక్ష్మము, 4; ద్ర. (6) అత్యంతము: చూ, మఱిమఱి; ద్ర. క్రి. విణ. (7) యోగ్యముగా. భార. అర, 7, ఆ. 393.
నలికండ్లపాము, దే. వి. నలికిఁచు: చూ, సర్పము.
నలికము, దే. వి. సన్నఁదనము.
నలికిరి, దే. వి. (రూ-నలికిలి-నల్లిక-నలికిఁచు): చూ, సర్పము.
నలికిలి, —పై.—
నలికిఁచు, —పై.—
నలిగులి, దే. వి. మిక్కిలి నలఁగినది; గజిబిజి, నజ్జు.
నలిగొట్టు, దే. విణ. సన్నమగునది: చూ, శీర్షము. 2.
నలితిండి, దే. విః చూ, చిరుదిండి.
నలితిండికాఁడు, వా. విః చూ, సోమరి.
నలినము, సం. వి. అ. న. (రూ-నలీనము-నలము-నళికము-నాళికము-నాళీకము). 1. తామర: చూ, సహస్రపత్రము. 1; 2. నీరు: చూ, సలిలము.
నలిని, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, నలినము. 1; 2. తామర కొలను: చూ, సరస్సు. 1; 3. తామరతీఁగ: చూ, పద్మము. 1; 4. తామరతంపర: చూ, సహస్రపత్రము 1; 5. మిన్నేరు: చూ, నది; అం 6. ఒకానొక వృత్తము. ఒక్కొక్కపాదములో స-స-స-స-స గణములు గలిగి పదింట యతిగల పంచదశ ఛందస్సునందుఁబుట్టిన వృత్తము: చూ, వృత్తము.1.
నలినీపద్మకోశము, అం: చూ, నృత్తహస్తములు.
నలినేశయుఁడు, సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.
నలియు, దే. అ. క్రి: చూ, నలఁగు. 1. ఉ, హరి. 3, ఆ. 80.
నలు, దే. స. వృత్తియందు హల్లుపరమగుచో నాలుగున కాదేశముగా వచ్చును. "నలుగడ-నలుమూల" మొ. (నాలుగు).
నలుఁగు, వా. వి. చూ, నలుఁగుఁబిండి. భార.విరా. 2, ఆ. 22; దే. అ. క్రి. 2: చూ, రూ-నలఁగు. 1.
నలుఁగుడు, దే. వి. 1: చూ, నలుగుఁబిండి; 2: చూ, పీడనము.
నలుఁగుఁబిండి, వా. వి. సున్ని: చూ, సాదము. (1).
నలుఁడు, సం. వి. అ. పుం. 1. నలమహారాజు: రాజు. 1; 2. ఒకకోఁతి: చూ, వానరము; 3. పితృదేవత: చూ, యముఁడు.
నలకువ, దే. వి. 1: చూ, నలఁక. 1; 2: చూ, నలఁక. 3.
నలుగు, వా. విః చూ, రూ-నలుఁగు. 1.
నలుగురినోళ్లలోఁబడుట, జా. అల్లరిపాలగుట, అపకీర్తినిఁ బొందుట "పసులఁగాచుచు నలుగురినోళ్లలోఁబడ్డ గురుతు వోవ" (శ్రీనివాసవిలాసము).
నలుగురు, దే. స. నాలుగునకు మహన్మహత్యర్థక బహువచనాంతాదేశము: రూ-నలువురు-నల్గురు-నల్వురు.
నలుచదరము, వా. వి. రూ-నల్చదరము: చూ, చతురము. 3-4.
నలుచు, దే. ప్రే. నలియఁజేయు, నలుపు.

నలుతుము, ద్వ. వి. (నాలుగు + తూము) చతుఃరాఢకి: రూ-నల్తుము.
నలుపగు, వా. అ. క్రి. కందు: చూ, సందడించు.
నలుపలము, ద్వ. వి. చతుఃపలము: రూ-నల్పలము.
నలుపు, వై. వి. = నైల్య-నీల. రూ-నల్ల-నల్లన. 1. నీలవర్ణము: చూ, వర్ణము. 6: విణ. 2. నీలవర్ణముగలది. వై. 8, ఆ. 184: చూ, వర్ణము. 6; ప్రే. 3; చూ, నలుచు.
నలుపుమొల్లచెఱకు, ద్వ. వి. ఒకరకము చెఱకు *: చూ, రసాలము. 3.
నలుపుగింజెముదాల్పు, ద్వ. వి: చూ, బలరాముఁడు.
నలుపుపాఱు, వా. అ. క్రి: చూ, కాటుకకట్టు.
నలుబది, దే. స. (౪౦): రూ-నలబై-నలువది-నల్బది-నల్వది.
నలువ, ద్వ. వి. (నాలుగు + వా): చూ, బ్రహ్మ. 1.
నలువంద్రు, ద్వ. స. నలువదిమంది (నలువదికి మహన్మహత్యర్థక రూపము.)
నలుపతేజి, వా. వి: చూ, హంస.
నలువది, ద్వ. స. (నాలుగు + పది): చూ, నలుబది.
నలువరాణి, వై. వి. రూ-నల్వరాణి. బ్రహ్మభార్య: చూ, సరస్వతి.
నలువు, దే. వి. 1. ఒప్పిదము, మంజులము: చూ, హృద్యము; 2. సొగసు: చూ, సౌందర్యము; 3: చూ, సామర్థ్యము. స్వా. 4, ఆ. 3[7]; 4. క్రమము: చూ, విధము 1; విణ. 5. ఒప్పిదమైనది: చూ, శ్రీమంత. 2. (హృద్యము.)
నలువురు, దే. స: చూ, రూ-నలుగురు.
నలుసాల, ద్వ. వి. (నాలుగు + సాల) చుట్టు కొల్లారు: చూ, సదనము. 1.
నలుసంత, ద్వ. వి. నలి: చూ, రేణువు. 1.
నలుసు, దే. వి.—వై.—
నల్గురు, దే. స: చూ రూ-నలుగురు
నల్చదరము, వా. వి: చూ, రూ-నలుచదరము.
నల్తిగ, వా. స: చూ, ఇరాజు. ఆం, పదా. నర, 124.
నల్తుము, ద్వ. వి: చూ, రూ-నలుతుము.
నల్పలము, ద్వ. వి: చూ, రూ-నలుపలము.
నల్బది, దే. స: చూ, రూ-నలుబది.
నల్మోముదేవర, ద్వ వి: చూ, నలువ.
నల్ల, వై. వి. = నైల్య. నీలః 1: చూ, రూ-నలుపు 1. భార. ఆది. 2, ఆ. 32; 2: చూ, బొగ్గు. జై. 3, ఆ. 74; విణ. 3. = నైల్య. నీలః: చూ, నలుపు. 2; దే. వి. 4: చూ, రక్తము. అచ్చ. సుం, కాం. 105.
నల్లఁబాఱు, వా. అ. క్రి, చూ, సందడించు.
నల్లఁదనము, వై. వి: చూ, చామనచాయ.
నల్లఅగలు, వా. వి. 1. అగరువు: చూ, రాజార్హము; 2: చూ, జాపువ్వు.
నల్లఉమ్మెత్త, దే. వి. ఒకరకము ఉమ్మెత్త *: చూ, హలాపుష్పము.
నల్లక, దే. వి: చూ, సురభి.
నల్లకంద, వై. వి. ఒకకంద*: చూ, సూరణము.
నల్లకచోరము, వై. వి. చోరము *. చూ, రాజార్హము.
నల్లకలువ, వై. వి. రూ-నల్లగలువ-నల్లగల్వ: చూ, పద్మము. 1.
నల్లగగెర, ద్వ. వి: చూ, పర్ణాశము *.
నల్లగఱిక, ద్వ. వి. పచ్చిక: చూ, హరిత: (చూ, తృణము. 1.)
నల్లగలిజేరు, ద్వ. వి: చూ, వర్షకేతువు *.
నల్లగింజెన, ద్వ. వి నల్లదింజెన. (సం. ప.)—నీలపుష్పి *.
నల్లగియ, వై. వి: చూ, శిరీషపత్ర*.
నల్లగినియ, వై వి: చూ, కునాసము. 1.*
నల్లగుండె, ద్వ. వి: చూ, యకృత్తు.
నల్లగురిగింజ, ద్వ. వి: చూ, శ్వేతపాకి*.
నల్లగుఱ్ఱము, వై. వి. నీలాశ్వము: చూ, హయము.
నల్లగూబ, ద్వ. వి. కృతమాలకము: చూ, సకినంపుఁబులుఁగు.
నల్లగొలిమిడి, ద్వ. వి. నీలమూర్వ*: చూ, మొగబీర.
నల్లగోరంట, వై. వి: చూ, మహాసహ*.
నల్లగ్రుడ్డు, ద్వ. వి. కనీనిక: చూ, లోచనము.
నల్లగ్రోలుసట్టి కెంకి, ద్వ. వి: చూ, మూలతేఁడు. వేం. ఆ. 4.
నల్లచీమ, ద్వ. వి. ఒకానొకచీమ: చూ, పిపీలిక.
నల్లచెన్నంగులు, ద్వ. వి. బ: చూ, ధాన్యము.
నల్లచెఱకు, ద్వ. వి: చూ, రసాలము 3*.
నల్లచేమ, ద్వ. వి: చూ, శకుటము *
నల్లచ్చిగాఁడు, ద్వ. వి. (నల్ల + అచ్చనము + కాఁడు) 1: చూ, ఏటిరింత; 2. ఒకానొక పక్షి: చూ, పక్షి.
నల్లజీడి, ద్వ. వి: చూ, భల్లాతకి*.
నల్లజీలకఱ్ఱ, వై. వి. రూ నల్లజిలకఱ్ఱ*: చూ, సుషవి. 2.
నల్లజెఱ్ఱి, ద్వ. వి. ఒకరకముజెఱ్ఱి: చూ, సర్పము.
నల్లతీఁగ, వై. వి. కమ్మెరాకుతీఁగ: చూ, సురలి*.
నల్లతుమిక, ద్వ. వి. కాకితుమ్మికి*: చూ, స్ఫూర్జకము*.
నల్లతుమ్మ, ద్వ. వి: చూ, విట్ఖదిరము *.
నల్లతెగడ, వై వి: చూ, సర్వానుభూతి*.
నల్లతేలు, ద్వ. వి: చూ, ఎనుఁగుతేలు.
నల్లత్రాఁచు, ద్వ. వి. (రూ-నల్లఁద్రాఁచు) కృష్ణసర్పము: చూ, సర్పము.
నల్లదాసరిగాఁడు, ద్వ. వి: చూ, తాఁబేలు.
నల్లదిరిసెనము, వై వి. ఇరుగుడు*: చూ, శింశుప.
నల్లదింజెన, ద్వ. వి: చూ, నల్లగింజెన*.
నల్లదోమ, ద్వ. వి. తీక్ష్ణతుండము: చూ, మశకము. 1.
నల్లద్రాగుడు, దే. వి. రూ-నల్లద్రావుఁడు: చూ, బుద్ధపిడుఁదు.
నల్లద్రావుడు, 1.—వై—అచ్చ. అర, కాం. 12; 2. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.
నల్లద్రావువాఁడు, ద్వ. వి: చూ, మూలతేఁడు, ఆం, సం. దే. 20.
నల్లన, వై. వి. = నైల్య—నీల : చూ, వర్ణము. 6.
నల్లనగు, వా. అ. క్రి: చూ, నలుపగు.
నల్లనయ్య, వై. వి. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. కృష్ణుఁడు:—వై.—; 3. కోమటి. సాంబ. మా. 2: చూ, వైశ్యుఁడు; విణ. 4. నల్లనివాఁడు: చూ, అసితుఁడు. 2.
నల్లనయ్యారవాలు, ద్వ. వి. గరుడుఁడు. సాంబ. దే. 15. చూ, హరివాహనుఁడు.

నల్లనియాఁగ, వా. వి: చూ, మక్షిక.
నల్లనివాఁడు, ద్వ. వి: కట్టి. (సం. ప.)—కాలుఁడు.
నల్లనేల, ద్వ. వి. కృష్ణభూమి: చూ, భూమి. 1.
నల్లనేఁగుమ్మడు, ద్వ. వి. పాలగుమ్ముడి*: చూ, మహా ఫలము.
నల్లనైదువగేస్తు, ద్వ. వి: చూ, శివుఁడు.
నల్లపిచ్చుక, ద్వ. వి. పోతకి: చూ, పిచ్చుక.
నల్లపులగుడు, ద్వ. వి. కృష్ణకాంభోజి*. చూ, వాకంగిని.
నల్లపూస, ద్వ. వి. నల్లనిగాజుపూస.
నల్లపెసలు, ద్వ. వి. బ. శింబికము: చూ, పెసర.
నల్లబుకమలు, ద్వ. వి. బ: చూ, ధాన్యము.
నల్లబాదుసర, ద్వ. వి: చూ, వాయసి*.
నల్లమందు, ద్వ. వి. అభిని. (సం. ప.)—అఫేనము. అహిఫేనము. అభిని. (దీనికి విడుగుడు ఎట్రొపిన్ అను ఇంగ్లీషు మందు) (శుద్ధి.—నేతిలో నొకఁ మర్దించిన శుద్ధి)
నల్లమందుపాలు, ద్వ. వి. అభినిపాలు.
నల్లమడుఁగు, ద్వ. వి. మిక్కిలిలోఁతుగల మడుగు: చూ, సరస్సు. 1.
నల్లమంగ, ద్వ. వి: చూ, శ్వసనము*.
నల్లమద్ది, ద్వ. వి: చూ, ఇనుమద్ది*.
నల్లమట్టి, ద్వ. వి: చూ, కర్మజము. 2.
నల్లమామిడి, ద్వ. వి: చూ, మామిడి*.
నల్లయారెలు, ద్వ. వి. బ: చూ, ధాన్యము.
నల్లయతివస, ద్వ. వి: చూ, విష*.
నల్లయిరుగుడు, ద్వ. వి: చూ, శింశుప*.
నల్లయుప్పి, ద్వ. వి: చూ, లవణి.*.
నల్లయుమ్మెత్త, వై. వి హేమిక*: చూ, హలాపుష్పము.
నల్లయురగ, ద్వ. వి: చూ, పు-జు.
నల్లరఁటి, ద్వ. వి: చూ, రంభ. 2*.
నల్లఱాయి, ద్వ. వి. నీలమణి: చూ, రత్నము. 1.
నల్లవంగ, వై. వి. నీటివంగ *: చూ, వంగ.
నల్లవడు, వై. అ. క్రి: చూ, సందడించు.
నల్లవలువదాల్పు, ద్వ. వి. బలరాముఁడు: చూ, హలాయుధుఁడు.
నల్లవస, వై. వి. ఉగ్ర*: చూ, విష.
నల్లవావిలి, ద్వ. వి. శేఫాలిక *: చూ, వావిలి.
నల్లవిష్ణుక్రాంత, మి. వి. స్థూలపుష్పి *: చూ, విష్ణుక్రాంత.
నల్లవెదురు, వై. వి. కృష్ణసారకము *: చూ, వేణువు.
నల్లవో, దే. అవ్య. రూ-నల్లవో. భార. విరా. 3, ఆ. 99: చూ, సంతాపము.
నల్లవో. —పై.—
నల్లసుగంధిపాల, మి. వి: చూ, శారిబ*.
నల్లావలు, ద్వ వి. బ: చూ, సర్షపము.
నల్లి, దే. వి. (నల్ల+ఇ): చూ, మత్కుణము.
నల్లిండ్లు, ద్వ. వి. బ. (నల్ల+ఇండ్లు) బ్రాహ్మణులపల్లె, అగ్రహారము. భార. సభా. 2, ఆ. 121: చూ, దేశము.
నల్లిక, దే. వి. రూ-నలికిరి: చూ, సర్పము.
నల్లికకరము, వా. వి: చూ, బక్కవాఁడు.
నల్లె, దే. వి. జేన: చూ, వితస్తి.
నల్లెకు, దే. వి. జిబ్బెడు: చూ, మూర. 1.
నల్లేరు, దే. వి. రూ-నల్లేసు*: చూ, హస్తిశుండి.
నల్లేరు, దే. వి.—పై.—
నల్లేరుపైబండి, జా. నిరభ్యంతరము, సులువు "నల్లేరుపై బండి నడక మాకు." (నానారాజసందర్శనము.)
నల్వజక్కి, ద్వ. వి: చూ, హంస. వేం. అం. 97.
నల్వది, ద్వ. స. చూ, రూ-నలువది.
నల్వము, సం. వి. అ. పుం. నన్నూఱుమూరల దూరము.
నల్వరాణి, వై. వి: చూ, రూ-నలువరాణి.
నల్వురు, దే. స: చూ, రూ-నలువురు.
నవ, సం. స. 1. తొమ్మిది: చూ, ము మ్మూఁడు; దే. వి. (1) దురద: చూ, విదర్చిక.
నవఁత, దే. వి 1. క్షయము: చూ, రోగము. 1; 2. నవయుట; 3. దుఃఖము: చూ, శోకము.
నవకము, సం. వి. అ. స. 1. తొమ్మిది: చూ, ముమ్మూఁడు; దే. వి. (1) మృదుత్వము: చూ, సుకుమారము.
నవక్షారము, సం. వి. అ. పుం. = ; చూ, నవాసారము.
నవఖండములు, అం. 1: చూ, ఖండములు. 4; 2. భరత, హేమకూట, నైషధ, ఇలావృత, నీల, శ్వేత, కురు, భద్రాశ్వ, కేతుమాల. (ఇవే నవవర్షములు.)
నవగోజె, దే. వి. పెద్దదేరా: చూ, సదనము. 1.
నవగ్రహములు, అం: చూ, గ్రహములు.
నవటాకు, వా. వి. అరసోల, 1/8 సేరు. పది రూపాయల ఎత్తు.
నవతి, సం. వి. ఇ. స్త్రీ: చూ, తొంబది.
నవదళము, సం. వి. అ. న: చూ, సంవర్తిక.
నవద్రవ్యములు, అం: చూ, ద్రవ్యములు.
నవధాన్యములు, అం: చూ, ధాన్యములు.
నవనందిని, అం. ఒకానొకవృత్తము. ఒక్కొక్కపాదమునందు స-జ-స-న-గగములు గలిగి తొమ్మిదింట యతిగలిగి 14 వ ఛందస్సునందుఁబుట్టిన వృత్తము: చూ, వృత్తము. 1.
నవనము, సం. వి. అ. న: చూ, స్తోత్రము.
నవనిధులు, అం: చూ, నిధులు.
నవనీతము, సం. వి. అ. న. అప్పుడు చిలికి యెత్తిన వెన్న: చూ, వెన్న.
నవబ్రహ్మలు, అం: చూ, బ్రహ్మలు.
నవమము, విణ: చూ, నవమి. 2.
నవమల్లిక, సం. వి. ఆ. స్త్రీ: చూ. విరజాజి*.
నవమాలిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, నవమల్లిక*.
నవమి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, తిథులు; విణ. 2. తొమ్మిదవది, నవమము.
నవము, సం. వి. అ. పుం. 1: చూ, స్తోత్రము; విణ. 2. రూ-నవీనము-నవ్యము. క్రొత్తది: చూ, నూతనము.
నవయు, దే. అ. క్రి. 1. (రోగాదులచే) చిక్కు. భార. ఆర. 5, ఆ. 330: చూ, సొటసొటవోవు: 2. శుష్కించు. భార. ఆర. 7, ఆ. 28: చూ, శోషించు.

నవరంగము, సం. వి. అ. న ఒకానొక యిల్లు. పాండు. 5, ఆ. 266: చూ, సదనము. 1.
నవరత్నములు, అం. 1: చూ, రత్నములు; 2. సంఖ్యాబద్ధము లగు ముక్తకాదికములలో నొకటి: చూ, త్రికము. 7.
నవరసములు, అం: చూ, రసములు.
నవరససాయీభావములు. అం: చూ, రసస్థాయీభావములు.
నవరసు, వా. వి. బంగారునాణెము.
నవరు, దే. వి. 1: చూ, నగరు. 1; 2: చూ, సౌందర్యము.
నవల, దే. వి. 1. రూ-నవలా. ఆఁడుది: చూ, స్త్రీ; 2. మానికె: చూ, శేరు. 1; వా. 3. కథయందలి చమత్కారమును దెలుపు వచనగ్రంథము: చూ, పుస్తకము.
నవలా, దే. వి. ఆఁడుది. స్వా. 2, ఆ. 25: చూ, స్త్రీ.
నవలెబ్రాహ్మణులు, అం: చూ, కపూరియే· బ్రాహ్మణులు.
నవవర్షములు, అం: చూ, నవఖండములు. 2.
నవసస్యేష్టి, అం. ఆగ్రహాయణేష్టి: చూ, హవిర్యజ్ఞములు.
నవసూతిక, సం. వి. ఆ. స్త్రీ. (కొత్తగా ఈనినది) లేఁగటి యావు: చూ, ధేనువు.
నవాంబరము. సం. వి. అ, న. క్రొత్తబట్ట: చూ, వస్త్రము.
నవాతు, దే. వి. తెల్లని చక్కెర: చూ, శర్కర.
న వారిణా శుధ్యతి చాంతరాత్మా, న్యా. పైని స్నానమాడుటచే అంతరాత్మ శుద్ధముగాదు.
నవారు, వా. వి, మంచముపట్టెడ: చూ, పట్టెడ. 1,
నవార్చి, సం. వి. ఇ. పుం. అంగారకుఁడు: చూ, వక్రుఁడు. 1.
నవాసాగరము, వై. వి. = నవక్షారము, ఒకరకము ఉప్పు: చూ, లవణము,
నవాసారము, వై. వి. =: చూ, రూ-నవాసాగరము.
నవి, దే. వి. కరగోడ పెట్టుటకు నిడుపున త్రవ్వి యెత్తిన మట్టి వల్లము.
నవీనము, సం. విణ: చూ, నూతనము.
నవీనుఁడు, సం. విణ: చూ, నూతనుఁడు.
నవు, దే. వి: రూ-నవ్వు.
నవుకరి, వా. వి; చూ, శుశ్రూష. 2. (రూ-నౌకరు.)
నవుకరు, వా, వి: చూ, సేవకుడు. (రూ-నౌకరు.)
నవుకు, వా. వి. 1. లోఁతు: చూ, రంధ్రము. 1; 2: చూ, మొట్టి.
నవుడుకొట్టు, దే. అ. క్రి. రూ-నౌడుకొట్టు. ఏమియుతోఁచక భ్రమించు: చూ, మిణకరించు.
నవురు, దే. వి. మృదువు: చూ, సుకుమారము.
నవోఢావస్త్రము, సం. వి. అ. న. పెండ్లికూతురునకుఁ కట్టెడు మధుపర్కము: చూ, వస్త్రము.
నవోద్ధృతము, సం. వి. అ. న: చూ, నవనీతము.
నవైద్యః ప్రభు రాయుషః, న్యా. వైద్యుఁడు జీవితమునకుఁ బ్రభువు గాఁడు. అనఁగా బ్రదికింపఁజాలఁడు.
నవ్యము, సం. విణ. 1. నవీనము: చూ, నూతనము; 2. నుతింపఁదగినది: చూ, శ్లాఘ్యము.
నవ్వ, దే. వి. బాలకుఁడు: చూ, శిశువు.
నవ్వు, దే. వి. రూ-నవు. 1. అలతెంత: చూ, హాస్యము. 1;2. అపహాస్యము: చూ, హాస్యము. 1; 3: చూ, పరిహాసము; 4: చూ, వికాసము; అ. క్రి. 5: చూ, హసించు; 6: చూ, వికసించు; స. క్రి. 7. పరిహసించు. పంచ. నా. 1, ఆ. 470: చూ, వెక్కిరించు. 3; 8. అపహసించు. విజ. 1, ఆ. 150: చూ, వెక్కిరించు. 3.
నవ్వుఁబాటు, ద్వ. వి: చూ, రూ-నగుఁబాటు. ఉ, హరి. 5, ఆ. 141,
నవ్వుటాల, దే. వి.—పై.—భార. ఉద్యో. 3, ఆ. 61.
నవ్వులాట, —పై.—
నవ్వులబండి. దే. వి. నవ్వెడు స్వభావముగల ఆఁడుది: చూ, స్త్రీ.
నశించు, సం. అ. క్రి: చూ, సమయు. 3.
నశ్వరము, సం. విణ. నశించునది: చూ, భంగురము.
నష్టమగు, మి. అ. క్రి: చూ, అదృశ్యమగు.
నష్టము, సం. విణ. 1. నాశము (ద్రవ్యనాశము) నొందినది: చూ, సేగి: 2. మఱుఁగుపడినది; అం. 3: చూ, ప్రస్తార ప్రత్యయ ప్రాణములు.
నష్టములు, అం: ఇల్లుకాలిపోవుట, పెండ్లాము చచ్చుట, పసులు గోల్పోవుట, మిత్రులు నశించుట, కొడుకులుచెడుట, ధనము కొల్లపోవుట, ధాన్యము కొల్లపోవుట (7).
నష్టలబ్ధి, అం: చూ, షట్ప్రత్యయములు.
నష్టవ్రతుఁడు, సం. విణ: చూ, అవకీర్ణి.
నష్టాగ్ని, సం. వి. ఇ. పుం, 1. వీరహా. గార్హపత్యాగ్నిని విడిచినవాఁడు; 2. నష్టమైనయగ్ని గలవాఁడు.
నష్టాశ్వదగ్ధరథన్యాయము' న్యా. యుద్ధములో ఒకని గుఱ్ఱము చచ్చెను. ఇంకొకని రథము కాలిపోయెను. ఉభయులు గలిసిన రథికులయ్యెదరనురీతి. (కష్టసమయమున పరస్పర సాహాయ్యము).
నష్టి, సం. వి. ఇ. స్త్రీ. 1. నాశము: చూ, రుత్త; 2. ద్రవ్య నాశము: చూ, సేగి.
నస, సం. వి. ఆ. స్త్రీ. 1. (రూ-నస్-నస్సు-నాస-నాసిక); చూ, ముక్కు; 2. దురద: చూ, విదర్చిక; 3. కసరు: చూ, మసము; 4: చూ, విపత్తు.
నసగూఁటి, దే. విణ. (నసగూఁడు + ఇ): చూ, అంకులాడి.
నసగూఁడు. దే. వి. కామోద్రేకము.
నసాహసమనారుహ్య నరో భద్రాణి పశ్యతి, న్యా, మనుష్యుఁడు సాహసింపక మేలును బొందఁడు.
నసిమిరి, దే. వి. 1: చూ, నస. 2; 2. ఒకాచొకచేఁప: చూ, మత్స్యము. 1.
నసీబు, వా. వి. నుదుటివ్రాఁత.
నసుకు, దే. వి. 1. అసత్యము: చూ, వితథము; విణ. 2. అబద్ధోక్తి—పై.—; వా. 3: చూ, నణుగు.
నసువు, దే. వి. మొలక: చూ, మొక్క. 1.
నస్యము, వా. వి. ముక్కుపొడుము: చూ, ముక్కుపొడుము. తద్వి.—అవపీడన-అవపీడనము.
నస్తితము, సం. వి. అ. పుం. ముకుఁద్రాడుగట్టిన యెద్దు: చూ, వృషభము. 1.

నస్త్రీస్వాతంత్ర్యమర్హతి, న్యా. స్త్రీస్వాతంత్ర్యమున కర్హురాలు గాదు.

నస్యోతము, సం. వి. అ. పుం.—పై.—

నహి, సం. అవ్య: చూ, న. 15-16-17.

నహి కఠోరకంఠీరవస్య కురంగశాబః ప్రతిభటో భవతి, సింహముతో లేడిపిల్ల యుద్ధము చేయగలదా? అట్లే శాస్త్రజ్ఞునితో శాస్త్రముచదువనివాడు వాదముచేయజాలఁడు.

నహినిందాన్యాయము, పా. ప్రతివ్రతము సంకల్పించినపు డది యెల్లవ్రతములలో నెల్ల సుత్తమమని చెప్పఁబడుచుండును. ఇట్లు చెప్పుటచేఁ దక్కినవి నిందింపబడినవని తలంపరాదు. ప్రస్తుతమగుదాని స్తుతించినంతమాత్రమున దానితో సమానములగు నితరములను దూషించినట్లు తలంపరాదు అనురీతి.

నహిమమరీచిసరసీ క్రమశః శుష్యతి, న్యా. ఎండమావులలోని నీరు క్రమక్రమముగా నింకిపోదు. ఎండమావి ఒక్కసారిగానే అదృశ్యమగును. జ్ఞానోదయముకాఁగానే అజ్ఞానము ఒక్కసారిగానే నశించును.

నహి సార్వభౌమానందమనుభవ న్రాజా గ్రామాధిపతిసుఖం తుచ్ఛమపేక్షతే, న్యా. చక్రవర్తి పదవియొక్క ఆనందమను భవించువాఁడు, ఒకగ్రామకరణముయొక్క అధికారముకొఱకు ఆశపడునా? అట్లే బ్రహ్మానందము ననుభవించుచున్నజ్ఞాని విషయసుఖముకొఱకు ఆశపడఁడు.

నహిస్వల్పోదోషోఽమితగుణాభిభావకః, న్యా. ఒక్కదోషమువల్ల అనేక సద్గుణములకు హానికలుగదు. అట్లే చంద్రునిలో నల్లనిమచ్చయున్నను చల్లఁదనము మొదలగు మంచిగుణము లుంటవలన మన మతనిని ప్రేమించుచున్నాము.

నహీనతానములు, అం. అశ్వక్రాంతము, యవక్రాంతము, విష్ణుక్రాంతము, సూర్యక్రాంతము, జగత్క్రాంతము, వలభిత్తు' నాగయక్షకము (7): చూ, శుద్ధతానములు.

నహ్యయంస్థాణోరపరాధోయ దేనమంధోనపశ్యతి, న్యా, ఎదురుగా నున్న స్తంభమును చూడలేక గ్రుడ్డివాఁడు దానిమీఁదపడి తల పగులఁగొట్టుకొనిన ఆ తప్పు స్తంభమునకు అంటదు, అట్లే మంచివాఁడు చెడ్డవానితో తిరిగి దుష్టస్వభావము నేర్చుట చెడ్డవానిని తప్పుకాదు.

నళ- అం. (నల): చూ, సంవత్సరములు.

నళము, సం. వి. అ. పుం: చూ, రూ-నడము.

నళి, సం. వి. ఈ. స్త్రీ: చూ, తుంటికూర*.

నళికము, సం. వి. అ. న: చూ, రూ-నలినము. 1.

## నా

నా, అం. 1. అష్టాక్షరి; దే. స. (1) నేను అనుదానికి ప్రాతిపదికము; 2. సంబంధమున "నీ-నా"లకు బహువచన రూపం బొక్కెడ నగు. ఉదా.—మీయూరు, మాతల్లి మొ.

నాంచారు, వా. వి. ఒకానొక వైష్ణవదేవత. (నాంచారి అనియు.)

నాంది, సం. వి. ఈ. స్త్రీ. 1. దేవతలు బ్రాహ్మణులు లోనగువారు చేయునట్టి ఆశీర్వాదము: చూ, మంగళాశాసనము; 2. నాటక ప్రారంభమునందు జరిపెడు మంగళము; (నాంది యనఁ గావ్యాది పద్యము. ఇందుఁ బదముచేఁగాని యర్థముచేగాని కథాసూచనచేయు టాచారము. నాందికిఁ బద నియమము గలదని కొందఱు, లేదని కొందఱు, పాదమే పదమని కొందఱు, 8-12-18-22 పదము లుండవలెనని యందురు. నాంది ద్వివిధము.-శుద్ధనాంది, క్రియానాంది యని. కేవల పద్యపూర్వక దేవతాస్తుతి శుద్ధనాంది. ఈస్తుతిపద్యమునం"దాశీర్నమస్క్రియా, వస్తునిర్దేశ" ములలో నొకటి యుండును. అక్షతలు, పుష్పములు దోయిలించి సభ్యుల మీఁద జల్లుచు మంగళగీతముఁ బాడుట క్రియానాంది. పూర్వరంగమనఁగా నాట్యోపక్రమమునఁ గుశలవులచే విఘ్నోపశాంతికొఱకుఁ జేయు కృత్యము. దీనికిఁ బెక్కు అంగము లున్నవిగాని వానిలో నాంది ముఖ్యము.; 3. భేరి: చూ, దుందుభి. 2; అం. 4: చూ, స-మ-హీనతానములు: (చూ, సర్వతానములు) ; 5: చూ. వేసరషాడవజ భాషలు: (చూ, భాష. 1. ); వి: చూ, జన్యతాళములు.

నాందీకము, సం. వి. అ. పుం: చూ, తోరణ స్తంభము.

నాందీకరుఁడు, సం. విణ. 1. మంగళపాఠకుఁడు: నాందీవాది: భేరీవాయించువాఁడు; నాందీవాది.

నాందీవాది, సం. విణ. (న్. ఈ. న్.) —పై.—

నాఁగటిచాలు, వా. వి: చూ, సీత. 2.

నాఁగటిచాలుకూర, ద్వ. వి. తఱిగొట్టి*: చూ, హలిని.

నాఁగటిచాలుపేరియతివ, ద్వ. వి. శ్రీరాముని భార్య: చూ; సీత. 1: (చూ, భార్య.)

నాఁగటిచిప్ప, ద్వ. వి. (నాఁగలి + చిప్ప) రూ. నాఁగంటిచిప్ప, నాఁగంటిదుంప - నాఁగటిదుంప - నాఁగంటిపడత - నాఁగటి పడత - నాగంటియారు-నాఁగటియారు - పడత - పణత : చూ, లాంగలము. 1.

నాఁగటిజోదు, వై. వి. బలరాముఁడు: చూ, హలాయుధుఁడు.

నాఁగటిదుంప, ద్వ. వి. నాఁగటిచిప్ప.

నాఁగటిపడత, —పై.—

నాఁగటియారు, —పై.—

నాఁగటిసీల, ద్వ. వి. ఏడికోల జారకుండుటకై బిగించిన చీల,

నాఁగలి, వై. వి. = లాంగలమ్. (రూ-నాఁగెలు నాఁగేలు - నాఁగేరు) 1. హలము: చూ, లాంగలము. 1; 2. మడక: చూ, లాంగలము. 1.

నాఁగలివాల్జోదు, వై. వి: చూ, నాఁగటిజోదు.

నాఁగు, దే. వి. ధాన్యమునకు వడ్డీగానిచ్చు ధాన్యము.

నాఁగురు, వై. వి. = నాగిని*: చూ, శూలిని.

నాఁగెలు: చూ, రూ-నాఁగలి.

నాఁగేరు, —పై.—

నాఁగేలు, —పై.—

నాఁచికోలు, దే. వి. అపహరించుకొనుట. భార. శల్య. 1, ఆ. 49: చూ, ముచ్చిలి.

నాఁచు, దే. వి. 1. తీఁగపాఁచి: చూ, శైవలము; 2: చూ, ముచ్చు. 1; స. క్రి. 3: చూ, ముచ్చిలించు. అని. 2, ఆ. 136.

నాఁచుడు దే. వి. క్షుద్రజలచరము: చూ, మత్స్యము. 1.

నాఁచువగ, వా. వి. అంతరదామర *:చూ, సహస్రపత్రము. 1.

నాఁడు, దే. వి. 1. తారీఖు. అం, భా. ప్ర. 90: చూ, రోజు; 2. అదినము. జై. 8, ఆ. 65; భార. ఉద్యో. 4, ఆ. 407; ఉ. రా. 7, ఆ. 232; కళా. 4, ఆ. 132; 3. కాలము: చూ, సమయము. 1; 4. అకాలము.

నాఁడునాఁడు, వా. వి. రూ నానాఁడు: చూ, ప్రతిదినము.

నాఁడెకత్తె, దే. వి. నాణెముకలది. రూ-నాణెకత్తె: చూ, స్త్రీ.

నాఁడెకాఁడు, దే. వి. నాణెముకలవాఁడు. రూ-నాణెకాఁడు: చూ, శ్రేష్ఠుఁడు.

నాఁడెము, వై. వి = నాణక: చూ, రూ-నాణెము.

నాఁపజాయి, దే. వి. (నాము+జాయి) విషశిల: చూ, రత్నములు.

నాకబలి, సం. వి. ఇ. పుం. = నాగప-నాగప్ప-నాగవలి - నాగవల్లి-నాప. పెండ్లిచివరనాటితంతు. కళా. 7, ఆ. 83.

నాకము, సం. వి. అ. పుం. 1: చూ, స్వర్గము; 2. ఆకాశము: చూ, వ్యోమము. 1; 3. నక్క: చూ, సృగాలము.

నాకిని, సం. వి. ఈ. స్త్రీ. =: చూ, నాగిని. (1).

నాకు, వా. స. 1. నాకొఱకు; దే. స. క్రి. 2. లేహనము చేయు.

నాకుట, వా. వి: చూ, లేహనము.

నాకులి, సం. వి. ఈ. స్త్రీ: చూ, సర్పాక్షి *.

నాకువు, సం. వి. ఉ. పుం. 1. పుట్ట: చూ, వల్మీకము; 2. కొండ; చూ, పర్వతము; 3: చూ, సన్న్యాసి. 1.

నాకేశుఁడు, సం. వి. అ. పుం: చూ, వేలుపుఱేఁడు.

నాక్రము, సం. వి. అ. పుం. = నక్క: చూ, సృగాలము.

నాగ, వై. విశ. 1. పూజ్యము: చూ, సత్తు; 2. పెద్ద: చూ, విపులము; వా. 3: చూ, నాగా. 1.

నాగఁడు, వై. వి. = నాగః. శేషుఁడు: చూ, సర్పము.

నాగకంకణుఁడు, సం. వి. అ. పుం: చూ, శివుఁడు. 1.

నాగకన్నియ, ద్వ. వి: చూ, ఉలూపి. 2.

నాగకృతి, అం: చూ, క్రియాంగములు: (చూ, అంగము. 9.)

నాగకేసరము, సం. వి. అ. పుం. చూ, సువర్ణాఖ్యము. *.

నాగకేసర చూర్ణకము, సం. వి. అ. పుం. చూ, కరికుసుంభము.

నాగకేసరులు, ద్వ. వి. బ: చూ, ధాన్యము.

నాగగన్నేరు, ద్వ. వి. ఒకరకముగన్నేరు*: చూ, హయమారకము.

నాగచెముడు, ద్వ. వి. ఒకరకము చెముడు*: చూ, స్నుహి.

నాగజిహ్వక, సం. వి. ఆ. స్త్రీ. మణిసిల: చూ, రత్నములు.

నాగదంతకము, సం. వి. అ. పుం: చూ, నాగవాసము. (3).

నాగదంతి, ద్వ. వి: (సం. ప.)—ఏరండ పత్రిక, ఏరండఫల, కాండేరి, కామమూతిక, నాగస్ఫోట *.

నాగదమని, సం. వి. ఈ. స్త్రీ: చూ, ఈశ్వరి. 2.

నాగదాళి. దే. వి. ఒకానొకముండ్లచెట్టు: చూ, వృక్షము.

నాగనేరేడు, ద్వ. వి. ఒకరకమునేరేడు *: చూ, నేరేడు.

నాగప, వై. వి. =: చూ, నాకబలి.

నాగపడగలదండ, మి. వా. వి. ఆఁడువారి మెడనగ: చూ, భూషణము. 2.

నాగపడగలు, మి. వా. వి. బ.—పై.—

నాగపసాని వై. వి. నాకబలిచిరంటి. (రూ-నాగప్పసాని-నాగసాని-నానాపసాని-నానాపసాని-నాపసాని): చూ, స్త్రీ.

నాగపాశము, సం. వి. అ. పుం. 1. వరుణుని ఆయుధము: చూ, బాణము. 1; 2: చూ, రతిబంధము; అం. 3: చూ, ఉత్తానకరణబంధములు.

నాగపెంజెర, ద్వ. వి. ఒకరకము పెంజెర: చూ, మత్స్యము 1.

నాగప్ప, వై. వి. =: చూ, నాకబలి.

నాగప్పసాని, వై. వి: చూ, రూ-నాగపసాని.

నాగబందము, వై. వి. = నాగబంధ. సర్పాకృతి ముగ్గు.

నాగబంధము, సం. వి. అ. న. 1 = నాగబందము.—పై.—; అం. 2: చూ, కాయమానములు; 3: చూ, శబ్దాలంకారములు; 4: చూ, సంయుతహస్తములు.

నాగబల, సం. వి. ఆ. స్త్రీ: చూ, బీజ. 2.*.

నాగబలుఁడు, సం. వి. అ. పుం: చూ, భీమసేనుఁడు.

నాగబెత్తము, వై. వి. పొన్నువేసిన మంత్రపూతమైన చిన్న పేము. కళా. 2, ఆ. 48.

నాగబ్రాహ్మణులు, అం. సారస్వతులలో నొకతెగవారు: చూ, ఆచార్యే అను బ్రాహ్మణులు: (చూ, బ్రాహ్మణులు).

నాగమల్లిక, సం. వి. ఆ. స్త్రీ. =: చూ, నాగమల్లె. *.

నాగమల్లె, వై. వి. = నాగమల్లికా. (రూ-నాగమల్లియ-నాగుమల్లియ-నాగుమల్లె) అష్టపత్రిక: చూ, మల్లె. 1 (హసంతి.2.)

నాగమల్లెలు, వై. వి. బ: చూ, ధాన్యము.

నాగమాత, సం. వి. ఋ. స్త్రీ: చూ, ఇా. 9.

నాగము, సం. వి. అ. న. 1. సత్తు: చూ, లోహము. 1; 2. తగరము: చూ, లోహము 1; 3: చూ, నాగపాశము. 2; పుం. 4. = నాగువు. రూ-నగము: చూ, సర్పము; 5. ఏనుఁగు: చూ, హస్తి; 6. కొండ. రూ-నగము: చూ, పర్వతము; - 7. గ్రహము, గాము. చూ, రాహువు. 2; 8: చూ, నాగవాసము. (3); 9. మబ్బు: చూ, మేఘము. 1; 10. ఉద్గారప్రవర్తమానవాయువు: చూ, వాయువు. 11. ముస్తె*: చూ, తృణము. 1; 12: చూ, సువర్ణాఖ్యము *; 13: చూ, పొన్న *; 14. (ఉత్తరపదమైనపుడు) శ్రేష్ఠము: చూ, శ్రైష్ఠ్యము; అం. 15. అష్టనాగములు.— అనంతుఁడు, వాసుకి, తక్షకుఁడు, శంఖపాలుఁడు, కులికుఁడు, పద్ముఁడు, మహాపద్ముఁడు, కర్కోటకుఁడు: (చూ, సర్పము); 16: చూ, ఛన్దములు.

నాగముస్తె, వై. వి. భద్రముస్తకము *: చూ, తృణము. 1.

నాగమ్మ, వా. వి. నిరుపయోగి "పుంజులూరి నాగమ్మ".

నాగయక్షకము, అం: చూ, నహీనతానములు: (చూ, శుద్ధతానములు.)

నాగరంగము, సం. వి అ. పుం. నారింజ *: చూ, శర్కరాంకము.

నాగరము, సం. వి. అ. న. 1: చూ, శుంఠి; 2. ముస్తె *: చూ, హరిత; 3. నాగరదేశీయాక్షరము; పుం. 4. గోరంట*: చూ, మహాసహ; విశ. 5. నగరమునఁబుట్టినది; అం. 6. ఒకానొకవృత్తము. ఒక్కొక్క పాదము భగణ, రగణ, వగణములతోఁగూడినదై యష్టమఛందస్సునందుఁబుట్టిన

వృత్తము: చూ, వృత్తము. 1; దే. విణ. (1) ఆఁడువారి శిరోభూష: చూ, భూషణము. 2.

నాగరముస్త, సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకతుంగ*: చూ, తృణము. 1.

నాగరాఖ్యము, అం: చూ, ఉత్తానకరణబంధములు.

నాగరికత, సం. వి. అ. స్త్రీ: చూ, నాణెము. 4.

నాగరికము, సం. విణ నాణెమైనది: చూ, శ్రైష్ఠ్యము.

నాగలోకము, సం. వి. అ. పుం. పాతాళము: చూ, లోకము. 1.

నాగవము, సం. వి. అ. న: చూ, కరణము. 14.

నాగవలి, వై. వి. =: చూ, నాకబలి.

నాగవల్లి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, తాంబూలవల్లి, తాంబూలవల్లిక, తాంబూలి. (తె).—తమలపాకుతీఁగె*: వై. వి. (1) =: చూ, రూ-నాగవలి.

నాగవల్లిసిష్ఠురము, జా. 1. పెండ్లియైదవనాఁటి దెప్పలు; 2. ముద్దఱపిండిదగ్గఱ దెబ్బలు; 3. పనియైనపిదప పోరాటము. "లోలత నింక నాగవలిలోపల సిష్ఠుర మేలపల్కగన్". (విజయవిలాసము. 3, ఆ. 72.)

నాగవల్లీదళము, సం. వి. అ. న: (తె. ప.)—ఆకు, తమలపాఁకు - తములపాకు - తములపుటాకు; తద్వి.—కారపు నల్లతములపాకునకు. —(తె. ప.)—కమ్మెరాకు. (కమ్మెరాకు తీఁగెకు.—: చూ, సురలి.) (మిగతవానికి. చూ, సురలి.)

నాగవాసము, సం. వి. అ. పుం. 1: చూ, నాగలోకము; వై. వి. (1) వేశ్యాసమూహము. స్వా, 2, ఆ. 73: చూ, వేశ్య: (2) ఆటమేళము. అచ్చ. బాల, కాం. 33: చూ, వేశ్య: దే. వి. (3) గొండ్లెము తగిలించెడు రెండు కొనలు వంచినయినుపకమ్మి; నాగదంతము, నాగము, నిర్యూహము. (తె.ప.)— కటిమొల, ఏనుఁగుపల్లు.

నాగవీటుఁడు, సం. వి. అ. పుం. మనువు కుదుర్చువాఁడు: ఖటకుఁడు, టాంకరుఁడు, త్ర్యక్షరుఁడు.

నాగశుండి, సం. వి. ఈ. స్త్రీ. ఖురాసానిపుచ్చ*. చూ, పుచ్చ.

నాగసంభవము, సం. వి. అ. న: చూ, సిందూరము. 1.

నాగసత్వ, అం: చూ, ద్వాదశసత్వము.

నాగసరము, వై. వి. = నాగస్వరః - రూ- నాగసొరము. 1. పాములవాఁడు ఊఁదెడుబుఱ్ఱ: చూ, వీణె; 2. మంగలికొళ్ళు, సన్నాయి: చూ, వీణ.

నాగసాని, వై. వి: చూ, రూ-నాగపసాని.

నాగసుగంధ, సం. వి. ఆ. స్త్రీ: చూ, సర్పాక్షి*.

నాగసొరము, వై. వి. =: చూ, నాగస్వరము. 1-2.

నాగస్వరము, సం. వి. అ. పుం. =: చూ, నాగసరము. 1-2.

నాగా, వా. వి. 1. పనిచేయనిరోజు; 2. శూన్యము.

నాగాంతకుఁడు, సం. వి. అ. పుం. గురుడుఁడు: చూ, హరివాహనుఁడు.

నాగాఖ్యము, సం. వి. అ. పుం: చూ, నాగకేసరము*.

నాగాపసర్పితము, అం: చూ, కరణములు.

నాగాశనుఁడు, సం. వి. అ. పుం: చూ, నాగాంతకుఁడు.

నాగిని, సం. వి. ఈ. స్త్రీ. 1. గొల్లజిడ్డు*: చూ, శూలిని; వై. వి. (1) =నాకిని. దేవత్వమొందిన ముత్తైదువ: చూ, స్త్రీ.

నాగుఁబాము, ద్వ. వి: చూ, సర్పము.

నాగుమల్లె, వై. వి. = నాగమల్లికా*: చూ, రూ-నాగమల్లె.

నాగులు, వై. వి. బ. = నాగాః (కశ్యపునకుఁ గద్రువయందుఁ గల్గిన సహస్రసంఖ్యాకమగు సంతతి — శేష-వాసుకి-తక్షక-ఐరావత-కంబళ-అశ్వతర-మహాపద్మ - శంఖ - కర్కోటక-ధనంజయ-మహానీల-ఐలాపత్ర-మహాకర్ణ-ధృతరాష్ట్ర- బలాహక-కుహర-పుష్పదంష్ట్ర, దుర్ముఖ, సుముఖ, శంఖపాల, కపిల, వామన, నహుష, మణి, శంఖరోమాదులు ప్రముఖులు): చూ, సర్పము.

నాగువు, వై. వి. = నాగ: చూ, సర్పము.

నాగోదము, సం. వి. అ. న. ఉదరత్రాణము: చూ, వారవాణము.

నాచికేతుఁడు, సం. వి అ. పుం: చూ, వహ్ని. 1.

నాజూకు, వా. విణ. సున్నితము, నాణెము.

నాట, సం. వి. ఆ. పుం. ఒకానొకరాగము: చూ, స్వరము 2.

నాటకము, సం. వి అ. న. 1. నాట్యప్రధానమై పద్యగద్యాత్మకమైన గ్రంథవిశేషము: (చూ, నాట్యము: చూ, ఉద్ధతము. 2: చూ, వ్యంజకము. 1.) రూపకము-రూపము. (౧. దృశ్యము నాటకము. దీనికే రూపకమని నామాంతరము; ౨. నాటకమనఁగా నాట్యముచేఁ జూపఁబడునది; ౩. నాటకము త్రివర్గ (ధర్మ-అర్థ-కామ) ఫలదము; ౪. నాటకములు వస్తు, నేతృ, రసభేదములచేఁ బదియయ్యె.—నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవాకారము, వీథి, అంకము, ఈహామృగము: (చూ, దశరూపకముల లక్షణములు); ౫. దశరూపకముల లక్షణములలో.—నాటకము.—ఇందుఁ గథప్రఖ్యాతము. ధీరోదాత్తుఁడు నాయకుఁడు. శృంగారవీరరసములలో నొకటి ప్రధానము. ఇతర రసము లంగములు. భారతివృత్తి. సంధులైదును గలవు. 5 మొదలు 10 లోపుగ నంకము లుండవలెను. అంక కథ పరిమితిదినమని కొందఱు వత్సరమని కొందఱు చెప్పుదురు; ౬. నాటకకథను నడిపించువాఁడు సూత్రధారుఁడు; ౭. నాటకములోని భాగములకు "అంక" మనిపేరు; ౮. సర్వనాటకములందుఁ బ్రథమమునఁ బూర్వరంగము, తర్వాతఁ బ్రస్తావనము జరుపవలెనని సామాన్యలక్షణము.) తద్విశేషములు. —౧. నాటకాంగభేదములు.—అథమాసారితక్రియ, ఆవకృష్ట, అవతరణము, ఉత్థానము, గానము, చూలిక; ౨. నాటకపరిచ్ఛేదము. —అంకము, ఉద్ఘాతము, ఆశ్రావణము. ఆశ్వాసము; ౩. విలంబితనృత్యము. — జీవము; ౪. జిక్కిణియనుఆట.—(తె. ప.) జిక్కిణి; ౫. నాట్యము.—ఖంఖ; ౬. నాట్యగతిభేదము.—(తె. ప.)—కోపు, కౌరు, తీరుకు, తీరుపు-తీర్పు, సారె; ౭. నాట్యబంధము.—(తె.ప.)—కంట, కట్టరము—కట్టారము; ౮. నాట్యతృతీయసంధి—గర్భము; ౯. నాట్యచతుర్థసంధి.—అవమర్శము; ౧౦. నాట్యచతుర్దశాంగభేదము.—అయారము, కలాసకము, కితువు, ఖర్వత్వము, చలి, చాల, చాలి, తూకము. (తె. ప.)—కలానికి. ౧౧. ముఖము మొదలగు రెండు సంధులయొక్క అంతర్భాగము: అంగము, (మిగతవానికి: చూ, వ్యంజకము. 1.) పుం. న. 2. నాటకగ్రంథముయొక్క నాట్యము: వై. వి.

(1) = నాట్యము-నర్తక-నర్తనము ఆట. పాండు. 4, ఆ. 77: చూ, విలాసము. 1; (2) ప్రవర్తనము. ఉ, హరి. 2,ఆ. 70: చూ, సమయము. 2.

నాటకసంధులు, అం. (సంధులు) ముఖము, ప్రతిముఖము, గర్భము, విమర్శము, నిష్ఠ.

నాటకసాల, మి. వై. వి. = నాట్యశాల. ఆటపట్టు. స్వా. 5, ఆ. 63: చూ, సదనము. 1.

నాటామ్రము, సం. వి. అ. పుం: చూ, తిమిటము.

నాటిక, అం. (4 అంకములు. పాత్రభేదముచే ప్రకరణిక వంటిది): చూ, నాటికలు.

నాటికలు, అం. ఇవి ౧౮.— నాటిక, త్రోటిక, గోష్ఠి, సత్తకము, నాట్యరాసకము, ప్రస్తావనము, ఉపలాస్యము, కావ్యము, ప్రేంకణము, రాసకము, సల్లాపకము, శృగాదితము, శిల్పకము, విలాసిక, దుర్మల్లిక, ప్రకరణిక, హల్లీసకము, భాణికము.

నాఁటిది, వా, వి: చూ, ఆతుది.

నాటివెడలు, వా. అ. క్రి: చూ, ఉచ్చు. 2.

నాటు, దే. వి. 1. నాఱులోనగువానిని నాటుట; నాట్నము; 2. నాటుట; అ. క్రి. 3. గ్రుచ్చుకొను. భార. ఉద్యో. 4, ఆ. 467: చూ, స్థిరపడు; స. క్రి. 4. నాఱులోనగు వాని స్థాపించు: చూ, మొలవేయు; అం. ప్రే. 5, గ్రుచ్చు. ఉ, హరి. 3, ఆ. 60: చూ, మొలవేయు

నాటుకొను, దే. అ. క్రి: చూ, నాటు. 3. (ప్రే. నాటుకొలుపు. అచ్చ. సుం, కాం. 91.)

నాటుపురము, వా. వి. పల్లెటూరు.

నాట్నము, దే. వి: చూ, నాటు. 1.

నాట్యభేదములు, అం. నృత్తము నృత్యము నను రెండును నాట్యభేదములే.

నాట్యము, సం. వి. అ. న. = నట్టువ. 1. నృత్యము (నాట్యము మృదుమధురమైనచో "లాస్యమని" ఉద్ధతమైనచో "తాండవమని" చెప్పుదురు): చూ, తాండవము: చూ, లాస్యము: (చూ, వ్యంజకము. 1: చూ, నాటకము. 1); (నాట్యమునకు భరతసూత్రము లాధారములు. కాఁబట్టియే నాట్యమునకు "భరత"మని పేరువచ్చినది: చూ, భరతము): 2. నృత్త గీత వాద్యముల కూడిక: చూ, తౌర్యత్రికము; అం. 3: చూ, విసరులు.

నాట్యరాసకము, అం. (ఒకంకము, నాట్య, గాన, హాస్య, ప్రణయము లుండవలె): చూ, నాటిక.

నాట్యశాల, సం. వి. అ. స్త్రీ. = : చూ, నాటకసాల.

నాట్యోపయోగములైన యంగములు, అం. ఇవి 19. — వీనిలో నొక్కొక్కదానికిఁ గల భేదసంఖ్య.— శిరస్సు 17, దృష్టి 18, తారలు 9, పుటలు 9, భృవులు 7, నాసికము 6, గండములు 6, అధరము 6, చిబుకము 8, ముఖము 6, కంఠము 4, హస్తములు 10, వక్షము 3, జఠరము 3, పార్శ్వములు 5, కటి 5, ఊరులు 5, జంఘలు 5, చరణములు 9: (చూ, ఉపవిద్యలు: చూ, అంగము. 9.)

నాడా, వా. వి. 1. సన్ననినూలుపట్టె; 2. గుఱ్ఱములు ఎడ్లు లోనగువాని డెక్కలకు వేసెడు ఇనుపముక్క.

నాడి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, నరము (1): (చూ, నాడులు); 2: చూ, నాడిక; 3. = నారి. నారికుఱుపు: చూ, వ్రణము; 4. ఈనె: చూ, పర్వరీణము; 5. కూరకాడ: చూ, శాకము. 1; 6. తెల్లగఱిక: చూ, హరిత: (చూ, తృణము. 1.); 7. మోసకాని నడక.

నాడింధముఁడు, సం. వి. అ. పుం: చూ, స్వర్ణకారుఁడు.

నాడిక, సం. వి. ఆ. స్త్రీ. 1. గడియకాలము: గడియ - గడె. (సం. ప.) ఘటిక, నాడి; (మిగతవానికి "విఘటిక" చూడుము.) వై. వి. (1) రూ-నాడు-నాజీమ. అచ్చ. అ. కాం. 111: చూ, దేశము.

నాడీచరణము, సం. వి. అ. న. అగసాలె: చూ, స్వర్ణకారుఁడు.

నాడీదేహుఁడు, సం. వి. అ. పుం. భృంగీశ్వరుఁడు. చూ, శలుఁడు.

నాడీవ్రణము, సం. వి. అ. పుం: చూ, నాడి. 3

నాడు, దే. వి. 1: చూ, దేశము; 2. జనపదము; అ. క్రి. 3. నాటు, భార. కర్ణ. 2. ఆ. 245: చూ, మొలవేయు; స. క్రి. 4. స్థాపించు, అం, భా. తృ. 122: చూ, స్థిరపడు.

నాడుమొదలు, దే. అవ్య. అప్పటినుండియు.

నాడులు, అం. 1. దేశభేదములనుబట్టి రాఁబడిన బ్రాహ్మణాది వర్ణములకు గలిగిన పేళ్లు. (వెలినాడు, ములకనాడు, కాసలనాడు, తెలనాడు, వెంగినాడు మొ.): 2. మండలములోని అంతర్భాగములనుబట్టి ఆ యా భాగములకు రాఁబడిన పేళ్లు. (చాగలునాడు, పోలునాడు మొ.): (చూ, దేశములు); 3 ఇవి 10 — నాసికాద్వారములు, నేత్రద్వారములు, కర్ణద్వారములు, శంఖినీనాడి. గుదనాడి, బ్రహ్మనాడి, సుషుమ్ననాడి; (దశవిధనాడుల వివరము. — ౧. ఇడానాడియన చంద్రనాడి (ముక్కునకు ఎడమభాగముననుండును. శివుఁడు అధిదేవత); ౨. పింగళనాడియన సూర్యనాడి (ముక్కునకు కుడిభాగమున నుండును. విష్ణువు అధిదేవత); ౩. సుషుమ్ననాడిఅన అగ్నినాడి (ముక్కుమధ్య నుండును, బ్రహ్మ అధిదేవత); ౪. గాంధారినాడి (కుడినేత్రమందుండును. ఇంద్రుడు అధిదేవత); ౫. అస్తినినాడి (నాలుకయందుండును. ఎడమనేత్రమందును ఉండును. వరుణుఁ డధిదేవత); ౬. పుషానాడి. (కుడిచెవియందుండును. దిగ్దేవత అధిదేవత); ౭. పయస్వినినాడి (ఎడమచెవియందుండును. బ్రహ్మ అధిదేవత); ౮. అలంబననాడి (శిశ్నమందుండును. అగ్ని అధిదేవత); ౯. లకుహూనాడి. (గుదస్థానమందుండును. భూమి అధిదేవత); ౧౦. శంఖినినాడి (నాభిస్థానమున నుండును. చంద్రుఁడు అధిదేవత); (శరీరమునందు మజ్జా తంతువులు (నాడులు) దాదాపుగ 700 కలవు.)

నాడె, దే. వి. నడుమ నూలికండె నుంచెడు నాడా: తొట్టియ-తొట్టె - తొట్టెనాళ. (సం. ప.)—ఉవర. తంతుకాష్ఠము. తురి, తుర్య.

నాణకము, సం. వి. అ. న. = నాఁడెము. రూపాయలోనగు నాణెము. ఆహతము. (తె. ప.)— నాణెము: (చూ, లోహము. 1.)

నాణము, వా. వి. మాంసరసము. అం, భా. ద్వి. 252.

నాజీమ, దే. వి: చూ, దేశము.

నాజేయము, వై. వి. = నాణక : చూ, రూ- నాణెము.
నాణెకత్తె, వై. విణ : చూ, రూ- నాఁడెకత్తె.
నాణెకాఁడు, వై. విణ. 1. కోమటి. సాంబ. మా. 2 ; చూ, వెన్యఁడు; 2 : చూ, నాఁడెకాఁడు.
నాణెము, వై. వి. = నాణక. (రూ-నాణేయము - నాఁడెము.) 1. శుద్ధదీనారము ; చూ, లోహము. 1; 2. ముద్రింపఁబడిన రాగి వెండి బంగారముల బిల్ల : చూ, లోహము 1; 3. ఇచ్చి పుచ్చుకొనుటయందలి యోగ్యత; 4. నాగరికత; 5. యోగ్యతాయోగ్య పరిశీలనము : చూ, శ్రేష్ఠత; 6. మంజులము : చూ, హృద్యము.
నాతము, దే. వి. బత్తెము. రా, వి. 2, ఆ. 34 : సంబళము.
నాతి, దే. వి రూ- నాతుక. ఆఁడుది : చూ, స్త్రీ. 1.
నాతుక, దే. వి. (నాతి+ఉక) ; చూ, రూ - నాతి.
నాతోడు, జా. నాయాన. నాపైఒట్టు, నన్ను చంపుకొనితిన్నట్టు. "నీ నెచ్చెలితోడ నుమ్మ సఖి నిక్కము చెప్పుము." (ప్రభావతీ. 1, ఆ. 8.) "కఁయట్లు చెప్పుమీ కల్లలాడిన నీకు నాతోడ నుమ్ము ప్రాణసఖివీవు" (ప్రభావతీ. 3, ఆ. 67.)
నాదత్తముపతిష్ఠతే, న్యా. పూర్వజన్మమునఁ బెట్టకున్న నీ జన్మమున రాదు. ఈ విషయము నీక్రింది శ్లోకమున గమనింపనగు. "శ్లో॥ ద్వారంద్వార మటఁ భిక్షు శ్శిక్ష త్యేవం నయాచతే। అదత్వా మాదృశో మాభూ ద్దత్వా త్వం త్వాదృశో భవ"॥
నాదము, సం. వి. అ. పుం. = నాదు. 1. ధ్వని, మ్రోఁత : చూ, స్వరము. 2; అం. 2. ఆహతము - అనాహతము. అని ద్వివిధము. (ఆహతము.— హరికీర్తనాది రూపముచేత శ్రోత్రుశ్రోత్రరంజకమై భవభంజకమై యున్నది. ఈ యాహతనాదమునకే స్థానభేదములనుబట్టి 22 భేదములు గలవు. అవే వినఁబడునవి గనుక శ్రుతులనుపించుకొనినవి; చూ, ఉచ్చారము. ), అనాహతము (ప్రాణాగ్ని సంయోగ రూపమైనది); (నాదమనఁగా వ్యాకరణప్రకారము = మ్రోఁగెడి అస్ఫుటధ్వని యని తాత్పర్యము. మంత్రవ్యాకరణ ప్రకారమైనచో.—న = ప్రాణము, ద = అగ్ని, ప్రాణాగ్ని సంయోగరూపమైనది గనుక నాద మనిపించుకొనినది.) : చూ, స్వరము. 2; 3 : చూ, అష్టాదశపదార్థములు.
నాదములు, అం. (దశవిధనాదములు) జల, భేరీ, మద్దెల, మృదంగ, ఘంటా, కాహళ, కింకిణీ, వేణు, భ్రమర, ఓంకారనాదములు.
నాదాంతరి, అం : చూ, భాషాంగములు.
నాదారు, వా. వి. 1. నిప్పచ్చు, : చూ, బీదతనము; 2. పీల; 3. పొట్టి; 4. శక్తిలేమి; విణ. 5. చిక్కినది; 6. పీలది.
నాది, దే. వి. నాసంబంధమైనది.
నాదించు, సం. అ. క్రి. మ్రోఁగు. శశాం. 5, ఆ. 53 : చూ, శబ్దించు.
నాదు, వై. వి. = నాదః. శబ్దము, ధ్వని. సా. 2, ఆ. 98; చూ, స్వరము. 2.
నాదేయము, సం. వి. అ. పుం. 1. కైవడిముత్తె*. చూ, ముక్తకము; 2. నీర్వుబ్బు*: చూ, ప్రబ్బలి; విణ. 3. నదీ సంబంధమైనది.
నాదేయి, సం. వి. ఈ. స్త్రీ. 1. కిత్తలి*. చూ, శర్కరాంకము; 2. నారదబ్బ*: చూ, శర్కరాంకము; 3. తక్కలి*: చూ, వైజయంతి; 4. దాసనము *: చూ, హయజీవన మారకము; 5: చూ, నాదేయము. 2*; 6. కాకినేరేడు (నేలనేరేడు)*: చూ, లికుచము. (నాగరంగపు చెట్టు అని కొందఱు.)
నాధము, సం. వి. అ. పుం: చూ, ముకుక్రాఁడు.
నాధవంతుఁడు, సం. విణ. చూ, పరాధీనుఁడు.
నాథుఁడు, సం. వి. అ. పుం. 1. పెనిమిటి: చూ, భర్త. 1; 2. ఱేఁడు, ప్రభువు: చూ, స్వామి. 1; 3. ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు.
నాన, వై. వి. = జ్ఞాన: చూ, సిగ్గు. భార. అది. 3, ఆ. 137.
నానఁబ్రాలు, దే. వి: చూ, నానబియ్యము.
నానగండ, వై. విణ. సిగ్గుమాలినవాఁడు. పాండు. 5, ఆ. 179.
నానబియ్యము, దే. వి. నానఁబెట్టిన క్రొత్త చేరుడు బియ్యము: చూ, బియ్యము.
నానాఁడు, దే. వి. రూ-నాఁడునాఁడు. చూ, ప్రతిదినము.
నానాప, వై. వి. = : చూ, నాకబలి.
నానాపసాని, వై. వి: చూ, రూ-నాగపసాని.
నానారూపము, సం. విణ. పలుతెఱంగులుగలది: చూ, వివిధము.
నాను, దే. వి. 1. నానుక్రోవి: చూ, భూషణము. 2 ; అ. క్రి. 2: చూ, ఊరు. 6.
నానుక్రోవి, దే. వి: చూ, నాను. 1.
నానుచు, దే. ప్రే. 1: రూ-నాన్చు. నానఁజేయు. పాండు. 3, ఆ. 191.
నానుడి, దే. వి (నాను+నుడి) 1. లోకోక్తి, గాలిమాట: చూ, శబ్దము. 2; 2. సామెత. సా. 2, ఆ. 258; చూ, శబ్దము. 2.
నానుఁడు, దే. విణ. 1.—పై.—; 2. తడిసినది.
నానుఁబువాన, దే. వి. విడువకకురిసెడు పొడిపొడి చినుకుల వాన: చూ, వాన. 1.
నానుపు, దే. ప్రే. (బట్ట) చలువచేయు.
నానుబోర, దే. వి. మాంసముగలతొమ్మ: చూ, వక్షము.
నానృతాత్ పాతకంపరమ్, న్యా. అనృతముకన్న పాతకములేదు.
నానృషిఃకురుతేకావ్యమ్, న్యా. ఋషిగానివాఁడు కావ్యమును రచింపఁజాలఁడు.
నానేఁత, వా. వి, ఆలస్యము: చూ, విలంబము. 1.
నానొడి, వా. వి: చూ, రూ-నానుడి. అం, భా. ప్ర. 111.
నానోడు, వా. వి.—పై.—
నాన్చు, దే. ప్రే: చూ, రూ-నానుచు.
నాన్తైల, దే. వి: చూ, భక్ష్యము.
నాన్న, దే. వి. రూ-నాయన. 1. తండ్రి: చూ, సవిత్రుఁడు. 2; 2. పూజ్యుఁడు: చూ, మహనీయుఁడు: వా. 3. (శూద్రులలో) అన్న; 4. (శూద్రులలో) మేనమామ.
నాప, వై. వి. = : చూ, నాకబలి.
నాపసాని, వై. వి: చూ, రూ-నాగపసాని.
నాపితుఁడు, సం. వి. ఋ. పుం; చూ, మంగలి.

నాభాగ్యము దేవరచిత్తము, లో. దయతోఁగూడిన లాభము. "మామకస్వాంతవీధి, చెలువభాగ్యంబు దేవరచిత్త మధిప." (పాంచా).

నాభి, సం. వి. ఇ. స్త్రీ. 1. కస్తూరి: చూ, మృగమదము; పుం. స్త్రీ. 2: చూ, బొడ్డు. 1; పుం. 3. విషవిశేషము; వత్సనాభి: చూ, వసనాభి; 4. బండికంటి నడిమితూము: చూ, పిండిక. 1; 5. తిలకము, చూ, బొట్టు. 1; 6. క్షత్రియుఁడు: చూ, రాజు. 1; 7. చక్రవర్తి: చూ, రాజు. 1; పా. 8. దీనికి ఉపమానములు—పొన్నపువ్వు, సుడి, మడుగు, నూయి, చక్రము; అం. 9. పురుషలక్షణాంగములలోనొకటి, (బొడ్డు) (దక్షిణావర్తమై వర్తులమై యతిగంభీరమైనఁ బ్రశస్తము. వామావర్తమై మిక్కిలి లోఁతుగలిగిన పాపాత్ముఁడగు. ఉత్తానవిరళమైన దుఃఖప్రదము.): చూ, లక్షణాంగములు; 10. స్త్రీలక్షణాంగములలో నొకటి. (బొడ్డు) (లోఁతుగనున్న పూజ్యురాలగు. ఏటిసుడివలె దక్షిణావర్తమైన రాజపత్నియు, పుత్త్రవతియు, పతిప్రియయు, భోగియునగు. ఎడమసుడియైన చచ్చుబిడ్డలు కలదియగు. లోపల సుడియున్న జారయగు. బొడ్డుకు కొంచెముక్రింద కుంకుమగర్భితమై పద్మసమమగు చిన్నెయున్న మన్నెవాని యన్నుమిన్నయగు): చూ, స్త్రీలక్షణాంగములు; 11: చూ, అధమక్షేత్రములు 12: చూ, కళలుండు స్థలములు; 13: చూ, హస్తక్షేత్రములు; 14: చూ, చుంబనస్థానములు; 15: నాభిశుద్ధి. — గోమూత్రములో 3 రోజులు నానవైచి యెండించిన శుద్ధి(7 రోజులనికొందఱు).

నాభిజన్ముఁడు, సం. వి. న్. పుం. పొక్కిలిచూలి: చూ, బ్రహ్మ. 1.

నామకరణము, సం వి. అ. న. 1. బిడ్డలకు పేరుపెట్టుట; అం, 2: చూ, కర్మములు.

నామకా, వా. క్రి. విణ. స్వతంత్రము లేకుండఁగ.

నామగుంట, ద్వ. వి. (నామము + గుంట) గళగర్తము: చూ, రోగము. 1.

నామధేయము, సం. వి. అ. న: చూ, పేరు. 1.

నామమడచు, మి. స. క్రి. చంపు. భార. స్త్రీ 2, ఆ. 54: చూ, సంహరించు.

నామము, సం. వి న్. న. 1: చూ, నామధేయము; (సృష్టిలో మొదట చెట్లపేర్లు భూసారమునుబట్టి పుట్టెను. తరువాత సరీసృపములు జంతువులపేర్లు చెట్లసారమునుబట్టి పుట్టెను. పిదప గ్రామముల పేర్లు సరీసృపములయొక్కయు జంతువుల యొక్కయు పేర్లనుబట్టి పుట్టెను. తదుపరి గ్రామనామములు యింట్ల పేర్లయ్యెను. వీనియందెన్నియో విశేషాంశములు పుట్టెను. దీనికంతకును ప్రత్యేక నిఘంటువు ఈ నిఘంటుకర్తచే వ్రాయఁబడినది, వ్రాయఁబడుచున్నది.): చూ, ఇంటిపేరు. వా. 2. (నామము) పేరునకుఁ బ్రాతిపదికమని సంజ్ఞ. "రామ, కృష్ణ" మొ; దే. వి. (1) నొసట పెట్టుకొనెడుబొట్టు: చూ, బొట్టు. 1.

నామములు, అం: చూ, పదములు.

నామరులు, దే. వి. బ. పాచికలు: చూ, వ్యవహారము. 4.

నామర్దా, వా. వి. అగౌరవము.

నాము, దే. వి. జొన్నలోనగువాని కొయ్యగాఱన చిగిరించిన మొలక: చూ, మొక్క. 1.

నామూషీ, వా. వి. అవమానము.

నాయంకరము, ద్వ. వి. (నాయకుఁడు + కరము): చూ, ప్రభుత్వము.

నాయఁకవాడి, ద్వ. వి. పంటపరామరికచేసెడు దివాణపుబంటు. రూ-నాయఁకవాళి: చూ, మహసూలుదారు.

నాయఁకవాళి, —పై.—

నాయకుఁడు. వై. వి. 1. ప్రభువు: చూ, స్వామి. 1; 2. పన్నిద్దఱు భటుల కధిపతి: చూ, స్వామి. 1.

నాయఁడు, వై. వి. 1. శూద్రవిశేషము: చూ, శూద్రుఁడు; 2. = నాయకః. ప్రభువు: చూ, స్వామి. 1; 3. బలిజెలోనగువాని పట్టపుఁబేరు.

నాయకగుణములు, అం. కావ్యలక్షణంబున — మహాకులీనత, మహాభాగ్యము (పరిపాలన), ఔజ్జ్వల్యము, ఔదార్యము (దాతృత్వము), తేజస్విత (పరాక్రమ), ధార్మికత, వైదగ్ధ్యము (నేర్పు), పాండిత్యము (విద్యావివేకము) మొ. వీరికిఁదగిన నాయికలు సాధారణముగ ముగ్గురు: చూ, స్వీయ, అన్య, సామాన్య. (ఈ గుణములన్నియు పూర్తిగా గలవాఁడుత్తముఁడు. కొన్నియె కలవాఁడు మధ్యముఁడు. చాల తక్కువగలవాఁడధముఁడు.)

నాయకత్రయము, అం. దేవనాయకుఁడు, మనుష్యనాయకుఁడు, ఉభయనాయకుఁడు. (3).

నాయకనర్మసచివులు, అం: చూ, నాయకసఖులు.

నాయకము, సం. వి. అ. పుం. పతకము నడిమి రత్నము: చూ, భూషణము. 2.

నాయకసఖులు. అం. విటుఁడు, విదూషకుఁడు, పీఠమర్దుఁడు, చేటుఁడు. (4).

నాయకస్వరూపము, అం. కీర్తిప్రతాపసుభగత్వము, ఆర్తావనత్వము, సుగుణాఢ్యత్వము, భూభరణధురీణత్వము, కావ్యగీతప్రియత్వము. (5).

నాయకుఁడు, సం. వి. అ. పుం. 1. = నాయఁడు. అధిపతి: (చూ, నాయకులు): చూ, స్వామి. 1; 2. శృంగారరసావలంబనపురుషుఁడు: (చూ, నాయకులు); విణ. 3: చూ, శ్రేష్ఠుఁడు; వై. వి. (1). = నాయక. అధిపతి: చూ, స్వామి. 1. (పురుషోత్తమకవీయము.)

నాయకులు, అం. 1. సర్వరససాధారణులయిన నాయకులు నల్వురు.— ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరశాంత, ధీరలలిత (4). (ధైర్యముగలిగి శాంతుఁడై సర్వమెఱింగి దయాశాలియైన వాఁడు ధీరోదాత్తుఁడు, గర్వాసూయాదంభమాయాక్రోధాదులు గలవాఁడు ధీరోద్ధతుఁడు, ప్రసన్నాత్ముఁడు ధీరుఁడు శాంతుఁడునైనవాఁడు ధీరశాంతుఁడు, నిశ్చింతుఁడు విద్యాసక్తుఁడు సుఖియైనవాఁడు ధీరలలితుఁడు); 2. శృంగారనాయకులు నల్వురు. — అనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు (4): (చూ, ఉపనాయకులు) [అనుకూలుఁడు.— ఒకేనాయికయం దాసక్తుఁడు; దక్షిణుఁడు— అనేకనాయికలయందు సమస్నేహవర్తి: ధృష్టుఁడు.— పరస్త్రీగమనాదులచేఁ దప్పుచేసియు నిర్భయుఁడు; శఠుఁడు..

నాయికామాత్రవిదితవిప్రియకారి: (చూ, పతులు): 3. ఉపనాయకులు నల్వురు — పీఠమర్దుఁడు, విటుఁడు, చేటుఁడు, విదూషకుఁడు: (చూ, నాయకసఖులు. ఉపనాయకులు.)

నాయన, దే. వి. (నా + అన్న): చూ, రూ-నాన్న.

నాయనమ్మ, వా. వి. తండ్రితల్లి: చూ, పితామహి.

నాయభారము, వై. వి. = న్యాయభారః. 1. సత్యమును వహించుట; 2. రాజీకిఁబ్రయత్నించుట.

నాయవారి, వై. వి. = న్యాయభారి. సత్యదూత.

నాయము, సం, వి. అ. పుం. 1. ప్రాపణము: చూ, లాభము. 1; 2. నీతి: చూ, సత్యము. 1; వై. విణ. (1) = న్యాయః, న్యాయయుక్తము: చూ, సత్యము. 1.

నాయిక, సం. వి. ఆ. స్త్రీ. శృంగారరసావలంబనస్త్రీ: చూ, స్త్రీ.

నాయికలు, అం. వివిధశృంగార రమణీయులైన రమణీమణులు స్వీయ, పరకీయ, సామాన్యలను ముత్తెఱంగులయియుండిరి అందు స్వీయ పదుమూఁడు, పరకీయ రెండు, సామాన్య యొక విధములవుటచేఁ బ్రధాననాయికలు పదునార్వురైరి. అవస్థాభేదంబుచే శృంగారనాయిక లష్టవిధములైరి. ౧. స్వాధీనపతిక (ప్రియునిం దనకు వశపఱచుకొన్నది): ౨. వాసవసజ్జిక (పతి వచ్చువేళకు శయనాదు లంకరించునది); ౩. విరహోత్కంఠిత (నాయకుఁడు వేళకురాకున్నఁ దపించునది); ౪. విప్రలబ్ధ (సంకేతస్థలమునం బ్రియునింగానక కలఁగునది); ౫. కలహాంతరిత (ముందు కోపముచేఁ బతిని విడనాడి పిదపఁ బశ్చాత్తాప పడునది); ౬. ఖండిత (ప్రియుఁడు పరస్త్రీనిఁగూడిన చిన్నెలఁజూచి కోపించునది); ౭. ప్రోషితభర్తృక (పతి పరదేశమున నుంటచేఁ బరితపించునది); ౮. అభిసారిక (ప్రియునిఁగూర్చి సంకేతస్థలమున కేగునది) (వీరికి దూతి, దాసి, సఖి, చేటి, ధాత్రేయి, ప్రాతివేశిని, లింగిని, శిల్పిని యనువారు సహాయులు)(ధాత్రేయి= దాదికూఁతురు. ప్రాతివేశిని = పొరుగింటిది. లింగిని = సన్యాసిది. శిల్పిని = ముచ్చిది.)

నాయికాత్రయము, అం. స్వీయ, పరకీయ, సామాన్య (3).

నార, దే. వి. 1. నడితడప, చీల్చిన తాటిమట్ట లోనగునది: చూ, శల్కము 2; 2. జనపనారపీఁచు: చూ, శల్కము. 2; 3. కూరమీఁదిపీఁచు, కడంబము: చూ, శల్కము. 2; 4. కొబ్బరి, ఈఁత, మొగలి, గోఁగులోనగువాని పీఁచు: చూ, శల్కము. 2; 5. చెట్టుమీఁదిపట్ట, వల్కలము. భార. అర. 2, ఆ. 326: చూ, వల్కలము: (చూ, బెరడు).

నారంగడు, సం. వి. అ. పుం. 1: చూ, విటుఁడు; 2. = నరకుఁడు. దుష్టుఁడు: చూ, వ్యాఘుఁడు. 2.

నారంగము, సం. వి. అ. పుం. 1. నారింజ*: చూ, శర్కరాంకము; 2. కంచెఊడ*: చూ, శర్కరాంకము; బ. 3. అమడబిడ్డలు: చూ, యమళశిశువులు; 4. పిప్పలిరసము.

నారకము, సం. వి. అ. పుం: చూ, రూ-నరకము.

నారచీర, దే. వి. పొత్తిచీర.

నారద్దము. సం. వి. అ. పుం. కీటికనేల, విపీతము: చూ, భూమి. 1.

నారణపక్కి, వై. వి. = నారాయణపక్షి: చూ, పక్షి.

నారదబ్బ, వై. వి. = నారదము. (దేశ్యమని శ. ర.): చూ, శర్కరాంకము*.

నారదము, సం. వి. అ. పుం. 1 = : చూ, నారదబ్బ*: 2. = నారింజ*: చూ, శర్కరాంకము. (నారంగతద్భవము నారదమని కొందఱు.)

నారదస్మృతి, అం: చూ, మూలస్మృతులు, స్మృతులు.

నారదీయము, అం. 1: చూ, పురాణములు: 2: చూ, ఉపపురాణములు.

నారదుఁడు, సం. వి. అ. పుం. ఒకానొక దేవముని: చూ, ముని. 1.

నారపంటలు, అం. ప్రత్తి, గోఁగు, జనుము, కిత్తనార మొ.

నారమడి, దే. వి. నారతోనేసినబట్ట, ముకుటము-ముకుటము: చూ, వస్త్రము.

నారము, సం. వి. అ. న. 1. నరులగుంపు; 2: చూ, రూ—నారాచము. 1; పుం. 3. అప్పుడుపుట్టినదూడ: చూ, ధేనువు; బ. 4. నీళ్ళు: చూ, సలిలము.

నారవేళ్లు, దే. వి. బ. ఏకబీజదళ వృక్షములవేళ్లు (కొబ్బరి, తాటి, ఈఁత, వరి, చోడి, జొన్న లోనగువానివేళ్లు): చూ, వేరు. 1.

నారసము, వై. వి. = నారాచము: చూ, బాణము. 1.

నారసింహాయనమః, అం. (నరసింహః = అన్యేన నరీయతే నక్షీయత ఇతి చతుర్విధ నాశరహిత ఇత్యర్థః): చూ, ఓమ్.

నారసింహీయము, అం: చూ, ఉపపురాణములు.

నారాచము, సం. వి. అ. పుం. 1. = నారాసము. నారము, అచ్చము ఇనుప బాణము, ప్రక్ష్వేడనము: చూ, బాణము. 1; 2. నీటి యేనుఁగు: చూ, హస్తి; అం. 3: చూ, ముప్పదిరెండాయుధములు: (చూ, బాణము. 1); అం. 4. ఒకానొక వృత్తము. ఒక్కొక్కపాదము తగణ, రగణ, వగణములు గలదై యెనిమిదవ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము: చూ, వృత్తము. 1.

నారాచి, సం. వి. ఈ. స్త్రీ. 1. బంగారునఱకెడు కొఱముట్టు: చూ, సానము. 2. ఆరాచి, తీక్షణి-ఏషణిక, అగసాలెవాని ఇనుపత్రాసు (అనికొందఱు).

నారాజి, దే. వి: చూ, రూ-నరాజి.

నారాజీ, —పై.—

నారాయణపక్షి, సం. వి. న్. పుం. = : చూ, నారణపక్కి.

నారాయణబలి, పా. సన్యాసికిఁజేయు శ్రాద్ధము (పరిషత్తు).

నారాయణము, వా. వి. తైత్తిరీయమను వెదభాగమునం దొక పన్నము.

నారాయణాస్త్రము, అం: చూ, అస్త్రములు.

నారాయణస్వాహా, అం. (నారాయణః = నారస్య - జ్ఞానస్య - ముక్తేర్వా-అయనం ప్రాప్తిః = (రేఫాత్ పరనకారస్య ణత్వవిధానాత్ సర్వప్రాణిబుద్ధిగుహానివాసాత్ శుద్ధచైతన్యమిత్యర్థః) : చూ, ఓమ్.

నారాయణి, సం. వి. ఈ. స్త్రీ. 1 : చూ, పార్వతి. 1; 2: చూ, లక్ష్మి; 3 : చూ, శతమూలి*.

నారాయణుఁడు, సం. వి. అ. పుం. (రూ-నారయాణుఁడు - నరాయణుఁడు - నరాయుఁడు) (౧ అవతారపురుషుఁడు,

౨ ఉదకమందు స్థానము, ౩ నరసమూహమున కునికిపట్టు ౪ నరసమూహమునివాసము, ౫ శబ్దగమ్యుఁడు, ౬ సారూప్య ముక్తికి స్థానము, ౭ తొంబదియాఱు తత్వములకు స్థానము, ౮ ఒక మన్వంతరమున నరుఁడనుఋషికిఁ గుమారుఁడు.) 1. వెన్నుఁడు : చూ, విష్ణువు. 1; 2 : చూ, సూర్యుఁడు; 3. చంద్రుఁడు : చూ, హిమాంశువు; 4. నలువ: చూ, బ్రహ్మ. 1; 5 : చూ, శివుఁడు; 6. అగ్ని : చూ, వహ్ని. 1; 7 : చూ, అశ్వమేధిని; 8. ఆవు : చూ, ధేనువు.

నారి, సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుది : చూ, స్త్రీ: వై. వి, (1)=నాడి : చూ, నరము; (2)=నాడి. నారికుఱుపు : చూ, వ్రణము; దే. వి. (3) వింటియల్లెత్రాడు : చూ, మౌర్వి. 1.

నారింజ, వై. వి. = నారంగ *: చూ, శర్కరాంకము.

నారికడము, వై. వి.= చూ, స్కంధఫలము:1.

నారికాయ, దే. వి. అల్లెత్రాటి తాఁకుడువలన చేతఁగలిగిన కిణము: (చూ, కిణము. 1-2.)

నారికుఱుపు, ద్వ. వి. సెలపుండు : చూ, వ్రణము.

నారికెడము, వై. వి.= : చూ, నారికేళము*.

నారికేడము, —పై.—

నారికేళము, సం. వి. అ. పుం. =నారికడము - నారికెడము- నారికేడము. (రూ- నారికేళము - నారికేళి-నారీకేళి - నాళీకేరము - నాడికేరము - నాళికేరము - నారికేరము) టెంకాయ* : చూ, స్కంధఫలము.

నారికేళతృణన్యాయము, న్యా. కొబ్బరిచెట్టెందులకెక్కితివన దూడగడ్డికై యెక్కితినను రీతి.

నారికేళపాకము, అం. 1. పాకములు 2 లో నొకటి. (మిగుల కఠినమై యభేద్యమైనది.) : చూ, పాకములు: (చూ, ద్రాక్షాపాకము); 2. పాకములు 4 లో నొకటి : చూ, పాకములు: (చూ, వృత్తులు.)

నారికేళఫలాంబున్యాయము, న్యా. "సిరి దా వచ్చిన వచ్చును సలలితముగ నారికేళసలిలముభంగిన్."

నారికేళాంజనము, అం : చూ, అంజనములు.

నారికేళాంబున్యాయము, న్యా. కొబ్బరికాయలోనికి నీరెట్లు వచ్చినది తెలియదనినరీతి.

నారీ, అం.ఒకానొకవృత్తము. ఒక్కొక్కపాదమునకు ఒక మగణముగలదై మూఁడవ ఛందస్సునందుద్భవించిన వృత్తము: చూ, వృత్తము. 1.

నారీనుతము, అం ఒకానొకవృత్తము. ఇది పదునొకండవ త్రిష్టుప్ఛందస్సునందలి శాలినీవృత్తచ్ఛాయను బేసిపాదములున్న' ఇంద్రవజ్రచ్ఛాయను సరిపాదములున్ను నడచును; చూ, వృత్తము. 1.

నారు, దే. వి , చూ, రూ- నాఱు.

నారుచు, దే. ప్రే. నాడఁజేయు : నార్చు.

నారు౧, —పై.—

నాఱు, దే. వి : 1. రూ-నారు, ఆకు, కోఁగు. (సం ప)— అంకురాళి.తద్వి- ౧. విత్తులుపల్లుట. అంకురార్పణము. ౨. శుభకార్యములందు నవధాన్యములు పల్లుట; అంకురార్పణము.

నాఱునాటు, దే. స. క్రి : చూ, మొలపేయు.

నాఱునాటుట, దే. వి. : ఊడ్పు - ఊడ్పు.

నాఱుపోయు, దే. స. క్రి ; ఆకుపోయు.

నాలము, వా. వి : చూ, లావము.

నాలవకోఁమువాఁడు, ద్వ. వి : చూ, శూద్రుఁడు.

నాలాయకు, వా. వి. లాయఖులేని.

నాలి, దే. వి. 1. కుత్సితప్రపని. స్కా. 3, ఆ. 51 : చూ, వంచన; విణ. 2. కుత్సితము: చూ, హీనము. 1; 3. మందము, ఆలస్యము : స్కా. 3, ఆ. 28 : చూ, విలంబము. 1; 4. తక్కువైనది : చూ, హీనము. 1.

నాలిక, దే. వి : చూ, రసన, జై. 7, ఆ. 100.

నాలికచేఱు, ద్వ. వి. 1. తృణవిశేషము : చూ, తృణము. 1; 2 : చూ, పశురోగము.

నాలికతీపు లోనవిషము, లో. ఉదా.—ఆజిత్తులమారి మృగము యొక్క తేనెమాటలకు మోసపోయితివి. నాలికతీపు లోన విషమని యెఱుంగుమనా" (నీతిచంద్రిక - మిత్రలాభము.)

నాలికలు, దే. వి. బ. సర్పజిహ్వలు. రూ- నాలికలు.

నాలికి, వా. వి, వల్లకి. రూ - నాలకి- నాల్కి; (లాలకి-లాలికి- లాల్కియని వాడుక.)

నాలిగాలి, వా. వి : చూ, చిఱుగాలి.

నాలిజంఘము, సం. వి. అ. పుం. కాకి : చూ, వాయసము.

నాలిబూతము, ద్వ. విణ. 1. కుత్సితుఁడు : చూ, వ్యాధుఁడు, 2; 2. కుత్సితురాలు : చూ, స్త్రీ.

నాలిముచ్చు, దే. విణ : చూ, నాలిబూతము. 1.

నాలీషు, వా. వి : చూ, నామర్దా.

నాలుక, దే. వి : చూ, రూ- నాలిక.

నాలుకమిగులుట, జా. (మాటమిగులుట) దూషించుట "నాలుక మిగులరానీయకుము" (చిన్నయసూరి నీతిచంద్రిక.)

నాలుకలు, దే వి. బ. 1 : చూ, రూ- నాలికలు భాగ. 4, స్కం. 729: 2. జ్వాలలు. భార. ద్రో. 5, ఆ. 229.

నాలుగాకులెక్కవచదువుట,జా. విశేషాంశంబులుతెలిసియుండుట. "అంతకునాలుగాకు లెక్కువయే చదివితి." (ధర్మజ)

నాలుగు, దే. ప : రూ- నాలువు - నాల్గు - అడ్డ - ఉడ్డ- ఉడ్డా, చవు - చౌ - చవుకము - చౌకము, తిగవంచ - తీవంచ, పుంజీ, మూఁడు నొకటి - మూడునొకటి. (సం. ప.) — అంబుధి, అబ్ధి, చతుర్థము, చతుష్కము, చతుష్టయము, చరమము: (చూ, మూడునొకటి.)

నాలుగుఅంకములు గలవి, అం. అంతఃకరణములు, అగ్నులు, అనుబంధములు, అభినయములు, అలంకారములు, అవస్థలు, ఆశ్రమములు, ఉపవేదములు, ఉపాయములు, కరణులు, కావ్యవృత్తులు (వృత్తులు). క్రతువులు, గ్రీవాభేదములు, జ్ఞాతులు, తార్కికప్రమాణములు, తాళగ్రహములు, దిశలు, దుష్టులు, ద్వారములు, ధనవృద్ధులు, నాయకనర్మసచివులు, నృత్యములు, పతులు, పాకములు, పురుషజాతులు,

పురుషార్థములు, ప్రయోగములు, ప్రాణాయామములు, మనుజ వృత్తులు, ముక్తులు, ముఖరతులు, మేఘములు, యుగములు, యోగములు, రతులు, రథికులు, రాజవిద్యలు, మనుష్య వర్ణములు, వర్జితములు, వాద్యిత్రము, వేదములు, వేదోపాంగ ములు, వ్యూ(హ)హాభేదములు, శుశ్రూషలు, సముద్ర ములు, సాధనములు, సృష్టిభేదములు, సేనాంగములు, స్త్రీజాతులు ఇత్యాది.

నాలుగుకంబాలాట, ద్వ. వి: చూ, బాలక్రీడ.

నాలువు, దే. స: చూ, రూ-నాలుగు.

నాల్క-, దే. వి: చూ, రూ-నాలిక.

నాల్గు, దే. స: చూ, రూ-నాలుగు.

నాల్గుకన్నులవేల్ప, దే. వి. అగ్ని, అచ్చ. బాల, కాం. 54: చూ, వహ్ని. 1.

నావ, సం. వి. ఔ. స్త్రీ = నౌక. 1. తరణి: చూ, హోడము; వై. వి. (1) = నావ. ఓడ: చూ, హోడము.

నావి, దే. వి. సస్యరోగము: ఆవ, చీడ, నట్టు.

నావికుఁడు, సం. వి. అ. పుం: చూ, సరంగు.

నావిష్ణుఃపృథివీపతిః, న్యా. విష్ణువుగానివాఁడు రాజుగాఁడు. లేక రాజునరయూపుఁడగు విష్ణువు.

నావురు, వై. వి: చూ, రూ-నాఁగురు*.

నావ్యము, సం. విణ. ఓడచేత దాఁటఁదగినది. (నద్యాదులు).

నాశకుఁడు, సం. విణ: చూ, తుట్టు. 2.

నాశము, సం. వి. అ. పుం. 1. చేటు: చూ, రుత్త; 2. కఁబడమి; 3. అనుభవములేమి; 4: చూ, మరణము; అం. 5: చూ, ధనగతులు.

నాశిలు, సం. అ. క్రి. నవయు: రూ-నాశిల్లు. (తె. ప.) అం. వి. ప(వ)డు.

నాశిల్లు, సం. అ. క్రి. —పై.—

నాస, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, ముక్కు. 1; 2; చూ, లచ్చి కమ్మి; 3. ఆవ*: చూ, సర్షపము.

నాసత్యులు, సం. వి. అ. పుం. ద్వి అశ్వినీదేవతలు (అసత్యము లేనివారు.)

నాసాభరణము, సం. వి. అ. న. అడ్డబాస, ముక్కర: చూ, భూషణము. 2.

నాసామణి, సం. వి. ఇ పుం. —పై.—

నాసి, దే. వి. పిల్లి: చూ, మార్జాలము.

నాసిక, సం. వి. ఆ. స్త్రీ 1: చూ, ముక్కు; 2. దీనికి ఉప మానములు.—తిలపుష్పము, సంపెంగపువ్వు, కోఁకురు: అం. 3: చూ, చుంబనస్థానములు; పురుషలక్షణాంగము లలో నొకటి (ముక్కు) (చిలుకముక్కువలెమన్న రాజగు దీర్ఘమైన భోక్తయగు. హ్రస్వమైన ధర్మశీలుఁడగు): చూ, లక్షణాంగములు; స్త్రీలక్షణాంగములలో నొకటి. (ముక్కు) (సమముగనున్న పతిని సంపన్నునిఁజేయును. నువ్వుపువ్వు వలెను సంపెంగపువ్వువలెనున్న సుఖవతియగు. కుడిసుడి యున్నధనవృద్ధియుఁ బుత్త్రవృద్ధియునగు.ఎడమసుడియున్న విధవయగు. మచ్చయున్న హానియగు. ఊర్ధ్వమైనను హ్రస్వమైనను దాసియగు. దీర్ఘమైన కోపియగు. లంబమైన స్వప్రశస్తురాలగు. మిక్కిలి పొడవు మిక్కిలి లావు లేకున్న సుఖప్రదురాలగు. చట్టియైయున్న విధవయగు. నాసాబిలముల రోమమున్న న్రపశస్తురాలగు. మీసములున్న విధవయగు): చూ, స్త్రీలక్షణాంగములు; 4: చూ, నాట్యోపయోగములైన యంగములు (చూ, అంగము. 9.)

నాసికాంగుళీన్యాయము, న్యా. ఎవని ముక్కురంధ్రముఁలో వాని వ్రేళ్ళేపైనను పట్టుననురీతి.

నాసికాక్రియలు, అం. భావాధ్యాయప్రమేయములోనివి. — స్వాభావికి, నత, మంద, సోచ్ఛ్వాస, నికూణిత, వికృష్ట (6)

నాసికాద్వారములు, అం: చూ, నాడులు.

నాసికావేదనము, సం. వి. అ. పుం: చూ, నాస 3*.

నాసిరిల్లు, వై. అ. క్రి. = నాశ. నశించు: చూ, సమయు 3.

నాసీరము, సం. వి. అ. న 1: చూ, సేనాముఖము. 1: 2. దర్పము: చూ, హుంకారము.

నాస్త, హిం. వి. చలిదిభోజనము, ఫలహారము.

నాస్తి, వా. సం. అవ్య. లేదు.

నాస్తికత, సం. వి. అ. స్త్రీ. పరలోకము లేదనెడు బుద్ధి: చూ, మిథ్యాదృష్టి.

నాస్తికుఁడు, సం. వి. అ. పుం. పరలోకము లేదనెడువాఁడు.

నాస్తిక్యము, సం. వి. అ. న; చూ, నాస్తికత.

నాహంకారాత్పరోరిపుః, లో. మనుజున కహంకారముకంటె శత్రువు వేఱొకఁడు లేఁడు.

నాళము, సం. వి. అ. పుం, న. 1. రూ-నాళి. తామరలోనగు వానికాడ: చూ, బిసము. 1; 2. క్రోవి: చూ, బాణము. 1; 3. చిమ్మనఁగ్రోవి: చూ, శృంగము. 3; 4. అగసాలెవాని ఊఁదుఁగ్రోవి: ఊఁదుఁగ్రోవి, క్రోవి, గొట్టము; 5. సస్యాది నాళము: చూ, క్రోవి. 2: (అకారాంతస్త్రీలింగమునగును); దే. వి. (1). రూ-నాలము: చూ, లాడము.

నాళి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, నాళము. 1; 2 కూర యొక్కనార, కాడ, గొట్టము.

నాళికము, చూ, రూ-నాళీకము.

నాళికేరము, సం. వి. అ. పుం: చూ, రూ-నారికేళము*.

నాళీకము, సం. వి. అ. న. రూ-నాళికము. 1. తామర: చూ, రూ-నలినము. 1; 2. తామరతంపర: చూ, సహస్రపత్రము; పుం. 3. అమ్ము: చూ, బాణము. 1; 4. బాణపుములికి: చూ, బాణము. 1.

నాళీకాసనుఁడు, సం. వి. అ. పుం. నలువ: చూ, బ్రహ్మ. 1.

# ని

ని, సం. అవ్య. 1. నిశ్చయార్థకము: చూ, సత్యము. 1; ఉప. 2. (నికిర్ణము = ఇచట "ని" అనునది మిక్కిలి అను నర్థముకలది: నికషము = ఇచట నిరర్థకము; నికారము = ఇచట ధాత్వర్థమును వంచనయను నర్థమునకు మార్చినది; నికాశము = ఇచట ధాత్వర్థమును తుల్యము అను నర్థముకల దిగా మార్చినది; నికృంతనము = ఇచట వ్యర్థము): అం. 3: చూ, స్వరము. 2: (చూ, గ. 1.) దే. అప. (1) ద్వితీయైక వచనమునందు వచ్చెడు ఒకప్రత్యయము. "దానిని.

సోముని" మొ; ద్ర. (2.) చార్థకము. అం. భా. తృ. 67: చూ, ను (14).

నింకిరి, దే. వి. రూ-నిఁపిరి. ముణికి: చూ, శమలము. 1.

నింకిటీ, దే. అవ్య. క్రి. విణ: చూ, వేగము. 3.

నింగి, దే. వి. ఆకాశము. స్వా. 4, ఆ. 99: చూ, సుర వర్త్మము.

నింగిచూలి. దే. వి నభస్వంతుఁడు: చూ, వాయువు.

నింగిమిరి, దే. వి. సువర్చల*.

నింగివడు, ద్వ. అ. క్రి (ఉ, హరి. 5, ఆ. 84): అస్తమిల్లు, కూఁకు, క్రుంకు, పడు. (సం. ప్ర.—అస్తమించు.

నింగిసిగ, ద్వ. వి. వ్యోమకేశుఁడు: చూ, శివుఁడు.

నిఁచు, దే. ప్రే: రూ-నినుచు-నింపు, నెరవు-నెఱపు.

నింజిలి, వా. వి మనోవ్యథ: చూ, శోకము.

నింట, దే. వి. జలపూరము.

నిండఁబడు, ద్వ. అ. క్రి. (రూ-నిండారు- నిండు- నిండుకొను) పూర్ణమగు : చూ, మెండుకొను. 3.

నిండారు, దే. అ. క్రి. —పై.—

నిండు, దే. వి. 1. పూర్ణత : చూ, సంపూర్ణత; విణ 2 నిండినది, పూర్ణము. భార. ఆది. 1, ఆ. 100: చూ, సంపూర్ణము; అ. క్రి. 3 : చూ, నిండఁబడు; వా. 4 : చూ, నిండుకొను. 2.

నిండుకొను దే. అ. క్రి. 1 : చూ, నిండఁబడు; వా. 2. లేక పోవు. "బియ్యము నిండుకొనెను."

నిండుజవ్వనము, వా. వి. నెలజవ్వనము. అం, భా. ద్వి. 1.8 : చూ, వయస్సు. 1.

నిండుమాట, వా. వి. అలాపము : చూ, సంభాషణము: (చూ, శబ్దము. 2.)

నింద, సం. వి. ఆ. స్త్రీ. 1. దూఱు : చూ, నెగ్గింపు; 2. అపదూఱు : చూ, నెగ్గింపు.

నిందతికంచుకమేవప్రాయశ్శుష్కస్తనీనారీ. న్యా. స్తనములులేని స్త్రీ అవికను నిందించును.

నిందితము, వా. విణ. నిందింపఁబడినది.

నిందించు, సం. స. క్రి. దూఱు : చూ, నెగ్గించు.

నిందింపఁబడు, మి. అ. క్రి : చూ, పీటఁబోవు.

నిందితుఁడు, సం. విణ. దూఱఁబడినవాఁడు : చూ, వెలివాఁడు. 1-3.

నింద్యము, సం. విణ. నిందింపఁదగినది : చూ, హీనము. 2.

నింద్యములు, వా. కవులు వాడుకొనఁగూడనివి. ఉదా— వ్రాస్తాడు, కొంటావు, ఇచ్చేని, కూకుందాము, లెగుద్దాము, వచ్చేని, అందాము మొ.

నింద్యుఁడు, సం. విణ. దూఱదగినవాఁడు : చూ, వ్యాధుఁకు.2.

నింపాది, దే. విణ. (నింపు+అది) సమృద్ధము: చూ, సమృద్ధి.

నింపారు, దే. అ. క్రి. రూ- నినుపారు : చూ, నిండఁబడు.

నింపిరి, దే. వి : చూ, నింకిరి.

నింపు, దే. వి. 1. రూ-నినుపు. ఉత్త. 6, ఆ. 235 : చూ, సమృద్ధి; ప్రే. 2: చూ, రూ-నించు.

నింపువాఁడు, దే. విణ. సమృద్ధుఁడు : చూ, సంపన్నుఁడు.

నింబతరువు, సం. వి. ఉ. పుం. వారిజము * : చూ, సూక్ష్మదారువు.

నింబము, సం వి అ. పుం : చూ, వేము*.

నికటము, సం. వి. అ. న. 1. దగ్గఱ: చూ, సమీపము. 1; విణ. 2. సమీపమైనది : చూ, సమీపము. 2; దే. వి. (1) నిర్బంధము : చూ, బలవంతము.

నికటస్థము, సం. విణ. ఉపోద్ఘము : చూ, నికటము. 2.

నికము, దే. వి. విణ : చూ, రూ-నిక్కము.

నికరము, సం. వి. అ. పుం. 1 : చూ, సమూహము; 2 : చూ, లబ్ధి. 2; విణ. 3. శ్రేష్ఠము, : చూ, శ్రైష్ఠ్యము; దే. విణ. (1) త్రోపుకు పోఁగా మిగిలినది : చూ, సారాంశము; వా. (2) శ్రేష్ఠమైనది.

నికర్షణము, సం. వి. అ. న. పట్టణము చుట్టువాటినబయలు : చూ, సన్నివేశము.

నికష, సం. వి. ఆ. స్త్రీ. రాక్షసులతల్లి : చూ, మాత. 1.

నికషము, సం. వి. అ. పుం. రూ-కషము. 1. ఒకటరకల్లు, శాణము : చూ, సాన. 1; 2. గంధము తీసెడుబాయి : చూ, సాన. 3; 3. కత్తులు లోనగునవి నూరెడుబాయి: చూ, సాన. 2; అవ్య. సమీపార్థమందు వర్తించును, హిరుక్కు : చూ, సమీపము. 1.

నికషాత్మజుఁడు, సం. వి. అ. పుం. నిర్ఋతి ; చూ, సోఁకులఱేఁడు.

నికామము, సం. క్రి. విణ. అ. న : చూ, స్వేచ్ఛ.

నికాయము, సం. వి. అ. పుం. 1. (రూ-నీకాయము - నికాయ్యము - నీకాయ్యము) ఇల్లు : చూ, సదనము. 1; 2. తెగ : చూ, సమూహము; 3.= నిగా : లక్ష్యము. 1; 4. ప్రోగు: చూ, రాశి. 1; 5. పరమాత్మ : చూ, హంసుఁడు.

నికాయ్యము, సం. వి. అ పుం. : చూ, రూ- నికాయము. 1.

నికారణము, సం. వి. అ. న : చూ, వధము.

నికారము, సం. వి. అ. పుం. 1 : చూ, వంచన; 2 : చూ, ఉత్కారము 1; 3 : చూ, ఉత్కారము. 2; 4. దంతనిష్పీడనమువలనఁ గలిగిన ముఖవికారము లోనగునది : చూ, విప్రకారము. 3; వా. 5. తిరస్కారము : చూ,వహేళనము.

నికాశము, సం. వి. అ. పుం. 1. నిశ్చయము : చూ, సత్యము. 1; విణ. 2. రూ-నీకాశము. తుల్యము : చూ, సమానము. 2.

నికుంచకము, సం. వి. అ. పుం ; చూ, సోల.

నికుంచకార్థము, సం. వి. అ. న : అర్ధ, అరసోల.

నికుంచితము, అం. 1 : చూ, శిరఃక్రియలు 2: చూ, భ్రూక్రియలు; 3 : చూ, కరణములు.

నికుంజము, సం. వి. అ. పుం. న, రూ- కుంజము, పొదరిల్లు : చూ, వదనము 1.

నికుంజకామ్ల, సం. వి. ఆ. స్త్రీ : కుంజిక, కుంజవల్లరి*.

నికుంభము, సం. వి. అ. పుం. దంతి* : చూ, విశల్య. 4.

నికుంభుఁడు, సం. వి. అ. పుం, కుంభకర్ణుని కొడుకు : చూ సూనుఁడు. 1.

నికుట్టనము, అం : చూ, కరణములు.
నికురుంబము, సం. వి. అ. న : చూ, సమూహము.
నికూణిత, అం : చూ, నాసికా క్రియలు.
నికృంతనము, సం. వి. అ. న: చూ, హతి.
నికృతము, సం. విశ. 1. దూఱఁబడినది : చూ, హీనము. 2; 2. వంచింపఁబడినది : చూ, వ్యవసితము. 3; 3. త్రోపుడు చేయఁబడినది.
నికృతి, సం. వి. ఇ. స్త్రీ. బెదరుమాట: చూ, శబ్దము. 2; 2: చూ, వంచన; 3. త్రోపుడు: చూ, నిషేధము; వా. 4. కపటము: చూ, వ్యాజము. 1.
నికృతుఁడు, సం. విశ: చూ, వంచకుఁడు.
నికృత్తము, సం. విశ. నఱకఁబడినది: చూ, విచ్ఛిన్నము. 3.
నికృష్టము, సం. విశ. అధమము: చూ, హీనము. 1.
నికృష్టుఁడు, సం. విశ. అధముఁడు: చూ, వ్యాధుఁడు. 2: (చూ, హీనుఁడు.)
నికేతనము, సం. వి. అ. న (రూ-నికేతము నీకేతము-కేతము) ఇల్లు: చూ, సదనము. 1.
నికోచకము, సం. వి. అ. పుం. ఊడుగ * : చూ, మహాయమళ పత్రిక.
నిక్కచ్చి, దే. వి. 1. నిర్బంధము: చూ, బలవంతము; 2: చూ, శ్రమము. 1; 3. సంకటము: చూ, శోకము.
నిక్కము, దే. వి (రూ-నికము-నిక్కువము.) 1. నిశ్చయము. లక్ష్మి. 4, ఆ. 157: చూ, సత్యము. 1; 2. యథార్థము. భార. కర్ణ. 1, ఆ. 187: చూ, సత్యము. 1; 3. న్యాయము: చూ, సత్యము. 1; విశ. 4. సత్యమైనది: చూ, సత్యము. 1; 5. పొసఁగినయర్థముగలది: చూ, అన్వర్థము.
నిక్కల, దే. వి కన్నదియనుభవమునకు తెచ్చెడుకల. భార. ఆర, 6, ఆ. 401: చూ, స్వప్నము. 1.
నిక్కవుఁడు, వై. వి. 1. దంభములేనివాఁడు; 2. = నిష్కపటి. చూ, సత్యవంతుఁడు.
నిక్కవొడుచు, దే. అ. క్రి. (నిక్కు + అనపొడుచు) నిక్కన నిలుచు.
నిక్కాఁక, దే. వి. (నిండు + కాఁక) మిక్కిలికాఁక: చూ, వేఁడిమి.
నిక్కించు, వా. స. క్రి. నిక్కనటులఁజేయు.
నిక్కు, దే. వి. 1. గర్వము: చూ, హంకారము. 1; 2. బిబ్బోకము: చూ, విలాసము. 2; 3. పశుచుతనపు టెక్కు: చూ, తెక్కు; 4. ఉన్నతి: చూ, పొడవు. 2; అ. క్రి. 5: చూ, వర్ధిల్లు. భాగ 5, స్కం. 2, ఆ. 78; 6. అతిశయించు. ఉ,హరి. 6, ఆ. 57: చూ, ముమ్మరించు; 7. గర్వించు: చూ, హంకరించు: 8. తనరారు, ఉన్నతమగు: చూ, పొడుగు. 6; వా. 9. ఉద్ధితమగు: చూ, లేచు. 1.
నిక్కుఁబోతు, దే. విశ: చూ. పొగరుబోతు.
నిక్కుడు, దే. వి: చూ, నిక్కు. 4.
నిక్కువము, దే. వి: చూ, రూ-నిక్కము.
నిక్కువీనులజక్కి, దే. వి. ఉచ్చైశ్శ్రవము: చూ, హయము. (ఇట్లు నిక్కువీన్వావురము).
నిక్కువీనులజక్కినెక్కురౌతు, ద్వి. వి. ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు.
నిక్వణము, సం. వి. అ. పుం. (రూ - నిక్వాణము - క్వాణము - క్వణము - క్వణనము) వీణలోనగువాని మ్రోఁత: చూ, స్వరము. 2.
నిక్వాణము, —పై.—
నిక్షేపము, సం. వి. అ. పుం. 1. చెప్పి చూపియుంచిన యిల్లడ: చూ, వాడిక; 2. నిధి: చూ, లిబ్బి. 2; అం. 3: చూ, వ్యవహారపదములు; వా. 4. చేమిరి: చూ, తోడు. 4.
నిక్షేపించు, సం. స. క్రి. పాఁతు: చూ, పూడుచు.
నిఖాతము, సం. విశ. త్రవ్వఁబడినది.
నిఖిలము, సం. విశ. ఎల్ల: చూ, సర్వము.
నిగడము, సం. వి. అ. పుం. న. రూ-నిగళము. 1. ఏనుఁగు కాలి సంకెల: చూ, శృంఖలము. 2; 2. సంకెల: చూ, శృంఖలము. 3.
నిగణము, సం. వి. అ. పుం. హోమధూమము: చూ, పొగ.
నిగదము, సం. వి. అ. పుం. రూ-నిగాదము. స్పష్టమునాఁ బలుకుట: చూ, ప్రస్తావము. 2.
నిగదించు, సం. స. క్రి. స్పష్టముగా చెప్పు. భాగ. 2, స్కం. 37: చూ, వచించు.
నిగనిగ, దే. వి. 1. అధికప్రభ: చూ, వెలుతురు. 1; 2. మెఱయుటయందగు ననుకరణము. వసు. 6, ఆ. 85: చూ, హలాహలా.
నిగమము, సం. వి. అ. పుం. 1: చూ, వేదము; 2. అంగళ్లవాడ: చూ, మార్గము. 1; 3. దారి: చూ, మార్గము. 1; 4. పట్టణము. చూ, సీమ. 1.
నిగముఁడు, సం. వి. అ. పుం. బేహారి: చూ, వర్తకుఁడు.
నిగరణము, సం. వి అ. న. 1. రూ-గరణము-నిగారము: చూ, మ్రింగుట; పుం. 2. కంఠము: చూ, మెడ.
నిగరము, సం. వి. అ. పుం. 1: చూ, రూ-నిగరణము. 1; వై. విశ. రూ-నిగారము. (1) = నికరః. శ్రేష్ఠము. ఉ రా. 7, ఆ. 397: చూ, శ్రైష్ఠ్యము; (2) = నికరః. న్యాయము: చూ, సత్యము. 1; (3) బలము: చూ, శక్తి. 1.
ని - గ—హీనతానములు, అం. భైరవము, కామదము, గర్భదము, అష్టాకపాలము, స్వష్టికృత్తు, వషట్కారము, మోక్షదము (7): (చూ, సర్వతానములు )
నిగళము, సం. వి. అ. పుం. న: చూ, రూ-నిగడము. 1—2; అం. 3. గ్రహములు ద్విస్వభావరాసులలో చివరిమూఁడు పాదములయందున్న నిగళమువట్టును: (చూ, పాశము, భుజంగిము.)
నిగా(నిగహ్), వా. వి. 1. దృష్టి: చూ, వీక్షణము; 2. జాగ్రూకత; వై. వి. 3. = నికాయ: చూ, లక్ష్యము. 1.
నిగాదము, సం. వి అ. పుం: చూ, రూ-నిగదము.
నిగారము, సం. వి. అ. పుం. 1: చూ, రూ-నిగరణము. 1; వై. విశ. (1) = నికరః: చూ, రూ-నిగరము (1), (2), (3) (శ్రేష్ఠమునకు.—అచ. అ. కాం. 83.)

నిగాళము, సం. వి. అ. పుం, న. గుఱ్ఱముమెడ సమీపపుచోటు: చూ, హయము.

నిగిడారు, దే. అ. క్రి. (నిగిడి + ఆరు): చూ, వ్యాపించు.

నిగిరిక, దే. వి. ఇగిరిక: చూ, హవిస్సు.

నిగుడు, దే. అ. క్రి. రూ-నివుడు. 1: చూ, వ్యాపించు. భార. అర. 5, ఆ. 3; ఉ, హరి. 3, ఆ. 141; 2: చూ, విజృంభించు. భార. శల్య. 1, ఆ. 129; 3. నిక్కు. భార. ఉద్యో, 2, ఆ. 146: చూ, వీఁగు, 5; 4. చాఁగు. భార. విరా. 3, ఆ. 79: చూ, పొడవగు: 5: చూ, సంభ్రమించు; 6. కన్నువేయు. భార. భీష్మ. 3, ఆ. 375; చూ, దృష్టించు; 7. చక్కఁబడు. భార. ఉద్యో. 2, ఆ 61: చూ, సరిపడు. 2; 8. చిప్పిల్లు: చూ, బుగులుగొను.

నిగుడుచు, దే. ప్రే. నిగుడఁజేయు; రూ-నిగుడ్చు-నివుడుచు-నివుడ్చు.

నిగుడుదెంచు, దే. అ. క్రి. నిక్కు: చూ, వీఁగు. 5.

నిగుడ్చు, దే. ప్రే: చూ, రూ-నిగుడుచు.

నిగులు, దే. వి. (రూ-నివులు-వీలు) కట్టెనిప్పుమీఁదిభస్మము. ఉ, రా. 5, ఆ. 58: చూ, భస్మము

నిగూఢము, సం, విణ. మఱుఁగుపుచ్చినది: చూ, రహస్యము.

నిగూహనము, సం. వి. అ. న. మఱుఁగుపుచ్చుట: చూ, బంచు: (చూ, దాఁచుట.)

నిగ్గడి, దే. విణ. కఠినము; చూ, బెడిదము.

నిగ్గు, దే. వి. 1. ఉత్కృష్టకాంతి: చూ, వెలుతురు. 1; 2. వర్ణలేశము: చూ, వర్ణము. 6; 3. కిరణము. ఆం, భా. ప్ర. 82; చూ, హాయనము. 2; 4. పస: చూ, సారాంశము; విణ. 5: చూ, వికరము. (1); అ. క్రి. 6. రూ-నెగ్గు. నిర్వహిల్లు చూ, రవణించు.

నిగ్రహము, సం. వి. అ. పుం. 1. త్రోపాట; 2. బెదరుమాట: చూ, శబ్దము 2; 3. చెఱ: చూ, బంధనాలయము; 4. మేర: చూ, సన్మానము; 5. రూ-నిగ్రాహము. అడ్డగింపు: చూ, వారణము. 1; అం. 6: చూ, హస్తక్రియలు.

నిగ్రహించు, సం. స. క్రి. 1. త్రోపాడు; వా. 2. గెలుపొందు. "వాసివ్యాజ్యము నిగ్రహించినది."

నిగ్రాహము, సం. వి. అ. పుం. రూ-నిగ్రహము: చూ, వారణము. 1.

నిఘ-టుప్రావీణ్యము, అం: చూ, సుగుణములు.

నిఘంటువు, సం. వి. ఉ. పుం. పదపదార్థములను పర్యాయపదాదులను తెలియఁజేసెడు ప్రమాణగ్రంథము.

నిఘట్టనము, సం. వి. అ. న. = నెగ్గడము: చూ, పీడనము.

నిఘము, సం. వి. అ. పుం. చదరపువస్తువు.

నిఘసము, సం. వి. అ. పుం. కుడుపు: చూ, సాపాటు.

నిఘాతకము, అం: చూ, అదూషితములు: (చూ, వ్యాకరణబంధములు.)

నిఘాతిక, సం. వి. ఆ. స్త్రీ. దాకలి: చూ, పట్టెడ.

నిఘ్నుఁడు, సం. విణ లోఁబడువైనవాఁడు: చూ, పరాధీనుఁడు.

నిచయము, సం, వి. అ. పుం: చూ, సమూహము.

నిచికి, సం. వి. ఈ. స్త్రీ. రూ-నైచికి. మంచిరూపముగలిగి చాల పాలిచ్చెడియావు: చూ, ధేనువు.

నిచితము, సం, విణ. వఱపఁబడినది: చూ, ప్రసారితము. 1.

నిచుల(ళ)ము, సం. వి. అ. పుం. 1. ఎఱ్ఱగన్నేరు*: చూ, హయమారకము; 2. రూ- (నిచోళము-చోళము) కప్పుడుదుప్పటి, పక్కదుప్పటి (అనికొందఱు): చూ, వస్త్రము; 3. నీరుప్రబ్బలి.*: చూ, ప్రబ్బలి.

నిచోళము, సం. వి అ. పుం. 1; కోశము-కోషము, ఖడ్గకోశము, ఖడ్గపిధానకము-ఖడ్గపిధానము. (తె. ప.)—ఒఱ, గసీబు-గలీబు, గవిసెన-గవుసెన-గౌసెన: చూ, వస్త్రము; 2: చూ, నిచుల(ళ)ము. 2.

నిచ్చెన, వై. వి. = నిశ్రేణి. తాప. (సం. ప.)-అధిరోహిణి, ఆరోహణము, నిశ్రేణి.

నిచ్చెనపంజు, ద్వ. వి. దివిటీలకమ్మలమర్చిన నిచ్చెనవంటి సాధనము, కరదీపము: చూ, స్నేహాశము.

నిచ్చెనదివ్వెపంజు, —పై.—

నిచ్చు, వై. అవ్య. రూ-నిచ్చలు, 1. = నిత్య. సదార్థకము. వసు. 2, ఆ. 126: చూ, సతతము. 2; 2. ప్రతిదినము. పంచ. నా. 1, ఆ. 153: చూ, వాసరము; 3. ఎల్లప్పుడు: చూ, సతతము. 2; వా. 4. తారీఖు. ఆం, భా. ప్ర. 90: చూ, రోజు.

నిచ్చమల్లె, వై. వి. = నిత్యమల్లికా. ఎల్లప్పుడును బూచెడు మల్లిక. ఆం, భా. ద్వి. 51: చూ, రూ-నిత్తెమల్లె.

నిచ్చయము, వై. వి. = నిశ్చయః. రూ-నిచ్చలము-నిచ్చలు: చూ, సత్యము. 1.

నిచ్చలము, 1. = —పై.—; 2. = నిర్మలము. ఆం, భా. తృ. 15; చూ, సొచ్చెము. 2; విణ. 3. = నిశ్చలమ్. కళా 3, ఆ. 198; చూ, స్థావరము; 4. నిర్దోషము. శశాం. 2, ఆ. 18: చూ, సమీచీనము. 2; 5. నిరంతరము. రాఘ. 2, ఆ. 5: చూ, సతతము. 2.

నిచ్చలు, వై. వి. అవ్య. = నిత్య: చూ, రూ-నిచ్చు. (సదార్థకము.—పాండు. 2, ఆ. 53.)

నిజము, సం. వి. అ. న. = నిజము. 1. కలతెఱఁగు: చూ, సత్యము. 1; 2. సత్యవచనము: చూ, శబ్దము. 2; 3: చూ, స్వభావము. 2; విణ. 4. నిజమైనది: చూ, సత్యము. 1; 5. యథార్థము: చూ, సత్యము. 1; 6. తనది: చూ, స్వకీయము; 7. శాశ్వతమైనది: చూ, శాశ్వతము.

నిజమోహము, అం: చూ, మోహచతుష్టయము.

నిజాయితీ, వా. విణ. న్యాయమైన.

నిజమరి, ద్వ. విణ. చూ, సత్యవంతుఁడు. 2.

నిజెము, వై. వి. విణ = : చూ, నిజము (కలతెఱఁగునకు.—కళా. 1, ఆ. 163; నిజమైనది అనుటకు..లక్ష్మి. 4, ఆ. 154; భార. కర్ణ. 3, ఆ. 60.)

నిజోగి, వై. వి. = నియోగి, రూ-నియ్యోగి: చూ, మంత్రి. 1.

నిటలము, సం. వి. అ. పుం. న. = నుదురు-నొసలు. (రూ-నిటాలము-నిటీలము-నిటిలము-నీటిలము : చూ, లలాటము.
నిటలాక్షుఁడు, సం. వి. అ. పుం: చూ, శివుఁడు.
నిటాకు, వా. విణ. నిలువున.
నిటాలము, సం. వి. అ. పుం, న: చూ, రూ-నిటలము.
నిటిలము, —పై.—
నిటీలము, సం. వి. అ. పుం, న.—పై.—
నిట్ట, దే. వి. 1. ప్రవాహము. భార. విరా 2, ఆ 66: చూ, వెల్లువ; 2. చోటు. భార. విరా. 1, ఆ. 45: చూ, స్థానము. 1; 3. కంబము: చూ, స్తంభము. 1; 4. ఎత్తు. పాండు. 3, ఆ. 139: చూ, నిక్కు- 4; 5. ప్రక్క: చూ, పార్శ్వము. 2; 6. (రూ-నిట్ర-నిట్రు): చూ, లంకణము; విణ. 7. నిక్కినది. భాగ. 6, స్కం. 469: ఉన్నమితము, నద్ధము; 8. సరియైనది. స్వా. 4, ఆ. 73: చూ, సుషమ. 1.
నిట్టఁనిలుచు, దే. అ. క్రి. సరిగానిలుచు: రూ-నిట్టనిలుచు, నిట్టనిలుచుండు.
నిట్టకనిలువు, దే. వి. సరినిలువు: రూ-నిట్టకనిల్వు.
నిట్టకనిల్వు, —పై.—
నిట్టగ్రమ్ము, దే. అ. క్రి. 1. నిట్టవొడుచు. లక్ష్మి. 2, ఆ. 50: చూ, విజృంభించు; 2: చూ, పులకరించు.
నిట్టనిలుచు, దే. అ. క్రి: చూ, రూ-నిట్టకనిలుచు. పాండు. 2, ఆ. 55.
నిట్టనిలుచుండు, —పై.—
నిట్టపంట, దే. వి. నిష్కారణము.
నిట్టరాడు, దే. వి. రూ-నిట్రాడు: చూ, తలగుంజ.
నిట్టలము, దే. విణ. రూ-ఇట్టలము. భాగ. 6, స్కం. 319: చూ, హెచ్చు. 1.
నిట్టవొడుచు, దే. అ. క్రి: చూ, నిట్టగ్రమ్ము.
నిట్టు, దే. వి. 1. రూ-నిట్రు. వసు. రా. వి. 2, ఆ. 69: చూ, లంకణము; 2: చూ, పిపాస; 3: చూ, వఱపు; విణ. 4: చూ, రాత్రి; విణ. 5. రూ-నిట్రు. చూ, శుష్కము. 2.
నిట్టుపాసము, ద్వ. వి రూ-నిట్రుపాసము, శుష్కోపవాసము: చూ, లంకణము.
నిట్టూరుచు, ద్వ. అ. క్రి. (నిడుద + ఊరుచు) రూ-నిట్టూర్చు: చూ, వగర్చు.
నిట్టూర్చు, ద్వ. అ. క్రి.—పై.—
నిట్టూరుపు, ద్వ. వి. (నిడుద + ఊరుపు) రూ. నిట్టూర్పు. దీర్ఘనిశ్వాసము: చూ, వాయువు.
నిట్టూర్పు, ద్వ. వి.—పై.—
నిట్ర, దే. వి. రూ-నిట్రము. 1. ఇల్లి: చూ, లంకణము; 2. నిలువు.
నిట్రము, దే. వి.—పై.—
నిట్రాడు, దే. వి: చూ. నిట్టరాడు.
నిట్రాయి, దే. వి. (నిట్ట + ఱాయి) పొడవుఱాయి: చూ, రాయి.
నిట్రించు, దే. స. క్రి. నిలువుగానుంచు.
నిట్రిల్లు, దే. అ. క్రి. ఉపవాసముండు.
నిట్రు, దే. వి. విణ. చూ, నిట్టు. 1-5.
నిట్రుపాసము, ద్వ. వి: చూ, రూ-నిట్టుపాసము.
నిడిపడక, ద్వ. వి: చూ, భక్ష్యము.
నిడివి, దే. వి (రూ-నిడుద-నిడుపు) 1. దైర్ఘ్యము: చూ, పొగ. 2; విణ. 2. దీర్ఘము. లక్ష్మి. 3, ఆ. 76: చూ, మూల. 2.
నిడిమ్రేలు, దే. వి. నడిమిమ్రేలు: చూ, వేలు 2
నిడు, దే విణ. వృత్తియందు నిడుదశబ్దముయొక్క మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. "నిడు మోము, నిడువాలు" మొ.
నిడుచట్ట, దే. వి: చూ, కుపనము.
నిడుచను, దే. అ. క్రి. (నిడుద + చను) చాఁగు. భార. ఆది. 7, ఆ. 175: చూ, పొడవగు.
నిడుద, దే. విణ: చూ, నిడివి. 2.
నిడుదపెన్ను, దే. వి: చూ, సర్పము. అచ్చ. సుం. కాం. 57.
నిడుపఁడు, దే. వి. —పై.—
నిడుపఁడుపాన్పుజేఁడు, ద్వ. వి: చూ, విష్ణువు 1.
నిడుపు, దే. వి. 1; చూ, చాఁపు. 1. ఆం, భా. ద్వి. 152; 2. దీర్ఘము: చూ, పొగ. 2; విణ. 3. చూ, నిడివి. 2.
నిడుపుకాసె, దే. వి: చూ, అంగదట్టము.
నిడుముస్తె, ద్వ. వి. (నిడుద + ముస్తె) తుంగ*: చూ, తృణము. 1.
నిడువెంట్రుక, దే. వి. (నిడుద + వెంట్రుక) 1. గగుర్పు: చూ, రోమాంచము; వా. 2. పొడవుగనుండెడు వెంట్రుక.
నిడువెంట్రుకవెట్టు, దే. అ. క్రి: చూ, పులకరించు. భార. భీష్మ. 1, ఆ. 181.
నిడుసు, వా. వి బారిముద్ర. ఆం. భా. ద్వి 274: చూ, లోహము. 1.
నిడ్డ, వా. వి. దెబ్బ: చూ, హతి.
నితంబము, సం. వి. అ. పుం. 1. చూ. పిఱ్ఱ: (స్త్రీలమొలకు వెనుకనున్న ప్రదేశము. సురతసమ్మర్దముచేత మిక్కిలి గాసిఁబొందునది); 2. మొల: చూ, శ్రోణిఫలకము; 3. కొండనడుము: చూ, పర్వతము; 4. మూఁపు: చూ, స్కంధము. 1; 5. దరి: చూ, రోధస్సు; ఆం. 6; చూ, నృత్తహస్తములు; 7: చూ, కరణములు.
నితంబిని, సం. వి. ఈ స్త్రీ. 1. గొప్పపిఱుఁదులు గల ఆఁడుది: చూ, స్త్రీ; 2. ఆఁడుది: చూ, స్త్రీ.
నితాంతము, సం. క్రి. విణ. అ. న. 1. పెల్లు: చూ, హెచ్చు. 1.
నిత్తెమల్లె, వై. వి. = నిత్యమల్లికా*: నిచ్చమల్లె. (సం. ప.)-నిత్యమల్లి-నిత్యమల్లిక.
నిత్యకళ్యాణము పచ్చతోరణము, జా. ఎడతెగని శుభములు. "నిత్యకళ్యాణముఁ బచ్చతోరణమై జనులందఱు నుల్లసిల్లఁగన్." (విజ. 1, ఆ. 84).
నిత్యమల్లి, సం. వి. ఈ. స్త్రీ. = : చూ, నిచ్చమల్లె*.
నిత్యమల్లిక, సం. వి. ఆ స్త్రీ. = —పై. —

నిత్యము, సం. క్రి. విశ. అ. న.=నిచ్చలు. 1. ఎల్లప్పుడు: చూ, సతతము. 2; విశ. 2. ఎడతెగనిది: చూ, సాంద్రము. 2; 3. స్థిరమైనది: చూ, శాశ్వతము.

నిత్యానిత్యవస్తువివేకము, అం: చూ, సాధనచతుష్టయము.

నిదర్శనము, సం. వి అ. న. 1. దృష్టాంతము: చూ, వృత్తాంతము. 7; పుం. అం. 2. నిదర్శనాలంకారము. (వాక్యార్థములకు సామ్యారోపణము.) "దాతకు సౌమ్యత యెడియె యదె పూర్ణేందునకు నిష్కళంకత.": చూ, అలంకారము. 3

నిదాఘము, సం.వి. అ. పుం 1. వెట్టకారు: చూ, ఘూసన్వయము; 2. వెచ్చన: చూ, వేఁడిమి; 3. చెమట: చూ, స్వేదము.

నిదానము, సం. వి. అ. న. 1; చూ, ఆదికారణము; 2. పెయ్య పలుపు: చూ, సూత్రము. 1; 3. రోగనిర్ణయము: చూ, ఆదానము. 3; వై. వి. (1)=నిర్ధారణ, ఆత్రపడక విచారించుట: (సం. వ.)—నిర్ధారణ.

నిదానించు, వై. అ. క్రి: చూ, తాస 3.

నిదిగ్ధము, సం. విశ. (కొలఁతమోచ్చిన ధాన్యాదులు) పెంపఁబడినది: చూ, వర్ధితము. 1.

నిదిగ్ధిక, సం. వి. ఆ. స్త్రీ; చూ, వాఁకుడు*.

నిదిధ్యాసనము, సం. వి. అ. న. మటిమటితలఁచుట.

నిదుర, వై. వి.=నిద్రా. రూ-నిద్దుర: చూ, స్వప్నము. 2.

నిదురపోతు, ద్వి. విశ. రూ-నిద్దురపోతు: చూ, స్వప్నకుఁడు.

నిదురవోవు, ద్వి. అ. క్రి: రూ-నిద్దురవోవు: చూ, నిద్రించు.

నిదురించు, వై. అ. క్రి.—పై.—

నిదేశము, సం. వి. అ. పుం. 1. పనుపు చూ, సెలవు; 2 రూ-నిర్దేశము, చెప్పుట: చూ, శంసనము; 3. దాపు: చూ, సమీపము. 1.

నిదేష్ట, సం. విశ. ఆజ్ఞాపించువాఁడు.

నిద్ధము, వై. విశ.=స్నిగ్ధ. 1. రూ-నిద్ధా. నునుపుగలది; చూ, స్నిగ్ధము. 2; 2. స్నేహముకలది: చూ, స్నిగ్ధము. 1; 3. దట్టమైనది: చూ, సాంద్రము 2; 4. చిక్కనైనది: చూ, స్నిగ్ధము. 3.

నిద్ధా, వై. విశ.=స్నిగ్ధమ్: చూ, రూ-నిద్ధము. 1.

నిద్దుర, వై. వి.=నిద్రా: చూ, రూ-నిదుర. రాఘ. 4, ఆ. 165.

నిద్దురపోతు, ద్వి. విశ: చూ, రూ-నిదురపోతు.

నిద్దురలేనట్టి పెద్దలు, ద్వి. వి. బ. దేవతలు. వేం, అం. 20: చూ, వేలుపు.

నిద్దురవోవు, ద్వి. అ. క్రి: చూ, రూ-నిదురవోవు.

నిద్ర, సం. వి. ఆ. స్త్రీ. 1.=నిదుర: చూ, స్వప్నము. 2; అం. 2. (అమ్మన్నుకన్నియ స్వప్నంబుననైనఁ బ్రియాపలోకనంబు లభించునేమోయని నిద్రఁగోరి నేత్రకంజంబులమూయుచుండెను): చూ, సంచారిభావములు; 3: చూ, శిక్షాకాలములు.

నిద్రపోవు, మి. అ క్రి: చూ, రూ-నిదురవోవు.

నిద్రాణుఁడు, సం. విశ: చూ, నిదురపోతు.

నిద్రాళువు, సం. విశ. ఉ: చూ, నిదురపోతు.

నిద్రించు, సం. అ. క్రి: నిద్రిలు-నిద్రిల్లు. (తె. వ.)—కునికిపడు, కునుకు, కూరుకు, తూఁగు, నిదురించు, నిదురవోవు. నిద్దురవోవు, నిద్రపోవు.

నిద్రిలు, —పై.—

నిద్రిల్లు, —పై.—

నిధనము, సం. వి. అ. న. 1. కొలము: చూ, వంగడము; పుం, న. 2. చావు: చూ, మరణము: 3. చేటు: చూ, వత్త.

నిధానము, సం. వి. అ. న. 1. ఉంచుట: చూ, పెట్టుకోలు; 2. పాఁతర: చూ, లిబ్బి. 2.

నిధి, సం. వి ఇ. పుం. 1: చూ, లిబ్బి. 2; అం. 2: చూ, సంతానములు.

నిధినాథుఁడు, సం. వి. అ. పుం. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు.

నిధులు, అం. మహాపద్మము, పద్మము, మకరము, శంఖము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము. (9).

నిధువనము, సం. వి. అ. న. 1. కలయిక: చూ, సంయోగము; 2. వడఁకు: చూ, వేపథువు.

నిధ్యానము, సం. వి. అ. న. చూపు: చూ, వీక్షణము.

ని, దే. ద్రవ్యార్థకము: చూ, రూ-ను. ఆం, భా. తృ. 67.

నినదము, సం. వి. అ. పుం. రూ-నినాదము. ధ్వని; చూ, స్వరము. 2.

నినాదము; —పై.—

నినుచు, దే. ప్రే: చూ, రూ-నించు. స్వా. 1, ఆ. 78.

నినుపారు, దే. అ క్రి: చూ, రూ-నింపారు.

నినుపు, దే. వి: చూ, రూ-నింపు.

నిన్న, దే. వి. (నిరు+నాఁడు) గతదినము. (సం. వ)—అధరేద్యువు.

నిపఠము, సం. వి. అ. పుం. రూ-నిపాఠము. 1. చదువుట: చూ, పఠనము; వా. 2; చూ, హెచ్చరిక.

నిపతించు, సం. స. క్రి. రూ-నిపాతించు: చూ, వడఁద్రోయు.

నిపము, సం. వి. అ. పుం. కలశము: చూ, భాండము. 3.

నిపాఠము, సం. వి. అ. పుం: చూ, రూ-నిపఠము. 1—2.

నిపాతనము, సం. వి. అ. న: చూ, నియాతనము.

నిపాతము, సం. వి. అ. పుం. 1. పడుట. చూ, పతనము; 2. వ్యాకరణమునందు సాధారణవిధికి సంబంధింపక విధింపఁబడినశబ్దము; 3: చూ, అవ్యయము. 4.

నిపాతించు, సం. స. క్రి: చూ, రూ-నిపతించు.

నిపానము, సం. వి. అ. న. నీళ్ళగాఁడి: చూ, లట్టు. 1.

నిపీడితము, అం: చూ, ఉత్తానకరణబంధములు.

నిపుణుఁడు, సం. విశ: చూ, సమర్థుఁడు.

నిప్పచ్చు, ద్వి. వి. (నిరు+వచ్చు) రూ-నిప్పచ్చరము. 1: చూ, బీదతనము; 2. నాశము: చూ, రుత్త.

నిప్పచ్చరము, వై. వి. 1: చూ, రూ-నిప్పచ్చు. 1; 2: చూ, రూ-నిప్పచ్చు. 2; విశ 3. ఉత్తది: చూ, శూన్యము. 1.

నిప్పటి, దే. వి: చూ, భక్ష్యము.

నిప్పట్టు, దే. వి: చూ, నిప్పటి.
నిప్పస్తు, దే. వి. (నిఱు + పస్తు): చూ, లంకణము.
నిప్పు, దే. వి. రూ-నిప్పుక. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2. నిప్పుకణము. భార. భీష్మ. 4, ఆ. 349: చూ, వహ్ని. 1.
నిప్పుఁదిండి, దే. వి. 1: చూ, వెన్నెలపులుఁగు; వా. 2: నిప్పుకోడి.
నిప్పుక, దే. వి: చూ, రూ-నిప్పు.
నిప్పుకలు, దే. వి. బ. రూ-నిప్పులు. స్ఫులింగములు. చూ, వహ్ని.
నిప్పుకోడి, వా. వి. నిప్పుఁదిండి. 2.
నిప్పులను మ్రింగుపులుఁగు, దే. వి: చూ, నిప్పుఁదిండి. 1.
నిప్పులగుంపు, వా. వి: చూ, వహ్ని. 1.
నిప్పులు, దే. వి. బ: చూ, రూ-నిప్పుకలు.
నిప్పువన్నె గుత్తులకామఁగు, ద్వ. వి: చూ, శాదఘ్నము 1 *.
నిబంధనము, సం. వి. అ. న. 1. ఏర్పాటు: చూ, సత్యము. 1; 2. కట్టు: చూ, బంధనము. 1; 3. తంతులుగట్టెడి బిరడ: చూ, బిరడ: 4. కారణము: చూ, హేతువు 1; 5. కట్టు పాటు: చూ, సమ్మె; విశ. 6. కూర్పఁబడినది: చూ, సంయోజితము.
నిబంధము, సం. వి. అ. పుం. 1. మ మూత్రబంధము; 2: చూ, నిబంధనము 2; 3. వర్షాశనము మొదలైనది.
నిబంధించు, సం. స. క్రి. 1: చూ, బంధించు; 2: చూ, వారించు.
నిబద్ది, వై. విశ. = నిబద్ధ. (రూ-నిబ్బరి-నిబ్బద్ది): చూ, సత్యము. 1.
నిబద్దించు, వై. స. క్రి. నిజపఱచు రూ-నిబద్దిలించు.
నిబద్దిలించు, —వై.—
నిబద్ధమగు, మి. అ. క్రి: చూ, సంధి చు.
నిబద్ధము, సం. విశ. 1. బంధింపఁబడినది: చూ, సితము. 4; 2. అడ్డగింపఁబడినది: చూ, రుదము. 1.
నిబర్హణము, సం. వి. అ. న. చంపుట; చూ, వధము.
నిబర్హితము, సం. విశ. చంపఁబడినది. చూ, ప్రోక్షితము. 2.
నిబిడము, సం. విశ. దట్టమైనది: చూ, సాంద్రము. 2.
నిబిడీకరించు, సం. స. క్రి. దట్టముచేయు.
నిబిడీకృతము, సం. విశ. దట్టముగాఁజేయఁబడినది: చూ, సాంద్రము. 2.
నిబిరీసము, సం. విశ: చూ, నిబిడము.
నిబోధనము, సం. వి. అ. న. చూపు: చూ, వీక్షణము.
నిబ్బద్ది, వై. వి. = నిబద్ధ: చూ, రూ-నిబద్ది.
నిబ్బద్ది, —వై.—
నిబ్బరము, వై. వి. 1. అతిశయము: చూ, హేరాళము. ; 2; 2. అశ్వగతివిశేషము; చూ, హయము; క్రి. విశ. 3. అత్యంతము; చూ, హెచ్చు. 1; విశ. 4. = నిర్భరమ్. తిన్నవ; చూ, హృద్యము; వా. వి. 5. బెదురులేమి.
నిబ్బరించు, వై. అ. క్రి. 1: చూ, ముమ్మరించు; 2: చూ, నిదానించు.
నిబ్బరికము, దే. వి. దయ. సా. 2, ఆ. 216: చూ, ప్రేమము
నిబ్బరికించు, వై. అ. క్రి. 1: చూ, ముమ్మరించు; దే. అ. క్రి. 2: చూ, దయసేయు.
నిభము, సం. వి అ. పుం. 1. = నెపము: చూ, వ్యాజము. 1; విశ. 2. సమానము: చూ, ఉపమ. 4.
నిభాయించు, వా. క్రి. తాళు.
నిభుగ్నము, అం: చూ, వక్షక్రియలు.
నిభృతము, సం. విశ. ప్రశ్రితము, శిక్షింపఁబడినది: చూ, వినీతము.
నిమంత్రణము, సం. వి. అ. న. శ్రాద్ధభోజనాదులయందు తగిన వారిని నియమించుట.
నిమంత్రించు, సం. స. క్రి. శ్రాద్ధభోజనాదులయందు తగిన వారిని నియమించు: చూ, పిలుచు
నిమంత్రితుఁడు, సం. విశ. నిమంత్రింపఁబడినవాఁడు.
నిమజ్జనము, సం. వి. అ. న. మజ్జనము: చూ, స్నానము. 1.
నిమటాయి, దే. వి. ఒకరకపుతీఁగె*: చూ, వృక్షము.
నిమయము, సం. వి. అ. పుం: చూ, వినిమయము.
నిమాజు, వా. వి. ప్రార్థన: రూ-నమాజు.
నిమితకాఁడు, ద్వ. వి. బరువు మోసెడి పనివాఁడు: చూ, భారవాహుఁడు.
నిమితకాండ్రు, ద్వ. వి. బాణశాఁజీవిజనము.
నిమితము, వై. వి. 2; చూ, బైసి; విశ. 2. = : చూ, నియమితము. 1.
నిమిత్తము, సం. వి. అ. న. 1. కారణము: చూ, హేతువు. 1; 2: చూ, శకునము. 1; 3. గుఱి: చూ, లక్ష్యము. 1; 4. గుఱుతు: చూ, లక్షణము. 1.
నిమిత్తాభావే నైమిత్తికస్యాప్యభావః న్యా. చేయువాఁడు లేక పోయినచో చేయబడెడి పనికూడనుండదు. అట్లే ఈశ్వరుఁడు లేకపోయినచో జగముకూడ నుండదు.
నిమిషకవి, వా. పౌరుషబిరుదమునొందినఇంటిపేరుగాగలవాఁడు.
నిమిషము, సం. వి. అ. పుం. రూ-నిమేషము. = నిముసము (60 సెకనులకాలము).
నిమీలనము, సం. వి. అ. న. 1. కనుమూయుట; 2. చావు: చూ, సావు.
నిమీలితము, అం: చూ, దృష్టిక్రియలు.
నిముకళ్ళ, దే. వి. (నిముసు + కళ్ళము) 1. కైలుచేసిన కళ్లమునందలి యడుగు ధాన్యము: చూ, స్తంబకరి; 2. కొలఁత: చూ, వెలితి. 2.
నిముకు, దే. స. క్రి. స్తన్యపానముచేయు. చూ, త్రాగు.
నిమురు, దే. స. క్రి. 1. ఆకర్షించు. ఆం, భా. తృ. 132: చూ, రెమ్మ. 2; 2 ప్రేమచే శరీరము జల్లనతడవు: రూ-నివురు. తడవు-తడుము, దువ్వు. (సం. వ.)—అభిమర్శించు.
నిమురుట, దే. వి. అభిమర్శనము.
నిముసము, వై. వి. = : చూ, నిమిషము.
నిమేయము, సం. వి. అ. పు : చూ, నిమయము.
నిమేషము, సం. వి. అ. పుం. 1. = నిముసము: చూ, రూ-నిమిషము; అం. 2: చూ, పుటక్రియలు; 3. చూ, కాలప్రాణము.

నీలాబ్జము, సం. వి. అ. న. నల్లకలువ: చూ, సహస్రపత్రము. 1.
నీలాలి, ద్వ. వి. రెండుముఖముల దీపారాత్రికపు తట్ట.
నీలాశ్వము, సం వి. అ. పుం: చూ, నీలఁడు.
నీలి, సం. వి. ఈ. స్త్రీ. 1. నల్లగోరంట:* చూ, మహాసహ; 2.= నీలిని *: చూ, రంజని; 2: చూ, అంకుశము; వై. వి. (1)= నీలిని *: చూ, నీలి. 2: (2) నల్లనిబట్ట నల్లనూలు (అనికొండఱు): చూ, వస్త్రము; విణ. (3) = నీల- నల్లనిది. హరిశ్చ. 2, ఆ. 8: చూ, వర్ణము. (6); (4) గారడము గలది. పాండు. 3, ఆ. 71.
నీలిక, సం. వి. అ. స్త్రీ. 1. నల్లవావిలి *: చూ, వావిలి: 2. ప్రాఁచితీఁగె *: చూ, శైవలము.
నీలిగోతాము, అం: చూ, మల్లశాస్త్రము.
నీలిని, సం. వి. ఈ. స్త్రీ.= నీలి: చూ. నీలి. 2, (1).
నీలిమ, సం.వి. న్. పుం. రూ-నీలిమము. న.పు:చూ, వర్ణము. 6.
నీలిమందు, ద్వ. వి. నీలిమొక్కలు వంటచేసిన వస్తువు.
నీలిమబ్బు, ద్వ. వి. వేఁటసాధనము.
నీలిరాగము, సం. వి. అ. పుం. బయటికి విశేషముగా కనఁబడక లోపల నెప్పటికిని వీడకుండెడు గాఢానురాగము: (చూ, పూర్వరాగము.)
నీలుఁడు, సం. వి. అ. పుం. ఒకానొక కోఁతి: చూ, వానరము; 2. పూర్వజైన విశేషము: చూ, బుద్ధుఁడు. 1.
నీలుఁగు, దే. వి. రూ - నీల్గు. 1. గాత్రవినామము; అ. క్రి. రూ - నీల్గు. 2; చూ, రూ - నిలుగు. 2; 3. చచ్చు: చూ, సమయు.
నీలోత్పలము, సం. వి. అ. న: చూ, నీలాబ్జము *.
నీలోత్పలి, సం. వి. ఇ. పుం. 1: చూ, నీలుఁడు. 2; అం. 2: చూ, భాషాంగములు.
నీల్గు, దే. వి. అ. క్రి: చూ, రూ - నీలుగు.
నీవరి, వై. వి = నీవార: చూ, రూ - నివ్వరి.
నీవాకము, సం. వి. అ. పుం: చూ, రూ - నివాకము.
నీవారము, సం. వి. అ. పుం.=: చూ, నీవరి.
నీవి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, సంచిమొదలు; 2: చూ, వలపుకీలు; 3: చూ, బంధనాలయము; 4. పందెపుసొమ్ము.
నీవీబంధము, సం. అ. న: చూ, నీవి. 2.
నీవు, దే. వి. రూ - ఈవు: 1. ఎదుటివిమవాఁడు. 2. నీశబ్దమునకు ప్రథమైకవచనము: చూ, త్వమ్; 3. బ్రాహ్మణుని తిరస్కరించునపు డుపయోగించు శబ్దము: చూ, హుం.
నీవృత్తు, సం. వి. త్. పుం. రూ - నివృత్తు. 1. గ్రామము: చూ, నీమ. 1; 2. దేశము: చూ, సీమ. 1.
నీవము, సం. వి. అ. న. 1. చూరు: చూ, వెలిసె; 2. బండికంటి నడిమికమ్మి: చూ, బండికల్లు; 3. చూ, విపినము; 4. రేవతి: చూ, రిక్క. 1. ౨౭.
నీశారము, సం. వి. అ. పుం: చూ, రూ-నిశారము.
నీహారము, సం. వి. అ. పుం: చూ, రూ-నిహారము.
నీళ, సం. వి. ఆ. స్త్రీ. విష్ణుభార్యలలో నొకతె: చూ, లక్ష్మి. 1.
నీళ్లగాఁడి, వా. వి: చూ, లట్టు. 1.
నీళ్లపాఁబుడు, వా. వి: చూ, వెల్లవ.
నీళ్లమ్ముకొనునది, అం. దూతీచతుష్టయమునందలి మూఁడవదానిలోని పదియాఱింటిలో నొకటి. చూ, దూతీచతుష్టయము.
నీళ్లఱేఁడు, వా. వి: చూ, వరుణుఁడు.
నీళ్లరేనిరిక్క, ద్వ. వి: చూ, రూ-నీటిఱేనిరిక్క.
నీళ్లవరుగు, ద్వ. వి. ఉప్పు: చూ, లవణము.
నీళ్ళాటబొద్దులు, వా. వి. బ. తొమ్మిదినెలలు నిండిన పిదప ప్రసవమగు సమయమందలి సూచనలు.
నీళ్ళాటరేవు, ద్వ. వి. చూ, రూ-నీరాటరేవు.
నీళ్ళాడు, ద్వ. అ. క్రి. 1: చూ, ప్రసవించు. భార. శల్య. 2,ఆ. 160; 2: చూ, స్నానమాడు.
నీళ్ళనమలుట, జా. మాంద్యము వహించుట. "నీవివియన్నియు నీళ్లనమలక" (నీతిచంద్రిక విగ్రహము.)

# ను

ను, సం. అవ్య. 1. ప్రశ్నార్థకము: చూ, ప్రశ్నము; 2: చూ, యోచన; దే. అప. (1) నా శబ్దమునకు ప్రథమైకవచనమునందు వచ్చెడు ప్రత్యయము. "నేను"; (2) తఱుచుగ అమహద్వర్తక శబ్దములకు ద్వితీయైకవచనమునందు వచ్చెడు ప్రత్యయము. "వనమును"; (3) క్రియలలో తద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనమునందును, తద్ధర్మవర్తమాన భవిష్యద్వ్యతిరేకార్థకోత్తమపురుషైకవచనము అందును వచ్చెడు ప్రత్యయము. "కొట్టును, కొట్టుదును, కొట్టుచున్నాను, కొట్టఁగలను, కొట్టను" మొ; అవ్య. (4) సముచ్చయార్థమును తెలుపును. (ఇది ఉకారేతరముపమీఁద యువర్ణపూర్వకముగా వచ్చును. భార.ఆది. 1, ఆ. 12; ఆ యువర్ణము ఒకానొకచో లోపించును. భార. సభా. 2, ఆ. 282; భార. భీష్మ. 1, ఆ. 31; వను. 3, ఆ. 173): చూ, సముచ్చయము: చూ, యు; (5) అవధారణార్థకము: చూ, సత్యము. 1; (6) సహితార్థకము. స్వా. 1, ఆ. 72: చూ, సైతము; (7) వ్యతిరేకార్థద్యోతకమైన ప్రశ్నమునందు సహితార్థమును తెలుపును. జై. 1, ఆ 85; (8) ఏని, ఐన అను వానివలె వ్యతిరేకార్థద్యోతకమైన ప్రశ్నమునందు వచ్చును. భార. ఉద్యో. 1,ఆ. 28; ఉద్యో. 4, ఆ. 285; (9) ఎటులు, ఎట్టు, ఎట్టు అను శబ్దములు కడపటఁజేరినప్పుడు ఏవిధముచేతనైన అను నర్థమును తెలుపును. భార. అర. 1, ఆ, 49: (10) కొన్నిచోట్ల అర్థవిశేషములను తెలుపును. భార. అని. 1, ఆ. 14; (11) వ్యతిరేక క్రియలమీఁద వికల్పార్థమును తెలుపును. భార. ద్రో. 3, ఆ. 162; (12) పాదపూరణమందు అంతలోనగు శబ్దముపమీఁద వచ్చును (13) "న"కారము ద్రుతము. ద్ర. (14): చూ, ని. (2). అం, భా. తృ 67.
నుంకు, దే. వి వస్తు. చూ, లంకణము.
నుక్కట, దే. వి. చలనము; చూ, లోలము.
నుగ్గాట, దే. వి. హింస. అం, పదా. నర. 115; చూ, వధము.
నుగ్గాడు, దే. స. క్రి. 1. చంపు. అం, భా. తృ. 123; చూ, సంహరించు; 2. ఖండించు: చూ, నెలగు
నుగ్గు, దే. వి. 1. తునుక: చూ, శకలము. 4; 2: చూ, సుదుము; బ. 3: చూ, పిసక; అ. క్రి. 4. నుగ్గగు, నలఁగు, లక్ష్మి. 4, ఆ. 114; చూ, నదమదమగు.

నుగ్గులువారు, దే. అ. క్రి: చూ, నుగ్గు. 4.
నుచ్చిళ్లు, దే. వి. బ: చూ ఫేనము.
నుచ్చె, దే. వి 1. గొఱ్ఱెల మేఁకల వెంట్రుక. స్వా. 3, ఆ. 60: చూ, శమలము 1: స. క్రి. 2. నుచ్చుపొంతలుచుట్టు.
నుచ్చెపొంత, ద్వి. వి. గొఱ్ఱెల మేఁకల చన్నులకుఁ జుట్టెడు గుడ్డ.
నుచ్చెన, వా. వి: చూ, మాదపట్టు.
నుజ్జు, దే. వి. క్షతినొందినది.
నుడి, దే. వి. (రూ-నుడికారము-నుడువు-నుడుగు-నుడువు-నొడి-నొడికారము-నొడుగు-నొడువు) 1: చూ, శబ్దము. 2; 2. వచనము: చూ, శబ్దము. 2: 3. చెడ్డపేరు: చూ, బన్నము.2.
నుడికారము, దే వి. 1. మాటచమత్కారము: రూ-నొడికారము; 2: చూ, రూ-నుడి. 1. ఆం, భా. ప్ర. 110.
నుడివోనలుఁగు, దే. వి. ముమ్మొనవాలు. ఆం, పదా. సుర, 12: చూ, బాణము. 1.
నుడు, దే. వి చూ, రూ-నుడి. 1.
నుడుగు, 1.—పై —; స. క్రి. 2. చెప్పు: చూ, వచించు.
నుడుగుజేఁడు, దే. వి. చూ, వేల్పుటొజ్జ.
నుడుపరి, దే. విణ. 1. మాటలమారి; చూ, వక్త. 1; 2. చెప్పువాఁడు: చూ, వక్త. 1.
నుడువు, చూ, రూ-నుడుగు.
నుతము, సం. విణ. నుతింపఁబడినది: చూ, స్తుతము.
నుతి, సం. వి. ఇ. స్త్రీ: చూ, స్తోత్రము.
నుతించు, సం. స. క్రి: చూ, స్తుతించు.
నుతిరి, దే. వి: చూ, సమూహము
నుత్తము, సం. విణ. త్రోయఁబడినది: చూ, విద్ధము.
నుదురు, వై. వి.=నిటల (దేశ్యమని శ. ర.): చూ, లలాటము: పా. 2. దీనికి ఉపమానము.—అర్ధచంద్రుఁడు.
నును, దే. విణ. 1. వృత్తియందు నునుపుశబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (వృత్తియందది అల్పార్థకమునగును. ఉదా.-నునుఁజెక్కిలి, నునుసిగ్గు మొ) (హల్లుపరమగుచో కడపటి ఉకారము వికల్పముగ లోపించును.) (నున్బూది మొ.); ద్రి. 2. చార్థకము: చూ, ని. ఆం, భా. తృ. 67.
నునుపరి, దే. విణ. నునుపుగలది: చూ, స్నిగ్ధము. 2.
నునుపు, దే. వి 1. నున్నన: చూ, స్నిగ్ధము. 3; విణ. 2. నున్ననిది: చూ, స్నిగ్ధము. 2.
నున్న, దే. వి. 1 నున్ననిఉముక; విణ. 2. నునుపైనది: చూ, స్నిగ్ధము. 2.
నున్నన, దే. వి (రూ - నున్న - నునుపు - నున్నదనము): చూ, స్నిగ్ధము. 2.
నున్నము, దే. విణ: చూ, నుత్తము.
నుయి, దే. వి. (రూ - నుయ్యి - నూయ - నూయి) చేఁదబావి. పాండు. 4, ఆ. 274: చూ, సరస్సు. 1—గాఁ.
నుయ్యి.—పై.—
నురుగు, దే. వి. 1. రూ - నురువు: చూ, నుచ్చిళ్లు. రాజ. 1, ఆ. 84; 2. గతిలేనిశరము, సరుకు: చూ, బాణము. 1.
నురుఁగుచబ్బి, దే. వి: చూ, యక్కృత్తు.
నురువు, దే. వి. రూ - నుర్వు: చూ, రూ - నురుఁగు. 1.
నురువుడు, దే. వి. సస్యమంజరీ చూర్ణము: చూ, స్తంబకరి.
నుర్వు, దే. వి: చూ, రూ - నురువు. ఆ, భా. ప్ర. 154.
నులిచిపుచ్చు, దే. స. క్రి నాశముచేయు. రాఘ. 4, ఆ. 122: చూ, సరిపెట్టు.
నులిపిడి, దే. వి. (రూ నూర్పిడి-నూర్పు నూర్పిడి- నూఱుపు) ధాన్యాదికమును కాళ్ళతోను మూఁకలతోను త్రొక్కి నులుచుట. భార. ద్రో. 3, ఆ 268: చూ, నూఱుపు.
నులుచు, దే. స. క్రి. (రూ - నుఱుపు - నూర్చు - నూఱుచు) ధాన్యాదికమును కాళ్లతోను దూడలతోను త్రొక్కినుఱుచు.
నుఱుపు, 1.—పై.—; 2. చంపు: చూ, సంహరించు: 3. ప్రహరించు ఆం, భా. తృ. 124: చూ, మొత్తు. 2.
నుఱుమాడు, దే. స. క్రి. 1: చూ, పొడిసేయు; 2. చంపు. భార. కర్ణ. 2, ఆ. 376: చూ, సంహరించు.
నుఱుము, దే. వి.: చూ, సురుము. భార. ఆది. 6, ఆ. 160; స. క్రి. 2: చూ, పొడిసేయు; 3: చూ, నుఱుమాడు. 2.
నుఱుముచేయు, ద్వి. స. క్రి: చూ, నుఱుమాడు.
నులక, దే. వి. రూ - నులక్క. మంచమల్లెడుగోఁగు, జనుము, మొగలిలోనగువాని నారతోఁ పేనిన (త్రాడు) దారము: చూ. సూత్రము. 1.
నులి, దే. వి. 1. ప్రేగులలోనొప్పి; 2. చిక్కు. ప్రభా. 2, ఆ. 42; కళా. 5, ఆ. 113: చూ, స్రుక్కు. 3; విణ. 3: చూ, స్వల్పము. "నులివెచ్చ - నులివేఁడి."
నులించు, దే. ప్రే. నులియఁజేయు: రూ - నులుచు - నులుపు, నులివెట్టు.
నులికొమ్ములమెకము, ద్వి. వి. జింక. సాంబ. తిర్య. 4: చూ, హరిణము. 1.
నులిగుల్ల, ద్వి. వి. క్షుద్రజలచరము: చూ, మత్స్యము. 1.
నులిగొను, దే. అ. క్రి. చిక్కుపడు: చూ, సంతాపించు.
నులితడ, దే. వి: చూ, మహోజలః.
నులిపురుగు, ద్వి. వి. కడుపులోని సన్నని యెమిడిక: చూ, పురుగు.
నులియు, దే. అ. క్రి. 1. ఏదైననొకటి తాఁకుటచే స్థానము తప్పి యిట్టట్టుతొలఁగు. భార. శల్య. 1, ఆ 176; 2. పొడియగు: చూ, వలియు.
నులివాళ్లు, దే. వి. బ. కొంచెమువాడుటలు: చూ, వసివాళ్లు.
నులివాళ్లవాడు, దే. అ. క్రి. కొంచెముపాడు.
నులివు, దే వి నులియుట. (ఉలివువంటిది.)
నులివెచ్చ, దే వి. మందోష్ణము: చూ, వేఁడిమి.
నులివెచ్చన,—పై.—
నులివెట్టు, దే. స. క్రి: చూ, నులించు.
నులుచు, దే. ప్రే.—పై.—
నులుపు, దే. ప్రే: చూ, నులివెట్టు.

నుఱుము, దే స. క్రి. 1. చంపు. ఆం, భా. తృ. 123: చూ, సంహరించు; 2. తొడ బుగ్గ లోనగువానికండ రెండు వ్రేళ్ళతో అటునిటునొక్కి త్రిప్పు. కళా. 4, ఆ. 41 : చూ, వడివేయు; 3 ఉన్మూలించు : చూ, ఛేదిల్లు.

నులుసు, దే. వి. న్యూనత : చూ, వెలితి. 2.

నుల్క, దే. వి: చూ, రూ - నులక.

నువు, దే. వి. (రూ - నువ్వు - నూ - నూవు) 1. సస్యవిశేషము : చూ, సస్యము. 1; బ. 2. తెలికలు : రా. వి. 3, ఆ. 48 : చూ, నువ్వులు.

నువ్వు, వా. వి. 1 : చూ, నీవు. (అప్ర) ; 2 : చూ, నువ్వు.*.

నువ్వు (నువ్వులు), దే. వి. బ. (బహుర క్తము జారీచేయును.) 1 : తెలకలు - తెలికలు, నువు - నువ్వు - నూ - నూగు - నూవు, బొట్టుగు - బొట్టువు. (సం. ప.)—కిరండము, కాకగుడము, కాకరుహము, కుతపము, కురవము, క్షీరకము, ఖురకము, ఛిన్నరుహము, తిల, తిలకము, శ్రీమాన్. తద్వి.—౧. అడవి నువ్వులు. (సం. ప.)—జర్తిలము ; ౨. కుటినువ్వులు - కుఱునువ్వులు; ౩. పొట్టినువ్వులు. (సం. ప.)—కాతిలలు, కాతువరిక ; ౪. పొల్లనువ్వులు. (సం. ప )— తిలపింజము — తిలపేజము. (మిగతవానికి "శ్రీమాణ" చూడుము) ; 2 : చూ, నవధాన్యములు, ధాన్యము.

నువ్వులనూనె, వా. వి. తిలతైలము : చూ, స్నేహము. 2.

నుస, దే. వి. 1. కండూతి. ఆం, భా. ద్వి. 129 : చూ, విదర్చిక ; వా. 2. గొంతుకలోని పొడిదగ్గు.

నుసమ, దే. వి: చూ, రూ - నుసుమ: (చూ, మశకము. 1-౪.)

నుసము, దే. వి: చూ, మసము.

నుసలు, దే. అ. క్రి. 1. ఆలస్యముచేయు: చూ, వివరించు. 3; 2. పూను: చూ, వహించు; స. క్రి. 3. (ఒళ్లు) విఱుచుకొను, శశాం. 4, ఆ. 62: చూ, విఱుచు.

నుసి, దే. వి. 1. పురుగులుతొలువఁగా రాలు మ్రానిపొడి ; చూ, పురుము; 2: చూ, స్వల్పము.

నుసిపురుగు, ద్వ. వి. ఘుణము: చూ, పురుగు.

నుసుఁగు, దే. స. క్రి: చూ, తిరస్కరించు. నై. 7, ఆ. 130.

నుసుమ, దే. వి. కండ్లయందు ముసరెడు చిన్నదోమ: రూ - నుసమ.

నుసుము, దే. స. క్రి. ఆకర్షించు. వసు. 4, ఆ. 23: చూ, రెమ్ము. 2.

నుసులు, దే. వి. 1. అలఁతి. భార. శల్య. 2, ఆ. 267: చూ, లాఘవము. 1; అ. క్రి. 2. కొంచెము చలించు, మొదలు. పా. 2, ఆ. 126 : చూ, సలించు.

## నూ

నూ, దే. విశే. 1. వృత్తియందు నూవుశబ్దమునకు అంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (ఉదా.—నూఁబిండి - నూఁబువ్వ మొ): 2: చూ, రూ - నువ్వులు.

నూఁక, దే. వి. ఒకానొకచెట్టు: చూ, వృక్షము.

నూఁగారు, వా. వి. రూ - నూఁగాఱు. 1: చూ, రోమరాజి ; ఆం. 2. దీనికి ఉపమానములు. -తుమ్మెదచలచాలు, చీమలబారు, సలాకు, కత్తి, నల్లత్రాఁచు, ఇంద్రనీలమణులవరుస, ధూమము, మబ్బు మొ.

నూఁగు, దే. వి. 1. కొన్నియాకులమీఁదను, కాయలమీఁదను ఏర్పడియుండు చిన చిన్నముండ్లు : చూ, సితాగ్రము ; 2. వడ్లులోనగువాని రేణువు, రూ - నూఁగుడు : చూ, సితాగ్రము; 3. లేఁతదనము. భార. విరా. 1, ఆ. 245: చూ, సౌకుమార్యము. 1; విశే. 4. లేఁత: చూ, సుకుమారము.

నూఁగుడు, దే. వి: చూ, రూ-నూఁగు. 2.

నూఁగుదోస, దే. వి. కూఁతురుబుడము*: చూ, హరివాలుకము.

నూక, దే. వి చూ, శంబూకము.

నూకపొట్టు, వా. వి. ఊఁక: చూ, తుషము.

నూఁచు, వా. స. క్రి. 1. తుడుచు, ఊడుచు (రాయలసీమలో వాడుక): చూ, సమ్మార్జించు; 2. తుడుచు, ఒత్తు: చూ, ప్రాము. 4; 3. త్రోలు స్వా. 4, ఆ. 44. చూ, వెలుచు.

నూకుడు, దే. వి. త్రోపుడు: చూ, నిషేధము.

నూగు, దే. వి: చూ, రూ-నూవు*.

నూచ, దే. వి. రూ-నూచము. పొడి. భార. భీష్మ. 2, ఆ. 211: చూ, సురుము.

నూచము, —పై.—భార. భీష్మ. 2, ఆ. 361.

నూతనము, సం. విశే. రూ-నూత్నము: చూ, హొస.

నూతనుఁడు, సం. విశే: ఆధునికుఁడు, నవీనుఁడు. (తె. ప.) - క్రొత్తవాఁడు.

నూతిమొలి, వా. వి: చూ, బావిమొలి.

నూత్నము, సం. విశే: చూ, రూ-నూతనము.

నూదోస, దే. వి: చూ, రూ-నూఁగుదోస*.

నూనము, సం. క్రి. విశే, అ. న: చూ, నెట్టన.

నూనియ. ద్వ. వి. రూ-నూనె. 1. తలచమురు. వసు. 5, ఆ. 74: చూ, స్నేహము. 2; 2. తైలము: చూ, స్నేహము. 2; 3. నువ్వులనూనె: చూ, స్నేహము. 2.

నూనె, ద్వ. వి. (నూవు + నేయి)—పై.—; వా వి. 4. తైలములు ఇంటిపేరుగాగలవారు. (నూనెవారు, నేతివారు, వెన్నవారు, ఇత్యాదు లూహ్యంబులు.)

నూనెముడి, ద్వ. వి: చూ, వేనలి. స్వా 3, ఆ. 31.

నూనియగిన్నె, ద్వ. వి. నెల్లగిన్నె*: చూ, శుకనాసము. 1.

నూపురపాదిక, అం: చూ, ఆకాశచారులు.

నూపురము, సం. వి. అ. పుం. న. 1. అందె: చూ, భూషణము. 2; అం. 2. చూ, కరణములు.

నూయి, దే. వి: చూ, రూ-నుయి; వా. 2.నూయి యింటిపేరుగాగలవారు "నూతివారు" (ఇట్లు చెరువువారు, గోదావరివారు, సముద్రమువారు ఇత్యాదులూహ్యంబులు.)

నూయి, —పై.—

నూరి(టి)పోయుట, జా. బాగుగ బోధసేయుట. "అప్పుడీతనిఁ జేరఁదీయవలదని మీరెంత తెంత తెన్నెన్ని విధములనో నూరి(టి)పోసిరి." (నీతిచంద్రిక-విగ్రహము.)

నూర్చు, దే. స. క్రి: చూ, రూ-నూఱుచు.
నూర్పిడి, దే. వి: చూ, రూ-నూఱిపిడి.
నూర్పు, దే వి: చూ, రూ-నూఱుపు.
నూఱంచులకత్తిచేఁగాంచుజోదు, ద్వ. వి. వజ్రపాణి,ఇంద్రుఁడు. వేం, ఆం. 12: చూ, సహస్రాక్షుఁడు.
నూఱంచులకైదువు, దే. వి. శతకోటి, వజ్రాయుధము. లక్ష్మీ. 2, ఆ. 46: చూ, బాణము. 1.
నూఱంచులవాలు, —పై.—
నూఱాఘ్లు, జా. విస్తారము. "నొచ్చినకరువాత గిడలు నూఱాఘ్లు వడవచ్చునే." (రామాభ్యుదయము.)
నూఱిపిడి, దే. వి: చూ, రూ-నుఱిపిడి.
నూఱు, దే. స. 1. వంద: చూ, సంఖ్య. 1; స. క్రి. 2: చూ, వాడిచేయు; 3. సన్నెకంట మర్దించు: చూ, మర్దించు.
నూఱుచు, దే. అ. క్రి: చూ, రూ-నుఱుచు.
నూఱుచుక్కలఱ్ఱోపు, వా వి. శతభిషము: చూ, రిక్క.
నూఱుట, వా. వి. పొడిచేయుట: చూ, నురుము.
నూఱుపు, దే. వి చూ, నుఱిపిడి.
నూఱుఱాయి, వా. వి. 1. సన్నెకల్లు: చూ, రాయి; 2 మంగలి కత్తి నూఱుఱాయి: చూ, రాయి.
నూఱువందలు, వా. స. పదివేలు: చూ, సంఖ్య. 1.
నూఱువేలు, వా. స. లక్ష, నియుతము: చూ, సంఖ్య. 1.
నూలాసు, వా. వి. సరకుపోయు వస్తువిశేషము.
నూలిగరసు, దే. వి: చూ, బట్టతల.
నూలు, దే. వి. ప్రత్తివడికినపోఁగు: చూ, స్తోకము; వా. 2. నూలు యింటిపేరుగాఁ గలవారు. "నూలువారు".
నూలుకండె, దే. వి. చూ, సరిక.
నూలుకొను, దే. అ. క్రి' రూ-నూల్కొను. 1: చూ, సమ్మతించు; 2: చూ, మట్టుపడు; 3: చూ, సరిపడు. 2; 4: చూ, వ్యాపించు. (ప్రే. నూలుకొలుపు-నూలుకొల్పు. సమ్మతింపఁజేయుటకు.-కళా. 7, ఆ. 157; మట్టుపఱచుటకు.—భార. విరా 4, ఆ. 187.)
నూలుకోలు, దే వి. నూలుకొనుట.
నూలుపోఁగితుకు, వా. వి: చూ, క్రొత్తముట్టు.
నూల్కొను, దే. అ. క్రి: చూ, రూ-నూలుకొను. (మట్టుపడుటకు.—భార. ఉద్యో. 2, ఆ. 174.)
నూవు, దే. వి: చూ, రూ-నువ్వు.
నూవుచేను, దే. వి. తిల్యము. ఆం. భా. ద్వి. 229: చూ, భూమి. 1.

# నృ

నృగాదికము, అం. నాటికలు 18 లో నొకటి.(ఒకచే యంకము, గానము, సంభాషణముగలది): చూ, నాటికలు.
నృత్తము, సం. వి. అ. న. 1. రూ-నృత్యము. నర్తనము, కేవలభావాశ్రయము (కాళ్లతో గంతులువైచుట): చూ, వ్యంజకము. 1: (చూ, నాటకము); 2.=నెత్తము. జూజము: చూ, వ్యవహారము. 4.
నృత్తహస్తములు, ఆం. ఉద్ధృతము, తలముఖము, విప్రకీర్ణము, గజదంతము, అరాళకటకాముఖము, ఆవిద్ధవక్త్రము, సూచీవిద్ధము, రేచితము, అర్ధరేచితము, పల్లవము, నితంబము, కేశబంధము, లత, కరిహస్తము, దండపక్షము, ఊర్ధ్వమండలము, పార్శ్వమండలము, ఉరోమండలము, నలినీపద్మకోశము, ఉరఃపార్శ్వమండలము, కపోతము, మకరము, జ్ఞానము, వరదాభయము, ముద్ర, గరుడపక్షము, ముష్టిస్వస్తికము, ముకుళస్వస్తికము, ప్రయుక్తాలపల్లవము (29).
నృత్యము, సం. వి. అ. న. తాళలయాన్వితము. (మాటలాడకుండ భావమును హస్తాద్యవయవములచేఁ గనఁబఱచుట): చూ, నృత్తము. 1.
నృపతి, సం. వి. ఇ పుం. 1. రాజు: చూ, రాజు. 1; 2: చూ, శ్రీసుఁడు.
నృపపదము, ఆం. (దీనినే రాజ్యపదమందురు): చూ,ఆరూఢము.
నృపలక్ష్మము, సం. వి. న్. న. రాజునకుఁబట్టెడు తెల్లగొడుగు: చూ, వారిత్ర.
నృపాలుఁడు, సం, వి. అ. పుం: చూ, నృపతి. 1.
నృపుఁడు, —పై.—
నృశంసుఁడు, సం. విణ: చూ, హింసకుఁడు.
నృసింహము, అం. (నరసింగము): చూ, విన్నాణములు.
నృసింహావతారము, అం. (నారసింహము): చూ, అవతారములు.
నృసింహుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, విష్ణువు. 1; 2. నరశ్రేష్ఠుఁడు: చూ, సింగఁడు. 1.
నృహరి, సం. వి. ఇ. పుం.—పై.—

# నె

నె, దే విణ నెలనెతిశబ్దములకు వృత్తియందు అంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (వృత్తియందు దీనిమీఁదిహల్లునకుద్విత్వమువచ్చెడి.ఉదా.-నెలశబ్దమునకు-నెచ్చెలి.నెత్తమ్మి, నెత్తఱి, నెత్తామర, నెత్తావి, నెమ్మది, నెవ్వగ, నెవ్వడి మొ. నెతిశబ్దమునకు – నెన్నడ, నెన్నడుము, నెన్నుదురు, నెన్నొసలు, నెమ్మొయి,నెమ్మేను,నెమ్మొగము,నెమ్మోము మొ. నెన్నడ, నెన్నడుము, నెమ్మేను ఇత్యాదిస్థలములయందు నెతిశబ్దపూర్వకమై అర్థము పొసఁగి యుండునట్లు నెలశబ్దపూర్వకమై పొసఁగియుండదని యెఱుంగవలయును. కొన్ని యెడల తత్సమపదము పరమగునపుడును ద్విత్వము కానఁబడుచున్నది. "నీవు నెమ్మనమున" భార. అర. 4, ఆ. 377.
నెంజిలి, దే. వి. మనోవ్యథ: చూ, శోకము.
నెక్కట, దే. వి. ఒకానొకచెట్టు: చూ, వృక్షము.
నెక్కొను, దే. అ. క్రి. (రూ - నెట్టుకొను - నెలకొను - నెలవుకొను) 1. పాదుకొను. భార. ఉద్యో. 1, ఆ. 287: చూ. స్థిరపడు; 2: చూ, మట్టుపడు; ప్రే. 3. (రూ - నెక్కొలుపు - నెక్కొల్పు) భార. విరా. 1, ఆ. 321.
నెక్కోలు, దే. వి. నెక్కొనుట.
నెగడి, దే. వి. 1. దుష్టమృగములు బెదరుటకును, చలికాఁచుకొనుటకును వేసెడుమంట: చూ, వహ్ని. 1; 2: చూ, భూతము.

నెగసు, దే. వి. రూ-నెవసు. 1. అగసు: చూ, మత్స్యము. 1; 2: చూ, తంతినాగము; అ. క్రి. 3. బయలు మెఱయు. భార. విరా. 1, ఆ. 143; 4: చూ, వర్థిల్లు.
నెగపు, దే. వి. 1: చూ, హంకారము; 2. మండిపడుట: రూ-ఎగపు- ఎగసిపాటు, గోరింపు.
నెగయు, దే. అ. క్రి. రూ-నెవయు-ఎగయు. 1. ఎగురు: చూ, లంఘించు; 2. పైకిలేచు. భార. విరా, 1, ఆ 152: చూ, రేగు.
నెగయుదెంచు, —పై.— భార అది. 5, ఆ. 173.
నెగవు, దే. వి: చూ, సందీనము.
నెగులు, దే. వి. (రూ-నెవులు — నొగులు-నోవి - నొవ్వ-నొవ్వు-నోవు) 1. నొప్పి: చూ, శ్రమము. 1; 2 దుఃఖము; చూ, శోకము; 3. దుఃఖరూపమైన విచారము: చూ, శ్రమము. 1. (శోకము.)
నెగ్గడము, వై. వి. 1.=నిఘట్టన: చూ, సమ్మర్దము; 2.=వికట: చూ, సాంద్రము.
నెగ్గు, దే. అ. క్రి: చూ, రంజించు.
నెగ్గుట, వా. వి. చెల్లుబడి : చూ, రసము. 1.
నెగ్గురు, దే. వి. గుండె యదురుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.
నెచ్చు, దే. వి. మిక్కిలి సన్నమైన నూకలసమూహము: చూ, శంబుకము.
నెచ్చెలి, దే. వి. 1: చూ, స్నేహితుఁడు; 2. సఖురాలు: చూ, స్త్రీ.
నెటిక, దే. వి. రూ-నెట్టిక. వ్రేళ్ళ కీళ్ళ చప్పుడు; చూ, చిటిక.
నెటుకతట్లు, దే. వి. చూ, బాలక్రీడ.
నెటికురు, దే. వి నెటికవిఱుఁగుటయందగు ధ్వన్యనుకరణము. జై. 8, ఆ. 17: చూ, హూహూ.
నెట్టన, దే. అవ్య. క్రి. విశ. అనివార్యముగ. భార- ఆది. 5,ఆ. 58: చూ, భృశము. (రూ-నెట్టనము.)
నెట్టనము, దే. అవ్య. —పై.—
నెట్టపంట, దే. అవ్య. క్రి. విశ. నిష్కారణముగ.
నెట్టము, వా. వి. నెమలియీఁకలచే బేసిన దారము. (రూ-నెట్టియము-నెట్టెము): చూ, సూత్రము. 1.
నెట్టిక, దే. వి: చూ, రూ-నెటిక.
నెట్టికసీల, వై. వి. 1.=నైష్ఠికశీల. సదాచారసంపన్నమగు స్వభావము గలవాఁడు. జై. 6, ఆ. 190. చూ, నైష్ఠికుఁడు; విశ. 2.=నైష్ఠికశీలా, సదాచారసంపన్నమగు స్వభావము గల యాఁడుది: చూ, స్త్రీ.
నెట్టియము, దే. వి. (రూ-నెట్టెము-నెట్టము) 1: చూ, రూ-నెట్టము; 2. చుట్టకుదురు; చూ, మట్టు. 3; 3. గుండుపాగ: చూ, పాగ. 2.
నెట్టు, దే. వి. 1. చోటు: చూ, స్థానము. 1; 2. ఉపద్రవము: చూ, శోకము; 3: చూ, యత్నము; 4. రూ-నట్టు. ఉప్పురాను ఖండెడు చోటు: చూ, భూమి. 1; 5: చూ, బాలక్రీడ; స క్రి. 6. పూనిత్రోయు. భాగ. 3, స్కం. 13.
నెట్టుకొను, దే. అ. క్రి. 1: చూ, యత్నించు; 2: చూ, స్థిరపడు; 3; చూ, ముమ్మరించు. శశాం, 3, ఆ 4; స. క్రి. 4: చూ, బలాత్కరించు; వా. 5. అడ్డుకొను.
నెట్టుకుగాయ, వా. వి: చూ, నెట్టు. 5.
నెట్టె, దే. వి. పోలిక: చూ, సమానము. 2
నెట్టెము, దే. వి. ద్వీపము (అప్ర): చూ, లంక. 1.
నెత్తికమ్మ, దే. వి. (నెత్తము+కమ్మ) పాచికల పందెము. శశా 6, ఆ. 118: చూ, వ్యవహారము. 4.
నెత్తపుఁబలక. ద్వ. వి. (నెత్తము+పలక) రూ-నెత్తపలక; చూ, శారిఫలము. (వాడుక) (నెత్తపలము అని కొందఱు.)
నెత్తపలక, —పై.— (వాడుక.)
నెత్తము, దే వి. 1. దెప్ప, సున్నపు. స్వా, 4, ఆ. 78: చూ, పర్వతము; 2.=నృత్త. పందెము: చూ, వ్యవహారము. 4; 3.=నృత్త. పాచికలాట. జై. 3, ఆ. 42: చూ, వ్యవహారము. 4.
నెత్తమ్మికొలనికాఁపు. ద్వ. వి. గాలి. వేం, ఆం. 13; చూ, వాయువు.
నెత్తమ్మిదిమ్ముల నిసురమందు, ద్వ. వి. చంద్రుఁడు: చూ, హిమాంశువు. వేం, ఆం. 11.
నెత్తరి, వా. వి. జూజరి. ఆం, పదా. నర. 53: చూ, పందెకాఁడు.
నెత్తలులు, దే. వి. బ (నెఱ+తరగలు) 1. పెద్దయలలు: చూ, వీచి. 1; 2. రూ-ముత్తరులు. ఆం, భా. ద్వి. 137: చూ, వళి. 1.
నెత్తి, దే. వి. తల. జై. 8, ఆ. 98; చూ, శిరము. 1. (తల పైభాగమని కొందఱు).
నెత్తికాయ, వా. వి.— పై. —"సీనెత్తికాయ".
నెత్తిరాప, వా. వి. తప్పనిసరి.
నెత్తురు, దే. వి. రూ-నెత్రు: చూ, రక్తము.
నెత్తురుఁబ్రొద్దు, ద్వ. వి: చూ, సందెజాము. స్వా. 4, ఆ. 60.
నెత్తురుకందు, ద్వ. వి. రూ-నెత్రుకందు. పాండు. 3, ఆ. 156: చూ, శిశువు.
నెత్తురుగడ్డ, వా. వి: చూ, వ్రణము. 1.
నెత్తురుద్రావుఁడు, దే. వి: చూ, రాక్షసుఁడు. 1. అచ్చ. యు,కాం. 60.
నెత్తురుపెనుపొడ, వా. వి. ముఙ్జుఁబాము: చూ,సర్పము.
నెత్తురుపొడ, దే. వి.—పై.—
నెత్తురుబంక, దే. వి మలముతో నెత్తురును బంకయును పడు రోగము: చూ, రోగము. 1.
నెత్తురువాలు, దే. అ. క్రి: చూ, పల్లటిల్లు.
నెత్రు, దే. వి: చూ, రూ-నెత్తురు.
నెత్రుకందు, ద్వ. వి: చూ, రూ-నెత్తురుకందు.
నెనడు, దే. వి: చూ, మూలగ. భార, ద్రో. 2, ఆ. 312.
నెనరు, దే. వి. 1. ప్రేమము: చూ, స్నేహము; 2. కృతజ్ఞత: చూ, కుశము.
నెన్నడుము, వా. వి: చూ, మధ్యము. 1. సాంబ. మాన. 15.
నెన్నుదురు, వా. వి: చూ, లలాటము. వేం, ఆం. 37.

నెన్నుదుళ్ళను వ్రాయుదు నేను, వా. వి: చూ, బ్రహ్మ. 1. అం. పదా. సుర. 17.
నెన్నొసలు, వా. వి: చూ, నెన్నుదురు.
నెపము, వై. వి. (రూ-నెవము-నేవము) 1. = నిభః. మిష, కపటము: చూ, వ్యాజము. 1; 2: చూ, సిగ్గు. అం, భా. ప్ర. 38; 3. కారణము. భార. అవి. 8, ఆ. 112: చూ, హేతువు. 1; 4. తప్పు. భార. అర. 5, ఆ. 318: చూ, సొంటు; వా. 5. లేనిది మీఁద మోపుట.
నెప్పరము, దే. వి. రూ-నెప్పళము. వేగము. పా. 4, ఆ. 66: చూ, స్యదము. 1.
నెప్పరి, దే. విణ. 1. ఉపాయశాలి. చూ, సమర్థుఁడు: 2. ఉపాయశాలిని: చూ, స్త్రీ
నెప్పరించు, దే. స. క్రి: చూ, రుజువుపరచు.
నెప్పళము. దే. వి: చూ, రూ-నెప్పరము.
నెప్పు, దే. వి. 1. చోటు: చూ, స్థానము. 1; 2: చూ, స్థైర్యము; 3: చూ, వెరవు; 4: చూ, విధము. 1: విణ. 5: చూ, నిలువరము. 1.
నెప్పుకొను. దే. అ. క్రి: చూ, స్థిరపడు. స్వా. 4, ఆ. 34.
నెమకు, దే. స. క్రి: చూ, వెదకు. పా. 2, ఆ. 33.
నెమకుట, వా. వి: చూ, వెదకుట.
నెమకుడు, —పై.—
నెమరు, దే. వి. 1: చూ, రోమంథము; 2. నెరుసు: చూ, రేణువు. 1.
నెమరుచు, దే. అ. క్రి. రూ-నెమరుచ్చు. నెమరువేయు.
నెమలి, దే. వి. 1. (రూ-నెమ్మి-నమలి-నమ్మి, నెమలి-నెమ్మిలి-నెవిలి): చూ, మయూరము; 2. రూ నెమలు*: చూ, పూతికరజము; అం. 3. (నెమలివలుకు): చూ, కూజితములు.
నెమలికన్ను, వా. వి: చూ, అర్ధచంద్రము. 5.
నెమలియడుగు, దే. వి. రూ నెమిలియడుగు. 1: చూ, పూతికరజము*; బ. 2. కుచనఖక్షతములు: చూ, స్ఫుటత: (చూ, నఖక్షతము).
నెమలు, వా. వి: చూ, రూ-నెమలి. 2*.
నెమిలి, దే. వి: చూ, రూ-నెమలి. 1. జై. 4, ఆ. 79.
నెమిలివడ్లు, దే. వి బ. శాలిధాన్యము: చూ, ధాన్యము.
నెమిలిసొరము, వా వి. షడ్జస్వరము: చూ, స్వరము. 2.
నెమురు, వా వి. 1. తైలలేపనము; 2. (బియ్యములోనగునవి) నెమురుట; 3. తడవుట.
నెమ్మది. వా. వి. 1: చూ, మదిమది. అం, భా. ద్వి. 181; 2: చూ, శాంతము. 1; 3. కుదిరిక: చూ, పాదు. 3; 4. ఆరోగ్యము.
నెమ్మయి, వా. వి: చూ, శరీరము. వేం, అం 36.
నెమ్మలిపరుఁజు, వా. వి: చూ, నెమ్మిలిపరుఁజు.
నెమ్మి, దే. వి 1: సంతోషము: చూ, హ్లాదనము; 2. చూ, శుభము. 1. అచ్చ. సుం, కాం. 86; 3. = స్నేహః: చూ. స్నేహము. 1. భార. అర. 1, ఆ. 63; 4. రూ-నెమ్మది: చూ, శాంతము. 1. భార. అర. 2, ఆ. 338: 5. రూ-నెమ్మది: చూ, మదిమది; 6. = నేమి. తినాసను*; చూ, వంజులము. 2; 7: చూ, రూ-నెమలి. 1; 8. = నేమి బండి కంటికడకమ్మి. రథనేమి: చూ, శకటము. 1.
నెమ్మిక, దే. వి: చూ, రూ-నెమ్మి. 3.
నెమ్మిజుట్టు, ద్వ. వి: చూ, సిగ. 1.
నెమ్మిరవుతు, ద్వ. వి. శిఖివాహనుఁడు: చూ, స్కందుఁడు. (ఇట్లు నెమ్మితేఁడు.)
నెమ్మిలి, దే వి: చూ, రూ-నెమలి.
నెమ్మిలిపరుఁజు, దే. వి. కర్రిపిసి: చూ, పిడి. 2.
నెమ్ము, దే. వి. 1. తడి: చూ, స్తేమము; 2. ఎమిరె: చూ, శల్మయి. 1; బ. 3. పలకలు, కలుపుచెక్కలు లోనగునవి ఒకదాని కొకటి చేర్చి యంటవేయ లోపలఁజొప్పించెడు మేకులు: బ. 4. బండిచక్రముల రంధ్రములయందు జొప్పించెడు ఇనుపగొట్టములు; వై. వి. 5. = నేమి: చూ, రూ-నెమ్మి. 8.
నెమ్ముకొను, దే. అ. క్రి. చూ, పదనుకొను.
నెమ్మేను, వా. వి: చూ, నెమ్మయి. వేం, అం. 36.
నెయి, వై. వి (రూ-నెయ్యి-నే-నేయి) = స్నేహః. 1. ఘృతము: చూ, హవిస్సు; 2. తైలము: చూ, స్నేహము. 2.
నెయ్యపుటలుక, ద్వ. వి. ప్రణయకోపము: చూ, రోషము.
నెయ్యపుతేఁడు, ద్వ. వి: చూ, మన్మథుఁడు.
నెయ్యమాడు, ద్వ. అ. క్రి. చూ, స్నేహించు.
నెయ్యమి, వై. వి. రూ-నెయ్యము. = స్నేహః. 1: చూ, స్నేహము; 2: చూ, సౌందర్యము.
నెయ్యము, వై. వి. = (రూ-నేయము-నెయ్యమి-నెమ్మి-నెమ్మిక) = స్నేహ.—పై.— (సౌందర్యమునకు.—భార. ఆది. 7, ఆ. 172.)
నెయ్యరి, ద్వ. విణ. 1: చూ, స్నేహితుఁడు, 2. సఖి: చూ, స్త్రీ. 1.
నెయ్యి, వై. వి. 1. =: చూ, రూ-నెయి; వా. స. క్రి. 2. (బట్టలు) నేయు. (అప్ర.)
నెయ్యుఁడు, వై. విణ. = చూ, స్నేహితుఁడు. భార. సభా. 1, ఆ. 77.
నెయ్యురాలు ద్వ. విణ. (నెయ్యము + ఆలు): చూ, నెయ్యరి. 2
నెర, దే. విణ. వృత్తియందు నెరవు శబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము: రూ-నెఱ-నెరా-నేరా.
నెరకు, దే. విణ. 1. గొగ్గి: చూ, రత్నము. 1; 2. సమము కానిది: చూ, విషమము.
నెరవు, దే. వి 1. రూ-నెరవు; చూ. వ్యాపనము; 2; చూ, పలితము. 1; విణ 3. అధికము: చూ, హెచ్చు. 1; క్రి. 4. నెరయుచు జేయు; 5: చూ, నించు; 6. నెఱవేర్పు. లక్ష్మీ. 2, ఆ. 76; 7. పఱపు; 8. వ్యాపింపఁజేయు; 9: చూ, దువ్వు. 5.
నెరయు, దే. అ. క్రి. రూ-నెఱయు, 1: చూ, వ్యాపించు. లక్ష్మీ. 3, ఆ 41; 2: చూ, మెండుకొను. భార. ఆది 3, ఆ. 157 3: చూ, సిద్ధించు.
నెరయొంటరి, వా. వి. తుమ్మెద. వేం, అం. 98: చూ, భ్రమరము.

నెరవంజి, దే. వి (రూ-నెరవు-నెరవెంద*): చూ, సరవెంద.
నెరవు, దే. వి. 1. రూ-నెఱవు. పూర్తి: చూ, సంపూర్ణ: 2. రూ-నెరపు. చుట్టుట: చూ, వ్యాపనము; 3. రూ-నెఱవు, దారి: చూ, మార్గము. 1; 4: చూ, రూ-నెరవంజి*; విశ. 5. రూ-నెఱవు. పూరణము: చూ, సంపూర్ణము; 6. అధికము: చూ, హెచ్చు. 1; 7. యుక్తము: చూ, యోగ్యము. 2; 8. విశాలము: చూ, విస్తారము. 1; 9: చూ, వ్యాపకము; 10; చూ, వ్యాప్తము' నై 5, ఆ. 161.
నెరవెంద, దే. వి: చూ, రూ-నెరవంజి*.
నెరసరి, వా. వి. 1. రూ-నెఱసరి: చూ, సింహము; 2. పూర్ణోపమానము: చూ, ఉపమ.
నెరసు, దే. వి. 1. కళంకము: చూ, లక్షణము, 1;2. దోషము: చూ, వృజినము. 1; 3. రూ-నెరుసు. ఉ, రా. 1, ఆ. 98: చూ, రేణువు. 1; 4. తప్పు. అని. 1, ఆ. 12: చూ, సొంటు; 5. గవుండ్లవాఁడు కత్తులనూఁదెడు పొడి: చూ, రేణువు. 1.
నెరి, దే. వి. రూ-నెఱి. పాండు, 1, ఆ. 117; చూ, వేల్లితము.2.
నెరుము, దే. స. క్రి. రాచు: చూ, రుద్దు. 1.
నెఱ, దే. విశ. 1. రూ-నెఱా-నేఱా. వృత్తియందు నెఱవుశబ్దము నకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలినరూపము. "నెఱగాణ-నెఱజాణ" మొ; అచ్చ. యు, కాం. 420; వి. 2. కేశము. ఆం, భా. ద్వి. 145: చూ, వెంద్రుక. 1.
నెఱఁకు, దే. వి. రూ-నెఱను. జీవస్థానము, మర్మము (అఁయు). భార. విరా. 3, ఆ. 161: చూ, మర్మము. 1.
నెఱక, దే. వి: చూ, నెఱ. 2.
నెఱకాఁడు, దే. విశ. (నెఱవు+కాఁడు): చూ, పూర్ణుఁడు.
నెఱను, దే. వి: చూ, రూ-నెఱఁకు, భార. విరా. 3, ఆ. 161; ఉ, హరి. 5, ఆ. 98.
నెఱపు, దే. వి. విశ, ప్రే: చూ, రూ-నెరపు (వ్యాపింపఁజేయుటకు.—శకాం. 3, ఆ, 102.)
నెఱమీటుమొన, అం: చూ, మొనలు.
నెఱయు, దే. అ. క్రి: చూ, రూ-నెరయు.
నెఱవాది, దే వి: చూ, సమర్థుఁడు.
నెఱవిద్దె, ద్వ. వి. హస్తలాఘవముగల జాలవిద్య: చూ, విద్య 1.
నెఱవు, దే. వి: చూ, రూ - నెరవు (అధికము — అచ్చ. యు, కాం. 33; యుక్తము.— స్వా. 4, ఆ. 27; విశాలము.— ఉ, హరి. 4, ఆ. 272.)
నెఱవేఱు, దే. అ. క్రి: చూ, సిద్ధించు.
నెఱవేఱుచు, దే. స. క్రి: చూ, సిద్ధిపొందించు.
నెఱవేఱుట, దే. వి: చూ. రసము. 1.
నెఱసరి, ద్వ. విశ. 1: చూ, శూరుఁడు; 2: చూ, రూ—నెరసరి. 1.
నెఱా, దే. విశ: చూ, రూ-నెఱ. 1.
నెఱి, దే. వి. 1. కచ్ఛభేదము: చూ, పింజె. 4; 2. క్రమము: చూ, విధము.1.భార. ద్రో. 2, ఆ. 132; 3. న్యాయము.భార. ఉద్యో. 3, ఆ. 263: చూ, సత్యము. 1; 4. పరాక్రమము. భార. ఆది. 4, ఆ. 201: చూ, శౌర్యము. 1; 5. రూ-నెరి. వక్రిత: చూ, వేల్లితము. 2; 6: చూ, సౌందర్యము. కళా. 4, ఆ. 103; 7: చూ, తెక్క. 1. స్వా. 4, ఆ, 58; 8. పక్షియొక్కల చిక్కు. భార. ఉద్యో. 2, ఆ. 112; 9: చూ, నెటిక, 1; 10. ఆచారము: చూ, సమయము. 2; 11: చూ, నెరవు. 1; 12. ప్రజ్ఞ; చూ, హృల్లేఖము. 2; బ. 13. కేశము: చూ, వెంద్రుక. 1; 14. చుట్టువెంద్రుకలు: చూ, వెంద్రుక. 1; విశ. 15. వక్రము: చూ, వేల్లితము. 2.
నెఱిక, దే. వి. 1. వస్త్రపుకుచ్చె: చూ, వళి. 2; 2 పైఁటపావడ. నై. 6, ఆ. 22: చూ, వస్త్రము.
నెఱికురులు, దే. వి. బ. అలకలు: చూ, వెంద్రుక. 1.
నెఱిపెడు, ద్వ. అ. క్రి: చూ, సిద్ధించు.
నెఱియ, దే. వి. (రూ-నెఱె-నెఱ్ఱియ-నెఱ్ఱె) 1. చీలిక: చూ, శకలము. 4; 2. నేలపగులు చూ, బీఁట.
నెఱె, —పై.—
నెఱ్ఱియ, —పై.—
నెఱ్ఱె, —పై.—
నెల, దే. వి. 1. చంద్రుఁడు: చూ, హిమాంశువు; 2: చూ, పున్నమ; 3: చూ, మాసము. 1. (బ. నెల్లు అని యయాతి చరిత్రము); 4. చోటు. పాండు. 1, ఆ. 153: చూ, స్థానము. 1; 5. కర్పూరము. కళా. 7, ఆ, 60: చూ, సిరము; 6. ఆఁడుదానితలగ: చూ, భూషణము. 2.
నెలఁత, దే. వి. ఆఁడుది. రూ-నెలఁతుక: చూ, స్త్రీ.
నెలఁతుక, —పై.—
నెలకట్టు, దే. వి. కట్టడపునేల. భార. విరా. 4, ఆ. 26: చూ, భూమి. 1.
నెలకువ, దే వి. చోటు. నిర్వ. 2, ఆ. 11. చూ, స్థానము. 1.
నెలకూన, ద్వ. వి. 1. బాలచంద్రుఁడు: చూ, హిమాంశువు; 2. నెలవంక: చూ, నక్షత్రము.
నెలకొను, దే. అ. క్రి. రూ-నెలవుకొను. 1. నిలుకడయగు: చూ, స్థిరపడు; 2. నిలుచుండు: చూ, మట్టుపడు.
నెలగ, దే. వి. ధనము: చూ, హిరణ్యము. 3.
నెలచూలి, దే. వి. బుధుఁడు: చూ, సౌమ్యుఁడు.
నెలచెలియలు, దే. వి: చూ, లక్ష్మి. 1.
నెలజవ్వనము, ద్వ. వి: చూ, నిండుజవ్వనము, ఆం, భా. ద్వి. 118.
నెలజోడు వా. వి: చూ, సూర్యుఁడు. సాంబ. దేవ. 9.
నెలతాలుపు, దే. వి. రూ-నెలతాల్పు. చంద్రశేఖరుఁడు: చూ, శివుఁడు. 1.
నెలతునియ, వా. వి. చంద్రకళ: చూ, శశికళ.
నెలత్రావుడము, దే. వి: చూ, వెన్నెలపులుఁగు.
నెలదారిసింగిణి, వా. వి: చూ, పర్వతము.
నెలపంది, వా. వి. ముండ్లపంది: చూ, సూకరము.
నెలపట్టి, దే. వి: చూ, నెలచూలి.
నెలపట్టు, దే. వి. చంద్రగ్రహణము: చూ, గ్రహణము. 1.
నెలపాలు, దే. వి: చూ, నెలతునియ.
నెలపు, వా. వి. పరిమాత్ర భాగధేయము: చూ, రూ-నెలవు. (శు.పా.)

నెలపులుఁగు, దే వి. రూ-నెలపుల్గు: చూ, నెలత్రావడము.
నెలమేఁపరి దే. వి 1. విధుంతుదుఁడు: చూ, రాహువు. 1; 2. శని: చూ, రాహువు. 2.
నెలయల్లుఁడు, వా. వి: చూ, మన్మథుఁడు.
నెలఱా, దే. వి. రూ-నెలఱాయి. చంద్రకాంతపుశిల: చూ, రాయి.
నెలఱాయి, దే వి. —పై—
నెలలు, అం. మాసములు: చూ, మాసము 1.
నెలవంక, ద్వ. వి: చూ, నెలకూన. (నఖక్షతము. — వసు. 1. ఆ 75.)
నెలవంకకోల, ద్వ. వి. అర్ధచంద్రబాణము: చూ, బాణము 1.
నెలవత్తి, ద్వ. వి 1. పచ్చకప్పురపు పలుకు. కళా. 7, ఆ. 60: చూ, సిరము; 2. పోఁక*: చూ, క్రంసి.
నెలవరి, దే. విణ. రూ-నెళవరి. 1. పరిచయముకలవాఁడు; 2: చూ, మర్మజ్ఞుఁడు. సా. 3, ఆ 239.
నెలవారము, మి. వి. సోమవారము: చూ, వారము. 2.
నెలవీసము, దే. వి: చూ, నెలతుసియ.
నెలవు, దే. వి. 1. ఇల్లు: చూ, సదనము. 1; 2. చోటు: చూ, స్థానము. 1; 3. వాసస్థానము: చూ, సదనము. 1; 4. పరిచయము: చూ, సంస్తవము.
నెలవుకొను, దే. అ. క్రి: చూ, రూ-నెలకొను
నెలవెలుఁగు, దే. వి: చూ, వెన్నెల.
నెల్లి, దే. వి. 1: చూ, శ్రీపర్ణము. 1*; 2. ఉసిరిక *: చూ, శ్రీఫలి. 1.
నెల్లిబద్ద, వా. వి. చూరుకుట్టుబద్ద. (విశాఖపట్టణ ప్రాంతమున వాడుక).
నెఁడు, వా. వి: చూ, రూ-నెగడు (బయలుమెఱయుటకు.— పంచ. వేం. 4, ఆ. 159).
నెపము, వై. వి.=నిభ. మిష: చూ, రూ-నెపము. (కారణమునకు.—నై. 8, ఆ. 47.)
నెవయు, దే. అ. క్రి: చూ, రూ-నెగయు. (గురుటకు. — భార. సభా. 1, ఆ. 254.)
నెవిలి, దే. వి: చూ, రూ-నెమలి. (అప్ర.)
నెవులు, దే. వి: చూ, రూ-నెగులు.
నెవ్వ, దే. వి. 1. దారిద్ర్యము: చూ, సీదరము. 1; 2: చూ, విపత్తు; 3: చూ, వఱపు.
నెవ్వగ, వా. వి. రూ-నెవ్వము. అధికవిచారము: చూ, శోకము.
నెవ్వడి, వా. వి. అతిశీఘ్రము: చూ, వేగము. 3.
నెవ్వము, వా. వి: చూ, రూ-నెవ్వగ.
నెళవరి, దే. విణ: చూ, రూ-నెలవరి
నెళము, దే. వి. 1. రూ-నెలవు. పరిచయము: చూ, సంస్తవము 2; చూ, మర్మము. 1.
నెళవు, వా. వి —పై.—
నెళనెళ, దే వి. విఱుగుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

# నే

నే. దే. స. 1. నాళబ్దప్రథమైక వచనమునకు సరళస్థిరవర్ణములు పరములగుచో గ్రుతము లోపించిన రూపము. నేగెలిచితిని" "మొ: వై. వి. 2: చూ, రూ-నెయి. 1; 3: చూ, రూ-నెయి. 2.
నేఁజెల్ల, దే. అవ్య. (నేను+చెల్లె బహార్థకము : చూ, సంతాపము.
నేఁడు, దే. వి: చూ, ఈ దినము.
నేఁత, వై. వి. 1.=వ్యూతి. నేయుట: చూ, వ్యూతి; బ. 2. సన్నబారచాఁపులు: చూ, పత్రము (దేశ్యమని శ. ర.)
నేఁతకాఁడు, దే వి. రూ-నేఁతరి: చూ, సాలెవాఁడు.
నేఁతపక, దే. వి. నేఁతకాఁడు నేయునపుడు పడుగుపేకలను ఉగ్గించునట్టి పక.
నేఁతపురుగు, ద్వ. వి: చూ, సాలెపురుగు.
నేఁతరి, దే వి. చూ, రూ-నేఁతకాఁడు.
నేజ, దే. వి (రూ-నేజా-నేజము) 1. చిల్లకోల. కళాం. 5, ఆ. 25: చూ, సర్వల; 2. కుంతము: చూ, బాణము. 1.
నేజము, —పై.—
నేజా.—పై.—
నేటించు దే. అ. క్రి. దృఢపడు: నేటుగొను, పదిలపడు, పనుగొను.
నేటు, దే వి. 1. నిశ్చయము: చూ, సత్యము. 1; 2. నిజము; చూ, సత్యము. 1; 3. దృఢము. అన్న. యు, కాం. 128; చూ, స్థైర్యము; 4. శ్రేష్ఠము: చూ, శ్రైష్ఠ్యము.
నేటుకొను, దే. అ. క్రి: చూ, నేటించు,
నేటుసేయు, ద్వ. అ. క్రి. నిశ్చయపఱచు: చూ, రేఖకివచ్చు.
నేత, సం విణ. 1. ఏలిక: చూ, స్వామి. 1; అం 2. నేత యనఁగాఁ గథానాయకుఁడు. [నాయకునకు మహాభాగ్య (పరిపాలన) ఔదార్య (దాతృత్వ) తేజస్విత, పరాక్రమ) వైదగ్ధ్య (నేర్పు) పాండిత్య (విద్యావివేకము) ప్రముఖసుగుణములుండవలయును. ఈ గుణములన్నియు పూర్తిగాఁ గలవాఁడుత్తముఁడు. కొన్నియె కలవాఁడు మధ్యముఁడు. చాల తక్కువగల వాఁడధముఁడు. సర్వరస సాధారణులయిన నాయకులు నల్వురు. (చూ, నాయకులు) శృంగార నాయకులు నల్వురు (చూ, నాయకులు), ఉపనాయకులు నల్వురు. (చూ, నాయకులు)]
నేతి, సం. అవ్య: చూ, యద్వ.
నేతిచాలు, వా. వి. ఆజ్యధార: చూ, హవిస్సు 1.
నేతిబీర, (ఱ), ద్వ. వి. ఘృతకోశాతకి*. చూ, బీర. 2.
నేతిబీరకాయ వాటము, జా. లోపలసారములేనిది.
నేతిసంద్రము, ద్వ. వి. సర్పిస్సముద్రము: చూ, సముద్రము.
నేత్రపర్వము, జా. కనులపండువు. "నేత్రంబుల కపూర్వ పర్వంబులొనర్చె." (నీళచంద్రిక-విగ్రహము); "కన్నుల పండువై ధగధగం" (కవికర్ణరసాయనము.)
నేత్రము, సం. వి. అ. న. 1. కన్ను: చూ. లోచనము; 2. తరిత్రాడు: చూ, సూత్రము. 1; 3. ఏరు; చూ స్వర్ణది (నది); 4. వెలిపట్టుచీర: చూ, వస్త్రము; 5 తేరు: చూ. శకటము. 1; 6. చెట్టువేరు: చూ, వేరు. 1.

**నేత్రములు**, పా. సంస్థ. 1. వీనికి ఉపమానములు.— తామర రేకులు, లేడికన్నులు, తుమ్మెద, కలువ, చేపలు, అం. 2. పురుషలక్షణాంగములలో నొకటి, (రక్తరేఖలైన ధన వంతుఁడగు. వ్యాఘ్రాక్షుండైన నత్యంత కోపనుఁడగు. కుక్కుటాక్షుఁడు సదాదుఃఖియగు. మృగాక్షుఁడైన శుభలాభ మందగు బిడాలాక్షుఁడైనను హంసాక్షుడైననునధముఁడగు. మయూరాక్షుఁడును నకులాక్షుఁడునైన మధ్యముఁడగు. నేత్రాం తము లెఱ్ఱనైన లక్ష్మీయుక్తుఁడగు. మధుపింగళ వర్ణమైన నైశ్వర్యము దీర్ఘాయువునగు ఏకాక్షుఁడైన క్రూరుఁడగు. మిడిగ్రుడ్లు గలిగిన నైష్ఠికుఁడగు తడికన్నులైన దుఃఖి యగు. గుంటకన్నులైన దరిద్ర దుఃఖియగు. రోమము లున్న దరిద్రుఁడగు): చూ, లక్షణాంగములు; 2. స్త్రీ లక్షణాంగములలో నొకటి, (లేడి కన్నులవలెనున్న రాజ భార్యయగు విశాలమైన సుఖపతియగు పింగళవర్ణములైన బిడ్డలు లేనిదియును దుశ్శీలురాలును విధవయును నగు. కాటుకపెట్టవలెనున్న భాగ్యసంపురాలగు ఎఱ్ఱనైన పెద్దను కలుండిన దరిద్రురాలగు. మచ్చయున్న నపత్రవదము. గుండ్రముగనున్న రాక్షసీసమయై దుశ్చారిణియగు. గూబ కన్నులైనను పిల్లికన్నులైనను ఏనమండ్రుగురు మగలగు దురు కదలుచున్న చూపు గలిగిన జారిణియగు ; చూ, స్త్రీ లక్షణాంగములు.

**నేత్రాంబువు**, సం. వి. ఉ. న. కన్నీరు: చూ, రోదనము. 2.

**నేత్రామృతము**, అం: చూ, అంజనము.

**నేతృఁడు**, సం. విశే. ఒడయఁడు: చూ, స్వామి. 1.

**నేదిష్ఠము**, సం. విశే. రూ-నేదీయాంసము. మిక్కిలి దగ్గఱ చూ, సమీపము. 1.

**నేదీయాంసము**, —పై—

**నేను**, దే. స: రూ-ఏను. (సం ప).— అహమ్

**నేపథ్యము**, సం. వి అ. న. రూ-నైపథ్యము. 1. ఆహార్యాలం కారము: చూ, భూషణము. 2; 2 నటీనటుల మచోటు: చూ, రంగము. 3.

**నేపాళదేశపుబ్రాహ్మణులు**, అం వారి జాతులయొక్క నామ ములు. అం వార్ప్యాల అధికారి, అర్జల, ఆచార్య, ఉక్నె యాల, కండరియ, కప్యాల, కొయిక్కాల, కొయినాల- కొయద్రాల, ఖనాల ఖాంత్యాల, గజ్నియాల, గుంగాయి, గైతొల, ఘిమిరియా, చంపాగాయి, చవలాగాయి, దజి, దెంకాలరి, దవారి, ధూంధాయాల, నేపాలియా, పండిత, పనేరు రిజాల, రిష్యాల, రుకాయి, లంసాల, లహోని వాస్తిగాయి, సత్యాల, సిద్ధియాల: చూ, బ్రాహ్మణులు (నేపాళదేశము పర్వతములతో నిండినదగుటచే నందు వసించు బ్రాహ్మణులు పార్వత్యాది నామములు కలవారై గోమాంసభక్షకులను శూద్రజాతిలో నధములగు కహోరా, ఖోలియా లనెడి తక్కువజాతివారలచే నీళ్లు తెప్పించి యుపయోగించుకొందురు. వీరిలో ఋగ్వేదులు, యజుర్వే దులు, మాధ్యందినులు, సామవేదులు, అధర్వణవేదులును కూడ కలరు. వీరు శాక్తేయమతమువఁకుఁజెంది శక్త్యుపాసనా పరులైన యొక తెగవారును, తంత్రోపాసకులై యొకతెగవారు నైయున్నారు. వీరిలో పార్వత్యాది బ్రాహ్మణులు బ్రాహ్మణు లకును, క్షత్రియులకును పురోహితులై యున్నారు. కొందఱు ఇతరజాతులవారికి పురోహితులైయున్నారు నేపాళదేశపు బ్రాహ్మణ తెగవారందఱును గొఱ్ఱెను మేఁకను పక్షిజాతు లను భక్షించెదరు. ఆ దేశపు ప్రభువు క్షత్రియుఁడగుటచే బ్రాహ్మణాది జాతులవారు కులాచారములు చెడకుండ కాపాడు చుందురు.); చూ, బ్రాహ్మణులు.

**నేపాళము**, సం. వి అ పుం 1. నేపాళదేశము: చూ, దేశము: 2. ఒకరకము చెట్టు: చూ, చెట్టు. 3; వై. వి. (1) నేపాళము*: నేపాళక (ఇది ద్వివిధము.—పెద్ద నేపాళము, సీమనేపాళము.) (శుద్ధి.—గింజలలోని పప్పును పేడనీళ్లలో రెంపుజాములు ఉడికించిన శుద్ధి.)

**నేపాళవేము**, సం. వి. అ. పు : అశ్వతిక్తము, తృణనింబము.*

**నేపాళి**, సం. వి. అ. స్త్రీ: చూ, నేపాళము (1) *.

**నేబు**, దే. వి. 1. పంద్రెండుకాసుల నాణెము; వా. బ. 2. డబ్బులు (కాసులు) "నేబుపంచి"

**నేమంబుఁగన్న మన్నీసితల్లి**, ద్వ వి. దేవగంగ. వేం, అం. 17: చూ, నది.

**నేమకము**, వై. వి.= నియమ. రూ-నేమము: చూ, బైసి.

**నేమము**, సం. వి. అ. పుం. 1. కాలము: చూ, సమయము. 1; 2. మేఁక: చూ, మేషము. 1; 3. ఖండము. చూ, శక లము 4; 4: చూ, ప్రాకారము; 5. కపటము: చూ, వ్యాజము. 1; వై. వి. (1): చూ, రూ-నేమకము. కళా. 6, ఆ. 94; (2): చూ, వ్రతము.

**నేమి**, సం. వి. ఇ. పుం. 1.= నెమ్మి-నెమ్మ. బండి కంటికడ కమ్మి: చూ, శకటము. 1; 2. తినిశము*; చూ, వంజులము, 2; ఇ. స్త్రీ. 3. త్రిక. నూతియందు నీరెత్తుటకు సమీపమున నుంచిన రాట్నము, ఏతము మొదలైన దారుయంత్రము; వా. వి. (1): చూ, సామర్థ్యము. 1.

**నేమించు**, వై. స. క్రి.= నియమ: చూ, సెలవిచ్చు.

**నేము**, దే. స. క్రి. 1. ధాన్యముచేటలోఁబోసికొని యిటునటుఁ ద్రిప్పు 2. రూ-ఏము-మేము. నాశబ్దప్రథమా బహువచనము నకు రూపాంతరము.

**నేయము**, వై. వి. (రూ-నెయ్యము-నెయ్యమి) 1.=: చూ, స్నేహము రస. 3, గుచ్ఛము; 2. న్యాయము. "నేయము గాదు" క్షేత్రయ; చూ, సత్యము. 1.

**నేయార్థము**, అం. సంధిదోషములలో నొకటి. (తనకె సంకేత మైనది): చూ, కావ్యదోషములు, సంధిదోషములు.

**నేయి**, వై. వి. చూ, రూ నెయ్యి;

**నేయు**, వై స. క్రి. 1. నేఁతనేయు: అనువయించు; 2: చూ, అల్లు; వా. వి. 3. జబ్బుతో మంచముమీఁద పరుండు.

**నేయుఁడు**, వై. వి. (రూ-నెయ్యరి-నెయ్యుఁడు) = స్నేహః చూ, స్నేహితుఁడు

**నేరఁబోతు**, దే. విశే: చూ, వ్రాజె.

**నేరమి**, దే. వి. 1. అజ్ఞానము. భార. అర. 5, ఆ. 311; చూ, మఱపు. 2; 2. పాపము. అం, భా. ద్వి. 191; భార. సభ. 2, ఆ. 224: చూ, వ్యసనము; 3: చూ, రూ-నేరము.

నేరము, దే. వి. తప్పు. (రూ-నేరమి-నేపము-నెవము-నెపము-నెరసు: చూ, సొంటు.

నేరజా, దే. వి. జరబాజీ (బట్ట): చూ, వస్త్రము.

నేరమి, దే. వి: చూ, రూ నేరుపు. 1.

నేరుచు, దే. అ. క్రి. రూ-నేర్చు. 1. ఓపు: చూ, పర్యాప్తమగు; స. క్రి. 2: చూ, వాడుకపడు.

నేరుపరి, దే. విణ. (రూ-నేర్పరి-నేరుపుకాఁడు-నేరుపులాఁడు-నేర్పుకాఁడు): చూ, సమర్థుఁడు.

నేరుపు, వై. వి. = నైపుణ్య. రూ-నేర్పు. (దేశ్యమని శ. ర.) 1: చూ, సామర్థ్యము. 1; 2. చమత్కారము, విజ్ఞానము: చూ, సామర్థ్యము. 1. ఆం, బా. ప్ర. 103; 3. అజ్ఞ చూ, సమర్థనము, ప్రే. 4. నేరుపంజేయు.

నేరుపుకాఁడు, దే. విణ: చూ, రూ-నేరుపరి.

నేరుపులాఁడి, దే. విణ. జాణ: చూ, స్త్రీ.

నేరుపులాఁడు, దే. విణ: చూ, రూ-నేరుపరి. అచ్చ బాల, కాం. 7.

నేరేటేఱు, దే. వి. జంబు: చూ, నది.

నేరెడు, దే. వి: చూ, రూ-నేరేడు.

నేరేడల్లులు, వా. వి. బ. చూ, హణిగలు.

నేరేడు, దే. వి. (రూ-నేరెడు-నేఱెడు-నేఱేడు): చూ, సురభిపత్ర. (అతిమూత్రమును, మధుమూత్రమును తగ్గించును. రక్తగ్రహణి కట్టును.)

నేరేడుదీవి, ద్వ. వి: చూ, తొలుదీవి. నై. 5, ఆ. 76.

నేరేడుపండు, ద్వ. వి. జంబువు. జాంబవము.

నేర్చు: చూ, రూ-నేరుచు.

నేర్పరి, దే. విణ: చూ, రూ-నేరుపరి.

నేర్పు, వై. వి. ప్రే: చూ, రూ-నేరుపు (దేశ్యమని శ. ర)

నేర్పుకాఁడు, దే. విణ: చూ, రూ నేరుపుకాఁడు.

నేర్పువాఁడు, దే. విణ: చూ, బోధకుఁడు.

నేలా, దే. విణ: చూ, రూ-నెఱ. 1.

నేల, దే. వి. 1. పుడమి: చూ, భూమి. 1; 2. చోటు. ఉ.హరి. 2, ఆ. 204: చూ, స్థానము. 1; 3. దేశము. భార. విరా. 4, ఆ. 221: చూ, సీమ. 1. (దేశము); వా. 4. పంట పండు పొలము. 'నాకు నాలుగుపుట్ల నేలకలదు.'

నేలంటు, వా. వి. 1. పునాదికట్టుదిట్టము; 2. నేలమీఁద వ్రాయుటతో సంబంధము. "మావానికి నేలంటు వదలినది. పై తరగతులకు వచ్చినాఁడు".

నేలఁగలుపు, దే. అ. క్రి. చంపు: చూ, సంహరించు.

నేలఁబెట్టి కాలరాచుట, జా. మిక్కిలి కష్టపెట్టుట. 'నేలఁబెట్టి కాలరాచునట్టి యా చిన్నవాండ్రు.' (ధర్మజరాజసూయము.)

నేలకడిమి, ద్వ. వి. భూకదంబము*: చూ, హలిప్రియము.

నేలకలిగొట్టు, దే. వి. భూపాటలి*: చూ, స్థాలి. 2.

నేలకుఁగోలకుఁదెచ్చుట, జా. మిక్కిలి బాధపెట్టుట. "నేలకుఁ గోలకుఁ దెచ్చుచున్నవాఁడు." (కళాపూర్ణోదయము. 7, ఆ. 35).

నేలగుమ్మడి, దే. వి: చూ, భూమికర్కారువు*.

నేలగుమ్మడు, ద్వ. వి. విదారి*. (ఇది ద్వివిధము. — తెల్లనేలగుమ్మడు, నల్లనేలగుమ్మడు. ఇదియే తెల్లనే-గుమ్మడు): చూ, భూమి కర్కారువు.

నేలగొలిమిడి, దే. వి. గోలోమి*: చూ, మొగబీర.

నేలచూలి, దే. వి. మన్నుకానుపు: చూ, సీత.

నేలజమ్మి, ద్వ. వి. పిన్నజమ్మి*: చూ, శమీరము.

నేలతంగేడు, దే. వి: చూ, హేమపుష్పకము*

నేలతమ్మి, ద్వ. వి. మెట్టదామర*: చూ, సహస్రపత్రము.

నేలతాడి, ద్వ. వి. రూ-నేలతాటి: చూ, శిలీంధ్రకము*.

నేలతాడు, —పై.—

నేలతామర, ద్వ వి: చూ, నేలతమ్మి*.

నేలతాలుపు. దే. వి. 1: చూ, పర్వతము; 2 క్షత్రియుఁడు. అచ్చ. యు, కాం. 21: చూ, రాజు. 1.

నేలతొళసి, ద్వ. వి. భూతులసి*: చూ, హరిప్రియ.

నేలనమలి, దే వి ఒకానొకపిట్ట: చూ, పక్షి.

నేలనేరేడు, దే వి. భూమిజంబువు*: చూ, సురభిపత్ర.

నేలపట్టి, దే. వి. 1. అంగారకుఁడు. చూ, వక్రుఁడు; 2. నరకాసురుఁడు: చూ, మహీసుతుఁడు; 3: చూ, నేలచూలి.

నేలపట్టిమగనిబంటు, ద్వ. వి. 1. అనుమంతుని కోఁతి. ఆం,పదా. 6—21: చూ, వానరము; 2. కోఁతి: చూ, వానరము.1.

నేలపడక, వా. వి. 1. చచ్చినవానిపడుకు: చూ, మృతశయ్య; 2. నేలపెపరుండుట.

నేలపల్లటీ, దే. వి. ఒకరకము పావురము: చూ, సురటీ.

నేలపొన్న, ద్వ. వి. కోలపొన్న*: చూ, పృశ్నిపర్ణి.

నేలపోక, ద్వ. వి బోధాంబకము*: చూ, క్రంపి.

నేలబువి, ద్వ. వి: చూ. వల్మీకము. వేం, ఆం. 88.

నేలమలె, ద్వ. వి. భూమిలోపలియిల్లు. (రూ-నేలమాలియ-నేలమాలె): చూ, సదనము. 1.

నేలమాలియ, —పై —

నేలమాలె, —పై.—

నేలములక, దే. వి. (రూ-నేలములగ-నేలములుక) వార్తాకి*: చూ, వాఁకుడు.

నేలములగ, —పై.—

నేలములగచెట్టునకు దొంకెనలుకట్టుట, జా. పుట్టినది పుట్టినట్టుగానే యుండుట.

నేలములుక, దే. వి: చూ, రూ-నేలములక*.

నేలయడుగు, వా. వి. పాతాళము: చూ, లోకము. 1.

నేలయునిక, దే వి. భూమ్యాలిక*: చూ, శివ. 4.

నేలరేను, దే. వి. భూబదరి*: చూ, రేఁగు. 1.

నేలఱేఁడు, దే. వి. భూపతి: చూ, రాజు. 1.

నేలవిడిచిసాము, జా. నిరాధార వ్యాపారము. "ఊరక యేల నేల విడిచి సాముచేసెదవు." (నీతిచంద్రిక — మిత్రభేదము.)

నేలవేము, దే. వి: చూ, భూనింబము*.

నేలవేలుపు, దే. వి: చూ, బ్రాహ్మణుఁడు.

నేలసంపెగ, ద్వ. వి. భూమిచంపకము*: చూ, సంపెగ.

నేలసెనగబుడ్డలు, వా. వి. వేరుసెనగకాయలు (రాయలసీమలో వాడుక.)

**నేలాఁపు,** దే. వి. ఒకరకముడేగ; చూ, శ్యేనము.

**నేప,** వా. వి. 1. కోపము: చూ, రోషము; 2. నింద. చూ, నెగ్గింపు.

**నేపడెము,** దే. వి. (రూ-నేవలము-నేవళము) రత్నాలదండ: చూ, భూషణము. 2. (రాయి.)

**నేవము,** వై. వి: చూ, రూ-నెవము.

**నేవలము,** దే. వి: చూ, రూ-నేవడము.

**నేవళము,** —పై.—కళా. 7, అ. 66.

**నేష్టుఁడు,** అం: చూ, ఋత్విజుఁడు. 1.

**నేస్తకత్తియ,** వై. విణ. నేస్తకత్తె: చూ. స్త్రీ.

**నేస్తకాఁడు,** వై. విణ. = చూ, స్నేహితుఁడు.

**నేస్తము,** వై. వి. = స్నేహః: చూ, స్నేహము.

**నేస్తి,** —పై.—

**నేస్తు,** —పై.—

**నేస్తురాలు,** ద్వ. విణ: చూ, నేస్తకత్తియ.

**నేహరము,** దే. వి: చూ, నేవలము.

## నై

**నైకభేదము,** సం. విణ: చూ, ఉచ్చావచము.

**నైగన్గ్యము,** సం. వి. అ. న. నిగనిగలాడుట.

**నైగమము,** సం. వి. అ. న. 1. వేదాంతము: చూ, వేదము; విణ. 2. పట్టణమది.

**నైగముఁడు,** సం. వి. అ. పుం. 1. నాగరుఁడు; 2: చూ, నిగముఁడు.

**నైచికము,** సం వి. అ. న. ఆవుయొక్క తలభాగము: చూ, సౌరభేయి. (ధేనువు.)

**నైచికి,** సం. వి. ఈ. స్త్రీ. చక్కనిరూపము మంచిప్రాయము గలిగి చాలపాలిచ్చేడియావు: చూ, సౌరభేయి (ధేనువు.)

**నైచ్యము,** సం. వి. అ. న. (భక్త్యాదులచేఁగలుగు) అధమ భావము: చూ, హీనము. 1.

**నైజము,** సం. విణ. 1. తనది: చూ, స్వతంత్రము; 2: చూ, స్వాభావికము.

**నైతికుఁడు,** వా. వి. నీతిశాస్త్రజ్ఞుఁడు.

**నైపథ్యము,** సం. వి. అ. న: చూ, నేపథ్యము.

**నైపాలి,** సం. వి. ఈ. స్త్రీ. నేపాళదేశపుమణిశిల, కుణటి: చూ, రాయి.

**నైపుణము,** సం. వి. అ. న = నేర్పు. నేర్పరితనము: చూ, సమర్థనము.

**నైపుణి,** సం. వి. ఈ. స్త్రీ. = —పై.—

**నైపుణ్యము,** సం. వి. అ. న = —పై.—

**నైమిత్తికము,** సం. విణ. నిమిత్తమువలనఁగలిగినది; వా. 2. నిమిత్తసంబంధమైనది.

**నైమేయము,** సం. వి. అ. పుం; చూ, వినిమయము.

**నైయగ్రోధము,** సం. వి. అ. న. మఱ్ఱిపండు.

**నైయాయికుఁడు,** సం. వి. అ. పుం: చూ, న్యాయాధిపతి.

**నైరాశ్యము,** సం. వి. అ. న. 1; చూ, వలవమి: అం. 2: చూ, శత్రుములు.

**నైరృతి,** చూ, రూ-నిరృతి. 2. 4.

**నైరృతిమూల,** మి. వి: చూ, రూ-నిరృతిమూల. (హరిత్తు.)

**నైరృతుఁడు,** చూ, రూ-నిరృతి. 2.—4.

**నైర్ఘృణ్యము,** సం. వి. అ. న. దయలేనితనము.

**నైర్మల్యము,** సం. వి. అ. న. నిర్మలత్వము, గరగర: చూ, శుద్ధము. 3.

**నైల్యము,** సం. వి. అ. న = నల్ల. నల్లఁదనము: చూ, వర్ణము 6.

**నైవాశ్రితేషుగుణదోష విచారణాస్యాత్.** న్యా. ఆశ్రితులందుగుణ దోషములను విచారింపరాదు.

**నైవేద్యము,** సం. వి, అ. న రూ-నివేదనము. 1. నివేదింపఁదగినవస్తువు (దేవుని కారగింపయినది): చూ, సమర్పణము; అం. 2: చూ, ఉపచారము. 1; 3: చూ, ఉపచారము 2.

**నైషధుఁడు,** సం. వి. అ. పుం. నిషధుఁడు, నలచక్రవర్తి: చూ, రాజు. 1.

**నైషాది,** అం: చూ, శుద్ధజాతులు (అంశములు.)

**నైష్కికుఁడు,** సం. వి. అ. పుం: చూ, రూపాధ్యక్షుఁడు.

**నైష్ఠికుఁడు,** సం. విణ =: చూ, నైష్ఠికసీల. 1.

**నైష్ఠుర్యము,** సం. వి. అ. న. నిష్ఠురత్వము.

**నైసర్గికము,** సం. విణ: చూ, నైజము. 2.

**నైస్త్రింశికుఁడు,** సం. విణ: చూ, అసిహేతి.

**నైస్పృహ్యము,** సం. వి. అ. న. ఇచ్ఛలేనితనము: చూ, వలవమి.

## నొ

**నొంచు,** దే. క్రి. నొవ్వఁజేయు. భార. కర్ణ. 1, అ. 192: చూ, అ. 192: చూ, నొగులుచు. 1, 2.

**నొక్కము,** దే. వి. పెద్దసదాప*: చూ, సదాప.

**నొక్కు,** దే. వి. 1. రూ-నొక్కుడు. అదుముడు వలనఁగలిగిన పల్లము: చూ. రంధ్రము. 1; 2. ముడుత. స్వా. 3, అ. 23: చూ, పళి. 2; స. క్రి. 3. పేనుపదుపు: కుక్కు-కుక్కు, చదుపు: 4. పంటనొక్కు: చూ, మూకొను; 5. అదుము: చూ, పిసుకు. 1.

**నొక్కుడు,** దే. వి; చూ, రూ-నొక్కు. 1.

**నొక్కులు,** దే. వి. బ. వళులు: చూ, పళి. 1.

**నొగ,** దే. వి: చూ, యుగంధరము.

**నొగచివర,** దే. వి: చూ, పంగలగుంజ.

**నొగులు,** దే. వి. 1. వికలమగుట; 2; చూ, రూ-నెగులు; 3: చూ, శోకము; అ. క్రి. 4: చూ, వైకల్యమగు. ఉ హరి. 3, అ. 80; 5: చూ, నొచ్చు. 1; 6: చూ, నొచ్చు. 2.

**నొగులుచు,** దే. క్రి. రూ-నొగుల్చు-నొంచు. 1. నొగులఁజేయు, ఎడలించు; 2. నొప్పించు: చూ, హింసించు.

**నొగుల్చు,** —పై.—

**నొచ్చిళ్ళు,** దే వి. బ. చొంగ: చూ, లాల.

**నొచ్చు,** దే. అ. క్రి 1; చూ, వేసారు; 2. దారిద్ర్యాదులచే పీడనొందు: నొగులు.

నొచ్చుకొను, దే. అ. క్రి: చూ, స్రుక్కు. 1.

నొచ్చుకోలు, దే. వి: చూ, విప్రతీసారము. 1.

నొట్ట, వా. వి: చూ, రూ-నొష్ట. 'నొట్టచుక్క'.

నొడలదొంతి, దే. వి: చూ, సంశయము (అప్ర.)

నొడి, దే. వి: చూ, రూ-నుడి.

నొడికాఁడు, దే. విణ: చూ, నుడువరి.

నొడికారము, దే. వి: చూ, రూ-నుడికారము. (మాటచమత్కార మునకు.-కళా. 8, ఆ. 55; మాటకు.-ఆం, భా. ప్ర 110.)

నొడికారి, దే. విణ (నొడికారము + ఇ): చూ, రూ-నుడువరి ఉ, హరి. 4, ఆ. 155.

నొడుగు, దే వి, స. క్రి: చూ, రూ-నుడుగు.

నొడుచు, దే. స. క్రి. తప్పులుపట్టు.

నొడుపు, దే. వి. తప్పులుపట్టుట.

నొడువు, దే వి, స. క్రి: చూ, రూ-నుడుగు.

నొప్పి, దే. వి. 1. బాధ: చూ, శోకము; 2: చూ, విపత్తు జై. 7, ఆ. 117; 3: చూ, శ్రమము. 1.

నొప్పించు, దే. ప్రే. చూ, హింసించు.

నొప్పిగుంటి, వా. వి: చూ, వ్యాధితుఁడు.

నొప్పియెత్తు, వా. స. క్రి: చూ, ఎత్తు. 29.

నొలి, వా. వి: చూ, శోకము.

నొల్లు, దే. స. క్రి. 1. బిడ్డలు నోటఁ వ్రేళ్లిడుకొని చప్పరించు; వా. 2. గ్రహించు, నొల్లుకొను.

నొవులు, వా. వి: చూ, నొలి.

నొవ్వి, దే. వి రూ నొవ్వు. 1. వేదన: చూ, శ్రమము. 1; 2. తెవులు. పంచ. నా. 1, ఆ. 408; చూ, రోగము 1; 3: చూ, శోకము.

నొవ్వు, —పై.—

నొసటియొమిక, దే వి. అశి; చూ, శల్యము. 1.

నొసలు, పై. వి. = నిటల. రూ-నెన్నొసలు. (దేశ్యమని శ.ర.) 1. నుదురు: చూ, లలాటము; అం. 2: చూ, కళలుండు స్థలములు.

నొసలుబత్తుఁడు నోరుతోదేలు, జా. 'ననపు నొసలు బత్తుఁడును నోరు తోఁదేల, టన్నరీతి దోఁచుచున్నదిపుడు' (వైజయంతీ విలాసము.)

నొష్ట, వా. వి. నుదురు: చూ, రూ-నొట్ట. (లలాటము.)

## నో

నోఁచు. దే. స. క్రి. నోము. పాండు. 2, ఆ. 30: చూ, వ్రత మాచరించు.

నోఁత, దే. వి. నోఁచుట.

నోటికితాళముపేయుట, జా. మాటాడకుండఁ జేయుట. "ఈపా టికి నోటికి తాళమువేయవచ్చును." (ధర్మజరాజసూయము.)

నోటిబ్బిగము, దే. వి. దేవతాప్రార్థనకై దౌడలయందు పట్టు కొనెడు చొకపు లోహపుకమ్మి.

నోటీసు, వా. వి. ప్రకటన,

నోటు, వా. వి. 1. బదులుపుచ్చుకొని వ్రాసియిచ్చెడు ప్రామిసరీ నోటు; 2. రూపాయలుగా మార్చుకొనెడు బ్యాంకినోటు; 3. జ్ఞాపకార్థము వ్రాసియుంచుకొనెడు టెక్కె; 4 తాటాకలము.

నోటెఁడు, వా. వి. గుక్కెఁడు-గుక్కెఁడు, గు-క.

నోము, దే వి. 1: చూ, వ్రతము; స. క్రి. 2: చూ, నోఁచు; 3. పోఁగొట్టు: చూ. భంగించు.

నోయు, దే. అ. క్రి. నొచ్చు: చూ, చేసారు.

నోరు, దే. వి. చూ, వదనము. 1; వా.వి: 2. నోరు యింటిపేరుగా గలవారు. "నోరివారు" (ఇట్లే శరీరావయవము లన్నీ పేర్లగా వ్యవహరించెడి ఇంటిపేర్లు:— బుఱ్ఱావారు, ముక్కువారు, గడ్డమువారు, లలాటంవారు, కాళ్లవారు ఇత్యాది.)

నోరుమెంగ, దే విణ. చూ, మూఁగ. కళా 3, ఆ. 238.

నోరుమెదల్పుట, జా. మాటలాడుట. "బ్రహ్మయు నోరుమెదల్ప లేడి" పాండు. 3, ఆ. 151. మిన్నకచన నంత నోరు మెద పక' కళా. 3, ఆ. 238.

నోరూరు, దే అ. క్రి. 1. రుచిగల వస్తువు ను తినెడుకోరికచే నోటనీళ్లూరు; 2: చూ, వాంఛించు పా. 3, ఆ. 51.

నోరెత్తు, దే. అ. క్రి. మాటాడయత్నించు: చూ, ఎత్తు. 23.

నోరోడక, జా. మాటాడ సందేహించక. "అచ్చట నోరోడ కాయన రచ్చలో" (శుద్ధాంధ్రశిరోష్ఠ్య నిర్వచన నైషధము.)

నోవరి, దే. విణ: చూ, నొప్పిగుంటి.

నోవి, దే. వి: చూ, రూ-నొవ్వి.

నోవు, —పై.—భార. ఉద్యో. 3. ఆ. 267.

## నౌ

నౌ, సం వి. ఔ. స్త్రీ. 1. ఓడ. (పదార్థమును గట్టును బొందించు నది): చూ, హోడము; దే. వి. (1): చూ, రూ-నవు-నవ్వు.

నౌక, సం. వి. ఆ. స్త్రీ.= నావ: చూ, నౌ. 1.

నౌకాశకటన్యాయము, న్యా. ఓడలుబండ్లగును, బండ్లోడలగు నను రీతి.

నౌకాఖ్యము, అం: చూ, ఉత్తానకరణబంధములు.

నౌకాదండము, సం. వి. అ. పుం ఓడనడపుగడ; చూ, పీలి.2.

నౌకార్ధము: చూ, అర్ధనావము.

నౌకు, దే. వి. చూ, రూ-నవుకు.

నౌడుకొట్టు, దే. అ. క్రి: చూ, రూ-నవుడుకొట్టు.

నౌబతు, వా. వి. మహారాజుల కోటముందు వాయించెడువాద్యము. "ఢంకా నౌబతులు."

నౌరు, దే. విణ: చూ, రూ-నవురు.

## న్య

న్యంకువు, సం. వి. ఉ. పుం 1. ఇఱ్ఱి (తలవంచుకొని పోవు నది): చూ, హరిణము. 1; 2. ముని: చూ, సన్న్యాసి.

న్యక్కారము, సం. వి. అ. పుం: చూ, పహేలనము.

న్యక్కృతి, సం వి. ఇ. స్త్రీ. —పై.—

న్యక్షము, సం. విణ. 1. అధమము: చూ, హీనము. 1; 2: చూ. సర్వము.

న్యక్షుఁడు, సం. విణ. చూ, హీనుఁడు.

న్యగ్రోధము, సం. వి. అ. పుం. 1. మఱ్ఱి: చూ, వటము. 3; 2: చూ, శమీ*; 3. భార: చూ, వ్యామము.

న్యగ్రోధాదిగణము, అం. మఱ్ఱి, మామిడి, జువ్వి, రావి, మేడి (5).

న్యగ్రోధి, సం. వి. ఇ. స్త్రీ: చూ, భల్లాతకి *

న్యర్బుదము, సం. వి. అ. న. 1. పదియర్బుదములసంఖ్య: చూ, సంఖ్య. 1; విణ. 2. పదియర్బుదముల సంఖ్యగలది.

న్యస్తము, సం. విణ. ఉంచఁబడినది: చూ, వ్యూఢము. 2.

# న్యా

న్యాదము, సం. వి. అ. పుం. కుడుపు: చూ, సాపాటు.

న్యాయము, సం. వి. అ. పుం. = నాయము. 1. తగవు, న్యాయబుద్ధి: చూ, సత్యము. 1; 2. స్వధర్మమువలన చలింపకుండుట: చూ, సత్యము. 1; అం. 3: చూ, తర్కము. 5; బ. 4: చూ, న్యాయములు; వా. 5. న్యాయము ఇంటిపేరుగాఁగలవారు "న్యాయపతి-న్యాపతి" వారు.

న్యాయములు, అం. న్యాయమనఁగా పోలిక. (ఇవి సమయోచితముగాఁ గొన్నిచోట్లఁ బ్రయోగించినచోఁ గావ్యము శ్రావ్యముగా నుండును.) ఉదా:— అంకోలబీజన్యాయము మొ॥ క్రొద్దిగ అకారాదిని చూపఁబడెను.

న్యాయశాస్త్రము, వా. వి. న్యాయమనఁగా దృష్టాంతము. దీనివలనఁ దెలియబడని గవయాది పదార్థములను, తెలియఁబడిన గోవు మొదలగు పదార్థములను జూపి వీటివంటివే గవయాది పదార్థములని చెప్పి తెలుపవచ్చును. గనుక ప్రమాణము మొదలైన షోడశపదార్థములం దొకటియగు దృష్టాంతపదార్థమునకు నామమైన న్యాయశబ్దముతో శాస్త్రమునకుఁ బేరేర్పడుపఁబడినది: (న్యాయశాస్త్రము ననుసరించువారే న్యాయపతి, న్యాపతి అను యింటిపేరు వారయిరి.

న్యాయాత్పథః ప్రవిచలంతి పదం నధీరాః, న్యా. ధీరులు న్యాయమార్గము నుండి కాలుఁగదల్పరు.

న్యాయాధికారి, సం. విణ: చూ, స్వామి. 3.

న్యాయాధిపతి, —పై.—

న్యాయాన్యాయములు, పా: చూ, యుక్తాయుక్తతలు.

న్యాయ్యము, సం. విణ: చూ, యోగ్యము. 2.

న్యాసము, సం. వి. అ. పుం. 1. ఉనుపుట. చూ, విన్యాసము 1; 2. ఇల్లడ: చూ, వాడిక.

# న్యు

న్యుబ్జఖడ్గము, సం. వి. అ. పుం. బాకు: చూ, బాణము. 1.

న్యుబ్జము, సం. వి. అ. న. 1. కర్మరంగమను మ్రానిపండు; పుం. 2. దర్భతోఁజేసిన స్రుక్కు. (శ. ర.)

న్యుబ్జుఁడు, సం. విణ. 1. క్రిందుచూచువాఁడు; 2. తెవులుచే వంకరైనవాఁడు.

# న్యూ

న్యూనపదము, అం. వాక్యదోషములలోనొకటి ("శ్రీరామచంద్రుని శరణు చొరమి హతుఁడయ్యెను." ఇందు రావణుఁడను పదము న్యూనము. పదలోపము కొన్నియెడల నపార్థమున కెడమిచ్చును. "పిల్లవాఁడైనను వానికిఁ బెద్దవానికున్నంత యున్నది." ఇందు తెలివియను పదము లుప్తము.): చూ, వాక్యదోషములు.

న్యూనము, సం. విణ. 1. తక్కువైనది: చూ, హీనము 1; 2. నిందింపఁదగినది: చూ, హీనము. 2; వా. 3. తగ్గుదలఁ గలది; చూ, వెలితి. 2.

న్యూనాధిక్యము, సం. వి. అ. న: చూ, వాసి. 4.

న్యూనోపమము, అం. వాక్యదోషములలో నొకటి (ఉపమయందు న్యూనతయుండెనేని న్యూనోపమము. ఉదా.— పీతాంబరుఁడైన హరిమేఘునిభుఁడు. మేఘముతోఁబోల్పఁదగిన గుణము నీలవర్ణము హరియందుఁ జెప్పకుండుటచే నుపమ వాలదు. ఇత్యాది): చూ, వాక్యదోషములు.

# ప

ప, ఒకయక్షరము. సం. వి. అ. పుం. 1. గాలి చూ, వాయువు అం. 2: చూ, కవర్గము; 3: చూ, స్వరము. 2; 4: చూ, పరుషములు.

పంకక్షాళన్యాయము, న్యా. బురదలోదిగి కాళ్ళుకడుగుకొనుట కంటె దూరముగా నొత్తిగిలుటయే మేలనురీతి.

పంకజము, సం. వి. అ. న. అసలుఁబుట్టువు రూ-పంకేజము; చూ, సహస్రపత్రము.

పంకప్రక్షాళనన్యాయము, న్యా. అడుసుత్రొక్కనేల? కాలు కడుగనేల?

పంకమగ్నగజన్యాయము, న్యా. బురదలో నేనుఁగు పడినచో దానినెత్తుట దుర్లభము. దాని నేను గే యెత్తవలెననురీతి.

పంకము, సం. వి. అ. పుం, న. 1. = పంకి: చూ, సుబ్బక; బురద; 2. పాపము: చూ, వృజినము. 1; దే. వి (1) పాలు. జై. 4, అ 79: చూ, స్తన్యము.

పంకరుహము, సం. వి. అ. న: చూ, పంకజము. (రూ-పంకేరుహము.)

పంకా, వా. వి. కఱ్ఱచెక్కకు గుడ్డనతికి ప్రేలఁగట్టి లాగెడు యొకానొక పెద్దవిసనకఱ్ఱ. "పంకాలాగుము."

పంకి, వై. వి. = పంకము. య. 5, అ. 12: చూ, బురద.

పంకించు, వై. అ. క్రి. 1. = కంపిః; చూ, సలించు. జై. 3, అ. 40; దే. స. క్రి. 2. పట్టించు. జై. 6, అ. 86; పాండు, 2, అ. 41: చూ, పూయు.

పంకిణి, వా. వి. పరిమళద్రవ్యము లుంచెడు పాత్రము: చూ, పాత్రము. 6.

పంకిలపడు, మి. అ. క్రి: చూ, అసలుకొను.

పంకిలము, సం. విణ. బురదగలది (నేల): చూ, సీమ. 1.

పంకెన, దే. వి. తడి: చూ, స్తేమము.

పరిమండలము, సం. విణ. అంతటగుండ్రమైనది: చూ, వృత్తము. 5.

పరిమళము, సం. వి. అ. పుం. రూ - పరీమళము. 1. మెదుపుటవలనను, రాయిడివలనను బుట్టిన యొప్పిదపుతావి: చూ, వాసన. 1; 2. సురతమున నలఁగిన మేనిపూఁతలోనగు వాని వలనఁ బుట్టినతావి: చూ, వాసన. 1; 3. (కుంకుమాదుల) మెదుపుట: చూ, విమర్దనము.

పరిమళించు, సం. అ. క్రి. తావివీచు: చూ, విసరు. 6.

పరిమాణము, సం. వి. అ. న. 1. తూము లోనగువాని కొలఁత: చూ, పరిమితి; వా. వి. 2: చూ, సంచిమొదలు; 3. విశాలము.

పరిమాణార్థకములు, అం. "అంత, ఇంత, ఎడు." అనునవి.

పరిమార్జనము, సం. వి. అ. న. అంతట తుడుచుట: చూ, రుద్దుదు.

పరిమార్పు, దే. వి. చంపుట: చూ, హింస. 1.

పరిమాఱుచు, దే. స. క్రి. (పరియ + మాఱుచు) 1. ఖండించు. భాగ 10, స్కం. ఉ. 444: చూ, నెలగు; 2. చంపు. భార. విరా. 2, ఆ. 193: చూ, సంహరించు. (రూ - పరిమాఱ్చు - పరిమార్చు అనియు).

పరిమికంప, వా. వి ఒకానొక ముండ్లచెట్టు: చూ, వృక్షము.

పరిమితము, సం. విణ. 1. కొలఁది యిడఁబడినది. ఉచితము; 2. చేర్పఁబడినది: చూ, మట్టసము.

పరిమితి, సం. వి. ఇ. స్త్రీ. ఇయత్త, ఇయాన్, గరళము, పరిమాణము, పరివాపము, మితి. (తె.ప).-అలవి, కట్టు,కొలఁది-కొల్ది, కొలత, పాళము, మట్టము, మట్టసము, వాసి. తద్వి. - ౧. అల్పపరిమాణమునకు.— కణము; ౨. ధాన్యపు కొలతకు.—కణము. (తె. ప): (చూ, కొలత); 3. రెండువేల పలములు పరిమాణమునకు — శకటము. (మిగత వానికి "చూ, వాసి 6.") (కొలత అను పదము కడనుగల వివరములు చూడుము.)

పరియ, దే వి: చూ, రూ - పఱియ.

పరియంకము, వై. వి. = పర్యంకః. పానుపు. విక్ర. 6, ఆ. 21: చూ, శయ్య. 1.

పరియాచకము, వై. వి. = పరిహాసః. రూ-పరేచకము. 1: చూ, పరిహాసము; విణ. 2. పరిహాసయుక్తము.

పరియాచకముసేయు, వై. స. క్రి. వెక్కిరించు. కాశీ. 4, ఆ. 81: చూ, హసించు.

పరియాచకుఁడు, వై. వి. = పరిహాసకః చూ, హాస్యగాఁడు.

పరియు, దే. అ. క్రి. 1. తప్పు: చూ, మిడివోవు; 2. నశించు; చూ, సమయు. 3; 3. మీదిభాగము సారహీనమై చెక్కలు వాని రాలు.

పరిరంభము, సం. వి. అ. పుం. రూ - పరీరంభము. కౌఁగిలింత: చూ, సంశ్లేషము.

పరివట్టము, వై. వి. 1. అలవట్టము: చూ, సూరెపాను; 2. = పరివట్ట. ఒకానొకమూలిక: చూ, వృక్షము; 3. — పరివేష్టన. విష్ణుప్రసాదముగా గ్రహించి తలకుఁ జుట్టుకొనెడు పట్టు బట్ట: చూ, వస్త్రము.

పరివర్జనము, సం. వి. అ. న. 1. బొత్తిగా విడుచుట: చూ, విమోచనము; 2. చంపుట: చూ, హింస. 1.

పరివర్జితము, సం. విణ. బొత్తిగావిడువఁబడినది: చూ, హీనము. 3.

పరివర్తనము, సం. వి. అ. న. 1. (రూ - పరివర్తము - పరీవర్తము.) వస్తువులమాఱుపు: చూ, వినిమయము 1; 2. (రూ - పరివర్తము - పరీవర్తము.) చుట్టివచ్చుట: చూ, వ్యాపనము; 3. (రూ - పరివర్తము - పరీవర్తము.) వెనుకకు తిరుగుట: చూ, వైముఖ్యము; 4. కథావిభాగము: చూ, సంపుటము; అం. 5: చూ, ఉత్తానకరణబంధములు.

పరివర్తము, సం. వి. అ. పుం. 1.—పై.—1-2-3; అం. 4: చూ, సంచారివర్ణగతాలంకారములు (రూ-పరీవర్తము).

పరివర్తించు, సం. అ. క్రి. చుట్టివచ్చు. తిరుగు: చూ, విహరించు.

పరివర్తితము, అం. 1: చూ, తిర్యక్కరణబంధములు (బంధములు); 2: చూ, కంఠక్రియలు; 3; చూ, హస్తకరణములు.

పరివసథము, సం. వి. అ. పుం. ఊరు: చూ, సీమ. 1. (దేశము).

పరివాదము, సం. వి. అ. పుం. రూ-పరీవాదము. 1. నింద: చూ, నెగ్గింపు; 2. వీణవాయించెడు కొడుపు: చూ, శలాక.2.

పరివాదిని, అం: చూ, తతవాద్యములు (ఏడుతంతులుగలవీణె): (చూ, వీణె).

పరివారు, వై. వి. = పరివార. పరిజనము: చూ, సంఘము.

పరివాపనము, సం. వి. అ. న. గొఱుగుట: చూ, ముండనము.

పరివాపము, సం. వి. అ. పుం. రూ - పరీవాపము. 1. వెదవెట్టుట; 2. కొలఁది: చూ, పరిమితి (కొలత); 3: చూ, పాదు. 1; 4. తనివి: చూ, సౌహిత్యము.

పరివాపితము, సం. విణ. 1. గొఱుగఁబడినది ముండితము: చూ, వాపితము. 1; 2. చక్కగా భేదింపఁబడినది: చూ, విచ్ఛిన్నము. 3.

పరివారము, సం. వి. అ. పుం. రూ - పరీవారము. 1. = పరివారః. ప్రాణిసమూహము: చూ, సంఘము; 2. దండు: చూ, సేన. 1; 3. కత్తియొఱ: చూ, ప్రత్యాకారము; 4. తిరిగెడి ప్రాణి: చూ, శరీరి.

పరివారు, వై. వి. =: చూ, పరివారము. 1.

పరివాహము, సం. వి. అ. పుం. రూ-పరీవాహము. 1. కలుజు: చూ, వాహసము. 2; 2: చూ, పరిబర్హము. 1.

పరివాహితము, అం: చూ, శిరఃక్రియలు.

పరివిగ్నము, సం. విణ. వ్యవస్థ తప్పినది. ఉద్విగ్నము.

పరివిత్తి, సం. వి. ఇ. పుం. తమ్మునికి పెండ్లియయి తనకు లేకుండెడియన్న. రూ - పరివిత్తుఁడు, (వీనికి రెండు ప్రాజాపత్యకృచ్ఛ్రములు ప్రాయశ్చిత్తము. అట్లు చేయనిచో నరకమును పొందును).

పరివిత్తుఁడు, సం. వి. అ. పుం.—పై.—

పరివృఢుఁడు, సం. విణ. ఏలిక. రూ-పరీవృఢుఁడు: చూ, స్వామి. 1.

పరివృతము, సం. విణ. రూ-పరీవృతము. 1. చుట్టఁబడినది: చూ, వ్యావృత్తము. 2; 2 పొందఁబడినది: చూ, వ్యాప్తము. 3; 3. తెలియఁబడినది: చూ, వ్యక్తము. 2.

పరివృత్తము, అం. 1: చూ, జంఘాక్రియలు ; 2: చూ, కరణములు.

పరివృత్తి, అం. ఒకానొకయర్థాలంకారము (కొంచెమిచ్చి హెచ్చుగొనుటగాని హెచ్చిచ్చి యించుకగొనుటగాని పరివృత్తియే. ఉదా.- "ఏకవిశిఖమువిడిచి యరినృపాలపురములగొనియె."): చూ, అలంకారము. 3.

పరివేత్త, సం. వి. ఋ. పుం. అన్నకన్నముందుఁ బెండ్లాడిన తమ్ముఁడు. (వీనికి రెండు ప్రాజాపత్యకృచ్ఛ్రములు ప్రాయశ్చిత్తము. ఇవి చేయనిచో నరకము తప్పదు.)

పరివేదని, సం. వి. ఈ. స్త్రీ. పరివేత్తయగువానిని పెండ్లి చేసికొనినస్త్రీ. (దీనికొకప్రాజాపత్యకృచ్ఛ్రము. అది చేయనిచో నరకము సిద్ధము.) (మఱియు అట్టి పరివేత్తకు పిల్లనిచ్చినవాఁడు, అట్టి పెండ్లికి యాజకుఁడుకూడ నరకమును పొందుదురు. కన్యాదాతకు కృచ్ఛ్రాతికృచ్ఛ్రము, యాజకునకు చాంద్రాయణము ప్రాయశ్చిత్తములు.)

పరివేశము, సం. వి. అ. పుం. 1. రూ - పరివేషము - పరీవేషము. గాలిగుడి: చూ, వఱదగుడి; 2. వేష్టనము: చూ, వ్యాపనము.

పరివేషము. —పై.—

పరివేష్టనము, సం. వి. అ. న. 1.—పై.—; 2: చూ, పరివర్తము. 3.

పరివేష్టించు, సం. స. క్రి: చూ, వేష్టించు.

పరివ్యాధము, సం. వి అ. పుం. 1. కొండగోగు*: చూ, మృదుద్రుమము; 2. నీరుప్రబ్బ*: చూ, విదులము.

పరివ్రాజకుఁడు, సం. వి. అ. పుం: చూ, సన్న్యాసి.

పరివ్రాట్టు, సం. వి. జ్. పుం.—పై.—

పరిశిష్టము, సం. విణ. కడపట శేషించినది: చూ, శేషము. 1.

పరిశీలనము, సం. వి. అ. న: చూ, శోధన. 1.

పరిశీలించు, సం. స. క్రి: చూ, శోధించు.

పరిశుద్ధము, సం. విణ. మిక్కిలి శుద్ధిపొందినది: చూ, శుద్ధము. 3.

పరిశుద్ధి, సం. వి. ఇ స్త్రీ. మిక్కిలిగరగర, తెలుపు: చూ, పరిశీలనము.

పరిశుద్ధుఁడు, సం. వి. అ. పుం: చూ, శుద్ధుఁడు.

పరిశేషన్యాయము, న్యా. ఆఁడువాండ్రును మగవాండ్రును గలసి పదిమంది. అందులో నలుగురు మగవాండ్రు అని చెప్పఁగా మిగిలిన ఆఱుగురు ఆఁడువాండ్రని చెప్పనక్కఱ లేకుండఁగనే తెలియునదరీతి.

పరిశోధనము, సం. వి. అ. న: చూ, పరిశీలనము.

పరిశోధించు, సం. స. క్రి: చూ, పరిశీలించు.

పరిశ్రమము, సం. వి. అ. పుం. 1: చూ, స్వభావము; 2. మిక్కిలి అలపు: చూ, హాంత.

పరిశ్రాంతము, సం. విణ. మిక్కిలి యాయాసఁజెందినది.

పరిశ్రాంతి, సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలియాయాసము: చూ, శ్రాంతి.

పరిషత్తు, సం. వి. ద్. స్త్రీ. 1.= పరుస. సమితి: చూ, సభ. 2. (పరిషత్తు 5 విధపక్షములు.- ౧. వేదవేదాంగములు పఠించి యజ్ఞాదికము నాచరించిన ఆహితాగ్నులు నలుగురుండుట; ౨. వేదవేదాంగములు పఠించి యజ్ఞాదికము నాచరించిన ఆహితాగ్నులు ముగ్గురుండుట; ౩ ఆహితాగ్నులు కాకపోయినను వేదవేదాంగములు పఠించినవారలు ఇరువదుండుట; ౪. ఆహితాగ్నులు కాకపోయినను వేదవేదాంగములు పఠించినవారలు ముగ్గురుండుట; ౫ ఆత్మవిద్యానుభవముకలిగి మనన శీలుఁడై ఆహితాగ్నియగువాఁడొకఁడుండుట. ఇట్లు లేక కేవల నామధారక బ్రాహ్మణులు వే కొలఁది యున్నను వారు పరిషత్త్వమునకు అర్హులు కారు): 2: చూ, సమూహము; వా. 3.= పరుస: చూ, వనగరము.

పరిషేచనము, సం. వి. అ న. పుడిసిట నీళ్లుపోసికొని భోజనపాత్రాదుల చుట్టువిడుచుట: చూ, శుద్ధాచమనము.

పరిష్కరించు, సం. స. క్రి: చూ, సవరించు.

పరిష్కారము, సం. వి. అ. పుం. 1. చక్కఁబెట్టుట: పరిష్కృతి; 2. తొడవు: చూ, భూషణము. 2.

పరిష్కృతము, సం. విణ. 1. చక్కఁబెట్టఁబడినది: చూ, సంస్కృతము. 3; 2. అలంకరింపఁబడినది: చూ. సజ్జితము 2.

పరిష్కృతి, సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, పరిష్కారము. 1; 2: చూ, పరిష్కారము. 2.

పరిష్కృతుఁడు, సం. విణ: చూ, భూషితుఁడు.

పరిష్వంగము, సం. వి. అ. పుం కౌఁగిలింత: చూ, సంశ్లేషము.

పరిసంఖ్య, అం. ఒకానొక యర్థాలంకారము. (ఒకచో లేదని మఱొకచో నియమించుట. ఉదా.— "స్నేహక్షయము చెలులడెందంబులందుఁగాదు దీపములందుఁగాని.": చూ, అలంకారము. 3; అం. 2: చూ, విధులు.

పరిసరము, సం. వి: అ. పుం. 1: చూ, సమీపము. 1; 2.= పరగడ. ఊరుదరి పొలము: చూ, భూమి. 1; 3: చూ, సావు.

పరిసర్పము, సం. వి. అ. పుం: చూ, పరిక్రియ. 1.

పరిసర్య, సం. వి. అ. స్త్రీ. రూ - పరిసారము - పరీసారము. 1. కొంత లోనగువాని సమీపమార్గము ననుసరించిపోవుట; 2. అంతట తిరుగుట: చూ, వ్యాపనము.

పరిసారము, సం. వి. అ. పుం.—పై.—

పరిసెనము, దే. వి. గంతు. స్వా. 4, ఆ. 27: చూ, లంఘ.

పరిస్కందుఁడు, సం. వి. అ. పుం: చూ, పరజాతుఁడు.

పరిస్తరణము, సం. వి. అ. న అగ్నిచుట్టు పఱచినదర్భ: చూ, హరిత. 1. (తృణము. 1.)

పరిస్తోమము, సం. వి. అ. పుం. ఏనుఁగుమీద పఱచెడి యెఱ్ఱకంబళి, కుథము: చూ, రల్లకము.

పరిస్పందము, సం. వి. అ. పుం. 1. మాల్యాది నిర్మాణము: చూ, రచన; 2. దర్పణాద్యుపకరణము: చూ, సాధనము. 2.

పరిస్ఫోటనము, సం. వి. అ. న. 1. చీల్చుట; చూ, విదారణము. 1; 2. ప్రకాశింపఁజేయుట: చూ, వెలుతురు. 1.

పరిస్ఫోటించు, సం. స. క్రి. 1. చీల్చు: చూ, విదారించు; 2. ప్రకాశింపఁజేయు.
పరిస్రుత, సం. వి. ఆ. స్త్రీ. 1. కల్లు: చూ, సుర. 1; విశ. 2. కాఱినది: చూ, స్రుతము.
పరిహరించు, సం. స. క్రి: చూ, విస్తరించు.
పరిహసనము, సం. వి. అ. న. = పరియాచకము: చూ, హాళి
పరిహసించు, సం. వి. క్రి. నవ్వు: చూ, హసించు.
పరిహస్తబ్రాహ్మణులు, అం. మైథిలులలో నొక తెగవారు. (సామవేదులు కొందఱును, కృష్ణయజుర్వేదులు కొందఱును, శుక్లయజుర్వేదులొకకొందఱును నైయున్నారు): చూ, బ్రాహ్మణులు.
పరిహారము, సం. వి. అ. పుం. 1. విడుపు: చూ, విమోచనము; 2. చేయి: చూ, హస్తము. (శ.ర.)
పరిహారి, సం. విశ. పరిహరించు వాఁడు: చూ, హారకుఁడు. 1.
పరిహార్యము, సం. వి. అ. పుం 1. హస్తవలయము: చూ, భూషణము. 2; విశ. 2. విడువఁదగినది, హేయము: చూ, హీనము. 3.
పరిహాసకులు, అం: చూ, సభాసప్తాంగములు.
పరిహాసము, సం. వి. అ. పుం. రూ-పరీహాసము: చూ, పరిహసనము.
ప-రి-హీనతానములు, అం. సౌభాగ్యకృత్తు, శారీరి, శాంతి, పుష్టికృత్తు, వైనతేయము, ఉచ్చాటనము, వశీకరణము. (7): చూ, తానములు.
పరిహృతము, సం. విశ. పరిహరింపఁబడినది: చూ, హీనము. 3.
పరిహృతి, సం. వి. ఇ. స్త్రీ: చూ, పరిహారము. 1.
పరీక్ష, సం. వి. ఆ. స్త్రీ: చూ, పరిశీలనము.
పరీక్షకుఁడు, సం. విశ. కారణికుఁడు: చూ, శోధకుఁడు.
పరీక్షాతంత్రములు, అం: చూ, పంచతంత్రములు.
పరీక్షించు, సం. స. క్రి. = పరికించు: చూ, శోధించు. 1.
పరీక్షిత్తు, సం. వి. త్. పుం: చూ, ఔత్తరేయుఁడు.
పరీతము, సం. విశ. చుట్టుకొనఁబడినది: చూ, వ్యావృత్తము. 2.
పరీతాపము, సం. వి. అ. పుం: చూ, రూ- పరితాపము. 1.
పరీధావి, అం: చూ, సంవత్సరములు.
పరీభవము, సం. వి. అ. పుం: చూ. రూ-పరిభవము.
పరీభావము, —పై.—
పరీరంభము, సం. వి. అ. పుం: చూ, రూ-పరిరంభము.
పరీవర్తము, సం. వి. అ. పుం: చూ, రూ-పరివర్తము. 1-2-3; అం. 4: చూ, హస్తప్రాణములు.
పరీవాదము, సం. వి. అ. పుం: చూ, రూ-పరివాదము.
పరీవాపము, సం. వి. అ. పుం: చూ, రూ-పరివాపము.
పరీవారము, సం. వి. అ. పుం: చూ, రూ-పరివారము.
పరీవాహము, సం. వి. అ. పుం: చూ, రూ-పరివాహము. 1-2.
పరీవృఢుఁడు, సం. విశ: చూ, రూ-పరివృఢుఁడు.
పరీవృతము, సం. విశ: చూ, రూ-పరివృతము.
పరీష్టి, సం. వి. ఇ. స్త్రీ. 1. అమంత్రణార్థము వెదకుట: చూ, వెదకుడు; 2. పరిచర్య: చూ, సేవ; అం. 3. (ప్రాకామ్యము): చూ, సిద్ధులు (విభూతులు).
పరీసారము, సం. వి. అ. పుం: చూ, రూ-పరిసారము.
పరీహాసము, సం. వి. అ. పుం: చూ, రూ-పరిహాసము.
పరుండు, దే. అ. క్రి. (పడి+ఉండు): చూ, శయనించు (రేఫాదేశము.)
పరుంజు, వై. వి. = పరంజ. కత్తిపిడి. స్కా. 4, ఆ. 28: చూ, పిడి. 2.
పరుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, శత్రువు; 2. పరమాత్ముఁడు: చూ, హంసుఁడు. 2; విశ. 3. అన్యుఁడు: చూ, వేఱయినవాఁడు.
పరుగిడు, వా. అ. క్రి. రూ-పరువిడు. పరుగెత్తు: చూ, వెళ్లు. 1.
పరుగు, దే. వి. 1: చూ, పరువు. (1); 2. (రూ - పఱుగు - పరువు - పర్వు): చూ, ప్రధావనము.
పరుగుగొను, వా. అ. క్రి: చూ, పరుగిడు.
పరుగునేల, వా. వి: చూ, పరువు. (1).
పరుగుమెట్టు, —పై —
పరుగువాఱు, వా. అ. క్రి. (రూ-పరువువాఱు - పరుగువెట్టు - పరువువెట్టు-పరుగెత్తు-పరువెత్తు - పరుగుగొను-పరువుగొను-పరుగిడు-పరువిడు): చూ, వెళ్లు 1.
పరుగువెట్టు, —పై.—
పరుగెత్తు, —పై.—
పరుపు, వా. వి. 1: చూ, వైశాల్యము; 2: చూ, శయ్య. 1.
పరుషు, వా. వి: చూ, సురుము.
పరువడము, దే. వి. చేయము, చయనము: చూ, వహ్ని. 1.
పరువడి, దే. వి. ఏ. 1. పర్యాయము: చూ, సమానము. 2; 2. = పరిపాటి. క్రమము. ఉ, హరి. 2, ఆ. 86: చూ, విధము. 1.
పరువము, వై. వి. 1. = ప్రాయము. హరి. ఉ, 5, ఆ. 218: చూ, వయస్సు. 1; 2. = ప్రాయ. యౌవనము: చూ, వయస్సు. 1; 3. పరిపాకము: చూ, పరువు; 4. = పర్వు ఉత్సవము: చూ, సంబరము.
పరువళ్ళు, అం. ఎడమడుగు పరువడి, కుడియడుగు పరువడి, కదలుపరువడి, దాఁటుపరువడి, కోపుపరువడి, ఒంటియడుగు కత్తెర, సర్పబంధు కత్తెర, చిట్టడుగు కత్తెర, జాగివక త్తెర, పొదలిక కత్తెర, పావురపు పావులు, జాగినపావులు. (12) (మల్లశాస్త్రములోనివి.)
పరువిడు, దే. అ. క్రి: చూ, రూ.పరుగిడు.
పరువు, సం. వి. ఉ. పుం. స్. న. 1. వెదురుగనుపు, గ్రంథి, పర్వము: చూ, వేణువు; దే. వి. (1) కోసుదూరము: కూఁతనేల, కూఁతపట్టు, కూఁతపట్టునేల, కూఁతవేటు, కోసు, పరుగు-పరుగునేల-పరువు-పర్వు, పరుగుమెట్టు (సం.ప).— క్రోశము, గవ్య. గోమితము, గోరుతము, గోవు: తద్వి.— (౧) రెండుకోసులకు.— (౨) ఇరుపరువునేల- ఇరువర్వునేల. (సం. ప). — క్రోశద్వయము, క్రోశయుగము, గోయుజ (మిగతవానికి: "చూ, విప్రకృష్టము"); (2) ధావనము: చూ, రూ-పరుగు. 2; (3) ఇంటికప్పు: చూ, సదనము. 1; వై. వి. (4) = భర. గొప్పదనము: చూ, సన్మానము;

(5) = పర్వ: కొలికె, పదను, పరువము, పరువు (సం. ప.— పరిపాకము, పరిణతి, పాకము.

పరువుగొను, దే. అ. క్రి: చూ, రూ-పరుగుగొను. అచ్చ, యు, కాం. 90.

పరువువాఱు, చూ. పరువుగొను.

పరువువెట్టు, —పై.—

పరువెత్తు, వా. అ. క్రి. —పై —

పరుషము, సం. విణ. 1. కఠినము, నిష్ఠురము, (తె ప).— ఈఅతాఱలు, కంకర, కరసు, కఱకు. కిఱుకు, క్రొవ్విదము, గంద్రయి, చిడిపి, దురుసు, పరుసదనము, పరుసన - పరుసనము, - పరుసు, పలుసము, పెఱుచు, ప్రల్లదము, మొఱకు, మొఱ్ఱ; (మిగతవానికి "చూ, శబ్దము. 2."); 2. నిష్ఠుర వాక్యము: చూ, శబ్దము. 2; 3. చిత్రవర్ణము: చూ, వర్ణము. 6; 4. = కరుసు, బిరుసు-బెరుసు, కఠినము: చూ, బెడిదము; అం. 5. పదదోషములలో నొకటి (శ్రు.కటువు): చూ, కావ్యదోషములు; 6. వాక్యగతదోషములలో నొకటి (కఠి నార్థము గలది: చూ, వాక్యగతదోషములు (వాక్య దోష ములు); 7. కావ్యదోషములలో నొకటి (వినుటకు కఠినము లగు పదము లు గలది. ఉదా.—"శుద్రేజా పతేమూర్ధ ధృతా ర్థోర్ధ్వధి పతికొల్తు".): చూ, కావ్యదోషములు; 8: చూ, అర్థ దోషములు ("ఈ రాజు సౌందర్యమునకు మంటలోఁ బడిన మన్మథుఁడే సాటి.")

పరుషోక్తి, సం. వి. ఇ. స్త్రీ: చూ, పరుషము. 2.

పరుస, వై. వి. 1. బాటసారులగుంపు: చూ, సమూహము; విణ: 2. కఠినుఁడు. భార. ఉద్యో. 3, ఆ. 47: చూ, వ్యాధుఁడు.2; 3. = పరిషత్: చూ, పరిషత్తు. 1; 4. = పరిషత్. కదుపు: చూ, వంగడము; 5. = పరిషత్. గుంపు: చూ, సమూహము.

పరుసదనము, వై. వి. = పరుషత. (రూ-పరుసనము-పరుసన- పరుసు పలుసము): చూ, పరుషము. 1.

పరుసన, —పై.—

పరుసనము, —పై.—

పరుసము, వై. వి. = స్పర్శవేది: చూ, రూ-పరసవేది; విణ. 2. రూ-పలుసము: చూ, పరుషము.

పరుసవేది, వై. వి. = స్పర్శవేది: చూ, రూ-పరసవేది. హరి. ఉ. 5, అ. 238.

పరుసు, వై. వి. 1. = పరుషత: చూ, పరుషము. 1; 2. రీతి: చూ, విధము. 1.

పరూషము, సం. వి. అ. పుం. పేరీఁదు*: చూ, మధుఖర్జూరిక.

పరూషి, సం. వి. ఈ. స్త్రీ. చిట్టీఁదు*: చూ, మధుఖర్జూరిక.

పరేచకము, వై. వి. = పరిహాసము: చూ, పరిహాసము.

పరేతరాట్టు, సం. వి. జ్. పుం: చూ, యముఁడు.

పరేతుఁడు, సం. వి. అ. పుం. 1. భూతవిశేషము: చూ, భూతము; విణ. 2. చచ్చినవాఁడు: చూ, మృతుఁడు. (తద్వి.—కీర్తిశేషుఁడు, మృతజీవుఁడు, జీవన్మృతుఁడు, జీవ న్మృతుఁడు ఇత్యాది.)

పరేద్యవి, సం. అవ్య. మఱునాటికిపేరు.

పరేష్టుక, సం. వి. ఆ. స్త్రీ పెక్కు ఈఁత లీనిన యావు, బహుసూత: చూ, సౌరభేయి (ధేనువు.

పరైధితుఁడు, సం. వి. అ పుం: చూ, పరజాతుఁడు.

పరోక్షము, సం. విణ. ఇంద్రియగోచరముకానిది.

పరోఢ, సం. వి. ఆ. స్త్రీ. పరకీయాభేదము (ఒకనిఁబెండ్లాడినది.)

పరోపకారార్థమిదం శరీరమ్, లో. ఈ శరీరము పరులకుపకారము చేయుటకొఱకు. "అతయ బరోపకారార్థ మిదంశరీరమ్మను వాక్యసారము గ్రహించి." (కుచేలోపాఖ్యానము)

పరోయుతులు, సం. విణ. పదివేలకంటె నధికమైన సంఖ్య గలది: చూ, సంఖ్య 1.

పరోష్ణి, సం. వి. ఈ. స్త్రీ: చూ, తైలపాయిక. (తైలపాయిక దగ్గఱ పరోష్ణి చేర్చి చదువుము.)

పర్కటి, సం. వి ఈ. స్త్రీ న్. పుం. 1. జువ్వి*: చూ, ప్లక్షము; 2 పోఁకమ్రాను లోనగువాని క్రొత్తపంపు: చూ, స్రింసి. 1.

పర్జని, సం వి. ఈ. స్త్రీ పచుపచ, మ్రాని పసుపు*: చూ, హరిద్రు.

పర్జన్యన్యాయము, న్యా. మేఘునివలన చవిటినేలను మంచినేలను గూడ వాన కురియును మంచినేలను గురిసినది యుపయో గించును. చవిటినేలను గురిసినది వ్యర్థమగుననురీతి.

పర్జన్యము, సం. వి. అ. పుం. 1. ఉఱుము: చూ, స్తనితము; 2. ఉఱిమెడు మేఘము: చూ, మేఘము. 1.

పర్జన్యుఁడు, సం. వి. అ. పుం. 1. వర్షాధిదేవత. ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు; అం. 2: చూ, ఆదిత్యులు.

పర్ణభోజనము, సం వి. అ. న: చూ, పరిక్రమసహము.

పర్ణము, సం. వి. అ. న. 1. (వృక్షమున నిండియుండునది): (చూ, ఆకు) అరరము, ఉటము, కచవము, కవచము, ఛదనము-ఛదము, దళము, పత్రము, వర్ణము, పలాశము. (తె. ప).—ఆకు, గాదము; తద్వి. — గ. ఎండిన ఆకు నకు.—(తె). — ఎండాకు, కారాకు, చొక్కాకు, చొరుగు- చొరువు, సొరుగాకు; ఇ. గఁజాయిఅకునకు.—(తె).— పత్తిరాకు-పత్తిరి-పత్రి; ఇ. చివికినఆకునకు.— చీకాకు; ౪. పండిన ఆకునకు.—(తె).—కారాకు, పండుటాకు - పండాకు; ౫. పూజాదళమునకు.—(తె) —పత్తిరాకు-పత్తిరి- పత్రి (మిగత విశేషాదులకు: "చూ, సొరుగాకు"); పుం. 2: చూ, మోదుగు *.

పర్ణశాకము, సం. వి. అ. న: ఆకుకూర.

పర్ణశాల, సం వి. ఆ స్త్రీ. ఆకుటిల్లు: చూ, సదనము. 1.

పర్ణస్తబకము, సం. వి అ. పుం: ఆకుచుట్ట, ఆకుబుట్ట.

పర్ణాస, సం వి. ఆ. స్త్రీ. 1. గగ్గెర*: చూ, సుగంధికము; 2. నల్లగగ్గెర*: చూ, సుగంధికము.

పర్ణాసము, సం వి. అ. పుం.—పై.—

పర్ణి, సం. వి. ఈ. స్త్రీ: చూ, షడ్గ్రంధ*.

పర్ణగపాబ్రాహ్మణులు, అం. ఉత్కళులలో నొకతెగవారు. (శుక్లయజుర్వేదము, మాధ్యందినశాఖ): చూ, బ్రాహ్మణులు.

పర్పటము, సం వి. అ. పుం; చూ, పాపట. 2*.

పర్పటి, సం. వి. ఈ. స్త్రీ: చూ, కృష్ణ. 14.

పర్పణము, సం. వి. అ. పుం: చూ, పర్పటము*.
పర్పరీకుఁడు. సం. వి. అ. పుం అగ్ని: చూ, వహ్ని. 1.
పర్పాటకము, వై.* వి: చూ, తృణము. 1.*
పర్మానా, వా. వి: చూ, సెలవు.
పర్యంకము, సం. వి. అ. పుం. 1. = పరియంకము. పలంగు: చూ, మంచము; 2: చూ, పర్యస్తిక.
పర్యంతము, సం. వి. అ. పుం. వఱవాఁక, దనుక; చూ, వఱకు.
పర్యంతార్థకములు, అం. "దనుక, దాఁక, వఱకు" అనునవి.
పర్యటనము, సం. వి. అ. న. వ్రజ్య. భిక్షలోనగు వానికొఱకు తిరుగుట: చూ, విహారము. 1.
పర్యటించు, సం. అ. క్రి. భిక్షలోనగువాని కొఱకు తిరుగు: చూ, సంచరించు.
పర్యయము, సం. వి. అ. పుం. క్రమముతప్పుట: చూ, వ్యత్యయము.
పర్యవసానము, సం. వి. అ న. ముగియుక: చూ, సమాప్తి. 1.
పర్యవసితము, సం. విణ. ముగిసినది: చూ. సమాప్తము.
పర్యవస్థ, సం. వి. ఆ. స్త్రీ. విరోధించుట; చూ, విరోధము. 1.
పర్యవస్తము; సం. విణ. 1. పడినది; 2. కొట్టఁబడినది: చూ, ప్రహతము. 1.
పర్యస్తిక, సం. వి. ఆ. స్త్రీ. పర్యంకము: చూ. యోగపట్టె.
పర్యాప్తమగు, మి. అ. క్రి. (తె. ప).—అఁటు, ఉఱుగు, ఓపు, కలుగు-కల్గు-కలువు. నేరుచు-నేర్చు.
పర్యాప్తము, సం. వి. అ. న. 1. యథేష్టము: చూ, స్వేచ్ఛ; 2. తృప్తి: చూ, సౌహిత్యము; 3: చూ, శక్తి. 1; 4. నివారణము: చూ, వారణము. 1.
పర్యాప్తి, సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, పర్యాప్తము. 2; 2: చూ, పరిత్రాణము. 3.
పర్యాయము, సం. వి. అ. పుం. 1. అవసరము: చూ, సమయము. 1; 2. క్రమము: చూ, విధము. 1; 3. పోలిక: చూ, సమానము. 2; 4. స్వాధ్యాయక్రమము: చూ, పరిపాటి; అం. 5. ఒకానొక యర్థాలంకారము. (ఒక వస్తువున కనేక సంశ్రయములఁ జెప్పుట. ఉదా—"కామినీముఖప్రభ తమ్మి విడిచి చంద్రుం బొందె"): చూ, అలంకారము. 3.
పర్యాయోక్తి, అం. (పర్యాయోక్తము) ఒకానొక యర్థాలంకారము (చేయవలసిన పనిని భంగ్యంతరముచేఁ దెల్పుట. ఉదా.—"సముద్రపానము చేసిన మునికి వందనము."): చూ, అలంకారము. 3.
పర్యాలోచనము, సం. వి. అ. న. చక్కఁగా ఆలోచించుట: చూ, యోచన.
పర్యాలోచించు, సం. స. క్రి. చక్కఁగా ఆలోచించు: చూ. విమర్శించు.
పర్యుదంచనము, సం. వి. అ. న. అప్పు: చూ, బాకీ. 2.
పర్యుదస్తము, సం. విణ: చూ, విద్ధము.
పర్యుదాసము, సం. వి. అ. పుం. త్రోయుట: చూ, విద్ధము.
పర్యుషితము, సం వి. అ. న. 1. చలిది: చూ, సాదము. (1); విణ. 2. బహుకాలము ఉంచఁబడినది: చూ, వ్యూఢము. 2.

పర్యుదస్తము, సం. విణ. త్రోయఁబడినది: చూ, విద్ధము.
పర్యుదాసము, సం. వి. అ. పుం. త్రోయుట: చూ, విద్ధము.
పర్యుదాసించు, సం. స. క్రి. త్రోయు: చూ, రాపొట్టు.
పర్యుషితము. సం. వి. అ. న. 1. చలిది: చూ, సాదము (1): విణ. 2. బహుకాలము ఉంచఁబడినది: చూ, వ్యూఢము. 2.
పర్యేషణ, సం. వి. ఆ. స్త్రీ: చూ, పరీక్ష. 1.
పర్వతమార్గము, సం. వి. అ. పుం. కొండమీఁది దారి: చూ, మార్గము. 1.
పర్వతము, సం. వి. అ. పుం. (సంధులుగలిగినది) 1. అంకము, అగమము, అగము, అచలము, అద్రి, అవని (నీ) ధరము, అవని (నీ) ధ్రము, అద్రిము, అర్బుదము, అని, ఆహార్యము, ఋ, ఙా, కందరాకరము, కటకి, కళింగము, కాలంజరము, కుంజము, కుందము, కుకీలము, కుట్టారము, కుట్టీరము, కుతి, కుత్కీలము, కుధరము, కుధ్రము, కుశీలము, కుశేశయము, కేదారము, క్షితిధరము, క్ష్మాభృత్తు, గంగాధరము, గజచ్ఛాయ, గిరి, గోత్రము, గోమేధము, గోవిందము, గ్రావము, ఘనాఘనము, చికురము, జీమూతకుటము, జీమూతము, జీమూలము, తుంగము, ధ్రదంతి, ధరణి, ధరణీధరము, ధరము, ధరాధరము, ధాతుభృత్తు, నగము, నాకువు, నాగము, నిర్ఝరి, పత్రి, పృథుశేఖరము, భూభృత్తు, మహీధ్రము, మహేంద్రము, వరాహము, వలాహకము, వ్యంగకము, శిఖరి, శిలోచ్చయము, శృంగి, శైలము, సానుమంతము, స్థావరము, స్థిరము, (తె. ప.) — కరువ, కొండ, గట్టు, గుంపు, గుట్ట, గుబ్బలి, చట్టు, తిప్ప, నేలతాలుపు, పుడమితాలుపు, మల, మెట్ట-మెట్టు, తద్విశేషములు. ౧. అంజన పర్వతమునకు - అంజనగిరి, అంజనము, అంజనాచలము, నీలము. (తె. ప).-కప్పుమల, కాటుకకొండ, కాటుకగుబ్బలి; ౨ అస్తాద్రికి- అబ్దము, అర్బుదము, అస్తము, అస్తాచలము, అస్తాద్రి, కనకాచలము, కనకాద్రి, చరమక్ష్మాభృత్తు, (తె.ప).- క్రుంకుకొండ, క్రుంకుడుగట్టు, క్రుంకుమల, క్రుంకుమెట్ట, పడమటికొండ; ౩. ఉదయాద్రికి. — ఉదయము, ఉదయాద్రి, ఖగాపనము, పూర్వపర్వతము. (తె.ప).—తూరుపుఁగొండ, తొలుగట్టు, పుట్టుగట్టు, పొడుపుఁగొండ, మునుగట్టు; ౪. ఋక్షమను కొండకు.— ఋక్షపర్వతము, ఋక్షము; ౫. ఓఢ్రదేశస్థ పర్వతవిశేషమునకు. — కిష్కింధము - కిష్కింధ్య; ౬. కవ్వపుఁగొండకు.— ఇంద్రకీలము, మందరము, మంథాంద్రి(తె. ప).—కవ్వంపుమల, కవ్వపుఁగొండ, కవ్వపుమల, తరిగట్టు, తరిగొండ; ౭. కుల (ప్రధాన) పర్వతములు — మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము, గంధమాదనము, వింధ్య, పారియాత్రము (7); ౮. కృతకాద్రికి.—కృతకాద్రి, క్రీడాస్థానము, (తె. ప.)—ఆటతిప్ప, ఆటపట్టు, చేఁతగట్టు; ౯. కైలాసపర్వతమునకు. — అపరావృత్తినిలయము, అష్టాపదము, కర్పూరవేదిక, కుబేరాచలము, కువేరాచలము, కేలాసము-కైలాసము, గణపర్వతము, గౌతమీద్వారము, రజతప్రస్థము, రజతాద్రి, శివాద్రి; (తె. ప). — తెల్లగుబ్బలి, మడికాసుమలగట్టు, ముక్కంటిమల, ముక్కంటియిల్లు, విసపుమేఁతరిభులు చెంకి,

వెండికొండ, వెండిగుండు, వెండిమించుకొండ, వెలిగొండ, వెలితిప్ప; ౧౦. కొండగుహకు.—: (చూ, రంధ్రము. 1); ౧౧. కొండచఱియకు —అగము, చౌండాదికము, దంతము, తటము, ప్రపాతము, భృగువు. (తె. ప.)— కొండచఱియ, కొండనడుము, గుబ్బపేట, చఱి-చఱియ, జాఱుపు, పడుకు - పడుగు - పఱుగు, లొద్ది, లోలము, లోవ; ౧౨. కొండ పగుళ్లు; అఘాతము; (తె.ప) లొద్ది, లోయి, లోవ; ౧౩. కొండమీఁద సమానమైనచోటునకు — ప్రస్థము, స్నువు, (తె.ప)— డెప్ప, నెత్తము, పాళి; ౧౪. క్రౌంచాద్రికి — కౌంచము - క్రౌంచము. (తె.ప).— కొలచ; ౧౫. చక్ర వాళ పర్వతమునకు.—చక్రవాళము, లోకాలోకము. (తె. ప).— కడపటిమల, చుట్టుగొండ, బటువుగుబ్బలి, మేర గట్టు, సుడిగట్టు; ౧౬. చిత్రకూటాద్రికి.—గుణేశ్వరము, చిత్రకూటము; ౧౭. చిన్నచిన్న రాళ్లగుట్టకు.—(తె.ప).— దిమ్మె; ౧౮. త్రికూటాద్రికి.—త్రికకుత్తు. త్రికూటము; ౧౯. ద్రోణాద్రికి.—ద్రోణము, ఓషధీశము; ౨౦. ప్రతి ధ్వనించు కొండకు.— (తె ప).—పలుకుడుబండ; ౨౧. మలయాద్రికి.—ఆషాఢము, గిరిసారము, చందనాచలము, మలయము (తె. ప.)—గందపుఁ గొండ; ౨౨. మేరు పర్వతమునకు -ఉరు, కనకాచలము, కనకాద్రి, కర్ణికా చలము, కల్యాణగోత్రము, కాంచనగిరి, చామీకరము, జ, మేరువు. శక్రక్రీడాచలము, సుమేరువు, హేమాద్రి. (తె.ప).- జేజేగట్టు-జేజేలగట్టు, నెలదారిసింగిణి, పొంగట్టు, బంగరుకొండ - బంగారుకొండ, వేలుపుమల - వేల్పుమల, వేలుపులయిల్లు, వేవన్నెల పసిఁడిగట్టు; ౨౩. మైనాకపర్వత మునకు.— క్రౌంచానుజము, మైనాకము. (తె. ప.— గట్టువట్టి, గట్టురాచూలి-గట్రాచూలి; ౨౪. రైవతపర్వతము నకు —కృష్ణాచలము, రైవతము; ౨౫. వర్షపర్వతములు.- చైత్రము, హిమవంతము, హేమకూటము, నిషధము, మేరువు, కర్ణి, శృంగి, (7); ౨౬. వృషభపర్వతము నకు. — ఋషభము. విష్ణుక్షేత్రము, వృషభము, వేంకటా చలము. (తె. ప).—తిరుపతి, తిరుమల; ౨౭. హిమాద్రికి.—అద్రిరాజు, ఉమాపిత, కారము, గోవిందుఁడు, నగపతి, నగాధిపుఁడు, నారాయణుఁడు, మేనాధవము, హిమ ధాతువు, హిమవంతము, హిమాచలము, హిమాద్రి, హిమా లయము. (తె. ప).—కొండఱేఁడు, గట్టులఱేఁడు; గట్లయెకి మీఁదు, గుబ్బలిదొర, చలిగొండ, చలువగట్టు, చలువలమల, చల్లనివెలిదిబ్బ, తొడుకుసాహిణిమామ, దుగ్గతంత్రి, దుగ్గి కన్నయ్య, పులుచూలి తాత, బేసికంటిమామ, మంచుగుబ్బలి, మంచుఁగొండ, మంచుటిలుఁదాల్పు, రెల్లుకానుపు తాత, వడఁకుగుబ్బలి, వడఁకుఁగొండ, వలిమల; ౨౮. పర్వత విశేషములు.—అగ్నిపర్వతము, అంశుమంతము, అయో ముఖము; ఋష్యమూకము; కకుభము; కగోత్రులు (సము ద్రము నందలి కొండలు); కలిందము; కాలాంజనము, కులాచలము; కూపిక (పీటినడిమికొండ); కూలకము (కృమిపర్వతము); కేదారము: (తె. ప).—కొండకోట (వలయాకారమైనకొండ): కోలాహలము; గులూచి-గుళూచి (పర్వతప్రాంతము); గోమంతము; గోవర్ధనము; ధారమల; (తె. ప).—నడఁగొండ (జంగమపర్వతము); నరాగము; వింధ్యము; ౨౯. శిలకు -(చూ, రాయి); (మిగతవానికి "చూ, హిమాలయము.")

పర్వతుఁడు, సం. వి. అ. పుం. ఒకానొకదేవఋషి: చూ, సన్న్యాసి. 1.

పర్వతోద్భూతము, సం. వి. అ. న. బేగడ: చూ, శుభ్రము. 1.

పర్వము, సం. వి. న్. పుం. 1. గనుపు: చూ, బుడిపి; 2. దర్శప్రతిపత్సంధి: చూ, పున్నమ; 3. = పబ్బము-ప్రబ్బము - పరువము, పండుగ: చూ, సుబరము; 4. విషువ దాది; చూ, విషువత్తు; 5: చూ, సమూహము; 6: చూ, శంసనము; 7. లక్షణాంతరము; 8. గ్రంథసంధి: చూ, సంపుటము (సర్గము).

పర్వములు, అం. 1. కృష్ణపక్షాష్టమి, కృష్ణపక్ష చతుర్దశి, కుహూవు (అమవస), పూర్ణిమ (పున్నమ), రవిసంక్రాంతి (5): చూ, పంచకము; 2. భారతపర్వములు.— ఆది, సభా, అర, విరా, ఉద్యో, భీష్మ, ద్రోణ. కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ, శాంతి, అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ -పర్వములు. (18). (ఇక శీర్షికలుగా లేవు.)

పర్వరీకుఁడు, సం. వి. అ. పుం: చూ, వహ్ని. 1.

పర్వరీణము, సం. వి. అ. న. 1. ఆకులయీనె: చూ, పొరక; 2. జూజమాడెడు కంబళి: చూ, వ్యవహారము. 4 (రల్లకము); 3. గనుపు: చూ, బుడిపి; 4: చూ, వసరు. 2.

పర్వసంధి, సం. వి. ఇ. పుం. పున్నమకును పాడ్యమికిని, అమావాస్యకును పాడ్యమికిని మధ్యకాలము; చూ, పున్నమ.

పర్వా, వా. వి. 1. గుఱి: చూ, లక్ష్యము. 1; 2: చూ, రూ-పరవా. 2; 3: చూ, వెఱపు. "నీకు పర్వా లేదు."

పర్వు, దే. వి. 2: చూ, రూ-పరుగు. 2; 2: చూ, రూ-పరువు (1); అ. క్రి. 3. రూ-పరవు: చూ, వ్యాపించు.

పర్శుక, సం. వి. ఆ. స్త్రీ. ప్రక్కయెముక: చూ, శల్యము. 1.

పఱ, దే. వి. 1. రూ-పఱ్ఱ, ఉప్పుపండెడుబయలు: చూ, భూమి. 1; 2 రూ-పఱ్ఱ. బయలు: చూ, భూమి. 1; 3. రూ-పఱ్ఱ. సున్నము లోనగువానిఁ గొలిచెడు మానవిశేషము. 4: చూ, సమూహము; వై. విణ. 5. = పరః. ఇతరము: చూ, వేఱు. 3; 6. మిక్కిలి. భో. 5, ఆ. 289: చూ, హెచ్చు. 1; 7. = పృథు- గొప్పది. భార. విరా. 4, ఆ. 86: చూ, విపులము.

పఱఁగు. వై. అ. క్రి: చూ, వ్యాపించు. హరి. ఉ. 7. ఆ. 34.

పఱగడ, వై. వి. 1. = పరిసర. (రూ—పరగడ—పరవడ—పఱగడము) ఇతరస్థలము. ఉ. హరి. 4, ఆ. 48: చూ, భూమి. 1; 2: చూ, పార్శ్వము. 2. రామా. 7, ఆ. 249.

పఱగడము, —వై.—

పఱగు, వై. అ. క్రి = ప్రసర-ప్రయుజ్: చూ, వ్యాపించు.

పఱచినపాటు, వా. వి. పొందించిన దురవస్థ.

పఱచు, దే. అ. క్రి. 1. పాఱు. భార. ఆది. 2. ఆ. 67: చూ, వ్యాపించు; 2. వలపఱచు: ఒగ్గు, ఒడ్డు; వై. ప్రే. (రూ- పఱుచు-పఱుపు.) 3. పడఁజేయు. కళా. 7, ఆ. 225;

4. దుప్పటిలోనగువానిపఱచు; 5. పాటు పడఁజేయు. భార. ఉద్యో. 1, ఆ. 245.
పఱనుట, వా. వి: చూ, త్రోలుట.
పఱత, దే. వి. (రూ-పఱతి-పఱద-పఱవ-పఱ్ఱు, వరద-వఱద.) ప్రవాహము: చూ, వెల్లువ.
పఱతి, —పై.—
పఱతెంచు, దే. అ. క్రి. (పఱచు + తెంచు). పాఱివచ్చు. భార. ఆది. 5, ఆ. 255.
పఱద, దే. వి: చూ, రూ-పఱత.
పఱపఱ, దే. వి. చించుట నమలుట లోనగువాని యందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.
పఱపు, దే. వి. 1. పడక: చూ, శయ్య. 1; 2. శీఘ్రము: చూ, వేగము. 3; 3. వికివి. కళా. 2, ఆ. 133: చూ, విస్తారము. 1; విణ. 4. విరివిగలది: చూ, విపులము; దే; ప్రే. 5. పోఁగొట్టు. భార. విరా. 4, ఆ. 201: చూ, భంగించు; 6. త్రోలు: చూ, వెలుచు; 7: చూ, ప్రయోగించు; 8: చూ, పూయు. సర్వ. 6, ఆ. 128.
పఱవ, దే. వి: చూ, రూ-పఱత.
పఱి, దే. వి. 1. రీతి: చూ, విధము. 1; 2. కాఁడిబరువు.
పఱిక, దే. వి 1. ఒకానొకఱాయి: చూ, రాయి; 2. ఒకరకము పక్కి: చూ, పక్షి.
పఱిగ, దే. వి: చూ, రూ-పరిగె. 4.
పఱిగపిట్ట, ద్వ. వి. పఱిగయేఱితినెడుపిట్ట: చూ, పక్షి.
పఱిగబ్రతుకు. ద్వ. వి: చూ. రూ-పరిగెబ్రతుకు.
పఱిగరి. దే. విణ. (పరిగ + అరి) పఱిగయేఱువాఁడు: పఱిగవాఁడు.
పఱిగవాఁడు, దే. విణ: చూ, పఱిగరి.
పఱిగొను, దే. స. క్రి. అపహరించు: చూ, సడపు.
పఱిపఱి. దే. విణ. పీడనము. హరి. ఉ. 8, ఆ. 6; హరి. ఉ. 8, ఆ. 48: చూ, సమ్మర్దము.
పఱియ, దే. వి. రూ-పఱ్ఱియ: చూ, శకలము. 4.
పఱియవాయు, దే. అ. క్రి. 1. చీలు: చూ, విదారించు; ప్రే. 2. పఱియవాపు. భార. విరా. 1, ఆ. 77.
పఱివోవు, దే. అ. క్రి. 1. చూరవోవు. ఉ. హరి. 3, ఆ. 44: చూ, ప్రుచ్చువోవు; 2. నశించు: చూ, సమయు. 4.
పఱుగు, దే. వి: చూ, రూ పరుగు.
పఱుచు, దే. ప్రే: చూ, రూ-పఱచు. 3-4-5 (పడఁజేయుటకు— భాగ. 6, స్కం. 370).
పఱుపు, దే. వి. 1. పడక: చూ, శయ్య. 1; ప్రే. 2: చూ, రూ-పఱచు. 3-4-5.
పఱె, వా. వి. 1: చూ, రూ-పఱియ; 2. గర్తము: చూ, రంధ్రము. 1.
పఱ్ఱు, దే వి. 1: చూ, ముద్ది. సాంబ. మాన. 19; 2: చూ, రూ-పఱ. 1-2-3.
పఱ్ఱుఉప్పు, వా. వి. ఊషంజరము: చూ, లవణము. 1.
పఱ్ఱుపంట, వా. వి. పఱ్ఱునేలయందు పండినపంట.
పఱ్ఱియ, దే. వి: చూ, రూ-పఱియ.
పఱ్ఱు, దే. వి. చినుఁగుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.
పఱ్ఱె, దే. వి. 1: చూ, రూ-పఱ్ఱియ; వా. 2: చూ, రూ-పఱ్ఱు. 1.
పఱ్ఱెమీను, దే. వి. పెనుచొరచేప: చూ, మత్స్యము. 1.
పలంకష, సం. వి. అ. స్త్రీ. 1. పల్లేరు*: చూ, స్వాదుకంటకము. 1; 2. గుగ్గిలము*: చూ, మహిసాక్షి; 3: చూ, మోదుగు*; 4. రాస్న*: చూ, సన్నరాష్టము; 5. బోదతరము*: చూ, హపుష.
పలంకషుఁడు, సం. విణ. నైరృతి: చూ, సోఁకులఱేఁడు.
పలంగు, వై. వి. = పర్యంక: చూ, శయ్య. 1.
పలంపువు, సం. వి. ఉ. పుం: చూ, రూ-పలాండువు.*
పలఁకు, దే. అ. క్రి. పండు: చూ, ఫలించు (అప్ర).
పలక, వై. వి. 1. = ఫలకమ్. వ్రాయఁదగినసాధనము: (సం.ప). —అక్షరభూమిక, ఖమ్, ఫలకము; 2. = ఫఽకమ్. కేడెము: చూ, హరిగ; 3. = ఫలకమ్. జూదమాడెడుబల్ల: చూ, శారిఫలము; 4. తలుపు లోనగువాని కుపయోగించెడు ప్రమానిచెక్క: చూ, శకలము. 4; 5. బల్ల, మేజా, కూర్చుండుటకై కాళ్ళమర్చిన యెత్తుపలక: చూ, పీఁట; 6. సాలెవాఁడు నేఁతసరిత కైటకు సాధనము: చూ, మగ్గము; 7. = ఫఽకమ్. నుదురు: చూ, లలాటము.
పలకపుల్ల, వా. వి. బలపము: చూ, లేఖని.
పలకము, వై. వి. 1. = పల్యంక. కుక్కి, చిన్నమంచము: చూ, మంచము; 2. ఒకానొక గుఱ్ఱము (నిలువుముడి యగ్రభాగము గలది): చూ, హయము.
పలకసరి, వై. వి. స్త్రీపురుషుల కంఠాభరణము: చూ, భూషణము. 2.
పలగండఁడు, సం. వి. అ. పుం. సున్నముపూఁతపూయువాఁడు, లేపకుఁడు: చూ, సూనరి.
పలఘ్నము, సం. వి. అ. పుం. గ్రుడ్డికామంచి* : చూ, తృణము. 1.
పలచె, వా. విణ: చూ, రూ-పలుచ.
పలచన, వా. వి: చూ, రూ—పలుచన.
పలచెము, దే. వి: చూ. పంగము. నిర్వ. 1, ఆ. 33.
పలనాడు, దే. వి. రూ-పల్నాడు. ప్రభా. 1, ఆ. 18: (చూ, నాడులు. 1.)
పలపల, దే. వి. 1. తొరఁగుట యందగు ననుకరణము. ఉ, రా. 5, ఆ. 308: చూ, హూహూ; 2. వేగుటయందగు ననుకరణము. కాశీ. 5, ఆ. 144: చూ, హూహూ: విణ. 3. విరళము. పాండు. 2, ఆ. 48: చూ, వెలితి. 1; 4. కృశము: చూ, సొరపు.
పలపలన, దే. వి. 1. వైరళ్యము: చూ, వెలితి. 1: 2. కార్శ్యము: చూ, సొటసొట; విణ: 3. విరళము: చూ, వెలితి. 1; 4. కృశము: చూ, సొరపు.
పలము, సం. వి. అ. న. 1. నిష్కము. నాలుగు కర్షముల యెత్తు (వెండిపలము-ఇరువు; బంగారుపలము = కురుబిస్తము,

ఆగ్రము. తద్వి.—(సం. ప).— అక్షము, అర్ధపలము, కర్షము. (తె. ప.)—అరపలము; 2. మూఁడుతులములు (శేక) 1/8 శేరు: చూ, శతమానము. 1; 3. రూ-పలలము-పాలలము = పొలసు: చూ, మాంసము; వై. వి. (1) = ఫల. మిగులు: చూ, లాభము. 1.

పలలము, సం. వి. అ. న. 1. = పొలసు: చూ, పలము. 3; 2. బురద: చూ, శాదము. 2; 3. నూవుపిండి: చూ, సాదము. (1).

పలలుఁడు, సం. వి. అ. పుం. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

పలవ, దే. వి. రెండుకొమ్మల మొదలు: చూ, శాఖ. 1.

పలవకొమ్మ, వా. వి. పంగ - ప్రగ్గ. పాయగొమ్మ, ఎడముగా చాఁచినశాఖ: చూ, శాఖ. 1.

పలవరము, వై. వి. = ప్రలాపము. స్వప్నభాషణము (రూ-పలువరము—పలవరింత - పలువరింత - పలవరింపు-పలువరింపు -పల్లబ్బు): చూ, శబ్దము. 2.

పలవరించు, వై. అ. క్రి. = ప్రలాప. ప్రలాపించు (రూ-పలవించు - పలవు-పలుము - పల్వరించు) ఉ, హరి 5, ఆ. 282; చూ, రొల్లు. 2.

పలవరింత, వై. వి. = ప్రలాప. 1. పలువరించుట: చూ, రూ - పలసరము; 2. వ్యర్థోక్తి: చూ, శబ్దము. 2.

పలవరింపు, వై. వి. = ప్రలాప: చూ, రూ-పలవరము. అం. భా. ప్ర. 116.

పలవించు, వై. అ. క్రి. = ప్రలాపించు: చూ, రూ-పలవరించు. జై. 6, ఆ. 76.

పలాండువు, సం. వి. ఉ. పుం. రూ-పలండువు, నీరుల్లి* (ఇందుల భేదములు—ఎఱ్ఱనీరుల్లి, తెల్లనీరుల్లి. పచ్చనీరుల్లి): చూ, సుకందకము. 1. (ఇదె ఎఱ్ఱనీరుల్లి.)

పలాములు, వా. వి. బ. నాశనము: చూ, సంస్థ. 3.

పలాయనము, సం. వి. అ. న. పాఱిపోవుట: చూ, సంద్రావము.

పలాయితుఁడు, సం. విణ. పాఱిపోయినవాఁడు: గ్రిగ్గులుకాఁడు.

పలాలము, సం. వి. అ. పుం, న. 1. = పొల్ల-పొల్లు: చూ, నిష్ఫలము; 2. కిర్మి, మోడు: చూ, తృణము. 1. (తృణము 1 అను నర్థమందు 'ఋలాలము' అను పదము "పలాలము" అని చదువవలెను.)

పలాశము. సం. వి. అ. న. 1. ఆకు: చూ, పర్ణము. 1; పుం. 2. ఆకుపచ్చ: చూ, వర్ణము. 6; 3. గంట్లకచోరము*: చూ, షడ్గ్రంధ; 4: చూ, మోదుగు*; విణ. 5. ఆకుపచ్చనిది: చూ, వర్ణము. 6.

పలాశి, సం. వి న్. పుం. 1. చెట్టు: చూ. వృక్షము; 2. కోరింద*: చూ, ముచపత్రి; 3. జువ్వి*: చూ, ప్లక్షము; 4: చూ, పలాశము. 3*; 5: చూ, రాక్షసుఁడు. 1.

పలాశుఁడు, సం. వి. అ. పుం: చూ, పలాశి. 5.

పలాత్రి. వా. వి. ప్రాణములకంటించు మలాముపట్టి: రూ-పాలాత్రి.

పలిక్ని, సం. వి. ఈ. స్త్రీ. 1. ముదిసినయాఁడుది, వృద్ధ: చూ, స్త్రీ; 2. తొలిచూలి యావు: చూ, సౌరభేయి (ధేనువు).

పలితము, సం. వి. అ. న. 1. నర - నరపు - నరుపు-నెరుపు. (సం. ప).—పాకము; 2. నరవెండ్రుక: చూ, నర. 2; 3. బురద: చూ, శాదము. 2; 4: చూ, డాపువ్వు.

పలియ, వై. వి. = పల్లి. రూ-పల్లె: చూ, సీమ. 1. (దేశము).

పలు, దే. వి. రూ-పల్లు. 1. దంతము. భాగ 9, స్కం. 196: చూ, రూ-పల్లు. 1; 2. అనేకము: చూ, విస్తారము. 1; అవ్య. 3. నానార్థకము. ఆం, భా. తృ. 68.

పలుఁగు, వై. వి. = స్ఫటికము. ఉ. హరి. 2, అ. 172: భార. సభా. 1, ఆ. 12: చూ, పటికము.

పలుక, వై. వి. 1. తెల్లన. హరి. ఉ. 3, ఆ. 43: చూ, వర్ణము, 6; 2. = పలక. డాలు: చూ, హరిగ.

పలుకఁబాఱు, ద్వి. అ. క్రి: చూ, వెల్లఁబాఱు. పా. 2, ఆ. 59.

పలుకన, వై. వి: చూ, రూ-పలుక. (విశేషణమగుచో.—విక్ర. 2, ఆ. 155.)

పలుకప్పు, వా. వి. రూ-పల్కప్పు. పెదవి: చూ, వాతెఱ.

పలుకమి, వా. వి: చూ, మౌనము.

పలుకరించు, దే. స. క్రి. రూ-పల్కరించు. 1. మాటాడు: చూ, వచించు; 2. పిలిచిమాటాడు: చూ, వచించు; 3. నిద్దురలేపిమాటాడు: చూ, వచించు; అం. పేరి. 4. మాటాడించు: చూ, వచించు; స. క్రి. 5: చూ, హెచ్చరించు.

పలుకరింత, దే. వి. (రూ-పల్కరింత-పలుకరింపు) 1. మాటాడుట: చూ, శబ్దము. 2; 2: చూ, హెచ్చరిక.

పలుకరింపు,—వై.—

పలుకసరి. వా. వి: చూ, రూ-పలకసరి.

పలుకు, దే. వి. రూ-పల్కు. 1. తునుక. య. 1, ఆ. 97: చూ, శకలము. 4; 2. మాట: చూ, శబ్దము. 2; 3. వచనము: చూ, శబ్దము.2; 4. చదువు: చూ, విద్య; 5. నింద. భార. ఉద్యో. 2, ఆ. 286: చూ, సెగ్గింపు; 6. పక్షిధ్వని: చూ, స్వరము. 2; 7. విత్తులోపలి భాగము: చూ, బద్ద. 1; 8: వీణాదిస్వరము: చూ, స్వరము. 2; స. క్రి. 9, (అను. భార. ఆర. 7, ఆ. 309:) చూ, వచించు; 10. నిందించు: చూ, సెగ్గించు; అ. క్రి. 11. మాటాడు: చూ, వచించు.

పలుకుఁజెలి, దే. వి. రూ-పల్కుఁజెలి. వసు. 1, ఆ. 3: చూ, సరస్వతి.

పలుకుఁదత్తడి, దే. వి. చిలుక: చూ, శుకము.

పలుకుడుబండ, వా. వి. ప్రతిధ్వనించుకొండ: చూ, పర్వతము.

పలుకుపల్లదనము. ఆం: చూ, సప్తవ్యసనములు.

పలుకుబంగారము. జా. అపూపము. "చిలుకా నీతోనైనను పలుకంగారాదె పలుకుబంగారఁటవే" (విజ. 2, ఆ. 181).

పలుకుబడి, దే. వి. రూ-పల్కుబడి. 1. ఉచ్చారణము: చూ. శబ్దము. 2; 2. వచోనిబంధనము: చూ, రాజి.

పలుకుడాయి, దే. వి. ప్రతిధ్వనినిచ్చు శిల. రూ-పలుగుడాయి: చూ, రత్నములు.

పలుకులపులుఁగు, వా. వి: చూ, పలుకుఁదత్తడి.

పలుకులు, పా: (చూ, కూజితములు, దీనికి ఉపమానములు - కోకిలవాక్కులు, చిలుకవాక్కులు, చక్కెర, తేనె, కర్పూరము, అమృతము, మాఘిడి పండు, చెఱకు మొ.

పలుకువెల(దిమగ(డు, వా. వి. నలువ: చూ, బ్రహ్మ. 1.
పలుకెంపు, దే. వి: రూ-పల్కెంపు: చూ, పలుగంటి.
పలుగంటి, వా. వి. (రూ-పలుగంటు - పల్గంటి - పల్గంటు, పలునొక్కు-పల్నొక్కు, పలుకెంపు-పల్కెంపు) దంతక్షతము. చూ, వాతెరకెంపు.
పలుగంటు, వా. వి.—పై.—ఆం. ధా. ద్వి. 180.
పలుగఱ, ద్వ. వి. వంద్లపొడి. ప్రభా. 5, ఆ. 66: చూ, సురుము.
పలుగా(డి, దే. వి. 1. పెంపెదు. పసులపొట్టి లోనగువానికి పెట్టెడుతలుపు. ఉ. హరి. 3, ఆ. 34: చూ, వాకిలి. 2. బండిపరము. వారి. పూ. 5, ఆ. 174: చూ, పరము; (2): విణ. 3. పెక్కుగా(డులుగలది.
పలుగాకి, దే. విణ. దుష్టుడు. హరిశ్చ. 2, ఆ. 154: చూ, వ్యాధుడు. 2.
పలుగు, దే. వి. 1. గుంటకగుజ్జులకును, పాపటపు గుజ్జులకును తగిలించెడు దళమైన తగడు: చూ, సరిగ; వా. వి. 2. గడ్డపలుగు: చూ, పలుగుగుంటక; వై. వి. 3. = స్ఫటిక : చూ, రాయి; 4. = ఫాల. పసువు పలుపు: చూ, సూత్రము. 1; దే. విణ. 5: చూ, పలుగాకి. హరిశ్చ. 2, ఆ. 154.
పలుగుంద్రు, దే. స. బ. (రూ - పలువుంద్రు - పలుగుర - పలువురు - పల్వురు, పెక్కుంద్రు - పెక్కుంద్రుర - పెక్కురు) అనేకులు.
పలుగుగుంటక, దే. వి: చూ, పలుగు. 2.
పలుగుడు, వా. వి. శరీరమునుపగుల్చురోగము: చూ, విపాదిక.
పలుగుడు(బాము, దే. వి. కట్టెడ: చూ, సర్పము.
పలుగు(బిట్ట, ద్వ. వి. గుడ్లగూబ: చూ, సకినంపు(బులు(గు.
పలుగురు, దే. స. బ: చూ, రూ - పలుగుంద్రు.
పలుగుబాయి, వా. వి: చూ, రూ - పలుకుబాయి.
పలుగొమ్ములమెకము, ద్వ. వి. ఏను(గు: చూ, హస్తి.
పలుచ, దే. విణ. రూ - పలచ. 1. దళసరికానిది; 2. వెలితియైనది, వెలితి: చూ, హీనము. 1; 3. చిక్కనకానిది: చూ, వెలితి. 3; 4. చులకనైనది; చూ, లఘ్వి. 2; 5. సన్నమైనది: చూ, సైకము.
పలుచన, దే. వి. రూ-పలచన. 1. సన్న(దనము, సన్నన: చూ, సూక్ష్మము. 4; 2. వెలితితనము, తక్కువ: చూ, వెలితి. 1; 3. అనుకువ(దనము: చూ, పిదపిద. 2; 4. చులుక(దనము. స్వా. 4, ఆ. 70: చూ, లాఘవము 1; వా. 5. నీరు కలిసిన పాలు మజ్జిగ లోనగునవి తేటగా అగుట. ("పాలు పలుచన, మజ్జిగ పలుచన." మొ.)
పలుచనిపప్పు, వా. వి. సూపఖళము: చూ, సూపము.
పలుదుర (ఱ). ద్వ. వి: చూ, రూ-పలుకప్పు.
పలుదోముట, దే. వి. (సం. ప). ఖమ్, దంతధావనము.
పలునొక్కు, దే. వి. రూ-పల్నొక్కు: చూ, పలుగంటి.
పలుపట్టడ, దే. వి. సంకరజాతిజనము: చూ, సంతతి. 6.

పలుపు, వై. వి. = ఫాల, రూ-పలుగు. 1. పసుల మెడ(గట్టెడు లలుగు: చూ, సూత్రము. 1. (దేశ్యమని శ. ర.); 2. గుఱ్ఱము మెడ(గట్టెడు త్రాడు. ధార. విరా. 5, ఆ. 53: చూ, సూత్రము. 1.
పలుమఱు, దే. క్రి. విణ. (పలు + మాఱు) (రూ-పలుమారు-పలుమఱు-పలుమాఱు-పల్మరు-పల్మారు-పల్మఱు-పల్మాఱు) మాటిమాటికి. రామా. 3, ఆ. 153: చూ, శశ్వత్తు.
పలుమఱు, —పై.—
పలుమాఱు, —పై.—
పలుమారు, —పై.—
పలుము, వై. వి. = ప్రలాప. 1: చూ, పలవరము; అ. క్రి. 2: చూ, పలవరించు
పలుమేప, దే. వి: చూ, వృకము. స్వా. 4, ఆ. 37.
పలువ, ద్వ. విణ. (పలు + వా): చూ, పలుగాకి; 2: చూ, పలుము. 1; వా. 3. బొంకు: చూ, వితథము.
పలువగలు, వా. వి. బ. ఉచ్చావచనములు: పలువితములు.
పలువతిట్టు, వా. వి: చూ, పలువ. 3.
పలువరము, వై. వి = ప్రలాప: చూ, రూ-పలవరము.
పలువరింత, —పై.—
పలువరింపు, —పై.—
పలువలువ, దే. వి. రూ-పల్వల్వ: చూ, పలుకప్పు.
పలువితములు, వా. వి. బ: చూ, పలువగలు.
పలువిత్తు, దే. విణ. పలువురకు( బుట్టినవా(డు: లంజెకొడుకు చూ, సూను(డు. 1.
పలువుంద్రు, దే. స. బ: చూ, రూ-పలుగుంద్రు.
పలువురు, —పై.—
పలుసము, వై. విణ. = పరుష: చూ, రూ-పరుసము. 2. హరిశ్చ. 5, ఆ. 111.
పల్కన, వై. వి: చూ, రూ-పలుకన. (ఆమ్రేడితమందు పలు పల్కన.—య. 1, ఆ. 129).
పల్కప్పు, దే. వి: చూ, రూ-పలుకప్పు.
పల్కరించు, చూ, రూ-పలుకరించు. (మాటాడుటకు — భార. ఆది. 4, ఆ. 68; మాటాడించుటకు. — స్వా. 4, ఆ. 41).
పల్కరింత, దే. వి: చూ, రూ-పలుకరింత.
పల్కు: చూ, రూ-పలుకు.
పల్కు(జెలి, దే. వి: చూ, రూ-పలుకు(జెలి.
పల్కుటల్లుమేటులు, వా. వి. బ. దేవతలు. సాంబ. దేవ. 8: చూ, వేలుపు.
పల్కుడు, వా. వి. వల్లము: చూ, రంధ్రము. 1.
పల్కుబడి, దే. వి: చూ, రూ-పలుకుబడి. కళా. 3, ఆ. 163.
పల్కులచెలియత్త, వా. వి: చూ, లక్ష్మి. 1.
పల్కెంపు, దే. వి: చూ, రూ-పలుకెంపు.
పల్గంటి, వా. వి: చూ, రూ-పలుగంటి.
పల్గంటు, —పై.—
పల్గాకి, దే. వి: చూ, రూ-పలుగాకి. రామా. 5, ఆ. 70.
పల్నాడు, వా. వి: చూ, రూ-పలనాడు.

పల్నొకుక్కి, వా. వి: చూ, రూ-పలునొకుక్కి.

పల్పల: చూ, రూ-పలపల.

పల్పలన, చూ, రూ-పలపలన. (విరళమునకు. — భాగ. 10, స్కం. పూ. 75.)

పల్మరు, దే. ద్ర. క్రి. విణ: చూ, రూ-పలుమరు. పల్మఱు. ఉ. హరి. 2, ఆ. 124.

పల్మఱు, —పై —

పల్మారు, —పై.—

పల్మాఱు, —పై.—

పల్యంకము, సం. వి. అ. పుం. 1.＝పలంకము. పలంకు: చూ, మంచము; 2. అరప: చూ, మంచె; 3 యతులు లోనగువారి యానము; చూ, సవారి; 4: చూ, యోగపట్టె; 5.＝పల్లకి—పాలకి. రూ-పల్యంకిక: చూ, సవారి.

పల్యంకిక, సం. వి. ఆ. స్త్రీ.＝పల్లకి - పాలకి. చూ, పల్యంకము. 5.

పల్యయణము, సం. వి. అ. న.＝పల్లాయనము-పల్లము. (రూ-పల్యయనము-పల్యాణము - పళ్యాణము) గుఱ్ఱపుజీను: చూ, హయము.

పల్యయనము, —పై.—

పల్యాణము, సం. వి. అ. న. 1. —పై.—; 2. ＝ పల్లన. ఏనుఁగుమీఁది అంబారి: చూ, హస్తి.

పల్ల, వై. విణ.＝పాటల. 1. పాటలవర్ణము కలది: చూ, వర్ణము. 6; 2. కపిలవర్ణముకలది. కాశీ. 4, ఆ. 158: చూ, వర్ణము. 6; 3. అరుణవర్ణముకలది, పల్లకమ్మ: చూ, పర్ణము. 6.

పల్లకట్టు, ద్వ. విణ. పల్లపన్నె చూపట్టునది.

పల్లకమ్మ, వా. వి. ఒకానొక గ్రామదేవత: చూ, మహాలక్ష్మి. 3; 2: చూ, పల్ల. 3.

పల్లకి, వై. వి.＝పల్యంకికా. రూ-పల్లకీ. ఉత్సవవిగ్రహములు వధూవరులు లోనగువారిని శుభదినములలో మనుష్యులు మోసికొనిపోయెడు వాహనము. జై. 2, ఆ. 103: చూ, సవారి.

పల్లకీ, —పై.— కళా. 2, ఆ. 7.

పల్లగించు, వై. స. క్రి.＝పల్యాణ: చూ, పల్లించు.

పల్లగేదె, వా. వి. తెల్లబఱ్ఱె: చూ, మహిషి.

పల్లట, దే. వి. రూ-పల్లటము. 1: చూ, లోలము; 2: చూ, వ్యత్యాసము; 3: చూ, సంభ్రమము.

పల్లటము. —పై.—; వై. వి 4.＝పర్యస్త. కష్టము: చూ, శోకము.

పల్లటి, దే. వి. రూ-పల్లటీ-చేపల్లటీ-అంతర పల్లటీ. 1. ప్లుత గతిభేదము: చూ. హయము; 2. ఎగపు: చూ, సండీనము; వై. వి. 3.＝పాటలాంఘ్రి. ఒకానొక పావురము: చూ, సురటీ.

పల్లటిలు, దే. అ. క్రి. రూ-పల్లటిల్లు. 1: చూ, పలించు. భార. అర. 5, ఆ. 394; వై. అ. క్రి. 2.＝పర్యస్త. తడఁబడు: చూ, వ్యత్యస్తమగు (దేశ్యమని శ. ర.); 3: చూ, వెల్లఁబాఱు; 4: ఎఱ్ఱవాఱు, వా. 5: చూ, శోకించు.

పల్లటిల్లు, —పై.— (ఎఱ్ఱవాఱుటకు.-భార. విరా. 2, ఆ. 135.)

పల్లటీ: చూ, రూ-పల్లటి (పారావతవిశేషమునకు.—స్కా. 1, ఆ. 117.)

పల్లటీగొను, దే. అ. క్రి. ఎగురు. కళా. 8, ఆ. 98: చూ, లంఘించు.

పల్లటీద్రాఁటు, దే. అ. క్రి.—పై.—కళా. 8, ఆ. 41.

పల్లటీవైచు, దే. అ. క్రి.—పై.—

పల్లదము, దే. వి. రూ-ప్రల్లదము: చూ, శబ్దము. 2.

పల్లన, వై. వి.＝పల్యాణ. (రూ-పల్లనము-పల్లము-పల్లాయనము) 1: చూ, పల్యయణము; 2. అంబారి. పా. 4, ఆ. 111: చూ, పల్యాణము. 2.

పల్లనము, —పై.— విక్ర. 5, ఆ. 132.

పల్లపుఁబంట, ద్వ. వి. నీరాసరాను పండెడుపంట. చూ, వ్యవసాయము.

పల్లము, సం. వి. అ. పుం. 1. ధాన్యముపోసెడు పెద్దగరిసె: చూ, సదనము. 1. (పంటసాల); వై. వి. (1).＝పల్వల. (రూ-పల్లు-పల్లుపు-పల్లుకడు) గోయి: చూ, రంధ్రము. 1; (2).＝పల్యాణమ్. కోగిరి. స్వా. 4, ఆ. 28; కళా. 3, ఆ. 81; హరి. ఉ. 7, ఆ. 92: చూ, పల్లన. 1; (3)＝ ప్లవః. పల్లపునేల: చూ, భూమి. 1; విణ. (4) పల్లు (నేల): చూ, భూమి. 1.

పల్లఅపులు, ద్వ. వి బ. (పలు＋అఱపులు) 1: చూ, పలవరము; 2. (పలువ＋అఱపులు) ఆడరాని పెక్కుమాటలు. హరిశ్చ. 4, ఆ. 109.

పల్లవము, సం. వి. అ. పుం. 1. చిగురు: చూ, విద్రుమము; 2. చిగిరించిన కొమ్మ: చూ, శాఖ. 1; 3. కోకచెఱఁగు; చూ, మైజాఱు; 4. లత్తుకరంగు: చూ, వర్ణము. 6; 5. శృంగారము: చూ, సౌందర్యము; 6. విరివి: చూ, విస్తారము. 1; పుం. 7. వెనుకటి చరణములయందలి యర్థమునను సరించి సంగీతము మొదటచెప్పెడు వాక్యము: చూ, స్వరము. 2; అం. 8: చూ, నృత్తహస్తములు.

పల్లవి, అం. ఒకరకము రాగము: చూ, స్వరము. 2 : (చూ, గానశాస్త్రపండితుఁడు).

పల్లవించు, సం. అ. క్రి: (తె. ప).—ఇంకించు, ఇగిరించు—ఇవిరించు, ఇగురుకొను, ఇగురుచు - ఇగుర్చు - ఇగ్రుచు, ఇగురొత్తు, ఇవురు, ఇవురుచు - ఇవుర్చు - ఇవులుచు - ఇవుల్చు, చిగిరించు, చిగురుకొను, చిగురుచు - చిగుర్చు, చిగురొత్తు, తలిరుచు - తలిర్చు, ననయు, మొగ్గవిచ్చు.

పల్లవితము, సం. విణ. 1. చిగిరించినది: చూ, సంభూతము; 2. లత్తుకచే నెఱ్ఱనైనది: చూ, వర్ణము. 6; 3. విరివియైనది: చూ, విపులము.

పల్లవుఁడు, సం. వి. అ. పుం. రూ-పల్లవికుఁడు: చూ. విటుఁడు.

పల్లా, వా. వి. నూటయిరువది పక్కాసేరుల మానము, పందుము (శ. ర.)

పల్లాయనంబువాఁడు, ద్వ. విణ. రూ — పల్లాయనమువాఁడు, ఆప్తుఁడు: చూ, స్నేహితుఁడు. భార, ఉద్యో. 1, ఆ. 94.

పల్లాయనమువాఁడు, —పై.—

పల్లాయనము, వై. వి. 1. ఆప్తత: చూ, స్నేహము. 1; 2. = పల్యయన: చూ, పల్లన. 1.

పల్లి, సం. వి. ఈ. స్త్రీ. 1. = పల్లె-పల్లియ: చూ, సీమ. 1. (దేశము); 2. గుడిసె: చూ, సదనము. 1; 3. = బల్లి. గౌళి: చూ, బల్లి.

పల్లించు; వై. స. క్రి. పల్లముకట్టు. పా. 4, ఆ. 66: పల్లగించు

పల్లిక, వై. వి. = బిలక. రూ-పళ్ళిక. వెదల్పుగల చిన్నతట్ట: చూ, స్యోనము.

పల్లికతట్ట, వా. వి. ఒకానొకచేఁప: చూ, మత్స్యము. 1.

పల్లియ, వై. వి. 1. = పల్లి: చూ, రూ-పల్లె. 1; దే. వి. 2: చూ, రూ-పల్లె 2; 3: చూ, రూ-పల్లె 3.

పల్లు, దే. వి. 1: రూ-పలు, అవుడు-బొడు, కోఱ, పన్ను. (సం. వ.)—ఖరువు, ఖాదనము, జంభము, దంతము, దశనము, ద్విజన్మము, ద్విజము, రదనము, రదము, వక్త్రఖురువు, హాసువు; తద్విశేషములు.—౧. కోఱపల్లు నకు.—రూ-పలు, కోఱ, వౌడ, (సం. వ).—దంష్ట్ర, దాడ; ౨. పందికోఱకు.—కొమ్ము, కోఱ, పందికొమ్ము, పందికోఱ; 3. పాముకోఱకు-కోఱ. (సం. వ.)—ఆశి, ఆశీస్సు, దంష్ట్ర; ౪ ఏనుఁగుదంతమునకు.—(చూ, హస్తి); ౫. (సం) పండ్లులేనిది, దంతములు లేనిది.—అజంభము.) (మిగతవానికి "చూ, హాసువు."); వై. వి. 2. = ప్లవ. నిమ్నము: చూ, రంధ్రము. 1.

పల్లుసు, వై. విశ. = ప్లవ. పల్లము: చూ, రంధ్రము. 1.

పల్లె, వై వి. రూ-పల్లియ. 1. = పల్లి. చిన్నఊరు: చూ, సీమ. 1. (దేశము); దే. వి. 2. రూ-పల్లియ. అగ్నికులక్షత్రియ జాతి; 3. రూ-పల్లియ. చదువుబడి: చూ, స్కూలు.

పల్లెకూటము, దే. వి: చూ, పల్లె. 3.

పల్లెటూరివాఁడు, వా. వి. గ్రామేయుఁడు—గ్రామ్యుఁడు.

పల్లెత, దే. వి. అగ్నికులక్షత్రియజాతియందుఁబుట్టిన యాఁడుది.

పల్లెమాట. దే. వి. పల్లెటూరి పలుకు: చూ, శబ్దము. 2.

పల్లెరు, దే. వి. రూ-పల్లేరు=పలంకష*: చూ, స్వాదుకంటకము.

పల్లెరుపూవు, వా.వి. (రూ-పల్లేరుఁబూవు.) జడయందును, చెవులయందును ధరించెడు ఆఁడుదాని నగ: చూ, భూషణము. 2.

పల్లెవాఁడు, వా. వి. అగ్నికులక్షత్రియజాతి యందుఁ బుట్టిన వాఁడు (ఇతఁడు ఓడదాఁటించుచు సర్వవర్ణములను మోసెడు వృత్తిగల వాఁడు); చూ, సరంగు.

పల్లేరు, దే. వి: చూ, రూ-పల్లెరు*.

పల్లేరుఁగాయ, దే. వి: చూ, పల్లెరుపూవు.

పల్లొత్తు, దే. వి: చూ, పలుగంటి. పాండు. 3, ఆ. 10.

పల్వరించు, వై. అ. క్రి. = : చూ, రూ-పలవరించు. రుక్మి. 3, ఆ. 96.

పల్వలము, సం. వి. అ. న. పడియ: చూ, సరస్సు. 1.

పల్వల్వ, దే. వి: చూ, రూ-పలువలువ. అచ్చ. బాల, కాం. 135.

పల్వాలుగలదొర, వా. వి. సర్పరాజు. వేం. అం. 102: చూ సర్పము.

పవచిగ్రుచ్చిగాలి, వా. వి: చూ, సకినంపుబుఱుఁగు. సాంబ. లిఖ. 10.

పవనగీతి, అం. ఇది అంబెజఁదెవలె నవుచును. ప్రతిపాదము నను రెండవయక్షరము ప్రాస: చూ, వృత్తము. 1.

పవడము, వై. వి. = ప్రవాళ: చూ, రూ-పగడము.

పవడించు, దే. అ. క్రి. (రూ-పవళించు-పవ్వడించు-పవ్వళించు): చూ, శయనించు.

పవడుఁడు, ద్వి. వి: చూ, రూ-పగడుఁడు. పం. వేం. 4, ఆ. 181.

పవనతనయుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, భీముఁడు. 1; 2. హనుమంతుఁడు: చూ, వానరము; 3. అగ్ని: చూ, వహ్ని. 1.

పవనము, సం. వి. అ. పుం. 1. అవము; 2. గాలి: చూ, వాయువు; 3: రూ-పవము, నిష్పావము. (తె. వ):—ఎగరఁబోఁత, చూపుపెట్టు-తూర్పెత్తు: (చూ, స్తంబకరి.)

పవనాశనము, సం. వి. అ. పుం. పాము: చూ, సర్పము. 1.

పవమానుఁడు, సం. వి. అ. పుం. గాలి: చూ, వాయువు. 1.

పవము, సం. వి. అ. పుం: చూ, రూ - పవనము. 3.

పవలు, దే. వి: చూ, రూ - పగలు.

పవళించు, దే. అ. క్రి: చూ, రూ - పవడించు.

పవళింత, దే. వి. పవళించుట: చూ, శయ్య. 1.

పవళింపు, —పై.—

పవాడము, వై. వి. 1. రూ - పావాడము. కోరిక నెఱవేఱిననాఁడు దేవునిఁజేయు నిందారోపణము; 2: చూ, విపరీతము. ఆం, భా. ద్వి. 193.

పవి, సం. వి. ఇ. పుం. రూ - భవి. వజ్రాయుధము: చూ, బాణము. 1.

పవిత్రకము, సం. వి. అ. న. 1. శణసూత్రము, జనపనారత్రాడు: చూ, సూత్రము. 1; పుం. 2: చూ, మేడి *; 3: చూ, రావి *.

పవిత్రము, సం. వి. అ. న. 1. జందెము: చూ, యజ్ఞోపవీతము; 2. దర్భ*: చూ, తృణము. 1; 3. నీరు: చూ, సలిలము; 4. అవుపేఁడ: చూ, పిడక; 5. తామ్రము: చూ, లోహము. 1; విశ. 6. పరిశుద్ధమైనది: చూ, శుద్ధము. 3.

పవిత్రుఁడు, సం. వి. అ. పుం. శుచియైనవాఁడు: చూ, శుద్ధుఁడు.

పవిది, వై. వి. = ప్రకృతి: చూ, రూ - పగిది.

పవ్వుఁజు, వై. వి. రూ - పౌఁజు. 1. వరుస, బారు: చూ, శ్రేణి: 2. దండు: చూ, సేన. 1; అం. 3. బలము, రాజ్యాంగములలో నొకటి: (చూ, అంగము. 9.)

పవ్వుఁజులకమ్మ. వా. వి. రూ - పౌఁజులకమ్మ: చూ, భూషణము. 2.

పవ్వుఁజులుతీరు, ద్వి. అ. క్రి. రూ - పౌఁజులుతీరు: చూ, పరిగొను.

పవ్వుఁజులతీరుచు, ద్వి. ప్రే. బారుతీర్చు. (రూ - పవ్వుజులతీర్చు - పౌజుతీరుచు - పౌఁజుతీర్చు - పౌఁజులుతీరుచు

పవుఁజులుసేయు - పౌఁజులుసేయు - పౌఁజుసేయు, పౌఁజులుతీరఁజేయు (అని కొందఱు).
పవులు, దే. అ. క్రి. (రూ - పగులు - పౌలు): చూ, విచారించు.
పవ్వ, వా. వి. తతముఖభాండము: చూ, పాత్రము. 6.
పవ్వడించు, దే. అ. క్రి: చూ, రూ - పవళించు.
పవ్వళించు, —వై.—
పవ్వళింపు, వా. వి: చూ, రూ - పవళింత.
పశుకంఠరవము, సం. వి. అ. పుం. అజాపు: చూ, స్వరము. 1.
పశుపతి, సం. వి. ఇ. పుం: చూ, శివుఁడు. 1.
పశుపాదరోగము, సం. వి. అ. న. గౌరిసెగాలి; చూ, పశురోగము.
పశుబ్రాహ్మణులు, అం. "గమ్యాంగమ్యాం నజానాతి ప్రియం యోఽశౌచనిర్ఘృణః । కృత్యాకృత్య పరిభ్రాంత సవిప్రః పశురుచ్యతే." (గమ్యాగమ్యములను కృత్యాకృత్యములను ఎఱుఁగక పరస్త్రీలోలులగువారు): చూ, బ్రాహ్మణులు.
పశుమక్షిక, సం. వి. అ. స్త్రీ. జోఱీఁగ: చూ, మక్షిక.
పశుమార్గము, సం. వి. అ. పుం. దర్శిని: చూ, మార్గము. 1. (నక్షత్రమార్గమనియు వాడుక).
పశురోగములు, సం. వి. అ. పుం. బ. పశువులకు వచ్చెడు తెవుళ్లు. పాదరోగమునకు — అడప - అడుప, గాలికుంటు, గౌరిసెగాలి, పుప్పు; మఱికొన్ని రోగములు.—అదురుఁద్రిక్క - అరువుఁద్రిక్క — అవురుఁద్రిక్క; ఉంగడ - ఉంగిడి, కడుపూఁద, కప్పనావురు; కింక; గురుకు; చురుక; దొమ్మ; నరిడి; నాలికచేఱు. మొ: (చూ, రోగము. 1.)
పశువు, సం. వి. ఉ. పుం. 1. = పసలము - పసురము - నాలుగుకాళ్ళజంతువు: చూ, మృగము. 1; 2. గొఱ్ఱె: చూ, మేషము. 1.
పశ్చాత్తాపపడు, మి. అ. క్రి: చూ, స్రుక్కు. 11.
పశ్చాత్తాపము, సం. వి. అ. పుం; అనుతాపము: చూ, విప్రతీసారము.
పశ్చాద్భాగము, సం. వి. అ. పుం: చూ, వెనుక. 1.
పశ్చిమము, సం. విణ. 1. పడమటిది: చూ, హరిత్తు. 1; 2. వెనుకటిది: చూ, వెనుక. 1; 3. కడపటిది: చూ, వెరసి. 2; అం. 4: చూ, తంత్రములు.
పశ్చిమసముద్రము, అం: చూ, సముద్రములు.
పశ్యతోహరుఁడు. సం. వి. అ. పుం. 1. కమసాలె: చూ, స్వర్ణకారుఁడు; 2. = పచ్చెపువాఁడు. ఎదుటదొంగిలించువాఁడు: చూ, హారకుఁడు. 1.
పశ్యత్పాలుఁడు, సం. వి. అ. పుం; చూ, శివుఁడు.
పష్ఠౌహి, సం. వి. ఈ. స్త్రీ. తొలుచూలిపడ్డ. రూ - ప్రష్ఠౌహి: చూ, సౌరభేయి (ధేనువు).
పస, వా. వి. 1. అధికప్రభ; చూ, వెలుతురు. 1; 2. ఉపస్థితి, తోఁచుట. అం, భా. తృ. 30; చూ, స్ఫురణము. 2; 3. సారము; చూ, సారాంశము; 4: చూ, సమృద్ధి. కళా. 1, అ. 33; 5: చూ, సామర్థ్యము. 1. కళా. 1, అ. 10; వై. వి. 6. = పచంపచా. పసుపు: చూ, వర్ణము. 6.
పసందు, వా. వి: చూ, సౌందర్యము.
పసఁగు, దే. అ. క్రి: చూ, విశదమగు.
పసగడుగు, వా. వి. కడుగు: చూ, ఉక్తము.
పసగరగొను, దే. స. క్రి. పీడించు. హరి. పూ. 7, అ. 167: చూ, హింసించు. 2.
పసదనము, వై. వి. 1. = ప్రసాదనమ్. అలంకారశోభ: చూ, భూషణము 2; 2. తానుకోటినపని నెఱవేరినప్పుడు నెఱవేర్చుకొన్నవాఁడు సంతోషించి నెఱవేర్చినవానికి సంతోషముగా నిచ్చెడు వస్త్రాభరణాదిద్రవ్యము: పారితోషికము; వా. 5. (రూ - పసాదము - సాదము) భోజనము: చూ, సాదము. (1).
పసను, దే. వి. 1. ఎఱుపుమించినపసుపువన్నె: చూ, వర్ణము. 6; 3: చూ, సౌందర్యము.
పస, దే. వి: చూ, నానుకువాన.
పు. వై. వి. = పచంపచా. రూ - పసుపు 1. హరిద్రము; చూ, వర్ణము. 6. (దీనిభేదములు—కస్తురిపసపు, కూరపసపసపు. మ్రానిపసపు); 2. హరిద్రావర్ణము: చూ, వర్ణము. పసరి: 3. జాతిమీఁదజాది పూసికొనెడు పసుపు, బండారు: చూ, వర్ణము. 6; విణ. 4. పసుపువన్నెకలది: చూ, వర్ణము. 6.
పసపుంజాయ, వా. వి. పసుపురంగు: చూ, వర్ణము. 6.
పసరము, వై. వి. = పశు: చూ, రూ- పసులము.
పసరించు, వై. అ. క్రి. = ప్రసర: చూ, వ్యాపించు.
పసరింపు, వై. వి. = ప్రసర: చూ, వ్యాపనము.
పసరిక, వా. వి. చూ, రూ-పసిరిక. 4.
పసరు, వై. వి: చూ, వ్యాపనము. హరి. ఉ. 8, అ. 158; దే. వి. రూ- పసురు; 2. అకునలిపిన రసము: అసరు, ఆకుపసరు. (సం. ప).—పర్వరీణము; విణ. 3. ఆకుపచ్చని. ఉ, రా. 6, అ, 8: చూ, వర్ణము. 6. పసరుగాయ, దే. వి. ముదిరినపిందె: చూ, శలాటువు. 2.
పసరుచాయ, వా. వి: చూ, పసపుంజాయ.
పసరుమొగ్గ, ద్వ. వి. (రూ-పసిమొగ్గ, పసిరికమొగ్గ) లేఁతమొగ్గ: చూ, మొగ్గ. 1.
పసలము, వై. వి. =: చూ, రూ-పసరము.
పసాదపడు, వై. స. క్రి. తిను: చూ, సాపడు.
పసాదము, వై. వి. = ప్రసాదనమ్. అన్నము: చూ, సాదము. (1.)
పసాపడు, వై. స. క్రి. (పసాదము + సాపడు): చూ, రూ. పసాదపడు. అచ్చ. బాల, కాం. 75.
పసారము, వై. వి. రూ-పసారు. 1. అంగడి. రాజ. 2, అ. 90: చూ, సదనము. 1; 2. = ప్రసార. సంచారము. (రూ- పసారు-పచేరు-పచారు): చూ, ప్రయాణము.
పసారు, —వై.— అచ్చ. బాల, కాం. 34.
పసి, దే. వి. 1. పశ్వాదులమీఁదిగాలి. స్వా. 4, అ. 41; స్వా. 4, అ. 51: చూ, వాయువు; 2. పువ్వులమీఁదిగాలి. భో. 3, అ. 176: చూ, వాయువు; వై. వి. 3. = పశు. గోశు

లము: చూ, పసులము. హరి. ఉ. 8, ఆ. 265; (బ. పసులకు.—హరి. ఉ. 8, ఆ. 260 ; 4. ఆఁకలి: చూ, ఉుధుత్: 5: చూ, వాసన. 1; విణ. 6. లేఁత: చూ, సుకుమారము.

పసిఁడి, దే. వి. 1. బంగారు. కాశీ, 5, ఆ. 58: చూ, లోహము. 1; 2. ధనము: చూ, హిరణ్యము. 8.

పసిఁడికంటి, దే. వి: చూ, రూ పయిఁడికంటి.

పసిఁడికంటె, వా. వి.—పై.—(రూ-పైఁడికంటె.)

పసిఁడికాయ, దే. వి. పొత్తిమాలికాయ. భాగ. 2, స్కం. 51.

పసిఁడిపుట్టముదాల్పు, ద్వి. వి: చూ, విష్ణువు. 1. ఆం. సం. దే. 7. (ఇట్లు పసిఁడిపలువదాల్పు.)

పసిఁడిపురుగు, ద్వి. వి. పొత్తిమాలికాయపురుగు. మార్క. 2, 118: చూ, పురుగు.

పసిఁడిఱేఁడు, దే. వి: చూ, శ్రీమంతుఁడు.

పసిక, దే. వి. 1. పస: చూ, సారాంశము: వా. 2: చూ, సమృద్ధి: 3: చూ, సామర్థ్యము. 1.

పసిగాఁపు, ద్వి. వి. గోపకుఁడు. పాండు. 2, ఆ. 128: చూ, మహాశూద్రుఁడు.

పసిగొను, దే. అ. క్రి. గాలిపట్టు: పసిపట్టు.

పసితిండి, ద్వి. వి. పులి. ఆచ్చ. బాల, కాం. 122: చూ, శార్దూలము.

పసిపట్టు, వా. అ. క్రి: చూ, పసిగొను.

పసిపాప, దే. వి. 1. లేఁతబిడ్డ: చూ, శిశువు: విణ. 2. మిక్కిలి లేఁత యైనది. నై. 8, ఆ. 12: చూ, సుకుమారము.

పసిబిడ్డ, వా. వి: చూ, పసిపాప. 1.

పసిమంద, వా. వి. పసులమంద, ఆవులమంద: చూ, ధేనువు.

పసిమనుపరి, వా. వి: చూ, పసిగాఁపు.

పసిమనుపు, వా. వి. గోరక్షణము: చూ, రక్షణము.

పసిమి, దే. వి. (రూ-పసిమిడి). 1. ఆకుపచ్చన. కళా. 3, ఆ. 83: చూ, వర్ణము. 6; 2. ఎఱుపుమించిన పసుపువన్నె. కళా. 3, ఆ. 204: చూ, వర్ణము. 6; 3. గోరోజనపు వన్నె. హరి. ఉ. 7, ఆ. 60: చూ, వర్ణము. 6.

పసిమిడి, దే. విణ. (పసిమి + మిడి) పసిమిగలది: చూ, వర్ణము. 6.

పసిమొగ్గ, వా. వి: చూ, పసరుమొగ్గ.

పసిరిక, దే. వి. (పసరు + ఇక) 1. పసరువన్నె: చూ, వర్ణము. 6; 2. పచ్చపిట్ట: చూ, హరితము. 3; 3. నల్లగబికి*: చూ, హరిత; వా. 4: రూ-పసరిక, కామాల-కామెల. (సం. ప) —కామల-కామలము; విణ. 5. పసరు వన్నెకలది: చూ, వర్ణము. 6.

పసిరికపాము, దే. వి. పచ్చపాము: చూ, సర్పము.

పసిరికపిట్ట, ద్వి. వి: చూ, పసిరిక. 2.

పసిరికమొగ్గ, ద్వి. వి: చూ, పసరుమొగ్గ.

పసివాఁడు, వా. వి: చూ, శిశువు. సాంబ. మాన. 5.

పసుపాడు, ద్వి. అ. క్రి. (పసుపు + ఆడు) పసుపుపూసికొని జలకమాడు: చూ, స్నానమాడు.

పసుపు, చూ, రూ-పసపు. (పసుపు పుండ్లు మాన్పును. పసుపు వటిక కలిపి చెవిలో పోసిన చీముగాఱుట తగ్గును.)

పసుపుఁబిట్ట, పై. వి: చూ, పసిరికపిట్ట.

పసుపుముద్ద, ద్వి. వి. —పై.—

పసుపుమొల్ల, పై. వి: చూ, పచ్చపూమొల్లి*.

పసుపుటమ్మ, వా. వి: చూ, మహాలక్ష్మి. 3.

పసురము, పై. వి. = పసు: చూ, రూ-పసులము.

పసురు, వా. వి: చూ, రూ-పసరు. 2.

పసులకాఁపరి, వా. వి: చూ, పసిగాఁపు.

పసులకొట్టము, వా. వి. పసువులశాల: చూ, సదనము. 1.

పసులదారి, వా. వి: చూ, పసుమార్గము.

పసులపుంత, —పై.—

పసులపోలిగాఁడు, ద్వి. వి. పెద్దిపులి: చూ, వ్యాఘ్రాటకము.

పసులము, పై. వి. = పసు. గోమహిషజాతి (శాకభక్షకజంతువుల గణము): (రూ-పసురము - పసరము - పసలము, పశి, తొలుకు, ఆవు: చూ, సౌరభేయి (ధేనువు).

పసులవాఁడు, ద్వి. వి: చూ, పసిగాఁపు.

పసులు, పై. వి. బ. = పసు. గోవులు: చూ, ధేనువు.

పస్తాయించు, దే. అ. క్రి: చూ, పశ్చాత్తాపపడు

పస్తిల్లి, వా. వి. (రూ-పస్తు-నిప్పస్తు): చూ, లంకణము.

పస్తు, పై. వి. —పై.—

పస్తుండు, వా. అ. క్రి: చూ, ఉపవసించు.

పస్తున్నవాఁడు, వా. వి: ఉపోషితుఁడు.

పస్త్రము, దే.వి. (రూ-పస్త్యము-వాస్త్యము-పస్తము-అవస్త్యము) ఇల్లు: చూ, సదనము. 1.

పస్సె, పై. వి, విణ: చూ, పయః. 1—2.

పళపళ, దే వి, ప్రకాశించుట యందగు ననుకరణము: చూ, హూహూ; వా. 2. లెంపలు వాయించుట, ఎండిన ఆకులు లోనగునవి విఱుచుట యందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

పళశ్రాహ్మణులు, అం: చూ, మహారాష్ట్రులు. (వీరు వాజసనేయ శాఖవారు. బొంబాయి రాజధానియందుఁ జూడనగు. ఇతర బ్రాహ్మణులు వీరి యాచారముల నిందింతురు.): (చూ, బ్రాహ్మణులు).

పళ్ళాలమ్మ, వా. వి: చూ, మహాలక్ష్మి. 3.

పళ్ళిక, వా. వి: చూ, రూ-పల్లిక.

పళ్యము, పై. వి. (రూ-పళ్ళెము-పళ్ళెరము) 1. భోజనపాత్రము కాశీ. 3, ఆ. 307: చూ, పాత్రము. 6; 2. తాంబాళము: చూ, పాత్రము. 6.

పళ్ళెము, —పై.—

పళ్ళెరము, —పై.— పా. 3, ఆ. 38.

## పా

పాంచజన్యము, సం. వి. అ. పుం. విష్ణుశంఖము: చూ, బాణము. 1.

పాంచజన్యుఁడు, సం. వి. అ. పుం. అగ్ని: చూ, వహ్ని. 1.

పాంచాలము, సం. వి. అ. పుం: చూ, దేశము.

పూగపుష్పిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, పోఁక పొత్తి.

పూగము, సం. వి. అ. న. 1 = పోఁక *: చూ, పోఁక; పుం. 2. = ప్రోగు. గుంపు: చూ, సమూహము; బ. 3. = బాగాలు, ఒత్తినవక్కలు; 4. గంగరావి *: చూ, రావి.

పూగుత్తి, వై. వి. = పుష్పగుచ్ఛ. రూ-పూలగుత్తి, పూలగెల: చూ, సుమము. తద్విశేషములు.— ౧. పువ్వులు కాయలు లోనగువానిగుత్తికి.—అత్తము, కుచ్చు, గుత్తి, గుది, గొత్తు, గెల, గొల. (సం).— గుంఛము - గుంజము-గుచ్ఛకము-గుచ్ఛము-గుత్సకము-గుత్సము, గులుంఛకము-గులుచ్ఛము గుళుచ్ఛము - స్తబకము; ౨. గెలలో నొకభాగమునకు.— అత్తము-అత్తెము, అస్తము, గెల-గొల, చీపు, తీపు; 3. వికసించిన పువ్వుల గుత్తికి.—(సం).—గుంఛము (గుఞ్ఛము): (చూ, స్తబకము.): చూ, సుమము).

పూచి, దే. వి. 1. రూ-పూచిక : చూ, తృణము. 1; 2. రూ-పూచీ: చూ, బాధ్యత ; వై. వి. 3. రూ-పూత : చూ, వికసనము. 2.

పూచిక, దే. వి: చూ, పూచి. 1-2.

పూచినతంగేడు, వా. జా. సిరిసంపదలతో నిండిన సంసారము "వానిగృహము పూచినతంగేడు."

పూచినమావు, దే. వి. మచ్చలుగల గుఱ్ఱము: చూ, హయము.

పూచీ, వా. వి: చూ, రూ-పూచి. 2. "పూచీకత్తు".

పూచీపడు, వా. వి: చూ, అచ్చు. 20.

పూచు, వై. అ. క్రి. 1.=పుష్ప్. పుష్పించు: చూ, వికసించు; 2. తప్పుసుళ్లుపొడము. ఆము. 5, ఆ; 3 నిస్సారమగు. భార. సభా. 2, ఆ. 41: చివుకు.

పూచెండు, వా. వి. పూలబంతి: చూ, సరి. 3.

పూజ, సం. వి. ఆ. స్త్రీ.=పూజ. 1: చూ, సపర్య; అం. 2: చూ, ఉపచారములు. 2.

పూజకుఁడు, సం. విణ: చూ, పూజారి. 1-2-3.

పూజనము, సం. వి. అ. న: చూ, పూజ.

పూజనీయుఁడు. సం. విణ: చూ, సన్మానితుఁడు.

పూజాకరుఁడు, సం. వి. అ. పుం: చూ, పూజకుఁడు.

పూజించు, సం. ప. క్రి. 1: చూ, సమర్పించు; వై. స. క్రి. (1) పూజసేయు. అచ్చ. బాల. కాం. 15: చూ, సమర్పించు.

పూజితము, సం. విణ: చూ, సన్న్యస్తము. 2.

పూజితవ్యుఁడు, సం. విణ: చూ, పూజనీయుఁడు.

పూజితుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, వేలుపు; విణ. 2: చూ, పూజనీయుఁడు.

పూజె, దే. వి. 1. ఘటాదులమీఁదిచిత్రము; వై. వి. 2. = పూజ: చూ, సపర్య: వా. 3. కరఁగిపోసిన బంగారు వెండి లోనగువానిపూస.

పూజెకుండలు, ద్వ. వి. అయిరేని, య. 4, ఆ. 117: చూ, భాండము. 3.

పూజెగులు, దే. వి. బ. (పూజె+కాఁగులు)—పై —

పూజెసేయు, ద్వ. అ. క్రి. ఘటాదులను చిత్రించు. ఉ, హరి. 6, ఆ. 60: చూ, వ్రాయు; 2: చూ, పూజించు. 1-(1).

పూజ్యము, సం. విణ. 1. గిరి, గంగ, మహితము: చూ; సత్తు. 4; వా. 2. ఉత్తది.

పూజ్యస్త్రీ, సం. వి. ఈ. స్త్రీ: చూ, స్త్రీ.

పూజ్యుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, గురువు. 8. (వాడుక); 2: చూ, గురువు. 9. (వాడుక); విణ. 3. పూజింపఁదగిన వాఁడు: చూ, సన్మానితుఁడు.

పూజ, వై. వి. = పూజా: చూ, పూజ. నీలా, 3, ఆ. 37.

పూజరి, వై. వి. పూజాకర. (ద్వయమని శ.ర.) (పూజ+అరి) కళా. 4, అ, 60: చూ, రూ - పూజారి. (వైకృతమని కొందఱు).

పూజారి, వై. వి. రూ- పూజరి. (విక్ర. 6, ఆ. 124.) 1, పూజసేయువాఁడు: తంబళ - తంబళి-తంబిగ-తమ్మళ - తమ్మళి. (సం.ప).—అర్చకుఁడు, ఆరాధకుఁడు, దేవలుఁడు, దేవాజీవి-దేవాజీవుఁడు, పూజకుఁడు-పూజాకరుఁడు; 2. విష్ణుపూజకుఁడు: తంబళ-తంబళి-తంబిగ-తమ్మళి తమ్మళి,నంబి. (సం. ప).-దేవద్రవ్యకుక్కు, దేవలుఁడు, దేవాజీవి-దేవాజీవుఁడు, పూజకుఁడు-పూజాకరుఁడు, విష్ణ్వర్చకుఁడు; 3. శివార్చకుఁడు:-తంబళ-తంబళి-తంబిగ-తమ్మళి తమ్మళి. (సం. ప).-కిరూకుఁడు, దేవలుఁడు, దేవాజీవి-దేవాజీవుఁడు, పూజకుఁడు-పూజాకరుఁడు, శివార్చకుఁడు. (ఈ మూఁడు అర్థములలోను మిగిలినవానికి "చూ, సేవకుఁడు.")

పూజ్యార్థకములు, అం. "అయ్య, గారు, జియ్య." అనునవి.

పూటము, సం. వి. అ. పుం. 1. ఒకరకము గుఱ్ఱము : చూ, హయము; దే. వి. (1) బరువు: చూ, భారము. 1.

పూటు, వా. వి: చూ, పూటము (1).

పూటెత్తు, ద్వ. వి: చూ, రూ-పువుటెత్తు.

పూడ, దే. వి: చూ, ముడ్డి.

పూడిక, దే. వి. నూయి మొదలగువానియందు అడుగున పూడిన మన్ను: చూ, భూమి. 1.

పూడు, దే. వి. 1.—పై.—; అ. క్రి. 2. పల్లము మట్టిలోనగు వానిచే నిండు: చూ, సంపూర్ణమగు; 3. నిండు: చూ, సంపూర్ణమగు.

పూడుఁబాము, దే. వి. మట్టిలోపూడియుండెడు ఇరుదల పాము: చూ, సర్పము.

పూడుచు, దే. ప్రే. రూ-పూడ్చు. 1. పూడఁజేయు; 2. పాఁతు: చూ, మూయు. 1.

పూడ్చు, దే. ప్రే —పై.—

పూడుపు, దే. వి. 1. పూడ్చుట; 2. నిక్షేపము: చూ, లిబ్బి. 2.

పూత, దే. వి: చూ, పూచి. 3.

పూతన, సం. వి. ఆ. స్త్రీ. 1. ఒక రక్కసి: చూ, రాక్షసి; 2. కరక*: చూ, హరీతకి.

పూతనము, సం. వి. అ. పుం. గజవిశేషము. (విషాణ కర్ణ నయన చరణములలో నేదేని యొక్కటి నొకప్రక్క కలుగక మఱియొకప్రక్క నన్నియుఁ జక్కఁగాఁ గలిగి మేఘము వలె నల్లనై మంజిడివన్నెగల నఖరోమములు గలిగినది. యూథనాశక మంద్రుడు.): చూ, హస్తి.

పూతనాసూదనుఁడు, సం. వి. అ. పుం: చూ, విష్ణువు. 1.

పూతము, సం. విణ. 1. తూర్పెత్తినది: బహూకృతము; 2. పరిశుద్ధమైనది: చూ, సమీచీనము. 2; 3. వడకట్టఁబడినది; చూ,వడఁబోఁత; 4. = పూచి (మూలల వెలి సెలం బట్టునది): చూ, బూఁజు. 2.

పూతాత్ముఁడు, సం. వి. అ. పుం. పరిశుద్ధుఁడు: చూ, శుద్ధుఁడు.

పూతిక, సం. వి. ఆ. స్త్రీ. 1. గుడబల, (తె)— కొమ్మన గొట్టెపిండి.*: (చూ, వృక్షము.) (దీని షర్బతు కఫహరము, జ్వరహరము); అం. 2: చూ, తైలములు; వా. వి. (1). చీఁపురుముల్లు: చూ, సితాగ్రము.

పూతికము, సం. వి. అ. పుం. 1. రూ-పూతీకము *: చూ, పూతికరజము; 2. పూతిమార్జాలము: చూ, మార్జాలము.

పూతికరజము, సం. వి. అ. పుం: చూ, రీఠాకరజము.

పూతికాష్ఠము, సం. వి. అ. న. 1. దేవదారువు*: చూ, సూక్ష్మ దారువు; 2: చూ, సరళము*.

పూతికోశి, సం. వి. ఇ. న: చూ, పునుఁగు. 1.

పూతిగంధి, సం. వి. ఇ. పుం. గదురు. దుర్గంధము: చూ, పుస్తు.

పూతిగడ్డ, వా. వి: చూ, పూతికోశి.

పూతిదారువు, సం. వి. ఉ. పుం: చూ, పూతికాష్ఠము. 1*.

పూతిపునుఁగు, వా. వి: చూ, తట్టుపునుఁగు.

పూతిఫలి, సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చ* : చూ, సోమరాజీ.

పూతిమృత్తికము, సం. వి. అ. పుం. చూ, నరకములు.

పూతీకము, సం. వి. అ. పుం: చూ, రూ—పూతికము. 1.

పూతుఁడు, సం. వి. అ. పుం. 1. అగ్ని: చూ, వహ్ని. 1; విణ 2: చూ, శుద్ధుఁడు.

పూ(పూ)త్కృతి, అం: చూ, రతిధ్వనులు.

పూత్యండము, సం. వి. అ. పుం. 1. కస్తురి మెకము: చూ, నివఁగి. 2; 2. గదురుకంపు గల ఒక పురుగు: చూ, పురుగు.

పూదండ, వా. వి: చూ, ప్రతిసరము. 5.

పూదారము, వా. వి. ఊకరుపు: చూ, సహస్రపత్రము.

పూదియ, దే. వి. రూ. పూదె. పూజె. బంగారుపూస, కళా. 8, ఆ. 9: చూ, పూస. 1.

పూదె, దే. వి. —పై.—

పూదెగట్టు, దే. అ. క్రి. బంగారుపూసగా నేర్పడు. కళా. 3, ఆ. 12.

పూనిక, దే. వి. రూ. పూనికి, పూన్కి. 1. యత్నము : చూ, సన్నాహము; వా. 2. ఒట్టు: చూ, శపథము; 3. పట్టుదల: చూ, స్పర్ధ. 4.

పూనికి,—పై—

పూనిగొల్ల, ద్వ. వి. ఒకతెగ గొల్ల: చూ, మహాశూద్రుఁడు.

పూనీరు, వై. వి. = పన్నీరు, పన్నీరు: చూ, సలిలము.

పూను, దే. అ. క్రి. 1. కదఁగు. హరి, ఉ. 3, ఆ. 94: చూ, సమకట్టు. 2; స. క్రి. 2. ధరించు: చూ, సవరించు. 4; 3. రూ-ఊను. వహించు. ఉ. రా. 7, ఆ. 174: చూ, సవరించు. 4; 4. నివము ఎత్తు-నివమెత్తు.

పూనుచు, దే. ప్రే. పూనఁజేయు: చూ, రూ.-పూంచు. భార. ఆది. 3, ఆ. 195; భార. సభా. 1, ఆ. 99.

పూనూక, ద్వ. వి. మిక్కిలి సన్ననూక: చూ, నేసఁబ్రాలు.

పూనూనె, ద్వ. వి. సంపెంగనూనె: చూ, స్నేహము. 2.

పూనె, దే. వి. బరణి: చూ, పాత్రము 6.

పూన్కి: చూ, రూ-పూనిక.

పూన్చు, దే. ప్రే: చూ, రూ- పూనుచు.

పూప, దే. వి. 1: చూ, రూ-పూఁబిందియ. కళా. 1, ఆ. 116; 2. అద్దపట్టుపాప: చూ, శిశువు; 3. కంటిపాప: చూ, లోచనము; విణ 4. లేఁత: చూ, సుకుమారము.

పూపము, సం. వి. అ. పుం. 1. అపూపము: చూ, భక్ష్యము; 2. ఒకానొక పిండివంట: చూ, భక్ష్యము.

పూపళిక, సం. వి. ఆ. స్త్రీ.—పై.—

పూబంతి, ద్వ. వి: చూ, పూచెండు.

పూమేను, వా. వి: చూ, మత్స్యము. 1.

పూమొగ్గ, వా. వి: చూ, మొగ్గ. 1.

పూయము, సం. వి. అ. పుం. 1. చీము: చూ, రక్తము. 1; 2 జూదము: చూ, వ్యవహారము. 4; 3. పీనుఁగు: చూ, శవము

పూయు, దే. స. క్రి. 1. (చందనము లోనగుదానిని) అలఁదు: చూ, లేపనముచేయు; 2. (మన్ను లోనగువానిని) మెత్తు: చూ, లేపనముచేయు; 3. (మొగ్గ లోనగునవి) వికసించు: చూ, వికసించు; వా. 4. (నాలుక లోనగునవి గఱిగలదియగు; 5. (బండికి ఎడ్లను) కట్టు.

పూరకము, సం. వి. అ. పుం. 1. ఊపిరిఁబూరించుట: చూ, కుంభకాదిత్రయము; 2. మాదీఫలము*: చూ, సుపూరము.

పూరకుఁడు, సం. విణ: నించువాఁడు.

పూరగించు, వై. స. క్రి. 1.=పూరణ. నెఱవేఱుచు: చూ, సిద్ధినొందించు; 2: చూ, వెలుచు.

పూరగిల్లు, వై. అ. క్రి. (రూ-పూరటిల్లు- బూరటిలు) నిండు; చూ, సంపూర్ణమగు.

పూరటిల్లు, —పై.—

పూరణము, సం. వి. అ. న. 1. నించుట: చూ, సంపూర్ణత; 2. గుణించుట: చూ, హెచ్చవేఁత; 3.= పూర్నము - పూర్ణము. బూరెలు కుడుములు లోనగు పిండివంటలలోపల జేర్చెడు బెల్లము పప్పు లోనగువానిముద్ద: చూ, భక్ష్యము; 4. గలిజేరు*: చూ, శోధఘ్ని; విణ. 5. నించునది: చూ, సంపూర్ణము.

పూరణి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, పేక. 1; 2. బూరుగు*: చూ, శాల్మలి.

పూరణించు, సం. స. క్రి.=: చూ, పూరగించు. 1.

పూరము, సం. వి. అ. పుం. 1. జలప్రవాహము: చూ, వెల్లువ; 2: చూ, భక్ష్యము; 3. వ్రణసంశుద్ధి: చూ, వ్రణము; 4: చూ, పూరణము. 4*.

పూరా, వా. విణ. పూరాగా: చూ, సీదా.

పూరాణము, సం. విణ: చూ, పురాతనము.

పూరాయించు, వై. అ. క్రి.= పూరణ: చూ, రూ-పురాయించు.

పూరి, దే. వి. 1. గడ్డి: చూ, తృణము. 1; 2. మృగముల చనుఁబాలు. జై. 4, అ. 79: చూ, స్తన్యము; 3. ఒక పట్టణము: చూ, సీమ. 1. (దేశము); వై. వి. 4.= పూరికా. రూ-పూరీ: చూ, భక్ష్యము.

పూరించు, సం. స. క్రి. 1: చూ, పూరగించు; 2. = పురడించు: చూ, పురడించు. 1; 3.= పురడించు: చూ, పురడించు. 2; 4. ఊఁదు: చూ, పట్టు. 27.

పూజించుట, వా. అవ్య. ఊఁదుట: ఆజ్.

పూరిక, సం. వి. ఆ. స్త్రీ. 1.= బూరె: చూ, భక్ష్యము; 2.= పూరీ: చూ, భక్ష్యము.

పూరిగుడిసె, వా. వి: చూ, పూరిల్లు.

పూరితము, సం. విణ. 1. రూ-పూర్తము-పూర్ణము. నింపఁబడినది: చూ, సంపూర్ణము; 2. గుణింపఁబడినది: గుణితము, నిహతము, పిండితము: చూ, హెచ్చవేఁత.

పూరిల్లు, వా. వి. గడ్డియిల్లు: చూ, సదనము. 1.

పూరీ, వై. వి. = పూరికా: చూ, రూ-పూరి. 4.

పూరుదొన్నె, ద్వ. వి. ఒకచెట్టు: చూ, వృక్షము.

పూరుషుఁడు, సం. వి. అ. పుం: చూ, మనుష్యుఁడు.

పూరెడు, ద్వ. వి. రూ-పూరేడు: చూ, పక్షి.

పూరేకు, ద్వ. వి. రూ-పూరేకు. పుష్పదళము: చూ, సంవర్తిక.

పూరేకులు, ద్వ. వి. బ: చూ, ధాన్యము.

పూరేడు, దే. వి: చూ, రూ-పూరెడు.

పూర్ణ, సం. వి. ఆ. స్త్రీ: చూ, పున్నమ.

పూర్ణకుంభము, సం. వి. అ. పుం: చూ, భద్రకుంభము.

పూర్ణగ్రహణము, అం: చూ, సూర్యగ్రహణము: (చూ, గ్రహణము. 1.)

పూర్ణఘటన్యాయము, పా. నిండుకుండ తొణఁకదనురీతి.

పూర్ణపాత్రము, సం. వి. అ. న. 1. దోఁపు, ఉత్సవకాలమునందు సంతోషముచే వస్త్రాభరణాదికము దోఁచుకొనుట: చూ, పూర్ణానకము. 1; 2. వస్తుసంపూర్ణపాత్రము: చూ, హరివాణము. (పాత్రము. 6.)

పూర్ణమగు, మి. అ. క్రి. నిండు: చూ, సంపూర్ణమగు.

పూర్ణము, సం. వి. అ. న. 1. వింటినారిని చెవిదాఁక తిగుచుట: చూ, శింజిని; విణ. 2. నిండినది: చూ, సంపూర్ణము; 3. శక్తికలది: చూ, యోగ్యము. 5; 4: చూ, సర్వము; 5.= పూర్నము: చూ, పూరణము. 3; అం. 6: చూ, గండక్రియలు; 7: చూ, జరక్రియలు.

పూర్ణవేగము, అం: చూ, ధారలు.

పూర్ణాంకము, వా. వి: చూ, సున్న.

పూర్ణానకము, సం. వి. అ. పుం. 1: పూర్ణపాత్రము. (తె. ప).—దోఁపు; 2. తప్పెట: చూ, వీణె.

పూర్ణానుస్వారము, అం. ఇది సిద్ధము,సాధ్యము అని ద్వివిధము: (చూ, సున్న. 1.)

పూర్ణాయుర్దాయవంతుఁడు, సం. విణ: చూ, వృద్ధుఁడు. 1.

పూర్ణిమ, సం. వి. ఆ. స్త్రీ.= పున్నమ (అఖండ చంద్రుఁడు గలిగినది): చూ, పున్నమ.

పూర్ణీభవించు, సం. అ. క్రి: చూ, పూర్ణమగు.

పూర్ణుఁడు, సం. విణ: చూ, సంపూర్ణుఁడు.

పూర్ణోపమ, అం: చూ, అలంకారము. 3. ("నీకీర్తి హంసాంగనవలె స్వర్గంగం దేలుచుండె."): (చూ, లుప్తోపమ.)

పూర్తము, సం. వి. అ. న. 1. నూతిని బావిని చెఱువును త్రవ్వించుట, గుడికట్టించుట, తోఁట పెట్టించుట, అన్నము పెట్టుట; 2. పాలనము: చూ, సంరక్షణము; విణ. 3. నింపఁబడినది: చూ, పూరితము. 1; 4. కప్పఁబడినది: చూ, స్థగితము.

పూర్తి, సం. వి. ఇ. స్త్రీ. నింపు: చూ, సమృద్ధి.

పూర్నము, వై. వి.=: చూ, పూరణము. 3.

పూర్వ, సం. వి. ఆ. స్త్రీ. తూర్పు, తొలిదిక్కు: చూ, హరిత్తు.

పూర్వగంగ, సం. వి. ఆ. స్త్రీ: చూ, నర్మద: చూ, హ్రాదిని. (నది).

పూర్వజ, సం. వి. ఆ. స్త్రీ. 1. అక్క: చూ, సహోదరి: విణ. 2. మొదట పుట్టినది: చూ, మొదలు. 4.

పూర్వజన్మము, సం. వి. అ. పుం. అనూకము: చూ, సంభవము. 1.

పూర్వజినుఁడు, సం. వి. అ. పుం: చూ, బుద్ధుఁడు.

పూర్వజుఁడు, సం. వి. అ. పుం. 1. అన్న: చూ, సహోదరుఁడు; విణ. 2. మొదటిపుట్టినవాఁడు: చూ, సహోదరుఁడు.

పూర్వదేవుఁడు, సం. వి. అ. పుం. తొలివేల్పు: చూ, రాక్షసుఁడు. 1.

పూర్వపక్షము, సం. వి. అ. పుం. 1. పాడము: చూ, హజ్జ; 2. శుక్లపక్షము: చూ, శుక్లము; 3. (పక్షము. 1.); వా. 4. సిద్ధాంతముకానిది.

పూర్వపర్వతము, సం. వి. అ. పుం. తూరుపుఁగొండ: చూ, పర్వతము.

పూర్వఫల్గుని, సం. వి. ఈ. స్త్రీ. = పుబ్బ: చూ, రిక్క. 1-౧౧. (పూర్వాభాద్ర.)

పూర్వభద్రపదము, సం. వి. అ. పుం: చూ, పూర్వాభాద్ర.

పూర్వమీమాంస, అం: చూ, గహన.

పూర్వము, సం. విణ. 1. మొదటిది: చూ, మొదలు. 4; 2. మొదటి దిక్కుది, పౌరస్త్యము: చూ, హరిత్తు; 3. మొదటి చోటుది: చూ, మొదలు. 4; 4. ముందటికాలముది: చూ, మొదలు. 4; అం. 5: చూ, తంత్రములు. 3.

పూర్వరంగము, అం: చూ, నాంది. 2.

పూర్వరాగము, సం. వి. అ. పుం. శ్రవణమువలనఁ గాని దర్శనమువలనఁ గాని పరస్పరము వృద్ధిఁబొందిన యను రాగముగల నాయికా నాయకులకు అయోగమునందుఁ గలిగెడి దశాశేషము. (ఇది త్రివిధము.—(చూ, నీలిరాగము, కుసుంభరాగము, మంజిష్ఠారాగము).

పూర్వరాత్రము, సం. వి. అ. పుం. ముందటిదినము రాత్రి: చూ, రాత్రి.

పూర్వరూపము, అం: చూ, అలంకారము. 3. (పెరగుణములచేఁ దనరూపు నిల్చుట. ఉదా.—"శివుని కంఠనీలిమచే నల్లనయ్యె భవద్యశమున భుజగేంద్రుఁడు తెల్లఁబడియె.)

పూర్వవాదములు, అం. పంచలక్షణి, వ్యధికరణము, సిద్ధాంతలక్షణము, అవచ్ఛేదకత్వనిరుక్తి, పక్షిత (5).

పూర్వసముద్రము, అం: చూ, సముద్రములు.

పూర్వావధీరితం శ్రేయో దుఃఖం హి పరివర్తతే. న్యా. మొదటఁ ద్రోసిపుచ్చినమేలు కీడుగాఁ దిరిగి వచ్చును.

పూర్వాషాఢ, సం. వి. ఆ. స్త్రీ. నీటిరిక్క: చూ, రిక్క. 1-20.

పూర్వాభాద్ర, సం. వి. ఆ. స్త్రీ. ఎనిమిది. కాళ్ళచుక్క: చూ, రిక్క.

పూర్వాహ్ణము, సం. వి. అ. పుం. దినపూర్వభాగము, లేఁబగలు: చూ, వాసరము.

పూర్వులు, సం. వి. అ. పుం. బ. ముందటివారు.

పూర్వోత్తర, సం. వి. ఆ. స్త్రీ. ఈశాన్యదిగ్భాగము: చూ, హరిత్తు.

పూతెక్క, ద్వ. వి: చూ, పూరేకు.

పూతేకు, ద్వ. వి: చూ, రూ-పూరేకు.

పూలగురిగింజ, ద్వ. వి. వాసంతి*: చూ, శ్వేతపాకి.

పూలతోఁట, ద్వ. వి: చూ, రూ-పూఁదోఁట.

పూలదండ, వై. వి: చూ, రూ- పూదండ.

పూలపొట్లము, వై. వి: చూ, పూవుబెత్తు.

పూలబంతి, ద్వ. వి: చూ, రూ-పూబంతి.

పూలబుట్ట, వై. వి. కటినము: చూ, పాత్రము. 6.

పూలమట్ట, ద్వ. వి: చూ, మత్స్యము. 1.

పూలము, సం. వి. అ. పుం. గడ్డికట్ట.

పూలముసుపు, ద్వ. వి: చూ, రూ-పుప్పొడి ముసుపు.

పూలమ్మువాఁడు, ద్వ. వి: చూ, మాలకరి.

పూలవరహా, వా. వి: చూ, పూలి. 2.

పూలవరా, వా. వి.—పై.—

పూలి, దే. వి. 1. ఒకచెట్టు: చూ, వృక్షము; వా. 2. పూలవరహా (రు 3-8-0): చూ, వరహా.

పూవర్తి, వై. వి. = పుష్పవర్తి: చూ, బాణసంచు.

పూవింటి, ద్వ. వి: చూ, రూ-పువ్విలుకాఁడు. పర. 2, ఆ. 35.

పూవింటివాఁడు, ద్వ. వి.—పై.—

పూవిలుకాఁడు, ద్వ. వి. —పై.—

పూవిలుతుఁడు, ద్వ. వి.—పై.—

పూవు, వై. వి. = పుష్ప: చూ, రూ-పువు.

పూవుఁబేనియ, ద్వ. వి: చూ, రూ-పూఁబేనియ. పాండు. 1, ఆ. 182.

పూవుఁబోఁడి, ద్వ. వి: చూ, రూ-పువ్వుఁబోఁడి. స్వా. 6, ఆ. 61.

పూవుగట్టు, ద్వ. అ. క్రి. పూవుగలదియగు. రామా. 8, ఆ. 144.

పూవుబెత్తు, ద్వ. వి: చూ, రూ-పువుబెత్తు.

పూవులపొట్లము, వై. వి.—పై.—

పూవులమ్మినయంగటనేఁ గట్టెలమ్ముట, లో. "కటకటా! పూవులమ్మినంగడినె కట్టెలమ్మఁజేసెను." వైజ. 3, ఆ. 72; "పూవులుముడిచిన యంగళ్ళనె కలకల పీడెల్లనవ్వఁ గట్టెలు మోసెన్." పాండు. 3, ఆ. 21.

పూషుఁడు, సం. వి. న్. పుం. 1: చూ, సూర్యుఁడు; అం. 2: చూ, ఆదిత్యులు.

పూష్కరము, సం. వి. అ. న. రూ-పూష్కారము: చూ, రూ-పుష్కరము.

పూష్కారము, సం. వి. అ. న.—పై.—

పూస, దే. వి. 1. పూదియ: చూ, మాత్ర. (1); 2. మణి: చూ, రత్నము. 1; 3. వ్రేలు లోనగువాని కీలు: చూ, సంధి. 7; 4. రంధ్రముగలిగినమణి: చూ, రత్నము. 1; 5. రంధ్రము గల పూస. తద్వి.—౧. తెల్లని గాజుపూసకు.—పాలపూస; ౨. గాజుపూసకు.—గాజుపూస. (సం).—కాచము; ౩. రంధ్రముగల ముత్యమునకు. — పూస. (మిగతవానికి: "చూ, హురుమంజి.")

పూసకజ్జము, ద్వ. వి. మనోహరము: చూ, భక్ష్యము.

పూసకామంచి, ద్వ. వి: చూ, తృణము. 1.

పూసగురుగింజ, ద్వ. వి: చూ, పూలగురిగింజ*; (ఇట్లు రూ-పూసగురివెంద-పూసగురువెంద-పూసలగురివెంద - పూసలగురువెంద.)

పూసగ్రుచ్చినరీతి, జా. వివరముగా. "పూసగ్రుచ్చినరీతిని వినిపించెను." (నీతిచంద్రిక-సంధి); "చిలుకలకొలికి తెలుంగెల్లఁ బూసగ్రుచ్చిన రీతిన్." (విజయవిలాసము); "పూసగ్రుచ్చినరీతి నప్పువ్వుఁబోఁడి చెప్పినది విని" (కళాపూర్ణోదయము).

పూసయెముక, దే. వి. వెన్నుపూస: చూ, శల్యము. 1.

పూసలలోదారము, జా. అభేదముగా, లోపల ప్రవేశించి, ఇష్టముగా. "పూసలలో దారంబు పాలఁజల్లినపీఁదుంబలె,"

పాండు. 3, ఆ. 59. (ఇది ఉపమానము).
పూసలవాఁడు, దే. వి: చూ, సానలవాఁడు.
పూసికొను, వా. స. క్రి. 1. కలుగఁజేసికొను; 2. చందనాదుల నలఁదుకొను.

## పృ

పృక్క, సం. వి. ఆ. స్త్రీ. 1. పిక్క*: చూ, స్పృక్క; 2. ఒకశాకము: చూ, శాకము. 1.
పృక్తము, సం. విణ. కూడుకొన్నది: చూ, సంచితము. 2.
పృక్తి, సం. వి. ఇ. స్త్రీ. తాఁకుడు: చూ, స్పర్శము. 1.
పృచ్ఛ, సం. వి. ఆ. స్త్రీ. ప్రశ్నము: చూ, సవాలు.
పృచ్ఛించు, సం. స. క్రి. ప్రశ్నించు: చూ, సవాలువేయు.
పృతన, సం. వి. ఆ. సీ. 1. దండు: చూ, సేన. 1; 2. సేనా విశేషము. (ఇన్నూట నలువదిమూఁడు రథములు, అన్ని యేనుఁగులు, ఏన్నూట యిరువది రొమ్మిది గుఱ్ఱములు, వేయినన్నూట పదునేవురు కాల్బురును గలది): చూ, సేన.1.
పృతనాషాట్టు, సం. వి. హ్. పుం. ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు.
పృథక్పర్ణి, సం. వి. ఈ. స్త్రీ. కోలపొన్న *: చూ, సురపొన్న.
పృథగ్జనుఁడు, సం. వి. అ. పుం. 1. నీచుఁడు: చూ, హీనుఁడు; 2. మూర్ఖుఁడు: చూ, స్తబ్ధుఁడు; 3: చూ, పాపాలముద్ద.
పృథగ్విధము, సం. విణ. పెక్కువిధములు గలది: చూ, వివిధము.
పృథవి, సం. వి. ఈ. స్త్రీ. రూ. పృథివి, పృథ్వి=పుడమి: చూ, భూమి. 1.
పృథివి, సం. వి. ఈ. స్త్రీ.=పుడమి.—పై. —
పృథివీ గతయౌవనా, న్యా. భూదేవికి యౌవనము గడచినది. దీని మూల మిది. అతిక్రాంతసుఖాః కాలాః, ప్రత్యుపస్థిత దారుణాః, శ్వః శ్వః పాపీయదివసా, పృథివీ గతయౌవనా.
పృథివీపతి, సం. వి. ఇ. పుం. 1. రాజు: చూ, రాజు. 1; 2: చూ, యముఁడు; 3: చూ, వృషభము. 3.*
పృథివ్యాది పంచతత్వములు, అం. పృథివీతత్వము 8 గడియలు, జలతత్వము గ 4 లు, అగ్నితత్వము గ 6 లు, వాయుతత్వము గ 5 లు, ఆకాశతత్వము గ 7లు = గ 30 లు. (ఆదివారము మొదలు బుధవారమువఱకు పృథివ్యాదిగాఁ జరించును. గు-శు-శనివారములయందు ఆకాశము మొదలుగాఁజరించును. ఈ 5 ను వరుసగా సంపద, శుభము, ఆర్తి, రోగము, దారిద్ర్యము నిచ్చునవి).
పృథుకము, సం. వి. అ. పుం. 1.=బొడిగ: చూ, శిశువు; బ. 2. అటుకులు-అడుకులు, ఖర్పరిక, చిపిటకము-చిపిటము-చిపుటము: చూ, సాదము. (1).
పృథుకుఁడు, సం. వి. అ. పుం.=బొడిగ: చూ, పృథుకము. 1.
పృథురోమము, సం. వి. న్. పుం. 1: చూ, మత్స్యము. 1; విణ. 2. పెద్దవెండ్రుకలు గలది.
పృథులము: సం. విణ. 1. పెద్దది: చూ, సుర, 3; అం, 2; చూ, గతివిశేషములు.
పృథువు: సం. వి. ఉ. స్త్రీ. రూ-పృథ్వి. 1. నల్లజీలకఱ్ఱ: చూ, సుషవి. 2; 2. ఇంగువమ్రాను: చూ, హింగువు. 1; పుం. 3. అగ్ని: చూ, వహ్ని. 1; 4. పృథ్వీరాజు: చూ, రాజు. 1; విణ. 5.=పఱ. గొప్పది: చూ, సుర. 3; 6. విరిషమైనది: చూ, సుర. 3.
పృథుశేఖరము, సం. వి. అ. పుం: చూ, పర్వతము.
పృథూనకము, సం. వి. అ. న. మేఁక: చూ, మేషము. 1.
పృథ్వి, సం. వి. ఈ. స్త్రీ. 1. = పుడమి: చూ, రూ-పృథివి; 2: చూ, రూ-పృథువు. 1; 3: చూ, రూ-పృథువు. 2; పా. 4. ఒక వృత్తము. "జ-స-జ-స-య-వ, 12 యతి." ఉదా.—"ప్రసన్న, వదనాం, బుజాధృ, తప-ర, శ్వధామా-ధవా": చూ, వృత్తము. 1.
పృథ్వీక, సం. వి. ఆ. స్త్రీ. పెద్దయేలకి: చూ, పత్రల (పృథ్వీక అనియు).
పృథ్వీపంచకము, అం. అహంకారము, అపానము, ఘ్రాణము, గంధము, గుదము (5).
పృదాకువు, సం. వి. ఉ. పుం. 1: చూ, సర్పము; 2: చూ, వృశ్చికము. 1; 3. పులి: చూ, శార్దూలము. 1; 4 చిఱుతపులి: చూ, శార్దూలము. 1.
పృద్వేల, సం. వి. ఆ. స్త్రీ: చూ, పృథ్వీక.
పృశ్ని, సం. వి. ఇ. పుం. 1. కిరణము: చూ, హాయనము. 2; 2: చూ, పృశ్నిపర్ణి*; విణ. 3. అల్పతనువు, కిరాతుఁడు. (తె).— అలిపిరి-అల్పిరి: చూ, శరీరి. 2; 4. బోయ: చూ, వ్యాధుఁడు. 1.
పృశ్నిపర్ణి, సం. వి. ఈ. స్త్రీ. కోలపొన్న *: చూ, సురపొన్న.
పృశ్నిశృంగుఁడు, సం. వి. అ. పుం: చూ, వినాయకుఁడు. 1.
పృషతము, సం. వి. అ. పుం. 1. దుప్పి: చూ, హరిణము. 1; 2. రూ-పృషత్తు-పృషదము. నీటిబొట్టు: చూ, విప్రుషము; విణ. 3. బ్రహ్మబిందువుతోఁగూడినది. రూ-పృషత్తు: చూ, బ్రహ్మబిందువు.
పృషత్కము, సం. వి. అ. పుం. అమ్ము: చూ, బాణము. 1.
పృషత్తు, సం. వి. త్. న. 1: చూ, పృషతము. 2; పుం. 2: చూ, పృషతము. 1; విణ. 3: చూ, పృషతము. 3.
పృషదంశకము. సం. వి. అ. పుం. రూ-పృషదంశకము: చూ, మార్జాలము.
పృషదశ్వుఁడు. సం. వి. అ. పుం: చూ, వాయువు.
పృషదాజ్యము. సం. వి. అ. న. పెరుఁగుతోఁ గలపఁబడిన నేయి: చూ, హవిస్సు. 1.
పృష్టము. సం. విణ: చూ, ప్రార్థితము. 1.
పృష్టి, సం. వి. ఇ. స్త్రీ. 1. తాఁకుడు: చూ, స్పర్శము. 1; 2. కిరణము: చూ, హాయనము. 2.
పృష్ఠఖలీనన్యాయము, న్యా. నోటికిఁబెట్టినకళ్లెము ముడ్డికిఁబెట్టె ననురీతి.
పృష్ఠతాడనాద్దంతభంగః. లో. తుంటినిఁగొట్టినఁ బండ్లు రాలినవి. "వృక్షంబున నెక్కడ ? సాక్ష్యంబు పలికెనన నెక్కడ ? "పృష్ఠతాడనాద్దంతభంగ యనునట్లున్నది" (నీతిచంద్రిక).
పృష్ఠభాగము, అం; చూ, హస్తక్షేత్రములు.

పృష్ఠమాంసాదనము, సం. వి. అ. న. కడచినపనికి చింతించుట.

పృష్ఠము, సం. వి. అ. న. 1: చూ, ముద్దీ; 2. = పృష్ఠ: చూ, వీఁపు; 3. వెనుకప్రక్క: చూ, వెనుక. 1; 4. యజ్ఞసంబంధి స్తోత్రవిశేషము; 5. = పెరడు: చూ, పెరడు; 6. = పొరట: చూ, పొరట; అం. 7: చూ, లక్షణాంగములు (వీఁపు.—పురుషుని వీఁపు.—మచ్చయున్న కోరికలొసఁగువాఁడగును ; 8: చూ, స్త్రీలక్షణాంగములు. (వీఁపు.—ఆఁడుదానివీఁపు.—మాంసయుక్తమై రోమరహితమై అరఁటియాకువలె నున్న ధనవంతురాలగు. రోమమున్న నశుభప్రదము. సుడియున్న మగఁడు చచ్చును.); 9: చూ, గురుమతమున వ్యూహాంగములు (అనుబంధములో చూడుము); 10: చూ, శుక్రమతమున వ్యూహాంగములు.

పృష్ఠస్వస్తికము, అం: చూ, కరణములు.

పృష్ఠానుసారి, అం: చూ, బాహుప్రచారములు (హస్తక్రియా భేదములు).

పృష్ఠోద్ధానతలము, అం: చూ, ఏకవింశతిస్థానకములు (స్థానకములు).

పృష్ఠ్యము, సం. వి అ. న. 1. పృష్ఠములనెడి యజ్ఞసంబంధి స్తోత్రవిశేషముల సమూహము; పుం. 2. మోపుమోసెడు గుఱ్ఱము: చూ, హయము.

## పె

పె, దే. విశే. వృత్తియందు పెనుపుశబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (దీనికి పరుష సరళములు పరములగునపుడు ను మాగమంబగు. పెన్‌గురుఁజు, పెన్‌జీఁకటి, పెన్‌దడి, పెన్‌బులుఁగు మొ. ఇందలి ద్రుతంబునకు బిందువు నగు. పెంజీఁకటి మొ.) (ఒకానొకచో స్థిరము పరమగునపుడును బిందువు కానంబడియెడి. "పెంమూళి యెసఁగ" మార్క. 6, ఆ. 107).

పెంకి, దే. వి. 1. ఒకతీఁగ. *: చూ, వృక్షము; వా. విశే. 2. మిక్కిలి ఎఱుపు: చూ, వర్ణము. 6; 3: చూ, రూ-పెంకె. 1-2-3.

పెంకితనము, వా. వి. చెప్పినమాట వినకపోవుట.

పెంకివాఁడు, వా. వి: చూ, దిట్టఁడు.

పెంకు, దే. వి. (రూ-పెంచి-పెంచిక-పెంచు). 1. తలపెంకు. అం. భా. ద్వి. 133: చూ, శల్యము. 1; 2. ఇంటికికప్పెడు ఓడుబిల్ల: చూ, శర్కర. 3; 3. కుండ లోనగువాని పెంకు: చూ, బోలె; వా. 4. చితికిన అద్దము లోనగువాని పెంకు; 5. కొబ్బరి లోనగువాని పెంకు; 6. ముష్టిచిప్ప.

పెంకె, దే. విశే. రూ-పెంకి. 1. మొండికట్టై: చూ, వ్యాధుఁడు. 2; 2. మూర్ఖుఁడు: చూ, స్తబ్ధుఁడు; వా. 3: చూ, దిట్టఁడు.

పెంకెపురుగు, ద్వ. వి. 1. పచ్చచిలుక: చూ, పురుగు; 2. సెనగలులోనగు అపరదినుసులకును, చింతపండు లోనగు వానికినిఁ బట్టెడు క్రిమి: చూ, పురుగు.

పెంచి, వా. వి: చూ, రూ-పెంకు.

పెంచిక, దే. వి.—పై.—జై. 4, ఆ. 137.

పెంపము, వై. వి. = పింఛ: చూ, రూ-పింఛియము.

పెంచు, దే. వి. 1: చూ, రూ-పెంకు. రామా, 7, అ. 67; క్రి. 2. రూ-పెనుచు. వర్ధిల్లఁజేయు; స. క్రి. 3. పోషించు: చూ, రక్షించు.

పెంపుకొను, దే. స. క్రి. దత్తుతీసికొను.

పెంపులవేరి, వా. వి: చూ, వాంక్రీవ.

పెంజారి, ద్వ. వి: చూ, రూ-పింజారి (వాయువు).

పెంజీఁకటి, వా. వి. కటికచీఁకటి: చూ, మేచకము. 1.

పెంజెర, దే. వి. ఒక కొండచిలువ (దీనిభేదములు:- రాస్సు పెంజెర, పొట్టపెంజర, రక్తపెంజెర): చూ, సర్పము.

పెంట, దే. వి. 1. ఇంటిపెంట: చూ, సంకరము. 2; 2. ఎరుపు కుప్ప. జై. 4, ఆ. 100: చూ, సంకరము. 2; 3. ఆవుల మంద యుండున్నచోటు. రూ-పెంచె: చూ, సౌరభేయి (ధేనువు); వై. వి. 4. = పెంరా. రూ-పేఁట. నగరము: చూ, సీమ. 1 (దేశము); 5. = పింఠా. రూ-పేఁట. అంగడి, శాఖానగరము (అని కొందఱు): చూ, సదనము. 1.

పెంటకోట, వా. వి. 1. ఒకానొకగ్రామనామము; 2. ఒకానొక యింటిపేరు.

పెంటగట్టు, దే. అ. క్రి. మందకట్టు-మందగట్టు.

పెంటగాడిద, వా. వి: చూ, వ్రాకె.

పెంటబట్టు, దే. వి. పసులదొడ్డి. స్కా. 4, ఆ. 60: చూ, సౌరభేయి (ధేనువు).

పెంటపురుగు, వా. వి. తుట్టపురుగు: చూ, పురుగు.

పెంటబండి, దే. వి. అమశకము, గంత్రీరథము: చూ, శకటము. 1.

పెంటి, దే. వి. పశుపక్ష్యాది స్త్రీజాతి. రామా. 6, ఆ. 107; భార. ఆది. 5, ఆ. 53: చూ, శకుంతి (పక్షి).

పెంటిక, దే. వి. (రూ-పెంట్రిక-పెంట్రుక) మేఁకలు లోనగు వాని పేఁడ: చూ, శుష్కగోమయము (కమలము. 1.)

పెంటికరడు, దే. వి. చిన్నఅల: చూ, వీచి. 1.

పెంటిగూర్చువాఁడు, వా. వి: చూ, దూతుఁడు.

పెంటిజింక, వా. వి. ఆఁడుదుప్పి: చూ, హరిణము. 1.

పెంటితాడి, వా. వి. ఆఁడుతాడి*: చూ, శ్రీతాళము.

పెంటిపడుట, ద్వ. వి. కవగూడుట.

పెంతె, వా. వి: చూ, రూ-పెంట. 3.

పెంట్రిక, దే. వి: చూ, రూ-పెంటిక.

పెంట్రుక, దే. వి. —పై.—

పెండ, దే. వి. రూ-పేఁడ: చూ, పిడక.

పెండరము, దే. వి. రూ-పెండారము: చూ, గండపెండరము.

పెండలము, దే. వి: చూ, సమష్టిల*.

పెండారము, దే. వి: చూ, రూ-పెండరము.

పెండారిమూఁక, వా. వి. దండులోని అల్లరి జనము: చూ, సేన. 1.

పెండియము, దే. వి. రూ-పెండెము. 1: చూ, పెండరము; 2. దొడ్డి మొదలైనవానివాకిటికిఁ బెట్టెడు పెండెము; 3: చూ, పలుగాఁడి. 1.

పెండిలి, దే. వి. రూ-పెండ్లి: చూ, వివాహము.

పెండిలియగు, దే. స. క్రి. వివాహమగు: చూ, రూ-పెండ్లియగు. భార. ఆది. 8, ఆ. 144.

పెండిలియాడు, దే. స. క్రి.—పై.—

పెండిలిసేయు, దే. స. క్రి.—పై.— (అం ప్రే. పెండ్లాడఁజేయు—ఉ, హరి. 4, ఆ. 19).

పెండె, దే. వి. 1. ఇంటి వాసములమీఁది అడ్డుకొయ్య. రా, వి. 3, ఆ. 40; 2. పొగాకు మొదలైనవాని నగయందు సగము.

పెండెకట్టు, వా. వి. రెండువాసములు కలిపికట్టిన కట్టు.

పెండెకట్లు, వా. వి. ఐ. పెండెలవలె పట్టెలుగా తీర్చిన విబూది రేఖలు.

పెండెకత్తు, వా. వి. చెడుగుడులోనగు ఆటలయందుండెడు యజమాని. రూ-పెండేకత్తు.

పెండెము, దే. వి: చూ, రూ-పెండియము.

పెండెరము, దే. వి: చూ, రూ-పెండరము.

పెండేకత్తు, వా. వి: చూ, రూ-పెండెకత్తు.

పెండేరము, దే. వి: చూ, రూ-పెండెరము.

పెండ్లము, దే. వి. (పెండ్లి+అము) రూ-పెండ్లాము-పెళ్ళము-పెళ్లాము) భాగ. 9, స్కం. 474: చూ, భార్య.

పెండ్లాడు, దే. స. క్రి: చూ, రూ- పెండిలియాడు.

పెండ్లాము, దే. వి: చూ, రూ- పెండ్లము.

పెండ్లి, దే. వి. రూ-పెళ్ళి: చూ, రూ- పెండిలి.

పెండ్లికుండలు, ద్వ. వి. ఐ: చూ, భాండము. 3.

పెండ్లికూఁతురు, దే. వి. రూ- పెళ్ళికూఁతురు. 1. వివాహదీక్షితురాలు: చూ, వధువు; 2. కోడలు: చూ, స్నుష.

పెండ్లికొడుకు, ద్వ. వి. రూ- పెళ్ళికొడుకు. 1. వివాహదీక్షితుఁడు: చూ, వరుఁడు; 2. అల్లుఁడు: చూ, స్వస్త్రీయుఁడు.

పెండ్లిగుమ్మడి, దే. వి. వివాహాదులలో నుపయోగించెడి వడియముల గుమ్మడి, బూడిదగుమ్మడి*: చూ, సర్వతోభద్ర.

పెండ్లిపాలకి, వా. వి. వధూవరులు ఊరేగెడుపాలకి: చూ, సవారి.

పెండ్లిపీఁట, వా. వి. వధూవరులు కూర్చుండెడిపీఁట(అరుఁగు): చూ, సింహాసనము.

పెండ్లియగు, వా. స. క్రి. రూ- పెండిలియగు. భార. ఆది. 7, ఆ. 281.

పెండ్లియాడు, దే. స. క్రి: చూ, పెండిలియగు. నై. 4, ఆ. 48.

పెండ్లిలేనివాఁడు, వా. వి. అకృతోద్వాహుఁడు, అవివాహితుఁడు, కుంభుఁడు.

పెండ్లిసేయు, దే. స. క్రి: చూ, రూ- పెండిలిసేయు.

పెందలకడ, దే. ద్ర. క్రి. విశ. (పెన్+తలకడ) రూ-పెందలాడ, ప్రొద్దుపోకమునుపు.

పెందలాడ, —పై.—

పెందిరువడి, దే. వి. (వైష్ణవ పరిభాషయందు) గరుడుఁడు: చూ, హరివాహనుఁడు.

పెందెరువు, దే. వి. రాజమార్గము. భార. ఉద్యో. 3, ఆ. 145: చూ, మార్గము. 1.

పెందొడ, దే. వి. ఊరుమూలము.

పెంద్రోవ, దే. వి. ముక్తి: చూ, సదాగతి. 2.

పెంపకము, వా. వి: చూ, దత్తత.

పెంపగు, దే. అ. క్రి: చూ, వర్ధిల్లు.

పెంపరలాడు, దే. స. క్రి. చంపు: చూ, సంహరించు.

పెంపారు, దే. అ. క్రి: చూ, రూ- పెనుపారు. భార. ఉద్యో. 3, ఆ. 96.

పెంపు, దే. వి. 1: చూ, సమృద్ధి; 2: చూ, హెచ్చు. 2; 3: చూ, సన్మానము; 4: చూ, సంస్థ. 3; 5 రూ-పెనుపు. మహత్వము; 6: చూ, పెంపకము; ప్రే. 7. నాశముచేయు. భాగ. 10, స్కం. పూ. 154; వసు. 1, ఆ. 28; స. క్రి. 8. చంపు: చూ, సంహరించు.

పెంపుడు, దే. వి. పెంపఁబడినది.

పెంపుడుగున్న, వా. వి: చూ, సాఁకుడుపులుఁగు.

పెంపుడుచిలుక, వా. వి. పంజరమునందుంచి పెంచెడు చిలుక: చూ, శుకము.

పెంపుమీఱు, దే. అ. క్రి: చూ, సంపడించు. పు 1, ఆ. 202.

పెకలు, దే. అ. క్రి. 1. పెల్లగిల్లు. పా. 3, ఆ. 31: చూ, విదారించు; 2. రాలు: చూ, సడలు. 4; 3. ఉన్మూలించు: చూ, విదారించు; 4. ప్రయాణమగు. జై. 2, ఆ. 10.

పెకలించు, దే. ప్రే. పెకలఁజేయు. రూ- పెకలించు-పెకల్చు-పెగలుచు-పెగల్చు. రామా. 8, ఆ. 92.

పెకలుచు,—పై.—

పెకల్చు,—పై.—

పెక్కండ్రు, వై. స. ఐ.=పుష్కలు. (రూ-పెక్కండ్రురు-పెక్కురు) పా. 4, ఆ. 54. (పెక్కు శబ్దమునకు మహన్మహత్వర్థకరూపము): చూ, పలుగుండ్రు.

పెక్కండ్రురు, —పై.—

పెక్కణము, వై. వి. రూ-ప్రెక్కణము.=ప్రేక్షణ. 1. అభినయముతోడి నృత్యము ఉ, హరి. 4, ఆ. 216: చూ, వ్యంజకము. 1; 2. మల్లరంగము: చూ, మల్లశాస్త్రము.

పెక్కిలి, దే. వి. ఒకచెట్టు: చూ, వృక్షము.

పెక్కు, వై. స.=బహు. పుష్కలు: చూ, హేరాళము.

పెక్కురు, వై. స. ఐ.=పుష్కలు: చూ, పెక్కండ్రు.

పెక్కువ, దే. వి. 1: చూ, వర్ధనము. 1. భార. అర. 3, ఆ. 26; 2: చూ, హెచ్చు, 2. జై. 5, ఆ. 199.

పెగడ, దే. వి. (రూ-పెగ్గడ-ప్రెగడ-ప్రెగ్గడ-ప్రెవడ) 1: చూ, మంత్రి; 2: చూ, శ్రేష్ఠుఁడు. 2; 3. యువరాజు: చూ, రాజు. 1.

పెగలు, దే. అ. క్రి: చూ, రూ- పెకలు. (పెల్లగిల్లుటకు.—భాగ. 6, స్కం. 61.)

పెగలుచు, దే. ప్రే. రూ-పెకలించు.

పెగల్చు,—పై.—

పెగ్గడ, దే. వి: చూ, రూ-పెగడ.

పెగ్గుమ్మడు, వై. వి. (పెద్ద+గుమ్మడు.) శ్రీపర్ణి*: చూ, సర్వతోభద్ర.

పెగ్గురు, వై. వి. = పుష్కర. చూ- బెగ్గురు; చూ, సారసము.

పెచ్చొరి, దే. విశ: చూ, మూర్ఖుఁడు. ఉ. హరి 3, ఆ. 19.

పెచ్చు దే. వి. 1. అతిశయము. పాండు. 1, ఆ. 111: చూ, రూ-హెచ్చు. 2; 2: చూ, కొనరు; 3. వెలఁగలోనగు కాయల పైపెంకు: చూ, బెరడు; విశ. 4. అధికము: చూ, హెచ్చు. 1.

పెచ్చుపెరుగు, దే. అ. క్రి. మిక్కిలి వర్ధిల్లు. ఆం, భా. శ్ర. 99. చూ, వర్ధిల్లు.

పెటపెట, దే. వి. పండ్లుకొఱుకుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. భాగ. 6, స్కం. 219: చూ, హూహూ.

పెటపెటమను, దే. అ. క్రి. పెటపెటమనుధ్వని కలది యగు: పెటపెటలాడు.

పెటపెటలాడు,—పై.—

పెటిలు, దే. అ. క్రి. కాలిధ్వని పూర్వకముగా బ్రద్దలగు. రూ- పెటులు-పెట్లు-పెకులు-పర. 3, ఆ. 229.

పెటుకు, దే. విశ: చూ, విరసము. 2.

పెటుకుమాట, దే. విశ. విరసపుమాట: చూ, శబ్దము. 2.

పెటులు, దే. వి. 1: చూ, పెట్లకంబము. స్వా. 5, ఆ. 14; అ. క్రి. 2: చూ, రూ-పెటిలు.

పెట్ట, దే. వి. (పశుపక్షిజాతి) 1. ఆఁడుకోడి: చూ, పుంజు; 2. ఆఁడుపిట్ట: చూ, పక్షి. (పశుపక్షి స్త్రీజాతికి.—కాశీ. 6, ఆ. 29'); 3. గడ్డ, లోష్టము: చూ, భూమి. 1.

పెట్టపోలి, వా. వి: చూ, పుంజు.

పెట్టమారి, దే. వి.—పై.—

పెట్టి, వై. వి. = పేటిక: చూ, రూ-పెట్టియ.

పెట్టిక,—పై.—

పెట్టిపుట్టనివాఁడు, వా. వి. అదృష్టహీనుఁడు.

పెట్టిపుట్టినవాఁడు, వా. వి: చూ, సంపన్నుఁడు.

పెట్టియ, వై. వి. (రూ-పెట్టి-పెట్టె-పెట్టిక-పేడె) 1.=పేటికా: చూ, సందుకా; 2. పల్లకి నడిమిపెట్టె చూ, సందుకా; 3. బండిపరముమీఁది పెట్టె: చూ, సందుకా; 4. పాముచుట్టుకొనుపెట్టె: చూ, సందుకా.

పెట్టు, దే. వి. 1. రూ- పెట్టుడు. ఈవి: చూ, స్పర్శము. 3; 2: చూ, మాఱు. 1; 3: చూ, హతి. కళా. 7, ఆ. 255; 4: చూ, వెండియు; స. క్రి. 5: చూ, హవణించు. 4; 6. (పక్షుల లోనగునవి) గ్రుడ్లను వెలిపుచ్చు: చూ, వెలిపుచ్చు; 7. గ్రుడ్లుపొదిగి పిల్లలనుచేయు; 8: చూ, వహించు. హరి. పూ. 9, ఆ. 178; 9. అందగించు, ఇచ్చు, ఇడు, ఒసఁగు-ఒసవు, దయచేయు-దయసేయు, దోఁటు, పుడుకు-పుఱుకు, పెట్టు, విడుచు. (సం. ప).—దానమిచ్చు; తద్వి.—౧. కానుకగానిచ్చుటకు.—దరిసించు; ౨. కొంచెమిచ్చుటకు — పుడికిరించు - పుణికిరించు - పుడుకు-పుఱుకు. (మిగతవానికి: "చూ, విడుచు. 3."); 10: చూ, మోపు. 7; 11. గోడ మొదలగువాని లేపు. భార. ఉద్యో. 1, ఆ, 298; 12: చూ, మొలవేయు. రామా. 6, ఆ. 43; 13: చూ, మొత్తు. 2; అ. క్రి. 14: చూ, సంభవించు. ఉ. హరి. 6, ఆ. 96.

పెట్టుజెట్టు, దే. వి: చూ, వేలుపుజెట్టు.

పెట్టుకొను, దే. స. క్రి: చూ, వహించు.

పెట్టుకోలు, దే. వి. పెట్టుకొనుట: చూ, సంస్కృతి. 2.

పెట్టుడు, దే. వి: చూ. రూ- పెట్టు. 1.

పెట్టుబడి, దే. వి. పేనికేని వెచ్చమునకై మొదటపెట్టిన ధనము: చూ, వ్యయము.

పెట్టుమందు, దే. వి: చూ, మధ్యౌషధము.

పెట్టువడు, ద్వా. అ. క్రి. పెట్బడు.

పెట్టె, వై. వి. = పేటికా: చూ, రూ-పెట్టియ. (పల్లకి నడిమి పెట్టె.-జై. 3, ఆ. 61.)

పెట్టెబండి, ద్వా. వి. పరముమీఁది పెట్టెవలె సమర్చిన బండి: చూ, శకటము. 1.

పెట్టెపెట్టు, ద్వా. అ. క్రి. (పాము) చుట్టుకొను. పాండు. 4, ఆ. 250: చూ, వేష్టించు.

పెట్రకొలికికట్టు, దే. స. క్రి. పెవటెక్కలు విఱిచిరట్టు: చూ, విఱిచికట్టు.

పెట్లకంబము, ద్వా. వి. అడుగుపెట్టుగొట్టము: పెట్లదిమ్మె, పెట్లుగ్రోవి, పెటులు.

పెట్లదిమ్మె, దే. వి. 1.—పై.—; 2. చేలయందు పక్షులను దోలుటకై సర్పాకారముగా పేని పెట్టుకొనియుండెడు చేరు: చూ, సూత్రము. 1.

పెట్లమారి, దే. విశ. 1. దెబ్బలుతిను స్వభావము కలవాఁడు, కొట్లమారి; 2. దెబ్బలుతిను స్వభావము కలది: చూ, స్త్రీ.

పెట్లాఁగు, అం: చూ, విస్ఫోటనములు.

పెట్లు, దే. అ. క్రి: చూ, రూ-పెటులు.

పెట్లుగ్రోవి, దే. వి: చూ, పెట్లకంబము. హరిశ్చ. 2, ఆ. 6.

పెట్లుప్పు, దే. వి: చూ, లవణము. 1.

పెఠిల్లు, దే. వి. 1. హరియందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ; 2. పిడుగుపడుటయందగు ధ్వన్యనుకరణము కళా. 4, ఆ. 86: చూ, హూహూ.

పెడ, వై. విశ. 1. = పృథు, వృద్ధ. పెద్దది. పర. 4, ఆ. 151: చూ, విపులము; 2: చూ, వెనుకటిది; 3: చూ, వ్యత్యయము. ఉ, రా. 7, ఆ. 123.

పెడఁబాయు, దే. స. క్రి. రూ-ఎడఁబాయు: చూ, వేఱుపడు.

పెడక, వై. వి. రూ- పెణక. = పృష్ఠ. 1. కత్తియొక్క పృష్ఠభాగము; 2. ఆకుయొక్క పృష్ఠభాగము; 3. ఇంటియొక్క వసారా పైకప్పు: చూ, సదనము. 1.

పెడకంటి(తి)రెడ్లు, వా. వి. బ: చూ, రెడ్డి(ఇట్లు)పెడగంతిరెడ్లు.

పెడకంత, వా. వి. తప్పుత్రోవ: చూ, మార్గము. 1.

పెడకట్టె, వై. విశ. రూ-పెడసరకట్టె, 1: చూ, స్తబ్ధుఁడు; 2: చూ, పాలసురాలు.

పెడకట్టెమాట, ద్వా. వి. కట్టెవిరుపుమాట: చూ, శబ్దము. 2.

పెడకేలు, వై. వి. వెనుకకుత్రిప్పిన భుజము: చూ, స్కంధము. 1.

పెడగాలు, ద్వా. వి. వెనుకకు మడిచిన కాలు: చూ, హజ్జ.

పెడచెవి, వై. వి. చెవివెనుకటిభాగము. భార. ఉద్యో. 4, ఆ. 76: చూ, శ్రోత్రము.

పెడచెవిఁబెట్టు: ద్వా. స. క్రి. 1. వినకపోవు; 2. చక్కగా విను: చూ, విను. 2.

పెదచేయి, వై. వి. మీఁజేయి: చూ, హస్తము.
పెదతల, ద్వ. వి. తలవెనుకటి భాగము: చూ, శిరము. 1.
పెదదారి, వై. వి: చూ, పెడకంత.
పెదనెల, ద్వ. వి. తీర్పరి: చూ, స్వామి. 3. (అప్ర.)
పెదబొబ్బ, ద్వ. వి. 1. యుద్ధమునం దుత్సాహముచే చేయు ధ్వని: చూ, స్వరము. 2; 2. విపరీతధ్వని, మొత్తుకోళ్ళు: చూ, స్వరము. 2.
పెడమరలు, ద్వ. వి. (రూ-పెడమర్లు-పెడమఱు) 1. వెనుకకు లిరుగుట. వై. 6, ఆ. 116: చూ, సంద్రావము; అ. క్రి. 2. వెనుకకుతిరుగు: చూ, వెనుదీయు. 1.
పెడమర్లు.—వై.—
పెడమఱు, —వై —నిర్వ. 3, ఆ. 27. (ప్రే-పెడమరించు.)
పెడమల్లె, వై. వి. పెద్దమల్లె*: చూ, మల్లె.
పెడము, వై. వి. రూ-పెడమోము: చూ, వైముఖ్యము.
పెడమోము, — వై.—
పెడమోమువడు, ద్వ. అ. క్రి: చూ, మాఱు.
పెడరేఁచు, వై. ప్రే: చూ, పురికొలుపు. 2.
పెడిటెక్కల గొడ్డు, వా. వి: చూ, వ్రాజె.
పెడలు, దే. వి: చూ, పెరడు.
పెడసరకట్టె, ద్వ. విణ: చూ, రూ- పెడకట్టె.
పెడసరము, దే. వి: చూ, మౌర్ఖ్యము.
పెడిసె, దే. వి: చూ, పక్షి.
పెడుచఁడు, వా. వి: చూ, శిశువు. ఆం, భా. ద్వి. 118.
పెడులు, దే. అ. క్రి: చూ, రూ-పెటిలు. భార. ఆది. 8, ఆ. 259.
పెడ్డ, దే. వి. మట్టిపెల్ల: చూ, భూమి. 1.
పెణక, వై. వి. = పృష్ఠ: చూ, రూ-పెడక.
పెతరులచుక్క, వై. వి: చూ, రూ- పితరులచుక్క.
పెతరులసామి, వై. వి. యముఁడు: చూ, హరి.
పెతరులు, వై. వి. బ: చూ, పితాళ్ళు.
పెత్తనగాఁడు, ద్వ. వి: చూ, పారుపత్తెకాఁడు.
పెత్తనదారు, వా. వి. కొద్ది ముదరా తీసికొని రైతులదగ్గఱ శిస్తులు రాఁబట్టు పెద్ద.
పెత్తనము, వై. వి. = వృద్ధతా. (పెద్ద + తనము) 1. అధికారము: చూ, రవము. 1; 2: చూ, వార్ధకము. 1; 3: చూ, సన్మానము.
పెద, వై. విణ. రూ- పెద్ద. = పృథు, వృద్ధ. 1: చూ, వృద్ధుఁడు; 2. అన్న: చూ, సహోదరుఁడు; 3. గొప్పవాఁడు: చూ, హేమాహేములు; 4. అధికము: చూ, హెచ్చు. 1; 5: చూ, శ్రేష్ఠ్యము; 6. దీర్ఘము: చూ, పొడవు. 2; 7: చూ, విద్వాంసుఁడు; 8. = పృథువు: చూ, విపులము; క్రి. విణ. 9. అత్యంతము (ఇది యువర్ణాంతమయ్యెడి): చూ, మఱిమఱి.
పెదతండ్రి, ద్వ. వి. తండ్రికిఅన్న: చూ, సవిత. 2.
పెదతల్లి, ద్వ. వి. తల్లికిఅప్ప: చూ, సవిత. 2.
పెదవి, దే. వి: చూ, వాతెఱ.
పెదవికెంపు, వా. వి: చూ, వాతెరకెంపు. వేం. ఆం. 75.
పెదవిగంటు, —వై.— సాంబ. మా. 51.
పెద్ద, వై. విణ.=: చూ, రూ- పెద. (దీర్ఘమునకు.— భార. ఆది. 4, ఆ. 64.)
పెద్దఃక్కెర, వై. వి: చూ, బకము.
పెద్దకడుపువాఁడు, ద్వ. వి: చూ, లంద.
పెద్దకడుపువేల్పు, ద్వ. వి: చూ, వినాయకుఁడు. 1.
పెద్దకప్ప, ద్వ. వి: చూ, మండూకము. 1.
పెద్దకాఁకర, వై. వి. మహాకారవేల్లము*: చూ, సుషవి. 1.
పెద్దకాఁచి, వై. వి. కాకాదని*: చూ, వాయసి.
పెద్దకాఁపు, ద్వ. వి. కాఁపువారిలో పెద్ద.
పెద్దకూఁకటిమూగ, ద్వ. వి. మాందిలవము: చూ, భృంగరాజము. 3.
పెద్దకొంగ, వై. వి. బలాకము: చూ, బకము.
పెద్దకొమ్మ, ద్వ. వి: చూ, శాఖ.
పెద్దగఱిక, ద్వ. వి. గండాలి*: చూ, హరిత (తృణము. 1.) తెల్లగఱికె, తీఁగెగఱికె అనియు).
పెద్దగుమ్మడి, వై. వి: చూ, పెండ్లిగుమ్మడి*.
పెద్దగుమ్ముడు, వై. వి: చూ, రూ. పెగ్గుమ్ముడు*.
పెద్దగోఁచి, వా. వి: చూ, పుట్టగోఁచి.
పెద్దగోరఁట, వై. వి: చూ, సహ. 2.
పెద్దచేఁతరాసి, వై. వి. మహోదురసి*: చూ, శమల.
పెద్దచేమంతి, వై. వి: చూ, సేమంతి*.
పెద్దజల్లిమెకము, ద్వ. వి. సృమరము: చూ, సవరపుమెకము.
పెద్దటేఁకుమ్రాను, ద్వ. వి: చూ, శాకోటము*.
పెద్దతనము, వై. వి. 1: చూ, సన్మానము; 2.=వృద్ధత్వ: చూ, వార్ధకము. 1.
పెద్దతల, ద్వ. విణ. 1. పెద్దగానుండి కార్యము నడిపించువాఁడు. కళా. 6, ఆ. 150; వా. 2. గొప్పశిరము.
పెద్దతలవాఁడు, ద్వ. వి. అడ్డతలవాఁడు. (సం. ప).—ఉరుశిరుఁడు.
పెద్దతుమ్మి, వై. వి. మహాద్రోణము *: చూ, స్ఫూర్జకము.
పెద్దతొలువేలుపు, ద్వ. వి: చూ, రాక్షసుఁడు. 1.
పెద్దదగు, వా. అ. క్రి. 1. గొప్పదగు: 2. (దీపము) ఆఱిపోవు. "దీపము పెద్దదగుచున్నది."
పెద్దదవనము, వై. వి. మహాదమనము*: చూ, రుచి. 5.
పెద్దదుప్పి, ద్వ. వి: చూ, రామము. 3.
పెద్దదూలగోవెల, ద్వ. వి. మహాత్మగుప్త*: చూ, శూకశింబి.
పెద్దదోస, ద్వ. వి. రాజకర్కటి*: చూ, హరివాలుకము.
పెద్దనక్క, వై. వి. గృంఢీరము: చూ, సృగాలము.
పెద్దనల్లచీమ, ద్వ. వి. గండ్రచీమ: చూ, పిపీలిక.
పెద్దనవు, ద్వ. వి. రూ - పెద్దనవ్వు. అట్టహాసము: చూ, హాస్యము. 1.
పెద్దనవ్వు, —వై.—
పెద్దనిదుర, వై. వి. రూ- పెద్దనిద్దుర, మరణము: చూ, సావు.
పెద్దనిదురపోవు, ద్వ. అ. క్రి: చూ, మరణించు.
పెద్దనిద్దుర, వై. వి: చూ, రూ- పెద్దనిదుర. భాగ. 6, స్కం. 429.
పెద్దనీలి, ద్వ, వి. ఆజలోమి*: చూ, రంజిని.
పెద్దనువ్వు, ద్వ. వి. మహాతిలము*: చూ, శ్రీమాఙ్.

పెద్దనెల, ద్వి. వి. తాటిరిక్కనెల: చూ, మాసము. 1.
పెద్దనేపాళము, ద్వి. వి: చూ, నేపాళము*.
పెద్దనేరేడు, ద్వి. వి. మహాజంబువు*: చూ, సురభిపత్ర.
పెద్దఎల్లేయ, ద్వి. వి. మహాపలంకష*: చూ, స్వాదుకంటకము.1
పెద్దపాఁచి, వై. వి: చూ, శైవలము వేం, ఆం. 71.
పెద్దపాఁపర, ద్వి. వి: చూ, సుపూరము*.
పెద్దపీఁచర, ద్వి. వి. పీవరి*: చూ, శ. మూలి.
పెద్దపులి, ద్వి. వి: చూ, శార్దూలము.
పెద్దపులుఁగు, ద్వి. వి: చూ, సకినంపుఁబులుఁగు.
పెద్దపెన్నేరు. ద్వి. వి. మహాశ్వగంధ*: చూ, వారాహకర్ణి.
పెద్దపొల, వై. వి. గోమాంసము: చూ, ప క్తము. 2.
పెద్దబట్ట, వై. వి. పొడుగు వెడల్పులు హెచ్చుగా గలబట్ట: చూ, వస్త్రము.
పెద్దబాడిసె, వై. వి: చూ, వాశి.
పెద్దబీఱ, ద్వి. వి. ఏనుఁగుబీఱ*: చూ, హస్తిస్వగవేషుక.
పెద్దబోడత(స)రము. ద్వి. వి. మహాముండిని*: చూ, హాపుష.
పెద్దమానేరు, ద్వి. వి. మహాజ్యోతిష్మతి*: చూ, స్వర్ణవల్లి.
పెద్దముత్తవపులగము, ద్వి. వి. అతిబల*: చూ, సహదేవ.
పెద్దములక, ద్వి. వి. మహావార్తాకి *: చూ, హింగుళి.
పెద్దమ్మ, వై. వి. 1: (మి. ప.).- మూదేవి. (సం. ప.).- అలక్ష్మి, కాలకంఠిక, కాలకర్ణి-కాలకర్ణిక, జ్యేష్ఠ, నిర్‌ఋతి; 2: చూ, పెదతల్లి.
పెద్దమఱింగ, ద్వి. వి: చూ, శ్వసనము. *
పెద్దమ్రాను, ద్వి. వి: చూ, శోణకము.*
పెద్దయల, ద్వి. వి: చూ, వీచి. 1.
పెద్దయీడ, ద్వి. వి. స్వర్ణపారేవతము*: చూ, శర్కరాంకము.
పెద్దయేలకి, వై. వి. బృహదేల *: చూ, పత్రిల.
పెద్దయ్య, వై. వి: చూ, పెదతండ్రి.
పెద్దరోగము, మి. వి: చూ, పులుము. 1.
పెద్దఱికము, వై. వి: చూ, పెద్దతనము. 1—2.
పెద్దలచాటుది, జా. అస్వతంత్రురాలు. "తరుణీమణి, పెద్దల చాటుదాన" (ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము).
పెద్దలు, వై. వి. బ. తెలిసినవారు. పాండు. 2, ఆ. 104: చూ, హేమాహేములు.
పెద్దవరగోఁగు, ద్వి. వి. బృహత్పీలువు *: చూ, వరగోఁగు.
పెద్దవాఁడు, ద్వి. వి: చూ, వృద్ధుఁడు. 1.
పెద్దవాకిలి, ద్వి. వి. గోపురద్వారము: చూ, వాకిలి. వా. 2. వాకిలికి ముందుండు విశాలప్రదేశము.
పెద్దవారము, మి. వి: చూ, బుధవారము.
పెద్దవిన్నపము, వై. వి. 1. చెవుడు: చూ, బాధిర్యము; వా. 2. గొప్పమనవి.
పెద్దవిన్నపమువాఁడు, ద్వి. విశే. చూ, బధిరుఁడు.
పెద్దవిరి, ద్వి. వి. మహానీలి*: చూ, రంజని.
పెద్దవీధి, ద్వి. వి. రాజమార్గము: చూ, మార్గము. 1.
పెద్దవేము, ద్వి. వి. మహానింబము*: చూ, వేము.
పెద్దవేలుపు, ద్వి. వి: చూ, బ్రహ్మ. 1.
పెద్దవేఱ్లు, ద్వి. వి. బొట్టనవేఱ్లు: చూ, వేలు. 2.

పెప్పిసవాప, దా. వి: చూ, నొప్పము.*
పెప్పాపపెట్టు, ద్వి. వి: చూ, వృషము.
పెప్పాపుతి, దే. వి. గోదావరీమండలమందలి పెప్పాపురము తాలూకాలో తయారుచేయఁబడెడు వెల్లము: చూ, శర్కర. 1.
పెప్పారుగ, ద్వి. వి. వరకము*: చూ, స్తంబకరి (ధాన్యము).
పెద్దింటమ్మ, ద్వి వి. (పెద్ద+ఇల్లు+అమ్మ): చూ, మహాలక్ష్మి. 3.
పెన, దే. వి. 1: చూ, యుద్ధము; 2. మెలిక. పాండు. 5, ఆ. 264: చూ, లంకియ. 3; 3. కట్టు: చూ, బంధము. 1; 4. రెండు పశువులకు చేర్చి కట్టెడుబంధము: చూ, లంకియ. 5.
పెనఁకువ, దే. వి. రూ-పెనుఁకువ. 1. వాదము: చూ, వ్యాక్షేపము; 2. కలయిక: చూ, సంయోగము; 3: చూ, యుద్ధము; 4: చూ, మేళనము; 5. చుట్టుకొనుట: చూ, వ్యాపనము; 6: చూ, యుద్ధము; 7. అల్లిబిల్లిక-అల్లిబిల్లి, పెనఁగు.
పెనఁకువలుగొను, దే. అ. క్రి. మెలిపడు: చూ పెంటిగొను. భాగ. 8, స్కం. 399.
పెనఁగఁబడు, ద్వి. అ. క్రి: చూ, పెనఁకువలుగొను. జై. 6, ఆ. 31.
పెనఁగాడు, దే. అ. క్రి —పై.—
పెనఁగియాడు, —పై.—
పెనఁగు, దే. వి. 1: చూ, రూ-పెనఁకువ. 7; అ. క్రి. 2: చూ, పెనఁకువలుగొను; 3: చూ, పెట్టివెట్టు; 4: చూ, మేళగించు. భార. ఆది. 5, ఆ. 49; 5: చూ, వాయిలాడు; 6. మాఱాడు: చూ, వక్కాణించు; వా. స. క్రి. 7. ప్రార్థించు: చూ, సక్తమగు.
పెనఁగులాట, దే వి. రూ-పెనఁగులాటము, మల్లడి: చూ, యుద్ధము.
పెనఁగులాటము, —పై.—
పెనఁగులాడు, దే. అ. క్రి. మల్లాడు: చూ, పెంటిగొను.
పెనఁగువడు, దే. అ. క్రి. చేరు. నిర్వ. 10, ఆ. 77: చూ, సమీపించు.
పెనఁగూడు, —పై.—
పెనఁగొను, 1. —పై.—; 2: చూ, పెనఁగులాడు. భార. ఉద్యో. 2, ఆ. 9.
పెనఁచు, దే. ప్రే. పెనఁగఁజేయు. భో. 2, ఆ. 64: పెనపు, మెలచు.
పెనపరి, దే. విశే. (పెనపు+అరి) వివాదశీలుఁడు: చూ, రెచ్చెల; 2. భేదశీలుఁడు. భార. ఉద్యో. 3, ఆ. 214.
పెనపు, దే. వి. 1. వివాదము: చూ, పెనఁకువ. 1; 2. భేదము: చూ, వేఱుపాటు. 1; ప్రే. 3: చూ, పెనఁచు; 4. కలపు.
పెనము, దే. వి. స్వేదని: చూ, పాత్రము. 6.
పెనయు, దే. అ. క్రి. 1: చూ, మేళగించు; 2: చూ, పెనఁగు.7.
పెనవెట్టు, దే. స. క్రి: చూ, వడివేయు. స్వా. 4, ఆ. 73.
పెనవేయు, దే. స. క్రి. 1. — పై. —; 2. పశువులను ఒకటితో నొకటిఁ జేర్చి ముడివేయు: చూ, లంకెవెట్టు. 1.
పెనసలు, వా. వి. (రూ-పెన్సలు-పెనిసిలు-పెన్సిలు): చూ, లేఖిని.

పెనిమిటి, దే. వి. (పెనుపు + మేటి) రూ—పెన్మిటి. మగఁడు: చూ, సామి. 2.
పెను, దే. విశే. వృత్తియందు పెనుపు శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలినరూపము. పాండు. 2, ఆ. 55; పాండు 2, ఆ. 58.
పెనుఁకువ, దే. వి: చూ, రూ—పెనఁకువ.
పెనుఁగొమ్మ, దే. వి. (పెనుపు + కొమ్మ): చూ, పెద్దకొమ్మ.
పెనుఁబాము, దే. వి. (పెనుపు + పాము) కొండచిలువ. భార. ఆర. 2, ఆ. 89: చూ, సర్పము.
పెనుచు, దే. స. క్రి: చూ, రూ—పెంచు. 2-3.
పెనుతిండి, ద్వ. వి. అతిబాతి: చూ, పాదము. (1).
పెనుపంజు, ద్వ. వి: చూ, స్నేహాళము. వేం. ఆం. 70.
పెనుపడు, దే. అ. క్రి. (పెనుపు + పడు) 1: చూ, ముమ్మరించు. జై. 2, ఆ. 64; 2: చూ, వర్ధిల్లు.
పెనుపరి, దే. విశే. (పెనుపు + అరి) వృద్ధిబొందించువాఁడు: చూ, సంరక్షకుఁడు.
పెనుపారు, దే. అ క్రి. గొప్పయగు. రూ- పెంపారు.
పెనుపు, దే. వి. 1. వృద్ధి: చూ, హెచ్చు. 2; 2: చూ, రూ-పెంపు. 5; 3. పెంచుట: చూ, సంరక్షణము.
పెనుమసనము, ద్వ. వి. (పెనుపు + మసనము) కాశి, వారణాసి. కాశీ. 6, ఆ. 124: చూ, సీమ. 1. (దేశము).
పెనుమినుకులు, దే. వి. బ. (పెనుపు + మినుకులు): చూ, వేదము.
పెనుమీసువేఁటరి, ద్వ. వి: చూ, వలతేఁడు. వేం, ఆం. 31.
పెనుమ్రాను, దే.వి. (పెనుపు + మ్రాను): చూ, పెద్దమ్రాను*.
పెనువెల్లి, దే. వి. (పెనుపు + వెల్లి) 1. ప్రళయకాలమునందలి యేకార్ణవము: చూ, వెల్లువ. 2.
పెనుమ్రేలు, దే. వి. (పెనుపు + మ్రేలు): చూ, పెద్దమ్రేలు.
పెన్న, వై. వి.=పినాకినీనది: చూ, పినాకిని. 1.
పెన్నదపలుఁగు, దే. వి(పెన్ + పడపులుఁగు): చూ, లకుముకి.
పెన్నిదుర, వై. వి. మరణము: చూ, సావు.
పెన్నెరు, దే. వి. రూ-పెన్నేరు*: చూ, వారాహకర్ణి.
పెన్నెఱులవాఁడు, ద్వ. వి: చూ, సుకేశుఁడు.
పెన్నేరు, దే. వి: చూ, రూ- పెన్నెరు*. (అవుపాలలో ఉడికించిన శుద్ధి.)
పెన్నేరుగడ్డ, ద్వ. వి.—పై.—
పెన్నొసలు, ద్వ. వి: చూ, లలాటము. సాం. మా. 15.
పెన్షను, వా. వి: చూ, పించను.
పెన్మిటి, దే. వి: చూ, రూ - పెనిమిటి. కళా. 8, ఆ. 138.
పెప్పె, వా. వి. శూన్యము, లేదు.
పెప్పెప్పె, వా. వి. 1. మిక్కిలి శూన్యము; 2. చేతకానివాని మాట. (తెత్తెత్తె - మెమ్మెమ్మె మొదలగునవి ఈ యర్థమందు వాడెదరు.)
పెమ్మె, దే. వి: చూ, రూ—పెరిమె.
పెయ్య, దే. వి. రూ—పేయ. 1. వత్సము: చూ, ధేనువు; 2. పాలువిడిచిన ఆఁడుదూడ: చూ, సౌరభేయి (ధేనువు); 3. ఆవు. ఉ, రా. 5, ఆ. 208: చూ, ధేనువు; 4: చూ, సబ్బుఁడు; 5: చూ, హీనుఁడు.
పెయ్యదూడ, దే. వి: చూ, పెయ్య. 1-2-3.
పెయ్యమ్మ, వా. వి: చూ, వ్రాజె.
పెర, వై. స.=పరః. రూ- పెఱ. 1: చూ, వేఱు. 3. మార్క. 5, ఆ. 76; దే. వి. 2. తేనె తెట్టె పాండు. 1, ఆ. 181: చూ, మధుపటలము.
పెరక, దే. వి: చూ, పించు.
పెరజు, దే. వి: చూ, సర్పము.
పెరటిగుమ్మము, వా. వి. దొడ్డివైపు గుమ్మము: చూ, వాకిలి.
పెరటిమందు, జా. స్వాధీనము.
పెరడు, వై. వి.=పృష్ఠ. (దేశ్యమని శ. ర.) ఇంటి వెనుకదొడ్డి: చూ, స్థానము. 1. (బ. పెళ్లు).
పెరతేనె, వా. వి: చూ, పుట్టతేనె వేం. ఆం. 72.
పెరమ, వై. వి.=ప్రేమ: చూ, రూ- పెరిమ.
పెరయీఁగ, దే. వి. తేనెటీఁగ: చూ, మక్షిక.
పెరయు, వా. స. క్రి: చూ, పెనఁగు. 7.
పెరరేఁచు, వై. స. క్రి. = ప్రేర్. ప్రేరేపణచేయు. (రూ- పెరరేపు—ప్రేచు—ప్రేరేఁచు — పేరేపు — ప్రేరేపించు) జై. 6, ఆ. 215: చూ, రేఁచు. (రేచు అని కొందఱు).
పెరరేపు, —పై.—
పెరవణి, వై. వి. = ప్రేరణ. తాండోపరినృత్యము: చూ, వ్యంజకము. 1.
పెరసు, దే. వి. పొల: చూ, మాంసము.
పెరిమ, వై. వి, = ప్రేమ. (రూ — పెరమ — పెరిమె) వర. 3, ఆ. 127: చూ, స్నేహము. 1.
పెరిమె, వై. వి. 1. —పై.—; 2. రూ- పెమ్మె. స్వా. 3, ఆ. 84: చూ, సన్మానము.
పెరుఁగాకు, దే. వి: చూ, శాకిని. 2. *.
పెరుఁగు, (రూ—పెర్గు—పెరువు—పెర్వు) దే. వి. 1. దధి: చూ, స్తన్యము; 2: చూ, వృద్ధుఁడు; 3. ఏండ్లు చెల్లినది: చూ, వృద్ధ; 4. వృద్ధిపొందినది: చూ, వృద్ధము. 2; అ. క్రి. 5. రూ- పెఱుగు: చూ, వర్ధిల్లు. మార్క. 3, ఆ. 380; 6. ఎదుగు. పాండు. 5, ఆ. 165: చూ, పొడవగు.
పెరుఁగుకడవ, ద్వ. వి: చూ, భాండము. 3.
పెరుఁగుముంత, —పై.—
పెరుఁగుట, దే. వి. 1. తగ్గుట: చూ, వెలితి. 2; 2. ఎదుగుట, వృద్ధి: చూ, హెచ్చు. 2; 3: చూ, వర్ధనము. 1.
పెరుఁగుడు, దే. వి: చూ, పెరుఁగుట. 2—3.
పెరుఁగుతోఁటకూర, దే. వి: చూ, పెరుఁగాకు. *
పెరుఁగుసంద్రము, ద్వ. వి. దధ్యుదము: చూ, సముద్రము.
పెరుకు, దే. అ. క్రి: చూ, రూ-పెర్కు.
పెరుగు, దే. అ. క్రి. తెగు. పా. 4, ఆ. 37: చూ, వ్రక్కవాఱు.
పెరుమాకోయిల, దే. వి. (పెరుమాళ్ళు + కోయిల) కాంచీపురము: చూ, సీమ. 1. (దేశము).
పెరుమాళ్లడుగుబుగ్గ, ద్వ. వి. గంగ: చూ, నది. 1.
పెరుమాళ్ళు, దే. వి. బ: చూ, విష్ణువు. 1. పర. 2, ఆ. 173.

పెరువు, దే. వి. విణ. అ. క్రి: చూ, రూ-పెరుఁగు. (దధికి.—హరి. పూ. 5, ఆ. 206; ఏండ్లు చెల్లినదానికి, ఏండ్లు చెల్లిన వానికి —కాశీ. 2, ఆ 103; వృద్ధిపొందినది అనుటకు.—రాజ. 2, ఆ. 46.)

పెర్కు, దే. అ. క్రి. రూ-పెరుకు-పెఱుకు. 1. పీఁకు: చూ, మెఱుకు; 2. పెల్లగించు: చూ, విదారించు; 3: చూ, వహించు; అం. ప్రే. 4. మోయించు.

పెర్గు, దే. వి. అ. క్రి: చూ, రూ-పెరుఁగు. (వర్ధిల్లుటకు.—విక్ర. 7, ఆ. 50.)

పెర్వు, దే. వి. అ. క్రి.—పై.—(దధికి.-హరి. పూ. 5, ఆ. 198).

పెఱ, దే. వి. 1: చూ, రూ-పెర. 2; పై. స. 2. = పరః. (రూ-పర-పెర-పరాయి) భార. ఆది. 2, ఆ. 67: చూ, వేఱు. 3.

పెఱగాయ, ద్వ. విణ: చూ, వ్యాధుఁడు. 2. శశాం. 3, ఆ. 78.

పెఱమగఁడు. ద్వ. వి. జారుఁడు: చూ, విటుఁడు.

పెఱిక, దే. వి. అంకియము-అంకెము, అందియము-అందెము.

పెఱికాటము, దే. వి. ఎడ్లులోనగువానిచే ధాన్యాదులు మోయించుట.

పెఱుకు, దే. స. క్రి: చూ, రూ-పెర్కు. (మోయించుటకు —భార. సభా. 1, ఆ. 268).

పెఱుకుట, వా. వి. ఉత్పాటనము.

పెఱుగు, దే. అ. క్రి. 1. కడఁగు. భార. ఆది. 6, ఆ. 202; భార. ఆది. 6, ఆ. 147: చూ, సమకట్టు. 2; 2: చూ, విజృంభించు; 3: చూ, రూ-పెరుఁగు. 5.

పెలుకుఱు, దే. అ. క్రి. రూ-పెల్కుఱు; చూ, విహ్వలించు. భార. సభా. 1, ఆ. 118.

పెలుచు, దే. వి. (రూ-పెల్చు-పెలుచన-పెల్చన-పేల్చు-పేల్చన) 1: చూ, హెచ్చు. 2. భార. ఆది. 5, ఆ. 178; 2. అధికము. య. 3, ఆ. 7: చూ, హెచ్చు. 1; 3: చూ, రోషము. భార, విరా. 2, ఆ. 54; స్వా. 4. ఆ. 86; 4. కాఠిన్యము: చూ, బెడిదము; 5: చూ, సంభ్రమము; ద్ర. 6. ఉచ్చైరర్థకము, గట్టిగా. నిర్వ. 3, ఆ. 7.

పెలుచన, దే. వి. ద్ర.—పై.—(కోపమునకు.— హరి. పూ. 1, ఆ. 182; కాఠిన్యమునకు.—హరి. ఉ. 5, ఆ. 149).

పెల్కుఱు, దే. అ. క్రి: చూ, రూ-పెలుకుఱు.

పెల్చు,-దే. వి. ద్ర: చూ, రూ-పెలుచ.

పెల్చన, —పై.—

పెల్ల, దే. వి: చూ, లోష్టము, భూమి. 1-౧౦౦.

పెల్లగించు, దే. ప్రే: చూ, విదారించు.

పెల్లగిలు, దే. అ. క్రి. రూ-పెల్లగిల్లు. 1. ఉన్మూలితమగు: చూ, విదారించు; 2 పాఱు: చూ, పెళ్ళు. 3.

పెల్లగిల్లు,—పై.—(1 వ అర్థమునకు.—రామా. 5, ఆ. 312.)

పెల్లాటకత్తె, వా. వి: చూ, వేశ్య.

పెల్లిదము, ద్వ. వి. (పెల్ల + ఇదము) 1. పెల్లు. భార. విరా. 3, ఆ. 172: చూ, హెచ్చు. 2; విణ. 2. అధికము: చూ, హెచ్చు. 1.

పెల్లు, పై. వి. = పుల. 1: చూ, హెచ్చు 2; విణ. 2: చూ, హెచ్చు. 1.

పెల్లుకొను, ద్వ. అ. క్రి. అతిశయిల్లు: చూ, సందడించు.

పెసర, దే. వి. ఒకానొకసస్యము. (సం ప).—గంధసారము, ముద్గము. (పెసలు. బ. పెసరధాన్యము) తద్విశేషములు. —౧. అడవిపెసర, కారుపెసర — కాఱుపెసర. (సం.) కులీనకము, కృమీలకము, మకుష్ఠకము, మకుష్ఠకము, మయష్టకము—మయష్టకము, వనముద్గము; ౨, కాకి పెసర, కారుపెసర—కాఱుపెసర, పిల్లపెసర—పిల్లిపెసర; (సం).—కాకపర్ణి, కాకముద్గ, కురంగిక, కోశిల, క్షుద్ర సహ, మహాసూపపర్ణి, మార్జాలగంధిక, ముద్గపర్ణి, సహ, హ్రస్వ; 3: కొమ్ముపెసర-కొమ్ముపెసలు. ४: నల్లపెసలు. (సం.ప).-కృష్ణముద్గము, సంతము, శింబికము; ५. పచ్చ పెసర, (సం).—ఖండికము-ఖండీరము, హరితము; ౬: పిప్పపెసర; ౭. పెసరపప్పుసిసు:—(చూ,సూపము); ౮. పెసరపొట్టునకు:—(చూ, బరడు) (మిగతవానికి: "చూ, స్తంబకరి")

పెసరకట్టు, వా. వి. పెసరచారు.

పెసరపప్పు, దే. వి: చూ, పప్పు.

పెసరపొట్టు, వా. వి: చూ, శింబ.

పెసవము, వా. పై. వి. = ప్రసవ: చూ, ప్రసవము. 1.

పెళపెళ, దే. వి. 1. విఱుచుట ఉఱుముట అర్చుట లోనగువాని యందగు ధ్వన్యనుకరణము. (విఱుచుటకు.—ఉ, రా. 7,ఆ. 415; అర్చుటకు—య. 5, ఆ. 81.); 2. ఒకధ్వని: చూ, స్వరము 2.

పెళపెళయను, దే. అ. క్రి: చూ, శబ్దించు. పా. 2, ఆ. 19.

పెళుచు, దే. విణ. 1: చూ, స్తబ్ధుఁడు. పాండు. 4, ఆ. 165; 2. చూ, విరసము. 2.

పెళ్ళమ్రాను, దే. వి. దున్నినపిమ్మట మిట్టపల్లములు సరిపడ మీఁదనీడ్చెడు పలక: (చూ, దిండు. 5).

పెళ్లము, వా. వి: చూ, రూ-పెండ్లాము.

పెళ్ళాము, —పై.—

పెళ్ళి, వా. వి: చూ, రూ-పెండ్లి.

పెళ్ళికూఁతురు, వా. వి: చూ, రూ-పెండ్లికూఁతురు.

పెళ్ళికొడుకు, వా. వి: చూ, రూ-పెండ్లికొడుకు.

పెళ్ళివారు, వా. వి. పెండ్లికివచ్చిన బంధువులు.

పెళ్ళు, దే. వి. 1: చూ, పెళపెళ (విఱుచుటకు-వారి. పూ. 6. ఆ. 84.); బ. 2: చూ, పెరడు.

పెళ్ళెము, వి. మద్యముచేయుటకు అనేకవస్తువులుచేర్చి చేసిన పిండి, మేదకము; 2: చూ, కిణ్వము. *.

## పే

పేఁట, పై. వి. = పింతా: చూ, పెంట. 4—5. (5 వ యర్థమునకు.-ప్ర. 4, ఆ. 132.)

పేఁటు, దే. వి: చూ, పగులు. 1.
పేఁడ, దే. వి: చూ, రూ-పెండ.
పేఁడకట్ట, వా. వి. (ఒకసారి వెలువరించిన) పేఁడముద్ద.
పేఁడగుప్ప, దే. వి: చూ, సురటీ.
పేఁడనీళ్ళు, దే.వి. బ. రూ-పేన్నీళ్లు. కలయంపి: చూ, సలిలము.
పేఁడపురుగు, ద్వ. వి: చూ, పురుగు.
పేఁడు, దే. స. క్రి. దారముపేను, పురిపెట్టు.
పేక, దే. వి. 1. వస్త్రములనేఁతయందలి యడ్డనూలు: చూ, మగ్గము; వా. 2. చీట్లపేక (ఇందలి రకములు — అరఖు, ఇస్పేటు, కళావరు, డైమాను).
పేగు, దే వి: చూ, రూ-ప్రేవు.
పేచకము, సం. వి. అ. పుం. 1: చూ, పకినంపుఁ బులుఁగు; 2. ఏనుఁగు తోఁక మొదలు: చూ, హస్తి; 3. దాని సమీపము.
పేచకి సం. వి. ఇ. పుం: చూ, హస్తి.
పేచిక, దే. వి. ఒకచెట్టు: చూ, వృక్షము.
పేచిలము, సం. వి. అ. పుం: చూ, పేచకి.
పేచీ, వా. వి. తగవు.
పేచీకోరు, వా. వి. కలహశీలుఁడు: చూ, లడాయిగాఁడు.
పేజి, వా. వి: చూ, పుట.
పేట, సం. వి. ఆ. స్త్రీ. 1. = పెట్టె (రూ-పేటము-పేటి-పేడ): చూ: సందుకా; దే. వి. (1) యష్టి: చూ, భూషణము. 2.
పేటకము, సం. వి. అ. న. = పెట్టె: చూ, పేట. 1.
పేటనఁబెట్టు, ద్వ.అ. క్రి: చూ, సమకట్టు. 2. కళా. 6, ఆ.83.
పేటాడు, దే. అ. క్రి: చూ, వేఁటుపడు.
పేటాపన, వా. వి. దురాలోచన.
పేటి, సం. వి. ఈ. స్త్రీ. 1. = పెట్టె: చూ, పేట. 1; వై. వి. = పట్టా. రూ-పేటీ. (1) నడికట్టు: చూ, వస్త్రము (దేశ్యమని శ. ర.)
పేటిక, సం. వి. ఆ. స్త్రీ. 1. = పెట్టె: చూ, పేట. 1; 2: చూ, సమూహము.
పేటీ, వై. వి. = పట్టా: చూ, రూ-పేటి. (1) దేశ్యమని (శ.ర.)
పేటు, దే. వి. 1. సరిగలోనగువానితో నేసినపట్టె: చూ, వస్త్రము; 2. పర్వతశిఖరము: చూ, హిమాలయము.
పేడి, వై. వి. = షండః. భార. సభా. 2, ఆ. 14: చూ, సొవిదల్లుఁడు.
పేడితనము, వై. విశే. ఉబ: చూ, షండత్వము.
పేడు, దే. వి. 1. సన్ననికఱ్ఱచెక్క: చూ, సమిధ. 1; 2. వంటకట్టియ: చూ, సమిధ. 2.
పేడె, వై. వి. 1. = పేటి: చూ, పేట. 1; విశే. 2. తూబరుఁడు: చూ, సొవిదల్లుఁడు.
పేడెమూతి, వై. వి. గడ్డము మీసము లేనిది; చూ, వదనము.1.
పేడెత్తు, దే. అ. క్రి: చూ, విరియు. 5. స్వా. 2, ఆ. 38.
పేణి, వై. వి. = పేనికా: చూ, భక్ష్యము.
పేద, వై. వి. 1: చూ, భటుఁడు. 1. సా. 2, ఆ. 34; విశే. 2. = భీరుః: చూ, పెఱపరి. స్వా.4, ఆ. 105; 3. దరిద్రుఁడు. విక్ర. 2, ఆ. 171: చూ, బీదవాఁడు; 4. అశక్తుఁడు. భార. అర. 2, ఆ. 166: చూ, శాతుఁడు.
పేదకోపము పెదవులచేటు, లో. నిరుపయోగము-కళా.6,ఆ.30.
పేదరాలు, వా. వి. దరిద్రురాలు: చూ, స్త్రీ.
పేదర్మి, ద్వ. వి. రూ-పేదఱిమి. 1. దరిద్రము. పంచ. నా. 5, ఆ. 35: చూ, సీదరము. 1; 2: చూ, వెఱపు.
పేదఱికము, ద్వ. వి. దారిద్ర్యము. విక్ర. 2, ఆ. 176: చూ, సీదరము. 1.
పేదఱిమి, ద్వ. వి: చూ, రూ-పేదర్మి.
పేదవడు, వై. అ. క్రి. 1. దారిద్ర్యమునుపొందు. భార. ఉద్యో. 2, ఆ. 42; 2. వైర్యమునుపొందు.
పేనా, వా. వి. కలము: చూ, లేఖిని.
పేనిక, సం. వి. ఆ. స్త్రీ. = పేణి: చూ, భక్ష్యము.
పేను, దే. వి. 1: చూ, యూకము; స. క్రి. 2: చూ, పేఁడు.
పేనుకొఱుకుడు, దే. వి: చూ, బట్టతల.
పేనుగ్రుక్కినపాటి, జా. తేలికగా, స్వల్పకాలములో. "పేను గ్రుక్కినపాటిగా నిష్టమైన యర్థమెల్లఁ బడసి" (ప్రభావతీ ప్రద్యుమ్నము.)
పేనుగ్రుడ్డు, దే. వి: చూ, వీక.
పేనుపిల్ల, —వై.—
పేన్నీళ్లు, ద్వ. వి. బ. (పేఁడ + నీళ్ళు): చూ, రూ-పేఁడనీళ్ళు.
పేపజువ్వ, వా. వి: చూ, వేత్రము. 1.
పేపపొద, దే. వి. వేత్రగుల్మిని*: చూ, వేత్రము. 2.
పేపబెత్తము, వా. వి: చూ, పేపజువ్వ.
పేపర, దే. వి. ఒకపక్షి: చూ, పక్షి.
పేము, దే. వి. రూ-ప్రేము: చూ, వేత్రము. 2.
పేముబొద్దు, దే. వి. గోడబొద్దు, గోలు.
పేయ, దే. వి: చూ, రూ-పెయ్య. 1-2-3.
పేయగంజి, వా. వి. మెతుకులుగలగంజి: చూ, సాదము. (1).
పేయము, సం. వి. అ. న. 1. నీరు: చూ, సలిలము; 2. పాలు: చూ, స్తన్యము; పుం. 3. అచ్చపుఁదేట: చూ, శుద్ధము. 3; 4. వెలవ, కాఁపుడుగంజి: చూ, సాదము. (1); విశే. 5. త్రావఁదగినది: చూ, పానీయము.
పేయూషము, సం. వి. అ. న: చూ, రూ-పీయూషము.
పేరంగి, వా. వి. 1. కత్తి: చూ, రిష్టి. 2; 2: చూ, రూ-పిరంగి. 4.
పేరంటము, వా. వి: చూ, రూ-పేరంట్రము.
పేరంటాలు, వా. వి: చూ, రూ-పేరఁటాలు.
పేరంట్రము, దే. వి. రూ-పేరంటము-పేరఁటము. 1. పసుపు బొట్టులకు ముత్తైదువులఁ బిలుచుట. హరిశ్చ. 4, ఆ. 138; 2. పసుపు బొట్టులకు ముత్తైదువు వచ్చి చేయుకార్యము.
పేరఁటము, —వై.— (1 వ యర్థమునకు.—కళా. 7, ఆ. 59; 2 వ యర్థమునకు.—హరి. ఉ. 8, ఆ. 257.)
పేరఁటలు, దే. వి: చూ, రూ-పేరఁటాలు.
పేరఁటాలికూర, వా. వి. ఒకకూరాకు.
పేరఁటాలు, దే. వి. (రూ-పేరంటాలు-పేరఁటలు) 1. పేరఁటమునకు వచ్చిన ముత్తైదువ. కళా. 7, ఆ. 70: చూ, స్త్రీ; 2. మృతసువాసిని, జక్కిణి: చూ, స్త్రీ.

బీజాక్షరములు, అం. (హ్రాం—హ్రీం—హ్రూం—హ్రయాం—హ్రౌం—హ్రః): చూ, మంత్రము. 1. (బీజాక్షరములు పెక్కు రీతుల నుచ్చరింతురు.)

బీజావాపము, సం. వి. అ. న. విత్తుట, ఉప్తి: చూ, వెద. 2.

బీజావాపితము, సం. విణ. ఉప్తము: చూ, భూమి. 1.

బీజోదకము, సం. వి. అ. పుం: చూ, వడగల్లు.

బీజ్యుఁడు, సం. విణ: చూ, సత్కుల ప్రసూనుఁడు.

బీటినేల, వా. వి. చిరకాలమునుండి దున్నని నేల: చూ, భూమి. 1.

బీటిసరులు, వా. వి. బ: చూ, ధాన్యము.

బీడు, దే. వి. 1: చూ, బీటినేల; 2. మట్లమైన యినుము (కాఁకరపువ్వువత్తులలోని మందులో బీడు కలిపెదరు): చూ, లోహము. 1; విణ. 3. నికృష్టము: చూ, హీనము 1; 4. ఉత్త: చూ. శూన్యము. 1.

బీతు, వై. వి. = భీతి: చూ, సాధ్వసము.

బీతుకొను, ద్వ. అ. క్రి. భయపడు. పు 2, ఆ. 82: చూ, ప్రుక్కు. 8.

బీద, వై. విణ. 1: చూ, సన్న్యాసి; 2: చూ, బీదవాఁడు; 3: చూ. పేదరాలు; విణ. 4. = భీత. భయము నొందినది: చూ, భీతము.

బీదతనము, వై. వి: చూ, సీదరము. 1.

బీదలపెనుబాద, ద్వ. వి: చూ, వాయువు. సాం. దే. 13.

బీదవాఁడు, వా. వి: గాలిగ్రుడ్డు, గుల్లకాఁడు, పంజె, పరికట్టె, పేద, బికారి—బికాసి, బీద, బొబ్బలగొట్టు, బక్క, బ్రక్క, లొల్లెగాఁడు. (పం.)—అకించనుఁడు, అభావుఁడు, అర్థహీనుఁడు, ఇత్వరుఁడు, ఋ, కంతేరుఁడు, కటుంబుకుఁడు. కాకరూకుఁడు—కాకలూకుఁడు, కీకటము, కీనాశుఁడు, క్షుల్లకుఁడు, ఖ, ఖిద్రుఁడు, జాయాజీవుఁడు, జాయానుజీవుఁడు, దరిద్రుఁడు, దీనుఁడు, దుర్గతుఁడు, దుర్విధుఁడు, నిర్గ్రంథుఁడు, నిర్ధనుఁడు, నిర్భర్త్సితుఁడు, నిస్స్వకుఁడు, నిస్స్వుఁడు భీతుఁడు. తద్వి.— ౧. మికిలి బీదకు.— ఇరుపేద–నిఱుపేద, బుక్కాపకీరు. ("చూ, లొల్లెగాఁడు.")

బీభత్సము, సం. వి. అ. పుం: చూ, రసములు.

బీభత్సుఁడు, సం. వి. అ. పుం. 1: చూ. సుభ్రదేశుఁడు; విణ. 2. వికారము గలవాఁడు: చూ, వెఱ్ఱి. 5; 3 క్రూరుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 4. కనికరముగలవాఁడు: చూ, సురతుఁడు.

బీర, వా. వి: చూ, బీఱ*.

బీరజము, వై. వి.= బీజ: చూ, బీజము. 3.

బీరతీఁగె, ద్వ. వి. కోశాతకీలత*: చూ, బీఱ.

బీరనరము, వా. వి: చూ రూ-బీఱనగము. (శ. పా.)

బీరము, వై. వి.= వీర్యమ్. 1: చూ, శౌర్యము. 1; 2: చూ, హుంకారము.

బీరాజు, వా. స. క్రి. తుడిచికుప్పచేయు.

బీరింగు, వా. వి: చూ, నటుపెయిద్దు.

బీరిజము, వై. వి. = బీజ: చూ, బీజము. 3.

బీరు, వా. వి. 1. అతిశయము: చూ, హెచ్చు. 2; 2. ఒక రకము సారాయము: చూ, సుర. 2.

బీరువ, వా. వి. రూ-బీరువా. లోపల అంతస్తు లమర్చిన పొడవగుపెట్టె: చూ, సందుకా. (అలమారునకు.— చూ, సందుకా)

బీరువా, వా. వి —పై.—

బీఱ, దే. వి. రూ-బీర*: చూ, హ్రస్వాంగఫేఘక; విణ. 2. పెద్ద. "బీఱెండ": చూ, సుర. (3).

బీఱనరము, వా. వి. రూ-బీరనరము: చూ, సిర. 1.

బీఱు, దే విణ: చూ, వ్యర్థము. "బీఱువడు."

బిఱువడు, ద్వ. అ. క్రి: చూ, వ్యర్థమగు. హరి. ఉ. 3, ఆ. 8.

బీఱువాఱు, దే. అ. క్రి. —పై.—

బీఱువోవు, 1.—పై.—; 2. బెండువడు: చూ, వలియు. 2.

## బు

బుంగ, దే. వి: 1. చిన్నమూతిగలకుఁడ: చూ, భాండము. 3; వా. 2. బుట్ట: చూ, సజ్జ. 1.

బుంగనామము, దే. వి. నడుమ ఎడములేక తీర్చిన తిరుమణి: చూ, బొట్టు. 1.

బుంద్రము, వా: వి. గుడ్లగూబ: చూ, సకినంపుఁబులుఁగు.

బుకము, సం. వి: అ. పుం: చూ, రూ-బకము. 2. *.

బుకాయించు, వా. స క్రి: చూ, బనాయించు. 2.

బుకాయింపు, వా. వి: దమాయింపు.

బుక్క, దే. వి. రూ-బుక్కా-బుక్కాము: చూ, సురుము.

బుక్కనము, సం. వి. అ. న. కుక్కకూఁత: చూ, స్వరము.2.

బుక్కము, సం. వి: న్. న, అ. పుం. 1. శౌర్తితమునందు ప్రసిద్ధమైన మాంసము: చూ, శుక్తము. 2; 2. మేఁక పోతు: చూ, మేషము. 1.

బుక్కా, దే. వి: చూ. రూ-బుక్క.

బుక్కాపకీరు, వా. వి. 1: చూ, బీదవాఁడు: 2.ఒకానొకతురక.

బుక్కాము, దే. వి. 1: చూ, రూ-బుక్క. స్వా. 3, ఆ. 84; 2. పుప్పొడి: చూ, సుమనోరజము.

బుక్కావాఁడు, దే. వి. గంధవాడి లోనగునవి యమ్మెడువాఁడు.

బుక్కింగుఆఫీసు, వా. వి. టిక్కెట్లుఅమ్మెడుచోటు.

బుక్కు, వా. వి. హొత్తము: చూ, సంపుటము. "ఎకాంల బుక్కు."

బుగడ, దే. వి. ఆఁడుదానికొన చెవినగ. రూ-బొగడ: చూ, భూషణము. 2.

బుగబుగ, దే. వి: బుగులు కొనుట యందగు ధ్వన్యనుకరణము. కళా. 2, ఆ. 78: చూ, హాహాహూ.

బుగులు, దే. వి: చూ, రూ-గుబులు.

బుగులుకొను, దే. అ. క్రి. 1. గుబాళించు. వర. 3: ఆ. 239: చూ, వలచు, 1; 2: చూ, వ్యాపించు. కాశీ: 6. ఆ. 240; 3: చూ, విజృంభించు అచ్చ. యు. కాం. 280; 4. వీటి

బొట్టులోనగునవి లోపలనుండి పైకుబుకు. జై. 6. ఆ. 197: ఉప్పొంగు, ఒడ్డగిలు—ఒడ్డగిల్లు; చిదుకు, చిప్పిలు-చిప్పిల్లు. నిగుడు—నివుడు, పిచ్చిలు—పిచ్చిల్లు.

**బుగులుపుచ్చు,** దే. ప్రే: చూ, బయలుపఱచు.

**బుగులుపోవు,** దే. అ. క్రి: చూ, బయలుపడు.

**బుగులుబుగులు,** దే. వి. క్రక్కుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హుహూ.

**బుగ్గ,** దే. వి: చూ, రూ- ప్రక్క. 1—2—3. వా. 4-బుగ్గ. యింటిపేరుగాఁగలవారు. "బుగ్గావారు".

**బుగ్గి,** దే. వి. 1. బూడిద: చూ, భస్మము; 2. ధూళి: చూ, రేణువు. 1.

**బుచ్చి,** దే. విణ. చిన్న: చూ, స్వల్పము.

**బుచ్చిగాఁడు,** దే. విణ: చిన్నవాఁడు.

**బుచ్చివాఱు,** దే. అ. క్రి: చూ, విన్నవోవు.

**బుజ్జ,** దే. వి. 1. కుండలీకరణము: చూ, సున్న. 1; వై. వి. 2. = భుజ. రూ-బుజము: చూ, స్కంధము. 1.

**బుజపత్తిరి,** వై. వి. = భుజపత్ర. *: చూ, లేఖనము. 3.

**బుజపత్రి,** వై. వి.=—వై.—

**బుజము,** వై. వి. = భుజ: చూ, రూ-బుజ. 2.

**బుజముపుట్టువు,** ద్వ. వి. రాచవాఁడు. ఆచ్చ. బాల, కాం.123, చూ, రాజు. 1.

**బుజముబుజముకలుపుట,** జా. కార్యమునకు సహాయమగుట; సవారిమోయువాఁడొకఁ డెగుబుజము మఱియొకఁడు దిగుబుజము వేయక సరిగాపట్టుట. "ఎన్నిగతులఁజూచిన దమరా వెన్నునితో బుజముబుజము గలుపుటయేమేలు." (ధర్మజ రాజసూయము).

**బుజగము,** దే. వి. 1. ఇచ్చకము, ఉపలాలనము, చూ, సమవనము. 2; విణ. 2. మిక్కిలి మధురమైనది: చూ, సాంత్వము. 2.

**బుజ్జగించు,** దే. అ. క్రి: అచ్చికబుచ్చికలాడు, ఇచ్చకమాఁడు, చలివాపు, పుసలాయించు, బెల్లించు, బెల్లించుకొను. (సం)-ఉపలాలించు.

**బుజ్జగింత,** దే. వి: చూ, బుజ్జగము. 1—2.

**బుజ్జగింపు,** దే. వి:—వై.—

**బుజ్జగింపుమాట,** వా. వి: చూ, బెల్లింపుమాట.

**బుజ్జనము,** దే. వి: చూ, రూ-బుజ్జగము. 1—2.

**బుటా,** వా. వి. వస్త్రములమీఁద వేయుపువ్వు.

**బుటుకు,** దే. వి. రూ-బుటుకుక్క. మునుగుటయందగు ధ్వన్యనుకరణము. పాండు. 5, ఆ. 283: చూ, హుహూ.

**బుటుక్కు,** దే. వి.—వై.—

**బుట్ట,** వై. వి. = పుట: చూ, సజ్జ. 1

**బుట్టి,** —వై.—పాండు. 2. ఆ. 17.

**బుట్టిక,** —వై.—

**బుతేత్రివు,** వా. వి: చూ, బుంద్రము. ఆం, పదా ౯—96

**బుడక,** వా. వి: రూ-బుడుక చూ, స్నానము.

**బుడకోడి,** ద్వ. వి. నీరుకోడి: చూ, పుంజు.

**బుడగ,** దే. వి: చూ, బుగ్గ.

**బుడబుడ,** దే. వి: నీళ్లలోనుండివెడలుట, క్రక్కుట, పొక్కుట, పొక్కుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హుహూ. (నీళ్ళలోనుండి వెడలుటకు.—స్వా. 4, ఆ. 17; క్రక్కుటకు.—భాగ. 3: స్కం. 702.)

**బుడమ,** దే వి: 1. (సం).—గవాక్షి, క్షుద్రఫల, గోతుంబ, గోపాలకర్కటి, గోపాలి, చిత్ర, మృగోర్వారువు; కద్వి.-౧. కారుబుడమకు. (సం).—తీవ్రగంధము; ౨. రామబుడమకు.— (చూ, రామబుడమ) 3. ఉర్వారుకము-ఉర్వారువు, ఊర్వారుకము. పాటుకము. (తె) కూఁతురుబుడమ. బ. 2. బుడమవడ్లు: చూ, ధాన్యము.

**బుడము,** దే వి: చూ, మొదలు. 4.

**బుడికిస్సు,** దే. వి: చూ, బాలక్రీడ.

**బుడిగ,** దే. వి: 1; ఎద్దుమీఁది యొకవైపుసిద్దె: రూ-బుడిగె; 2. పిడత: చూ, పాత్రము. 6.

**బుడిగి,** దే. విణ: చూ, రూ-బుడుగు.

**బుడిగె,** వా. వి: చూ, రూ—బుడిగ. 1.

**బుడిపి,** దే. వి: రూ-బుడ్పి. 1. బొడప. మానియందలి ముడి: చూ, ముడుత; 2. కమండలము: చూ, పాత్రము. 6-౫౩; 3: చూ, బొప్పి; 4. చెఱకులోనగువాని కనుపు: చూ, బుడిపి. 1; 5: చూ, శిరోగ్రీవము.

**బుడిబుడిదీర్ఘములు,** వా. వి. బ. దొంగదొంగయేడ్పులు. (ఉత్తరసర్కారులలో వాడుక.)

**బుడిబుడిపి,** దే. వి. 1: చూ, సంభ్రమము. వసు, 4, ఆ. 65; విణ. 2: చూ, స్వల్పము.

**బుడిబుడుక్క,** వా. వి: చూ, రూ-బుడుబుడుక్క.

**బుడివడు,** ద్వ. అ. క్రి: చూ, సంభ్రమించు. ఉ. హరి. 6, ఆ. 164.

**బుడుక,** దే. వి: చూ, రూ-బుడక.

**బుడుకు,** దే. వి. బ: చూ, భక్ష్యము. కాశీ. 7, ఆ. 186.

**బుడుగు,** దే. విణ. పొట్టి: చూ, హ్రస్వము.

**బుడుత,** దే. వి. రూ-బుడుతఁడు. 1. బిడ్డ: చూ, శిశువు; 2. బాలుఁడు: చూ, శిశువు; విణ. 3. పొట్టి: చూ, బుడుగు; 4: చూ, వామనుఁడు. 2.

**బుడుతఁడు,** దే. వి: చూ, రూ-బుడుత. 1—2. (బాలునికి.-ఉ, రా. 6, ఆ: 190.)

**బుడుతనెలతాల్పు,** ద్వ. వి: చూ, శివుఁడు. ఆం. దేవ. 6.

**బుడుబుడుక్క,** దే. వి. రూ-డుబుడక్క: హుడుక్క: చూ, పీఱ.

బుడుబుడుక్కవాఁడు, దే. వి: చూ, పౌవలీఁడు.
బుడుబుడుక్కలవాఁడు, దే. వి. —పై—
బుడుమ, దే. వి: చూ, రూ-బుడమ.
బుడ్డ, దే. వి, 1: చూ, వట్టవాఁపు ; 2. నీరుకాయ : చూ, స్ఫోటము. 2.
బుడ్డకాయలు, వా. వి. వేరుసెనగ కాయలు. (రాయల సీమలో వాడుక)
బుడ్డకొట్టు, వా. స. క్రి : ఎద్దుపట్టు, పిడిగొట్టు. (వి. అండాకర్షణము)
బుడ్డగించు, దే. అ. క్రి : కోరాడు, కోరు.
బుడ్డగింపు, దే. వి. బుడ్డగించుట.
బుడ్డవక్కె, దే. వి: చూ, మత్స్యము. 1.
బుడ్డపిడుఁడు, దే. వి. పశువుల మేననంటికొని రక్తముపీల్చెడి జంతువిశేషము. తద్వి.—౧. అంబారుపిడుఁజు, కొణుఁజు—కొణుఁడు—కొనుఁదురు, గోమారి ; ౨. చెక్క కొణుఁజు—చెక్క కొణుఁదురు—చెక్క పిడుఁజు, పిడుఁజు—పిడుఁదు పిణుఁదు ; (సం.)—బృహదసృఙ్మూర్తి ; ౩. జలగ—జెలగ, నల్లద్రాగుడు—నల్లద్రావుడు. (సం.)—అర్కృస్సు, ఉరగము, కారుండి, జలమక్షిక, జలసూచి, జలాటని, జలూక—జలౌక—జలౌకస—జలౌకసము, ఝల-ఝూలి, పటాలుక, వేణివేధిని ; ౪. ఏనుఁగుజలగ. (సం.)–గిరిక, దీర్ఘకోశిక, దుర్నామ ; ("చూ, వేణివేధిని.")
బుడ్డబుడుసర, దే. వి. రూ-బుడ్డబూసర, కాఁచర—కాఁజర—కాసర. (సం.)—కాళహర*.
బుడ్డబూసర, వా. వి.—పై.—
బుడ్డవాఁడు, దే. వి. అండవృద్ధి గలవాఁడు.
బుడ్డి, దే. వి. చిన్నమూతిగల నిడుపాటి కాచపాత్రము : చూ, పాత్రము. 6—౧౩ ; 2. కమండలము : చూ, పాత్రము. 6—౫౩.
బుడ్డిగ, —పై.—
బుడ్పి, దే. వి : చూ, రూ-బుడిపి.
బుత్త, వా. వి. అఁడుగుటి. పౌం. మా. 19: చూ, భగము. 12.
బుత్తి, వై. వి. =భుక్తి, తిండి, నీలా. 1. ఆ. 118 : చూ, సాపాటు.
బుదవారము, వై. వి. =బుధవాసర, సౌమ్యవారము, పెద్ద వారము : చూ, వారము : వారము. 2.
బుదుఁడు, వై. వి. =బుధ. 1 : చూ, నెలమాలి ; 2. పండితుఁడు : చూ, విద్వాంసుఁడు ; 3 : చూ, వేలుపు.
బుద్ది, వై. వి =బుద్ధి. 1. మతి. అచ్చ. సుం. కాం. 12 : చూ, హృల్లేఖము. 2; అం. 2: చూ, మానసిక పూజాకుసుమములు.
బుద్దిమెకము, వై వి. నక్క: చూ, సృగాలము.
బుద్దుఁడు, వై. వి. =బుద్ధ: చూ, బుద్ధుఁడు.
బుద్బుదము, సం. వి. అ. పుం. = బుద్బురము. 1. నీరుబుగ్గ : చూ, స్ఫోటము. 2; 2. గర్భమునందలి అవయవ విశేషము.
బుధవారము, సం. వి. అ. పుం. = బుదవారము : చూ, బుధవారము.
బుధితము, సం. విశ. తెలియఁబడినది: చూ, వ్యక్తము. 2.
బుధుఁడు, సం. వి. అ. పుం. = బుదుఁడు: చూ, సౌమ్యుఁడు.
బుద్ధము, సం. విశ: చూ, బుధితము.
బుద్ధావతారము, అం: చూ, అవతారములు. (ప్రజలందఱును వేదమార్గములను, నీతిని విడిచిరి. జీవహింసల కలవాటుపడిరి. ఇదిచూచి సహింపలేక అహింసను బోధించుటకై దేవుఁడు బుద్ధుండై పుట్టెను. ఇదియె బుద్ధావతారము) (చూ, బుద్ధుఁడు.)
బుద్ధి, సం. వి. ఇ స్త్రీ = బుద్ది: చూ, బుద్ది. 1-2. (అంతఃకరణ వృత్తులు నాలుగింటిలో నొకటి. ఇది పంత, మేధ, చార్వి, గృహీతి, శ్రౌతి, చత్వరి అని ఆఱువిధములు.)
బుద్ధిగుణములు, అం. శుశ్రూష, శ్రవణము, గ్రహణము. ధారణము, ఊహము, అపోహము, అర్థవిజ్ఞానము, తత్త్వజ్ఞానము.(8)
బుద్ధిపెడతలఁబట్టుట, జా. బుద్ధిచెడుట. "పెద్దతనముఁబోయి బుద్ధి పెడతలఁబట్టెన్." తార. 4, ఆ. 15 ; "ఉపిదలకు బుద్ధి పెడతలనుండుఁగాదె," పాండు 3, ఆ. 81.
బుద్ధిమంతుఁడు, సం. విశ. (హిం. అకోల్) (ఫా = అకిల్ మంద్) : చూ, సహృదయుఁడు.
బుద్ధిహీనుఁడు, సం: విశ: అక్కుపక్కి.
బుద్ధుఁడు, సం. వి. అ. పుం.=: అక్షచరణుఁడు, అద్వయవాది, అభిమానుఁడు, అర్కబంధువు, అష్టుఁడు, అసముఁడు, కనిష్ఠగుఁడు, కరుణాకూర్చుఁడు, కారభూషణుఁడు, కులిశాసనుఁడు, కేవలి, ఖసముఁడు, గుణాకరుఁడు, గోపీశుఁడు, గౌతముఁడు, చైత్యుఁడు, జితార్తి, జినుఁడు, తథాగతుఁడు, తమోఘ్నుఁడు, తమోపహుఁడు, తాపి, త్రిమూర్తి త్రిశరణుఁడు, తీర్థంకరుఁడు,—తీర్థకరుఁడు, దశబలుఁడు దశభూమీశుఁడు, దశార్హుఁడు, ద్వాదశాక్షుఁడు, ధర్మకాయుఁడు, ధర్మచక్షుఁడు, ధర్మధాతువు, ధర్మరాజు, నగ్నుఁడు, పంచజ్ఞానుఁడు, బహుక్షముఁడు, భవంతుఁడు, భగవానుఁడు, మహాబలుఁడు, మహాబోధి మహాముని, మహాసుఖుఁడు, మాయాదేవీసుతుఁడు, మాయాసుతుఁడు, మారజిత్తు, ముని, మునీంద్రుఁడు, మైత్రీబలుఁడు, రాగళని, లోకజిత్తు, వజ్రి, వినాయకుఁడు, విశ్వబోధుఁడు, వీతరాగుఁడు, వ్యోమాభుఁడు, శంభువు, శాక్యముని, శాక్యసింహుఁడు, శాస్త, శౌద్ధోదని, శ్రీఘనుఁడు, శ్వేతకేతుఁడు, షడభిజ్ఞుఁడు, సంగుప్తుఁడు, సంబుద్ధుఁడు, సమంతభద్రుఁడు, సర్వజ్ఞుఁడు, సర్వదర్శి, సర్వార్థసిద్ధుఁడు, సాధువు, సుగతుఁడు, సునిశ్చితుఁడు, సుభాషితుఁడు: (చూ, సన్న్యాసి); తద్విశేషములు.- (౧) బుద్ధభేదములు.— అనంతుఁడు, అవలోకితుఁడు, అసితాభశేఖరుఁడు, అహ్రీకుఁడు, అవీచదర్శి, కన్యారాముఁడు, కారండవ్యూహుఁడు, కీరకుఁడు, కుంథువు. కృపాద్వైతుఁడు, క్షపణకుఁడు, క్షపణుఁడు, ఖజిత్తు, ఖసర్పణుఁడు, గుణసాగరుఁడు, చక్రసంవరుఁడు, చింతామణి, జంభలుఁడు, జటాధరుఁడు, జినుఁడు, పద్మ

పాణి, పోతలకప్రియుఁడు, బహురూపుఁడు, బౌద్ధుఁడు, భిన్నకుఁడు, మహాశ్రమణుఁడు, మహావీర్యుఁడు, లోకనాథుఁడు, లోకేశుఁడు, లోకేశ్వరుఁడు, వజ్రసూర్యుఁడు, వైనాయికుఁడు, సరోజి, సుఖావతీశ్వరుఁడు. సుధావర్షి, హలాహలుఁడు. మజ్జిన్ని ౧. కబౌద్ధుఁడు: ౨. బౌద్ధమతస్థుఁడు.- కీరకుఁడు, క్షపణకుఁడు; ౩. బౌద్ధభిక్షుఁడు.—చీవరి, ౪. బౌద్ధబ్రాహ్మణుఁడు.—చైత్యుఁడు; ౫. బుద్ధశక్తివిశేషము.—కులిశాంకుశ, ఖదూరబుసిని.మహాశ్రీ; ౬.బుద్ధుని శిష్యులు.—ఏకచారిణుఁడు, ఖడ్గుఁడు, ప్రత్యేక బుద్ధుఁడు, సుదంతుఁడు, స్వయంభువు: ౭. బుద్ధభిక్షుకశిష్యులు.—గోమి, చేలుకుఁడు, వైత్రుఁడు, మహాపాసకుఁడు, శ్రమణేరుఁడు; ౮. బుద్ధునితల్లి—గౌరిపోత్రి, త్రిముఖ, రథాచన, మారాచి, వజ్రమూలిక, వజ్రవారాహి, వికట; ౯. పూర్వజైన విశేషము.—అష్టార చక్రవంతుఁడు, కుమారుఁడు, ఖడ్గీ, జ్ఞానదర్పణుఁడు- జ్ఞానదర్పుఁడు, దండి, ధియాంపతి, నీలుఁడు, నీలోత్పలి, పంచవీరుఁడు, పూర్వజినుఁడు, ప్రజ్ఞాకాయుఁడు, బాలవ్రతుఁడు, మంజుఘోషుఁడు, మంజుభద్రుఁడు, మంజుశ్రీ, మహారాజు, వజ్రధరుఁడు, వాగీశ్వరుఁడు, వాదిరాట్టు, విభూషణుఁడు, శార్దూలవాహనుఁడు. శిఖాధరుఁడు, సింహకేశి, స్థిరచక్రుఁడు: (చూ, సన్న్యాసి.); 2: చూ, విద్వాంసుఁడు; విశ. 3. తెలియఁబడినవాఁడు.

బుధ్నము, సం. వి. పుం. 1. బ్రధ్నము: చూ, వేరు. 1; 2. ఊడ: చూ, శిఫ. 1.

బుధ్నుఁడు, సం. వి. అ. పుం: చూ, శివుఁడు.

బుబ్బురము, వై. వి.=బుద్బుద; చూ, బుద్బురము. 1.

బుభుక్ష, సం. వి. ఆ. స్త్రీ: 1. అశనాయ, క్షౌరిక, క్షుతము, క్షుత్తు, క్షుధ, జిఘత్స భోగపిశాచిక. (తె.)—అంగద, ఆఁకలి, ఆఁకొంట, గొద, పసి. తద్వి.—మిక్కిలి క్షుత్తునకు. —(తె.)—అట్టాఁకలి.

బుభుక్షితఃకిం, నకరోతిపాపమ్, న్యా. ఆఁకలిగొన్నవాఁ దేపాపము జేయఁడు? "ఆఁకలిగొన్న కరణము పాఁతకవిలె చీసినాఁడు" అని ఆంధ్రజాతీయము.

బుభుక్షితః, కింద్వికరేణభుం క్తే? న్యా. ఆఁకలిగొన్నవాఁడు రెండుచేతులతో దినునా?

బుభుక్షితుఁడు, సం. విశ: అశనాయితుఁడు, క్షుధితుఁడు, జిఘత్సువు. (తె.)—ఆఁదనైనవాఁడు, ఆఁకొన్నవాఁడు.

బుభుత్స, సం. వి. ఆ. స్త్రీ. బోధగొననిచ్ఛ: చూ, వాంఛ.

బుయ్య, దే. వి: చూ, బుత్త.

బుయ్యారము, దే. వి: చూ, బంధనాలయము.

బురక, వా. విశ: చూ, వామనుఁడు.

బురకఁడు, వై. వి.=పుత్రక: చూ, సూనుఁడు. 1.

బురకా, వా. వి. గవుసెన: చూ, వస్త్రము.

బుర్జీ, దే. వి. చిఱుగజ్జె: చూ, భూషణము. 2.

బుర్దా; వా. వి: చూ, రూ-బురుదా.

బురద, దే. వి: చూ, పుబ్బలి.

బురదకమ్మి, ద్వ. వి. గడపక్రిందికమ్మి.

బురదఁగొట్టు, వా. అ. క్రి. బురదలో చిక్కుకొను.

బురదపాము, దే. వి. నీరుకట్టె: చూ, సర్పము.

బురబుర, వా. వి. 1. రొంపపట్టుట; 2. పొంగుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

బురబురలాడు, వా. అ. క్రి: చూ, బుసబుసలాడు. 2.

బురమా, వా. వి: చూ, పిడిసాన.

బురికి, వా. వి: చూ, వామనుఁడు.

బురుక, బు. వి. 1. బిడ్డ: చూ, శిశువు; విశ. 2. పొట్టి: చూ, హ్రస్వము; 3: చూ, వామనుఁడు; 4. గుఱ్ఱము తలయందుండెడు తురాయి.

బురుకఁడు, వై. వి. 1.=పుత్రక. బిడ్డ. ఉ, భా. 6, ఆ. 139: చూ, శిశువు. (దేశ్యమని శ. ర.); దే. వి. 2. వేఁటకుక్క: చూ, శునకము; విశ 3: చూ, వామనుఁడు.

బురుజు, వా. వి. 1. గడి, కోటగోడ యందుండెడు దిబ్బ: చూ, సదనము. 1; 2: చూ, గజ్జియ.

బురుడా, దే. వి. బొంకు: చూ, వితథము.

బురుడు, దే. వి.—వై.—

బురుడుఁడు, సం. వి. అ. పుం: చూ, మేదరి.

బురుమా, దే: వి: చూ, రూ-బురమా.

బురుసా, దే. వి 1. ఎఱ్ఱపట్టు: చూ, సూత్రము. 1; 2 పట్టు. ఉ, రా. 6, ఆ. 128: చూ, సూత్రము. 1.

బురుసు, వా. వి. వెంట్రుకల కుంచె.

బుఱటకొమ్ము, దే. వి. రూ—బుఱ్ఱకొమ్ము—బుఱ్ఱకొమ్ము, చిమ్మనఁగ్రోవి: చూ, శృంగము. 3

బుఱ్ఱ, . వి. 1 దే: చూ, జీనుఁగ్రోవి; 2: చూ, పుఱియ; 3. కొబ్బెరకాయ మొదలగువాని గుల్ల; 4. ఎండినసొరకాయ; 5. వీణెలోనగువాని కాయ; 6. పాములవాని నాగసరము: చూ, నాగసరము 1; 7. తల: చూ, శిరము. 1; 8. సొరకాయ కమండలువు: బుఱ్ఱకాయ; 9. తాటిటెంక: చూ, డొక్కబుఱ్ఱ; విశ. 10. పెద్ద: చూ, సుర. (3) 11. శరీరములో నొక భాగము. ఇంటిపేరు గల వారు. "బుఱ్ఱావారు" (ఇట్లు ముక్కువారు—నోతివారు—గడ్డంవారు. ఇత్యాది.)

బుఱ్ఱఁడు, వా. వి. పిల్లవాఁడు. "బుఱ్ఱిబుఱ్ఱఁడు కథ": చూ, శిశువు.

బుఱ్ఱకత్తి, ద్వ. వి. మోటఁత్తి: చూ, రిష్టి 2.

బుఱ్ఱకాయ, ద్వ. వి. 1: చూ, బుఱ్ఱ. 8. ఉ, హరి. 4, ఆ. 42; 2: చూ, బుఱ్ఱ. 7.

బుఱ్ఱకొమ్ము, దే. వి: చూ, రూ-బుఱటకొమ్ము.

బుఱ్ఱగుంజు, వా. వి. డొక్కబుఱ్ఱలోని గుంజు.

బుఱ్ఱటకొమ్ము, దే. వి: చూ, రూ-బుఱటకొమ్ము.

బుఱ్ఱజింక, దే. వి. బుఱ్ఱముక్కుగల జింక: చూ, హరిణము. 1.

బుఱ్ఱతలము, దే. వి. బుఱ్ఱయేతము: (చూ, తలము. (2))

బుఱ్ఱదోసె, వా. వి. ఏఱుదాఁటెడు పుట్టి: చూ, హోడము.

బుఱ్ఱపిట్ట, వా. వి ఒకానొక పారావతము: చూ, సురఁటీ.

బుఙ్ఙాడిన, ద్వ. వి. జొల్లుచెక్కెడు బాడిన.
బుఙ్ఙముక్కు, దే. వి. పెద్ద రంధ్రముగల ముక్కు : చూ, ముక్కు.
బుఙ్ఙముక్కువాఁడు, దే. విణ. దొఙ్ఙముక్కువాఁడు: చూ, వాఁడిముక్కువాఁడు.
బుఙ్ఙి, దే. వి. 1. తరిపి ఆవు; చూ, సౌరభేయి (ధేనువు.) వా. 2. ఆఁడుపిల్ల. "బుఙ్ఙిబుఙ్ఙఁడు.": చూ, స్త్రీ. (కుఙ్ఙివంటిది).
బుఙ్ఙు, దే. వి. 1. పక్షి యెగురుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హుహుహూ; వా. 2. చీఁదుట యందగు ధ్వన్యనుకరణము: చూ, హుహుహూ.
బులాకి, వా. వి. రూ—బులాకు: చూ, అడ్డబాస: చూ, భూషణము. 2.
బులాకు, వా. వి. —పై.—
బులియు, దే. అ. క్రి: చూ, సుఖించు. కళా. 8, ఆ. 213.
బులియుచుండుట, జా. ఉబ్బుచుండుట. "ముక్తికన్యలను బెండ్లియాడి బులియుచున్న, క్రొత్త పెండ్లికొడుకు." (కళాపూర్ణోదయము.)
బులుపు, దే. వి. 1. సుఖము. కళా. 8, ఆ. 213: చూ, హ్లాదనము; 2: చూ, విలాసము. 2. అం, భా, ప్ర. 139; వా. 3. దూల: చూ, విదర్చిక.
బుల్ల, దే. వి. మగగుఱి: చూ, శిశ్నము.
బుల్లి, వా. వి. 1. విల్లు: చూ, స్త్రీ; 2. కూఁతురు: చూ, సూన. 1; విణ. 3. చిన్న: చూ, స్వల్పము. (ఉత్తర సర్కారులలో వాడుక.)
బువి, వై. వి. = భూ: చూ, భూమి. 1.
బువ్వ, దే. వి. కూడు, అన్నము: చూ, పాదము. (1)
బువ్వంబంతి, వా. వి. వివాహమునందు బంధువులయిన మగవారు ఆఁడువారు అందఱును ఒకటిగాఁ గూర్చుండి వేఁడుకగా భుజించుట, వివాహ చతుర్థ బంధుజనసజ్ధి:. బువ్వము—హరిబువ్వము. (చూ, సాపాటు.)
బువ్వకుడువు, దే. వి: (చూ,) అన్నప్రాశనము.
బుషము, సం. వి. అ. న: చూ, రూ-బుసము.
బుస, దే. వి. పాముయొక్క పూత్కారము: చూ, స్వరము. 2; 2: చూ, నిట్టూరుపు, వసు. 1, ఆ. 75.
బుసకొట్టు, దే. అ. క్రి. 1: చిఱ్ఱుమను; 2: చూ, నిట్టూరుచు; 3. (ఏనుఁగు తొండముతో) పూత్కారముచేయు. య. 1, ఆ. 122; 4. (సింహము) పూత్కారముచేయు; 5. (పాము) బుస్సను; వా. 6. మైమఱచి నిద్రించు. (చూ, నిద్రించు); 7. గుఱ్ఱుపెట్టు—గుర్పెట్టు—గుఱుపెట్టు; 8. బుసపెట్టు, బుసబుసలాడు, బుస్సుకొట్టు.
బుసకొట్టు పుట్టువు, దే. వి: చూ, సర్పము. వేం, ఆ. 102.
బుసపెట్టు, వా. అ. క్రి: చూ, బుసకొట్టు. 8.
బుసబుస, దే. వి. నీళ్లుపొంగుట లోనగువానియందగు ధ్వన్యనుకరణము: చూ, హుహుహూ.
బుసబుసలాడు, దే. అ. క్రి. 1: చూ, బుసకొట్టు 8; వా. 2. రొంపచే ముక్కుగుండా చిమిడిలోనగునవి ప్రవహించు: బురబురలాడు.
బుసము, సం. వి. అ. న. రూ-బుషము. 1. పొల్లు, బుసి, బూగర: చూ, ధాన్యము; 2. మీఁగడతీసిన పెరుఁగు: చూ, స్తన్యము; 3: చూ, పిదక; 4. పొల్లుకసవు: చూ, తృణము. 1.
బుసి, సం. వి. ఈ. స్త్రీ. పశ్చిమసముద్రము నడుమనుండెడు వరుబోద్యాన నది: చూ, హ్రాదిని (నది); దే. వి. (1) నిగులు: చూ, భస్మము; (2) గడ్డిగలిగిన పొల్లుధాన్యము, బూగర. (సం.) ఉమాకటము: చూ, స్తంబకరి (ధాన్యము); (3) ధాన్యముమీఁది పొట్టు: చూ, ఠింఐ; (4) ఇండ్లవాసములకుఁ బట్టెడు బూసి: బూగర. (సం.)—ఉమాకటము.
బుసిపోవు, దే. అ. క్రి. చెడు: చూ, సమయు. 3.
బుసుకుజొన్న, ద్వ. వి. ఒకానొకజొన్న *; చూ, సస్యము.1.
బుస్సుకొట్టు, వా. అ. క్రి: చూ, బుసకొట్టు. 8.
బుస్సు, వా. వి. బుసకొట్టుట యందగు ధ్వన్యనుకరణము. అచ్చ. యు, కాం. 149: చూ, హుహుహూ.

## బూ

బూఁజము, వై. వి. = భూత: చూ, భూతము 2.
బూఁజు, దే. వి. 1. పూతిగంధము: చూ, వాసన; 2. ఎండసోఁకమిచే తడివస్తువులమీఁదఁ గలుగు కొంచెము మాసిన తెలుపు: రూ-బూఁదు. (సం).—పూతము.
బూఁజుగులు, వా. వి. ఆయిరేని: చూ, భాండము, 3.
బూఁజుపట్టు, దే. అ. కి: బూఁదిచలుచు, బూఁదుపాఱు.
బూఁదిచలుచు, —పై.—
బూఁదు, దే. వి: చూ, రూ-బూఁజు. 2.
బూఁదుపాఱు, దే. అ. క్రి: చూ, బూఁజుపట్టు. పాండు. 5, ఆ. 14; పాండు. ఆ. 165.
బూక, దే. విణ. 1. అబద్ధోక్తి: చూ, శబ్దము, 2; 2. బూటకము: చూ, వితథము.
బూగర, దే. వి. 1: చూ, బుసి (2); 2; చూ, బుసి (3); చూ, బుసి (4).
బూగరమండె, వా. వి. నూర్చినవరిరాశి.
బూచి, వై. వి. = భూత: చూ, భూతము. 2.
బూచికన్నులకచ్చు, వా. వి: చూ, బాలక్రీడ.
బూచిగాఁడు, ద్వ. వి. బూచివలెనుండుటచే కుక్కకియ్యఁబడిన పేరు: చూ, సివఁగి. 2.
బూచివాఁడు, ద్వ. వి: చూ, భూతము. 2.
బూచులతేఁడు, ద్వ. వి: చూ, శివుఁడు.

బూటకము, దే. వి. 1: చూ, బూక. 1; 2: చూ, బూక. 2; 3: చూ, వంచనము. పు. 1: ఆ. 148; 4: చూ, మాయము: 1. నీలా. 2. ఆ. 41.

బూటకీఁడు, దే. విణ. (బూటకము + ఈఁడు) రూ-బూటకుఁడు. 1: చూ, ప్రతిహారకుఁడు; 2: చూ, వంచకుఁడు.

బూటకుఁడు, —పై.—

బూడిద, వై. వి. రూ-బూడిదె-బూద్ద = భూతి: చూ, భస్మము.

బూడిదరంగు, వా. వి: చూ, ధూసరము. 1.

బూడిదగుమ్మడి, వై. వి: చూ, పెండ్లిగుమ్మడి *.

బూడిదపండు, ద్వ. వి: చూ, విభూతిపండు. పాండు. 5, ఆ.14.

బూడిదపన్ను, ద్వ. వి. శవముపై పన్ను: చూ, సుంకము. 1.

బూడిదె, వై. వి. = భూతి: చూ, రూ-బూడిద.

బూద్ద, వై. వి. = భూతి. చూ, రూ-బూడిద.

బూద్దీ, —పై.—(వాడుక.)

బూతనాదుఁడు, వై. వి. = భూతనాథ. 1: చూ, బూచులతేఁడు; 2: చూ, బూచిగాఁడు.

బూతపిల్లి, వై. వి. (బూతము + పిల్లి) : చూ, పూతికము.

బూతము, వై. వి. 1.=భూత. య. 2: ఆ:80: చూ, భూతము. 2; 2. = భూత. (సం).—ప్రాణి, ఆత్మవీరుఁడు, చేతనము, భూతము.

బూతములసామి, వై. వి. చంద్రుఁడు; చూ, హిమాంశువు.

బూతాటము, దే. వి. (బూతు + ఆడుట) బూతులాడుట: చూ, శబ్దము. 2.

బూతి, వై. వి. 1. = భూతి: చూ, బూడిద; 2. = భుక్తి. తిండి: చూ, బుత్తి.

బూతు, దే. వి. 1. కుచ్ఛితపుతిట్టు: చూ, శాపము. 1; 2 కుచ్ఛితపుతిట్టు తిట్టువాఁడు; 3. అబద్ధోక్తి: చూ శబ్దము. 2; 4. బట్టువాఁడు: చూ, స్వస్తిముఖుఁడు. 2.

బూద, దే. వి. పాలకుండ. వసు. 4,ఆ. 20: చూ, భాండము.3.

బూది, వై. వి. = భూతి: చూ, బూడిద. పాండు. 1, ఆ. 165.

బూదె, వై. వి. = భూత. 1. చతుర్దశితిథి: చూ, హరివాసరము, 2: చూ, శివరాత్రి.

బూబు, వా. వి తురకస్త్రీ: చూ, స్త్రీ.

బూమి, వై. వి. = భూమి: చూ, భూమి. 1.

బూమియు, వై. వి. రూ-బూమె. = భూమికా. కపటము; చూ, సూక్ష్మము. 2; 2: చూ, వంచనము; 3: చూ, బూటకము; 4. మాఱువేషము: చూ, వేసము. 1; 5. అబద్ధోక్తి: చూ, శబ్దము. 2.

బూమె, వై. వి.=-పై.-(మాఱువేషమునకు.-య.2: ఆ.58.)

బూమెకత్తియ, వై. విణ. బూమెలుకలది. రూ-బూమెకత్తె, బూమెలాఁడి. కాశీ. 5, ఆ. 316: చూ, స్త్రీ.

బూమెకత్తె, —పై.—

బూమెలాఁడి, —పై.—

బూమెకాఁడు, ద్వ. విణ. బూమెలుకలవాఁడు: బూమెలాఁడు

బూమెలాఁడు, —పై.—

బూర, వై. వి. 1. = పూర. (రూ-బూరగ-బూరా-బూరుగ) కాహళమను వాద్యము. అచ్చ. యు, కాం. 226: చూ, వీణె; విణ 2: చూ, స్థూలము. 2.

బూరఁడు, వై. విణ. విజృంభించినవాఁడు. పంచ వేం. 1; ఆ. 704.

బూరకాఁడు, ద్వ. విణ. ఏనుఁగు కాలివాఁడు.

బూరకాలు, ద్వ. వి, ఏనుఁగుకాలు ఉ. హరి, 2: ఆ. 122: చూ, హజ్జ.

బూరగ, వై. వి. 1: నాగసరమునకు సుతియిచ్చెడువాద్యము: చూ, బూర, 1; 2: సుషిరవాద్యము, ఆహికము, తార: చూ, స్వరము. 2.

బూరగడ్డి, ద్వ. వి: చూ, తృణము. 1.

బూరగొమ్ము, ద్వ. వి. కొమ్ము, శృంగము రామా. 8, ఆ, 69: చూ, వీణె.

బూరగొమ్ముతుపాసి, ద్వ. వి: చూ, విష్ణువు. 1. వేం ఆం, 2;

బూరట, వై. వి. ఉల్బణము: చూ, హెచ్చు. 2.

బూరటించు, వై. ప్రే. బూరటిల్లఁజేయు.

బూరటిలు, వై. అ: క్రి. బూరటిల్లు. 1:=పూరణ. పూర్ణమగు: చూ, సంపూర్ణమగు; 2. ఉబ్బు: చూ, లేచు.

బూరటిల్లు, వై. అ. క్రి.—పై.—

బూరదిప్పకాయ, వా. వి: చూ, భక్ష్యము.

బూరా, వై. వి: = పూర: చూ, రూ-బూర. 1.

బూరినీసు, వా. వి. రూ-బూర్నీసు. మెత్తనికంబళి; చూ, రల్లకము.

బూరియ, వై. వి. = పూరికా, రూ-బూరె. నై. 6, ఆ. 124: చూ, భక్ష్యము. (పూర్ణము అని గుంటూరుప్రాంతమున వాడుక).

బూరుగ, వా. వి. 1: చూ, బూర. 1; 2. రూ-బూరుగు-బూరువు*: చూ, శాల్మలి.

బూరుగు, దే. వి: చూ, రూ-బూరుగ. 2*.

బూరుగుకాయ, ద్వ. వి. కర్కటము: చూ, శాల్మలి శలాటువు.

బూరుగుదీవి, ద్వ. వి: చూ, దీవములు.

బూరుగుబంక, దే. వి. అజమోద : చూ, శాల్మలీవేష్టము.

బూరువు, దే. వి: చూ, రూ-బూరుగ. 2*.

బూరె, వై. వి. = పూరికా: చూ, రూ-బూరియ.

బూరెలమూఁకుడు, వా. వి రూ-బూర్లెమూఁకుడు. (బూరెలు వండెడి వెడల్పు పాత్రము): చూ, పాత్రము 6 ; (కొన్ని దేశములయందీ శబ్దమునకు అపార్థము నుపపాదించుచున్నారు.)

బూర్నీసు, వా. వి: చూ, రూ-బూరినీసు.

బూర్లెమూఁకుడు, వా. వి: చూ, రూ-బూరెలమూఁకుడు.

బూల, దే. వి. 1. తాటిమ్రానిలోని బొండు. (ఏకబీజదళ వృక్ష జాతుల మ్రానులన్నియు నిట్టివే.) (చూ, ఏక, ద్విబీజదళ వృక్షములు); వా. విణ. 2. విస్సారము: చూ, బెండు. 2.

బూలి, దే. విణ. నిస్సారమైనది: చూ. బెండు. 2.
బూసము, దే. వి: చూ, ధాన్యము. (ఇది చింత్యము.)
బూసి, దే. వి. 1. వాదట్టు-పాదొట్టు; వా. 2: చూ, సాలెపట్టు.

# బృ

బృంద, సం. వి. ఆ. స్త్రీ. తొళసి*: చూ, హరిప్రియ. 3.
బృందము, సం. వి. అ. న.=బిందము, పిండు: చూ, సమూహము.
బృందారకుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, వేలుపు; విణ. 2: చూ, మనోజ్ఞుఁడు; 3: చూ, శ్రేష్ఠుఁడు. 2.
బృందిష్టము, సం. విణ. మిక్కిలి మనోజ్ఞమైనది: చూ, హృద్యము.
బృంహితము, సం. వి. అ. న. ఏనుఁగుయొక్క గీఁక: చూ, స్వరము. 2.
బృసి, సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-బ్రిషి-బ్రుషి-బ్రుసి.(బ్రుసి అని శ. ర.)
బృహచ్చరణ బ్రాహ్మణులు, అం: చూ, ద్రావిడులు. (సామ వేదులు. దాహ్యాయణ సూత్రముగలవారు కొందఱు).
బృహచ్ఛదము, సం. వి. అ. పుం. బలురక్కసి*: చూ, స్వర్ణక్షీరి. 2.
బృహతి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, వాఁకుడు*; 2. ములక*: చూ, శత్రువు. 1; 3. ఉత్తరీయము: చూ, వస్త్రము; 4. విశ్వావసుని వీణ: చూ, వీణ; విణ. 5. గొప్పది: చూ, సుర. (3); అం. 6. తొమ్మిది అక్షరముల పాదముగల ఛందస్సు; చూ, ఛందస్సులు 7: చూ, తతవాద్యములు.
బృహతిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, బృహతి. 3.
బృహత్కుక్షి, సం. విణ. (ఇ): చూ, బొజ్జవాఁడు.
బృహత్తు, సం. విణ. (త్. ఈ. త్.) 1: చూ, బృహతి. 4; 2: చూ, వట్టవాఁపు.
బృహత్పాటలి, సం. వి. ఈ. స్త్రీ. ఉమ్మెత్త*: చూ, హలా పుష్పము.
బృహత్త్రిలువు, సం. వి. ఉ. పుం. పెద్దవరగోఁగు*: చూ, వరగోఁగు.
బృహదసృజ్మూర్తి, సం. వి. ఈ. స్త్రీ: చూ, బుద్ధపిడుఁదు.
బృహదారణ్యకము, అం: చూ, ఉపనిషత్తులు.
బృహదేల, సం. వి. ఆ. స్త్రీ. పెద్దయేలకి*: చూ, పత్రల.
బృహద్బీజము, సం. వి. అ. న. 1: చూ, వట్టవాఁపు; పుం. 2 అంబాళము*: చూ, మామిడి.
బృహద్భానువు, సం. వి. ఉ. పుం. అగ్ని: చూ, వహ్ని. 1.
బృహన్నల, సం. వి. ఆ. స్త్రీ. అర్జునునికి వేషాంతరము నందలి నామము: చూ, పాండవులు: (చూ, సుభద్రేశుఁడు).
బృహన్నలము, సం. వి. అ. పుం. పెద్ద కిక్కస*: చూ, హరిత (తృణము. 1.)
బృహన్మరీచము, సం. వి. అ. న: చూ, మిరెపకాయ.
బృహస్పతి, సం. వి. ఇ. పుం. 1: చూ, సురాచార్యుఁడు; 2. గురుఁడు: చూ, సురాచార్యుఁడు.
బృహస్పతివారము, సం వి అ. పుం. 1. గురువారము: చూ, వారము. 2; అం. 2: చూ, వారములు.
బృహస్పతిసవము, సం. వి. అ. పుం: చూ, యజ్ఞము.
బృహస్పతిస్మృతి, అం: చూ, స్మృతులు.

# బె

బెంగ దే. వి. 1. కూఁత. సా. 2, ఆ 4: చూ, స్వరము. 2; 2. విరహవ్యథ: చూ, శోకము.
బెండ, దే వి: ఎదురునాలిక—ఎదునాలుక, (సం.)—ఖురస, ఖుళస్థలి, ఖరపత్రి, గోగ్రంథి, గోజిహ్వ, గోజిహ్వక, ద్వారి-దార్విక, మండూరపర్ణి.
బెండగిల్లు, దే. అ. క్రి: చూ, రూ-పెల్లగిల్లు. 1-2.
బెండు, దే. వి. 1. జీలుగు*: చూ, స్వర్ణపుష్పి; విణ. 2. సారములేనిది. హరి. పూ. 4, ఆ. 154. కాయికము, చివుకు-చీకు, బజ్జు, డ్రాబ, పోరచి, బూల, బూలి, మక్కి. (సం.)—అసారము, నిస్సారము, ఫల్గువు.
బెండుమానిసి, ద్వ. వి: చూ, బక్క. 1.
బెండువడు, ద్వ. అ. క్రి. ఎత్తువడు: చూ, వలియు. 2.
బెందడి, వా. వి. 1. అడుసు: చూ, శాదము. 2; 2. కంకరి. చూ, లేపము.
బెంబెలు, వా. వి. బెదరు: చూ, సాధ్వసము. (ఉత్తర సర్కారు లలో వాడుక)
బెంబేలుపడు, వా. అ, క్రి. 1. బెదరు: చూ, స్రుక్కు. 6; 2. నిశ్చేష్టతనొందు. (ఉ॥ స॥ లలో వాడుక).
బెకబెకలాడు, దే. అ. క్రి. (కప్పలు) కూయు: చూ, శబ్దించు.
బెకబెకలు, వా. వి. బ (కప్పల) కూఁత: చూ శబ్దము. 2.
బెక్కణ, వై వి.=ప్రేంకణ: చూ, పెరవణ.
బెక్కొట్టు, దే. అ. క్రి. (బెంగ+కొట్టు) వాపోవు: చూ, శబ్దించు.
బెగడు, దే. వి. 1. రూ-బెగ్గడు. భయము: చూ, బెంబేలు; అ. క్రి. 2. (రూ-బెగ్గడు-బెగడువడు-బెగ్గడిలు-బెగ్గడిల్లు-బెగ్గిలు-బెగ్గిల్లు-బెగ్గలించు) భయపడు: చూ, బెంబేలుపడు. 1.
బెగడువడు, ద్వ. అ. క్రి. 1: చూ, రూ-బెగడు. 2; ప్రే. 2. బెగడుపఱుచు.
బెగడ, వా. వి. భాగధేయము. అం.పదా.చర.48: చూ, నిస్తు. 1.
బెగ్గడిలు, దే. అ. క్రి. రూ-బెగ్గడిల్లు: చూ, బెగడు. 2.
బెగ్గడిల్లు, —వై.— మార్క. 8, ఆ. 66.
బెగ్గడు, దే. వి, అ. క్రి: చూ, రూ-బెగడు.
బెగ్గలము, వై వి. 1.=విక్లబ: చూ, బెగడు. 1; 2: (సం.)-విహ్వలత. మార్క. 1, ఆ. 239.
బెగ్గలించు, వై. అ. క్రి.=విహ్వల. 1. భయపడు: చూ, బెగడు. 2; 2. పెలుకుఱు: చూ, విహ్వలించు. విర్వ. 5, ఆ. 87.
బెగ్గలికము, వై. వి =విక్లబ: చూ, బెగడు. 1. హరి. పూ. 9, ఆ. 49.

బెగ్గిలు, వై. అ. క్రి. రూ-బెగ్గిల్లు. 1.=విహ్వల: చూ, దెగ్గలించు. 1; 2: చూ, బెగ్గలించు. 2; 3. చింతించు: చూ, గ్రుక్కు 11; 4: చూ, సలించు; 5. చెదరు: చూ. వెల్లివిరియు. 1.

బెగ్గిల్లుట, వై. వి; చూ, బెగడు. 1.

బెగ్గిల్లు, వై. అ. క్రి. =: చూ, రూ-బెగ్గిలు. (చలించుటకు.—ఆచ్చ. బాల, కాం. 98.)

బెగ్గురము, వై. వి. =పుష్కర. సాం. తి. 11: చూ. సారసము. 2.

బెగ్గురు, —పై—

బెగ్గోడి, వా. వి. ఒకానొకకోడి: చూ, నెలుకొలుది. (పుంజు.)

బెజ్జము, దే. వి: తూటు: చూ, రంధ్రము. 1.

బెట్ట, దే. విశ. తీక్ష్ణము: చూ, వేండ్రము.

బెట్టించు, దే. స. క్రి. (నిర్బంధమునుండి) మరలించు.

బెట్టిదము, దే. వి. (బెట్టు + ఇదము) 1. ఉద్ధతి: చూ, హంకారము; 2. క్రౌర్యము: ప్రామిడి; వై. విశ. 3. కఠినము: చూ, బెడిదము. 5; 4. = భీతిదమ్. ఘోరము: చూ, బెగడు. 1; 5: చూ, బెట్ట; 6. క్రూరము. భో. 6 ఆ. 357: చూ, రౌరవము. 2; 7. దృఢము: చూ, స్థైర్యము. 1; 8: చూ, బిట్టు. 4. ఐ. 9. నిష్ఠురోక్తి: చూ, శబ్దము. 2.

బెట్టిదుఁడు, దే. విశ. (బెట్టు+ఇదుఁడు) 1. పొగరుఁబోతు: చూ, హేరంబుఁడు 2; 2. క్రూరుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 3. కఠినుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

బెట్టిదురాలు, దే. విశ. (బెట్టిద+ఆలు) బెట్టిదముగల ఆఁడుది: చూ, స్త్రీ.

బెట్టు, దే. వి. 1. అతిశయము: చూ, హెచ్చు. 2, 2. గౌరవము: చూ, సన్మానము; 3. గర్వము. ఉ, రా. 2, ఆ. 309: చూ, హంకారము; విశ. 4: చూ, బెట్టిదుఁడు. 1; క్రి. విశ. 5. అత్యంతము: చూ, మఱిమఱి; 6. గట్టిగా; 7. దృఢముగా. హరి. పూ. 8, ఆ 46.

బెట్టుసరి, వా. విశ. రూ-బెట్రుసరి. 1. ఘోషణ: చూ, తెగనీలుగుట. 1; 3; చూ, తెగనీలుగుట. 2; 4: చూ, బెట్టు. 1; 5. చెప్పినవిషయము సరిగా గమనింపకుండుట; 5. బింకము, తలబిరుసుతనము.

బెట్రుసరి, వా. విశ.—పై.—

బెడఁకు, దే. వి. (రూ-బెణఁకు-బెళుఁకు.) 1: చూ, తలఁగుడు; 2. చలనము: చూ, లోలము; 3. కులుకు: చూ, విలాసము. 2; అ. క్రి. (రూ-బెణఁకు-బెళుఁకు.) 4. తొలఁగు. వసు. 4, ఆ. 50: చూ, విరియు. 3; 5: చూ, సలించు, కళా. 4, ఆ. 105; వా. 6. కీలుతప్పు; 7. నరముతప్పి నొప్పియెత్తు.

బెడఁగారు, దే. అ. క్రి: చూ, రమ్యమగు. స్వా. 3, ఆ. 71.

బెడఁగు, దే వి. 1: చూ, విలాసము. 2. కళా. 3, ఆ. 33; 2: చూ, సౌందర్యము; విశ. 3. అధికము. వసు. 5, ఆ. 5: చూ, హేరాళము; 4: చూ, హృద్యము; అ. క్రి. 5: చూ, బెడఁగారు.

బెడఁద, దే. వి. 1. బాధ: చూ, శోకము; 2: చూ, విపత్తు. హరిశ్చ. 3, ఆ. 21; 3. అశుభము: చూ, హాని. 2; వా. 4: చూ, భారము. 1; 5. గందరగోళము: చూ, రద్దు. 2.

బెడక, దే. వి. 1. ధాన్యముపోసినగోనె, బస్తా: చూ, సంచి; 2. ఉత్తగోనె: చూ, సంచి.

బెడద, దే. వి: చూ, భక్ష్యము.

బెడిగ, వా వి. రూ-బేడిగ: చూ, సిస్తు. 1.

బెడిదము, వై. వి. రూ-బేడిదము. = భీతిద. 1. భయంకరత్వము: చూ, సాధ్వసము; 2 కఠినత్వము: చూ, బెడిదము. 5; విశ. 3. భయంకరము; చూ. సాధ్వసము: 4. అధికము. పర. 3, ఆ. 46: చూ, హేరాళము; 5. గట్టిది: విశ.—రూ—బేడిదము, కటికి, కరకసా, క్రకస, గట్టి, గొట్టు, నిగ్గడి, బెట్టిదము, మొనక, మొప్పియ-మొప్పె; పి.-కక్కసము, కడిఁది, కఱకుఁదనము, గొడ్డ, పెలుచు, బిరుసు-బిఱుసు, బెడిదము; వి, విశ — కఱకు, గడుసు, దురుసు; వి, ద్ర—పెల్చ—పెలుచన-పెల్చన; (సం).—విశ.—అచ్ఛిద్రము, అయోమయము. ఉపోఢము, కంకణము, కంఖటము, కఠరము, కఠలము, కఠినము, కఠోరము, కఠోలము, కర్కరము, కర్కశము. కిటకము, క్రూరము, గాటము, జఠరము, జరఠము, ఠ, దృఢము, న, నిర్వహము. నివాతము, నిషధము, నిష్ఠురము, నిస్పంధి, పరుషము, మూర్తము, మూర్తిమత్తు, వృత్తము; వి.—కంకణము, కార్కశ్యము, గఱగఱ, మూర్తి. (మిగతవానికి "చూ, వృత్తము. 6—10"); 6. పరుషోక్తి: చూ, శబ్దము. 2.

బెడిదుఁడు, వై. వి. 1: చూ, వెఱపరి. 1; 2. కఠినుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 3. క్రూరుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

బెడిదురాలు, ద్వ. విశ. (బెడిదము+ఆలు); చూ, బెటిదురాలు

బెడియు, దే. అ. క్రి. 1: బెసుకు, తప్పు: చూ, మిడివోవు; 2. బెసుకు: చూ, వైకల్యమగు.

బెడిసెకొట్టుట, వా. వి. 1. ఉగ్రదేవతలను క్రమవిరుద్ధముగా ఆరాధించినందున కలిగెడి హాని; 2. దేవతాదులు ఎదురుతిరుగుట.

బెడ్డ, వా. వి. రూ-బెడ్డు. మంటిగడ్డ: చూ, భూమి. 1.

బెడ్డు, వా. వి.—పై.—

బెణఁకు, దే. వి, అ, క్రి: చూ, రూ-బెడఁకు.

బెళుఁకు, వా. వి, అ. క్రి,—పై.—

బెత్త, వై. వి: చూ, బెత్తిలి.

బెత్తము, వై. వి.=వేత్ర: చూ, పేము.

బెత్తిక, వై. వి. లోష్టము, ఎండిలేచినమట్టిపెళ్ల: చూ. భూమి. 1.

బెత్తిలి, వై. వి. = భిత్తి. తర్జని మొదలైన నాలుగువ్రేళ్ల అడ్డకొలత. ఉ, రా. 3, ఆ. 123: చూ, హస్తము.

బెత్తు, వై. వి. 1: చూ, బెత్తిక; 2.=వేత్ర: చూ, బెత్తము; దే. వి. 3: చూ, సన్మానము.

బెత్తెడు, వా. వి: చూ, బెత్తిలి.

బెదరించు, వా. స. క్రి: చూ, వెఱపించు.

బెదరింపు, దే. వి. బెదరించుట: చూ, సంకోపము. 3.

బెదురు, దే. వి. 1: చూ, బెగడు. 1; అ. క్రి.2: చూ, బెగడు. 2.

బెదరుచూపుట, అం: చూ, భేదోపాయములు.

బెదరుపడు, ద్వ. అ. క్రి: చూ, బెదరు. 2.

బెదరుపోతు, దే. విణ: చూ, వెఱపరి. 1—2.

బెబ్బులి, ద్వ. వి. (పెద్ద+పులి) పెద్దపులి: చూ, శార్దూలము.

బెబ్బులుఁగు, వా. వి. వడ్లంగిపిట్ట: చూ, శతపత్రము. 4.

బెబ్బె, వా. అవ్య. లేదు. "నీకుబెబ్బె-నీఅబ్బకు బెబ్బె.": చూ, శూన్యము. 1.

బెరడు, వై. వి. = బర్బర. 1: రూ బరడు, అంట, అట్టి. కద వసము-కడాసము- కళవసము -కళాసము, చట్ట, చెక్క, తాఁట, తిత్తి, తొంట, తొక్క, తొప్పు, తొడప, తొడవ సము, తొలక-తొలుక, తోడు, తోడుపట్ట, తోలు, తోలుక, నార, పట్ట, పీతోలు, పైపొర, పొప్పర; (సం).— అజిన ము—అజినము, అసృగ్ధర, అసృగ్వర, ఉక, ఐ, ఐక్య ము, కటుచాతుర్జాతకము, కృత్తి, ఖల్లము, ఖల్లి, ఖేటము, చర్మము, చోచకము, చోచము, చోలకము, ఛిల్లి, జామ, తనువు, త్వక్కు, త్వచము, పటము, శకలము. (మిగత వానికి "చూ, శకలము. 1—2"); తద్వి - ౧. ఎండిన అరఁటిపట్టకు.— చొదుము; ౨. ఒలిచినుతిపోయుట కేర్ప అచిన తోలునకు.— తిత్తి. (సం).—కృతి సుతి, ౩. చర్మ ఖండమునకు.- అట్ట; ౪. చర్మములసమూహమునకు. (సం).— చార్మాణము; ౫. దేగలతోలుగంతకు.- తొపొ రము- తోపారము; ౬. ద్రాక్షత్వక్కునకు.- కారపుఁజెక్క; ౭. పచ్చిచర్మమునకు.— కరుసు; ౮. పట్టెడవలె కోసిన తోలునకు.- అట్ట, పట్టెడ; ౯. పులితోలు. (సం).- ద్వీప ము; ౧౦. పొరాటుచెక్క: (సం)- త్వక్కు; ౧౧. ప్రక్క తోలు, బరితోలు; ౧౨. మృగచర్మమునకు,—అట్ట, తిత్తి, తోలు; ౧౩. లవంగపుపట్టకు. ( చూ, వరాంగకము. 1. ;) ౧౪. వింటినారిదెబ్బ కాపాడెడు ఉడుము తోలునకు: (సం.) గోధ; ౧౫. సన్నగాఁగోసిన తోలునకు,- వాఱు. (మిగత వానికి "చూ, శకలము. 1—2.") ; 2: చూ, రూ-బరడు. 1; 3: చూ, రూ-బరడు. 3.

బెరయు, దే. అ. క్రి. 1: చూ, వ్యాపించుహరి. పూ. 6. అ. 95; 2; చూ, సంభవించు. భాగ. 2. అ. 250; 3. చేరు, చెల్లుభార, శ్రీ. 1, అ. 73: చూ, సిద్ధించు; స. క్రి. 3. పొందు. కళా. 3, అ; 105: చూ, సక్తమగు.

బెరసు, వై. విణ. 1 =పరుష. క్రూరము. నీలా. 1, అ. 72: చూ, రౌరవము. 2: 2. ముతుక. నీలా. 3, అ. 49: చూ, స్థూలము. 4.

బైరికి, దే. వి. కొంఱత: చూ, కొద్దు. 1.

బెరుకు, దే. వి. 1. భేదము: చూ, పేజుపాటు. 1; 2. ప్రయో జనము: చూ, వ్యాపారము. 1.

బెటిక, దే. వి: చూ, బెడక. 1.

బెలంచి, దె. వి: చూ, పరి (అప్ర.)

బెలము, వై. వి. 1 =బిల: చూ, రంధ్రము. 1; వా. 2. ఒకా నొక ఎరువు. "పేడబెలముపోసిన బాలముపండును.": చూ, శుష్కగోమయము (గోదావరిమండలమున వాడుక.)

బెల్లయు, దే. అ. క్రి: చూ, వ్యాపించు.

బెల్లము, దే. వి. 1. గుడము; చూ, శర్కర. 1; వా. 2, ముగ్గుపిండి: చూ, పిష్టము (పిల్లల ముద్దునం దుపయో గింతురు.)

బెల్లి, దే. విణ. 1: చూ, వంచకము. కళా. 3, అ. 34; 2· చూ, వంచకుఁడు; 3: చూ, జజ్జరకత్తియ.

బెల్లించు, దే. స. క్రి. 1: చూ, వచించు; వా. అ. క్రి 2: చూ, బుజ్జగించు.

బెల్లించుకొను, —పై.—

బెల్లింపు, దే. వి. 1: చూ, వంచనము ; 2. ఇచకము : చూ, బుజ్జగము. 1; విణ. 3: చూ, బుజ్జగము. 2.

బెల్లింపుమాట, వా. వి. 1. ఇష్టోక్తి: చూ, శబ్దము. 2; 2: చూ బెల్లింపు. 2.

బెసుకు, దే. అ. క్రి: చూ, బెడియు. 1—2.

బెస్త, దే. వి. బోయ: చూ, మోపరి.

బెసవాఁడు, దే. వి. —పై.—

బెహారము, వై. వి. =వ్యవహార. (రూ-బేహారము-బేహారము బేరము-బెవరము): చూ, వర్తకము.

బెహారి, వై. వి. =వ్యవహార. రూ-బేహారి-బేహారి-కళా. 6: అ. 97: చూ, సెట్టి. 2.

బెళఁకు, దే. వి. 1. అధికప్రభ: చూ, వెలుతురు. 1; 2: చూ, విలాసము. 2; 3 : చూ, లోలము. అని. 5, అ. 29 ; వా, 4. ఒకానొక దేగ: చూ, శ్యేనము; అ. క్రి. 5. రూ-బెడఁకు: చూ, సలించు; 6. ఒరయు, పొందు. 4, అ. 3: చూ, రుద్దు. వా. 7. తళతళమని ప్రకాశించు. రూ-బెళుఁకు : చూ, హవణిల్లు.

బెళఁగు, దే. వి: చూ, రూ-బెడఁగు.

బెళగువ్వ, దే. వి. (బెడస+గువ్వ) (స్వా. 4, అ. 58); కంపపులుఁగు-గంపపులుఁగు, గబ్బు, గబ్బులుఁగు, డబ్బు, బెళవ (సం) అలజము, కుక్కుటకము, కుక్కుభము, కులాలము, జీవంజీవము, భాసంతము, లజ్జాభాసము; తద్వి.- జలకుక్కుభమునకు. సం. గోభండీరము, జలకుక్కుభము. (చూ, శకుంతి.)

బెళవ, దే. వి. —పై.—

బెళుకు, దే. వి, అ. క్రి: చూ, బెళకు. 1-2-3-4-5-6-7. (అధికప్రభకు.—కళా: 1, అ. 135 ; తళతళమని ప్రకా శించుటకు.—య. 5, అ. 65.)

# బే

బే వై. వి: చూ, రూ-అంబే. భో. 6, ఆ. 44.
బేఁటు, దే. వి 1: చూ, బెత్తిక; (కొండలోనగు వానియందలి చీలిక. (పేఁటు అని వాడుచున్నారు.)
బేఁగడ, దే. వి. కాకిబంగారు: చూ, శుల్బము. 1.
బేగరి, వా. వి. గుఱ్ఱపువాఁడు: చూ, సాది. 1. (హయము.)
బేగి, వా. క్రి. విణ. వేగముగా. "బేగిరమ్మ."
బేగీరావులు, వా. వి. బ. వేగముగావచ్చువారు.
బేజరూరు, వా. విణ. తొందరలేనిది.
బేజారు, వా. వి. అలయిక. శ్రమము.
బేడ, దే. వి. వరకరూపాయ, (రు 0–2–0).
బేడలు, దే. వి. బ. కాయధాన్యములపప్పు: చూ, పప్పు. 1.
బేడిక, వా. వి. భాగధేయము: చూ, సిస్తు. 1.
బేడిగ, దే. వి.—పై.—
బేడిజము, దే. వి. టక్కు: చూ, వంచన.
బేడిదము, వై. వి.=భీతిద: చూ, రూ-బెడిదము.
బేడిమూఁక, వా. వి. అల్లరిమూఁక.
బేడిస, దే. వి. శఫరిఅనుమీను: చూ, మత్స్యము. 1.
బేడిసమీను, దే. వి.—పై.—
బేడీలు, వా. వి. బ. సంకెళ్లు: చూ, శృంఖలము. 3.
బేడౌలు, వా. వి వికారరూపము, దుస్తులుధరింపమి.
బేతాహతు, వా. విణ. తాహతులేనిది. (తాహతు=గొప్ప.)
బేతాళము, సం వి అ. పుం. 1. పిశాచము: చూ, భూతము; 2. భూతావిష్ట మృత శరీరము: చూ, శరీరము.
బేతాళుఁడు, సం. వి. అ. పుం: యమకింకరుఁడు.
బేది, దే. వి: చూ, పాచనము. 3.
బేపరవా, వా. విణ. లక్ష్యములేనిది.
బేబాచెయ్యి, వా. విణ. గొప్పసమర్థతకలవాఁడు.
బేబేబ్రాహ్మణులు, అం. కన్యాకుబ్జులలో నొకరు. (సామవేదులు కొందఱు యజుర్వేదులొక కొందఱు). చూ, బ్రాహ్మణులు.
బేమరమ్మతు, వా. విణ. మరమ్మతులేనిది.
బేరకత్తె, వై. విణ. (బేరము+కత్తె)బేరమాడునది:చూ,స్త్రీ.
బేరకాఁడు, ద్వ. విణ: బేరమాడువాఁడు, అమాంతగాఁడు, చిల్లరబేరగాఁడు.
బేరజము, దే. వి. 1. కుత్సితుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 2. ధూర్తుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 3. కుత్సితపునడక; 4. కుత్సితురాలు: చూ, స్త్రీ; బ. 5. పరుషోక్తి: చూ,శబ్దము.2.
బేరమాడువాఁడు, ద్వ. విణ: చూ, బేరకాఁడు,
బేరము, సం. వి. అ. న. 1. ప్రతిమ: చూ, హరిణి. 3; వై. వి. (1)=వ్యవహార: చూ, బెహారము. పాండు. 1, ఆ. 111; (2) వెలకు వస్తువు నిచ్చుకొమ్మని నడుగుట.
బేరి, వై. వి. 1.=వ్యవహార. (బేరము+ఇ.) 1: చూ, వైశ్యుఁడు; 2. = భేరీ. దుందుభి అచ్చ. యు, కాం. 205: చూ, పీజె.

బేకీజు, వా. వి. 1. రాబడిమొత్తము; 2. లెక్కవివరము.
బేరుండము, వై. వి = భేరుండ. గజములఁ దన్నుకొనిపోవు ఒకానొకపక్షి: చూ, శకుంతి (పక్షి)
బేల, వై. విణ.=బేల. 1. మూఢురాలు, ముగ్ధ: చూ, స్త్రీ; 2: మూఢుఁడు: చూ, స్తబ్ధుఁడు.
బేలతనము, వా. వి. అమాయికము. (హి) అత్యాబాపన్.
బేలరి, దే. విణ. (బేల+అరి): చూ, వంచకుఁడు. భాగ. 3, స్కం. 381.
బేలాయఖు, వా. విణ. తగనిది, పనికిరానిది.
బేలు, దే. వి. 1; చూ, వంచన; వా 2. జామీను; 2 ఇరువది రీములకట్ట: చూ, వటపత్రము.
బేలుపడు, ద్వ. అ. క్రి. రూ-బేల్పడు. 1: చూ, మోసపోవు; ప్రే. 2. బేలుపఱచు.
బేలుపోవు, దే.అ. క్రి, 1: చూ, బేలుపడు; ప్రే 2. బేలుపుచ్చు.
బేలువెట్టు, దే. స. క్రి. మోసపుచ్చు: చూ, వంచించు.
బేవరము, వై. వి.=వ్యవహార: చూ, బెహారము.
బేవారసు, వా. విణ. నాథుఁడులేనిది, హక్కుదారుఁడులేనిది.
బేషు, వా. వి (రూ-బేసు-భేషు) మంచిది.
బేసము, వై. వి.=పేశ. 1: చూ, పేసెము. భాగ. 8. స్కం. 450; 2 = వేష. కోలము: చూ, వేసము.
బేసరి, దే వి. 1. ఒకరకముముక్కర: చూ, భూషణము. 2; 2. అడ్డబాస: చూ, భూషణము. 2; 3. లలంతికావిశేషము: చూ, భూషణము. 2.
బేసి, వై. వి.=విషమ. (దేశ్యమని శ. ర.) సమముకానిది: చూ, విషమము. (1-3-5 మొ.)
బేసికంటి, దే. వి (బేసి+కన్ను) విరూపాక్షుఁడు,ముక్కంటి. య. 1, ఆ. 85: చూ, శివుఁడు.
బేసికంటిమామ, ద్వ వి: చూ. పర్వతము.
బేసికంటివేల్పు, దే. వి: చూ, బేసికంటి.
బేసికైదువుజోదు, ద్వ. వి. అసమశరుఁడు: చూ, మన్మథుఁడు.
బేస్తవారము, వా. వి: చూ, బృహస్పతివారము.
బేస్తు, వా. వి. పేక, జూదములోనగువానియందలి కొద్దిగెలుపు. "బేస్తుకన్న తగ్గిన కుదేలు, బేస్తుకన్న హెచ్చినఆట"(వాడుక)
బేహారము, వై. వి.=వ్యవహార: చూ, రూ-బెహారము.
బేహారి, వై. వి.=వ్యవహార. 1: చూ, రూ-బెహారి; 2: చూ, వైశ్యుఁడు.
బేహారము, వై. వి. = వ్యవహార: చూ, రూ-బెహారము.
బేహారి, వై. వి. = వ్యవహార. (బేహారము + ఇ): చూ, రూ-బేహరి.
బేహారికుఁడు, వై. వి. = వ్యావహారిక, వ్యాపారము తెలిసినవాఁడు.

# బై

బైండు, వా. వి. పుస్తకమునకు అట్టకట్టుట.
బైకలు, వా. వి. బ: చూ, రూ-బయ్యంకలు.

బైజ, వై. వి: చూ, రూ-బయిజ.
బైడాలము, దే. వి: చూ, రూ-బయిడాలము.
బైరవాసము, వై. వి =బహిర్వాస: చూ, రూ-బయిరవాసము. (బైరువాసముఅని కొందఱు)
బైరవుఁడు, వై. వి.=భైరవ: చూ, భైరవుఁడు.
బైరాగి, వై. వి.=విరాగి: చూ, రూ-బయిరాగి. (బ. 2. అ.175
బైరి, దే. వి: చూ, రూ-బయిరి.
బైలగు, ద్వ. అ.క్రి: చూ, రూ-బయిలగు. ఉ, రా. 2. అ. 137.
బైలు, వై. వి.=బహి: చూ, రూ-బయలు-బయిలు.
బైసణ, దే. వి: చూ, రూ-బయిసణ.
బైసి, వై వి.=భవిష్య. 1. నియతి: చూ, సత్యము. 1; 2. గౌరవము, మర్యాద: చూ, సన్మానము; 3 భాగ్యము. పంచ. నా. 1, ఆ. 183: చూ, సంపద; 4. కీర్తి: చూ, సమాఖ్య. 1
బైసికిలు, వా. వి: చూ, రూ-బయిసికిలు.
బైసుక, దే. వి: చూ, రూ-బయిసుక. రుక్మాం. 5. ఆ; ఉ, హరి. 3, ఆ. 124.

## బొం

బొంకణము, వై. వి.=బోక్కాణ: చూ, బొక్కణము.
బొంకప్ప, దే. వి. ఒకచేఁప: చూ, మత్స్యము. 1.
బొంకరి, దే. విణ (బొంకు+అరి): చూ, బొంకులాఁడు.
బొఁకి, దే వి: చూ, రూ-బోఁకి.
బొంకించు, దే. స. క్రి. 1. మోసపుచ్చు: చూ, వంచించు; ప్రే. 2. బొంకఁజేయు.
బొంకు, దే. వి. 1 కల్లమాట. హరి. పూ. 5, ఆ, 234: చూ, శబ్దము. 2; విణ. 2 కల్ల: చూ, వితథము; స. క్రి. 3. అనృతమాడు: దబ్బు, బిజుగు, బొల్లు.
బొంకులాఁడి, దే. విణ. అసత్యములాడునది: చూ, స్త్రీ.
బొంకులాఁడు, దే. విణ: అస్నెకాఁడు, కల్లరి-కల్లరీఁడు, జల్లికాఁడు, టక్కరి, బొంకరి. (సం.)—అన్యాయవాది.
బొంగ, వా. వి. 1. జలప్రసరణ విశేషము. "చేనుగట్టంతయు బొంగలే"; 2. చిన్నమూతిగల కుండ: చూ, భాండము. 3.
బొంగరము, వై. వి.=భ్రమరక. త్రాడుచుట్టి యాడెడువస్తువు: రూ-బంగరము - బొంగురము - బొమ్మరము. (సం).—గిరికము, భ్రమరకము.
బొంగరాలు, వా. వి. బ. (బొంగరాలు): చూ, భక్ష్యము.
బొంగు, దే. వి. ఎండిన లావుబోలువెదురు: చూ, వెదురు. 2: చూ, కొమ్మ. 7.
బొంగుగొంతుకవాఁడు, వా. వి. (సం).— అస్వరుఁడు, అసౌమ్యస్వరుఁడు.
బొంగురము, వై. వి.=భ్రమరక: చూ, రూ-బొంగరము.
బొంగువెదురు, ద్వ. వి. 1: చూ, బొంగు; 2. గాలిసోఁకున మ్రోఁగెడు బొంగువెదురు: చూ, బొంగు.
బొంధ, వై. వి.=బంధ. (దేశ్యమని శ. ర.): చూ, బోను. 1.
బొండకొయ్య, వా. వి. —వై.—

బొందమ్రాను, వా. వి.—పై.—
బొండము, దే. వి. పెచ్చులోఁగూడిన టెంకాయ, కొబ్బరి బొండము: (రూ-బొండలము—బొండాము-బొండ్లము—బొండ్లాము—బొండ్లెము): చూ, స్కంధఫలము.
బొండలము, దే. వి.—పై.—
బొండాము, దే. వి: చూ, బొండము.
బొండిగ, దే. వి. బొడిమ: చూ, వృంతము 1.
బొందు, వా. వి. 1. కంఠము: చూ, మెడ; దే. విణ. 2. పరిమండలము, గుండ్రమైనది: "బొందుగంటలు": చూ, వర్తులము.
బొందుగ, దే. వి. కంఠనాళము. అప్ప. యు, కాం. 136: రూ-బొండువ. (సం).— కృకము.
బొండుమల్లె, ద్వ. వి. గుండుమల్లె*: చూ, మల్లె.
బొండువ, దే. వి: చూ, రూ బొండుగ.
బొండెము, దే. వి: చూ, తమకు. 2.
బొండ్లము, దే. వి: చూ, రూ-బొండము.
బొండ్లాము, —పై.—
బొండ్లెము, —పై.—
బొంత, వై, వి. 1.=కంథా: చూ, వస్త్రము; దే. విణ. 2. పెద్ద: చూ, సుర. (3)
బొంతకత్తియ, వా. వి. కుట్టని: చూ, శంభళి.
బొంతకాకి, ద్వ. వి. మాలకాకి: చూ, వాయసము.
బొంతజెముడు, ద్వ. వి. బొమ్మజెముడు*: చూ, స్నుహి.
బొంతరఁటి, దే. వి. పెద్దకాయల అరఁటి, మహేంద్రి *: చూ, రంభ. 2.
బొంతజాయి, దే. వి: చూ, తురకజాయి.
బొంతు, దే. వి. 1. చోడి జొన్న గంటె లోనగు వాని గింజల యడుగుననుండెడి కుదురువంటిపొట్టు; వా. 2: చూ, బొందు.4.
బొంద, దే, వి. 1: చూ, రంధ్రము. 1. 2. తాడులోనగువాని. చిన్నచెట్టు; వా. 3. తలనఱికిన అరఁటిమ్రాను: బొందియ—బొందె. (దీనిరొప్పులు విస్తర్లకుపయోగింతురు;) విణ-4: చూ, లంద.
బొందకోల, దే. వి. 1. సానకత్తి: చూ, రిష్టి. 2; (ఇదెమల్ల యుద్ధ సాధనాయుధము.)
బొందదము, ద్వ వి. (బొంత+దదము): రూ-బొందళము, కవచము: చూ. వారవారణము.
బొందదీఁడు, ద్వ. వి: చూ, వర్మితుఁడు.
బొందపక్కె, దే. వి: చూ, మత్స్యము. 1.
బొందపువ్వు, ద్వ. వి. తాటిమోవును పట్టియుండెడు మూఁగుపూవు: చూ, సుమము.
బొందళము, ద్వ. వి. (బొంత+దలము): చూ, రూ. బొందదము. ఉ, రా. 4, ఆ. 222.
బొంది, దే. వి. 1. మేను: చూ, శరీరము; 2, ఎముకలగూఁడు: చూ, శల్యము. 1.
బొందియ, వా. వి. రూ-బొందె. 1: చూ, బొంద. 3; 2. అరఁటి ఊఁచ: ఊఁచ, దూఁట.
బొందిలి, దే. వి. 1. ఒకానొకజాతి; వా. 2. బొందిలీకులస్థుఁడు.

బొందివేఁట, వా. వి. గూఁడ్లలోనుండెడి కొఁజాలు మొదలగు పక్షులతో నాడెడువేఁట.

బొందు, దే. వి. 1. చేరు. "పెండ్లి ప్రధానపు బొందు.": చూ, సూత్రము. 1; 2. చొక్కాయ ముడివేసెడు సన్ననాడా; 3. పుష్పసరము కళా. 4. ఆ. 82: చూ, భూషణము 2; 4. వెన్నుదీయుటకు యోగ్యముగాని వరిలోనగునది: రూ-బొద్దు.

బొందుపోవు, దే. అ. క్రి. 1. వరిలోనగునది వెన్నుదీయ యోగ్యముగాకపోవు; వా. 2. సూత్రముతెగు.

బొందులోపుస్తె బొందవంటిమగఁడు, లో పుస్తెమాత్రముకట్టి నిరుద్యోగియై భార్యను ఆదరించని భర్త.

బొందె, వా. వి: చూ, రూ-బొందియ.

బొంపిరి, వా. వి. 1: చూ, హెచ్చు. 2; విణ. 2: చూ. సంపూర్ణము.

బొంపిరిపోవు, వా. అ. క్రి: చూ, బలకాయించు.

బొంబాయి, వా. వి. 1. ఒకానొక రాజధాని; 2. నీరు వెలువరించు గొట్టము, కుళాయి-కుళ్ళా. (పైప్)

బొంయి, వా. వి: చూ, రూ-బొయ్యి.

బొక్క, వై. వి. = భూకమ్. 1. బిలము: చూ, రంధ్రము. 1; 2. కన్నము: చూ, రంధ్రము. 1; 3. గొయ్యి: చూ, రంధ్రము. 1; 4. శవమును పూడ్చెడు గొయ్యి; దే. 5. నోరునిండిన పొడియగు తినుబండము. "వాఁడుఅడుకులు రెండు బొక్కలు బొక్కినాఁడు" (శ. ర.): బొక్కు.

బొక్కణము, వై. వి. = బోక్కాణ. విబూది సంచి: చూ, రూ-బొంకణము.

బొక్కనియ, వై. వి. = బోక్కాణ. రూ-బొక్కెన. గుఱ్ఱము నకు ఉలవలు పెట్టెడు బొక్కెన; (సం.)-బోక్కరము—బోక్కాణము.

బొక్కపెరడు, ద్వ. వి. ఒకపాము: చూ, సర్పము.

బొక్కలాఁడు, ద్వ. వి.(బొక్కలు + ఆఁడు) 1. కన్నగాఁడు: చూ, హారకుఁడు. 1; 2. దొంగ: చూ, హారకుఁడు. 1; 3: చూ, సర్పము; వా. 4. ఎలుక: చూ, మూషికము.

బొక్కసము, దే. వి. 1: చూ, పంటసాల; 2. అర్థభారము. కాశీ. 5, ఆ. 67; అం.3: చూ, సప్తాంగములు.(అంగము 9)

బొక్కి, దే. వి. తొస్సె, బోసి; 2. మాంసములేనిది.

బొక్కిజొమ్మువాఁడు, వా. వి: చూ, కుబ్జుఁడు.

బొక్కిన, దే.వి.1. బట్టలపెట్టె, కరోటకము: చూ, సందుకా; 2: చూ, రూ-బొక్కిసా.

బొక్కిసా, దే. వి. 1. చిన్నమూట; వా. 2: చూ, బొక్కెన. 4.

బొక్కు, దే. వి. 1. నిండిననోరు: చూ, బొక్క. 5; స. క్రి. 2. నోటినిండతిను: చూ, బొక్కులాడు.

బొక్కులాడు, దే. స. క్రి: చూ, బొక్కు. 2.

బొక్కెన, దే. వి. 1: చూ, పిరుపిప్పలి*; వై. వి. 2. = బోక్కాణ: చూ, బొక్కనియ; 3. = బోక్కాణ. నీళ్లెత్తి పోసెడు తోలుసంచి: (సం.)—కరకపత్రిక; 4.=బోక్కాణ. రూ-బొక్కిన-బొక్కిసా. పిరుచేఁదెడు పాత్రము: చూ, పాత్రము. 6-అ౫; తద్వి.- కఱ్ఱచేఁదకు.=(సం.) అంబువాహిని. (తె.) కఱ్ఱచేఁద.

బొగడ, దే. వి. 1: చూ, రూ-బుగడ; 2. మంచపు గోడు శిఖరము; బ. 3. చూచుకము కళా. 1, ఆ. 131: చూ, స్తనము; 4. గందపట్టైమీఁది గుబ్బ: గుబ్బ; 5. చెఱువుకట్ట లోనగువానియందు నీళ్లదూఱివచ్చెడు బొంగ: చూ, బొంగ.

బొగడము, వా. వి. పొగటాల పాళిగదులు నడపెడు కాయ.

బొగడసరులు, వా. వి. బ. చూ, ధాన్యము.

బొగిణి, వా. వి: చూ, దబరా.

బొగ్గరము, వా.వి. ఉక్కతోఁగూడిన వేఁడిమి: చూ, పేంద్రము. (ఉత్తరసర్కారులలో వాఁడుక.)

బొగ్గు, దే. వి: నల్ల, మసి, నిప్పు. (సం.)— అంగారకము— అంగారము. ఆంగారము, అగ్నిచిత్తు, అఙ్గల, ఇంగాలము, ఉల్క, కాలిక-కాళిక-కాలికము-కాళి, కోకిలము. (చూ, వహ్ని. 1.)

బొగ్గుగరఅచుట, జా. (పూరిగఅచుట వంటిది) నీచదశకు వచ్చుట. "వారు కట్టకడకు నిగ్గుబడి బొగ్గు గఅవకమానరు." (ధర్మజరాజసూయము.)

బొగ్గులకుప్ప, వా. వి. అంగార్య: చూ, వహ్ని. 1.

బొచ్చె, దే. వి. 1. కుండలోనగు వానిపెంకు: చూ, పెంకు. 3; 2. తలపుఱ్ఱె: చూ, పించు; 3. ఒకచేఁప: చూ, మత్స్యము.1.

బొచ్చు, వా. వి. కేశము: చూ, వెంద్రుక.

బొచ్చుమెకము, ద్వ. వి: చూ, భల్లము. 2.

బొజుఁగు, వై. వి. = భుజంగ. అచ్చ. అర, కాం. 1: చూ, విటుఁడు.

బొజ్జ, దే. వి: చూ, పొట్ట. 1.

బొజ్జదేవర, వా. వి: చూ, వినాయకుఁడు.1.

బొజ్జవాఁడు, దే. విణ: చూ, లంద.

బొటనవ్రేలికొన, అం: చూ, కళాస్థానములు.

బొటనవ్రేలు, దే. వి: చూ, పెద్దవ్రేలు. (రూ-బొట్టనవ్రేలు—బొటవ్రేలు-బొట్టవ్రేలు-పొటవ్రేలు-పొట్టవ్రేలు.)

బొటనవ్రేలు, —పై.—

బొటవ్రేలు, —పై.—

బొటిమ, దే. వి. మొటిమ: చూ, స్థూలోచ్చయము.

బొట్ట, దే. వి. వెదురుబద్దలగాదె: చూ, పంటసాల.

బొట్టడి, దే. వి. దొర్లించెడు నల్లబాయి: చూ, రాయి.

బొట్టనగోలలు, దే. వి. బ: చూ, బాలక్రీడ.

బొట్టనవ్రేలు, దే. వి. 1: చూ, రూ-బొటనవ్రేలు: అం. 2: చూ, కళలుండుస్థలములు.

బొట్టము, దే. వి. గోఁచి: చూ, లంగోటి.

బొట్టవ్రేలు, దే. వి: చూ, రూ-బొటనవ్రేలు.

బొట్టి, వా.వి.బ్రాహ్మణ శ్రేష్ఠవాచకము: చూ, స్వస్తిముఖుఁడు.1.

బొట్టియ, వై. వి. 1.= పుత్రక. రూ-బొట్టె. కొడుకు. అచ్చ. యు, కాం. 70: చూ, సూనుఁడు. 1; 2.=పుత్రిక. రూ-

బొట్టె. కూఁతురు. అచ్చ. యు, కాం. 486: చూ, సూన. 1; వా. 3. బాలకుఁడు: చూ, శిశువు; దే. వి. 4. బాణము లోనగువాని చివర నేర్పఱచెడు తామరమొగ్గవంటి ములికి: బొట్టె, బొట్టెకోల.

బొట్టియఁడు, వై. వి.=పుత్రకః చూ, రూ-బొట్టియ. 1.

బొట్టియకోల, వా. వి. డుపుడక్కవాఁడు శకునము చెప్పునపుడు చేతితోఁబట్టుకొను చిన్న సన్నపుకఱ్ఱ.

బొట్టు, వై. వి. 1.=పుండ్రమ్. పుండ్రము. తద్వి -౧.చుక్క బొట్టునకు.—చుక్క, చుక్కబొట్టు, బొట్టు. (సం).—అపాంగము, కలాపకము, కశేరువు, చిత్రకము, చిత్రపత్రము, చిత్రము, తమాలపత్రము, తమాలము, తిలకము, నాభి, పుండ్రము, బిందువు, విశేషకము; ౨. (సం)—అంగులితోరణము; ౩: అడ్డబొట్టు; ౪: కావలిబొట్టు, కావిరిబొట్టు, కావు; ౫: చాఁదు. (సం)—జాషము; ౬:చారిక-చాటిక, పత్తిరిబొట్టు, ౭:చేరుచుక్క-చేర్చుక, చేఱుచుక్క, చుక్కచేఱు, పాపటచేఱు, పాపటబొట్టు. (సం).—పత్రపాళ్య, లలాటిక; ౮: తిరుచూర్ణము, తిరుమణి,తిరుమన్ను, ౯. తిరునామము, పంగనామము; ౧౦: నిలువుబొట్టు, పుదియబొట్టు. (సం).- ఊర్ధ్వపుండ్రము; ౧౧: (సం).—పటలము, పట్టైవర్ధనము; ౧౨: నీటిబొట్టునకు — (చూ, "బొట్టు. 6"); ౧౩: అవిసెయాకుబొట్టు. ౧౪: అచ్చుతబొట్టు. (మిగతవానికి "చూ, విశేషము. 1."); 2: చూ, తాలిబొట్టు. 1: 3: చూ, తాలిబొట్టు. 2; 4. అనుస్వారము; చూ, సున్న. 1; 5: చూ, బుజ్జ 1; 6: నీటిబొట్టు, చుక్క. (బ) తొంగిళ్లు. (సం).—కంకణము, జలబిందువు, ద్రప్సము; (౧); తద్వి: అట్లొట్లు-నట్టొట్లు, వంగిళ్లు. 7=భట్ట. విప్రనామానుబంధము, భట్టు: చూ, స్వస్తిముఖుఁడు; వా. 8. ఒక కాని (రు 0-0-3.) (రాయలసీమలోవాడుక); 9. నేయి నూనెలోనగు వాని వడ్డనయం దుపయోగించెడిమాట. "నేతిబొట్టు, నూనెబొట్టు." మొ; 10. (పాయిఁటు.) బిందువు; 11. మద్యము. "ఇదివీఁడుత్రాగిన బొట్టుమహిమయే": చూ, సుర. 2; 12; పచ్చాబొట్టు (అంటిపీడనిది.)

బొట్టుగు, వై. వి. రూ-బొట్టువు *: చూ, నువ్వు. (నువ్వులు.)

బొట్టుదారము, ద్వ. వి. బొట్టునగ్రుచ్చెడు మంగళసూత్రము: చూ, భూషణము. 2.

బొట్టుపెట్టె, వా. వి. ఆఁడువారు కుంకుమాదుల నుంచుకొనెడు చిన్నపెట్టె: చూ, సందుకా.

బొట్టువు, వై. వి; చూ, రూ-బొట్టుగు *.

బొట్టె: చూ, రూ-బొట్టియ.

బొట్టెఁడు, వై. వి. =పుత్రి. బాలుఁడు. అచ్చ. బాల, కాం. 201: చూ, శిశువు.

బొట్టెకోల, దే. విః చూ, బొట్టియ. 4. కళా. 7, ఆ. 129.

బొడబొడ, దే. వి. 1. కాఱుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ; 2. మ్రోయుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

బొడాబొడి, వా, విణ. వెల్లడియైనట్టి. "బొడాబొడిమాటలు.": చూ.రూ-బొళాబొళి.

బొడిగ, వై. వి. =పృథుకః చూ, బొట్టెఁడు.

బొడిప, దే. వి: చూ, బుడిపి. 1.

బొడిమ, దే. వి. పావకోళ్ళబిరడ.

బొడియ, దే. వి. రెండుపిడ్డెలపు వేసెడుపెన.

బొద్ద, దే. వి, అత్తి *: చూ, మేడి

బొద్దనభావి, ద్వ. వి. నడుమ పిల్లనూయిగల కోనేఱు. ప్రభా. 1, ఆ. 65: చూ, సరస్సు. 1.

బొద్దసరము, దే. వి. పైరులోమొలచు మొక్క *: రూ—బోదసరము.

బొద్దు, దే. వి. 1. (లక్ష్మి. 5, ఆ. 63): పొక్కిలి. (సం).—ఉదానము, గుల్మము, తుందకూపి, తుందికరము, న,నాభి. తద్వి —ఉబుకుడుబొద్దు, ఊఁదబొద్దు. (సం). — తుండి-తుంది; అం. 2: చూ, కళాస్థానములు.

బొద్దుగాలి, వా. వి. సమానవాయువు: చూ, వాయువు.

బొద్దుజవిక, ద్వ. వి. చుట్టుకొల్లారము నడిమిచావడి: చూ, సదనము. 1.

బొద్దుకాఁడ, దే. వి: బొద్దుపుడక. (సం).— అమల.

బొద్దుపుడక, —పై.—

బొద్దుఱాయి, వా. వి. కోటగుమ్మమునడుమఱాయి: చూ, రాయి.

బొద్దువాఁడు, వా. వి: గోందుఁడు, తుండిభుఁడు- తుందిభుఁడు-తుందిలుఁడు.

బొణిగ, దే. వి. సరుకుతోనున్న చేతిసిద్దె: చూ. సిద్దియ.

బొణిగలు, దే. వి. బ. 1. పొట్టుపిడి బ్రద్దలుకాని కాయధాన్యము: చూ, స్తంబకరి (ధాన్యము ; 2. బొంతువీతనిజొన్న లోనగునవి; 3: చూ, భక్ష్యము.

బొత్త, దే. వి. 1. తామ్రాది పాత్రములబొంద: చూ, బొంద. 1; వా. 2. దండుగ: చూ, నేగి. 4; 3. నిలవసొమ్ములోని తఱుగు (తక్కువ.)

బొత్తాము, వా. వి: బొత్తాసు, గుండీ. (బటన్సు.) తద్వి.—పిన్నీసు.

బొత్తాసు, వా. వి.—పై.—

బొత్తి, వా. వి: చూ, పౌర. 6.

బొత్తిగ, వై. ద్ర. క్రి. విణ. మొదలంటః చూ, వడారము.

బొత్తు, వా. వి. బాలతాళము.

బొత్సొసాంతోబ్రాహ్మణులు, అం: చూ, సాంతోబ్రాహ్మణులు. (చూ, ఉత్కళులు.)

బొద, దే. వి. మొదవ *: చూ, తృణము. 1.

బొది, దే. వి. 1. ఓడలుచేసెడుచోటు: చూ, స్థానము. 1; వా. 2: చూ, పాదు. 1; 3. బొఱియ: చూ, రంధ్రము. 1.

బొద్ది, దే. వి. 1: చూ, శ్యామము. 7. * ; వై. విణ. 2.=వృద్ధ. పెద్దది: చూ, సుర. (3).

బొద్దికూర, వా. వి: చూ, బొద్ది. 1. *

బొద్దీఁక, దే. వి: చూ, బరిడెపురుగు.

బొద్దీఁగ, వా. వి.—పై.—

బొద్దు, దే. వి. 1. గోడలోనగువానియందలి అంచు తద్వి.-౧. గోడబొద్దునకు.—అడుగుబొద్దు, బొద్దు, మొలత్రాడు; ౨. పేముబొద్దునకు.—కమ్మి, బొద్దు; 2: చూ, గడ్డిబొద్దు: బ. 3. హస్తాభరణము: చూ, భూషణము. 2.

బొద్దుకీటు, వా. వి. పునాదిగోడపై పెట్టెడుకీటు.

బొనము, దే. వి. మెఱుగు.

బొప్పఁడు, దే. విణ: చూ, బేల. 2.

బొవ్పటము, వా. విణ. లేకుండఁగచేయుట. "నీకుబొప్పటము అయినదా?": చూ, శూన్యము.

బొప్పాయి, వా. వి. రూ-బొబ్బాయి*: చూ, వృక్షము. (దీని పండు తినిన స్త్రీలకు పాలుపడును. కడుపులోని బల్లలు కరుగును. మూలటశంకములు తగ్గును)

బొప్పి, దే. వి. కంతి, కదుము, గనుపు, గాదము, గ్రావ, పుంగుపు—ప్రుంగుడు, బుడిపి. బుడ్పి. (సం)—గ్రంథి.

బొబ్బ, దే. వి. 1. పెద్దఅఱపు: చూ, స్వరము. 2; 2. పొక్కు: చూ, వ్రణము; 3. సింహనాదము: చూ, స్వరము. 2; వా. 4. త్రాగెడునీరు: చూ, సలిలము. (ఉత్తరసర్కారులలో వాడుక.)

బొబ్బట్టు, దే. వి. చూ, రూ-ఒబ్బట్టు.

బొబ్బము, వా. వి. రూ-బొబ్బాము: చూ, వంకము. 3.

బొబ్బమెకము, ద్వ. వి: చూ, సింహము.

బొబ్బర, వై. వి=బర్బర. 1: చూ, బరడు. 1; 2: చూ, బెరడు; 3. అలచందలను సస్యము: చూ, సస్యము. 1.

బొబ్బరబ్రాహ్మణులు, అం: చూ, కర్ణాటకులు.

బొబ్బరలు, వై. వి. బ: చూ. ధాన్యము. (చూ, రాజమాషము.)

బొబ్బరించు, దే. అ. క్రి. బొబ్బవేయు.

బొబ్బరింత, దే వి. బొబ్బరింపు: చూ, స్వరము. 2.

బొబ్బరింపు. వా. వి. —పై.—

బొబ్బలగొట్టు, వా. వి: చూ, బీదవాఁడు.

బొబ్బలి, వై. వి.=బర్బుర. అజభక్షము, కఫాంతకము*: చూ, విట్ఖదిరము.

బొబ్బాటము, దే. వి: చూ, బొబ్బరింత.

బొబ్బాము, వా. వి: చూ, రూ-బొబ్బము.

బొబ్బాయి, వా. వి: చూ, రూ-బొప్పాయి*.

బొబ్బెట్టు, వా. వి: చూ, బొబ్బరింత.

బొమ, వై. వి.=భ్రూ: చూ, రూ-బొమ్మ. (ప్రతిమకు.—విక్ర. 7, ఆ. 72.)

బొమముడి, దే. వి. రూ-బొమ్మముడి: చూ, భ్రుకుటి.

బొమముడిపాటు, ద్వ. వి: (సం.)—ఆకారము; ఇంగము, ఇంగితము.

బొమిక, దే. వి. ఎముక: చూ, శల్యము. 1.

బొమికలగోడ, వా. వి: (సం).—ఏడుకము—ఏడూకము: చూ, సరాతి.

బొమికము, దే. వి. (రూ-బొమిడికము-బొమిడీకము—బొమ్మికము—బొమ్మిడికము—బొమ్మిడీకము) కిరీటము: చూ, శీనకము. (1.)

బొమిడికము, —పై.—

బొమిఢీకము, —పై.—

బొమ్మ, వై. వి. రూ-బొమ్మ. 1.=బ్రహ్మ: చూ, బ్రహ్మ. 1; 2.=భ్రూవు. కనుబొమ: చూ, భ్రూవు (దేశ్యమని శ. ర.), 3. ప్రతిమ: చూ, హరిణి. 3; 4. బిరుదచిహ్నము: చూ; లక్షణము. 1; 5: అవమానచిహ్నము: చూ, లక్షణము. 1; విణ. 6: చూ, స్వల్పము.

బొమ్మంచు, ద్వ. వి. 1. ఎఱుపు: చూ, వర్ణము. 6; 2. ఎఱ్ఱరంగుబట్ట, ఎఱ్ఱఅంచుబట్ట (అని కొందఱు): చూ, వస్త్రము; విణ. 3. ఎఱ్ఱనిది. ఉ, రా. 7, ఆ. 44: చూ, వర్ణము. 6.

బొమ్మఁడు, వై. వి.=బ్రాహ్మణ. పాండు 3, ఆ. 80: చూ, స్వస్తిముఖుఁడు. 1.

బొమ్మచీర, వా. వి. పొత్తి: చూ, వస్త్రము.

బొమ్మచారి, వై. వి=బ్రహ్మచారి. (రూ-బొమ్మసారి-బొమ్మాసారి-బమ్మచారి-బమ్మాచారి-బమ్మసారి-బమ్మాసారి): చూ, వటువు.

బొమ్మచుక్క, వై. వి. అభిజిన్నక్షత్రము, కానరానిచుక్క: చూ. రిక్క.

బొమ్మజెముడు, వై. వి. సింహుండము*: చూ, స్నుహి.

బొమ్మడాయ, దే. వి. మద్గురము: చూ, మత్స్యము. 1.

బొమ్మపెండ్లిండ్లు, దే. వి. బ: చూ, బాలికాక్రీడ.

బొమ్మపెట్టుట, జా. వెక్కిరించుట. "దేవతా నటీ మణులకు బొమ్మపెట్టు క్రియమర్దల తాళనినాద పద్ధతిన్." (రామాభ్యుదయము)

బొమ్మముడి, దే. వి: చూ రూ-బొమముడి.

బొమ్మమేడి, దే. వి. కాకోదుంబరిక*: చూ. వెట్టిమేడి.

బొమ్మర, వై. వి.=భ్రమ. 1. రూ-బమెర-బొమ్మఱ: చూ, భ్రాంతి 1; 2; చూ, భ్రాంతి. 2.

బొమ్మరక్కసి, వై. వి.=బ్రహ్మరక్షస్ (రూ-బొమ్మరాకాసి-బమ్మరక్కసి). 1: చూ, బ్రహ్మరాక్షసి: చూ, రాక్షసుఁడు. 1; 2. బ్రహ్మరాక్షసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

బొమ్మరము, వై. వి.=భ్రమరక: చూ, రూ-బొంగరము.

బొమ్మరములు, వై. వి. బ: చూ, బాలక్రీడ.

బొమ్మరవోవు, ద్వ. అ. క్రి: చూ, ఆమ్మరించు.

బొమ్మరాకాసి, వై. వి. =: చూ, రూ-బొమ్మరక్కసి.

బొమ్మరిక్క, వై వి: చూ, బొమ్మచుక్క.

బొమ్మరిల్లు, దే. వి. (బొమ్మ+ఇల్లు) బాలిక లాడుకొనెడు బొమ్మల చిన్నయిల్లు: చూ, సదనము. 1.

బొమ్మఱాయి, దే. వి. తెల్లని చిన్నఱాయి: చూ, రాయి.

బొమ్మలాట, వా. వి.1. పాంచాలికేళి; 2 (తోలుబొమ్మల) ఆట.

బొమ్మసారి, వై. వి. 1: చూ, రూ-బొమ్మచారి; వా. వి. 2. బొమ్మల తగవు.

బొమ్మసారె, —పై.—

బొమ్మాసారి, —పై.—

బొమ్మికము, దే. వి: చూ, రూ-బొమిడికము.

౯. లోఁగడుపునకు.-విణ. అంతర్గర్భము, కోష్ఠము. (మిగత వానికి "చూ, వ్రేఁకటి")
భ్రూభంగము, సం. వి. అ. పుం: చూ, భ్రూకుటి.
భ్రూమధ్యము, సం. వి. అ. న: బిందువు.
భ్రూవు, సం. వి. ఊ. స్త్రీ.=బొమ. 1: చూ, ఆవి. కూర్చిక. కోదండము. (తె.)—కనుబొమ, బొమ–బొమ్మ; అం. 2: చూ, చక్రములు.
భ్రూవులు, అం: చూ, రూ-భ్రువులు.

# మ

మ, ఒకయక్షరము సం. వి. అ. పుం. 1: చూ, శివుఁడు; 2: చూ, బ్రహ్మ 1; 3: చూ, హిమాంశువు; 4: చూ, వహ్ని. 1; 5. ప్రాణి: చూ, సంతతి. 1; 6: చూ, యముఁడు; 7: చూ, సమయము. 1; 8: చూ, విషము; 9: చూ, విష్ణువు. 1; అం. 10: చూ, కవర్గము; 11: మధ్యమ స్వరస్థానము. మధ్యమము (మః) చూ, సంగీత స్వరములు (స్వరము.2.)
మమ్, సం. వి. అ. న. జనము, మంది; చూ, సంతతి. 1.
మంకు, దే, విణ. 1.=మూర్ఖ; చూ, స్తబ్ధుఁడు; 2; చూ, మొండి. 1.
మంకుతనము, దే. వి. 1. చండితనము; చూ, విలంబము. 1; 2. మూర్ఖత్వము; చూ, మౌర్ఖ్యము.
మంకెన, దే. వి. 1; చూ, రక్తకము 3. *. పాండు. 2, ఆ. 41; 2. ఎద్దుమీఁద నీళ్ళబిందెలు తెచ్చునపుడు ఆబిందెల క్రింద కుదురుగా సంతనచేసి యుంచఁబడు బెత్తపుబుట్టల జత; చూ, మట్టు. 3.
మంకెనలు, దే. వి. బ: చూ, ధాన్యము; 2. చూ, బాలక్రీడ.
మంక్షు, సం. అవ్య. శీఘ్రముగ: చూ, వేగము. 3.
మంఖణము, సం. వి అ. న. పిక్కలకుఁదొడిగికొను కవచము; చూ, వారవారణము.
మంగ, దే, వి; చూ, శ్వసనము.*.
మంగల, దే. వి. క్షౌరకజాతి. (మంగలవాఁడు, మగలది.)
మంగలకత్తి, ద్వ. వి. క్షురము: చూ, రిష్టి. 2.
మంగలకత్తిరూపు, ద్వ. వి. కృత్తిక; చూ, ఠక్క.
మంగలపక్కె, దే. వి; చూ, మత్స్యము. 1.
మంగలపిట్ట, ద్వ. వి; చూ, వ్యాఘ్రాటము.
మంగలము, సం. వి. అ. న. చూ, రూ-మంగళము. 1—2; దే. వి. (1) వేఁపుడుచట్టి; చూ, పాత్రము. 6-ఆ౧.
మంగలవాఁడు, దే. వి; చూ, మంగలి.
మంగలి, దే. వి. (వై=మంగలి. మంగళప్రదుఁడు, మంగలి. సం. అనియు రూ-మంగళి అనియు కొందఱు.) 1. రూ-మంగలవాఁడు, మంగి. (సం).— అంతావళాయి- అంతావసాయి - అంతేవసాయి, అంబష్ఠుఁడు, కల్పకుఁడు, కేశచ్ఛిత్తు, క్షురమర్ది, క్షురి, క్షౌరికుఁడు, వండిలుఁడు, చండాలుఁడు—చాండాలుఁడు, దివాకీర్తి. నాపితుఁడు, ముండి ("చూ. శిల్పులు."); అం. 2; చూ, శిల్పులు.

మంగలికొప్పు, దే. వి. ఎ. సన్నాయి.కళా. 7. ఆ.75.చూ,పీజె.
మంగలిపని, దే. వి. క్షౌరము; చూ. ముండనము.
మంగళ, సం. వి. ఆ. స్త్రీ. 1; చూ, పార్వతి; 2. తెల్లగరిక*. చూ, హరిత (తృణము. 1.)
మంగళకౌశిక, అం: చూ, స్త్రీరాగములు.
మంగళదేవత, సం. వి. ఆ. స్త్రీ. చూ, లక్ష్మి.
మంగళమహాశ్రీవృత్తము, అం: చూ, వృత్తము. 1.
మంగళము, సం. వి. అ. న. 1: చూ, శుభము. 1; వా. 2. ధ్వంసము.
మంగళముచేయు, వా. ము. స. క్రి. 1. శ్రేయస్కోరు: చూ, దీవించు; 2, ధ్వంసముచేయు.
మంగళ వాచకములు, అం: (తె.)—జేజే, జొహారు-జోహారు.
మంగళవారము, అం: చూ, వారములు.
మంగళసూత్రము, సం. వి. అ. న: బొట్టుదారము. కళా. 7, ఆ. 75: చూ, భూషణము. 2; 2. మాంగల్యము, పుస్తె: చూ, భూషణము. 2.
మంగళహారతి, వై. వి.=మంగళార్తి. రూ-మంగళారతి: చూ, హారతి.
మంగళారతి, వై. వి =—వై.—
మంగళార్తి, సం. వి. ఈ. స్త్రీ.= మంగళహారతి. —వై.—
మంగళాశాసనము, సం. వి. అ. న. (వైష్ణవ పరిభాషయందు) ఆశీర్వాదము: చూ, దీవన.
మంగళుఁడు, సం. వి. అ. పుం. కుజుఁడు: చూ, వక్రుఁడు. 1.
మంగళ్య, సం. వి. ఆ. స్త్రీ. 1. గోరోజనము: చూ, రోచన. 1; 2. జమ్మి*: చూ, శమి. 1; 3. తెల్లపస*: చూ, విష; 4: చూ, సదాప*.
మంగళ్యకము, సం. వి, అ. పుం: చూ, రూ-మంగళ్యము. 6.
మంగళ్యము, సం. వి. అ. న. 1. మల్లెపూవాసనగల అగరు, మల్లెపూవాసనగల కృష్ణాగరు (నల్లఅగరు) (అనికొందఱు) చూ, రాజార్హము; 2 చూ, మీఁగడపెరుఁగు; పుం. 3 కలు క్రాంత*: చూ, వార్షికము. 1; 4: చూ, మారేడు*; 5: చూ, రావి*; 6. మంగళ్యకము, చిఱుసెనగలు: చూ, సెనగలు; విణ. 7; చూ, శుభకరము.
మంగి, దే. వి; చూ, రూ-మంగలి.
మంగు, దే. వి. రూ-మంగుడు-మాఁగు. ముఖసిధ్మము; చూ, సిధ్మము.
మంచకము, సం. వి. అ. పుం: చూ, మంచె.
మంచము, సం.వి. అ. పుం. = మంచము. 1: చూ, మంచము; 2: చూ, మంచె,
మంచి, దే. వి. 1 యోగ్యత: చూ, సామర్థ్యము. 2; 2. ఇష్టోక్తి: చూ, శబ్దము. 2; 3. బుజ్జగింపు: చూ, సమరసము 2; అం. 4. సామము: చూ, ఉపాయములు. (1-2-3-4); విణ. 5: చూ, సజ్జనుఁడు; 6: చూ, శ్రైష్ఠ్యము; 7: చూ, యోగ్యము. 2. (మఱియు దీనికి సందర్భానుసారముగా ననేకార్థములు చెప్పెదరు.)
మంచిగంధము, ద్వ. వి. శ్రీచందనము: చూ, వాసన. 1.

మంచిచెడ్డలు, దే. వి. బ: అవుగాములు — బొగాములు, కలిమిలేములు, సముగాములు, దాగుడుగులు, మేలుగీళ్లు (సం)— ఉచ్చనీచములు, సుఖదుఃఖములు, (వ్య.) కష్టసుఖములు మొదలగునవి.

మంచితనముచేయుట, అం: చూ, సామము. 3.

మంచితెలివి, అం: చూ, రాజలక్షణములు.

మంచిత్రోవ, దే. వి. సత్పథము: చూ, మార్గము. 1.

మంచిదారి, దే. వి: చూ, మంచిత్రోవ.

మంచిది, దే. అవ్య. మాదాగు: చూ, సమ్మతి. 1.

మంచినడత, దే.వి.!: చూ, శీలము. 2; 2: చూ, వర్తనము.1.

మంచినీరు, ద్వ. వి. కుడినీరు: చూ, సలిలము. 1.

మంచినూనె, ద్వ. వి. అంటునూనె: చూ, స్నేహము. 2.

మంచిపని, దే. వి: చూ, హితము. 1

మంచిపాము, దే. వి. నాగుబాము: చూ, సర్పము.

మంచిబెల్లము, దే. వి. చెఱకు రసముతోఁజేసిన బెల్లము: చూ, శర్కర. 1.

మంచిమాట, వా. వి. 1. పరిభాష: చూ, శబ్దము. 2; 2 ఇష్టోక్తి: చూ, శబ్దము 2.

మంచిముత్తెము, ద్వ. వి. అకృత్రిమమైన మౌక్తికము: చూ, రత్నము. 1.

మంచియ, వై. వి =మంచ: చూ, రూ-మంచె.

మంచివాఁడు, దే. వి. 1. చూ, మంచి. 5; 2: చూ, సుకృతి.1.

మంచె, వై. వి.=మంచ. రూ-మంచియ. అరప: చూ, శయ్య.1,

మంచపుఁగోడు, వా. వి: చూ, కాలు. 3.

మంచము, వై. వి. = మంచ. పానుపు: చూ, శయ్య. 1.

మంచు, దే. వి. 1: చూ, హిమము; క్రే. 2. (రూ-మనుచు—మనుపు) మనఁజేయు.

మంచుఁగొండ, ద్వ. వి. హిమవత్పర్వతము: చూ, పర్వతము.

మంచుకారు, దే. వి. హేమంతఋతువు: చూ, మాసద్వయము.

మంచుగుబ్బలి, ద్వ. వి: చూ, మంచుఁగొండ.

మంచుటిలదాల్పు, దే. వి.—పై.—

మంచుతఱి, దే వి: చూ, మంచుకారు.

మంచుత్రాగుడు పులుఁగు, దే. వి: చూ, వెన్నెల పులుఁగు.

మంజరి, సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. చిగిరించిన లేఁతకొమ్మ: చూ, శాఖ. 1; 2. బొట్టుగు*: చూ, శ్రీమాన్ (నువ్వు!; 3. పెద్దముత్తెము: చూ, రత్నము. 1; 4. పూగుత్తి: చూ, స్తబకము; అం. 5: చూ, మహాకావ్యము; 6: చూ, క్షుద్రప్రబంధము; పా. 7: చూ, వృత్తము. 1. (ఒక్కొక్క పాదమున మూఁడింద్ర గణంబులును ఒక సూర్యగణంబును గలిగి మూఁడవ గణాద్యక్షరము యతిగాఁగల వృత్తము. ద్విపదవలెనే నడచును కాని ప్రాసము లేదు. యతియున్న చాలును).

మంజిడి, వై. వి. 1. = మాంజిష్ఠమ్. చిత్రవర్ణవస్త్రము. పాండు 1, ఆ. 110; నై. 6, ఆ. 108: చూ, వస్త్రము; 2. నీల వస్త్రము. ఉ, హరి. 2, ఆ. 171: చూ, నీలి (2.)

మంజిమ, సం. వి. న్. పుం. రూ-మంజిమము: చూ,మనోజ్ఞత.

మంజిష్ఠ, సం. వి. అ. స్త్రీ. 1.=మంజటి: చూ, సమంగ. 1;2. మిక్కిలిప్రకాశించెడి యెఱుపు: చూ, వర్ణము. 6.

మంజిష్ఠారాగము, సం. వి. అ. పుం. బయటికిని విశేషముగ కనఁబడుచు లోపలను ఎప్పటికిని వీడకుండెడు గాఢానురాగము (చూ, పూర్వరాగము.)

మంజీరము, సం. వి. అ. పుం. అందె: చూ, భూషణము. 4.

మంజుఘోషుఁడు, సం. వి. అ పుం: చూ, బుద్ధుఁడు.

మంజుభద్రుఁడు, —పై.—

మంజుభాషిణి, పా: చూ, వృత్తము. 1. ("స-జ-స-జ గురువులు. 9 యతి. 13 వ ఛందస్సు.)

మంజులము, సం. వి. అ. న 1. పాఁచి: చూ, శైవలము 1; 2. పొదరిల్లు: చూ, సదనము. 1; పుం. 3. ఒకరకము కూకురుగుండెంగ: చూ, దాత్యూహము (చూ, శకుంతి): విణ. 4. ఒప్పిదమైనది: చూ, హృద్యము; అం. 5: చూ, సంయుతహస్తములు.

మంజువు, సం. విణ. (ఉ): చూ, మంజులము. 4.

మంజుశ్రీ, సం. విణ: చూ, బుద్ధుఁడు.

మంజూష, సం. వి. అ. స్త్రీ.=మంజస. పెట్టియ: చూ,సందుకా.

మంజటి, వై. వి.=మంజిష్ఠ*: చూ, సమంగ. 1.

మంజస, వై. వి.=మంజూష: చూ, మంజూష.

మంజాడి, దే. వి. రూ-మంజాళి. 1. వజ్రములతూనిక; వా. 2 బట్టతలతూనిక.

మంజాళి, వా. వి.—పై.—

మంజూరు, వా. వి. 1: చూ, సమ్మతి. 1; 2. చెల్లుబడి.

మంట, దే. వి 1: చూ, రోషము; 2. జ్వాల: చూ, వహ్ని. 1: 3.చుఱుకుమనెడు నొప్పి. "గాయము మంట యెత్తుచున్నది."

మంటకము, సం. వి. అ. పుం.=మండెగ: చూ, భక్ష్యము.

మంటచమురు, దే. వి. కాలిన గరిఁటె చమురు: మంటనేయి.

మంటనేయి, —పై.—

మంటపము, సం. వి. అ. న. రమ్యభవనము: చూ, సదనము 1.

మంటఁబెట్టు, వా. స. క్రి: చూ, మండఁబెట్టు.

మంటమారి, దే. విణ. 1. జ్వలనశీలుఁడు; 2. కోపశీలుఁడు. వసు. 4, ఆ. 44.

మంటిగడ్డ, ద్వ. వి. గడ్డ: చూ, భూమి. 1—౦౦౦.

మంటిగోడ, ద్వ. వి: చూ, రూ-మట్టిగోడ.

మంటినూనె, ద్వ. వి. (మన్ను+నూనె): చూ, మట్టితైలము.

మండ, సం. వి. అ. స్త్రీ. 1. ఉసిరిక*: చూ, శ్రీఫలి. 1; దే. వి. (1.) కొమ్మ: చూ, శాఖ. 1; (2.) చిన్నకొమ్మ. స్వా. 4, ఆ. 37: చూ, శాఖ. 1; (3.) వితతశాఖ: చూ, శాఖ. 1; (4): చూ, నీలమండ.

మండ(బెట్టు, వా. స. క్రి. దహింప(జేయు: చూ, వెలు(గు. 5. (కోపమువచ్చినపుడు(గూడ వాడెదరు.)

మండకంచము. ద్వి. వి. అంచుకట్టిన కంచము: చూ, హరివాణము (పాత్రము. 6.)

మండగబ్బ, వా. వి. రూ-మండ్రగబ్బ: చూ, వృశ్చికము. 1.

మండనము, సం. వి. అ. న. 1: చూ, భూషణము. 2; 2. అలంకరించుట: చూ, భూషణము 2; విణ 3 అలంకరించునది.

మండనుఁడు, సం. విణ: అలంకరిష్ణువు, అలంకర్త.

మండపము, సం. వి. అ పుం, న. 1. చవికె: చూ, సదనము. 1; 2. చావడి: చూ, సదనము. 1. వై. వి. (1). = మంటపము. చవికె: చూ, మండపము. 1.

మండపి, సం. వి. ఈ. (స్త్రీ). చిన్నమండపము: చూ, సదనము 1.

మండము, సం. వి. అ. న. 1. మీఁగడ రూ-మండాము: చూ, స్తన్యము; పుం, న. 2. గంజి: చూ, సాదము. (1); 3. నెయ్యి నూనె లోనగువాని పై తేట: చూ, హవిస్సు. 1; పుం. 4 ఆముదము*: చూ, వ్యడంబకము; 5: చూ, భూషణము 2; 6. ఒకకూరాకు; దే. వి. (1). రూ-మండాము. చేఁపలఁబొడుచు చిల్లకోల: చూ, సర్వల.

మండలకము, సం. వి. అ న. ఎఱ్ఱపులుము: చూ, మండలము. 3

మండలగతి, అం: చూ, బాహ్యప్రచారములు.

మండలచ్ఛదము, సం. వి. అ. న. అటకమామిడి.* చూర మామిడి

మండలత్రయము, అం. సూర్య. చంద్ర, అగ్నులు (3)

మండలదూషణము, అం: చూ, విశంతివిగ్రహములు.

మండలము, సం. వి. అ. న. 1: చూ, వఱదగుడి; తద్వి: అంతరము, మధ్యము. (తె) — నడి-నడిమి-నడిమి చోటు; 2; = మాడెము: చూ, దేశములు; 3. కుష్ఠము: చూ, సితము. 1; 4. విలుకాఁడు రెండుకాళ్ళతో మండలాకారముగా నిలుచుట: చూ, స్థానము. 4. (చూ, విలుకాని స్థానములు.) 5. పన్నిద్దఱురాజులు (చూ, ద్వాదశరాజమండలము); పుం. 6: చూ, సమూహము; 7. వలయాకారముగఁ దీర్చిన యొక వ్యూహము: చూ, వ్యూహభేదములు; 8: చూ, శునకము; త్రి 9. సూర్యచంద్రాదుల బింబము: చూ, బింబము. 6. (చూ, వర్తులము): 10; చూ, పుంస్థానకములు.

మండలవికల్పము, అం; చూ, ప్రకరణములు.

మండలవ్యూహములు, అం. చూ, ప్రకృతివ్యూహములు.

మండలస్వస్తికము, అం: చూ, కరణములు.

మండలాగ్రము, సం. వి. అ. పుం. కత్తి: చూ, రిష్టి. 2.

మండలి, సం. వి. ఈ. (స్త్రీ). 1: చూ, సమూహము; వా. 2. సమితి; చూ, పరిషత్తు; న్. పుం 3: చూ, సర్పము; 4: చూ, మండలేశ్వరుఁడు; 5: చూ, సూర్యుఁడు; 6. పిల్లి: చూ, సూచకము. 5; 7. కుక్క; చూ, శునకము.

మండలూటి, దే. వి. రూ-మండిలూటి. మర్మవ్రణము: చూ, వ్రణము.

మండలేశుఁడు, సం. వి. అ. పుం. అధీశ్వరసార్వభౌముల కంటె ఇతరుఁడైన రాజు: చూ, రాజు. 1.

మండలేశ్వరుఁడు, — వై. —

మండవాయి, ద్వి. వి. గుల్మమారుతము: చూ, వాయువు.

మండహారకుఁడు, సం. వి అ పుం. కల్లమ్మువాఁడు: చూ, శౌండికుఁడు.

మండాటము, దే. వి. దైన్యముతో యాచించుట: చూ, యాచన.

మండాడు, దే. స. క్రి. దైన్యముతో యాచించు: చూ, వేఁడు. 4

మండాము, సం. వి. అ. న. 1: చూ, రూ-మండము. 1: దే. వి. (1): చూ, రూ-మండము (1).

మండి, దే. వి. ఒకకాలు నేలమోఁకరించుట. రూ-మండీ.

మండిగ, వా వి 1. కుంపటి: చూ, హసంతి; 2. దాణసంచుల మండులనూరెడు మట్టిపాత్రము: చూ, భాండము. 3 — 33

మండిగంట్రలు, దే. వి. బ: చూ, ధాన్యము.

మండిగము, దే. వి. వాకిటి క్రిందిలస్తకొయ్య: చూ, శిల. 2.

మండిఁగలు, వై. వి. బ = మంటక. రూ-మండెఁగలు. చక్కెరవేయని గోదుమపూరి: చూ, భక్ష్యము.

మండితుఁడు, సం. విణ అలంకృతుఁడు: చూ, కట్టుడు. 2.

మండిపడు, దే అ. క్రి: చూ, మండు 1.

మండిపాటు, దే. వి: చూ, సంభ్రమము.

మండియ, దే. వి. రూ-మండె 1 జొన్నకంకులు పొగాకులోనగునవి మగ్గుటకై ప్రోగుచేసి మీఁద కప్పిపెట్టుట ; 2. ఎగురఁబోయకముందు కళ్లములో ప్రోగుచేసిన ధాన్యపురాసి

మండిలూటి, దే. వి: చూ, రూ-మండలూటి.

మండీ, దే. వి: చూ, రూ-మండి.

మండీలు, దే. వి. బ: చూ, మల్లశాస్త్రము.

మండు, దే అ. క్రి. 1. జ్వలించు పాండు. 2, ఆ :109; స్వా 4, ఆ. 88: చూ, వెలుఁగు. 5. (చూ, మండు. 3 ); 2. చుఱుకుమని నొచ్చు. "గాయము మండుచున్నది"; 3. ఈర్ష్యాదులచే తపించు: అడిచిపడు, ఎగసిపడు. (చూ, మండు. 1.)

మండునెల, దే. వి. వసంతఋతువు. ఉ. హరి. 2, ఆ. 194: చూ, మాసద్వయము.

మండువా, వై. వి. 1. = మండురా. ఒక తట్టుగోడలేని గుఱ్ఱాలసాల స్వా. 1 ఆ. 40: చూ, సదనము. 1; 2. చతురముగా స్తంభములమీఁద దించినది; 3. పాక : చూ, సదనము. 1; వా. 4. నాలుగిండ్ల బవంతినడుమను వెలుఁగు వచ్చుటకును వాననీరుపడుటకును తగిన కాళీభాగము "మండువాలోగిలి."

మండువాలోగిలి, వా. వి. నాలుగిండ్ల బవంతి: చూ, సదనము. 1.

మండూక తులాన్యాయము, న్యా, కప్పలను తక్కెడలోఁ బెట్టఁగా నిలువక పారిపోవుచుండు నమరీతి.

మండూక పర్ణము, సం. వి. అ. పుం. దుండిగము*: చూ, శోణకము.

మండూకపర్ణి, సం. వి. ఈ. స్త్రీ. 1. పొన్నగంటి*: చూ, శీతసారము; 2: చూ, బెండ*; 3: చూ, మంజిష్ఠ* 1.

మండూకప్లుతిన్యాయము, న్యా. కప్ప దాఁటులువేసినట్లు కొంచెము పనిచేసి యదివిడిచి మఱికొంతచేయుట యనురీతి.

మండూక మక్షికాన్యాయము, న్యా. కప్ప పామునోటనుండియు నీఁగనుమ్రింగఁబోవు ననురీతి.

మండూకము, సం. వి. అ. పుం. 1. కప్ప: చూ, హరి. 12; 2: చూ, మండూక పర్ణము.

మండూకుఁడు, సం. వి అ. పుం ఒక ఋషి: చూ, సన్న్యాసి. 1.

మండూరము, సం. వి. అ. న 1. ఇనుప చిట్టెము: చూ, శింఘాణము. 1; 2 ఇనుప చిట్టెముతోఁజేసిన సిందూరము: చూ, శింఘాణము. 1

మండె, దే. వి: చూ, రూ-మండియ.

మండెఁగలు, వై. వి. బ.=మంటక: చూ, రూ-మండిఁగలు. కై. 8, ఆ. 204; వై. 6, ఆ. 134.

మండెచేటనలుఁగు. వా. వి. ఎగురఁబోసిన వడ్లరాసిపైన చేటతో నునుపుఁబెట్టుట.

మండెము, వై. వి 1: చూ, రూ-మాడెము. దుర్గమస్థలము: చూ, స్థానము. 1; 2: చూ, మాన్యము. 1.

మండెవెంటినలుఁగు, వా. వి. ఎగురఁబోయని వడ్లరాసిపైన చేటతో నలుఁగుఁబెట్టుట: చూ, వెంటినలుఁగు.

మండ్ర, దే. వి. ఒక ముండ్లచెట్టు: చూ, వృక్షము.

మండ్రగబ్బ, దే. వి: చూ, పుట్టతేలు.

మండ్రాటము, దే వి: చూ, సంతాపము. ఉ. హరి. 2, ఆ.167.

మండ్రాడు, దే. అ. క్రి: చూ, సంతాపించు.

మంత, సం. విణ (ఋ. ఈ. ఋ.) ఆలోచించువాఁడు.

మంతనము, వై. వి.=మంత్రణమ్. 1. ఆలోచన, హరి. ఉ. 1, ఆ. 14: చూ, యోచన; 2. ఏకాంతము. అచ్చ సుం. కాం. 98: చూ, రహస్యము. 1; అం. 3. త్రిశక్తులలో మూఁడవది: చూ, జతనము; 4. (చూ, త్రయము.)

మంతరము, వై. వి. = మంత్రమ్. రూ-మంతు-మంత్రము 1. ప్రసవోపాయము; 2. జాలవిద్య: చూ, విద్యలు; 3. గాయత్రి లోనగునది: చూ, గాయత్రి (చూ, మంత్రము.1;) 4.—: చూ, మంత్రము. 1.

మంతరసాని, వై. వి = మంత్రస్వామినీ. ప్రసవ మంత్రజ్ఞ: రూ-మంతురసాని—మంత్రసాని.

మంతవ్యుఁడు, సం. విణ. ఆలోచింపఁ దగినవాఁడు.

మంతిరి, వై. వి. = మంత్రి. ప్రధానుఁడు. ఉ. రా. 2, ఆ. 220: చూ, సచివుఁడు. 1.

మంతిరించు, వై. అ. క్రి. 1. మంత్రమువేయు: చూ, మంత్రించు; వా. 2. మంత్రించు: చూ, పిలుచు.

మంతు, వై. వి. 1. = మంత్రి. అచ్చ. కిష్కిం, కాం. 6: చూ, రూ-మంతిరి; 2. చదరంగములోని రాజుతర్వాత నుండెడు కాయ, ద్యూతమంత్రి; 3: చూ, రూ-మంతరము. 1. కళా. 2, ఆ. 48; 4: చూ, రూ-మంతరము. 2; దే. వి. 5: చూ, ప్రసిద్ధి. 1.

మంతుకెక్కినవాఁడు, ద్వ. వి: చూ, దొర. 5. అం, భా. త్ర. 4.

మంతురసాని, వై. వి =మంత్రస్వామినీ: చూ, రూ-మంతరసాని.

మంతువు, సం. వి ఉ. స్త్రీ. 1. తెలివి: చూ, హృల్లేఖము. 2; పుం. 2: చూ, నేరము; 3: చూ, మనుష్యుఁడు; 4. రాజు: చూ, రాజు. 1.

మంతుసాని, వై. వి.=మంత్రస్వామినీ: చూ, రూ-మంతరసాని.

మంత్రకాఁడు, ద్వ. వి. (మంత్రము + కాఁడు) ఇంద్రజాలవిద్య నెఱిఁగినవాఁడు. అచ్చ. యు, కాం. 448: చూ, వ్యాళగ్రాహి.

మంత్రణ, సం. వి. ఆ. స్త్రీ. = మంతనము. రూ-మంత్రణము. రహస్యాలోచన: చూ, యోచన.

మంత్రణము, సం. వి. అ. న — పై.—

మంతదీధితి, సం. వి. ఇ. పుం. అగ్ని: చూ, వహ్ని. 1.

మంత్రపదము, అం: చూ, ఆరూఢము.

మంత్ర బ్రాహ్మణము, అం ఋగ్వేద బ్రాహ్మణములలో నొకటి, ఇందలి మొత్తము 4000. (దీని వ్యాపకము గానరాదు): చూ, బ్రాహ్మణము.

మంత్రము, సం. వి. అ పుం. (విచారింపఁబడునది). 1. = మంతరము: అంకము, అప్రము, క్షిపణి, గుహ్యాభాషితము. మనువు. (తె)—మంతరము. తద్విశేషములు.— ౧. అన్నపూర్ణ పంచదశాక్షరి (ఐం హ్రీం సౌః శ్రీం క్లీం ఓం నమోభగవత్యన్నపూర్ణే); ౨. దేవీపంచాక్షరి (ఓం ఈం ఈం నమః); ౩. నారాయణాష్టాక్షరి. (అష్టాక్షరి) (ఓమ్ నమోనారాయణాయ); ౪. రామాష్టాక్షరి (ఓమ్ శ్రీం రాం రామాయనమః); ౫. వాసుదేవ ద్వాదశాక్షరి (ఓమ్ నమో భగవతే వాసుదేవాయ); ౬. శివ షడాక్షరి (షడక్షరి) (పంచాక్షరి) (ఓమ్ నమశ్శివాయ); ౭. శ్రీ రాజరాజేశ్వరీ పంచ దశాక్షరి (క, ఏ, ఈ, ల, హ్రీం, హ, స, క, హ, ల, హ్రీం, స, క, ల, హ్రీం); ౮. సూర్యాష్టాక్షరి (సౌరాష్టాక్షరి) ఓమ్ ఘృణిస్సూరియ ఆదిత్యోమ్); ౯. సౌభాగ్య విద్యేశ్వరీ పంచాక్షరి. (శ్రీం క్లీం హ్రీం బ్లూం ఐం); ౧౦ హయగ్రీవ ద్వాదశాక్షరి (ఓమ్ నమోభగవతేహయగ్రీవాయ) ఇత్యాది మంత్రంబులెల్ల యంత్రంబులతో నుపాసింపఁ దగినని. మఱియు:— ౧౧. గాయత్రి లోనగునది: చూ, అణ; ౧౨. అఘమర్షణము; ౧౩. అజప; ౧౪. అవసరము ౧౫ అర్ఘము; ౧౬. ఆవర్చన; ౧౭. ఆశ్రుతము; ౧౮. ఆసురి; ౧౯. ఉపాంశువు; ౨౦ ఋజ్మంత్రము; ౨౧. ఐంద్రము; ౨౨. గాయత్రి; ౨౩. గారుడము. (తె.)— గారడము; ౨౪. జప్యము; ౨౫. తారక మంత్రము; ౨౬. దిగ్బంధము (మంత్రముచే కట్టెడు దిక్కుల కట్టు); ౨౭. ప్రతిసరము; ౨౮. బీజాక్షరములు; ౨౯. హంస; ౩౦. హృద్యము. ఇత్యాది (మిగతవానికి "చూ, హృద్యము. 5.") 2. ఏకాంతము: చూ; రహస్యము. 2; 3 అథర్వ వేదము: చూ, వేదములు; అం. 4: చూ, యోగములు (యోగ చతుష్టయము); 5: చూ, ప్రకాశింపఁ జేయఁగూడనివి; 6: చూ, శక్తులు; 7: చూ, క్రియలు; వై. వి. (1): చూ, రూ-మంతరము. 1; (2): చూ, రూ-మంతరము. 2.

మంత్రవాది, సం. వి. న్. పుం: చూ, మాంత్రికుఁడు.

మంత్రవికల్పము, అం: చూ, ప్రకరణములు.

మంత్రశక్తి, అం. 1; చూ, శక్తిత్రయము; 2; చూ, విశంతి విగ్రహములు.

మంత్రసాని, వై. వి.=మంత్రస్వామినీ. మంతరసాని-మంతురసాని-మంతుసాని.

మంత్రసిద్ధి, అం; 1; చూ, కళలు; 2; చూ, సిద్ధిత్రయము (త్రయము.)

మంత్రాంగము, సం. వి, అ, న. మంత్రిత్వము.

మంత్రావృత్తి, సం. వి. ఇ స్త్రీ. జపము: చూ, తపము. 2.

మంత్రి, సం. వి. న్. పుం=మంతిరి-మంతు 1 ధీసచివుఁడు చూ, సచివుఁడు; 2. చూ, సహాయుఁడు. 1.

మంత్రించు, సం. అ. క్రి=: చూ, మంతిరించు. 1—2.

మంత్రిసింహాసనము, అం. చూ, సింహాసనములు.

మంథజము, సం. వి. అ. న. చూ, కలంబుటము.

మంథదండము, సం. వి. అ పుం: చూ, మంథానము.

మంథనము, సం. వి. అ. న. 1: మథనము; పుం. 2. చూ, మంథానము.

మంథని, సం. వి. ఈ. స్త్రీ. తరిగడవ: చూ, పాత్రము. 6.

మంథము, సం. వి. అ. పుం 1: చూ, మంథానము; 2. కంటి నొప్పి: హర్షణము; 3. అంబలి: చూ, సాదము (1); 4 వధము: చూ, హింస. 1.

మంథరజ్జువు, సం. వి. ఉ. పుం: చూ, తరిత్రాడు.

మంథరము, సం. వి. అ పుం. 1: చూ, మంథానము; విణ 2. చొరవలేనిది: జిహ్మము, మందము. (తె).— మసలిక; 3. మెల్లగాఁబోవునది: జిహ్మగము, మందము. (తె).— మసలిక; 4. వంకరైనది: చూ, వేల్లితము, 2; 5. విరివియైనది: చూ, సుర. 3.

మంథరుఁడు సం. వి అ.పుం. మెల్లగానడచువాఁడు: మందగామి.

మంథరువు, సం. వి. ఉ పుం. చామరపుగాలి: చూ, వాయువు.

మంథాద్రి, సం. వి. ఇ పుం. కవ్వపుఁగొండ: చూ, పర్వతము.

మంథానము, సం. వి. అ. పుం. రూ-మంథనము-మంథరము, మంథము, (తె).— కవ్వము: చూ, వైశాఖము. 2; తద్వి. (కవ్వపుగుత్తికి.— చూ, వైశాఖము. 2.)

మంథుఁడు, సం. వి అ. పుం: చూ, సూర్యుఁడు.

మంద, దే. వి. 1. గొల్లపల్లె: చూ, దేశములు; 2. పసుల మంద: చూ. సౌరభేయి (ధేనువు); 3. ఊరికివెలుపల పసులుండుచోటు; 4. గోవులమంద యుండుచోటు, పశువులసాల (అని కొందఱు): చూ, సదనము. 1.

మందకట్టు, దే. వి. 1. గొల్లపల్లెవారు ఏర్పఱచుకొన్న యేర్పాటు: మందగట్టు; వా. 2: చూ, వెంటగట్టు; 3. వరి మళ్ళయందు బలమునకై పశువులను నిలుపుట: మందగట్టు.

మందగట్టు, దే. వా. వి. —పై.—

మందగామి, సం. విణ: చూ, మంథరుఁడు.

మందగించు, వై. అ. క్రి. 1. మందమగు. "ఆఁకలి మందగించెను": చూ, జంపారు. (సం.)—మందీభవించు; వా. 2: చూ, సన్నగిలు. "నాడి మందగించినది"; 3. తగ్గు. "ధర మందగించెను."

మందగొను, దే. అ. క్రి. మందగాఁగూడు.

మందట, దే. వి. 1. వ్యవహారయోగ్యము; 2: చూ, సమీపము 1. పంచ. నా. 1, ఆ. 562; 3; చూ, వినయము. 1. హరి, ఉ 7, ఆ 39.

మందటిలు, దే. అ. క్రి. రూ-మందటిల్లు. అడఁగు. య. 4, ఆ. 81: చూ, గ్రుక్కు. 9.

మందడి, వై. వి. 1. = ముందురా. లాయము: చూ, సదనము. 1; వా. 2. ఉమ్మడి. "మీకును మాకును వ్యవహారపు మందడి విడిపోవలయును." "గోవమందడి" మొ.

మందడీఁడు, దే. వి. (మందడి + ఈఁడు) గుఱ్ఱపువాఁడు: చూ, సాహిణి.

మందపిచ్చుక, దే. వి. కుంవక పులుఁగు: చూ, పిచ్చుక.

మందప్రోయాలు, ద్వ. వి. గొల్లది. పాండు. 2, ఆ, 15: చూ, త్రేత.

మందము, సం. వి. అ. పుం. 1. గజజాతి విశేషము. (యుద్ధ కాలమందు వాహన యోగ్యమైనది): చూ, హస్తి; విణ. 2. చొరవలేనిది: చూ, మంథరము. 2; 3. మెల్లనిది: చూ, మంథరము. 3; అం. 4: చూ, గజజాతులు; 5: చూ, ముఖరజ్జువులు; 6: చూ, నాసికాక్రియలు; 7: చూ, శ్రుతులు; దే. విణ (1.) దట్టము: చూ, సాంద్రము. 2; (2.) లావు: చూ, స్థూలము. 2.

మందరము, సం. వి. అ. పుం. 1. కవ్వపుఁగొండ: చూ, పర్వతము; 2. మందారమను కల్పవృక్షము: చూ, కల్పవృక్షములు; 3: చూ, స్వర్గము; విణ 4. అలసము: చూ, విలంబము. 1; 5. బహుళము: చూ, హేరాళము.

మందరి, దే. వి: చూ, వైద్యుఁడు.

మందల, దే. వి 1. ఉసురు: చూ, ప్రాణము. 6; 2. మేర: చూ, విధము. 1; 3: చూ, సమీపము. 1; వా. 4. హద్దు: చూ, సీమ. 1.

మందలించు, దే. స. క్రి. 1. చెప్పు: చూ, వచించు; 2. ఆజ్ఞాపించు. భాగ. 2, స్కం. 186: చూ, సెలవిచ్చు; 3. మనవి చేయు. అని. 3, ఆ. 25: చూ, విన్నవించు; 4: చూ, హెచ్చరించు; 5. తలఁచు: చూ, యోచించు; వా. 6. అదమాయించు. (కొద్దిగా శిక్షించు): చూ, శిక్షించు.

మందలింపు, దే. వి. 1: చూ, వ్యవహారము. 3; 2: చూ, అదమాయింపు.

మందస, వై. వి. = మంజూషా రూ-మందసము పెట్టె: చూ, సందుకా.

మందసము, —పై.— నీలా. 3, ఆ. 86.

మందస్మితము, సం.వి.అ.పుం. చిఱునగవు: చూ, హాస్యము. 1.

మందహాసము, —పై.—

మందాకిని, సం. వి. ఈ. స్త్రీ. 1. గంగ: చూ, నది; 2. ఆకాశగంగ: చూ, నది; 3. అఱువదేండ్ల ఆఁడుది: చూ, స్త్రీ; అం. 4: చూ, వృత్తము. 1.

మందాకు, దే. వి. (మందు + ఆకు) ఓషధి: చూ, వృక్షము.

మందాక్రాంతము, పా: చూ, వృత్తము. 1. ("మ, భ, న, త, త, గగములు. 11 యతి. 17వ ఛందస్సు.")
మందాక్షము, సం. వి. అ. న: చూ, సిగ్గు.
మందాగ్ని, సం. వి. ఇ. పుం: అగ్నిమాంద్యము.
మందామణి, సం.వి.ఈ.(స్త్రీ). పెద్దబాన: చూ, పాత్రము. 6-౧.
మందారము, సం. వి. అ. పుం. 1. ఈగిమ్రాను: చూ, వేలుపుఁజెట్టు; 2. జిల్లేడు*: చూ, వికిరణము; 3. పారిభద్రము*: చూ, వారిదము. (1); అం. 4: చూ, కల్పవృక్షములు; దే. వి. (1) మేఘావరణము: చూ, మేఘము. 1.
మంది, దే. వి. 1. జనము: చూ, సంతతి. 1; వా. 2. సంతానము: చూ, సంతతి. 1; 3. గుమి. ఉ, రా. 6, ఆ. 105: చూ, పరివారము. 1; 4. కాలుబలము. య. 4, అ. 155: చూ, భటుఁడు; వా. బ. 5. చుట్టములు. "పెండ్లివారు ఎంతమందివచ్చిరి. (ఎంతమంది = ఎందఱు చుట్టములు)": చూ, సంబంధి. 1.
మందిరము, సం వి. అ. న. 1. ఇల్లు: చూ, సదనము. 1; 2. పట్టణము: చూ, దేశములు; వా. 3. దేవగృహము: చూ, సదనము. 1; 4. అల్ప దేవాలయము, ఇంటిలోని దేవుని పీఠము (అని కొందఱు) "రామ మందిరము": చూ, సదనము. 1; పుం 4: చూ, సముద్రము.
మందీభవించు, సం. అ. క్రి. 1: చూ, మందగించు. 1; వా. 2: చూ, మందగించు. 2.
మందు, దే. వి. 1. (ఇందు భస్మములు, చూర్ణములు, లేహ్యములు, రసాయనములు, ఘృతములు, తైలములు, ద్రావకములు, ఘటికౌషధములు, అంజనములు, కషాయములు, ఆసవములు మొదలగునవి చేరును) (సం.)— అగదము, అజాయువు, ఔషధము, కమలము, గదారాతి, జయువు—జాయువు, తంత్రము, ప్రతిక్రియ, భేషజము—భైషజ్యము, యోగము; తద్విశేషములు— ౧. అతికించు మందునకు. (సం.)—జీవగట్టి, జీవానౌషధము, జీవాతువు; ౨. కంటి మందునకు. (సం.)-బిడాలకము; ౩ కుష్ఠమను మందునకు. (సం.)— అంగారకుష్ఠకము, కుత్సితము, కుష్ఠఘ్నము, కుష్ఠహంత్రి, వాకుచి, హితావళి; ౪. పుంటి మందునకు. (సం.), ఉపనాహము. (తె.)—మలాము—మొలాము-మొల్లాము; ౫. బాలెంత మందునకు. (తె.)-కాయము. (సం.)-సర్మ్మ్య; ౬. బిడ్డల మందునకు. (సం.)—కారము; ౭. బెల్లముతో వండిన మందునకు. (సం.)—గుడకము, గుడేరము; ౮. విషమునకు.-(చూ, సంగరము. 6); (మిగతవానికి "చూ, రోగము. సంగరము. 6"); 2. వశ్యౌషధము. బుద్ధి: చూ: రాజార్హము; వా. 3 చావునకు ఇచ్చెడి ఔషధము. "మందులవాఁడు మందుపెట్టి కాకిని చంపెను": చూ, సంగరము. 6; చికిత్స, ఉపక్రమము, ప్రక్రమము, ప్రతిక్రియ, ప్రతీకారములు 5: చూ, వెరవు; విణ. 6: చూ, వెక్కసము. 3.
మందుఁడు, సం. వి. అ. పుం. 1, శని: చూ, శని; 2: చూ, సోమరి; 3: చూ, హీనుఁడు; 4. ఇచ్చవచ్చినట్లు తిరుగువాఁడు: చూ, సంచారి 2; 5 నిర్భాగ్యుఁడు: చూ, వ్రాజె; 6: చూ, స్తబ్ధుఁడు; 7: చూ, వ్యాధితుఁడు.
మందుపట్టడ, దే.వి. బాణసంచు చేసెడుశాల: చూ, సదనము. 1.
మందుభాయి, వా. వి. నల్లమందు తినెడి తెవులుగొంటు: చూ, వ్యాధితుఁడు.
మందుమల, ద్వ. వి.. మందుచెట్లుండు కొండ: చూ, హిమాలయము (పర్వతము).
మందుర, సం. వి. ఆ. (స్త్రీ). 1. = మందువాలాయము: చూ, సదనము. 1; 2. పడక: చూ, శయ్య. 1.
మందురకుఁడు, సం. వి. అ. పుం: చూ, మందడీఁడు. విక్ర. 3, ఆ. 17.
మందురా, దే. వి, చంద్రుఁడు: చూ, హిమాంశువు.
మందులమారి, దే. విణ. 1. మర్లుమందు పెట్టునది; 2. మర్లుమందు పెట్టువాఁడు: చూ, మందులవాఁడు.
మందులవాఁడు, వా. విణ. 1: చూ, మందులమారి. 2; 2: మందులు అమ్మెడువాఁడు; 3. మందులు చేయువాఁడు; 4: చూ, మందరి; 5. ఒకానొక కిరాతుఁడు: చూ, వ్యాధుఁడు 1.
మందెమేలము, దే. వి. 1. ఉపేక్ష: చూ, సయాట; 2. చూ, పరిహాసనము; 3. ప్రేమము, స్నేహము (అనికొందఱు). భో. 4. ఆ. 157: చూ, స్నేహము. 1.
మందోదరి, సం. వి. ఈ (స్త్రీ). 1. రావణుని భార్య: చూ, భార్య; అం. 2: చూ, కన్యకలు.
మందోష్ణము, సం.వి.అ.న, విణ. ఇంచుకవేఁడి: చూ, వేఁడిమి.
మంద్రతారప్రసన్నము, అం: చూ, అలంకారము. 3.
మంద్రమధ్యము, అం: చూ, సంచారివర్ణగతాలంకారములు.
మంద్రము, సం. విణ. 1 గంభీరమైనది (స్వరము): చూ, స్వరము. 2; అం. 2: చూ, స్థాయి
మంద్రస్థాయి, అం, చూ, ఉచ్చతమము. (హృదయమునందుండెడి మొదటి 7 శ్రుతులగుంపు.)
మంద్రాంతము, అం: చూ, సంచారివర్ణగతా లంకారములు
మంద్రాది, అం. —పై—
మంపిలు, దే. అ. క్రి. రూ-మంపిల్లు: చూ, మబ్బుకొను.
మంపిల్లు, దే. ఆ. క్రి. —పై.— సౌ. 1, ఆ. 68.
మంపు, దే.వి. మత్తు, మైకము.విజ.1, ఆ. 147: చూ, హామిక.
మంపుగొను, దే. అ. క్రి. 1: చూ, మంపిలు. ఉ, హరి. 4, ఆ. 26; ప్రే. 2. మంపుగొలుపు.
మంబరము, దే. వి. కాల్చుట. (సం.)—ఓషము, దహనము.
మంబరముసేయు, దే. స. క్రి: చూ, దహించు. ఉ, హరి. 3, ఆ. 153.
మంబె, దే. వి: అఱకడ-అఱకడము, మబ్బె.
మంభము, సం. వి. అ. న: చూ, పొగ. (హా.)
మకతక్రియ, అం: చూ, క్రియాంగములు. (అంగము. 9.)
మకరందము, సం. వి. అ. పుం. 1: ఆసవము. కౌసుమము, పుష్పరసము, మరందము. (తె.)-కమ్మనీరు, పూఁదేనియ-పూఁదేనె-పూవుఁదేనియ. ("చూ, సుమనోరజము.") అం. 2: చూ, జన్యతాళములు.

కరకంఠి, సం. వి. ఈ. స్త్రీ. నడుమ మొసలిముఖ మేర్పఱచిన కంఠభూష: చూ, భూషణము. 2.

కరకుండలము, సం. వి. అ. న. మొసలి ముఖమేర్పడఁజేసిన పురుషుని కర్ణభూష: చూ, భూషణము. 2.

కరకేతనుఁడు, సం. వి. అ. పుం: చూ, మకరధ్వజుఁడు.

కరతము, సం. వి. అ. న. రూ-మరకతము ఉ, రా. 6, అ. 76: చూ, రత్నములు.

కరతోరణము, సం. వి. అ. పుం, న. మొసలి రూపమేర్పడఁ జేసిన తోరణము. (చూ, తోరణము).

మకరతోరణములు గట్టించుట, అం: చూ, శోభనములు

మకరధ్వజుఁడు, సం. వి. అ. పుం: చూ, మకరాంకుఁడు

మకరము, సం. వి. అ. పుం. 1. పెద్దచేఁప: చూ, మత్స్యము. 1; 2. మొసలి:చూ,మత్స్యము. 1; అం. 3. మకరమనునిధి: చూ, నిధులు: చూ, లిబ్బి. 1—2; 4. అభినయ హస్త విశేషము: చూ, వ్యంజకము. 1; 5. మొసలి రాసి: చూ, రాసులు; 6: చూ, ఆసనములు; 7: చూ, శస్త్రములు; 8: చూ, భోగవ్యూహములు; 9: చూ. ప్రధానవ్యూహములు; వా. వి. అ. పుం. 10. మట్టమధ్యాహ్నము, ఎండవేళ. "నెత్తి మాడుచుండఁగా మకరములో వచ్చితిని."

మకరాంకుఁడు, సం. వి. అ. పుం: చూ, మన్మథుఁడు.

మకరాలయము, సం. వి. అ. పుం చూ, సముద్రము.

మకరిక, సం. వి. ఆ స్త్రీ. స్త్రీలకు చెక్కిళ్ళు లోనగుతావుల యందు లత్తుకతో వ్రాసెడు మకరరూపమగురేఖ. ఉ. రా. 1, అ. 44: మకరికాపత్రము.

మకరికాపత్రము, సం. వి. అ. న.—పై—

మకరివల, మి. వి. మృగములనుబట్టెడువల: చూ, వల. 1·

మకాము, వా. వి. ప్రయాణమందు నిలుచుస్థలము, బస.

మకిలి, వై. వి 1. నలుపు; చూ, వర్ణము. 6; 2.=మలిన మాలిన్యము: చూ, మలినము. 1.

మకిని, వా. వి: చూ, మకిల. 2.

మకుటము, సం. వి. అ. న. కిరీటము: చూ, సీసకము. (1.)

మకురము, సం. వి. అ పుం. 1. అద్దము: చూ, ముకురము; 2; చూ, పొగడ*; 3: చూ, మల్లెపువ్వు; 4. కుమ్మరి సారెత్రిప్పెడుకఱ్ఱ.

మకురు, దే వి: చూ, మౌర్ఖ్యము.

మకురుతనము, —పై.—

మకుష్ఠకము, సం. వి. అ. పుం. బ (రు-ముకుష్ఠకము—మపుష్ఠ కము-మయుష్ఠకము- మయష్టకము) అడవిపెసలు: చూ, పెసర.

మకూలకము, సం వి. అ. పుం. దంతి*: చూ, విశల్య. 4.

మకూలము, —పై.—

మక్క, వై. వి. 1. నితంబైక పార్శ్వము: మలుగు-మల్లు; 2. బిడ్డలతల్లి పొత్తికడుపునఁ బుట్టెడి అపాయకరమగు నెత్తురుగడ్డ. మక్కనగాయ; చూ. వ్రణము. 1; 3. కాల ఖండము: చూ, యకృత్తు.

మక్కనగాయ, ద్వ. వి: చూ, మక్క. 2.

మక్కలు, వై. వి.=మఘీ మొక్కజొన్నలు: చూ, స్తంబ కరి (ధాన్యము.)

మక్కల్లము, సం. వి. అ. పుం; చూ, మక్క. 2.

మక్కళించు, దే. అ. క్రి. 1. తిరుగుకొను: చూ, పెనుడీయు 2: చూ, సరిపడు; 2. నై. 6. ఆ. 108; 3; చూ, సరిపోలు. ఉ, హరి. 6, ఆ. 250; అం. ప్రే. 4. దిరుగుకొనఁజేయు. స్వా. 1, ఆ. 59; 5, సరిపఱుచు. కాశీ. 3, ఆ. 118; 6. సరిపోల్చు ఉ. హరి. 5, ఆ. 60.

మక్కా, వై. వి.=మఘ. యవనదేశమందలి ముఖ్యపట్టణము చూ, సీమ. (1) (దేశములు.)

మక్కి, దే వి. నిస్సారము: చూ, జెండు. 2.

మక్కికిమక్కి, జా. 1. ఉన్నదున్నట్లు; వా. 2. వారుచేసినట్లు వీరుచేయుట. "దెబ్బకుదెబ్బ యన్నటుల మక్కికిమక్కి చేసెను."; 3. అసలుకు సరియగునకలు.

మక్కు, దే. వి. 1. మాలిన్యము: చూ, మలినము. 1; 2. చింతఅంబలితో బొమ్మలకు పెట్టినఅతుకు; అ. క్రి. 3. కాంతిహీనమగు: చూ, మ్రక్కు; 4; చూ, శోషించు. పంచ. నా. 2, ఆ. 179; 5: చూ, మరణించు. య 3, ఆ. 123; స. క్రి. 6. గీఱు. అన్న. యు, కాం. 423: చూ, అక్కు; వా వి బ. 7. పునాదులయొక్క నూలిత్రాటికొనను కట్టెడు కఱ్ఱపుల్లలు; బ. 8. పునాదులయొక్క అద్యంతముల నిటునటు గ్రుచ్చెడు కొయ్యతునకలు; బ. 9. ఎముకలు: చూ, శల్యము. 1.

మక్కువ, దే. వి. కూరిమి: చూ, స్నేహము, 1.

మక్కె ·దే. వి. బ: చూ, మక్కు. 9.

మక్తా; వా. వి. రైతు ఈనాందారునకిచ్చెడు ధాన్యాదికము.

మక్షిక, సం. వి. ఆ. స్త్రీ: క్రిమిలూనము, క్షుద్ర,గంధలోలుప, చర్వణ, నీలంగువు. (తె).— ఈఁగ-ఈఁగె, ఈవ-ఈవె, నల్లనియీఁగ; తద్విశేషములు.—౧. అడవి యీఁగకు — క్షుద్ర, క్షుద్రిక, గోమక్షిక, దంశము, వనమక్షిక. (తె).— అడవియీఁగ–అడవీఁగ, జోట్టీఁగ-జోటీఁగ – జోఱుటీఁగ; ౨. కణుఁదురీఁగకు.— కంటక, కంటకాసన, కణ, కాష్ఠ కారి, గండోలి-గంధోలి, గృహిణి, తృణషట్పదము,భృంగ రోలము, వరటము, వరోలము, విషస్పృక్కు, శూక కీటము. (తె).— కందురీఁగ - కందురు - కడుఁదురీఁగ; కణుఁదురీఁగ, కడుఁదురు— కణుఁదురు - కనుఁదురు- ౩. చిన్నయీఁగకు.— క్షుద్రదంశిక; ౪. తేనెటీఁగకు.— క్షుద్ర, పతంగిక, పుత్తిక, మధుమక్షిక, సరఘ. (తె).— జుంటీఁగ-తేనెటీఁగ, తూనీఁగ-తూనీఁగ, తెరయీఁగ, ఫెర యీఁగ; ౫. నీరుపట్టుయీఁగకు.— కుంభీరమక్షిక, ఘోణి; ౬. పశుమక్షికకు-పశుమక్షిక. (తె).—జోట్టీఁగ-జోటీఁగ- జోఱుటీఁగ; ౭. బొద్దీఁగకు. (తె).—బరిడె పురుగు-బరిణి పురుగు-బరిణెపురుగు, బొద్దీఁక-బొద్దీఁగ; ౮. వల్మీకమక్షి కకు. (తె).— ఈసలు (మిగతవానికి "చూ, సరఘ")

మక్షికాస్థానేమక్షికాపాతః, న్యా. అన్నములోపడిన ఈఁగను తీసిపారవేసినచో, మఱియొక ఈఁగ వెంటనేవచ్చి పడినట్లు

ఒకకష్టము తప్పినదనుకొనిన వెంటనే మఱియొక కష్టము ప్రాప్తించదము.
మఖము, సం. వి. అ. పుం. రూ-మఘము: చూ, యజ్ఞము
మఖవంతుఁడు, సం.వి.న్ పుం. ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు.
మఖవుఁడు, సం. వి. న్. పుం. —పై.—
మగ, దే. వి పుంస్త్వము. "మగవాఁడు."
మగఁటమి, దే. వి: చూ, పౌరుషము. 1. (ఇదిచింత్యము.)
మగఁటిమి, 1. —పై —; 2: చూ, శౌర్యము. 1.
మగఁడు, దే. వి. పురుషుఁడు. నిర్వ. 1, ఆ. 4: చూ, మనుష్యుఁడు; 2. భర్త: చూ, సామి. 2; 3. ప్రభువు. రామా. 5, ఆ. 204: చూ, స్వామి. 1; 4. శూరుఁడు: చూ, హాఁవీరుఁడు. 2; (వృత్తియందంత్యవర్ణ లోపము. "మగపాటు, మగపొందు.") మొ.
మగఁడులేని యాఁడుది, అం: చూ, అప్రకాశములు.
మగచెయ్వులు, ద్వ. వి. బ: చూ, సంయోగము.
మగణము, అం. మూఁడుగురువులు. "వైకుంఠా": చూ, అష్టగణలక్షణము.
మగతనము, దే. వి. 1: చూ, పౌరుషము. 1; 2: చూ, శౌర్యము. 1.
మగది, దే. వి. మొగది.
మగధము, అం: చూ, దేశములు.
మగధుఁడు, సం. వి. అ. పుం. వంశావళి చదివెడువాఁడు, రూ-మాగధుఁడు, మధుకుఁడు: చూ, వంది.
మగనాలు, దే. వి. (మగని + ఆలు): చూ, పతివత్ని.
మగనిఅన్న, వా. వి: బావ, బావగారు.
మగని పేరెదనున్న వగలాఁడి, దే. వి: చూ, లక్ష్మి. 1.
మగనిసైఁదోడు, వా. వి: చూ, దేవరుఁడు.
మగపనులు, వా. వి. బ: చూ, మగచెయ్వులు.
మగపాటి, దే. వి: చూ, మగఁటిమి. 2.
మగపాడి, దే. వి. 1. —పై.—; 2: చూ, వయికూటమి.
మగపోడుములు, దే. వి. బ: చూ, మగచెయ్వులు.
మగపోల్కికూటమి, దే. వి: చూ, మగపాడి. 2.
మగమానికపువాలు, ద్వ. వి. వజ్రాయుధము. నీలా. 3, ఆ. 8: చూ, హేతి. 4 (బాణము. 1.)
మగమానికము, ద్వ. వి. వజ్రము: చూ, రత్నము. 1.
మగఱాతివాలు, ద్వ. వి: చూ, మగమానికపువాలు.
మగఱాయి, దే. వి: చూ, మగమానికము.
మగలాగు, దే. వి: చూ, వయికూటమి.
మగవాఁడు, దే. వి. 1: చూ, మగఁడు. 1. విజ. 1, ఆ. 78; 2: చూ, మగఁడు 4.
మగవాని నడక, అం. (దీనికి ఉపమానములు.—ఏనుఁగు, ఎద్దు, సింహము.)
మగవాని వక్షము, అం (దీనికి ఉపమానము—తలుపు.)
మగిడి, దే. వి. పాములవాఁడు ఊఁదెడు వాద్యము: చూ, నాగసరము. 1.
మగియించు, దే. స. క్రి. చంపు: చూ, సంహరించు.
మగుడ, దే. ద్ర. పునరర్థకము: చూ, వెండియు.
మగుడఁబడు, ద్వ. అ. క్రి. మరలు: చూ, వట్రిల్లు.
మగుడు, దే. అ. క్రి. —పై.—
మగుడుచు, దే. ప్రే. మగుడఁజేయు. రూ-మగుడ్చు.
మగుడ్చు, —పై.—
మగులు, దే. వి. గోడమీఁది కప్పు: మదురు-మదులు.
మగులుగోడ, ద్వ. వి. మదురుపెట్టిన గోడ—మదురు గోడ. కళా. 3, ఆ. 66: చూ. మఱుఁగుగోడ.
మగువ, దే. వి. ఆఁడుది: చూ, స్త్రీ. 1.
మగ్గపుగుంత, ద్వ. వి. సాలెవాఁడు నేయుటకుఁ గూర్చున్నపుడు కాలుచాఁచుకొనెడు పల్లము. హంస. 2. ఆ. 11. చూ, మగ్గము. 1—(3)
మగ్గము, దే. వి. సాలెవాఁడు నేసెడు యంత్రము. తద్విశేషములు (ఉపకరణములు).— ౧. అచ్చు; ౨. అసు; అసుఁగ్రోవి; ౩. కారవుఁబడుగు; ౪. కుంచియ-కుంచె; ౫. (సం) తంత్వాతర్చనము; ౬. పంటియ-పంచె, పంటికఱ్ఱ, పంచెకోల, పరఁచె. (సం).— తసరము-త్రసరము; ౭. పడుగు (సం).— ఆతానము, తంత్రము; ౮. పలక; ౯. పేక; ౧౦. లాక, లాకచేయి, లాకబద్ద. (సం).— ప్రవాణి: ౧౧. లాకకట్టు; ౧౨. సరి; (మిగతవానికి "చూ, సరి. 2.") (౧) మగ్గముయొక్క ఉపకరణములు.— (ఇందుకొన్ని శీర్షికలు కానేరవు.) అచ్చు అతుకుట; అచ్చుబద్ద; అచ్చుత్రాడు; అరిక (తడుపుట); అర్చుట (చేయుట); ఊడితెలు; కండి; గడ్డపాఱ, గడ్డపలుగు; చేడు; చేడుముల్లు; చుట్టుకఱ్ఱలు, చుట్టుబద్దలు. గుదిబద్దలు; గోఁజు, గంజి; జువ్వలు-సువ్వలు; దోనియ-దోనె; నాడి; నాడిముల్లు; నేఁతలాకలు; బండి; మొలలాకలు; మోకు; మోకుగిలక; సుద్దకడ్డీ. (౨) రాట్నములోని భాగములు.— అడ్డ; ఆకులు; ఇరుసు; ఊఁచలు; కదురు; గుంజలు; చెవులనడుమ దారము; చెవులపీఁట; తొక్కుడుపీఁట; దారము, పోగు, తంతువు. (3); చూ, మగ్గములకు (మిగతవానికి "చూ, సరి. 2.")
మగ్గరి, దే వి. (మగ్గము + అరి): చూ, సాలెవాఁడు.
మగ్గు, దే. అ. క్రి. ఉక్కచే చెమ్మగిల్లిచెడు: మగ్గడుపాఱు.
మగ్గుడు, దే. వి. మగ్గుట.
మగ్గుడుపాఱు, దే. అ. క్రి: చూ, మగ్గు.
మగ్దూరు, వా. వి అధికారము.
మగ్నము, సం. విణ. మునిఁగినది: చూ, విగాహితము.
మఘ, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, మక్కలు; అం. 2. చూ, పితరులచుక్క.
మఘము, సం. వి. అ. పుం. 1: చూ, రూ- మఖము; 2. ఒక దీవి: చూ, లంక (1).
మఘవంతుఁడు, సం. వి. న్. పుం: చూ, రూ-మఖవంతుఁడు
మఘవుఁడు, సం, వి. న్. పుం.—పై.—
మఘాభువు, సం. వి ఊ. పుం: చూ, శుక్రుఁడు:
మచర్చిక, అం: చూ, శ్రేష్ఠవాచకములు.

మచ్చిక, దే. వి. రూ-మచ్చికె-మచ్చిగ. 1. ప్రేమము: చూ, స్నేహము 1; 2. మోహము. భాగ. 7, స్కం. 48; మార్క. 5, ఆ. 200: చూ, వలపు. 2; 3; చూ, వాంఛ; 4: చూ, బుజ్జగము. 1.

మచ్చికపడు, ద్వ. అ. క్రి. 1: చూ, మరులుకొను. 1; 2: చూ, స్నేహించు.

మచ్చికె, దే. వి. చూ, రూ-మచ్చిక.

మచ్చిగ, —పై.—(వాంఛకు –విక్ర. 6 ఆ. 78.)

మచ్చెకంటి, ద్వ. వి, (మచ్చెము+కన్ను) 1 చేఁపలవంటి కన్నులుగల ఆఁడుది: చూ, స్త్రీ; 2. ఆఁడుది. కళా. 3, ఆ. 129: చూ, స్త్రీ.

మచ్చెము, వై. వి.=మచ్చ. 1. చేఁప: చూ, మత్స్యము. 1; 2. చిహ్నము: చూ, లక్షణము. 1; 3. చంద్రకళంకము. చూ, లక్షణము. 1.

మచ్చ, దే. వి. 1. రూ—మచ్చము. గాయపుగుఱుతు: చూ, లక్షణము. 1; 2: చూ, పుట్టుమచ్చ; 3:చూ,రూ-మచ్చెము,3.

మచ్చమాయు, దే. అ. క్రి. చూ. నశించు.

మచ్చము, దే. వి: చూ, రూ-మచ్చ. 1. వసు, 6, ఆ. 73.

మచ్చరము, వై, వి.=మత్సరః. 1. చూ, మాత్సర్యము. 1; 2. చూ, విరోధము.

మచ్చరి, వై. విణ. (మచ్చరము+ఇ) 1.=మత్సర. ద్వేషి: చూ, శత్రువు; 2. చోరుఁడు: చూ, హారకుఁడు. 1; 3; చూ, మాత్సర్యశీలుఁడు. భాగ. 6. స్కం. 273.

మచ్చరించు, వై. అ. క్రి. 1. చలపట్టు: చూ, సూడుకొను. 3; 2. చూ, ద్వేషించు. భాగ. 1, స్కం. 332.

మచ్చరికము, వై. వి.=మత్సర. 1: చూ, మచ్చరము. 1. హరిశ్చ. 1, ఆ. 84; 2: చూ, మచ్చరము. 2; 3; చూ, పోటి. 1. విక్ర. 5. ఆ. 62.

మచ్చరికించు, వై. అ. క్రి. 1: చూ, రూ-మచ్చరించు. 1.విక్ర. 8, ఆ. 8; 2: చూ, రూ-మచ్చరించు. 2. నై. 8, ఆ, 65.

మచ్చరీఁడు, వై. విణ.=మత్సర. (మచ్చరి+ఈఁడు): చూ, మచ్చరి. 3. ప్రభా. 1, ఆ. 77. (స్వార్థమున ఈఁడు.)

మచ్చవెన్నుఁడు, ద్వ. వి: చూ, ఫల్గునుఁడు.

మచ్చు, దే. వి. 1. మీఁదకట్టడములేని మిద్దెటిల్లు. అచ్చ. ఆ, కాం. 10: చూ, సదనము. 1; 2. చొక్కుపొడి: చూ,మైదు; 3: చూ, ప్రలోభనము. భాగ. 10, స్కం. పూ. 1287; 4. వన్నెసరి చూచుకొనుటకు అగసాలెవాఁడిచ్చెడు వెండి బంగారముల ముక్క, మచ్చుముక్క: చూ, లోహము. 1; 5. మాదిరి: చూ, సామ్యము.

మచ్చుకత్తి, ద్వ. వి. మోటకత్తి: చూ, రిష్టి. 2.

మచ్చుముక్క, దే. వి: చూ, మచ్చు. 4.

మచ్చులు, దే. వి. బ. వెండిబంగారముల మచ్చు కమ్ములు. హంస. 2, ఆ. 181: చూ, లోహము. 1.

మచ్ఛము, సం. వి. అ. పుం =మచ్చెము: చూ,మత్స్యము.1.

మజ్జ, సం. వి. ఆ. స్త్రీ, న్. పుం. 1. చెట్టుచేవ: చూ, సారము; న్. పుం. 2. ఎముకలయందలి సేయి, అస్థిస్నేహము: చూ, స్నేహము.

మజ్జనము, సం. వి. అ. న. 1.=మజ్జనము పాండు. 2, ఆ. 108 చూ, స్నానము; అం 2: చూ, భాషణము. 2.

మజ్జనోన్మజ్జనన్యాయము, న్యా. మునుఁగుట తేలుటకు అలముసుఁగుట తేలుట.

మజ్జము, అం: చూ, ధాతువులు.

మజ్జిగ, వై. వి.=మార్జికా: 1 చల్ల, మోరి. (సం).-అరిష్టము కాలశేయము - కాలసేయము, గోరసజము, గోరసము, ఘనరసము, /ఘోలము-ఘోళము, దండాహతము. తద్విశేషములు —౧. చల్లతో తడిపినది. (సం).— ఔదశ్వితము-ఔదస్విత్కము; ౨. చేమిరిపెట్టుచల్లకు.- తోడుచల్ల: ౩. నీళ్ళుకలియనిచల్లకు.—కాను. (సం) - కోథము, ప్రమథితము; ౪. పాతికపాలు/ నీళ్లచేర్చిన చల్లకు (సం).— కంకరము, కచ్చరము, కటురము-కట్వరము, తక్రము; ౫. మూఁడుపాళ్లు నీళ్లకలిసిన చల్లకు:- నీరుచల్ల-నీరుమజ్జిగ—నీరుమోరు, బక్కనీళ్లు-బక్కమజ్జిగ ; ౬. చల్లపులుసు, తిమ్మనము, మెంతిమజ్జిగ. (సం.)—తేమనము, మార్జిక ; ౭. సగమునీళ్లు చేర్చిన మజ్జిగకు. (సం.)—ఉదశ్విత్తు—ఉదస్విత్తు. (మిగతవానికి "చూ, స్తన్యము.")

మజ, దే. అవ్య. (రూ-మజా—మజ్జ—మజ్జరె—మజ్జరే—మజ్జా—మజ్జారె-మజ్జారే-మఝ్ఝారె-మఝ్ఝారే.) ప్రశంసనార్థకము. ఉ, హరి. 5, ఆ. 270: చూ, సెబాసు.

మజా, దే. అవ్య. —పై.— విక్ర. 8, ఆ. 18.

మజాకా, వా. వి. తమాషా-తడాకా, శక్తి.

మజుకూరు, వా. వి. పైనఉదహరించిన గ్రామము.

మజుబతు, వా. విణ: గట్టి.

మజూరి, వా. వి: చూ, మళాఖత్తు.

మజ్జ, దే. అవ్య: చూ, రూ-మజ.

మజ్జనము, వై. వి.= మజ్జన: చూ, మజ్జనము.

మజ్జరి, దే. వి: చూ, ధేనువు. 1-౨౩.

మజ్జరె, దే. అవ్య: చూ, రూ-మజ.

మజ్జరే, —పై.—

మజ్జా—పై —

మజ్జారె, —పై.—

మజ్జారే, —పై.—

మజ్జా, మి. అవ్య. —పై.—

మజ్జారే, మి. అవ్య. —పై.—

మటమట, దే. వి: చూ, రూ-మలమల.

మటమటలాడు, దే. అ. క్రి. మండు: చూ, వెలుఁగు. 5.

మటము, వై. వి.=మఠము. పరదేశులు సన్న్యాసులు లోనగువారు వసించు గృహము: చూ, సదనము. 1.

మటిక, దే. వి: రూ-మట్టిక, గోరుచిక్కుడు*: చూ, మొక్కచిక్కుడు.

మటిమము, అం. (మత్యము) పదియక్షరముల కాలము: చూ, తాళములు.

మటుమాయ, దే. విణ. (మాయదుము+మాయము) రూ-మటుమాయము. 1. మిక్కిలి మాయ; వా. 2. బొత్తిగా కనఁబడఁజేయుట

మటుమాయము, —పై.— సా. 2, అ, 114.

మటుమాయకాఁడు, దే. విణ. మిక్కిలి మాయలుగలవాఁడు: చూ, వ్యాళగ్రాహి.

మటుమాయలాఁడు, —పై.—

మట్ట, దే. వి. 1. తాటి, కొబ్బరి లోనగువాని ఆకుల కొమ్మ (వృంతము): చూ, శాఖ. 1; 2. ఆవులోనగువాని తోఁక. భార. విరా. 4, అ. 234: చూ, వాలము. 1; వై. వి. 3=మఠ: చూ, వామనుఁడు; 4. గోడకు సున్నముకొట్టెడు కుంచె: చూ, కుంచియ-కుంచె.

మట్టగించు, వై. స. క్రి.=మఠ. 1. మట్టుచేయు; వా. 2: మట్టముచేయు.

మట్టగిడుసు, దే. వి: చూ, మత్స్యము. 1.

మట్టపలక, వై. వి. (మట్టము+పలక) శిల్పులు మట్టము చూచెడు పలక.

మట్టపు బంగారు, వై. వి: చూ, కోరాబంగారు.

మట్టమధ్యాహ్నము, మి. వి. (మధ్యాహ్నము+మధ్యాహ్నము): చూ, పట్టపగలు.

మట్టము, దే. వి. 1: చూ, పరిమితి; వై. విణ. 2.=మఠ. వెలితి: చూ, సొద్దు. 1; 3.=మఠ. పొట్టి. భాగ. 8, స్కం. 542: చూ, హ్రస్వము; 4. చదను, సమము: చూ, సపాటము (వృత్తియందు హల్లుపరమగుచో ముపర్ణము లోపించును.- మట్టపలక మొ.)

మట్టముచేయు, వా. స. క్రి. 1: చూ, మట్టగించు; 2. ఎన్నటికిని పైకిరాకుండఁగ అడఁగఁద్రొక్కు.

మట్టసము, వై. విణ.=మఠ. 1. కుఱుచైనది: చూ, హ్రస్వము; 2: చూ, పరిమితి. య. 2, అ. 87; 3: చూ, పరిమితము. 2.

మట్టని, వై. విణ.=మఠ: చూ, వామనుఁడు.

మట్టాడు. దే. అ. క్రి. (మట్టి+అడు) 1. గమనించు. భాగ. 3, స్కం. 414: చూ; వెళ్లు. 3; 2: చూ, సంచరించు; 3: చూ. వ్యాపించు.

మట్టి, వై. వి.=మృత్తికా. మన్ను: చూ, భూమి. 1.

మట్టిక, దే. వి: చూ, రూ-మటిక.

మట్టిగోడ, వా. వి: చూ, మఱుఁగుగోడ.

మట్టితైలము, అం. మట్టివలనఁ దీసెడుధృతి: చూ, తైలములు.

మట్టినూనె, అం. —పై.—

మట్టిపగడము, వై. వి: ఇటిక పగడము. (సం.)— ఇష్టకప్రవాళము, తిక్కటిక—తిక్కణిక. (చూ, రత్నములు.)

మట్టియ, వై. వి. రూ-మట్టె. 1.=మృత్తికా: చూ, మట్టి; దే. వి. 2. మగవానికాలి రెండవ వ్రేలిమించు, రూ-మట్టెమించు, మెట్టియ-మెట్టె: చూ, భూషణము. 2; బ: 3. ఆఁడుదానికాలి రెండవ వ్రేలిమెట్టె కళా. 7, అ. 66. చూ, భూషణము. 2.

మట్టు, వై వి.=మిత. పాండు. 2, అ. 161: చూ, మితి. 2; 2. పర్యంతము: చూ, వఱకు; 3. కుదురు. భార. విరా. 4, అ. 264: కుదురు, గడ్డిబొద్దు, చుట్టకుదురు-చుట్టుకుదురు, నెట్టియము-నెత్తెము. (సం.)—ఆధారకుండము; తద్వి.—౧. గుండుగ చుట్టిన చుట్టకు చుట్ట; ౨. మోఁపుక్రింద తలమీఁదుగా నుంచుకొనెడు చుట్టకు—చుట్ట; 4. తక్కువ: చూ, సొద్దు. 1; దే. వి. 5: చూ, వామనుఁడు; 6: చూ, త్రొక్కుడు. 3. పా. 1, అ. 23; 7. ప్రదేశము: చూ, స్థానము. 1; 8. ఇల్లు: చూ, సదనము. 1; విణ. 9. మప్పితము: చూ, మితము. 1; స. క్రి. 10: చూ, ఒత్తు. 20. హరి పూ 6, అ. 88.

మట్టుకాఁకర. ద్వ. వి: చూ, పొట్టికాఁకర*.

మట్టుకొను. దే. అ. క్రి. 1: చూ, మట్టుపడు. విక్ర. 1, అ. 139; ప్రే. 2. మట్టుకొలుపు.

మట్టుచేయు, వై. స. క్రి: మట్టగించు.

మట్టుపడు, వై. అ. క్రి. 1. అడఁగు. జై. 5, అ. 145: చూ, క్రుక్కు. 4; ద్వ. అ. క్రి. 2. అంటు, ఇరవుకొను, ఇరవుపడు, ఇఱుకుకొను, కుదురుకొను, కుదురుపడు—కుదుర్పడు, కొను, నట్టుకొను, నిలఁబడు-నిలువఁబడు-నిల్వఁబడు, నిలుచు—నిల్చు, నిలుచుండు-నిల్చుండు, నిలుచుకొను, నూలుకొను-నూల్కొను, నెక్కొను, నెప్పుకొను, నెలకొను-నెలవుకొను, పట్టుకొను, పాదుకొను, పాదునిలుచు, మట్టుకొను (మిగతవానికి "చూ, స్థిరపడు"); ప్రే. 3. మట్టుపఱచు. జై. 6, అ. 30.

మట్టుపెట్టు, ద్వ. స. క్రి. చంపు. ఉ, రా. 5, అ. 11; ఉ, రా. 2, అ. 13: చూ, సంహరించు.

మట్టుబచ్చలి, ద్వ. వి: చూ, దుంపబచ్చలి*.

మట్టుబీఱ, ద్వ. వి. ఒకబీఱ*: చూ, హ్రస్వగవేధుక.

మట్టుమిగులు, ద్వ. అ. క్రి. అతిక్రమించు: చూ, వాలు. 12 (దాఁటు 6 )

మట్టుమీఱు, —పై.—

మట్టె, వై. వి. 1: చూ, రూ-మట్టియ 1. కాశీ. 4, అ. 97; దే వి.2: చూ, రూ-మట్టియ. 2; బ. 3: చూ, రూ-మట్టియ. 3; విణ. 4. బట్టవాఱుగలది. "మట్టెయావు" మొ.

మట్రు, ద్వ. వి. దున్నునపుడు కొండ్రతిరుగక నడుమనిలిచెకు కొంచెముతావు. పాండు. 3, ఆ. 24.

మఠము, సం. వి. అ. పుం.=మఠము ఆశ్రమము: చూ, సదనము. 1.

మఠ్యము, అం. 1: చూ, మటిమము; 2: చూ, జన్యతాళములు.

మడ, దే. వి. 1. ప్రవాహమార్గము. హరి. పూ. 8, అ. 37: చూ, మార్గము. 1; 2. మడచెట్టు: చూ, వృక్షము.

మడఁక, దే. వి. 1: మడత, మడుపు; 2: చూ, లాంగలము.

మడఁగు, దే. అ. క్రి. రూ-మణఁగు. 1: చూ, వంగు,2: చూ, నివర్తిలు. మార్క. 6 ఆ. 203.

మడఁచు, దే. ప్రే. మడఁగజేయు: మడుఁచు-మణఁచు.

మడఁతి, వై. వి.=మడవతి. (దేశ్యమని. శ. ర.) ఆఁడుది: చూ, స్త్రీ.

మడఁతుక, —పై.— (దేశ్యమని శ. ర.) (స్వార్థమునఉక.)

మడకఱ్ఱ, దే. వి. 1. లావుకఱ్ఱ: చూ, నేత్రము. 1; వా. 2. వంటకట్టియ. "మీ అడుకులో మడకఱ్ఱలుకలవా ?": చూ, సమిధ. 2: 3. మడ, మడకఱ్ఱచెట్టు: చూ, వృక్షము.

మడత, దే. వి. 1. చలువ, ధౌతవస్త్రము: చూ, వస్త్రము; 2. బట్టమడుపు: చూ, మడఁక. 1: 3. కడుపుమీఁది మడుపు: చూ, తొన. 1; 4: చూ, భక్ష్యము: వా.౬:చూ,మతకము.1.

మడఁద్రొక్కు, దే. స. క్రి. (మడఁగన్+త్రొక్కు) తాటాకులు పంక్తివలె వరుసగా అణఁగఁద్రొక్కు.

మడమ, దే. వి. గుదికాలు. (సం).— పార్ష్ణి, ఘుటి. (ఉ, హరి. 6, ఆ. 108.) చూ, హజ్జ. (దీనికి ఉపమానము.— మట్టివండు )

మడమపొల్లు, దే. వి. గాలిపాటు సరిగాలేక వరి వెన్నులో గింజలు కట్టినవిగాక పొల్లులయినది: మడవపొల్లు.

మడయు, దే. అ. క్రి: చూ, మరణించు.

మడవ, దే. వి. (మడ+వా.) మళ్ళకు పాదులకు నీళ్ళుపాఱెడి కాలువముఖము. కళా. 4, ఆ. 96.

మడవచేఁప, దే. వి. ఒకచేఁప: చూ, మత్స్యము. 1.

మడవపొల్లు, దే. వి: చూ, రూ-మడమపొల్లు.

మడవు, దే. అ. క్రి. 1. విముఖమగు; చూ, లేటమొగమువడు; 2. నిష్ఫలమగు.

మడి, దే. వి. 1. పడగ-పడిగమడ-పడిగమెడ-పడిగెమడ,చూ, హ్రాదిని (నది); 2: చూ, మడత. 1; 3. వరిపొలము; చూ, భూమి. 1; విణ. 4. పరిశుద్ధము: చూ, శుద్ధము. 3; 5. ఆచారము, శుచి: చూ, వర్తనము. 1; 6. (వృత్తియందుఉత్తరపదమైన మడుఁగు పట్టమునకు ఆదేశముగావచ్చెడిరూపము. "ఇనుమడి-ముమ్మడి. మొ.")

మడికట్టు, ద్వ. వి. 1. రూ-మణికట్టు-మనికట్టు: చూ హస్తము. 1; వా. అ. క్రి. 2. రూ-మడిగట్టు. ఆరవేయఁబడినవస్త్రము ధరించు: మడిగట్టుకొను; 3. రూ - మడిగట్టు - నలుప్రక్కలను గట్టువేసి మడిగాయేర్పఱచు: మడిగట్టుకొను.

మడికాసు, దే. వి. వె-డి: చూ, లోహము. 1.

మడికాసుగట్టు, దే. వి. కైలాసము: చూ, పర్వతము.

మడికాసుమఱఁదేఁడు, దే. వి: చూ, శివుఁడు.

మడిగట్టు, వా. వి. 1. చేనుగట్టు; అ. క్రి. 2: చూ, రూ-మడికట్టు. 2; 3: చూ, రూ-మడికట్టు. 3.

మడిగట్టుకొను. వా. అ. క్రి. చూ, మడికట్టు. 2-3.

మడిచేఱు, ద్వ. వి. (మడిచిన+చేఱు) వైష్ణవస్త్రీలు ముందు నుండియెత్తి వెనుకకు చెక్కుకొను కోక చేఱు:చూ, మైజారు.

మడిపెసలు, దే. వి. మడియందు పైరగు నల్లపెసలు: చూ, స్తంబారి (పెసర.)

మడిమ, అం: చూ, కళాస్థానములు.

మడిపంచ, వా. వి. ఆరవైచినబట్ట: చూ, వస్త్రము.

మడిబట్ట, వా. వి.—పై.—

మడిమంచ, దే. విణ. బలహీనము. స్వా. ఆ.6. 28. రూ-మడిమంచము, నిస్సత్తువ-నిస్సత్తువు. (సం).— అశక్తి, గ్లాని.

మడిమంచము, —పై.—

మడియఁడు, దే. విణ. మూఢుఁడు. సా. 2, ఆ. 127: చూ, స్తబ్ధుఁడు.

మడియాలు, దే. వి. రూ-మడేలు: చూ, రజకి.

మడియించు, దే. స. క్రి,చంపు.సా. 2.ఆ.37.చూ,సంహరించు.

మడియు, దే. అ. క్రి. 1: చూ, మరణించు; 2:కివ్వ.-తునుఁగు.

మడియుట, దే. వి: చూ, మరణము.

మడియుగాలి, వా: వి. చూ, మమ్మ. 1.

మడిపాలు, దే. వి. చూ, రజకుఁడు.

మడిసంచి, దే. వి. (ఇతరులు అంటఁగూడనిది) ఆరవైచిన బట్టలు. దేవుఁడు లోనగునవిగల సంచి:చూ, సంచి.

మడిసంది, దే. వి. (రామా. 6, ఆ. 164): చంక - చంకిలి - చక్కిలి. (సం).—కక్షము, కక్ష్య, దోర్మూలము, బాహుమూలము. (చూ, హస్తము.)

మడుఁగు, దే. వి. (రూ-మడువు-మడ్గు-మణుఁగు-మణువు) 1. గుణము. "దీనికది యెన్నిమడుఁగులు హెచ్చు.": చూ. రెట్టి; 2. హ్రదము: చూ, సరస్సు. 1; 3. కొలను. పంచ. నా. 3, ఆ. 340: చూ, సరస్సు. 1; 4. పరిశుద్ధి: చూ,సుద్ది. 2; 5. పరిశుద్ధవస్త్రము. పా. 2, ఆ. 14: చూ, వస్త్రము: 6. ఎనిమిదివీసెల కొలఁది, బారువలో ఇరువదవవంతు; 7, అడఁకువ: చూ, వినయము. 1; బ. 8. ఆకుమడుపు. రుక్మి 5, ఆ. 57: చూ, వృత్తపర్ణము; విణ. 9: చూ,మడి.

4; అ. క్రి. 10: చూ, వంగు. హరిశ్చ.1, అ. 5,ఆ. 73; 11: చూ, క్రుక్కు. 4. ఉ. హరి.2,ఆ.58;ఉ.హరి.క.ఆ.13.

మడుఁచు, దే. క్రే. చూ, రూ-మడఁచు.

మడుపు, దే: వి. 1: చూ, మడుఁగు. 5. అని. 5, ఆ. 31; 2: చూ, మడఁక. 1; బ. 3: చూ, రూ-మడుఁగు. 8; స. క్రి. 4. చంపు: చూ, సంహరించు.

మడుపు, దే. వి, అ. క్రి: చూ, రూ-మడుఁగు.

మడేలు, వా. వి: చూ, రూ—మడియాలు.

మడ్గు, దే. వి, అ. క్రి: చూ, రూ-మడుఁగు. (గుణమునకు.—పాండు. 3, ఆ 137).

మడ్డి, దే.వి. 1: చూ, బంధురము. 4; విణ. 2: చూ, స్తబ్ధుఁడు.

మడ్డిపాలు, దే, వి. బంకగానుండు నొకరసము.

మడ్డు, దే. వి. ఇనుపగుండు. ప్రభా. 5, ఆ. 60: చూ, రాయి.

మడ్డుకత్తి, ద్వ. వి: చూ, మచ్చుకత్తి.

మడ్డువు, సం. వి. ఉ. పుం. 1. గుమ్మెట, తుడుము: చూ, వీణె; అం. 2: చూ, ఆనద్ధ వాద్యములు.

మణఁగు, దే. అ. క్రి: చూ, రూ-మడఁగు. 1-2.

మణి, సం. వి. ఇ. పుం, స్త్రీ. 1. రూ-మాణి. పచ్చలాయి లోనగునది (అశ్మజాతి): చూ, రత్నము. 1; 2. ముత్యము లోనగునది (అనశ్మజాతి): చూ, రత్నము. 1; 3. రతనము: చూ, రత్నము. 1; 4. నంద, ముంత: చూ, పాత్రము. 6; 5.=మని: చూ, మడికట్టు; 6. గొట్టిమెడచన్ను: చూ, స్తన్యము; 7. మగవాని కామచివర: చూ. శిశ్నము; 8. ఒకానొకపాము: చూ, సర్పము; అం 9: చూ, క్రియలు; 10: చూ, అసంయుత హస్తములు.

మణికట్టు, వా. వి: చూ, రూ-మడికట్టు.

మణికము, సం. వి. అ. పుం. 1. కాఁగు. ముంత (అని కొందఱు): చూ, పాత్రము. 6; అం. 2: చూ, రదక్షతములు.

మణికాచము, సం. వి. అ. పుం: చూ, వెంపలి*.

మణికారుఁడు, సం. వి. అ. పుం. రత్నములను సానఁబట్టు వాఁడు: చూ, సానలవాఁడు.

మణిగ, దే. వి. (రూ—మళిగ—మళిగె—మణిగె): చూ, దుకాణము. 1.

మణిగణనికరము, పా: చూ, వృత్తము, 1. "న-న-న-న-స. 9 యతి. 15వ ఛందస్సు")

మణిగము, దే.వి. రూ మణివము. అధికారము: చూ, రపము.1.

మణిగానసము, దే. వి. సన్నసున్నపు పూఁత: చూ, సమాలంభము.

మణితము, సం. వి. అ. న. రూ-మాణితము. 1. రతికాలము నందలి గళరవము: చూ, స్వరము. 2; 2. కోకిలధ్వని: చూ, స్వరము. 2; అం. 3: చూ, రతిధ్వనులు.

మణిదీపిక, పా: చూ, వృత్తము. 1. (మొదటి పాదము.—"న-భ భ-న-భ-స గణములు. 13 యతి; రెండవ పాదము—"న-న-న-స జ-భ సగణములు. 14 యతి; మూఁడవ పాదము.—"న-భ-ర-స-న-స-న-స గణములు. 12 యతి; నాలుగవ పాదము—"న-భ-ర-స-జ-జ-గురువు 12 యతి.)

మణిపూరకము, అం: చూ, చక్రములు. (వెన్నెముకయందలి షట్చక్రములలో నొకటి.)

మణిపూరము, అం. —పై.—

మణిప్రవాళము, సం. వి. అ. పుం, న. రెండుభాషలు కలిసిన కవిత్వము: చూ, మాటలల్లుట.

మణిబంధము, సం. వి అ. పుం. 1.=మని. చేతిమనికట్టు: చూ, హస్తము 1; అం. 2: చూ, అధమక్షేత్రములు.

మణిబంధములు, అం. (ముంజేతులు) 1: చూ, లక్షణాంగములు (పురుషునకు—ముడుసులు కనిపించుచున్న దుఃఖి. మిక్కిలి కుఅచయైన రాజు. మూఁడు రేఖలున్న మణిఖచిత భూషణముల ధరించును.) 2: చూ, స్త్రీ లక్షణాంగములు. (లావైన పతి చచ్చును.)

మణిబిందుమాలిక, అం: చూ, దంతక్షతములు.

మణిభూషణము, పా: చూ, వృత్తము 1. ("ర-న-భ-భ-ర గణములు. 10 యతి. 15వ ఛందస్సు").

మణిమంత్రౌషధాదిసిద్ధి, అం: చూ, కళలు.

మణిమాల, పా: చూ, వృత్తము. 1. ("త-య-త-య గణములు. 7. యతి. 12వ ఛందస్సు")

మణిరంగము, పా: చూ, వృత్తము. 1. ("ర-స-స గురువులు. 6 యతి. 10వ ఛందస్సు").

మణిరంజనము, సం. వి. అ. న. వర్ణపుతేకు.

మణివకాఁడు, దే. విణ (మణివము+కాఁడు): చూ, పారుపత్తెపుకాఁడు.

మణివము, దే. వి: చూ, రూ-మణిగము.

మణిసరులు, దే. వి. బ: చూ, ధాన్యము.

మణిసిల, వై. వి.=మనశ్శిలా. కిటంభర. (శుద్ధి.—సున్నపు నీళ్ళతో రెండుజాములు దోలాయంత్రమున వండినశుద్ధి): చూ, రాయి.

మణిసూత్రన్యాయము, న్యా. పూసలలో దారమువలె లోపలకలిసి యుండుననురీతి.

మణిస్థానప్రయోగము, అం: చూ, తంత్రములు.

మణీచకము, సం.వి.అ.పుం. చాదినీవెండి: చూ, లోహము. 1.

మణుఁగు, దే. వి, అ. క్రి: చూ, రూ-మడుఁగు.

మణుఁగుఁబూలు, ద్వ. వి. బ. కుబేరమూలమను భక్ష్యము: చూ, భక్ష్యము.

మణుఁచు, దే. క్రే: చూ, రూ-మడఁచు.

మణువు, దే. వి, అ. క్రి: చూ, రూ-మడుఁగు.

మణేదారు, వా. వి. మునసబునకు సహాయకారి.

మతంగజము, సం. వి. అ. పుం. ఏనుఁగు: చూ, హస్తి.

మతంగుఁడు, సం. వి. అ. పుం. 1. ఒకఋషి: చూ, సన్న్యాసి; 2. రూ-మాతంగుఁడు: చూ, మాదిగ.

మతకము, దే. వి. 1. కపటము: చూ, సూక్ష్మము. 2; 2: చూ, మాయము. 1; 3: చూ, స్నేహము. 1,

మతకరి, దే. విణ. (మతకము + అరి) మాయావి: చూ, వ్యాళగ్రాహి.

మతము, సం. వి. అ. న. అభిప్రాయము: చూ, స్మృతి. 1; 2. అంగీకారము: చూ, సమ్మతి. 1; 3: చూ, శాస్త్రము. 1; 4. సమ్మతము: చూ, స్వీకృతము. 1; 5. తెలియఁబడినది: చూ, వ్యక్తము. 2; 6. పూజింపఁబడినది: చూ, సన్యస్తము. 2; 7. కులాచార పద్ధతి. తద్వి.—జైనము మొదలగు మతములు పెక్కులు గలవు (చూ, మతములు, హిందూ మతము).

మతములు, అం. 1. వైష్ణవము, మాధ్వము, స్మార్తము; 2. వైష్ణవము, శైవము, శాక్తము, గాణపతము (గాణాపత్యము), సౌరము, కాపాలికము. (కాపాలము); 3. ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతము. (చూ, త్రయము).

మతలబు, వా. వి. 1. ఉత్తరము పైవిలాసము వ్రాయురీతి: చూ, శిరోనామ. "మహారాజశ్రీ . . . వారికి, బ్రహ్మశ్రీ . . . వారికి". ఇత్యాది; 2. ఉత్తరములోని అంశముల గమనిక; 3: చూ, ముసాయిదా.

మతల్లిక, అం రూ-మాతల్లిక: చూ, శ్రేష్ఠ వాచకములు

మతాబు, దే. వి. రూ-మత్తాబు: చూ, బాణసంచు.

మతి, సం. వి. ఇ. స్త్రీ 1.=మది. శాస్త్రచింతనాదులచేఁ గలుగు నర్థనిర్ణయ జ్ఞానము: చూ, హృల్లేఖము. 2; 2: చూ, వాంఛ; 3. తలఁపు: చూ, స్మృతి. 1; అం. 4: చూ, సంచారి భావములు. ("ఔనౌను. దాశరథి పరతత్వరూపమే కాకున్న నిట్లెల్లెడలం గాన్పించునే? యోసరమా: యిదియు నా కించుక భాగ్యమనియే తలంచెద").

మతిరేవబలాద్గరీయసీ, న్యా. బలముకన్న బుద్ధియే గొప్పది.

మతోత్తము, అం: చూ, తంత్రములు.

మత్కుణము, సం. వి. అ. పుం. 1.=మొగటి. నల్లి: చూ, రక్తాంగము. 4; 2. కొమ్ములులేని యేనుఁగు: చూ, హస్తి; 3. నారికేళము*: చూ, స్కంధఫలము.

మత్కుణుఁడు, సం వి. అ. పుం. గడ్డము మీసము లేనివాఁడు: చూ, సౌవిదల్లుఁడు.

మత్త, అం. (హంసశ్రేణి): చూ, వృత్తము. 1. ("మ-భ-స గురువులు. 7 యతి. 10వ ఛందస్సు").

మత్తకాశిని, సం. వి. ఈ. స్త్రీ. రూ-మత్తకాసిని. 1. మదముచేత ప్రకాశించునట్టి ఆఁడుది: చూ, స్త్రీ; 2.ఆఁడుది: చూ, స్త్రీ.

మత్తకాసిని, —పై.—

మత్తకోకిల, పా: చూ, వృత్తము. 1. ("ర-స-జ-జ భ-ర. 11 యతి. 18వ ఛందస్సు").

మత్తగిలు, వై. అ. క్రి.=మత్త: చూ, మదించు. 1.

మత్తత, వా. వి: మదటతనము.

మత్తమయూరము, అం: చూ, వృత్తము. 1. ("మ-త-య-స గురువులు. 8 యతి. 13వ ఛందస్సు.")

మత్తము, సం. వి. అ. పుం. 1. మదముపట్టిన యేనుఁగు: చూ, హస్తి; విణ. 2. మదముపట్టినది,

మత్తల్లిక, అం: చూ, రూ-మతల్లిక.

మత్తల్లి, అం. 1: చూ, కిరణములు; 2: చూ, ఛాయాపలు.

మత్తవారణము, సం. వి. అ. పుం. 1. ఒజ్జగుడిసె: చూ, లోటు; 2: చూ, మత్తము. 1.

మత్తహంసిని, అం: చూ, వృత్తము. 1. ("జ-త-స-జ గురువులు. 7 యతి. 13వ ఛందస్సు").

మత్తా, వై. వి. = మద. మత్తు: చూ, మంపు

మత్తాక్రీడ, అం: చూ, వృత్తము. 1. ("మ-మ-త-న-న-న-న వగణములు. 9-17 యతులు. 25వ ఛందస్సు").

మత్తాబు, దే. వి: చూ, రూ-మతాబు.

మత్తాలంబము, సం. వి. అ. న: చూ, ఉపాశ్రయము. (తె.)—కటకిటాలు, కటకటాకమ్ములు (మత్తాలంబము చింత్యము).

మత్తి. వై. వి. మదము: చూ, మత్తా.

మత్తికాఁడు, ద్వ. వి: చూ, వలపుకాఁడు. ఉ, హరి. 5, ఆ. 149.

మత్తిల్లు, వై. అ. క్రి. = మత్త: చూ, మదించు. 1.

మత్తు, వై. వి. = మత్త-మద: చూ, మత్తి.

మత్తుఁడు, సం. విణ. 1. మదట: చూ, శౌండుఁడు; 2: చూ, హృష్టుఁడు; 3: చూ, సోమరి.

మత్తేభవిక్రీడితము, అం. (మత్తేభము): చూ, వృత్తము. 1. ("స-భ-ర-న-మ-య-వ. 14 యతి. 20వ ఛందస్సు")

మత్సరకృత్తు, అం: చూ, షడ్జగ్రామ గత మూర్ఛనలు.

మత్సరము, సం. వి. అ. పుం. 1 =మచ్చరము: చూ, హంస. 7. 2. క్రోధము: చూ, రోషము; విణ. 3. ఈర్ష్యకలది; 4. క్రోధము గలది: చూ, రోషము; అం. 5: చూ, హేయ గుణములు; 6. (మాత్సర్యము): చూ, అరివర్గములు.

మత్స్యండి, సం.వి. ఈ. స్త్రీ. రూ-మత్స్యంది. కండచక్కెర: చూ, శర్కర. 1.

మత్స్యంది, —పై.—

మత్స్యధాని, సం.వి. ఈ స్త్రీ. చేఁపలబుట్ట, కువేణి: చూ, వల. 1.

మత్స్యపిత్త, సం. వి. అ. స్త్రీ కటుకరోహిణి*: చూ, కఠులాదని.

మత్స్యబంధనము, సం. వి. అ. న: చూ, వల. 1.

మత్స్యబంధము, అం: చూ, శబ్దాలంకారములు.

మత్స్యము, సం. వి. అ. పుం. 1 (రూ-మచ్చము-మత్సము)= మచ్చెము. (మాంసము హరించునిచ్చచేత హర్షించునది); అండజము, అనిమిషము—అనిమేషము, అప్పుచరము, అంబుచరము, అత్మాశి, కచరము, క్షత, గోనర్దము, చపలము, జలపిప్పకము, ఝషము, పృథురోమము, పోటగళము, మీనము, విసారము, వైసారిణము, శంబరము, శకులి, (తె.)-చేఁప, (బ) తెలుగంటి, నీటికెదురెక్కు పుట్టువు, మచ్చము-మచ్చెము, మరునిడాలు, మిలు-మీను-మీలు, వాలుగ; తద్విశేషములు— ౧. అండాలువు; ౨. అంబుకీశము, అవసాధ్యము, ఉలూపి, జలకూర్మము, శిశుకము, మీనడింభము. (తె.)—ఉలచచేఁప, ఉలచమీను, ఉలస-ఉలుచ, ఉలుచమీను; ౩. అంబుగజము, అంబుకంటకము

అంబు కిరాతము, అంబు మర్కటము, అపహారము-అవహారము, అసిదంష్ట్రము, ఆరామము, కుంభి, కుంభీరము, క్షీరశుక్లము, గిలగ్రాహము, గ్రాహము, చపలాంగము, చులుక, జలకంటకము, జలకపి, జలజిహ్వము, జలరూపము, జలసూకరము, జలసూచి, ఝషము, ఝషాశనము, నక్రము, మకరము, మరోలి, మాయాదము, మీనరము, వార్ఫటము, శింశుమారము, శిశుకము, హ్రదగ్రహము. (తె.)—కదలిరా తత్తడి, పిడకమొసలి—పిడుకమొసలి, మరునిడాలు, మొసలి; ౪. కుంభీరము-కుంభిలము, గిలగ్రాహము, గోముఖము, నక్రము. (తె.)-కాలుమొసలి; ౫. అకూపారము, అపహారము-అవరాహము, అపహారకము, కూర్మరాట్టు, జలకిరాటము, జలగ్రహము, జలహస్తి, జలాంటకము, జలాండకము, తంతునాగము, తంతువు (తె.)—అగడు-నెగడు-నెవడు-నీటిదయ్యము; ౬. అతిశృంగకము, శృంగి. (తె.)—కొమ్ముచేఁప, పాఁపమీను; ౭. (తె.)—అరిజ, అరుజు. తద్వి.—కల్లరుజు, పుల్లరుజు.; ౮. ఆష్ఠశఫరము, తిమింగిలము, దంతపాలము; ౯. అవహారము, గ్రాహము; ౧౦. అసిపృచ్ఛకము, చపలాంగము, జలకపి, జలచరము, జలౌకసము, నీరాటము, శింశుమారము. (తె.)-నీరుద్రిమ్మరి; ౧౧. అలస్యము, కిఘోణి, జలసూకరము. (తె)—నీరుపంది; ౧౨. ఇంచాకము, జలవృశ్చికము. (తె.)—చిఱుచేఁప, రెయ్య-రొయ్య; ౧౩. ఇల్లిశము-ఇల్లీశము, ఇల్వలము, గాంగేయము, జలతాలము, జలవాపికము, ప్రోష్ఠి, రాజశఫరము, వారికర్పూరము, శఫరాధిపము, శఫరి. (తె.)-ఇల్లవ, ఇల్లిసె, ఇల్లెము, ఇల్లెస, బేడిస; ౧౪. ఉచ్చింగటుఁడు, తృణగండము; ౧౫. ఉద్దండపాలము; ౧౬. ఉద్రము-ఉద్రము. జలమార్జారము, జలాఖువు-జలాఘువు, జలనకులము, జలబిడాలము, జలప్లవము, నకులప్లవము, నీరాఖువు. (తె.)—నీరుపిల్లి; ౧౭. ఉరగము; ౧౮. ఎట్టిమీను (చూ, సర్పము, రోహితము); ౧౯. ఏరంగము; ౨౦. కంకత్రోటము, జలవ్యధము, జలసూచి. (తె.)-గద్దముక్కుచేఁప; ౨౧. కంటకాష్ఠీలము, కుక్షిశము, కుడిశము, కులిశము-కులీశము-కులీరము, ఖలిశము-ఖలేశము-ఖలేశయము, ఖశేటము. (తె.)—గుడి, గుడిజెల్ల; ౨౨. కజ్జలి; ౨౩. కరండి, జలేశయము, మూకము, శంబరము; ౨౪. (తె.)—కరవాడు-కఱవాడు, వట్టిచేఁప, వరుగుఁజేఁప; ౨౫. కర్ణఫలము; ౨౬. కలకము, గండోలము, గణోత్సాహము, శకిలి-శకులి, శకులము, శకులార్భకము. (తె.)-కుచ్చుమీను, బేడిస, బేడిసమీను, లంజెబేడిస; ౨౭. కలభము; ౨౮. కవయి, కవిక, క్రకచపృష్ఠి, రాజీవము. (తె.)—కొఱువాసములు, చొఱ-చొఱ్ఱ-చోఱ, చోఱబుడుత, సొఱ-సొఱ్ఱ-సొఱచేఁప; ౨౯. కశ్యపము-కాశ్యపము; ౩౦. కాకోచి, కాకోచికము, జలవాపికము; ౩౧. కాతరము, కాతలము; ౩౨. కుంచిక, కుంభిలము, కుంభీరము, కుచికము; ౩౩. కుడుంగము; ౩౪. క్షుద్రజలచరములు.—కులాటము; (తె.)—ఎరచిల్ల పురుగు, కత్తరి, కురుమిండ, కౌయ, గవ్వము, చట్టుడుగుల్ల, తలకప్ప, తెలిదెమ్మకరి, నసిమిరి, నాఁచుడు, నిర్ఘాత, నీటికుమ్మరి పురుగు; నీటిఁగె, నీరుగుట్టు, నీరుపాప, నీరెన, నీర్చలి, నులిగుల్ల, ప్రాచిపురుగు, బంగరు పురుగు, రుండము, వెల్లిపోలిక; ౩౫. కోంకణము; ౩౬. క్రోడీముఖము, ఖడ్గము, గండకము—గడకము, గడము, గలానిలము, శకులార్భకము. (తె.)—గెండ-గెండె; ౩౭. క్షిణనిశ్వాసము, శింశుమారము—శిశుమారము; ౩౮. క్షుద్రాండమత్స్య సంఘాతము, పోతాధానము; ౩౯. గాంగటకము-గాంగటము—గాంగటేయము, గాంగేయము; ౪౦. గరఘ్ని; ౪౧. గండూపది. (తె.)—ఆఁడు ఎట్టి (ఆఁడెట్టి) (చూ, సర్పము); ౪౨. గర్గరము, గర్గాటము, యోగనాలిక; ౪౩. గర్జకము; ౪౪. గవాచి; ౪౫. గుడము; ౪౬. గుల్మము; ౪౭. గోమీనము; ౪౮. గ్రామమద్గురిక, మద్గురము, మద్గువు. (తె.)—బొమ్మడాయి; ౪౯. ఘర్ఘటము; ౫౦. చంద్రచంచల; ౫౧. చిత్రఫలకము, చిత్రఫలము, చిత్రఫలి, ఫలకి; ౫౨. చిరిచిమము-చిరీచిమము-చిలిచిమము-చిలీచీమము. (తె)—తేలుమీను; ౫౩. చులుంపి; ౫౪. చులుకి; ౫౫. చిత్రవదాలము, చిత్రవల్లికము, పాఠీనము, సహస్రదంష్ట్రము. (తె).—కొఱ-కొఱ్ఱ, కొఱ్ఱమీను, పాటీనము, బేడిస; ౫౬. చీరము; ౫౭. చాగలకము; ౫౮. డాత్యూకటము; ౫౯. చూ, తిమి; ౬౦ త్రికంటకము; ౬౧. నీరుకోడికి.-(చూ, పుంజు); ౬౨. నీటిగుఱ్ఱమునకు-(చూ, హయము); ౬౩. శాలము: ౬౪. సిధ్మల. (తె.)—ఉప్పుఁజేఁప; ౬౫. మఱికొన్ని చేఁపలరకములు-(తెలుఁగు పదములతో వ్యవహరింపఁబడునవి)— అంబుపక్కెర; అల్లెదము-అల్లెదమ్మ; ఆకుజెల్ల; ఇంగిలాయి; ఇసుకదొందు; ఈసపిట; ఉబుజు; ఉరుజ; ఉల్లాకుఁజేఁప; ఉల్లికుచ్చడము; ఎరచిల్లపురుగు; ఒల్లెంక; కడినెల; కదిర; కనుగుఁజేఁప; కల్లరుజు; కౌగిస; కుంటముక్కు; కూరముక్కు; కొరదు; కొరద; గెజ్జె; గొల్లదొందు; గ్రుడ్డింగిలాయి, చందమామపక్కె; చందువాచేఁప; చాఱ, చాఱమీను; చిత్తర; చీరచింపు; చుక్కకొర; చుక్కపిల్ల; జెల్ల; టేఁకి; తిమిరమీను; తిరిర; తిఱికి; తూర-తూల; పండుఁజేఁప; తెల్లనార; తొల్లిక; దాసరికొయ్య; దొందు; నాగపెంజెర; నీరుపాపర; పక్కె; పయిఁజాఱుతట్ట; పల్లికతట్ట; పరిగియ-పరిగె, పత్తెమీను; పాలచేఁప; పాలచొఱ; పుత్తడికాసు; పులస; పులుచు; పుల్లరుజు; పులిమెకము; పూఁజేఁప; పూమేను; పూలమట్ట; పైఁజాఱుమట్ట; పొట్టపెంజెర: పొనుఁగుఁజేఁప; పొరకచేఁప; పొలస; పోసపెక్కె; బుడ్డపక్కె; బొంకప్ప; బొందపక్కె; బొచ్చె; మంగలపక్కె; మట్టగిడుసు; మడవచేఁప; మలుఁగు; మాచెనపక్కె; మాతగొరక; మిసి; మిసికల్లు; ముకుదొమ్మి; ముచ్చంగి; ముత్తెచేఁప; ములువాలుగ; మెత్తడి; మేనమొత్తె; మోరపక్కె; రాతిగొరక; రామ; లత్తిచేఁప; వంజిరము-వజ్జరము, వంజు, వందొందు; వడగవ్వ; వాలుగ,

వాలుగచెంకి, వాలుగపాము, వాలుపు; వింజరి ; వెలిమొట్ట; సోరంగి. ౬౬. మీనదింధము:—ఉలూపి. అం. 2. మత్స్య దేశము: చూ, దేశములు; 3: చూ, మత్స్యావతారము ; 4: చూ, ఆసనములు.

మత్స్యాక్షి, సం. వి. ఈ. స్త్రీ. 1. పొన్నగంటికూర : చూ, శీతసారము; 2: సోమిదకూర.

మత్స్యావతారము, అం: చూ, అవతారములు.

మథనము, సం. వి. అ. న. ఉన్మంథము, దధిమథనము, దధిమథము, మంథనము. (తె)— చిలుకుట, చిలుకుడు, తరి, తరుచుట-త్రచ్చుట, త్రచ్చన.

మథించు, సం. స. క్రి: (తె)-గిలకరించు, చిలుకు, తరుచు-తర్చు-త్రచ్చు, పుడుకు.

మథితము, సం. వి. అ. న. 1. నీళ్ళుకలియని మజ్జిగ; విణ. 2. త్రచ్చఁబడినది; 3. ఒరయఁబడినది.

మదంతి, అం: చూ, శ్రుతులు.

మదకలము, సం. వి. అ. పుం. 1 : చూ, మదపుటేనుఁగు; విణ. 2. మత్తుచేత వ్యక్తముకాని మాటలుకలది.

మదట, వై. విణ. 1. = మదః చూ, మత్తుఁడు. 1; 2. మత్తురాలు, దిమ్మరి-దిమ్మరి: చూ, స్త్రీ.

మదటతనము, వై. వి. = మత్తత్వ: మత్తత.

మదటయేనుఁగు, ద్వ. వి. గంభీరవేది: చూ, మదపుటేనుఁగు.

మదనకంటకము, సం. వి. అ. పుం: ఉదర్కము. (తె.)— ఉమ్మెత్తముల్లు.

మదనకామేశ్వరిలేహ్యము, అం: చూ, లేహ్యములు.

మదనగంధులు, దే. వి. బ: చూ, ధాన్యము.

మదనచేతులు, దే.వి. బ: 1 తనాబి, దంతియదంతె, దూలము. (సం.)-తండకము తుల, స్థూలము (చూ, స్తంభము.తద్వి. 2: అడ్డవాసపు. 3: అడ్డదూలము. 4: ఓడంగి.

మదనదర్పణము, అం: చూ, వృత్తము. 1. ("భ,స,జ,ర,జ, గురువులు. 11 యతి. 16వ ఛందస్సు.)

మదనము, సం. వి. అ. పుం. 1. ఆమని: చూ, సంబరము. 3; 2. ఉమ్మెత్త*: చూ, హాలాపుష్పము; 3. మంగ*: చూ, శ్వసనము. 3; 4.=మయినము: చూ, సిక్థకము; 5. ఒకపక్షి: చూ, కంజలము; 6: చూ, మర్లమాతంగి*; అం. 7: చూ, జన్యతాళములు.

మదనవిలసితము, అం: చూ, వృత్తము. 1. ("న, న, గ. యతిలేదు. 17వ ఛందస్సు")

మదనవృత్తము, అం: చూ, వృత్తము. 1. (ఇది వసంత తిలకవలెనే నడచును. 9 యతి.)

మదని, సం. వి. ఈ. స్త్రీ. జవాదిపిల్లి: చూ, సంకువు.

మదనుఁడు, సం. వి. అ. పుం: చూ, మన్మథుఁడు.

మదపుటేనుఁగు, ద్వ. వి: చూ, మదటయేనుఁగు.

మదమడఁచు, మి. స. క్రి. (మదము+అడఁచు) చంపు. జై. 5, ఆ. 58: చూ, సంహరించు.

మదము, సం. వి. అ. పుం. 1. = మత్తు. క్రొవ్వు: చూ, హేమిక; 2. ఏనుఁగుక్రొవ్వు: చూ, హేమిక; 3. సాఁడు: చూ, రేతస్సు. 1; 4. ఏనుఁగురేతస్సు: చూ, రేతస్సు. 1. (చూ, హస్తి); 5. కస్తూరి: చూ, మదాహ్వము; 6: చూ, హంకారము; 7: చూ, సంతోషము; అం. 8: చూ, సంచారిభావములు. ("అమ్మహావరాలును గనిపరులు మధురమధుపాన వ్యామత్తచిత్త రాలుచుఁ దేలుచు సోలుచు వివిధగతులఁ జెలఁగుచుండెఁ గడిరి"); 9: చూ. హేయసాధనములు; 10: చూ, గజమదములు; 11: చూ, అరిషడ్వర్గములు.

మదములు, అం. 1. (ఏనుఁగునకు మదము ఎనిమిదిచోట్లఁ బుట్టును.)—౧. చెక్కిళ్లకు.—దానము, ౨. కన్నులకు.—సీధువు, ౩. చెవులకు.—సౌగంధము, ౪. తొండముచివరకు-శీకరము, ౫. చనుమొనలకు.-దీక్షము, ౬. మేహమునకు-మదము, ౭. హృదయమునకు —ఘర్మము, ౮. చరణములకు.— మేఘము పుట్టును: చూ, హస్తి; 2. తద్వి.— ౧. ఉత్కటము. (త్రిమదములు) — ౧. విద్యామదము, ౨. ధనమదము, ౩. కులమదము; 3 (అష్టమదములు).- ౧. అన్నమదము, ౨. అర్థమదము, ౩. స్త్రీమదము, ౪. విద్యామదము, ౫. కులమదము, ౬. రూపమదము, ౭. ఉద్యోగమదము, ౮. యౌవనమదము. (లేక) ౧. ధాన్య సంగ్రహ, ౨. ధన, ౩. మాన్యక్షేత్ర, ౪. విద్య, ౫. సత్పుల ప్రసూత, ౬. సౌందర్య, ౭. ఉత్తమ గ్రామనివాస, ౮. యౌవనమదములు.

మదయిత్నువు, సం. వి. ఉ. పుం: చూ, మేఘము. 1.

మదరేఖ, అం: చూ, వృత్తము. 1. ("మగణ సగణ గురువులతోఁగూడినది. 7వ ఛందస్సు.)

మదల, వా. వి. అలుసు: చూ, సోమరి.

మందలతనము, వా వి. చూ, విలంబము. 1.

మదస్ఖలితము, అం: చూ, కరణములు.

మదస్థానము, సం. వి. అ. న. కల్లుత్రాగెడి యిల్లు: చూ సదనము. 1.

మదహత్తి, వై.వి. మదహస్తి. మదపుటేనుఁగు: చూ, హస్తి;

మదాంబరము, సం.వి.అ.పుం. ఇంద్రుని ఏనుఁగు: చూ, హస్తి.

మదావళము, సం. వి. అ. పుం. ఏనుఁగు: చూ, హస్తి.

మదాహ్వము, సం. వి. అ. పుం: చూ, మృగమదము.

మది, వై. వి. 1. గుండె: చూ, హృదయము. 2; 2 = మతి. బుద్ధి. ఉ, హరి. 5, ఆ. 191: చూ, హృల్లేఖము. 2.

మదించు, సం. అ. క్రి. 1. క్రొవ్వు: చూ, మబ్బుకొను; వై. అ క్రి. (1) తలఁచు. రా, వి. 3, ఆ. 52: చూ, సంకల్పించు. స. క్రి. (2) మదింపువేయు: చూ, తోఁచు. 4.

మదింపు, వై. వి: అంచన-అంచనా, దవులు-దౌలు.

మదింపుకాఁడు, వా. వి: అంచనదారుఁడు.

మదికొలంకు పులుఁగు, ద్వ.వి: చూ, హంస. సాంబ. తిర్య. 7.

మదికొలను నెక్కొ నుపిట్ట, —వై.—

మదిమది, వై. వి. నెమ్మది. ఉ. హరి. 5, ఆ. 43: చూ, శాంతము. 1.
మదిర, సం.వి.ఆ. స్త్రీ. 1. కల్లు: చూ, సుర. 2; 2. కుబేరుని కూఁతురు, కటమాలిని: చూ, సూన. 1; అం 3: చూ, సంచారిభావమునఁ బుట్టిన దృష్టులు.
మదిరాక్షి, సం. వి. ఈ. స్త్రీ. 1. మదముకప్పిన కన్నులుగల ఆఁడుది: చూ, స్త్రీ; 2 ఆఁడుది: చూ, స్త్రీ.
మదిరాగృహము, సం. వి ఆ. న: చూ, మదస్థానము.
మదీయము, సం. విశ (తె.)—నాది.
మదుగు, దే. వి. మదుము-మదువు. భాగ. 10, స్కం. పూ. 758: చూ, పిదపిద. 2.
మదుపు, దే. వి. 1. ఆకుపచ్చ: చూ, వర్ణము. 6; వా. 2. మదుపుపెట్టిన సొమ్ములోనగునది.
మదుము, దే. వి: చూ, రూ-మదుగు.
మదురు, దే.వి.1: చూ, మగులు; ఆ. క్రి. 2: చూ, మూఁగు 3.
మదురుకమ్మ, వా. వి. గతికమ్మ-గతిగమ్మ: చూ, వృంతము. 1. (మట్ట).
మదురుగోడ, ద్వ. వి: చూ, మగులుగోడ.
మదురుపు, వై. వి. 1. మత్తు; చూ, హోమిక; 2 =మధు. కల్లు: చూ, సుర. 2.
మదువు, దే. వి: చూ, రూ-మదుగు.
మదోత్కటము, సం. వి. ఆ. పుం. 1: చూ, మదపుటేనుఁగు; 2. కపోతము: చూ, సురటీ.
మద్గురము, సం.వి.అ.పుం. బొమ్మడాయి: చూ, మత్స్యము.1.
మద్గువు, సం. వి. ఉ. పుం. 1. నీరుకాకి: చూ, వాయసము. 1; 2: చూ, మద్గురము.
మద్దత్తు, వా. వి: చూ, సహాయము.
మద్దల, వై.వి.=మర్దల. మృదంగము. రూ-మద్దెల: చూ, వీణె.
మద్ది, దే. వి: చూ, సాలము*. (దీనిభేదములు—ఇనుమద్ది, ఏఱుమద్ది.)
మద్దికాయలు, దే.వి.బ. చెవితమ్మెఅనునగ: చూ, భూషణము.2.
మద్దెల, వై. వి =మర్దళ: చూ, రూ-మద్దల.
మద్దెలరూపురిక్క, వై. వి.=మర్దళరూపర్క్షధనిష్ఠ: చూ, రిక్క.
మద్దెలసంచు, అం: చూ, దండలు.
మద్దెలసంచుదండ, అం. —పై.—
మద్దెళన, అం. —పై.—
మద్యము, సం. వి. అ: న. కల్లు; చూ, సుర. 2.
మద్రంకరుఁడు, సం. విశ; చూ, శుభంకరుఁడు.
మద్రకము, పా: చూ, వృత్తము. 1. ("భ, ర, న, ర, స, స, న గురువులు. 11 యతి. 22వ ఛందస్సు").
మద్రము, అం: చూ, దేశములు.
మధుక, సం. వి. ఆ. స్త్రీ. తిప్పతీఁగ*: చూ, సోమవల్లి.
మధుకంఠము, సం. వి. అ. పుం. కోయిల: చూ, సాఁకుడు పులుఁగు.
మధుకము, సం. వి. అ. న. 1: చూ, యష్టిమధుకము*; 2. రూ-మధూకము. ఇప్ప*: చూ, వానప్రస్థము 2; 3. నెమలి: చూ, శిఖి. 2.
మధుకరము, సం. వి. అ. న. 1. భిక్షాన్నము: చూ, సాదము. (1); పుం. 2. తుమ్మెద: చూ, షట్పదము; 3. జీవకము, సర్జకము*: చూ, రాజార్హము.
మధుకరి, అం: చూ, సుషిరవాద్యములు.
మధుకుఁడు, సం వి. అ. పుం: చూ, మగధుఁడు.
మధుకేశటము, సం. వి. అ. పుం. తుమ్మెద: చూ, షట్పదము.
మధుక్రమము, సం. వి అ. పుం: చూ, మధువారము.
మధుఖర్జూరిక, సం. వి. ఆ. స్త్రీ. 1. ఉబ్బలి: చూ, హిం. తాలము. 1-౧, ౨, ౩, ౪.
మధుతృణము, సం. వి. అ న. చెఱకు*: చూ, రసాలము. 3
మధుదీపుఁడు, సం. వి. అ. పుం చూ, మన్మథుఁడు:
మధుద్రము, సం. వి. అ. పుం: చూ, మధుకేశటము.
మధుద్రుమము, సం. వి.అ.పుం. ఇప్ప*: చూ, మధుకము. 2
మధుపటలము, సం. వి. అ. న. కరండము, క్షౌద్రపటలము, (తె)—తుట్టియ-తుట్టె, తెట్టియ-తెట్టె, తేనెతుట్ట-తేనెతెర, పెర-పెఱ. తద్వి —మధుపర్కము. ("చూ, సారఘము")
మధుపము, సం. వి. అ. పుం. 1. తుమ్మెద, తేనెతిండి: చూ, షట్పదము; విశ. 2. మద్యపానముచేయునది.
మధుపర్కము, సం. వి. అ. న. 1. పెరుఁగుతోకలిసిన తేనె: చూ, సారఘము; 2. పెండ్లిలో వధూవరుల కిచ్చెడు నూతన వస్త్రము: చూ, వస్త్రము.
మధుపర్ణి, సం. వి. ఈ స్త్రీ. 1: రూ-మధుకర్ణిక. 2: చూ, మధుక*; 3. నీలి*: చూ, రంజని.
మధుపర్ణిక, సం.వి.ఆ.స్త్రీ. రూ మధుపర్ణి*: చూ, సర్వతోభద్ర.
మధుపుష్పము, సం. వి. అ. పుం: చూ, మధుద్రుమము*.
మధుప్రియుఁడు, సం. వి. అ. పుం: చూ, బలరాముఁడు.
మధుమక్షిక, సం. వి. ఆ. స్త్రీ. తేనెటీఁగ: చూ, మక్షిక.
మధుమక్షికాన్యాయము, న్యా. ఈఁగలుచేర్చిన తేనె మనుష్యుల యాధీనమగునను రీతి.
మధుమతి, పా: చూ, వృత్తము. 1. ("నగణ భగణ గురువులు 7వ ఛందస్సు").
మధుమేహము, సం. వి. అ పు. మూత్రరోగము: చూ, మూత్రకృచ్ఛ్రము.
మధుయష్టిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, మధుకము. 1.
మధుర, సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకపట్టణము. కాశీ. 3, ఆ. 47: చూ, దేశములు; దేశములు: 2: చూ, సదాప*; 3. అడవిసదాప*: చూ, సదాప: అం. 4: చూ, వృత్తము. 1. (ప్రభాతవృత్తచ్ఛాయను మొదటిచరణమును, అపరాజిత వృత్తచ్ఛాయను రెండవ చరణమును, మాలినీవృత్తచ్ఛాయను మూఁడవ చరణమును, నాలవ చరణము కలికల్పితమును); అం. 5: చూ, క్షేత్రములు; 6: చూ, పుణ్య నగరములు; వా. 7. గ్రామనామము యింటిపేరుగా గలవారు.
మధురకవి యాళ్వారు, అం: చూ, ఆళ్వారులు
మధురగతి, పా: చూ, వృత్తము. 1. (నవవిధ రగడలలో నొకటి. పదునాలుమాత్రలు 9 వమాత్రయతి.) (చూ,రగడ.)

మధురమీనాక్షి, అం: చూ, అక్షులు
మధురము, సం. వి. అ. న. 1: చూ, విషము; 2. తుమ్మెద: చూ, షట్పదము; పుం. 3. తియ్యన: చూ, మాధుర్యము.1; విణ 4. తియ్యనిది: (తె.)—తియ్య-తీయ, తీపి తీపు. తద్వి.—ఒ మిక్కిలి తియ్యనిది.— అమృతము; 5. ఇంపైనది: చూ, హృద్యము.

మధురస, సం. వి ఆ. స్త్రీ. 1. చాంగ*: చూ, స్రవ; 2. ద్రాక్ష*: చూ, స్వాదుఫల; 3 పిన్నపాల*: చూ. సుమంగళ.
మధురాక్కర, అం: చూ, వృత్తము 1. ("ఒక సూర్యగణమును, మూఁడింద్ర గణంబులును, ఒక చంద్ర గణమును గలది. నాలవ గణాద్యక్షరంబయతి.")
మధురామ్లఫలము, సం. వి. అ. పుం: చూ, దానింబ*.
మధురిక, సం. వి. ఆ. స్త్రీ, 1. అడవి సదాప*: చూ, సదాప; 2: చూ, సదాప*; అం. 3: చూ, కకుజవిభాషలు.
మధురిపుఁడు, సం. వి. ఉ. పుం: చూ, విష్ణువు. 1.
మధురిను, సం. వి. న్. పుం. తియ్యన: చూ, మాధుర్యము.1.
మధురిమము, సం, వి. అ. పుం.—పై.— (రూ-మధురిను.)
మధులిహము, సం. వి, హ్. పుం. చూ, మధుపము. 1.
మధువారము, సం.వి.అ.పుం.మద్యపానక్రమము,మధుక్రమము.
మధువాసిని, సం. వి. ఇ. స్త్రీ. ఏఁబుజాతి *: చూ, సుభిక్ష.
మధువు, సం. వి. ఉ. స్త్రీ. 1. పాలకూర *: చూ, సుమంగళ; న. 2. నీరు: చూ, సలిలము; 3. పాలు: చూ, స్తన్యము; పుం, న. 4.=మదురువు. కల్లు: చూ, సుర. 2. తద్వి.-ఇప్పకల్లునకు—మధ్వాసవము, మాధవకము-మాధ్వకము, మార్ద్వీకము; 5. తేనె (ఇది త్రివిధము.— మాక్షికము; భ్రామరము, సారఘము, పౌత్తికమనికొందఱు) మిగత విశేషములకు:— చూ, సారఘము; 6. పూఁదేనె: చూ, సారఘము; పుం; 7. చైత్రము. చైత్రికము:చూ,మాసము. 1; 8. వసంతఋతువు: చూ, మాసద్వయము; 9. ఇప్ప.*: చూ, మధుకము. 2; 10. గోరఁట *: చూ, సహ 2; 11: పుప్పొడి: చూ, సుమనోరజము. (ఈయర్థమునకు మధుకము— మాధుకము - మధూళి - మాధూళి - మధూళిక — మాధూళిక రూపాంతరములని కొందఱు. ఇది చింత్యము.); అం. 12: చూ, మాసములు.
మధువులు, అం. మాక్షికము, భ్రామరము, సారఘము. (3)
మధువ్రతము, సం. వి. అ. పుం: చూ, మధులిహము.
మధుశిగ్రువు, సం. వి. ఉ. పుం: తేనెప్రధానమై యుండెడు ఎఱ్ఱపువ్వుల మునగ *: చూ, శిగ్రువు. 1.
మధుశ్రవ, సం. వి. ఆ. స్త్రీ. తెల్లగురిజ *: చూ, శ్వేతపాకి.
మధుశ్రేణి, సం. వి. ఈ: స్త్రీ రూ-ధనుశ్రేణి- 1. చాంగ *: చూ, స్రవ. 2; 2. పిన్నయిప్ప *: చూ, వానప్రస్థము. 2.
మధుష్ఠీల, సం. వి. ఆ. స్త్రీ. ఇప్ప *: చూ, వానప్రస్థము.2.
మధుష్ఠీవము, సం. వి. అ. పుం.—పై.—
మధుసారథి, సం. వి. ఇ. పుం: చూ, మన్మథుఁడు.
మధుసూదనము, సం. వి. అ. పుం: చూ, మధువ్రతము.
మధుసూదనాయనమః, అం. (మధుసూదనః=మధుంసూదయతి=నాశయతి అసురస్వభావ సంహారకర్తా.): చూ, ఓమ్.
మధుసూదనుఁడు, సం. వి. అ. పుం: చూ, విష్ణువు. 1.
మధుస్రవ, సం. వి. ఆ, స్త్రీ చూ, మధువు. 1. *
మధూకము, సం. వి. అ. పుం. 1: చూ, రూ - మధుకము. 2. *: 2. నీరిప్ప *: చూ, మధూలకము.
మధూచ్ఛిష్టము, సం. వి. అ. న. చూ, మయినము.
మధూలకము, సం. వి. అ. పుం: మధూకము. (తె.)— నీరిప్ప *: (కొందఱిప్ప అనికొందఱు): చూ, సుమంగళ.
మధూలిక, సం. వి. ఆ. స్త్రీ. 1. పుప్పొడి: చూ, సుమనోరజము; 2. చాంగ*: చూ, స్రవ. 2.
మధూళి, సం. వి. ఇ. స్త్రీ. 1. కల్లు: చూ, సుర. 2; 2. పూఁదేనె: చూ, మధువు. 6.
మధూళిక, సం.వి.ఆ.స్త్రీ. పిన్నయిప్ప*: చూ, వానప్రస్థము.2.
మధ్య, అం 1: చూ, ఛందస్సులు; 2. స్వీయాంతర్భూత విశిష్ట నాయికావిశేషము. (ఉదయించిన యౌవనము గలది. పదుమూఁడేండ్లు మొదలు. పదునెనిమిదేండ్ల పర్యంతము వయసు గలది.) (ఇది పతి యన్యసతీసక్తుఁడైనను గోపింపక తన పాతివ్రత్యభావము తప్పక యుండును): చూ, స్వీయ. (చూ, మధ్యా ప్రగల్భలు).
మధ్యదేశము, అం. కురుక్షేత్ర ప్రయాగ హిమాద్రి వింధ్యములకు నడిమిదేశము: చూ, సీమ. (1) (దేశములు).
మధ్యమ, సం. వి. ఆ. స్త్రీ. 1. దుద్దు: చూ, మిద్దె. 2; 2. వాగ్భేదము: చూ, శబ్దము. 2; 3: చూ, నడిమివ్రేలు; 4. క్రొత్తగ సమర్తాడినది (ఆఁడుది) దుష్టరజ: చూ, రజస్వల.
మధ్యమకాలము, అం మూఁడవ రాగము: చూ, స్వరము. 2. (చూ. గానశాస్త్ర పండితుఁడు, చూ, సప్తస్వరములు).
మధ్యమక్షేత్రములు, అం. కపోలములు, అధరము, పృష్ఠము, కటి, ఊరులు. (5)
మధ్యమగ్రామ గతమూర్ఛనలు, అం. సౌవీరి, హారిణాశ్వము, కలోపనతము,శుద్ధమధ్యము,మారి,పౌరవి, హృష్యకము.(7)
మధ్యమగ్రామము, అం. 1: చూ, గ్రామములు; 2: చూ, కకుజభాషలు; 3: చూ, టక్కజభాషలు.
మధ్యమణిన్యాయము, న్యా. భూషణమధ్య స్థాపితమగు మణి యిరు వంకలకును గాంతినిచ్చునట్లు రెండు వైపులకును పదము లన్వయించునపుడు దీని నుపయోగింతురు. దేహళీదత్త దీప న్యాయమువంటిది.
మధ్యమ పాత్రలు, అం: పురోహిత బ్రాహ్మణాదులు: చూ, సూచ్యము.
మధ్యమము, సం. వి. అ. పుం, న. 1. నడుము, కవును: చూ, వీఁగు. 1; పుం. 2: చూ, మధ్యదేశము; 3: చూ, మధ్యమ. 3; విణ. 4. నడిమిది, అంతస్థము; అం. 5: చూ, మధ్యమకాలము; 6. (మ): చూ, మ. 11; 7: చూ, హస్తక్షేత్రములు; 8: చూ, ఉత్తమ క్షేత్రములు; 9. నడుము: చూ, లక్షణాంగములు (పురుషునకు—సింహసమమైనఁ బ్రశస్తము); 10. నడుము: చూ, శుద్ధజాతులు. (అంశములు) 11: చూ, కకుజభాషలు.

మధ్యమముమత్స్య మోహము, అం: చూ, మోహచతుష్టయము.
మధ్యమస్థాయి, అం: చూ, ఉచ్చతమము. (కంఠమునందుం డెడు రెండవ శ్రుతిసప్తకము.)
మధ్యమాది, అం; చూ, రాగాంగములు.
మధ్యము, సం. వి. అ. న. 1. అవకాశము: చూ, సందు. 6; పుం, న. 2: చూ, మధ్యమము. 1; 3: చూ, మండలము. 1; పుం. 4. మానమున అరత్నిప్రమాణము హీనమైన యేనుఁగు: చూ, హస్తి; విణ. 5. నడిలరమది; 6. నడిమిది: చూ, మండలము. 1; అం; 7: చూ, లయలు: 8; చూ, పురుషములు; 9: చూ, గురుమతమున వ్యూహాంగములు. (తకారాది అనుబంధమున చూడుము); 10; చూ, శుక్రమతమున వ్యూహాంగములు; 11: చూ, స్థాయి. (చూ, మధ్యమస్థాయి); 12: చూ, లయప్రాణములు; (చూ, స్వరము. 2) (విలంబిత, ద్రుత, మధ్యంబులనెడి లయ విశేషములు వరుసగా తత్వ, ఓఘ, ఘనములనఁబడును. (విలంబిత ద్రుతములయొక్క కూడికచేత రెంటినడుమనుండునది మధ్యము.)
మధ్యముఁడు, అం: చూ, ద్వాదశరాజమండలము.
మధ్యమోదీచ్యవ, అం. (జాతులు): చూ, అంశములు.
మధ్యరాత్రము, సం. వి. అ. న: చూ, నడికిరేయి.
మధ్యలోకము, అం. భూలోకము: చూ, లోకము. 1.
మధ్యవిత్తు, అం: చూ, హిందోళజభాషలు.
మధ్యవృత్తము, అం: చూ, ఊర్ధ్వవృత్తము.
మధ్యస్థుఁడు, సం. విణ. ఇరుకక్షులకు న్యాయము చెప్పువాఁడు: తగవుగోరి. (జడ్జి.)
మధ్యా, అం: చూ, ధారలు.
మధ్యాక్కర, అం: చూ, వృత్తము. 1. (రెండు ఇంద్రగణములు, ఒకసూర్యగణము. తిరిగి రెండింద్రగణములు ఒక సూర్యగణము. నాలవ గణద్యక్షరముయతి.)
మధ్యాప్రగల్భలు, అం. మధ్యాప్రగల్భలు ధీర, అధీర, ధీరాధీరలను మూఁడు తెఱఁగులైరి. (ధీర —ఇతరస్త్రీనిఁబొంది వచ్చిన పతినిఁజూచి దండించునది. అధీర.— అన్యాసక్తుఁడైనను పతినేమియనక పరాఙ్ముఖయౌనది. ధీరాధీర.— పతిని అన్నివిధములచేత దండించునది. ధీర-అధీర-ధీరాధీరలు జ్యేష్ఠకనిష్ఠ భేదంబుచే నిరుదెఱంగులైరి. (చూ, స్వీయ, ముగ్ధ, మధ్య, ప్రగల్భ, పరకీయ, సామాన్య.)
మధ్యాహ్నము, సం. వి. అ. పుం. 1. (తె.)— పట్టపగలు, మిడసరలగ్గము. అంబటిప్రొద్దు, (మి).— మట్టమధ్యాహ్నము: చూ, వాసరము; తద్వి.—మిడసరలగ్గము; అం. 2: చూ, కాలములు. 1; 3: చూ, కాలపంచకము.
మధ్వాసవము. సం. వి. అ. పుం. ఇప్పపువ్వు కల్లు: చూ, మధువు. 5.
మన, దే. స. మనము అనుదానికి ప్రాతిపదికము.
మనఃప్రభవుఁడు, సం. వి. అ. పుం. తలఁపుచూలి: చూ, మన్మథుఁడు.
మనఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః, న్యా, మనుష్యుని బంధమోక్షములకు మనస్సేకారణము.
మనన, వా. వి. ఆయుస్సు: చూ, వయస్సు. 1.
మననము, సం. వి. అ- న. 1. చింతన, గమనము: చూ, సంత. 4; అం. 2: చూ, యోగాంగములు.
మనమఁడు, దే. వి. 1. కొడుకుకొడుకు: రూ-మనుమఁడు— మన్మఁడు, పట్టిపట్టి. (సం).— నప్త: చూ, సూనుఁడు. 1 2. కూఁతుకొడుకు: రూ-మనుమఁడు-మన్మఁడు, పట్టిపట్టి; (సం) — దౌహిత్రుఁడు, నప్త: చూ, సూనుఁడు. 1.
మనమరాలు, దే. వి. 1. కొడుకుకూఁతురు: రూ-మనుమరాలు. పట్టిపట్టి. (సం).— నప్త, నప్త్రి: చూ, సూన. 1; 2: కూఁతుకూతురు: రూ-మనుమరాలు పట్టిపట్టి. (సం).— దౌహిత్రి, నప్త, నప్త్రి: చూ, సూన. 1.
మనము, సం. వి. న్. న. రూ-మనస్సు. 1. గుండె: చూ, హృదయము. 2; 2. బుద్ధి: చూ, హృల్లేఖము. 2; బ. దే. వి. (1) నీవును నేనును; వా. (2). వితంతువునకిచ్చెడు భరణము; చూ, మనవృత్తి.
మనవృత్తి, వా. సం; వి ఇ. స్త్రీ: భరణము, మనోవృత్తి, మనువృత్తి, మనోవర్తి. (తె,)— మనము.
మనవి, దే. వి: చూ, విన్నపము. రాఘ. 1, ఆ. 34,
మనశ్శిల, సం. వి. ఆ. స్త్రీ,=మణిసిల: చూ, రాయి.
మనశ్శుద్ధి, అం: చూ, శుద్ధులు.
మనసరి, మి, విణ. (మనసు+అరి) 1. శూరుఁడు: చూ, హంవీరుఁడు. 2; 2. బుద్ధిమంతుఁడు: చూ, సహృదయుఁడు.
మనసిజుఁడు, సం. వి. అ. పుం: చూ, మనఃప్రభవుఁడు.
మనసు, సం. వి. స్. న. (రూ-మనస్సు-మనము) 1: చూ, మనము. 1; 2: చూ, మనము. 2; విణ 3. ఇష్టము: చూ, వల్లభము. 2; అం. 4: చూ, మానసికపూజాకుసుమములు; 5: చూ, ఇంద్రియములు; 6: చూ, ద్రవ్యములు; 7: చూ, అంతఃకరణములు; 8: చూ, కరణములు; వై. వి. (1): చూ, మనసు. 1.
మనసుంచు, మి. అ. క్రి: చూ, మనసస్కరించు.
మనసు రగులుట, అం: చూ, మన్మథావస్థలు.
మనసు విఱుగుట, జా. ఇష్టముపోవుట. "అంతనామాట మనసు విఱిగి" (నీతిచంద్రిక—విగ్రహము).
మనస్కరించు, సం. అ. క్రి; అవధరించు, చిత్తగించు, మనసుంచు.
మనస్కారము, సం. వి. అ. పుం. మనఃప్రయత్నము, మనఃపూర్తి (అనికొందఱు): చిత్తాభోగము.
మనస్వి, సం. విణ మంచిమనస్సుగలవాఁడు: చూ, సహృదయుఁడు.
మనస్సంగమము, అం. (మనస్సంగము) 1: చూ, ద్వాదశావస్థలు; 2: చూ, దశావస్థలు.
మనస్సంగము, అం.— వై.—
మనస్సు, సం. వి. స్. న. చూ, రూ-మనసు. 1.—2.
మనాయించు, వా. స. క్రి: చూ, విను. 2.
మని, వై. వి. = మణి: చూ, మడికట్టు.
మనికట్టు, ద్వ. వి.— వై.— ఉ. హరి. 6, ఆ. 108.
మనికి, దే. వి. రూ-మన్కి. 1: చూ, స్థానము. 1. వసు. 2,

అ. 4; 2. జీవనము. మార్క. 7, అ. 169. చూ, వర్తనము 2; 3. వాసస్థానము: చూ, విడుపట్టు; 4 జీవించుట: చూ, మనికి. 2. 5. వసించుట: చూ, మనికి. 3; 6. వాసగృహము: చూ, సదనము. 1.

మనికితపడు, ద్వ. అ. క్రి: చూ, శోకించు. విక్ర. 6, అ. 142.

మనికితపాటు, ద్వ వి. మనోవ్యథ: చూ, శోకము.

మనికిపట్టు, దే. వి. 1. వాసగృహము చూ, సదనము. 1; 2. చోటు: చూ, స్థానము. 1.

మనికివేఁడు, దే. వి. గృహస్థుఁడు: చూ, యజమానుఁడు (ఇంటికాఁపు.)

మనితము, సం. విణ. తెలియఁబడినది: చూ, వ్యక్తము 2.

మనియకాఁడు, దే. వి. పారుపత్తెకాఁడు: చూ, స్వామి. 3.

మనియార్డరు, వా. వి. విలాసదారునకు తపాలులో పంపెడు పైకము.

మనిసి, వై. వి.=మనుజ. (రూ-మానిసి-మాని) చూ, మనుష్యుఁడు.

మనీష, సం. వి. ఆ స్త్రీ. బుద్ధి: చూ, హృల్లేఖము. 2.

మనీషి, సం. వి. న్. పుం. 1: చూ, విద్వాంసుఁడు; విణ. 2; చూ, బుద్ధిమంతుఁడు.

మను, వై. వి. రూ-మన్ను.=మృత్స్న. 1. నేల. స్వా. 2, అ. 11. చూ, భూమి. 1; 2. మట్టి: చూ, భూమి. 1; దే. 3: చూ, ముక్కొ-మ్ము మెకము; 4. ముఖ్యవాచకమైనమన్ను శబ్దమునకు వృత్తియందు ద్విత్వము లోపించిన రూపము. "మనుఁబోతు." మొ; అ. క్రి. 5. జీవించు. మార్క. 7, అ. 169: చూ, బ్రదుకు. 3; 6. మెలఁగు: చూ, వర్తించు.

మనుఁగు, దే. అ. క్రి. చచ్చు: చూ, సమయు.

మనుకువ, దే. వి. 1. వాసస్థానము. య. 1, అ. 51: చూ, సదనము, 1; 2. ఇక్క: చూ, స్థానము. 1; 3. చెలిమి: చూ, స్నేహము. 1.

మనుగడ, దే. వి. 1. జీవనము: చూ, మనికి. 2; 2. జీవనోపాయము: చూ, స్థితి. 5.

మనుగుడుపు, దే. వి. (మనువు+కుడుపు) అల్లియము: చూ, విందు. 2.

మనుచు, దే. స. క్రి. 1: చూ, పోషించు; ప్రే. 2. మనఁజేయు: చూ, మంచు. 2.

మనుజసత్వ, అం: చూ, ద్వాదశసత్వలు.

మనుజాసనుఁడు, సం. వి. అ. పుం: చూ, మానిసిదిండి.

మనుజుఁడు, సం. వి. అ. పుం.=మనిసి: చూ, మనుష్యుఁడు.

మనుజేంద్రుఁడు, సం. వి. అ. పుం. చూ, మానిసిజేఁడు.

మనుదిండి, ద్వ. వి: చూ, మాలుధానము.

మనుపరి, దే. విణ. (మనుపు+అరి): చూ, రక్షకుఁడు.

మనుపాల, దే. వి: చూ, పాలకూర *.

మనుపీనుఁగు, దే. వి. జీవచ్ఛవము: చూ, శవము.

మనుపు, దే. వి. 1. చూ, రక్షణము; ప్రే. 2. చూ, రూ—మంచు. 2.

మనుపెంపి, ద్వ. వి. అఁడుబుఱ్ఱపృగము: చూ, ముక్కొమ్ము మెకము.

మనుబిడ్డ, ద్వ. వి. బిడ్డమన్ను: చూ, ముక్కొ-మ్ము మెకము.

మనుఁబోతు, ద్వ: చూ, మనుబిడ్డ.

మనుమఁడు, దే. వి: చూ, రూ-మనమఁడు. అని. 5, అ 45.

మనుమరాలు, దే.వి. (మనుమ+ఆలు): చూ, రూ-మనమరాలు.

మనురాట్టు, సం. వి. జ్. పు. మదేంద్రుఁడు: చూ, క్రిముఁడు.

మనువృత్తి, వా. సం. వి. ఇ. స్త్రీ: చూ, మనస్మృతి.

మనువు, సం. వి. ఉ. పుం. 1: చూ, మంత్రము. 1; 2. చూ, విష్ణువు. 1; బ. 3. కాలాగ్రజుఁడు: చూ, మనువులు=వైవస్వతాది; దే.వి. (1): చూ, మనికి. 2; (2). జీవనము. మార్క. 5, అ. 199: చూ, వర్తనము. 2; (3). మనికి వరించుట; (4) నవవడి. భాగ. 2, స్కం. 74: చూ, సమయము 2; అ. క్రి. (5). రూ-మనుఁగు: చూ, మరణించు; స. క్రి. (6): చూ, పోషించు సాంబ్రా. 123. మనువులు అం: చూ, స్వాయంభువుఁడు, స్వారోచిషుఁడు, ఉత్తముఁడు, తామసుఁడు, రైవతుఁడు, చాక్షుషుఁడు, వైవస్వతుఁడు, సూర్యసావర్ణి (సూర్యసావర్ణిక), దక్షసావర్ణి (దక్షసావర్ణిక), బ్రహ్మసావర్ణి (బ్రహ్మసావర్ణిక), ధర్మసావర్ణి (ధర్మసావర్ణిక), రుద్రసావర్ణి (రుద్రసావర్ణిక), రౌచ్యుఁడు, భౌచ్యుఁడు. (14).

మనుష్యధర్ముఁడు, సం. వి. న్. పుం: చూ, మనురాట్టు

మనుష్యనాయకుఁడు, అం: చూ, నాయకత్రయము.

మనుష్యయజ్ఞము, సం. వి. అ. పుం. అతిథిపూజ: చూ, మహాయజ్ఞములు (యజ్ఞములు).

మనుష్యవర్ణములు, అం. బ్రాహ్మణ (బ్రహ్మ), క్షత్రియ, వైశ్య, శూద్రులు. (4)

మనుష్యసర్గము, అం: చూ, సృష్టిసర్గములు.

మనుష్యుఁడు, సం. వి. అ. పుం.=మనిసి: 1, ఊ, ఏభతుఁడు, కర్మార్హుఁడు, కర్మి, కుండీరుఁడు, జనపదుఁడు, జానపదుఁడు, జాబాలుఁడు, ధవుఁడు, నరుఁడు, నాడుఁడు, పంచజనుఁడు, పుమాంసుఁడు, పురుషుఁడు, పూరుషుఁడు, భూమిస్పృశుఁడు, మంతువు, మనుజుఁడు, మర్త్యుఁడు, మానవుఁడు, మానుషుఁడు, మానుష్యుఁడు, విశుఁడు. (తె.)—మగఁడు, మగవాఁడు, మనిసి-మానిసి-మాని, మిండగాఁడు, మిండగీఁడు, మిండఁడు. తద్వి.—౧: (తె.)-అడవి మానిసి. ౨: (సం.) అతికాయుఁడు, మహాకాయుఁడు; ౩: (తె) —పులుమానిసి; ౪.పుట్టినవానికి-(చూ, సంభూతుఁడు); ౫ నీళ్లమోయువాఁడు: అంబువాహి. ౬. మంచమును మించిన పొడవు గలవాఁడు: అతికట్వుఁడు. (మిగిలిన వానికి "చూ, సంభూతుఁడు").

మనెదారి, దే. వి. ప్రభువు, ఎకిమీఁడు: చూ, స్వామి. 2.

మదోగుప్త, సం. వి. ఆ. స్త్రీ. చూ, మనశ్శిల.

మనోజన్మ, సం. వి. న్. పుం: చూ, మనోజుఁడు.

మనోజవసుఁడు, సం. విణ. రూ-మనోజవుఁడు, తండ్రినిఁ బోలినవాఁడు (కొడుకు): చూ, సూనుఁడు. 1.

మనోజవుఁడు, సం. విణ. —పై.—

మనోజుఁడు, సం.వి.అ.పుం. తలఁపుచూలి: చూ, మన్మథుఁడు.
మనోజ్ఞ, పా: చూ, వృత్తము. 1. ("న-జ-జ-భ-రగణములు. 10 యతి. 15వ ఛందస్సు")
మనోజ్ఞత, సం. వి. అ. న: మంజిమ-మంజిమము.
మనోజ్ఞమగు, మి. అ. క్రి: మనోరమమగు. (తె.)—ఇంచు.
మనోజ్ఞము, సం. విణ: చూ, హృద్యము.
మనోజ్ఞుఁడు, సం. విణ: చూ, సౌందర్యవంతుఁడు.
మనోదండము, అం: చూ, త్రిదండము. 1—2.
మనోభవుఁడు, సం. వి. అ. పుం: చూ, మనోజుఁడు.
మనోమయ కోశము, అం: చూ, కోశములు.
మనోరథము, సం. వి. అ. పుం. కోరిక: చూ, వాంఛ.
మనోరథానామతటాః ప్రవాహాః, న్యా. మనోరథ ప్రవాహములకుఁ గట్టులులేవు.
మనోరథానాంగతిర్నవిద్యతే, న్యా. మనోరథములకు దూఱరాని చోటులేదు.
మనోరమ, సం. వి. ఆ. స్త్రీ. 1. బౌద్ధదేవి: చూ, భార్య; అం. 2: చూ, వృత్తము. 1. ("న-ర-జ గురువులు. 7 యతి. 10వ ఛందస్సు").
మనోరమమగు, మి. అ. క్రి: చూ, ఇంచు. 3.
మనోరమము, సం. విణ: చూ, హృద్యము.
మనోవర్తి, వా. సం. వి. ఇ. స్త్రీ: చూ, మనవృత్తి.
మనోవృత్తి, —పై.—
మనోహతుఁడు, సం. విణ మనసు చెడినవాఁడు: చూ, హతుఁడు. 3.
మనోహరము, సం. వి. అ. న. 1. బంగారు; చూ. లోహము. 1; 2: చూ, భక్ష్యము; విణ. 3: చూ, హృద్యము.
మనోహరవృత్తము, అం. చూ, వృత్తము. 1. ("ఇది కలితాంత వృత్తచ్ఛాయను బేసిపాదములున్ను తోటక వృత్తచ్ఛాయను సరిపాదములున్ను నడచును").
మనోహరుఁడు, సం. విణ: చూ, మనోజ్ఞుఁడు.
మనోహిజన్మాంతర సంగతిజ్ఞమ్, న్యా. మనస్సు జన్మాంతర సంబంధమును దెలిసికొనును. ఇట్టిదే "వ్యక్తిజన్మాంతర ప్రీతిం మనస్సి న్నహ్యాదకారణం" అనునదియు,
మనోహ్వా, సం. వి. ఆ, స్త్రీ: చూ, మణిసిల.
మన్కి, దే. వి: చూ, రూ-మనికి.
మన్దిండి, ద్వ. వి: చూ, రూ-మనుదిండి.
మన్న, దే. వి. 1: చూ, సంరోధము. 1; వై. వి.2 =మన్యా. పడతలయందుండు నరము: మన్ని. (సం).— మన్యా: చూ, సిర. 1.
మన్నఁడు, దే. వి: చూ, మనెదారి.
మన్నన, వై. వి.=మానన, 1. బహుమానము, గౌరవము (అనికొందఱు): చూ, సన్మానము; వా.2.అపరాధక్షమము: చూ, మన్నింపు. 2.
మన్నా, వా. వి. అటకాయింపు. "దేవిడీమన్నా.": చూ, సంరోధము. 1.

మన్ని. వై. వి. 1.=మన్యా: చూ, మన్న. 2; దే. వి. 2: చూ, మనికి. 2.
మన్నించు, వై, స. క్రి. 1: చూ, సమ్మానించు; 2.ఆదరించు: చూ, సంభావించు; వా, 3. అపరాధమును క్షమించు: చూ, సహించు,
మన్నింపు, వై. వి. 1. మన్నించుట: చూ, మన్నన. 1; 2; చూ, మన్నన. 2.
మన్నిక, వై. వి. = మానన: చూ, మన్నన. 1,
మన్నిగొను, దే. స. క్రి. చంపు. ఉ, హరి. 5, ఆ. 288. చూ, సంహరించు.
మన్నియ, వై. వి.=మాననీయ: చూ, మనెదారి. అచ్చ. అర, కాం. 73.
మన్నియఁడు. —పై.—(రూ-మన్నెఁడు)
మన్నియము, వై. వి.=మాన్య. (రూ - మన్నెము-మండెము-మన్యము) 1; చూ, మాన్యము. 1; వా. 2 కొండలనడుమనున్న భూమి. రోగభూయిష్ఠమగునేల (అనికొందఱు)— "గడుమన్నియములో కాఁపురంబు.": రూ - మన్నెము. (సం).—మన్యము.
మన్నీఁడు, వై. వి =మాననీయ. (ద్వ. అనికొందఱు): చూ, రూ-మన్నియ. అచ్చ. కిష్కిం, కాం. 56.
మన్ను, వై. వి. 1.=మృత్స్న. నేల: చూ, రూ-మను. 1; 2.=మృత్. మట్టి: చూ, రూ-మను. 2; దే. వి. 3; చూ, ముక్కొమ్ముమెకము. ప్వా. 4, ఆ. 20; 4. యుద్ధసాధనము. ఉ, హరి. 3, ఆ. 35: చూ, హేతి. 4
మన్నుకానుపు, ద్వ. వి: సీతాదేవి. అచ్చ. యు, కాం. 109: చూ, సీత. 1.
మన్నుమిన్ను, వా. వి: చూ, రోదసి. 3.
మన్నుమిన్నుఁగానకుండుట, జా. క్రిందుమీఁదుఱు తెలియకుండుట. "మీరు మన్నుమిన్నుఁ గానకున్నారు." (ధర్మజరాజసూయము)
మన్నుతేఁడు, ద్వ. వి: చూ, మన్నియ.
మన్నె, వై. వి.=మాన్య, (దేశ్యమని శ. ర) —పై.—
మన్నెఁడు, వై. వి = : చూ, మన్నుతేఁడు.
మన్నెకాఁడు, ద్వ. వి = —పై.— అచ్చ. సుం, కాం. 11.
మన్నెడి, వై.వి.1 = —పై.—; 2. అరణ్యదేశమునకు దొర.
మన్నెము, వై. వి. 1=మాన్య: చూ, మాన్యము. 1; 2: చూ, రూ-మన్నియము. 2.
మన్నెముల్లు, ద్వ వి. మేఁకల కాలిగిట్టలలోని ముల్లుతీసెడు పెద్దసూది: చూ, సూది.
మన్నెవాఁడు, ద్వ. వి,=మాన్య: మన్నియ.
మన్నెఱికము, ద్వ. వి. మండలేశ్వరత్వము.
మన్నెలు, దే. వి. బ. నతివిశేషము; చూ, హణిగలు.
మన్మఁడు, దే. వి: చూ, రూ-మనమఁడు.
మన్మథ, అం: చూ, సంవత్సరములు.
మన్మథబాణములు, అం: ౧. అరవిందము. (ఉన్మాదనము)

(ఐక్షవధనువు) (చెఱకువిల్లు) (స్త్రీ స్తనములయందుఁ బ్రయోగము); ౨. అశోకము. (రోదనము) (ప్రయోగస్థలము అధరము); ౩. చూతము. (సమ్మోహనము) (ప్రయోగస్థలము శిరస్సు); ౪. మల్లిక, నవమల్లిక. (శోషణము) (ప్రయోగస్థలము నేత్రములు); ౫. నీలోత్పలము (మారణము) (ప్రయోగస్థలము గుహ్యము). (5): చూ, బాణము. 1—౬౩.

**మన్మథబాణాలు,** అం: చూ, ధాన్యము.

**మన్మథము,** సం. వి. అ· పుం. 1: కామచింత*; 2: చూ, వెలఁగ*.

**మన్మథావస్థలు,** అం. కనులఁజూచుట, మనసు రగులుట, సంకల్పించుట, నిద్ర పట్టకుండుట, చిక్కిపోవుట, అన్నింట విసుగుపుట్టుట, సిగ్గు విడుచుట, చిత్తభ్రమనొందుట, మూర్ఛనొందుట, యత్నించుట. (10)

**మన్మథుఁడు,** సం. వి. పుం. (బుద్ధినిఁ గలియఁబెట్టువాఁడు): అంగజుఁడు, అంగభవుఁడు, అంగభువు, అంగహీనుఁడు, అజుఁడు, అతనుఁడు, అనంగుఁడు, అనన్యజుఁడు, అన్యక్తుఁడు, అసమశరుఁడు. అసమేషువు, ఆత్మభువు, ఆత్మయోని. ఆశయేశయుఁడు, ఇ, ఇక్షుధన్వుఁడు, ఇక్షుశరాసనుఁడు, ఇక్షుసాయకుఁడు, ఇష్మఁడు, ఈశ్వరుఁడు, ఋశ్యకేతువు, కంజనుఁడు, కంతుఁడు, కందర్పుఁడు, కమనుఁడు, కాలాకేలి—కలాకేళి, కామజుఁడు, కామదేవుఁడు, కాముఁడు, కాయజుఁడు, కార్ష్ణి, కింకిరాటుఁడు, కింకిరాతుఁడు, కింకిరుఁడు, కుసుమాయుధుఁడు, కుసుమేషువు, క్రోధుఁడు, గృత్సుఁడు, గృధువు, చేతోభవుఁడు, చోరుఁడు, జరాభీరువు, ఝషకేతుఁడు, ఝషధ్వజుఁడు, పంచశరుఁడు, పంచేషుఁడు, పుష్పకేతువు, పుష్పధన్వుఁడు, పుష్పశరుఁడు, ప్రద్యుమ్నుఁడు, ప్రసూనేషువు, బహురూపుఁడు, బ్రహ్మసువు, భావజుఁడు, మకరకేతనుఁడు, మకరధ్వజుఁడు, మకరాంకుఁడు, మదనుఁడు, మధుదీపుఁడు, మధుసారథి, మనసిజుఁడు, మనోజన్ముఁడు, మారుఁడు, మీనకేతనుఁడు, ముర్మురుఁడు, రణరణకుఁడు, రతిపతి, రతిరమణుఁడు, రమణుఁడు, రవీషురుఁడు, రాగరజ్జువు, రాజమిత్రుఁడు, రూపాస్త్రుఁడు, వ, వాముఁడు, విధాత-విధాతృఁడు, విశ్వకేతువు, విషఘ్న, వీరధన్వంతుఁడు, శంబరారి-సంబరారి, శమాంతకుఁడు, శూర్పకారాతి, శృంగారయోని, శ్రీపుత్రుఁడు, సంకల్పజన్ముఁడు, సంకల్పజుఁడు, సంకల్పభవుఁడు, సంకల్పయోని, సంసారగురువు, సురభిసాయకుఁడు, స్మరుఁడు, స్వయంభువు, స్వాదుధన్వుఁడు. (తె. వ.)—అంచయేనుఁగు మావంతు, అలరు విలుకాఁడు-అలరు విల్కాఁడు, అలరు విలుతుఁడు—అలరు విల్తుఁడు, ఇంచు విలుకాఁడు-ఇంచు విల్కాఁడు, ఇంచు విలుతుఁడు—ఇంచువిల్తుఁడు, ఇగురువిలుతుఁడు-ఇగురువిల్తుఁడు, ఎల్లపుడు ద్రిమ్మరు తేరుదొర, కందుఁడు, కన్నుల విలుకాఁడు-కన్నుల విల్కాఁడు, కన్నుల విలుతుఁడు- కన్నుల విల్తుఁడు, కమ్మ విలుకాఁడు—కమ్మవిల్కాఁడు, కమ్మవిలుతుఁడు—కమ్మ విల్తుఁడు, కలుకుల గరితపడ్డ, కోయిల తెగడజే, క్రౌంచి గురుల విల్కాఁడు, గాడ్పుటరదపు దొర, గాలితేరెక్కు మన్నీఁడు, గారవంక తెగడజే, చక్కనయ్య. చక్కెర విలుకాఁడు, చిగురాకువిలుకాఁడు——చిగురువిలుకాఁడు, చిలుకరవుతు-చిలుకరౌతు, చెఱకు విలుకాఁడు, చౌవంచయాఁ పులజోదు, జమిలి ముకాకులి విలుకాఁడు, జాబిల్లి యల్లుఁడు, దెంపమ్ము మూలి, తలఁపు మూలి, తలిరు విలుతుఁడు, తామర తూపరి, తావివిలుకాఁడు, తియ్యవిలుకాఁడు, తీఁగవిలుకాఁడు, తుంట విలుతుఁడు, దూఁడ విల్తుఁడు, తెలి విల్తుఁడు, తేఁటి తెగడజే, తేఁటి యల్లెవాఁడు, తేఁటి యల్లెవింటిదొర, నన విలుకాఁడు, ననవిలుతుఁడు, నెయ్యఁపుజేడు, నెలయల్లుఁడు, పంచదార తిండి, తేజిరౌతు, పచవాసుపు జోదు-పచవార్వపు జోదు, పచ్చ విలుతుఁడు, పుష్పిలుకాఁడు, పూల విలుతుఁడు, పూవింటి, పూవింటివాఁడు, పూవిలుకాఁడు, పూవిలుతుఁడు, బేసికైదువజోదు, మయిసున్నవజీరు, మరుఁడు, మీను మొసలి సిడెంబులమేటి, రాచిల్క నెక్కురౌతు, లేమావిలాయపు తేజిరౌతు, వలపురాయఁడు, వలదొర, వలరాజు, వలతేఁడు, వాలుగదాలు, విరివిలుకాఁడు—విరివి విలుకాఁడు, వెడవింటి, సత్తిరావగఱు, సిరిచూలి-సిరపిల్లి, సొగసరి. (మిగతవానికి "చూ, స్వాదుధన్వుఁడు").

**మన్మనము,** సం. వి. అ. పుం. ఆలుమగలు సురతకాలమునందు దేశభాషతోఁ జెవిలో మెల్లఁగా చెప్పుకొనుమాట: చూ, శబ్దము. 2.

**మన్య,** సం. వి. ఆ స్త్రీ.= మన్ని: చూ, సిర. 1.

**మన్యము,** వా. సం. వి. అ. న. = మన్నియము—మన్నెము. చూ, మన్నియము. 1; 2: చూ, మన్నియము. 2.

**మన్యువు,** సం. వి. ఉ. పుం. 1. క్రోధము: చూ, రోషము; 2: చూ, శోకము; 3. దైన్యము: చూ, వాంఛ ము; 4: చూ, యజ్ఞము.

**మన్వంతరము,** సం. వి. అ. న. 1. డెబ్బదియొక్క దివ్యయుగములు: చూ, పురాణము. 6; అం. 2. మనుకాలమధ్యచరిత్రము: చూ, పంచలక్షణము.

**మపుష్టకము,** సం. వి. అ. పుం: చూ, మకుష్ఠకము.

**మప్పితము,** దే. వి. మట్టు: చూ, మితము. 1.

**మప్పు,** దే. స. క్రి: చూ, రూ-మరవు.

**మబ్బు,** దే.వి.1: చూ, మేఘము. 1; 2. మద్యపాన మదము: చూ, హాలిక; 3. చీఁకటి. రామా. 6, ఆ. 23: చూ, శ్యామిక. 1; 4. అజ్ఞానము: చూ, స్వాపము. 3.

**మబ్బుకొను,** దే. అ. క్రి: కావరించు, క్రొవ్వు, క్రొవ్వుగొను, దిమ్మకొను, దిమ్మవట్టు, పొతరించు, పొసరించు, మంపిలు-మంపిల్లు, మంపుగొను, మత్తిల్లు, మత్తుకొను; (సం.)—మదించు-మదియించు. (మిగతవానికి "చూ, హుంకరించు").

**మబ్బుతోవ,** దే. వి. ఆకాశము: చూ, సురవర్త్మము.

**మబ్బువగ,** దే. వి: చూ, వాయువు. ఆం. పదా. సుర. 35.

**మబ్బుపువ్వులవెల్లి,** ద్వ. వి: చూ, సముద్రము.

మబ్బుపూనిసువు, ద్వ. వి. అగ్ని. అం, భా. ప్ర. 47; చూ, వహ్ని. 1.
మబ్బుమేపరి, దే.వి: చూ, మబ్బుపగ. అచ్చ. సుం, కాం.121.
మబ్బురపుతు, ద్వ. వి. మేఘవాహనుఁడు, ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు.
మబ్బురావుంటనము, వా. వి. మత్తువస్తువులఁ కలిపిచేసినమందు: మబ్బురావుంటు.
మబ్బురావుంటు, —పై.—అం, భా, ద్వి. 303.
మబ్బురూపరి, ద్వ. వి. ఐరావతము; చూ, హస్తి.
మబ్బువిప్పు, దే. వి; చూ, మబ్బుపగ.
మభ్యపెట్టు, మి. స. క్రి. 1; మోసపుచ్చు: 2. కమ్మీపెట్టు.
మమకారము, వా. సం. వి. అ. న. 1. ప్రేమము, దయ (అనికొందఱు); చూ, స్నేహము. 1: అం. 2; చూ, హేయగుణములు.
మమత, సం. వి. ఆ. స్త్రీ. మమత్వము; చూ,మమకారము.1.
మమ్మ, దే. అవ్య. (రూ - మమ్మరె - మమ్మరే - మమ్మా - మమ్మారె - మమ్మారే.); చూ, సేబాసు.
మమ్మరె, —పై.—
మమ్మరే, —పై.—
మమ్మా, —పై.— రామా. 5, ఆ. 225.
మమ్మాయము, వా. వి. మహమ్మాయమనులేహ్యము.
మమ్మారె, దే. అవ్య; చూ, రూ-మమ్మ. శశాం. 5, ఆ. 29.
మమ్మారే, —పై.—
మమ్మ, దే. వి. 1. సముద్రముమీఁది ఓడలకు విఘాతముగా వీచెడు సుడిగాలి; చూ, వాయువు: 2. (రూ-మము-మమ్ము లను) అస్మదర్థక ద్వితీయా బహువచనము.
మయటము, సం. వి. అ. న. గడ్డిమేడ, గడ్డియిల్లు (అనికొందఱు); చూ, సదనము. 1.
మయము, సం. వి. అ. పుం. 1. ఒంటె; చూ, లొట్టిపిట్ట: 2. కంచరగాడిద; చూ, రాసభము. వా. వి. (1.) కపును: (2.) మధ్యభాగము, నట్టనడుము.
మయకష్టము, సం. వి. అ. పుం. బ, చూ, మకుష్టకము.
మయష్టకము, చూ, మయుష్టకము.
మయి, దే. వి. రూ-మై. 1; చూ, శరీరము: 2. చూ,విధము. 1: 3. తడవ; చూ, సారె. 7: 4; చూ, పార్శ్వము. 2: 5; వెన్నడి: చూ, వెంబడి. 2; అప. 6. కొన్నియెడల తృతీయావిభక్తియందుండువచ్చెడు ప్రత్యయము: రూ-మై.
మయికము, దే. వి. రూ-మైకము. మత్తు: చూ, మంపు.
మయికొను, దే. అ.క్రి.(రూ-మెయికొను-మేకొను-మైకొను): చూ, సమ్మతించు.
మయికోలు, దే. వి. రూ-మైకోలు. ఇచ్చగింత: చూ, సమ్మతి1.
మయిజాలు, దే. వి. కొంతయెడయెడముగా అడ్డకమ్ములు వాటించిన అఁడుదానిచీరకొంగు: చూ, రూ-మైజాలు.
మయితాలుపు, దే. వి. (రూ- మైతాలుపు- మెయితాలుపు - మేతాలుపు-మేనుతాలుపు) ప్రాణి: చూ, శరీరి.

మయిద, వై వి. రూ-మైద. 1.=మాంద్య: చూ,మయికము; దే. వి. 2. రూ-మైద. గోరఁట *: చూ, సహ. 2.
మయిదానము, వా. వి. రూ-మైదానము. బహిఃప్రదేశము: చూ, వెలుపల. 1.
మయిదు, వై. వి. = మాంద్య. రూ-మైదు. 1. మంపు: చూ, హామిక; 2. మాయ: చూ, వంచన; 3. చొక్కు-పొడి: చూ, రూ-మైదు. 3.
మయినపువత్తి, వై. వి. మధూచ్ఛిష్టవర్తి. రూ-మైనపువత్తి: చూ, వర్తి. 1.
మయినము, వై.వి =మదన. రూ-మైనము: చూ, నాసిక్థకము.
మయిమయి, దే. వి. 1: రూ-మైమై-మెయిమెయి-మేమెయి-మైమయి. (సం.)— అనాయాసము; క్రి. విశ. 2. అనాయాసముగా: రూ-మైమై - మెయిమెయి - మేమెయి— మైమయి.
మయిమఱపు, దే. వి. రూ-మైమఱపు; చూ, విస్మృతి.
మయిముఱువు, దే. వి రూ-మైముఱువు: చూ, వాంవాణము.
మయిల, వై. వి. రూ-మైల. 1. నలుపు: చూ, వర్ణము. 6; 2 చీఁకటి: చూ, మబ్బు. 3; 3. = మలిన. (రూ-మకిల-మైల. మాలిన్యము: చూ, మలినము. 1. 4 అశుచిత్వము: ఆశౌచము, అసుము: రూ-మైల. 5. మైలకోక: చూ, వస్త్రము; విశ. 6: చూ, మలినము. 1; 7. అశుచి: చూ, రూ-మైల. 4.
మయిలకోక, ద్వ. వి. రూ-మైలకోక: చూ, మయిల. 5.
మయిలపడు, వా. అ. క్రి. రూ-మైలపడు: చూ,మలినమగు.
మయిలారు, దే. వి. ఒకక్షుద్రదేవత: రూ-మైలారు.
మయిలారువాఁడు, దే. వి. కోమట్లనడిగికొని జీవించువాఁడు: రూ-మైలారువాఁడు.
మయిలు, వా. వి. అరక్రోసుదూరము: రూ-మైలు.
మయిలుతుత్తము, పై.వి.=మయూరతుత్థము రూ-మైలుతుత్తము (పెరుఁగుతోనూఱి పుటమువేసినశుద్ధి. : చూ,రసాంజనము.
మయివడి, దే. వి. రూ-మైవడి. 1: చూ, సమ్మతి. 1; 2: చూ, స్నేహము. 1; 3. చూ,విధము.1; 4: చూ,సౌమ్యత.
మయిసున్నవజీరు, వా. వి: చూ, మన్మథుఁడు.
మయుఁడు, సం. వి. అ. పుం. అసురశిల్పి; చూ,స్వర్ణకారుఁడు.
మయువు, సం. వి. ఉ. పుం. 1. కిన్నరుఁడు. (చూ, దేవతాభేదము.); 2. మయువను మృగము.
మయూఖము, సం. వి. అ. పుం. 1. కిరణము: చూ, హాయనము. 2; 2: కాంతి: చూ, వెలుతురు. 1; 3. జ్వాల: చూ, వహ్ని. 1.
మయూరకము, సం. వి. అ. న. 1. మయిలుతుత్తము: చూ, రసాంజనము; పుం. 2. ఉత్తరేను *: చూ, శైఖరికము.
మయూరతుత్థము, సం. వి. అ. న.=మయిలుతుత్తము: చూ, మయూరకము.
మయూరము, సం. వి. అ. పుం. 1, నెమలి: చూ, శిఖి. 2;2. నెమలిజుట్టు: చూ, శిక. 1: 3. ఓమము: చూ, యవాని; 4. చూ, మయూరకము. 2. *; 5. గురుంటకము,

తిలమయూరము ; అం. 6; చూ, ఆసనములు; 7: చూ, అసంయుత హస్తములు.
మయూరలలితము, అం: చూ, కరణములు.
మయూరవిదళ. సం. వి. ఆ. (స్త్రీ: చూ, నల్లతెగడ *.
మయూరశిఖి, సం. వి. ఈ. స్త్రీ: చూ, దీపము. 4*
మయూరసారి, పా: చూ, వృత్తము. 1. ("ర-జ-ర గురువులు. 7 యతి 10 వ ఛందస్సు.")
మయూరాసనము, అం: చూ, ఆసనములు.
మయూరాస్యము, అం; చూ, అసంయుతహస్తములు.
మయ్యంకి, దే. వి: చూ, తాళము. 5.
మర, దే. వి. రూ-మఱ. 1. కీలు: చూ, మర్మము. 1; 2. తిరుగుడునొక్కు: చూ, హిండనము; 3. తిరుగుడుచీలః చూ, హిండనము.
మరందము, సం. వి. అ. పుం: చూ, రూ-మకరందము. 1.
మరక, దే. విః చూ, రూ-మఱక.
మరకతము, అం. (రూ - మరతకము - మరకతము): చూ, రత్నము. 1.
మరకత్తి, దే. వి. కీలుకత్తి: చూ, రిష్టి. 2.
మరకత్తిపీఁట, వా. వి. మరకత్తిని ఆడించు అనికిపీఁట (మామిడికాయలు తఱుగుటకు సులువుగనుండును.)
మరకము, వా. వి. ఎనిమిదిపళ్ళు, తూము.
మరకాఁడు, దే. వి. 1. నావికుఁడు స్వా. 5, ఆ. 47: చూ, సరంగు; 2 మరకఱులస్థుఁడు.
మరగాలు, దే. వి. కృత్రిమపాదము: చూ, హజ్జ.
మరగు, దే. అ. క్రి. 1. పరిచితమగు. మార్క. 3, ఆ. 419: చూ, స్నేహించు; 2. ఆశపడు: చూ, వాఛించు; స. క్రి 3. ఆశించు, ఇచ్ఛించు; చూ, వాంఛించు.
మరగొమ్ము, దే. వి. గుఱ్ఱముమీఁది పల్లమునకు ముందు వెనుకల నానికకై యెత్తుగా నేర్పఱచియుండు భాగము. కళా. 3, ఆ. 81.
మరచుట్టు, దే. వి. చూ, తిరుగడ.
మరణము, సం. వి. అ. న. 1. చావు: చూ, పావు; అం. 2: చూ, ఊర్ములు; 3: చూ, అవస్థలు; 4: చూ, ద్వాదశావస్థలు.
మరణించు, సం. అ. క్రి. చచ్చు: చూ, సమయు.
మరణోద్యమము, అం. 1: చూ, ద్వాదశావస్థలు; 2: చూ, దశావస్థలు.
మరతకము, సం. వి అ నః చూ, రూ-మరకతము.
మరపు, వా. వి. 1: చూ, రూ-మఱపు; దే. ప్రే. 2. మరఁగఁ జేయు. భాగ. 6, స్కం. 89.
మరమేకు, దే. వి. రూ-మరామేకు. తిరుగుడు చీల: చూ, మర. 3.
మరమ్మతు, వా. వి. భూమి లోనగువానిని బాగుచేయుట: చూ, మష్కాఖత్తు. 1.
మరల, దే అవ్య: రూ-మఱల: చూ, వెండియు. అం,ఖా,తృ. 69.
మరలఁబడు, ద్వ. అ. క్రి. నివర్తిలు: చూ, వట్రిలు,
మరలఁదాటు, ద్వ. వి. రూ—మరలుఁదాటు—మరులుఁదాటు, మారుట, తిరుగుడల. (సం.)—అప్రవృత్తి, అర్ధము, అవరతి, ఆవర్తనము-ఆవర్తము, అవృత్తి, ఉపసంహారము, నివర్తనము, నివృత్తి, (అవ్య.)— అపి; తద్వి.—గా. పునర యొక్క అవృత్తులు—(సం.) పున; ...పునర్యొక్క ఆవృత్తికి. (సం.)—ఆట. (ఇట్లు క్రియాపదములందు ఉపసర్గ కొనుము) (చూ, వెండియు).
మరలించు, దే. స. క్రి, ప్రే. మరలుచు-మరల్చు, మరలు, క్రమ్మఱుచు (సం.)—ఉపసంహరించు.
మరలు, దే. అ. క్రి. రూ-మరలు. 1: చూ. మరలఁబడు; 2. వెనుకకుఁదిరుగు. రాఘ 3, ఆ. 84.
మరలుచు, దే. ప్రే. రూ-మరల్చు: చూ, మరలించు.
మరల్చు, దే. ప్రే. —పై.— భో. 2, ఆ. 253.
మరలుఁదాటు, ద్వ. విః చూ, రూ-మరలఁదాటు.
మరవలి, దే. వి. మరుఁగుమూపు: చూ, పిందు. 2.
మరసాన, ద్వ. వి. రాళ్ల పదనుపెట్టు సాధనము.
మరాటము, దే. వి. లాంగలి అను చెట్టు: చూ, లాంగలి. 1.
మరాటి, వై. వి. = మహారాష్ట్రి: రూ-మరాటీ, మరాటివాఁడు-మరాటీవాఁడు: చూ, మహారాష్ట్రుఁడు.
మరాటిమొగ్గ, వై. వి. ఒకానొక అంగడి వస్తువు.
మరాటివాఁడు, వై. విః చూ, మరాటి.
మరాటీ, వై. వి.=: చూ, రూ-మరాటి.
మరాటీవాఁడు, వై. వి. చూ, రూ-మరాటివాఁడు.
మరామేకు, వా. విః చూ, రూ-మరమేకు. "నిలుచుండిన మరామేకు, కూర్చుండిన మరామేకు" (ఉత్తరసర్కారులలో వాడుక).
మరి, దే వి.వి. రూ-మఱి. 1. తడవ, వాడుక: చూ, వెండియు; అవ్య. 2. ఇంకను: మఱి. 2; 3. అనంతరము: చూ, వెనుక. 1.
మరించు, సం. అ. క్రి: చూ, రూ-మరణించు.
మరిగొమ్ము, దే. వి. కలుఁజు: చూ, వాహనము. 2.
మరిచము, సం. వి. అ. న. మరీచము=మిరియము: చూ, వెల్లజము.
మరిడి మహాలక్ష్మి, మి. వి. ఈ. స్త్రీ: చూ, మహాలక్ష్మి. 3.
మరిడివ్యాధి, మి. వి. కలరా; చూ, విషూచిక.
మరిడెమ్మ, వా. విః చూ, మహాలక్ష్మి. 3. "మరిడెమ్మతీర్థము".
మరియాద. వై. వి. 1. న్యాయము: చూ, సత్యము. 1; 2. = మర్యాదా. కట్టుపాటు: చూ, మర్యాద; 3: చూ, విధము. 1.
మరీచము, సం. వి. అ. న. =; చూ, రూ-మరిచము.
మరీచి, సం. వి. ఇ పుం, స్త్రీ. 1. కిరణము: చూ, హాయనము. 2; పుం. 2. మరీచి అను ఋషి: చూ, సన్న్యాసి; అం. 3: చూ, ఋషి శ్రేష్ఠులు (గోత్రము 13); 4: చూ, బ్రహ్మలు.
మరీచిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, మృగతృష్ణ.
మరీచికాద్వయము, అం: మిరియములు తెల్లమిరియములు (2).
మరు, దే. వి. వృత్తియందు మారుశబ్దమున కాదేశరూపము. "క్షేమరు",

మరుండ, సం. వి. ఆ. స్త్రీ: ఉచ్చ లలాటిక.
మరుఁడు, వై. వి.=స్మర: చూ, మన్మథుఁడు.
మరుతేజి, ద్వ. వి. చిలుక: చూ, శుకము.
మరుతేరు, ద్వ. వి: చూ, వాయువు. సాంబ. దే. 13,
మరుత్తు, సం. వి. త్. స్త్రీ. 1. పిక్క*: చూ, స్పృక్క: చూ. రాజార్హము; పుం. 2. (రూ—మరుతము—మారుతము—మరుత్వంతము): చూ, మరుతేరు; 3: చూ, వేలుపు; అం. 4: చూ, మహారాజులు.
మరుత్మంతుఁడు, అం: చూ, మహారాజులు.
మరుత్వంతుఁడు, సం. వి. త్. పుం: చూ, మబ్బురవుతు.
మరుద్రథము, సం. వి. అ. న. గుఱ్ఱము: చూ, హయము.
మరుద్వాహము, సం. వి. అ. న: చూ, పొగ. (హ,)
మరుధరిత్రి, సం. వి. ఈ. స్త్రీ. ఎడ్డడి నేల: చూ, భూమి. 1.
మరునయ్యతేజి, ద్వ. వి. గరుడుఁడు: హరివాహనుఁడు.
మరునల్లె, ద్వ. వి: చూ: భ్రమరము.
మరునాఁడు, వా. వి: చూ, రూ-మరునాఁడు.
మరునిడాలు, ద్వ. వి. 1, చేఁప: చూ, మత్స్యము. 1; 2. మొసలి: చూ, మత్స్యము. 1.
మరునిల్లు, ద్వ. వి. (మరుని + ఇల్లు): చూ, భగము. 12.
మరునిసూఁడు, ద్వ. వి: చూ, శివుఁడు. 1. అం. పదా. సు 10
మరున్మాల, సం. వి. ఆ. స్త్రీ: చూ, మరుత్తు. 1*.
మరుపత్రి, సం. వి. ఈ. స్త్రీ. ఇంగువు*: చూ, హింగువు.
మరుపని, ద్వ వి. సురతము: చూ, సంయోగము.
మరుపు, దే. వి. రూ-మఱుపు: చూ, విస్మృతి.
మరుభువ, సం. వి. ఆ. స్త్రీ: చూ, దేశములు. ౫౧.
మరుమరీచికన్యాయము, న్యా. ఎడారిలో నెండమావులు నీళ్ళవలెఁ గాన్పించి యెంతదూరము పోయిన నట్లే యుండునను రీతి
మరుమామ, వై. వి. చంద్రుఁడు: చూ, హిమాంశువు.
మరులు, దే. వి. 1. పిశాచము: చూ, సోఁకుడు. 1; 2. మోహము: చూ, వలపు; 3. తీరని ప్రేమ. అం, భా. ప్ర 136: స్నేహము. 1.
మరులుఁదీఁగ, ద్వ. వి: చూ, మరులుజడ*.
మరులుఁబాటు, దే. వి: చూ, రూ-మరలఁబాటు.
మరులుకొను, దే. అ. క్రి. 1. కామించు: చూ, వలచు. 2; ప్రే. 2. మరులుకొలుపు.
మరులుజడ, ద్వ. వి: చూ, మర్లమాతంగి*.
మరులుమాతంగి, దే. వి. —వై.—
మరులుమ్మెత, —వై.—
మరులుతేఁడు, దే. వి. పిశాచ పల్లభుఁడు: చూ, సోఁకుడు. 1,
మరువకము, సం. వి. అ. పుం. 1.= మరువము*. చూ, వాసనమొలక; 2. మంగ*: చూ, శ్వసనము.
మరువము, వై. వి =మరువకము*. రామా. 1. అ. 48: చూ, మరువకము. 1.
మరువు, సం. వి. ఆ. పుం. 1: చూ, మరుధరిత్రి; 2. కొండ: చూ, హిమాలయము (పర్వతము).
మరుహేతువు, సం. వి. ఉ. పుం: చూ, మధువాసిని*.
మరోలి, సం. వి. ఇ. పుం. మొసలి: చూ, మత్స్యము. ౧—౩.

మర్కటకము, సం. వి. అ పుం. 1. కోఁతి: చూ, వానరము; 2: చూ, సాలెపురుగు.
మర్కటకిశోరన్యాయము, న్యా. కోఁతిపిల్ల తల్లియెంత యెగురగ్రత్తగానున్నను తల్లికడుపును బట్టుకొని విడువదనురీతి. (స్వప్రయత్నము లేక భగవంతుఁడు కాపాడఁడు.)
మర్కటగృహము, సం. వి. అ. న. కోఁతిమెంట: చూ, సదనము. 1.
మర్కట పిపీలిక, సం.వి.ఆ. స్త్రీ. పెద్దనల్ల చీమ: చూ, పిపీలిక.
మర్కటము, సం. వి. అ. పుం 1. కోఁతి: చూ, వానరము; 2: చూ, సాలెపురుగు; అం 3: చూ, గతులు.
మర్కటవాసము, సం. వి. అ పుం: చూ, మర్కటగృహము.
మర్కటి, సం. వి. ఈ. స్త్రీ 1. తీఁగకానుగ* : (మర్కట రోమములవంటి ముండ్లుగలది): చూ, శాదఘ్నము; 2. ధూలగొండి*: చూ, శూకశింబి.
మర్కారి, వా. వి. పడవ నడిపించువాఁడు: చూ, సరంగు.
మర్తబు, వా. విశే. రూ-మర్తరబు సమాప్తము.
మర్తరబు, —వై—
మర్త్యము, అం. (భూలోకము): చూ, లోకములు.
మర్త్యుఁడు, సం. వి, అ. పుం: చూ, మనుష్యుఁడు.
మర్దనం గుణవర్ధనమ్, న్యా మందెంత మర్దించిన నంత దాని గుణము హెచ్చును.
మర్దనము, సం. వి. ఆ. న. 1. పిసుకుట: చూ, సంవాహనము; 2. నూఱుట: చూ, సురుము.
మర్దలబంధము, అం: చూ, శబ్దాలంకారములు.
మర్దలము, సం.వి.ఆ.పుం. 1.=మద్దెల (దీనిధ్వనిగుండిలము): చూ, వీణ; అం 2: చూ, వాద్యములు.
మర్దలాదులానద్ధములు, అం: చూ, వాద్యములు.
మర్దళరూపర్క్ష, అం. = మద్దెలరూపురిక్క, ధనిష్ఠ: చూ, రిక్క. 1—౨౩.
మర్దించు, సం స. క్రి. నూఱు: చూ, సమ్మర్దించు.
మర్దితము, సం. విశే నూఱఁబడినది, పీడితము: చూ, సమ్మర్దితము.
మర్దిని, అం: చూ, కళలు.
మర్నాఁడు, దే. వి: చూ, రూ-మఱునాఁడు. పర. 5, ఆ. 35.
మర్మజ్ఞుఁడు, సం. వి. అ. పుం: (తె.)—ఆణికాఁడు—ఆణీకాఁడు. ఒళవరి, కీలరి, నెలవరి.
మర్మము, సం. వి. న్. న, 1. జీవస్థానము: చూ, ఆయువు-ఆయుస్సు. (తె.)—అంకిలి, అనరు, ఆణి-ఆణీ, ఆను, ఆయము, ఒళవు, కిటుకు, కీలకము, కీలు, కొఱనంది, గాయకము, గుట్టు, గురుసు, గుటికొండి. తాపి-తాపీ, నెఱఁకు, నెఱను, నెళవు, పిక్కు, మర, మారాటము, మఱువు, లోచెయి—లోచెయ్యి. ("చూ, లోచెయ్యి"); 2: చూ, రహస్యము. 1,
మర్మరము, సం. వి. అ. పుం =మొఱమొఱ. ఆకులు లోనగువానియొక్క మ్రోత: చూ, స్వరము. 2.
మర్మస్పృక్కు, సం. విశే. (శ్.ఈ.శ్.) మర్మమును దాఁకునది (మాట), అరుంతుదము: చూ, శబ్దము. 2.

మర్యాద, సం. వి. అ. స్త్రీ. 1. పొలిమేర: చూ, హద్దు. 1; 2. తీరము: చూ, రోధస్సు: 3. = మరియాద, కట్టుపాటు; 4. = మరియాద: చూ, సత్యము. 1; 5: చూ, సన్మానము.

మర్యాదకుఁడు, సం. విణ: చూ, ఆర్య. మిత్రుఁడు.

మర్లమాతంగి, వా. వి. ముట్టినతోడనే మరులు పుట్టించెడి యోషధి*: రూ-మరులుమాతంగి, మరులుఁ దీఁగ, మరులు జడ, మరులుమ్మెత. (సం.)—గోలోమి, భూతకేశము, మదనము.

మర్లుఁబాము, దే. వి: చూ, మనుదిండి.

మర్షము, సం. వి. అ. పుం ఓరుపు: చూ, శాంతము. 1.

మఱ, దే. వి: చూ, రూ-మర. 1-2-3.

మఱఁదలు, దే. వి. (మఱఁది + అలు) 1. తమ్మునిభార్య: చూ, రిత్తిక; 2. భార్య చెల్లెలు; 3. తనకంటె చిన్నదగు మేనత్త మేనమామల కూఁతురు.

మఱఁది, దే. వి. 1. చెల్లెలి మగఁడు; 2. భార్య తోఁబుట్టువు; 3. మేనమామ కొడుకు; 4. మగని తమ్ముఁడు. (సం.)—ఋ, దేవరుఁడు.

మఱక, దే. వి. 1: చూ, రూ-మరక, కఱ్ఱ-కాఱు-డాగు. 2. మేఁకపడ్డ, పంచ. నా. 5, ఆ. 11: చూ, మేషము. 1.

మఱకువ, దే వి. అజ్ఞానము. భార. అర. 1, ఆ. 326: చూ, స్వాపము. 3.

మఱగుజ్జు, ద్వ. విణ: చూ, రూ--మఱుగుజ్జు.

మఱచు, దే. స. క్రి. మఱపుఁజెందు. పా. 4, ఆ. 16,

మఱపు, దే. వి. రూ-మఱుపు. 1: చూ, విస్మృతి; 2: చూ, మఱకువ; 3: చూ, పారవశ్యము. ఉ, హరి. 5, ఆ. 73; 4: చూ, ప్రమాదము. స్వా. 4, ఆ. 63.

మఱల, దే. అవ్య: చూ, రూ-మరల.

మఱలు, దే. అ. క్రి: చూ, రూ-మరలు, 1—2.

మఱి, దే. అవ్య. రూ-మరి. 1: చూ, రూ-మరి. 1; 2. ఇంకను. రూ — మరి అన-అనఁగ-అనఁగా-అనాఁగ-అనా; 3: చూ, మరి 3,

మఱిగ, దే. వి. జోడ్త వెలవలె బలపపు జాతితోఁ జేయఁబడిన పాత్రము: చూ, హరివాణము (పాత్రము. 6)

మఱిమఱి, దే. అవ్య. 1, మఱియు-మఱియు, అందంద, అడాడ, అనయము, (సం.)—అత్యంతము; 2: అనయము, అఱి-ముఱి, ఎస, ఏప్రొద్దు, కడు, తరమిడి, నలి, పెద-పెద్ద, పొరి, బెట్టు, హాళెము. (సం.)—అనిశము. (మిగతవానికి "చూ, హాళెము")

మఱియు, దే. అవ్య. 1: అదిగాక, ఇంతేకాకుండ, కాక; 2: చూ, వెండియు.

మఱియొకటి, ద్వ.స. (మఱి + ఒకటి) అన్యము: చూ, వేఱు.3.

మఱియొకఁడు, ద్వ. స: చూ, వేఱయినవాఁడు,

మఱియొకనాఁడు, ద్వ. వి. మఱియొకదినము.

మఱు, దే. వి. వృత్తియందు మఱుఁగు-మఱుస-మాఱుశబ్దముల కాదేశరూపము. ("మఱుపడు, మఱునాఁడు, మఱుమాట" మొదలగునవి).

మఱుఁగు, దే. వి. 1. చాటు. కళా. 4, ఆ. 102: చూ, స్థగనము; 2: చూ, మఱుఁగుచోటు; అ. క్రి. 3: ఏమఱించు, కనుమొఱఁగు, దాఁగు, దాఁగురించు, దాఁగియుండు; 4. చాటగు: చూ, లాఁచు. 2; 5: చూ, సంతాపించు.

మఱుఁగుగోడ, వా. వి. 1. మన్ను ఇటుకలాయి లోనగువానిచే పెట్టబడినగోడ. తద్వి.— ౧. అంపగోడ, తన్నుగోడ, ముట్టుగోడ; ౨. అడ్డగోడ, అరగడి, మఱుఁగుగోడ. (సం.) అర్ధకుడ్యము; ౩. అలవ, గోడ. (సం.)—౪. కుడ్యకము, కుడ్యము, కూడ్యము, కుడ్యము, భిత్తి-భిత్తిక; ౫. కణాటి గోడ-కనాతిగోడ, సరాటి; ౬. దడికె-దడికె-తడుకె-దడక-తడికె, దడి, అంతిక-అంటికె (చూ, వాకిలి); ౭. తల్లిగోడ; ౮. పునాది; ౯. పొరకటి; ౧౦. మంటిగోడకు.—(సం.)— కంథ; ౧౦. మగులుగోడ, మడురుగోడ; ౧౧. వెలుగుసకు. (చూ, వెలుఁగు.) (మిగతవానికి "చూ, సరాటి").

మఱుఁగుదొడ్డి, దే. వి. విష్ఠావిసర్జన స్థానము: పాయకానా—పాయికానా, పీతిరిగుంట, మఱుఁగుపెరడు. (దొడ్డహోలు మఱుఁగుదొడ్డి అని మఱియొకటి).

మఱుఁగుచోటు, దే. వి: అంతిపురు, అంటస్తు, ఓలము.

మఱుఁగుపడినవాఁడు, వా. వి: (సం.)—తిరోహితుఁడు.

మఱుఁగుపడు, ద్వ. అ. క్రి. మఱుఁగు: చూ, లాఁచు.

మఱుఁగుపెరడు, దే. వి: చూ, మఱుఁగుదొడ్డి.

మఱుఁగుమాట, దే. వి. అపలాపము: చూ, శబ్దము. 2.

మఱుఁగుపెట్టు, దే. స. క్రి: చాటుపెట్టు, మఱుపెట్టు, మాటు. (సం.)—అపలపించు, నిహ్నవించు.

మఱుకువ, దే. వి: చూ, సంతాపము.

మఱుగుజ్జు, ద్వ. విణ. (మఱు + గుజ్జు) గూనివాఁడు, గూనిది: చూ, వామనుఁడు.

మఱునాఁడు, దే. వి. (మఱుస + నాఁడు): (సం.)—అపర దినము, అన్యేద్యువు, ఇతరేద్యువు.

మఱుపడు, ద్వ. అ. క్రి: చూ, రూ-మఱుఁగుపడు.

మఱుపు, దే. వి: చూ, రూ-మఱపు.

మఱుమాట, దే. వి. (మాఱు + మాట): చూ, ప్రతివాక్యము.

మఱుమ్రోఁత, దే. వి. (మాఱు + మ్రోఁత) రూ-మాఱు మ్రోఁత: చూ, స్వరము. 2.

మఱువ, ద్వ వి. (మఱుఁగు + వా) 1. కుండ: చూ, భాండము. 3; విణ. 2: చూ, మూఁగ. 1.

మఱువకందు, ద్వ. వి. కుంభసంభవుఁడు, అగస్త్యుఁడు. అచ్చ. అర, కాం. 7: చూ, సన్న్యాసి. 1.

మఱువు, దే. వి. 1. కవచము. మార్క. 8, ఆ. 107: చూ, వారవారణము; 2. చాటు: చూ, స్థగనము; 3: చూ, మర్మము. 1: * : చూ, పుట్టుమచ్చ.

మఱుపెట్టు, దే. స. క్రి: చూ, మఱుఁగుపెట్టు.

మఱుస, దే. విణ. అవలిది. జై. 8, ఆ. 93. (వృత్తియందు అంత్యవర్ణంబునకు వికల్పంబుగా లోపంబగు. "మఱునాఁడు మఱుపుట్టువు, మఱుమేనువు." మొ.)

మఱుసంజ, ద్వ. వి. (మఱుస + సంజ) సాయంసంధ్య, మలుసంజ: చూ, సాయంకాలము.

మఱ్ఱి, దే. వి. 1. రూ-మఱ్ఱె *: భో. 2; అ. 61: చూ, వటము. 3; 2. రూ-మఱ్ఱెయ. అజకము: చూ, రోగము. 1.

మఱ్ఱిపండు, వా. వి. నైయగ్రోధము: చూ, ఫలములు.

మఱ్ఱె, దే. వి. చూ, రూ-మఱ్ఱి. 1.

మఱ్ఱెయ, దే. వి: చూ, రూ-మఱ్ఱి. 2.

మల, వై. వి: చూ, పర్వతము. 1.

మలఁక, దే. వి: 1. చిక్కు: చూ, గ్రుక్కు. 3; 2: మెలిక: చూ, లంకె; 3. చుట్టు. కాశీ. 5, ఆ. 284: చూ, సంవృతము; విణ. 4. వంకర: చూ, వేల్లితము. 2.

మలఁకతూము,ద్వ.వి.పదికుంచములకొలఁదిగలమానవిశేషము.

మలఁకపుట్టి, దే. వి. ఇన్నూఱుకుంచముల కొలఁదిగల మానవిశేషము. (గరిసెకు మూఁడుమలఁకపుట్లు.)

మలఁకమెఱుపు, దే. వి. ధనురాకారమగు మెఱుపు: చూ, విద్యుత్తు. 1.

మలఁకవాలు, దే. వి. పాదరక్ష: చూ, సమ్మాళిగలు.

మలఁగ, దే. వి. ఎద్దుపైగంతతోడి సరుకుగోనె: చూ, సంచి.

మలఁగు, దే. అ. క్రి. 1. తిరుగు: చూ, సంచరించు; 2: చూ, మరలఁబడు; 3: చూ, వంకరవోవు.

మలఁచు, దే. ప్రే. 1. మలఁగఁజేయు: మలఁపు; స. క్రి. 2: చూ, తొలచు.

మలఁపు, దే. వి. 1. నర్తనము: చూ, వ్యంజకము. 1; ప్రే. 2: చూ, మలఁచు. 1.

మలఁపుగొను, దే. అ. క్రి: ఆడు, గునియు, గునిపాడు, చిందాడు, చిందుద్రొక్కు-చిందులుద్రొక్కు, తుంపెసలాడు, నట్టాడు, పాత్రరలాడు-పాత్రలాడు, పింపిళ్ళాడు, పింపిసలాడు, పింపిళ్ళుగూయు. (సం).— నటించు, నర్తించు, నర్తిలు-నర్తిల్లు.

మలక, దే. వి. రూ-మల్క. 1. మూఁకుడు; చూ, పాత్రము. 6-ఆఱ (6-ఆఱలోగల 'పలక" ను "మలక" గా సవరింపుము.); 2. తురక: చూ, మ్లేచ్ఛుఁడు.

మలకడము, దే. వి: చూ, మలఁకవాలు.

మలగొంగ, ద్వ.వి. నగవైరి, ఇంద్రుఁడు:చూ,సహస్రాక్షుఁడు.

మలగొను, దే. అ. క్రి. (మలఁక+గొను) పెనఁగొను. జై. 5: ఆ. 32; కళా. 2, ఆ. 48: చూ, వెంటిగొను.

మలచము, దే. వి. 1. అధికము: చూ, హేరాళము. 1;.2. గొప్పది. ఉ, రా. 3, ఆ. 128: చూ, సుర. (3)

మలదూషితము, సం. విణ: చూ, మలినము. 3.

మలప, దే. వి. దూడచచ్చి పాలిచ్చెడుధేన్వాదికము: చూ, సౌరభేయి (ధేనువు.)

మలపఱ్ఱె, దే. వి. దూడచచ్చిపాలిచ్చెడుగేదె:చూ,హేరంబము.

మలపు, దే. వి. 1. ఆధిక్యము. ఉ, హరి. 6, ఆ. 29: చూ, హెచ్చు. 2; ప్రే. 2. మరలఁజేయు: చూ, మురించు; 3; చూ, మరలించు అచ్చ. అర, కాం. 100.

మలపువు, సం. వి. ఈ. స్త్రీ: రూ-మలయువు. కుక్కమేడి* చూ, వెఱ్ఱిమేడి.

మలమనికి, ద్వ. వి. రూ-మలమన్కి. కోఁతి. అచ్చ. యు, కాం. 88: చూ, వానరము.

మలమన్కి, —వై.—

మలమల, దే. వి. రూ-మటమట. మూఁడుట మఱుగుటల యందగు ధ్వన్యనుకరణము. చూ, హూహూ.

మలమాసము, సం. వి. అ. పుం: అధికమాసము. మలిమ్లుచము. (మాసము. 1.)

మలము, సం. వి. అ. పుం, న. 1. విష్ఠ: చూ, శమలము; 2: చూ, కిట్టము. (చూ, మలములు); 3. దోషము: చూ, వృజినము; అం 4 (మ+ల.)"రాధానాథ.": చూ,ఉపగణములు.

మలములు, అం వస, శుక్లము, రక్తము, మజ్జము,మూత్రము, విష్ఠ, పిఁజూషము, నఖము, శ్లేష్మము, అశ్రువు, దూషి—దూషిక-దూషీక-దూషము, స్వేదము (క్రొవ్వు, రేతస్సు, నెత్తురు, మెదడు, ఉచ్చ, ఏరుగడము, గులిమి, గోరు, తెమడ, కన్నీరు, కంటిపుసి, చెమట) (12) (చీమిడి 13వదని కొందఱు.): చూ, శమలము.

మలయ, సం. వి. ఆ స్త్రీ. తెల్లతెగడ *: చూసర్వానుభూతి.

మలయస్త్రీ, అం. ఒకస్త్రీ: చూ, స్త్రీ.

మలయజము, సం. వి అ. పుం. 1. చందనము *: చూ, సుగంధము; 2. చందనము: చూ, వాసన. 1; పా. 3: చూ, వృత్తము. 1. ("న-జ-న-స-న-న-భ-న-వగణము.8-15-22 యతులు. 26 వ ఛందస్సు.")

మలయమారుతము, సం. వి. అ. పుం. కమ్మగాడ్పు: చూ, వాయువు.

మలయము, సం. వి, అ. పుం. 1. కొండ: చూ, పర్వతము; 2; ఆరామము: చూ, వనము. 2; 3: చూ, దేశములు: అం. 4. కులపర్వతము: చూ, పర్వతము. ౭.

మలయమ్మ, వై. వి, (మల+అమ్మ): చూ, పార్వతి. య. 2. ఆ. 3.

మలయిక, దే. వి: చూ, విహారము. 1.

మలయు, దే. అ. క్రి 1. తిరుగు. కాశీ. 7, ఆ. 93; చూ, సంచరించు; 2. పెనయు. పా. 1, ఆ. 22, చూ, వెంటిగొను; 3: చూ, వ్యాపించు. 4: చూ, యత్నించు; 5: చూ, విజృంభించు. వసు. 3, ఆ. 96: 6. తపించు య. 5, ఆ. 115: చూ, సంతాపించు.

మలయువు, సం. వి. ఈ. స్త్రీ. చూ, మలపువు*.

మలవిలుకానితేరు, ద్వ. వి. గోపతి. వేం, అం. 96: చూ, వృషభము. 1:

మలహారి, అం. 1; చూ, స్త్రీరాగములు; 2: ఉపాంగము. 6. (అంగము. 9.); 3: చూ, స్వరము. 2.

మలాక, దే. వి. శ్రీఖండము: చూ, వాసన. 1;

మలామ, దే. వి. బంగారు నీరు మొదలగువానిపూఁత; చూ, సమాలంభము. 1.

మలాము, దే, వి: చూ, రూ-మెలాము. 1-2.

మలారము, దే. వి. 1. రూ-మల్లారము. మట్టిగాజులుగుది; 2. నిడుపు కొయ్యకొనను రెల్లలుకట్టి వీధిలోనగునది ఊడ్చెడు సాధనము: చూ, సమ్మార్జని.

మలికితము, దే. వి: చూ, సందేహము. య. 4, ఆ. 62.

మలిగ, దే. వి: అపణము: చూ, సదనము. 1.

మలిగఁడ్లు, దే వి.బ. గులచితియఁదగిననాయి: చూ, రత్నములు.

మలినత, సం: వి: ఆ: స్త్రీ: చూ, మలినము. 1.

మలినమగు, మి. అ. క్రి: అంటగు, అంటుపడు, కందుఁబాఱు-కందువాఱు, మయిలపడు-మైలపడు, మాఁగుడు వాఱు, మాఁగువడు, మాఁగువాఱు, మాయు.

మలినము, సం.విణ.=మకిల. 1: అశుచి, అశుద్ధము, కశ్మలము. (తె.)—కసమూలము. మయిల—మైల; విశేష్యములు—అనాచారము, అశుద్ధత, పిసక, మలినత, మాలిన్యము (తె.) అంటు, కసటు, క్రిచ్చు, క్రొంకు, మకిల-మకిలి, మఖ్ఖ, మలుకువ, మసటు-మస్టు, మసడు, మసి, మాఁగు-మాఁగుడు మాపు-మాపుడు, మాసి, మురికి-ముఱికి, రొచ్చు. ("చూ. రొచ్చు. 4"); 2. నల్లనిది: చూ, వర్ణము. 6; 3. దూషిత మైనది: అనచ్ఛము, ఆలోడితము, ఆవిలకము, ఆవిలము, ఉద్వేజితము, కలుషము-కల్మషము, కశ్మలము-కస్మలము, మలదూషితము, మలీమసము. (తె.)—కారాకూరము; అం. 4: చూ, సంచారిభావమునఁ బుట్టిన దృష్టులు.

మలిని, సం. వి. ఈ. స్త్రీ, చూ: ముట్టుత,

మలిమిడి, దే. వి. పశుపాదరోగము: చూ, హనువు. 4. (రోగము. 1.)

మలిమ్లుచము, సం. వి. అ. పుం. 1. దోమ: చూ, మశకము 1; 2: చూ, మలమాసము.

మలిమ్లుచుఁడు, సం. వి. పుం. 1. దొంగ: చూ, హారకుఁడు. 1; 2. అగ్ని: చూ, వహ్ని. 1.

మలివారము, వా. వి సోమవారము: చూ, వారము 2.

మలీమసము, సం. వి. అ. పుం. 1. ఇనుము: చూ, లోహము. 1; 2: చూ, మలినము. 3.

మలు, దే. విణ. మఱునకు ఆదేశరూపమైన మఱుశబ్దమునకు రూపాంతరము. ("మలుకారు—మలుసంజ" మొ.)

మలుఁగు, దే. వి. ఒకచేఁప: చూ, మత్స్యము. 1.

మలుకారు, ద్వ. వి: 1. చలికారు: చూ, మాసద్వయము; 2. ముక్కారు పంటలో రెండవకారు.

మలుకు, దే. వి. రూ-మల్కు. దారములోనగువాని నెదురెదురుగ తగిలించి మరల పెడమర్ల త్రిప్పినది.

మలుకువ, దే. వి. ముఱికి: చూ, మలినము. 1.

మలుగు, దే. వి. రూ-మల్గు. 1. తుంటి: చూ, రొండి; 2: చూ, మక్క. 1; అ. క్రి. 3. ఉపశమిల్లు: చూ, స్రుక్కు. 4; 4: చూ, నశించు.

మలుచు, దే. స. క్రి. రూ-మల్చు. 1: రోయు. పెరుగు; 2: తలిమెనఁబెట్టు-తలిమెనఁబెట్టు; 3: చూ, రాచు. 2.

మలుచూలు, దే. వి. రెండవచూలు.

మలుపక్షము, ద్వ. వి. కృష్ణపక్షము: చూ, పక్షము. 1.

మలుపు, దే. ప్రే. మఱుఁగఁజేయు. 1. అప్పు; 2. సరింపజేయు. అచ్చ. యు, కాం. 314; 3. (దారపుఁ లోనగు వానిని) మల్లించు మళ్ళించు, మఱలఁబోలు.

మలుసంజ, ద్వ, వి: చూ, రూ-మలుసంజ.

మల్క, దే. వి. చూ, రూ-మలక.

మల్కు, దే. వి: చూ, రూ-మలుకు. శకాం. 5: ఆ. 7.

మల్గు, దే. వి: చూ, రూ-మలుగు.

మల్చు, దే. స. క్రి. చూ, రూ-మలుచు (తలిమెనఁబెట్టుటకు. విజ 1. ఆ. 132)

మల్లి, వై. వి. = మల్లిక. మట్టికంచము: చూ, హరినామము. ఖాండము. 3.)

మల్లికము, సం. వి. అ. పుం: అ. స్త్రీ: 1. = మల్లి.—వై.—2; దీపపు ప్రమిద: చూ, హరివాణము (పాత్రము. 6.); వా. 3. అపరకర్మమందలి పిండివంట (చూ చతురంగులము)

మల్లకుఁడు, దే. విణ. తిండిపోతు: చూ, వ్యాఘుఁడు. 2.

మల్లగుల్లము, దే. వి: వాదులాట.

మల్లచిప్ప, వా. వి: (సం).— పాత్ర.

మల్లచఱచు, ద్వ. అ. క్రి. (మల్లట+చఱచు) భుజాస్ఫాలనముచేయు. హరి. పూ. 6, ఆ. 136.

మల్లచఱచుట, ద్వ. వి. భుజాస్ఫాలనము: మల్లచఱపు

మల్లచఱపు, ద్వ. వి.—వై.—

మల్లట, ద్వ. వి: రూ-మల్లాట, పోరాట.

మల్లడి, దే. వి. 1: చూ, సంతాపము; 2. పెనఁకువ, గుద్దులాట: చూ, యుద్ధము.

మల్లడించు, దే. అ. క్రి. 1: చూ, వెంటిగొను; 2. అతిశయించు. భాగ. 4: స్కం. 515: చూ, సందడించు.

మల్లడిగొను, దే. అ. క్రి. 1: చూ, వెంటిగొను. హరి. పూ. 7, ఆ. 156; 2: చూ. పరితపించు; ప్రే. 3. మల్లడిగొలుపు. పాండు. 4, ఆ. 292.

మల్లతాళము, అం: చూ, జన్యతాళములు.

మల్ల బంధములు, అం. కుస్తీలు, జెట్టిపోరాటములు. భాగ. దశమస్కం. పూ. 133: ఇవి ౧౦౦.— (వీనిని శీర్షికలలో చేర్చలేదు. ఇవి ఒకదానితరువాత నొకటిఁ దోడుగ సంబంధించియు సక్రమముగ నుండును. అట్లు దీనికిఁదోడు అని ఒకదానికొకటి కలిపి చదువవలెను.): ౧ దస్తీ (హస్తము), ౨ ఒకయించి (కత్తరి), ౩ ఉల్‌టాడూప్ (బోరగిలవేసి ముంచుట), ౪ పఛాడ్ (నిపాతనము), ౫ కస్తీబార్ (పాద సంఘర్షణము), ౬ ఉల్‌టాబద్‌లీ (వ్యతిరేకముగామార్చుట), ౭ పిఛలీ (పృష్ఠము), ౮ ఫర్‌షీ (సమీకరణము),

ఫరేబా-ఫరేదా (మోషణము), ౧౦ లుకాన్ (ఊఁపు), ౧౧ ఝూలీ (ఉద్ధారణము), ౧౨ డగ్‌దేద్ (గుల్ఫశృంఖల), ౧౩ కసోటా (గ్రీవాతాడనము), ౧౪ డూప్ (నిమజ్జనము) ౧౫ ఉల్‌తాకఫా (ప్రత్యామర్షము), ౧౬ ఉల్‌తాలుకాన్ (వ్యతిరేకముగా నూఁపుట), ౧౭ లప్టీ (చుట్టుముట్టుట), ౧౮ డూకీ (కూర్పరాకర్షణము), ౧౯ కోనితాల్ (కూర్పరాపనయనము), ౨౦ ఖైరా (బధిరము), ౨౧ ఖితర్ (బాహ్యము), ౨౨ ఉతార్ (అవతారణము), ౨౩ ఝూలీ, ౨౪ డగ్‌బేటీ (చరణశృంఖల), ౨౫ కొన్యూ (న్యో) ఖర్నా (కూర్పరాపూరణము). ౨౬ ఉల్టాబిఖాన్ (ఉత్తానపాతనము), ౨౭ కిలావర్ (ఆకస్మికోపవేశనము), ౨౮ గిర్దెబాన్ (కక్షప్రవేశము): ౨౯ గావ్‌పఛాప్ (ఆకస్మికనిపాతనము), ౩౦ గంధడా (గాఢ్ఢనిపాతనము), ౩౧ ఖఫా (ఆగ్రహము), ౩౨ కిలావర్ (ఆకస్మికోపవేశనము)(౨౭-౨౮), ౩౩ ఉల్‌రాబేడీ (ప్రతిశృంఖల), ౩౪ చౌబన్ (చతుర్దిశావరణము), ౩౫ చాబూప్ (విస్మారణము), ౩౬ ఉల్‌తాలప్టీ (వెనుకచుట్టుట), ౩౭ పయిరేకేదస్తీ (పాదతాడనము), ౩౮ ఉల్‌రాకసోటా (పృష్ఠనిబంధనము), ౩౯ డుప్కీ (అవగాహనము), ౪౦ సరేకసోటా-సర్‌కసోటా (శిరోబంధనము), ౪౧ అఖేరాపట్ - అఖోరాపట్ (ద్విగుణబంధనము), ౪౨ బగేలీ (కక్షము), ౪౩ ఉలబ్‌దాన్ (శాతనిపాతనము) ౪౪ షత్‌రంజి (చతురంగము), ౪౫ ఉల్‌తాడూప్ (వామపాదన్యాసము), ౪౬ కస్తీబార్ (౪౬)(అవలగ్నాకర్షణము), ౪౭ బహిర్‌వా (బధిరము), ౪౮ దడ్‌ఖరానా (కబంధపూరణము), ౪౯ రూమ్ (పరివేషము), ౫౦ గోది (బడి), ౫౧ బహిరా (శ్రవము), ౫౨ డుఫ్ (ముంపు), ౫౩ రూమ్ (౪౯ పరివేషము), ౫౪ పాంఖరానా (చరణపరివేషము), ౫౫ చౌకస్తీ (కకుప్పరివేషము), ౫౬ బహిర్‌వా (౪౭) (బధిరము), ౫౭ ధడ్‌ఖరాతి (వక్షత్యాగము), ౫౮ సీనేబన్ (ఊరోనిరోధము), ౫౯ నక్‌సూట్ (ముక్కునొక్కుడు), ౬౦ కిలావర్‌జంగ్ (జానువిన్యాసము), ౬౧ సీనేతడుఖ్ (ఊరోభగ్నము), ౬౨ నాగిన్ (నాశికానిరోధము), ౬౩ పాంఖరానా (వామపాద తాడనము), ౬౪ బందోటా (నిర్బంధము), ౬౫ లప్టీ (పరివేషము), ౬౬ ఝూలీ (ఉయ్యెల), ౬౭ ధోబిఘాట్ (రజకధావనము), ౬౮ సనారి—ధస్నా (ప్రవేశము), ౬౯ సరోతా (హస్తాకర్షణము), ౭౦ చౌటాల్ ఖరానా (చతుశ్చరణబంధము), ౭౧ డగ్‌బేడీ (౧౨-౨౪) (చరణశృంఖల), ౭౨ గజ్‌బేడీ (గజశృంఖల), ౭౩ కస్తీ బార్ (అపనుదపాదము), ౭౪ బాగ్‌లీ-బగ్‌లీ (కక్షము, ౭౫ గంధడా-గధడా: (సవ్యపాదతాడనము), ౭౬ ఉర్‌తా గజ్‌బేటీ (వ్యతిరేకగజశృంఖల), ౭౭ దండమొదోడి (కక్షనిపీడనము), ౭౮ ఉర్‌తాగజ్‌బేడీ (వ్యతిరేకద్విపశృంఖల), ౭౯ గిర్దెబాన్ (౨౮), ౮౦ ఉల్‌తాముష్టా (ప్రతికూలబంధము), ౮౧ ఢాక్‌లీ (కరతాడనము), ౮౨ చౌబన్ (౩౪) (దిశావరణము), ౮౩ లపటీ (౧౩-౬౫) (పరివేషణము), ౮౪ ఉల్‌తాపఛేడీ (పృష్ఠనియాతనము), ౮౫ వన్‌ట్రిట్ (ఉద్ధూతపాదము), ౮౬ కుర్సీ (౧౦౦) (సింహాసనము), ౮౭ ఝూలీ (డోల), ౮౮ వన్‌ట్రిట్టా (చరణవిమయము), ౮౯ కిలావర్ (౨౭-౩౨) (ఆకస్మికోపవేశనము), ౯౦ ఖప్‌ఛడ్ (కక్షన్యాసము), ౯౧ వన్ (ఏకము), ౯౨ ఖరాటీ (తిరుగుడు), ౯౩ ఆదాధడ్‌కా (అర్ధకంకాళము), ౯౪ ఏక్ లంగ్ (ఒంటికుంటి), ౯౫ లప్టీదాబ్ (నిహింసనము), ౯౬ జన్‌ధడా (పార్శ్వాకర్షణము), ౯౭ గజ్ మహర్ - గజమహిర్ (గజచంద్రుఁడు), ౯౮ నయ్‌ఫరా(ప్రకోష్ఠపీడనము), ౯౯ డుప్‌కీ (పాదద్వయాకర్షణము), ౧౦౦ సుడీ. "కుస్తీ మల్లయుద్ధబోధిని" అను గ్రంథమునందు వీనివివరణము లన్నియు చూడవలయును. కిమ్మతు రు 0-6-0 గ్రంథకర్త భాగవతుల లక్ష్మీపతి శాస్త్రిగారు, తాలూకా రామచంద్రపురము.) (ఈ శాస్త్రవిషయములంతరించినను గొన్ని లోకాచారంబుగానున్నవి ఇందు వివరింపఁబడియె.) మఱియిన్ని తద్వి. = అంకిణి.

తద్వి.—౧ దండలు 12, ౨. గతులు 12, ౩. పరువళ్ళు 12, ౪. మొనలు 12, ౫. కాయమానములు 12, ౬ విసరులు 14, ౭ ఉపవీతములు 16, ౮. విన్నాణములు 32, (ఆం, భా. ద్వి. క. 209), ౯. ప్రచారములు 32, ౧౦. నఱుకులు 3, ఇట్టిలక్షణములనేకములీములీమల్లశాస్త్రసాంప్రదాయము వలనఁ దెలియఁదగు.(వీని వివరములకుశీర్షికలంజూడుము.) వ. మఱియు కొన్ని తెనుఁగుఁ బేళ్ళఁ బరగుచున్నవానినిటఁ బొందుఁ పఱుపఁబడును. వానిని సందర్భమునుఁబట్టి పైవానితో సమన్వయించుకొననలయును. ౧. ఆయుధము.—చేత్రాడు; ౨. ఆయుధాగ్రము.—ములు—ముల్లు; ౩ పరికరములు.- కంబము, కటిక-కట్టిక, కొణత—కొణతము-కొణిత, నీల గోతాము, బాలసంగడము. మోడు, లోడీ-లోడు, సంగడము; ౪. కుస్తీలతావునకు.- పెక్కణము-ప్రెక్కణము. (సం.)— ప్రేక్షణము; ౫. యుద్ధక్రియలు.- ఉప్పరించు, ఉప్పళించు. కలయు మెలఁకువ; ౬. మెలఁకువలకు.- ఇంగళింపు, కాలిపాదువ, జంపు, పెక్కు; ౭. విజ్ఞానమునకు.- ఉపతాయి; ౮. విద్యాభేదములు.— కిన్నాత గస్తాలు, తాళాలు-దాళాలు, దండెములు, దింకలు, పావుపావులు, పుటములు, మండీలు, లాగులు ఇత్యాది.

మల్లము, సం. వి. ఆ. పుం: చూ, మల్ల.

మల్లయుద్ధము, పా: చూ, మల్లబంధములు.

మల్లరము, దే. వి. 1. గర్వము: చూ, హంకారము; విణ. 2. మదించినది. కళా. 6, ఆ. 222.

మల్లశాస్త్రము, అం: చూ. మల్లబంధములు.

మల్లసాల, వై. వి. భోజనశాల. హరిశ్చ. 4, ఆ. 193: చూ, సదనము. 1.

మల్లాట, ద్వ. వి: రూ, మల్లట, పోరాట: చూ. యుద్ధము.

మల్లాడు, ద్వ. అ. క్రి: చూ, వెంటిగొను. స్వా. 4, ఆ. 115.

మల్లామడి, దే. విణ: 1. చూ. పీడితము; 2. పీడితుఁడు ఉ. హరి. 5, ఆ. 168.

మల్లారము, దే. వి: చూ, రూ-మలారము. 1.

మల్లిక, సం. వి. ఆ. స్త్రీ. = మల్లియ *: చూ, మల్లె. 12;

మట్టిపాత్రము: చూ, భాండము. 3; అం. 3, (శోషణము): చూ, మన్మథబాణములు; 4. (మత్త్రిక): చూ, జన్యతాళములు.
మల్లికము, సం. వి. అ. పుం. మాసిన ముక్కు కాళ్లుగల హంస: చూ, హంస. 1.
మల్లికాక్షము, సం. వి. అ. పుం, 1. మాసిన ముక్కు కాళ్ళు గల హంస: చూ, హంస; 2. తెల్లని కన్నులుగలగుఱ్ఱము. చూ, హయము.
మల్లికాఛదనము, సం. వి. అ. న: చూ, మల్లెఆకు.
మల్లికామోదము, అం: చూ, జన్యతాళములు.
మల్లికార్జునలింగము, అం. చూ. జ్యోతిర్లింగములు.
మల్లియ, వై.వి.=మల్లికా. రూ-మల్లె,మల్లెతీఁగె*: చూ, హసంతి. 2.
మల్లు, వై. వి. 1.=భల్లుక. కోఁతి: చూ, వానరము; 2. జెట్టి పెనఁకువ: చూ, యుద్ధము: వా 3, మల్లుతాను: చూ, వస్త్రము.
మల్లుఁడు, సం. వి. అ. పుం: 1. జెట్టి: చూ, సాదనకాఁడు. 1; విణ. 2: చూ, శ్రేష్ఠుఁడు.
మల్లుకట్టు, ద్వ. స. క్రి. అడ్డగించు: చూ, సంరోధించు.
మల్లుతాను, వా. వి. మల్లుబట్ట: చూ, మల్లు. 3.
మలుపెనఁగు, ద్వ. అ. క్రి. జెట్టిపెనఁకువగా పెనఁగు.
మల్లె. వై. వి =మల్లికా. రూ-మల్లియ. 1: చూ, హసంతి. 2; 2 =మల్లక: చూ, మల్లు; 3. ఉపశాఖ. చూ, శాఖ. 1.
మల్లెఆకు, వా. వి. (సం).—అశ్మంతకము, మల్లికాఛదనము.
మల్లెజేగులు, ద్వ. వి: చూ, రాబందు.
మల్లెపుష్ప, వై. వి: (సం.)—మ్రుకురము : చూ, హసంతి. 2.
మల్లెమొగ్గలు, ద్వ. వి. బ. 1. మెడనగ: చూ, భూషణము. 2; 2. కుందముకుళములు, గువాకము—గూవాకము: చూ, హసంతి. 2.
మల్లెలగుది, ద్వ.వి. మల్లెపూగుత్తివలె మనోజ్ఞమగుటచే కుక్కకియ్యఁబడిన పేరు. స్వా. 4, ఆ. 32: చూ, సివఁగి. 2.
మల్లెలు, దే.వి. బ. 1: చూ, ధాన్యము; 2. స్ఫోటకజనితక్రియ.
మల్లెశ్రీగంధులు, మి. వి. బ: చూ, ధాన్యము,
మవురి, దే. వి. రూ-మౌరి: చూ, నాగసరము. 1,
మవ్వము, దే. వి. 1. కోమలత, నిర్వ. 5, ఆ. 105: చూ, సౌకుమార్యము. 1; విణ. 2. కోమలము. కళా. 7, ఆ. 174: చూ, సుకుమారము. 2.
మశకము, సం.వి.అ.పుం. 1. ఘోషము, దంశి, మలిమ్లుచము, రణరణము, దోమ; తద్వి.— ౧. ఘోణి. (తె.)-ఏనికదోమ, తొండపుదోమ; ౨. చిన్నదోమకు— (తె.)—చీఁకటియీఁగ. ౩. అడవిదోమ; ౪. నుసమ-నుసుమ. (చూ, సరఘ); 2. దేహమువిరియు రోగము: చూ, రోగము. 1.
మశహరి, సం. వి. ఈ. స్త్రీ: చతుష్కి, జాలిక. (తె.)–దోమతెర: చూ, వస్త్రము.
మశాకత్తు, వా. వి. 1. భూమికిపెట్టిన ఎరువు: రూ-మషాకత్తు, మసాకత్తు, మరమ్మతు-మరమ్మత్తు; 2. శిల్పులుచేసిన వస్తువులకు మజూరి: మషాకత్తు, మజూరి.
మషాకత్తు, వా. వి. —వై.—
మషాతు, వా వి. సేళ్లకొలుపుట, సర్వే.
మషాలు, వా. వి. కరదీపిక: చూ, స్నేహాళము.
మషాల్చి, వా. వి. దివిటీపట్టువాఁడు, దీపము వెలిగించువాఁడు.
మషి, సం. వి. ఇ, ఈ. స్త్రీ. = మసి. రూ-మసి. కాకితము వ్రాసెడుమసి: మసి. (తె.)—మసి
మషిమణి, సం. వి. ఇ. స్త్రీ. (తె)—మసిబుడ్డి.
మస, దే. వి: చూ, విలాసము. 2.
మసఁగు, దే.అ.క్రి: చూ, విజృంభించు, హరి, పూ. 7, ఆ.167.
మసక, వై.వి. రూ-మసకన. 1.=మేచక: చూ, మునిచీఁకటి. జై. 7, ఆ. 193; స్వా. 4, ఆ. 37; 2.=మేచక. ఇంచుక నలుపు: చూ, వర్ణము. 6.
మసకన, వై. వి. = మేచక. —వై— (ఆమ్రేడితమందు మసమసకన)
మసకపుఁబాము, దే.వి. సురతమొనరించుపాము: చూ, సర్పము.
మసకము, దే.వి. 1. రతి. భో. 5, ఆ. 118: చూ, సంయోగము; 2. సంభోగేచ్ఛ. ఉ, హరి. 3, ఆ 64: చూ, వాంఛ; 3. అహిరతి: చూ, మసకలుపాఱుట,
మసకలు పాఱుట, దే. వి. అహిరతి: చూ, సంయోగము.
మసకొను, దే. అ. క్రి. (మసకము+కొను) 1. సంభోగేచ్ఛఁగొను; ప్రే. 2. మసకొల్పు. అచ్చ. అ, కాం. 34.
మసటు, దే. వి. రూ-మస్తు. 1. మురికి. పాండు. 5, ఆ. 41: చూ, మలినము. 1; 2. వింపిరి: చూ, మలము. 1.
మసడు, —వై.—
మసనము, వై. వి.=శ్మశానమ్: చూ, శ్మశానము.
మసమసకన, వై. వి: చూ, మసక. 1—2. (మునిచీఁకటికి - జై. 2, ఆ. 101.)
మసర, దే. వి. 1. ధూసరవర్ణము: చూ, వర్ణము. 6; విణ. 2. ధూసర వర్ణముగలది.
మసరు, దే. వి. ఆవేశము. మార్క. 6, ఆ. 66.
మసలిక, దే. వి. 1. మాంద్యము, ఆలస్యము: చూ, విలంబము. 1; విణ. 2: చూ, మంథరము. 2; 3: చూ, మంథరము. 3.
మసలు, దే. అ. క్రి. ఆలస్యముచేయు: చూ, వివరించు. 3; 2. నీళ్లుమలమల (సలసల) కాగు; 3: చూ, విహరించు ; 4: చూ, వెనుకదీయు; 5: చూ, సంచరించు.
మసలుకొను, —వై.— (విహరించుటకు-భాగ. 3, స్కం. 508).
మసాకత్తు, వా. వి: చూ, రూ-మశాకత్తు.
మసారము, సం. వి. అ. పుం. ఇంద్రనీలము. పాండు. 2, ఆ. 44: చూ, రత్నము. 1.
మసాల, వా. వి. రూ-మసాలా. 1. పోగపు సరకులు : చూ, సంబారము; 2.పశువులు లోనగువాని వ్యాధులకిచ్చెడు మందు; 3. తాంబూలములోని పరిమళ ద్రవ్యముల గుండ; 4. కారపుసరకులు.
మసాలా, వా. వి. —వై.— "మసాలా కిళ్లీ".
మసి, సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1.=మసి: చూ, రూ-మసి; ఈ. (స్త్రీ). 2. పెద్దసదాప*: చూ, సదాప; వై. వి. (1) నలుపు: చూ, వర్ణము. 6; (2)=మషి : చూ, బొగ్గు; (3) : చూ, మలినము. 1; (4)=మసి: చూ, మసి. 1.

మసికట్టు, ద్వ. వి. బంగారు లోనగువాని చిలుము.
మసికోఁతి, ద్వ. వి. నల్లకోఁతి: చూ, వానరము.
మసిబుడ్డి, మి. వి. (సం.)—మషీమణి.
మసిలె, దే. వి. టాకుబండి: చూ, శకటము. 1.
మసీదు, దే వి. తురకల ప్రార్థనామందిరము: చూ, సదనము.1.
మసుర, సం. వి ఆ. స్త్రీ. రూ-మసూర. 1: చూ, వేశ్య; పుం. స్త్రీ. 2. చిఱుసెనగలు: చూ, సెనగలు,
మసూర, సం. వి. ఆ. స్త్రీ, పుం. స్త్రీ. —వై.—
మసూరము, సం. వి. అ. పుం. బిల్లతలగడ: చూ, లోడు.
మసూరవిదళ, సం.వి.ఆ.స్త్రీ. నల్లతెగడ*: చూ, సర్వానుభూతి.
మసూరి, సం. వి. ఈ. స్త్రీ రూ-మసూరిక. ఒకరకము గజ్జి: చూ, విదర్చిక. (చూ, వ్రణము).
మసూరిక, సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, మసూరి; 2. (రూ—మసూచిక-మశూచిక): చూ, స్ఫోటకము.
మసృణ, సం. వి. ఆ. స్త్రీ. నల్లగిసె* : చూ, శుకనాసము. 1.
మసృణము, సం. విశ. 1. చిక్కనిది: చూ, స్నిగ్ధము 3; 2. నున్ననిది: చూ, స్నిగ్ధము. 2. (మసృణ అని కొందఱు).
మసెల, దే. వి. ఆటక: చూ, సదనము. 1.
మసోదా, వా. విశ. చిత్తువ్రాసినది: చూ, ముసాయిదా.
మస్కరము, సం. వి. అ. పుం. వెదురు*: చూ, వేణువు.
మస్కరి, సం. వి. న్. పుం. 1: చూ, సన్న్యాసి; 2: చూ, యాచకుఁడు. 1.
మస్టు, దే. వి: చూ, రూ-మసటు.
మస్తకము, సం. వి. ఆ. పుం, న. రూ-మస్తము. తల: చూ, శిరము. 1.
మస్తకి, వా. వి. ఒకరకము మందు.
మస్తము, సం. వి. అ. న: చూ, రూ-మస్తకము.
మస్తరించు, దే. స. క్రి. లోఁబఱచు. కాశీ. 5, ఆ. 236: చేతులప్పళించు.
మస్తరు, దే. వి. 1. లోఁకువ: చూ, వశము. 1; వా. 2. పనివాండ్ర మొత్తముపద్దు.
మస్తి, వై. వి=మదహస్తి. మదించిన యేనుఁగు: చూ, హస్తి.
మస్తిష్కము, సం. వి. అ. న. తలమెదడు: చూ, మెదడు.
మస్తీ, వై. వి. = మదహస్తి: చూ, రూ-మస్తి.
మస్తు, వై. వి. 1.= మత్త. మదము: చూ, హామిక ; దే. వి. 2: సమృద్ధి. 3 మీఁగడ: చూ, స్తన్యము; 4. చదరంగమందు రాజు తరువాత నొక జంతువును ఉంచి యాఁడెడు ఆట.
మస్తువాఁడు, ద్వ. వి. మత్తుఁడు: చూ, సోమారి.
మస్తువు, సం. వి. ఉ. న: చూ, మండము. 1.
మస్థికాస్థి, సం. కపికందుకము. శిరోస్థి: చూ, శల్యము. 1.
మహంతు, దే. వి, దేవస్థానమునకు ధర్మకర్తృత్వము జరిగించు బైరాగి, మఠాధిపతిగానుండుబైరాగి(అనికొందఱు): చూ, సన్న్యాసి.
మహజరు, వా. వి. పెక్కుమందిచేరి వ్రాసికొను ప్రార్థనపత్రము. (పిటీషను, అర్జీ.)
మహజ్జోతులు, వై. వి. బ. దీపభేదము: చూ, స్నేహాశము.
మహతి, సం. వి. ఈ. స్త్రీ. 1. నూఱు తంతులుగల నారదుని వీణ: చూ, వీణె; 2. తెలుఁగు వ్యాకరణమున తిర్యగేతర స్త్రీ వాచకశబ్దములకు సంజ్ఞ; విశ. 3. గొప్పది: చూ, సుర. (3); అం. 4: చూ, తతవాద్యములు,
మహతో నాస్తి పాతకమ్, న్యా. పెద్దలకుఁ బాపమంటదు.
మహత్తత్త్వము, అం; చూ, ఆవరణములు.
మహత్తు, సం. వి. త్, న. 1. దొరతనము: చూ, స్వారాజ్యము. పుం, 2. బుద్ధి తత్త్వము: చూ, స్వభావము; 3 పురుషవాచక శబ్దములకు సంజ్ఞ: పుంలింగము;విశ.4.మహత్త్వమును తెలుపును: అఁట; 5: చూ,మహతి. 3;అం 6: చూ,ఆకాశములు.
మహత్త్వము, సం. వి. అ పుం: ఉదారత్వము. ఔదార్యము.
మహత్సర్గము, అం: చూ, సృష్టిసర్గములు.
మహదాత్మ, అం: చూ, ఆత్మలు.
మహద్భయము, సం. వి. అ. న: చూ, రూ-మహాభయము,
మహనీయుఁడు, సం. విశ. గొప్పవాఁడు: చూ, సన్మానితుఁడు.
మహమహానాఁడు, వా. వి. ఇప్పుడును కాదుగదా ఎల్లప్పుడును (ముందు వెనుకలయందును)
మహము, సం. వి. అ. పుం: చూ, రూ-మహస్సు.
మహర్లోకము, అం: చూ, ఊర్ధ్వలోకములు.
మహలక్ష్మి, అం. చూ, రూ మహాలక్ష్మి (వాడుక.)
మహలయము, వా. సం. వి: చూ, రూ-మహాలయము.
మహర్షులు, అం. 1: చూ, గోత్రము. 13; 2: చూ, ఋషిశ్రేష్ఠులు.
మహలు, వా. వి. 1. దేశములోని భాగము; 2: చూ, రాజమందిరము; 3. ఉప్పుపండు భూభాగము: చూ, భూమి. 1.
మహసూలు, వా. వి. రూ-మహస్సూలు.పంట: చూ, సేద్యము.
మహసూలుదారు, వా. వి: చూ, నాయకవాడి.
మహస్సు, సం. వి. స్. 1. తేజము: చూ. వెలుతురు. 1; 2. ఉత్సవము: చూ, సంబరము. 3.
మహస్సూలు, వా. వి: చూ, రూ-మహసూలు.
మహస్సూలుదారు, వా. వి. చూ, రూ-మహసూలుదారు.
మహాంగము, సం. వి. అ. పుం: చూ, లొట్టిపిట్ట.
మహాకందము, సం. వి. అ. పుం. 1: చూ, వెల్లుల్లి *: 2. దురదకంద *: చూ, సూరణము.
మహాకరంజము, సం.వి,అ.పుం. క్రానుగు *: చూ,శాదఘ్నము.
మహాకాయుఁడు, వా. విశ: చూ, అతికాయుఁడు.
మహాకారము, అం: చూ, లక్ష్యములు.
మహాకారవెల్లము, సం. వి అ. పుం. పెద్దకాఁకర *: చూ, సుషవి. 1.
మహాకాల, సం. వి. ఆ. స్త్రీ: చూ, విషముష్టి *:
మహాకాలుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, శివుఁడు; 2. ఒక శివభటుఁడు.
మహాకాశీమతము, అం: చూ, తంత్రములు
మహాకావ్యము, అం. (అప్పుడప్పుడు కవి చెప్పిన పద్యములు గ్రంథస్థములుగావు.) ఇది సంఖ్యాబద్ధము, అసంఖ్యాబద్ధము అని యిఱుతెఱంగులు. (౧) సంఖ్యాబద్ధము ముక్తకాదికము. ౧.ముక్తకము,౨.ద్వికము, ౩.త్రికము, ౪. పంచరత్నములు,

౮. వారణమాల, ౯. నవరత్నములు, ౧౨. భాస్కరమాలిక, ౧౬. శశికళ, ౨౭. నక్షత్రపంక్తి. ౩౦. త్రింశతి, ౩౨. రాగమాల. ౫౦. పంచాదశ, ౧౦౦. శతకము. ౧౦౮. అష్టోత్తరశతము, ౭౦౦. సప్తశతి; (౨) అసంఖ్యాబద్ధము రగడ, గద్య, ద్విపద, దండక, మంజర్యాదులు. పైని(జెప్పిన లక్షణములుగలది. మహాకావ్యము. (చూ, క్షుద్రప్రబంధము )
మహాకులీనత, అం: చూ, నాయకగుణములు.
మహాకులుఁడు, సం. విణ: చూ, సాధువు. 3.
మహాకోశాతకి, సం, వి. ఈ. స్త్రీ: చూ, పెద్దబీర *:
మహాక్షితి, అం: చూ, సంఖ్యాభేదములు.
మహాక్షోణి, అం.—పై.—
మహాక్షోభము, అం.—పై —
మహాగజాః పలాయంతే మశకానాంతుకాకథా ? న్యా. పెద్ద పెద్ద ఏనుఁగులే పరుగిడుచుండ దోమలమాట చెప్పనేల ?
మహాగణులు, పా. జంగాల గురువులబిరుదు.
మహాజంబువు, సం. వి. ఉ. పుం: చూ, పెద్దనేరేడు *:
మహాజాలి, సం. వి. ఈ స్త్రీ. పచ్చ పువ్వుల ఆవద *: చూ, హ్రస్వగవేధుక.
మహాజ్యోతిష్మతి, సం. వి. ఈ. స్త్రీ. లతావిశేషము: చూ, లత. 1.
మహాఝురసి, సం. వి. ఈ. స్త్రీ: శమల *:
మహాతండువు, సం. వి. ఉ. పుం, ఈ. స్త్రీ. పెద్దతెడ్డు: చూ, హరివాణము (పాత్రము. 6.)
మహాతలము, అం; చూ, అధోలోకములు.
మహాతార, సం. వి. ఆ. స్త్రీ: చూ, మనోరమ. 1.
మహాపిత్త, అక్షిపీడు. మహాపీడ. సం. వి. ఆ. స్త్రీ: అక్షీయనపిక్త.
మహాతిలము, సం. వి. అ. పుం: చూ, పెద్దనువ్వు *:
మహాతుక, సం. వి. ఆ. స్త్రీ. సన్నయేలకి *: చూ, పత్రల.
మహాత్మగుప్త, సం. వి. ఆ. స్త్రీ: చూ, పెద్దదూలగోవెల*.
మహాత్ములు, వా.వి. గొప్పవారు: చూ, హేమాహేములు.
మహాదంతము, సం. వి. అ పుం. ఏనుఁగుదంతము: చూ, పల్లు. 1
మహాదమనము, సం. వి. అ పుం: చూ, రుచి, 5.
మహాదానములు, అం: చూ, దానములు.
మహాదేవతంత్రము, అం: చూ, తంత్రములు.
మహాదేవతలు, అం: చూ, దేవతలు.
మహాదేవుఁడు, సం. వి అ. పుం: చూ, శివుఁడు. 1.
మహాదైత్యుఁడు, సం. వి. అ. పుం, పెద్దతొలివేలుపు: చూ, రాక్షసుఁడు. 1.
మహాద్రోణము, సం వి. అ. పుం: చూ, పెద్దతుమ్మి *:
మహాధనము, సం. వి. అ. న. 1. చిల్లమడ్డి: చూ, సల్లకి; 2. బంగారు: చూ, లోహము. 1; 3. కృషి: చూ, సేద్యము; 4. గొప్పవెలగలబట్ట: చూ, వస్త్రము: 5. గొప్పవెలగల వస్తువు: చూ, సరకు. 2. విణ. 6. గొప్ప వెలగలది.
మహాన్ మహత్యేవ కరోతి విక్రమమ్, న్యా. గొప్పవాఁడు గొప్పవానినే డీకొనును.
మహానటుఁడు, సం. వి. అ. పుం: చూ, శివుఁడు.
మహానరకము, అం: చూ, నరకములు.
మహానసము, సం. వి. అ. న.=పాకనము, వంటయిల్లు: చూ, పచనము. 1.
మహానస శశన్యాయము, న్యా. వంటయింటి కుందేలు ఎక్కడికి పోఁగలదను రీతి.
మహానాదము, అం: చూ, శస్త్రములు.
మహానిధి, అం: చూ, సంఖ్యాభేదములు.
మహానిరయము, అం: చూ, నరకములు.
మహానిశ, సం. వి. ఆ. స్త్రీ. రాత్రియొక్క రెండుమూఁడు జాముల వేళ: చూ, రాత్రి.
మహానీలము, సం. వి. అ. పుం. 1. సింహళ ద్వీపమునందుఁ గలిగిన యింద్రనీలమణి: చూ, రత్నము 1; 2: చూ, భృంగరాజము*.
మహానీలుఁడు, సం.వి.అ పుం. దేవయోనిసర్పము: చూ, సర్పము.
మహాపక్షము, సం. వి. అ. పుం. కన్నెలేడి: చూ, సుగ్రహము.
మహాపథము, సం. వి. అ. పుం. 1. ప్రాణాంతము; 2. రాజమార్గము: చూ, మార్గము. 1; అం. 3: చూ, నరకములు.
మహాపద్మము, అం.1: చూ, నిధులు; 2: చూ, సంఖ్యాభేదములు; 3. దేవయోని సర్పవిశేషము: చూ, సర్పము.
మహాపలంకష, సం. వి. ఆ. స్త్రీ: చూ, పెద్దపల్లేరు*.
మహాపాతకములు, అం. స్వర్ణస్తేయము, సురాపానము, బ్రహ్మహత్య, గురుపత్నీ గమనము, మహాపాతక సహవాసము. (చూ, పంచకము).
మహాపాతక సహవాసము, అం. —పై.—
మహాపారేవతము, సం. వి. అ. పుం: చూ, పెద్దయీత*.
మహాపిండీతకము, సం. వి. అ. పుం: చూ, పెద్దమ్రంగ*.
మహాపీడ, సం. వి. ఆ. స్త్రీ: చూ, మహాతిక్త.
మహాపుత్రజీవి, సం. వి. ఈ. స్త్రీ: చూ, పెద్దమ్రంగ*.
మహాపురాణములు, అం: చూ, పురాణములు.
మహాప్రళయము, సం. వి. అ. పుం. లోకనాశనము, బ్రహ్మకల్పక్షయము: చూ, సంవర్తము. 1. (చూ, కల్పము. 1.)
మహాప్రస్థాన గమనము, అం: చూ, కలియుగ వర్జ్యములు.
మహాప్రాచీరము, సం. వి. అ. పుం: చూ. సముద్రము.
మహాఫల, సం. వి. ఆ స్త్రీ. రాజజంబువు*: చూ, సురభిపత్ర.
మహాఫలము, సం. వి. అ. పుం. పినగుమ్ముడు*: చూ, సర్వతోభద్ర. 1—3.
మహాబల, సం. వి. ఆ. స్త్రీ. ఆవర్తని, చర్మరంగ. (తె.)—గూబతడ, నులితడ; తద్వి.—గాత్రవృక్షము. (తె.)—తడ.
మహాబలము, సం. వి. అ. న. సీసము: చూ, లోహము. 1.
మహాబలుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, వాయువు; 2: చూ, బుద్ధుఁడు; విణ. 3. మిక్కిలి బలముకలవాఁడు: చూ, శక్తుఁడు.
మహాభయము, సం. వి. అ. న. రూ-మహద్భయము. మిక్కిలి వెఱపు: చూ, సాధ్వసము.
మహాభాగ్యము, సం. వి. అ. న. 1. గొప్పసంపద. ''ఆరోగ్యమే మహాభాగ్యము": చూ, సంపత్తి. 1; అం. 2: చూ, నాయకగుణములు.
మహాభూరి, అం: చూ, సంఖ్యాభేదములు.
మహాభైరవము, అం: చూ, తంత్రములు.

మహామాత్రుఁడు, సం వి. అ. పుం. 1. కార్యసహాయుఁడు: చూ, వ్యవహర్త. 2; 2. మావటివాఁడు: చూ, హస్త్యారోహుఁడు; 3: చూ, సంపన్నుఁడు.

మహాముండిని, సం. వి. ఈ. స్త్రీ: చూ, పెద్ద బొడతరము*.

మహామాయాశంబరము, అం: చూ, తంత్రములు.

మహామిద, సం. వి. ఆ. స్త్రీ: అనుధారిణి మహామేద*.

మహాముని, సం. వి. ఇ. పుం: చూ, బుద్ధుఁడు.

మహామూలము, సం. వి. అ. పుం: చూ, పెద్దముల్లంగి*: చూ, ముల్లంగి.

మహామృగము, సం. వి. అ. పుం. ఏనుఁగు: చూ, హస్తి.

మహామేద, సం. వి. ఆ. స్త్రీ: చూ, మహామిద*.

మహాయజ్ఞములు, అం. (చూ, యజ్ఞములు; చూ, పంచకము) బ్రహ్మ, దేవ, భూత, పితృ, మనుష్య యజ్ఞములు. (ఇంకను జ్యోతిష్టోమాది యజ్ఞములును గలవు).

మహాయమళపత్రిక, సం వి ఆ. స్త్రీ. ఊడు: చూ, అంకోడము-అంకోటము-అంకోలము.

మహారంభ, సం. వి. ఆ. స్త్రీ పచ్చయరఁటి*: చూ, రంభ. 2.

మహారజతము, సం. వి. అ. న. బంగారు: చూ, లోహము. 1.

మహారజనము, 1. —పై.—; 2. కుసుమపువ్వు: చూ, వహ్నిశిఖము. 2.

మహారణ్యము, సం. వి. అ. న: చూ, పేరడవి.

మహారథుఁడు, సం వి అ. పుం. 1. పదునొకండు వేలమంది విలుకాండ్రతోఁ బోరెడి యోధుఁడు. తనను సారథిని గుఱ్ఱములను కాపాడుకొనుచు పోరెడియోధుఁడు (అని కొందఱు) (చూ, భటుఁడు): చూ, హంపీరుఁడు; విణ. 2. గొప్పరథము గలవాఁడు.

మహారాజికులు, అం: చూ, గణదేవతలు.

మహారాజు, సం వి అ. పుం. 1: చూ, బుద్ధుఁడు; 2. చక్రవర్తి: చూ, రాజు. 1.

మహారాజులు, అం: గయుఁడు, అంబరీషుఁడు, శశిబిందువు, అనంగుఁడు, పృథువు, మరుత్మంతుఁడు, మరుత్తు, సుహోత్రుఁడు, పరశురాముఁడు, శ్రీరాముఁడు, దిలీపుఁడు, నృగుఁడు, రంతిదేవుఁడు, యయాతి, మాంధాత, భగీరథుఁడు. (16) (చూ, రాజు. 1.)

మహారాత్రము, సం. వి. అ. పుం. అర్ధమరేయి: చూ, రాత్రి.

మహారాష్ట్రఘూర్జరి, అం: చూ ఘూర్జర్యుపాంగములు (అంగము. 9.

మహారాష్ట్రబ్రాహ్మణులు, అం. (మహారాష్ట్రులు): చూ, బ్రాహ్మణులు. (ఘూర్జరదేశమునకు దక్షిణముననను, కన్నడదేశమునకుత్తరముననను, ఆంధ్రదేశమునకు పశ్చిమముననను నుండు దేశము మహారాష్ట్రదేశము. ఈ దేశమున ప్రచారముగల భాషయు మహారాష్ట్రమే. ఆ దేశమందలి బ్రాహ్మణులు మహారాష్ట్రులనంబడుదురు).

మహారాష్ట్రము, అం: చూ, దేశములు.

మహారాష్ట్రస్త్రీ, అం. మహారాష్ట్ర దేశపు ఆఁడుది: చూ, స్త్రీ.

మహారాష్ట్రుఁడు, సం. వి. అ. పుం.=మరాటి-మరాటీ, మరాటివాఁడు-మరాటీవాఁడు, ఆరె.

మహారౌరవము, అం: చూ, నరకములు.

మహాలయము, వా సం. వి: చూ, మాలయము "మహాలయ అమావాస్య".

మహాలక్ష్మి, సం. వి. ఈ. స్త్రీ. మహాలక్ష్మి (వా.) 1: చూ, సరస్వతి; 2 కర్ణునిపెంపుడుతల్లి: చూ, రాధ. 2: 3. నారాయణశక్తి. తద్విశేషములు-గ్రామదేవతలు. ౧. (తె.)-అంకమ్మ-అంకాలమ్మ—అంకు: ౨. (తె.)—అసిరమ్మ; ౩. (తె.)—ఉప్పాలమ్మ; ౪ (సం.)—ఊతి; ౫. (తె.)-ఎఱ్ఱపోతమ్మ; ౬. (తె.)—ఎఱ్ఱమారికమ్మ; ౭. (తె)—ఎల్లమ్మ; ౮. (సం.)—కనకదుర్గ; ౯. (సం.)—కిరీసుత; ౧౦. (తె.)—కాశెట్టి-కాశేటి; ౧౧. (సం.)—కామేశ్వరి; ౧౨. (సం.)—కాళిక-కాళిక; ౧౩. (సం.)—కులాంకుర; ౧౪. (తె.)—గంగనమ్మ—గంగమ్మ—గంగానమ్మ; ౧౫. (తె.)-గంటలమ్మ-గంటాలమ్మ; ౧౬. (తె)-గొంతెమ్మ-గొంతేనమ్మ-గొంతేలమ్మ; ౧౭. (తె.)-గొట్టాలమ్మ; ౧౮. (మి.)—ధనమ్మ; ౧౯. (తె)-నూకాలమ్మ; ౨౦. (తె.)-పల్లకమ్మ; ౨౧. (తె. —పళ్లాలమ్మ; ౨౨. (తె.)-పసుపులమ్మ; ౨౩. (తె.)—పెద్దింటమ్మ; ౨౪. (తె.)—పోలక-పోలకమ్మ; ౨౫. (తె.)-పోలేరమ్మ-పోలేరు; ౨౬.(సం.) మారి; ౨౭. (మి.)—మరిడిమహాలక్ష్మి; ౨౮. (తె.)—మరిడెమ్మ-మారెమ్మ; ౨౯. (తె.)-అమ్మవారు, అమ్మోరు, ఆటలమ్మ-ఆట్లమ్మ, పొంగులమ్మ; ౩౦ (తె.)-ముత్యాలమ్మ; ౩౧. (తె.)-ముసుళ్లమ్మ; ౩౨. (సం.)—మూలదేవి, మూలభద్ర; ౩౩. (తె.)-మొగదారమ్మ; ౩౪, (సం.)-శ్యామలాంబ; ౩౫. (తె.)—సోమాలమ్మ మొ. (మిగతవానికి "చూ, సోమాలమ్మ"); వా. 4. లచ్చి: చూ, లక్ష్మి. 1.

మహావాతగజన్యాయము, న్యా. గొప్పగాలిలో నేనుఁగులే కొట్టుకొని పోవుచుండఁగా నిఁక యల్పజంతువుల లెక్కయేమిటనురీతి.

మహావాతము, సం. వి. అ. న. 1. గాలితోఁగూడిన పెద్దవాన; చూ, వాన. 1; వా. 2. చచ్చువాతము. (చంపివేయునది)

మహావాద్యములు, అం. భేరి, కాహళము, పటహము, శంఖము, జయఘంట. (5). (చూ, వీణ.)

మహావార్తాకి, సం. వి. ఈ. స్త్రీ: చూ, పెద్దములక. *.

మహావిద్యలు, అం. వేదములు ౪, ఉపవేదములు ౪, అంతరంగవిద్యలు ౪, బహిరంగ విద్యలు ౬=మొత్తము ౧౮. (ఈ మహావిద్యలవలన ౪౬ ఉపవిద్యలుగలిగి అన్నియు ౬౪ విద్యలయ్యె. ఈ ఉపవిద్యలయందొక్కొక్క దానియందవాంతర భేదములును గలిగియుండునట్టి శిక్షాది ఉపవిద్యలను 414 పొరటలో "ఉపవిద్యలు" అనుశబ్దముకడఁ జూచుకొనవలెను.)

మహావీర్యుఁడు, సం. వి. అ. పుం. చూ, బుద్ధుఁడు.

మహావ్రతము, అం: చూ, తానములు (చూ, రిహీనతానములు)

మహావ్రతి, సం. వి. న్. పుం: ఉరస్కటుఁడు, జోటింగుఁడు, పంచవటుఁడు, బాలయజ్ఞోపవీతుఁడు.

మహాశంఖము, సం. వి. అ. న. 1. నొసలు; చూ, లలాటము; 2. మనుష్యునియెముక: చూ, శల్యము. 1; అం. 3: చూ, సంఖ్యాభేదము.

మహాశతావరి. సం. వి. ఈ. స్త్రీ. పెద్దపిల్లిపీచర *: చూ, శతావరి.
మహాశయము, సం. వి. అ. పుం: చూ, సముద్రము:
మహాశయుఁడు, సం. వి. అ. పుం: 1: చూ, సముద్రము; విణ. 2. గొప్ప యభిప్రాయముగలవాఁడు.
మహాశూద్రి, సం. వి. ఈ. స్త్రీ. 1. గొల్లది: చూ, వ్రేత; 2. గొల్లవానిభార్య: చూ, ఆభీరి. 2. (చూ, భార్య.)
మహాశూద్రుఁడు, సం. వి అ. పుం ఎక్కిగొల్ల: చూ, వ్రేఁడు.
మహాశ్యామ, సం. వి. ఆ. స్త్రీ: జంతుకారి *: చూ, సుంలి.
మహాశ్రావణిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, మహాముండిని *:
మహాశ్రీ, సం వి. ఈ. స్త్రీ. బౌద్ధదేవి: చూ, బుద్ధుఁడు.
మహాశ్వగంధ, సం. వి. ఆ. స్త్రీ: చూ, పెద్దపెన్నేరు *:
మహాశ్వేత, సం. వి. ఆ. స్త్రీ : నల్లనేలగుమ్మడు *: చూ, సర్వతోభద్ర.
మహాసంమోహనము, అం: చూ, తంత్రములు.
మహాసర్పము, సం. వి. అ. పుం. పెద్దపాము (సర్పరాజు): చూ, సర్పము.
మహాసహ, సం. వి ఆ. స్త్రీ : చూ, మాషపర్ణి *: 2. చూ, గొజ్జంగ *: 3; చూ, పెద్దగోరంట *: (అమ్లానము, అధికమైన సమ్మర్దమును సహించునది)
మహాసుఖుఁడు, సం. వి. అ. పుం: చూ, బుద్ధుఁడు.
మహాసూపపర్ణి, సం. వి. ఈ. స్త్రీ: పిల్లపెసర *: చూ, పెసర.
మహాసేనుఁడు, సం. వి. అ. పుం: 1. కుమారస్వామి: చూ, స్కందుఁడు; విణ. 2. గొప్పసేనగలవాఁడు: చూ, సైనికుఁడు.
మహాస్రగ్ధర, అం: చూ, వృత్తము. 1. ("స, త, త, న, స, ర, ర గురువులు. 9-16 యతులు. 22వ ఛందస్సు.")
మహాస్థానము, సం. వి. అ. న: చూ, పేరోలగము.
మహి, సం. వి. ఇ. ఈ. స్త్రీ: 1. పుడమి. చూ, భూమి. 1; 2. ఆవు: చూ, ధేనువు.
మహిక: సం. వి. ఆ. స్త్రీ : (రూ-మిహిక: హిమిక): చూ, హిమము.
మహితము, సం. వి, అ. న. 1. శివునిశూలము: చూ, హేతి (బాణము. 1-రాశి.); విణ. 2. గొప్పది: చూ, సుర (3); 3. పూజ్యము: చూ, సత్తు. 4.
మహిమ, సం. వి. న్. పుం. 1. గొప్పతనము: చూ, యోగ్యత; అం. 2, ఒక ఐశ్వర్యము: చూ, సిద్ధులు (విభూతులు.)
మహిమము,—పై.—
మహిరుఁడు, సం. వి. అ. పుం. (రూ - మిహిరుఁడు). చూ, సూర్యుఁడు.
మహిషము, సం. వి, అ. పుం. 1. (బలముగలదౌటవలన నాదరింపఁబడునది): అనూపము, కక్షము, కటాదము, కలుషము, కాలితనయము, కాసరము. కృష్ణము, కృష్ణశృంగము, కోణము, క్రోధము, గజచ్ఛాయము, గద్గదస్వరము, జిడాత్మ, జరంతము, రక్తాక్షము, రజస్వలము, లులాయము, వాహద్విషము, సైరిభము. (తె).— ఎనుపోతు, కారెనుపోతు, జముసెక్కిరింత, దుంత, దున్న, దున్నపోతు, పోతు; తద్వి—౦. కోడె ఎనుపోతునకు—(తె).— కుట్టి, కోడియ-కోడె, కోడెదూడ: (చూ, వృషభము); ౨. నల్ల ఎనుపోతునకు.— గవలము. (మిండవానికి "చూ, వైరిభము."); అం. 2: చూ, గతులు; ; చూ, దిక్పాలవాహనములు.
మహిషవాహనుఁడు, సం. వి అ. పుం. పోతురౌతు: యముఁడు చూ, హరి. 5.
మహిషాక్షము, సం వి అ, పుం. కాలాసము *:
మహిషి, సం. వి. ఈ. స్త్రీ. 1. పట్టపుదేవి: చూ, రాణి 1; 2. బర్రె: చూ, హేరంబము; 3 ఒకానొకచెట్టు: చూ, వృక్షము.
మహిషీప్రసవోన్ముఖి మహిషాయుపనాటుటి, న్యా. "గేదె ఈనవున్నది. దున్నపోతు దానిపై నెక్కియున్నది.
మహిషాక్షి సం. వి. ఈ. స్త్రీ: గుగ్గులపు ఉదూఖలము. జంబుకము. టుండురిము, పలంకష. (తె.—గుగ్గిలపుచెట్టు, గుగ్గిలము *:
మహిషులు, అం శ్రీకృష్ణుని అష్టమహిషులు, (భద్రపోనగువారు)
మహిళ, సం. వి. ఆ స్త్రీ: రూ - మహేల. 1. ఆఁడుది. (24 ఏండ్లుగల ఆఁడుది): చూ, స్త్రీ; 2. ప్రేంకణము *: చూ, సన్నకదుపు.
మహీక్షితుఁడు, సం. వి. త్. పుం. 1. పుడమిఱేఁడు: చూ, రాజు. 1; 2 ఱేఁడు: చూ, రాజు 1.
మహీధ్రము, సం. వి. అ. పుం. పుడమితాలుపు: చూ, పర్వతము.
మహీనతానములు, అం: (చూ, తానములు) ఇడ, పురుషమేధము, శ్వనము, వజ్రము. ఇషువు అంగిరిస్సు, కింతిము 7).
మహీరుహము, సం. వి. అ. పుం. పుడమిపుట్టు: చూ, వృక్షము.
మహీలత, సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱగండూపదము. చూ, సర్పము.
మహీసుత, సం. వి. అ. స్త్రీ. భూమిజ: చూ, సీత. 1.
మహీసుతుఁడు, సం. వి. అ. పుం. 1. అంగారకుఁడు: చూ, వక్రుఁడు; 2. నరకాసురుఁడు. కుజుఁడు, భూమిజుఁడు, భౌముఁడు. (తె).- నేలపట్టి, పుడమిపట్టి.
మహేంద్రగిరి, అం: చూ, లింగములు.
మహేంద్రజాలము, అం, 1: చూ, కళలు; 2: చూ, అవాంతరములు; వి. 3. గారడీవిద్య: చూ, మాయము. 1.
మహేంద్రము, అం. కులపర్వతములలో నొకటి: చూ, పర్వతము. (చూ, కులపర్వతములు.)
మహేంద్రి, సం. వి. ఈ. స్త్రీ. బొంతఁరటి *: చూ, రంభ. 2.
మహేంద్రుఁడు, సం. వి. అ. పుం. ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు.
మహేచ్ఛుఁడు, సం. విణ. గొప్పయభిప్రాయముగలవాఁడు.
మహేరణ, సం. వి. ఆ, స్త్రీ. అందుగు *: చూ, సల్లకి.
మహేశ్వరుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, శివుఁడు; 2. గొప్పప్రభువు: చూ, స్వామి. 1; అం. 3: చూ, మూర్తులు.
మహోక్షము, సం. వి. అ. పుం: ఆఁబోతు: చూ, వృషభము 1.
మహోత్పలము, సం. వి. అ. న. తామర: చూ, సహస్రవ్రతము.
మహోత్సాహుఁడు, సం. విణ. అద్భుతకార్యారంభము కలవాఁడు.
మహోదయము, సం. వి. అ. న. 1: చూ, కన్యాకుబ్జము. 2. పుం; 2. ఆధిపత్యము: చూ, స్వారాజ్యము: 3. అభివృద్ధి: చూ, హెచ్చు, 2; 4: చూ, మోక్షము. 1.
మహోదరము, సం. వి. అ. పుం. ఒకరోగము; చూ, రోగము. 1.
మహోద్యముఁడు, సం. విణ. మహోత్సాహుఁడు.

మహౌషధము, సం. వి. అ. న. 1. అతివస *: చూ, విష; 2: చూ, వెల్లుల్లి*: 3. రూ-మహౌషధి ఉషణము: చూ, సొంటి.
మహౌషధి, సం. వి. ఈ. స్త్రీ: చూ, మహౌషధము. 3.
మళయాళస్త్రీ, అం. మళయాళదేశపు ఆఁడుది: చూ, స్త్రీ.
మళయాళము, అం. మళయాద్రి చుట్టునుగల దేశము: చూ, దేశములు.
మళిగ, వై. వి. అంగడి. రూ-మళిగె: చూ, సదనము. 1.
మళిగె, వై. వి.—పై.—
మళ్ళా, వా. వి. మరల, తిరుగ, మళ్లీ.
మళ్ళించు, వా. ప్రే: రూ-మల్లించు: చూ, రూ-మలుపు. 3.
మళ్ళీ, వా. వి: చూ, రూ - మళ్లా.
మళ్ళు, వా వి: బ. 1. పరిమళ్ళు; దే. అ. క్రి. రూ - మరలు: చూ, వట్రిల్లు.

# మా

మా, సం. వి. అ. స్త్రీ. 1: చూ, లక్ష్మి. 1; వై. విణ. (1) = మహత్. మిక్కిలి. "మాబాగాయె.": చూ, మఱిమఱి; దే. అవ్య. (2) బళిరె. నై. 6, ఆ. 95: చూ, సెబాసు: స. బ. (3) మాయొక్క. "మారాజ్యము."
మాంగల్యము, సం. వి. అ. న. 1. మంగళత్వము; 2: చూ, తాళిబొట్టు. 1: 3; చూ, తాళిబొట్టు. 2.
మాంగళి, అం, 1: చూ, పంచమజభాషలు; 2: చూ, మాళవకైశికిజభాషలు.
మాంజిష్ఠము, సం. వి. అ. న. 1. ఎఱుపుమించిన పసుపువన్నెగలచీర: చూ, వస్త్రము; పుం. 2. ఎఱుపుమించిన పసుపువన్నె: చూ, వర్ణము. 6; 3. = మంజిటి *: చూ, సమంగ. 1; విణ. 4. ఎఱుపుమించినపసుపువన్నెగలది: చూ, వర్ణము 6
మాండూక్యము, అం: చూ, ఉపనిషత్తులు.
మాంత్రికుఁడు, సం. వి. అ. పుం: కాలింగుఁడు. కాళింగుఁడు, మంత్రజ్ఞుఁడు, మంత్రవాది, మంత్రికుఁడు - మాంత్రికుఁడు. (తె) అంజనికాఁడు, అంజనకాఁడు.
మాంధాత, అం: చూ, మహారాజులు (రాజు. 1.)
మాందాళి, దే. వి. 1. రవా-రవాయి. "మాందాళిపచ్చ.": చూ, రత్నము. 1; 2. బచ్చుపట్టుచీర. పంచ. వేం, 4, ఆ. 342: చూ, వస్త్రము.
మాందిలవము, సం. వి. అ. పుం. పెద్దకూఁకటిమూఁగ: చూ, భృంగరాజము. 3.
మాంద్యము, సం. వి అ. న.=మయిదు. ఆలస్యము: చూ, విలంబము. 1; 2. = మయిదు: చూ, రూ-మయికము.
మాంసం మాంసేనవర్థతే, న్యా. మాంసముమాంసముచేవర్ధిల్లును.
మాంసభక్షకుఁడు, సం. వి: అ. పుం: క్రవ్యాత్తు-క్రవ్యాదుఁడు, క్రవ్యాశి.
మాంసము, సం. వి. అ. న. 1. పొలసు. (మాంసమునకును ఇందుల విశేషములకును గల పర్యాయపదములకు "చూ, శుక్తము. 2." అం. 2: చూ, ధాతువులు.
మాంసలుఁడు, సం. విణ. 1. బలిసినవాఁడు: చూ, శక్తుఁడు; 2; బలిమిగలవాఁడు: చూ, బలుఁడు. 4. (చూ, శక్తుఁడు.)
మాంసోదని, సం. వి. ఈ. స్త్రీ: అగ్నిదుహా*.
మాంసాశనుఁడు, సం. విణ: చూ, మాంసాహారి.
మాంసాహారి, సం. విణ: మాంసాశనుఁడు. (తె).— కాచుమేపరి, పొలసుదిండి.
మాంసి, సం. వి. ఈ. స్త్రీ. 1. (మాంసమువంటి అవయవములుగలది.): అంబార్థవాచక, ఆమిషి, కాలిక, కృష్ణజట, కేశి, కోలవస, గంధమాంసి, గోలోమి, జట, జటామాంసి, జటిల, తపస్విని, పిశాచి, పిశిత, భూతకేశము, మిసి, లోమశ *: (చూ, లోమశ.); 2. కా రు కొ ల్లి *: చూ, వాయసోలి.
మాంసికుఁడు, సం. వి. అ. పుం: చూ, సంహారకుఁడు.
మాఁకు, దే. వి. రూ-మ్రాఁకు. మ్రాను: చూ, వృక్షము.
మాఁగాయ, దే. వి. (మావి + కాయ) 1. మామిడికాయ; వా. 2. మామిడికాయ పొప్పరగిఁచి రెండువైపులను తఱిగి ఉప్పుతో ఊరంబెట్టిన ఊరఁగాయ: చూ, రుచిఁగాయ,
మాఁగు, దే. వి. 1; చూ, మలినము. 1: 2: చూ, రూ-మంగు హరి. పూ. 5, ఆ. 120; అ. క్రి. 3: కనియు, కమియు, మదురు.
మాఁగుడు, దే. వి. 1, నలుపు: చూ, వర్ణము. 6; 2, కసటు: చూ, మాఁగు. 1; వా. 3. మబ్బు. "ఆకాశము మాఁగుడు గానున్నది.": చూ, మేఘము. 1.
మాఁగుడువాఱు, దే. అ. క్రి. (మాఁగుడు + పాఱు) (రూ— మాఁగువడు-మాఁగువాఱు.) మాయ. ప్రభా. 5, ఆ. 57: చూ, మలినమగు.
మాఁగువడు, ద్వ. అ. క్రి. (మాఁగు + పడు.) —పై.— మార్క. 1, ఆ. 169.
మాఁగువాఱు, దే. అ. క్రి. (మాఁగు + పాఱు) —పై.— ఉ, హరి. 6, ఆ. 157.
మాఁటినంగ, దే. వి. (మాఁటిన + నంగ) కాముకి. కాశీ. 3, ఆ. 62; కాశీ. 3. ఆ. 171: చూ, స్త్రీ.
మాఁటు, దే. వి. 1. కాంక్ష: చూ, వాంఛ; 2: చూ, మాఁతు; అ. క్రి. 3. తగులముగొను: చూ, మాఁటువడు.
మాఁటుమడఁగు, దే. అ. క్రి. జంజాట ముడిగి నిశ్శబ్దమగు. (రూ-మాఁటుమడుఁగు-మాఁటుమణఁగు-మాఁటుమణుఁగు.)
మాఁటుమడుఁగు, —పై.—
మాఁటుమణఁగు, —పై.—
మాఁటుమణుఁగు, —పై.—
మాఁటువడు, ద్వ. అ. క్రి: చూ, వాంఛించు.
మాఁడించు, దే. ప్రే: మాఁడుచు.
మాఁడు, దే. వి. 1: చూ, దగ్ధిక; 2. ఇంటి యొకభాగపు కప్పు: చూ, సదనము. 1; అ. క్రి. 3: చూ; దగ్ధమగు.
మాఁడుచు, దే. ప్రే. మాడఁజేయు. రామా. 7, ఆ. 242: మాఁడించు.

మాఁడె, వై. వి. 1: చూ, రూ-మండెము; 2: చూ, వాయసోలి*.
మాఁడెము, వై.వి. రూ-మండెము. మండలాధిపతులు భూమండలము. స్వా. 1, ఆ. 37: చూ, రూ-మండెము.
మాఁతు, దే. వి. చతురంగపు ఆటయందు బంటులోఁగాక తక్కినవానితో రాజునుగట్టుట: మాఁటు.
మాకందము, సం. వి అ. పుం: చూ, మామిడి*. (దీనికి దోహదక్రియ కరస్పర్శము).
మాకరి, వై. వి.=మాలాకర: చూ, రూ-మాలకరి.
మాకలి, సం. వి. ఇ. పుం: చూ, రూ-మాతలి.
మాకొను, దే. స. క్రి. కాటుచేయు. హరిశ్చ. 5, ఆ. 46. కఱచు, కొఱుకు.
మాక్షికము, సం. వి. అ. న. 1. తైలవర్ణముగల తేనె: చూ, సారఘము; అం. 2: చూ, మధువులు.
మాఖము, సం. వి. అ. పుం: చూ, రూ-మాఘము.
మాగధి, సం. వి. ఈ. స్త్రీ. 1. అడవిమొల్ల*: చూ, యూధిక; 2: చూ, పిప్పలి*; 3: చూ, ప్రాకృతభాషా భేదములు; అం. 4: చూ, వ్యాకరణము; 5: చూ, భాషలు.
మాగధుఁడు, సం. వి. అ. పుం: మగధుఁడు, మధుకుఁడు.
మాగాణి, దే. వి. 1: చూ, నంజ; 2: చూ, దేశము.
మాగాని, —వై.—
మాగిలి, దే. వి: చూ, దేశము.
మాగుళ్లకట్టు, వా. అ. క్రి. మట్టితో దళసరియెక్కు.
మాఘము, సం. వి. అ. పుం. 1. మాఘమాసము: చూ, మాసము. 1; అం. 2: చూ, కావ్యములు.
మాఘుఁడు, అం. (ఇతఁడు శిశుపాలవధ వ్రాసెను) చూ, కావ్యనాటకములు.
మాఘ్యము, సం. వి. అ. న: చూ, మొల్ల*.
మాచి, సం. వి. ఈ. స్త్రీ. 1. కాఁచి*: చూ, వాయసి. 1; దే. వి. (1): చూ, మాచిపత్రి*.
మాచిక, సం. వి. ఆ. స్త్రీ. అంబాలిక, అంబష్ఠ*.
మాచిపత్తిరి, ద్వ. వి: చూ, రూ-మాచిపత్రి*.
మాచిపత్రి, ద్వ. వి: చూ, స్థౌణేయము. 2.
మాచెనపక్కె, దే. వి: చూ, మత్స్యము. 1.
మాచకమ్మ, ద్వ. వి. (మాచ+అక+అమ్మ). రూ—మాసకమ్మ: చూ, పోట. 1.
మాజుం, వా. వి. గంజాయి, (బెల్లము మొదలగునవి చేర్చి సిద్ధముచేసిన మత్తువస్తువు).
మాట, దే. వి. 1. పలుకు: చూ, శబ్దము. 2; 2. వచనము: చూ, శబ్దము. 2; 3: చూ, వార్త. 1; 4: చూ, నింద. 1; 5. చూ, నింద.6. ప్రతిజ్ఞా వచనము: చూ, శబ్దము. 2; 7. పిలుపు: "ఏమందోయి సత్యంగా మామాట"
మాటకాఁడు, దే. విణ. (రూ-మాటకారి-మాటలమారి): చూ, వాచాటుఁడు.
మాటకారి, దే. విణ. 1: చూ. వాగ్మి; 2: చూ, వాచాటుఁడు.
మాటతప్పుట, వా. వి వాగ్దత్తము నెఱవేర్చకపోవుట.
మాడతేడా, వా. వి: తేడామాట. (సం.)— ఇ.
మాటదాఁటనివాఁడు, దే. విణ: చూ, విధేయుఁడు.
మాటపట్టింపు, జా. వివాదము. "మాటపట్టింపుఁబట్టి" (రసికజన మనోరంజనము).
మాటయిచ్చుట, జా. కరారుచేయుట. "తమ యంకారాట్ప పట్టాభిషిక్తుని గావింపఁగ మాటయిచ్చి". (రామాభ్యుదయము
మాటలమారి, దే విణ: చూ, వాచాటుఁడు.
మాటలల్లుట, వా. వి: కయిత-కయితము-కైత-కైతము. గుడి, గుదికూర్పు. (సం)—కవిత్వము. గద్యము, గుంఫనము — గుంఫనము—గుంఫము, గ్రంథనము, వచనము. (ఇది చతుర్విధము—౧. ఆశుకవిత్వము, ౨. బంధకవిత్వము, ౩. గర్భకవిత్వము, ౪. చిత్రకవిత్వము). తద్వి —౧. రెండు భాషలు కలిసిన కవిత్వమునకు—(సం.)—మణిప్రవాళము; ౨: (చూ, అవధానములు); ౩. గణపాదరహిత కవిత్వము-(సం.)—గద్యము, చూర్ణకము-చూర్ణి-చూర్ణిక, సత్తువ; ౪. గద్యపద్యాది సందర్భము. (సం.)—గ్రంథనము.
మాటలల్లువాఁడు, వా. వి: కవి. ఆధీకుఁడు.
మాటలు చెవినినాటుట, జా. తెలియునట్లు దృష్టాంతముగాఁ జెప్పుట. "ఏవియో నాలుగుమాటలు నీ చెవినాటఁ బూనుకొన్నాఁడు", (ధర్మజ రాజసూయము).
మాటవరుసకు, జా. సంగతి తెలియుటకు. "నీవు కల్లు త్రాగుదువని మాటవరుసకు అన్నాఁడు.
మాటాడు, దే. అ. క్రి. 1. పలుకు: చూ, వచించు; స. క్రి. 2. అను : చూ, వచించు.
మాటికి, దే. ద్ర. 1 : చూ, రూ-మాటిమాటికి; 2: చూ, వెండియు.
మాటిమాటికి, దే. ద్ర. ముహూరర్థకము: చూ, శశ్వత్తు. 1.
మాటు, దే. వి. 1: చూ, మఱుఁగు. 1; 2 : చూ, వెండియు; 3.వేఁటకాని దాఁగుడుపల్లము: అనుపు.(సం.)-ఉపాయము: చూ, రంధ్రము. 1; 4: చూ, టంకపుపొడి; స. క్రి. 5: చూ, మఱుఁగుపెట్టు; 6. అతికించు: చూ, సంధించు 3.
మాటువడు, ద్వ. అ. క్రి: చూ, మఱుఁగుపడు.
మాఠరుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, దండుఁడు; 2: చూ, వ్యాసుఁడు.
మాడ, దే.వి.1.పణదశకము; 2. అరవరా: చూ, సువర్ణము.2.
మాడపట్టు, దే వి: చూ, సోడు.
మాడి, దే. వి. అడవియులవ*: చూ, వాయసోలి.
మాడికి, దే. ద్ర. రూ-మాడ్కి: చూ, విధము. 1. (ఇది నేఁటిగా ప్రయోగింపఁ బడదు. "అమ్మాడికి, ఇమ్మాడికి, చెప్పినమాడికి" మొ.); వి. 2. ఉపమా వాచకము. (చూ, ఉపమ. 2.)
మాడు, దే. అ. క్రి. 1. మెలయు : చూ, వర్తించు; వా. 2. అడుగంటు.
మాడుగు, వై. వి =మాలికా. (రూ మాడువు). 1. మేడ: చూ, సదనము. 1; 2. రాజగృహము: చూ, సదనము. 1.
మాడువు, వై. వి =మాలికా. —వై.— (మేడకు.-మార్క. 2, ఆ. 292).

మాదె, వై. వి.=మండల. (రూ-మాదెము): చూ, మన్నెము.

మాదెము, —వై—

మాడ్కి, దే. ద్ర: రూ-మాడికి

మాడ్పు, దే. వి. ఒకానొకచెట్టు: చూ, వృక్షము.

మాణవకము, సం. వి. అ. పుం. ఇరువదిపేటల మణిహారము: చూ, భూషణము. 2.

మాణవకుఁడు, సం. వి. అ. పుం. (మనువుయొక్క- అల్పమైన అపత్యకము) బాలకుఁడు: చూ, శిశువు.

మాణవ్యము, సం. వి. అ. న. బాలురగుంపు: చూ, శిశువు.

మాణిక్యము, సం. వి. అ. పుం. 1.= మానిక. కెంపు. (దీనికి సింహళము, కాలపురము, ఆంధ్రము, తుంబురము ఇవి నాలుగు జన్మదేశములు, సింహళమునందు పుట్టిన కెంపు రక్తవర్ణముకలది. అది పద్మరాగము. అది ఉత్తమము; కాలపురమునందు పుట్టినది పసుపుదాళకలది. అది కురువిందము. అది మధ్యమము; ఆంధ్రమునందు పుట్టినది అశోకపు చిగురుదాళగలది. అది సౌగంధికము. అదియు మధ్యమము. తుంబురమునఁ బుట్టినది నీలపు దాళగలది. అది నీలగంధి. అది అధమము): చూ, రత్నములు; (చూ, రత్నము. 1.)

మాణితము, సం. వి. అ. న: చూ, రూ-మణితము. 1—2.

మాణిబంధము, సం. వి. అ. న. రూ-మాణిమంధము. సైంధవ లవణము: చూ, లవణము. 1.

మాణిమంధము, సం. వి. అ. న: చూ, రూ-మాణిబంధము.

మాత, సం. వి. ఋ. స్త్రీ. 1. (గర్భమీమె యందిమిడి యుండును): అంబాలిక, అంబ, అంబిక, అక్క, అత్త, ఆర్య, ఇజ్య, ఈ, జనని, జనయిత్రి, జాము, జ్యా, త్రాయంతి, ధాత్రి, ప్రసుపు, మాతృక, సవిత్రి. (తె.)—అప—అప్ప, అమ-అమ్మ, అవ-అవ్వ, కన్నది, తలి-తల్లి, తాయి; తద్వి.- ౧. అనుకులతల్లికి—దితి; ౨. ఉపమాతకు, అంకపాలి—అంకపాళి, ఉపమాత, ధన్య, ధాత్రి, మాతృక. (తె.)—దాది-దాదిలి; ౩. దేవతల తల్లికి—అదితి, ఋ; ఋనామ, ఋూ, ౫. కరవీరి, దేవమాత; ౪. ధృతరాష్ట్రుని తల్లికి—అంబిక ; ౫. పినతల్లి (తల్లి చెల్లెలు, పినతండ్రి భార్య)కి. (తె.)—పినతల్లి, పిన్నమ్మ, పిన్ని; ౬. రాక్షసులు తల్లికి.—నికష; ౭. శ్రీకృష్ణుని తల్లికి—దేవకి. (తె.)—దేకి; ౮. వ్యాసుని తల్లికి—సత్యవతి. (మిగతవానికి చూ, సవిత్రి.1.); బ. 2. బ్రాహ్మ్యాది: చూ, మాతృకలు; 3. చూ, లక్ష్మి. 1; 4: చూ, పార్వతి; 5. నేల : చూ, భూమి. 1; 6. ఆవు : చూ, సౌరభేయి (ధేనువు); పుం. 7: చూ, కొలగాఁడు; అం. బ. 8: చూ, మాతలు.

మాతంగజాతి, అం: చూ, జాతులు.

మాతంగము, సం. వి. అ, పుం. ఏనుఁగు: చూ, హస్తి. 1.

మాతంగి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, హైమవతి (పార్వతి); 2. వశిష్ఠునిభార్య: చూ, భార్య.

మాతంగుఁడు, సం. వి. అ. పుం.=మాదిగ: రూ-మతంగుఁడు: చూ, మాదిగ.

మాతగొరక, దే. వి: చూ, మత్స్యము. 1.

మాతరపితలు, సం వి.ఋ.పుం.ద్వి: రూ-మాతాపితలు, పితలు.

మాతరిశ్వుఁడు, సం. వి. న్. పుం. గాలి: చూ, వాయువు. 1.

మాతలి, సం. వి. ఇ. పుం: రూ-మాతలి. ఇంద్రుని సారధి:

మాతలు, అం.1: చూ, మాతృకలు; 2: రాజుభార్య, అన్నభార్య, గురుభార్య, తనతల్లి, భార్యతల్లి (5) (చూ, పంచకము).

మాతాపితలు, సం వి. ఋ. పుం. ద్వి: చూ, రూ-మాతరపితలు.

మాతాబి, దే. వి. జలతారు, జరబాజు: చూ, వస్త్రము.

మాతామహుఁడు, సం. వి. అ. పుం: (తె.)—అమ్మయ్య, తల్లితండ్రి. తాత.

మాతామహి, సం. వి. ఈ. స్త్రీ: (తె.)—అమ్మమ్మ, తల్లితల్లి.

మాతుల, సం. వి. ఆ. స్త్రీ. మేనమామభార్య. మాతులాని, మాతులి: చూ, భార్య.

మాతులము, సం. వి. అ పుం. 1. ఉమ్మెత్త* : చూ, హాలా. పుష్పము; 2. ముఙ్గుఁబాము : చూ, సర్పము ; బ. 3. కుసుమలు: చూ, స్తంబకరి (ధాన్యము).

మాతుల పుత్రకము, సం. వి అ. పుం: ఉమ్మెత్తకాయ.

మాతుల పుత్రకుఁడు, సం. వి. అ. పుం. మేనమామ కొడుకు: బావ, బావగారు.

మాతులాని, సం. వి. ఈ. స్త్రీ. 1. = మాత్ర. జనము, భంగ, కుసుమలు (అనికొందఱు): చూ, ధాన్యము; 2 మేనమామ భార్య: చూ, మాతుల (చూ, అత్త. 4,; 3. లంకలు. (ఇది చింత్యము.)

మాతులాహి, సం.వి.ఇ.పుం. నెత్తురుపెనుపొడ, ముఙ్గుఁబాము: చూ, సర్పము.

మాతులి, సం. వి. ఈ స్త్రీ 1: చూ, మాతులాని. 2; 2: చూ, మాతులాని. 1.

మాతులుంగము, సం. వి. అ. పుం. రూ-మాలుంగము=మాదీఫలము*: చూ, సుపూరము.

మాతులుఁడు, సం. వి. అ. పుం: చూ, మేనమామ.

మాతులేయుఁడు, సం. వి. అ. పుం: చూ, మాతుల పుత్రకుఁడు.

మాతృక, సం. వి. ఆ. స్త్రీ. 1. తల్లి: చూ, మాత, 1; 2. దాది: చూ, మాత. 1—౨; 3: చూ, పార్వతి; 4: చూ, వర్ణమాల; 5. అసలు గ్రంథము: చూ, సంపుటము. 3; బ. 6: చూ, మాతృకలు.

మాతృకము, సం. వి. అ. పుం. ఎడమప్రక్క కొమ్ము చెవిలోనగువానిచే కొలవడిన యేనుఁగు : చూ, హస్తి. (దీనిచే రాజునకు దారిద్ర్యము కలుగును).

మాతృకలు, అం: బ్రాహ్మి, మాహేశ్వరి. కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండ. (7).

మాతృష్వసేయి, సం. వి. ఈ. స్త్రీ తల్లితోడఁ బుట్టిన దాని కూఁతురు: చూ, సూన. 1.

మాతృష్వసేయుఁడు, సం. వి. అ. పుం. రూ-మాతృష్వస్రీయుఁడు. తల్లితోడఁ బుట్టిన దానికొడుకు: చూ, సూనుఁడు. 1.

మాతృష్వస్రీయ, సం. వి. ఆ. స్త్రీ. తల్లితోడఁ బుట్టిన దాని కూఁతురు: చూ, సూన. 1.

మాతృష్వస్రీయుఁడు, సం. వి. అ. పుం: చూ, రూ-మాతృష్వసేయుఁడు.

మాతృసౌదాయకము, అం: చూ, స్త్రీధనములు.
మాత్ర, సం. వి ఆ. స్త్రీ. 1. అక్షరావయవము (బాణాకృతి గలది. లఘువు, లఘువేమాత్ర, మాత్రయన నొక చిటికా లము పలుకఁబడునది); 2 వృత్తాంశము : చూ, వృత్తము. 5; 3: చూ, స్వల్పము; 4. కొలఁది రూ-మాత్రము : చూ, వాసి. (6) (పరిమితి); 5: చూ, త్రుటి. 1; 6: చూ. సంఘము. 1; 7. తొడవు: చూ, హావణిక (భూషణము.2); 8 ధనము: చూ, హిరణ్యము. 3; అ. న. 9 అవధారణము: చూ, వినుము; 10: చూ, సర్వము; దే. వి (1) చిన్న మందుంట: మందుకుప్పెకు—ఁ తిన, కుహనము, గుడము, గులిక—గుళిక—గుళిగ, గోలము—గోళము, ఘనరసము, ఘుటిక. (తె.)—ఉంట, ఉండ, కొప్పియ-కొప్పె, గుండు, పూఁటె, పూదియ-పూదె, పూస; (2)=మాతులాని. జనపనార సంచి: చూ, సంచి.
మాత్రము, వా. సం. వి. అ. న 1: చూ, మాత్ర. 4; అవ్య. 2. ఇతర వ్యవచ్ఛేదము.
మాత్సర్యము, సం వి.అ.న 1.=మచ్చరము: చూ, హంస. 7; అం. 2: చూ, అరివర్గములు.
మాత్సర్యశీలుఁడు, సం. విణ: (తె.)—అంకకాఁడు, చలపకారి, చలపాది, చలమరి, మచ్చరి, మచ్చరీఁడు.
మాత్స్యన్యాయము, న్యా. పెద్దచేఁప చిన్నచేఁపను దినుననురీతి.
మాత్స్యము, అం. (౧౪ ౦౦౦ కలది): చూ, పురాణములు.
మాద, దే. వి. వాఁపురోగము: చూ, వ్రణము.
మాదము, సం. వి. అ. పుం: చూ, రూ-మదము. (విద్యా ధనాదులవలన వచ్చిన గర్వము)
మాదరోచ్ఛేదీ, వా వి. దగా, మోసము. (ఉత్తర సర్కారులలో వాడుక.)
మాదవళము, దే. వి. (రూ—మాదళము—మాదావళము మాదావళి) 1. కపిలవర్ణము: చూ. వర్ణము. 6; 2. కపిల వర్ణముగల చీర: చూ, వస్త్రము.
మాదళము, —పై.—
మాదావళము, —పై.—(కపిల వర్ణమునకు-కళా. 8, ఆ. 139)
మాదావళి, —పై.—
మాదిగ, పై. వి =మాతంగ: ఆసాది, గూబరి, గొడగరవాఁడు, గొడగరి, గొడారి, గొడారివాఁడు, గోసంగి—గోసఁగి, చచ్చుడి, ముచ్చెవాఁడు. (సం)-కురటుఁడు, గోహింసకుఁడు, చర్మకారుఁడు, చర్మరువు, పాదుకృతుఁడు-పాదూకృతుఁడు. పాదూవాహుఁడు, మతంగుఁడు-మాతంగుఁడు. తద్వి.—మాదిగజాతికి.—గొడగర, మాదిగ.
మాదిగకత్తి, పై. వి. మాదిగవాని కత్తి: చూ, రిష్టి. 2.
మాదిపలము, పై. వి.= మాతులుంగ. రూ-మాదీపలము: చూ, సుపూరము.
మాదిఫలము, మి. వి. —పై.— ఉ, రా. 6, ఆ. 61; య. 2, ఆ. 47; య. 1, ఆ. 36.
మాదిరి, దే. వి. ఏ. రూ-మాద్రి. 1: చూ, సామ్యము; 2: చూ, విధము. 1. 3. ఉపమావాచకము: చూ, సామ్యము; విణ. 4: చూ, సమానము. 2.
మాదీపలము, పై. వి.=చూ, రూ-మాదిపలము.
మాదీఫలము, మి. వి: చూ, రూ-మాదిఫలము.
మాద్యకుఁడు, సం. విణ. నావంటివాఁడు.
మాదెన, దే. వి: చూ, స్థూలపుష్పము*.
మాద్ర, సం. వి. ఆ. స్త్రీ. లలిపన *: చూ, విష.
మాద్రి, సం. వి ఈ. స్త్రీ. 1. పాండురాజుభార్య: చూ, దార్లు: దే. వి. ఏ. (1): చూ, రూ-మాదిరి. 1; వి. (2): చూ, రూ-మాదిరి. 2; (3): చూ, రూ-మాదిరి. 3; విణ. (4): చూ, రూ-మాదిరి. 4.
మాద్వీకము, సం. వి, అ. పుం: చూ, రూ-మాధవకము.
మాధవకళము, వా. సం వి. అ. పుం. మధుకరసంబంధమైన ముద్ర, భగవంతుని స్మరించుచు అడిగెడి భిక్షన్నపు ముద్ద (అనికొందఱు) మాదాకబళము అనియు వాడుక). చూ, సౌదము (1).
మాధవకము, సం. వి. అ. పుం. 1. ఇప్పపువ్వు కల్లు: చూ, మధువు 4; 2. కల్లు: చూ, సుర. 2;3 ద్రాక్షకల్లు: చూ, సుర 2.
మాధకరము, వా. సం. వి. అ. న: చూ, మాధుకరము.
మాధవము, సం. వి, అ. పుం. 1. వైశాఖమాసము: చూ, మాసము. 1; 2. వసంతఋతువు: చూ, మాసద్వయము.
మాధవాయస్వాహా, అం. (మాధవః=మాయాఽ విద్యాయాస్తస్యాః, ధునోతి=కంపయతి; మౌనాద్ధ్యానాచ్చయోగాచ్చ విద్ధిభారత మాధవమ్): చూ, ఓమ్.
మాధవి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, పూలగురిగింజ*: 2 చూ, మాదిపలము *: 3: చూ, సదాప *: 4. కల్లు: చూ సుర. 2; 5. తేనె: చూ, సారఘము; 6 చక్కెర: చూ, శర్కర. 1; 7: చూ, లక్ష్మి 1; 8 గోమహిష్యాది సమృద్ధి: చూ, సమృద్ధి; 9. కుంటెనకత్తె: చూ, శంభళి.
మాధవుఁడు, సం. వి. అ. పుం. లచ్చిమగఁడు: చూ, విష్ణువు. 1.
మాధుకరము, సం. వి. అ. న. మధుకరవృత్తి. భో. 3, ఆ. 33: మాధవకరము.
మాధురి, సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, మాధుర్యము: 1; 2: కల్లు: చూ, సుర: 2.
మాధుర్యము, సం. వి. అ. న. తీపు: (ఇందులవిశేష్య విశేషణంబులకు: "చూ, సురసము. 2"); 2. పక్షులలోనగునవి వచ్చుటకు బోయవేసెడు ఈలః చూ, స్వరము. 2; అం. 3: చూ, కావ్యగుణములు; 4: చూ, గుణములు; 5: చూ, శృంగారచేష్టలు.
మాధ్యందిన బ్రాహ్మణులు, అం: చూ, మహారాష్ట్రులు. (శుక్ల యజుర్వేదమునకుఁ జేరినవారు, వీరు శతపథ బ్రాహ్మణము కాత్యాయన సూత్రము మాధ్యాహ్నికసంధ్య ప్రధానముగా గలవారు. మాధ్యాహ్నమునకు ముందు వీరినిఁ జూచఁగూడదని కొందఱందురు. ఇది చింత్యము. కోలాపూరు, నాసికా, దక్షిణమహారాష్ట్ర దేశములందు వీరినిఁజూడనగు): చూ, బ్రాహ్మణులు.
మాంధ్యదినము, అం: చూ, కల్పసూత్రములు.

మాధ్యస్థము, సం. వి. అ. న. మధ్యస్థుఁడుచేయు తీర్పు.
మాధ్యాహ్నిక సంధ్యావందనము, అం: చూ, సంధ్యావందనము.
మాధ్వబ్రాహ్మణులు, అం: చూ, ద్రావిడులు, (వీరు శుద్ధముగ అఱవలు. వీరు ఇతరబ్రాహ్మణులనుండి పడుచులను తీసి కొందురు గాని వారిపడుచులను ఇతరుల కియ్యనొల్లరు. వీరు కృష్ణయజుర్వేదులు, అపస్తంబ సూత్రులు. వీరినే వీర వైష్ణవులనికూడ చెప్పుదురు. వీరు ద్వైతమతమునకుఁ జెందినవారు. చూ, బ్రాహ్మణులు.)
మాధ్వి, సం. వి. ఈ. స్త్రీ. 1. మద్యము: చూ, సుర. 2; 2. మకరందము: చూ, సుమనోరజము.
మార్ద్వీకము, సం వి. అ: న. (రూ - మాద్వీకము - మార్ద్వీకము-మాధవకము): చూ, రూ-మాధవకము. 1-2-3.
మాన, వై. వి.=మానమ్. (రూ-మానిక-మానికె) రెండు తవ్వలు, కుడపము-కుడుపము: చూ, సేరు.
మానన, సం. వి. అ. స్త్రీ. = మన్నిక. 1: చూ, మన్నన. 1; 2: చూ, వినయము.
మాననీయము, సం. విణ. మన్నింపఁదగినది. క్షమింపదగినది: మాన్యము.
మానము, సం. వి అ. న. 1. త్రాసు, మూర, తూములోనగునవి: ద్రువయము, పాయ్యము, మాయ్యము, పౌతవము: చూ, (తె).—వస్తు. (ఇది త్రివిధము.—తులామానము, అంగుళీమానము, ప్రస్థమానము) 2. కొలఁది: చూ, వాసి (6) (పరిమితి); 3. మానిక: చూ, సేరు; పుం. 4. చిత్తౌన్నత్యము; 5. గర్వము: చూ, హంకారము; 6. స్త్రీలకు పురుషులయెడఁగలుగు కోపము: చూ, రోషము; అం. 7: చూ, హేయగుణములు; 8. (విశంతివిగ్రహము): చూ, విగ్రహములు.
మానములు, అం. 1: ౧ చాంద్రమానాబ్దము, ౨ నాక్షత్ర మానాబ్దము, ౩ సౌరమానాబ్దము, ౪ బార్హస్పత్యమానాబ్దము, ౫ సావనమానాబ్దము; 2: చూ, మానము. 1.
మానవతి, సం. వి. ఈ. స్త్రీ. 1. మానముగల ఆఁడుది: చూ, స్త్రీ; 2. ఆఁడుది: చూ, స్త్రీ; 3: చూ, స్వీయ.
మానవము, అం. 1: చూ, ఉపపురాణములు; 2: చూ, ప్రచారములు.
మానవాస్త్రము, అం: చూ, అస్త్రములు. (బాణము. 1.)
మానవుఁడు, సం. వి. అ. పుం: చూ, మనుష్యుఁడు.
మానసము, సం. వి. అ. న. 1: చూ, మనసు. 1; 2 మానస సరస్సు; చూ, సరస్సు. 1.
మాననించు, సం. అ. క్రి. తలంచు. ఉ, రా. 5, ఆ. 181: చూ, యోచించు.
మానసికపూజాకుసుమములు, అం. మనస్సు, బుద్ధి, వాక్కు, శమము, దమము, అక్రోధము, మౌనము, నిరాహారము, నిద్రాత్యాగము, భూతదయ, అభినివేశము, నైర్మల్యము, అచాంచల్యము, వేదాంతవిచారము, బ్రహ్మజ్ఞానము. ఆనందము. (16.)
మానసికము, అం. 1: చూ, స్వాధ్యాయము; 2: చూ, కర్మములు (కర్మలు.)
మానసౌకసము, సం. వి. స. పుం: చూ, హంస.

మానా, వా. వి. వరవడి, వెఱవడి: చూ, మేలుబంతి.
మానావతి, వా. మి. వి. తనలోపములను కప్పిపుచ్చి మాటలాడెడు స్త్రీ.
మానావమానములు, అం: చూ, ప్రకాశింపఁ జేయఁగూడనివి.
మాని, సం. విణ మానము గలవాఁడు.
మానిక, సం. వి. అ. స్త్రీ: చూ, మాన.
మానికదారి, వై. వి.=మాణిక్యధారిణీ. (మానికము + దారి). చూ, వేశ్య.
మానికము, వై. వి.=మాణిక్య. కెంపు, వసు. 1, ఆ. 2: చూ, రత్నములు 1; 2 మణి: చూ, రత్నము. 1.
మానికె, వై. వి. 1.=మాన: చూ, మాన; 2.=మావ. మణి: చూ, రత్నములు. 1.
మానితము, సం. విణ. 1. మన్నింపఁబడినది: చూ, సన్మానితము: అం. 2: చూ, తిర్యక్కరణ బంధములు.
మానిని, సం. వి. ఈ. స్త్రీ: చూ, మానవతి. 1—2; అం. 3: చూ, వృత్తము. 1. (“భ, భ, భ భ, భ, భ, భ గురువులు. 13 యతి. 22వ ఛందస్సు).
మానిపసుపు, ద్వ. వి. రూ-మ్రానిపసుపు: చూ, హరిద్రువు. (ఇది ఎఱ్ఱకసిందవేరు లేక కాళేయకము).
మానిపుక్కిటి పులుఁగు, దే. వి: చూ, బెబ్బులుఁగు.
మానిపోటు పులుఁగు, —పై.—
మానిసి, వై. వి. 1.=మానుష: చూ, మనుష్యుఁడు; 2.=మానుషీ. మనుష్యస్త్రీ: చూ, స్త్రీ; 3: చూ, భటుఁడు. పర 5, ఆ. 62.
మానిసిదిండి, ద్వ. వి: చూ, రాక్షసుఁడు. ఉ, హరి. 4, ఆ 262.
మానిసిరౌతు, వై. వి.=మానుషరాహుత్త, నరవాహనుఁడు, కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు.
మానిసిఱేఁడు, ద్వ. వి. మనుజేంద్రుఁడు: చూ, రాజు. 1.
మానిసిసింగము, వై. వి.=మానుషసింహ. అచ్చ. యు, కాం. 466: చూ, సింగఁడు. 1.
మానీఁగ, దే. వి. భృంగవిశేషము: చూ, పౌరంగము. 3.
మాను, దే. వి. 1. రూ-మ్రాను. చెట్టు. వసు. 1. ఆ. 45: చూ, వృక్షము; 2. బోదె: చూ, రూ-మ్రాను; 3. మనోజ్ఞత: చూ, హృద్యము; 4. విసర్జనము: చూ, విమోచనము; విణ. 5. మనోజ్ఞము: చూ, హృద్యము; స. క్రి. 6 విడుచు: చూ, విసర్జించు; వా. 7. (పుండు) హరించు: చూ, స్రుక్కు (9); 8. (బడికి) రాకుండఁగపోవు.
మానుచు, దే. ప్రే. మానఁజేయు, మానించు: రూ—మాన్చు-మానుపు.
మానుట, దే. అవ్య. నివృత్తి, ఆజ్ఞ: చూ, మరలఁబాటు.
మానుపు, దే. ప్రే: చూ, రూ-మానుచు.
మానుపసుపు, ద్వ. వి: చూ, రూ-మానిపసుపు.
మానుపోటువు, దే. వి; చూ, బెబ్బులుఁగు.
మానుషి, సం. వి ఈ. స్త్రీ.=మానిని. మనుష్యస్త్రీ: చూ, స్త్రీ.
మానుషుఁడు, సం. వి. అ. పుం.= మానిసి: చూ, రూ-మనుష్యుఁడు.
మానుషక్యము, సం. వి. అ. న. మనుష్యుల సమూహము.
మానెడు, ద్వ. వి. కుడపప్రమాణము.

మానెరు, దే. వి. రూ-మానేరు*: చూ, స్వర్ణవల్లి.
మానేజరు, వా. వి. కార్యనిర్వాహకుఁడు: రూ-మేనెజరు.
మానెరు, దే. వి: చూ, రూ-మానెరు*.
మాన్చు, దే. ప్రే: చూ, రూ-మానుచు.
మాన్పైనవాఁడు, దే. విణ: చూ, సౌందర్యవంతుఁడు.
మానోజ్ఞకము, సం. వి. అ. న, మనోజ్ఞత: చూ, మాను. 3.
మాన్యక్షేత్రములు, అం: చూ, మదములు.
మాన్యము, సం. వి. అ. న.=మన్నియము-మన్నెము. 1. (తె)-ఇనాము-ఈనాము, కట్టుబడి, క్విటిరెంటు, మండెము-మన్నియము-మన్నెము; 2. కొండల నడుమను అరణ్యమధ్యమునను గలభూమి, రోగభూయిష్టమగు భూమి (అని కొందఱు); (తె.)—మండెము-మన్నియము-మన్నెము; విణ. 3: చూ, మాననీయము.
మావు, దే. వి. 1: చూ, పుంత; 2: చూ, రాత్రి. భాగ. 10, స్కం. పూ. 1050; 3. మైల: చూ, మలినము. 1; ప్రే. 4. మాయఁజేయు, పోఁగొట్టు.
మావుడు, దే. వి. మైల: చూ, మలినము. 1.
మావు, వా. వి. మన్నింపు, క్షమింపు.
మావుచేయు, వా స.క్రి. 1. క్షమించు; 2. కనఁబడకుండగఁజేయు
మాబాగు, ద్వ. వి. 1: చూ, సమ్మతి. 1; అవ్య. 2. మిగుల మంచిది: చూ, సమ్మతి. 1.
మామ, వై. వి. 1.=మామక. తల్లిసోదరుఁడు: చూ, మేనమామ; 2. ఆలుమగల తండ్రి: చూ, శ్వశురుఁడు; 3. తండ్రి తోఁబుట్టువుయొక్క భర్త, మేనత్తమగఁడు. (శూద్రులు కొందఱు తల్లిసోదరుని (మేనమామను) "నాన్న" అని పిలుచుచున్నారు.)
మామకీనము, సం. విణ. నాది, నాయది.
మామకుఁడు, సం. వి. అ. పుం.=మామ. 1: చూ, మామ. 1; విణ. 2. నావాఁడు; వా. 3. పూజ్యుఁడు: చూ, సన్మానితుఁడు.
మామమామ, వై. వి. 1: చూ, విష్ణువు. 1. (లక్ష్మీదేవిని పెండ్లాడుటచే తనకు మామయైన సముద్రుడునికి పెండ్లామగు గంగాదేవి తనకు కూఁతురు వరుసయగుటచే విష్ణువు సముద్రుడునకు మామ అయెనని యెఱుంగునది); 2. సముద్రుఁడు: చూ, సముద్రము.
మామమామబావ, వై. వి. చంద్రుఁడు. అం, పదా. సు. 23: చూ, హిమాంశువు.
మామా, దే. అవ్య. మానుమాను.
మామాటయే మాట, జా. నిజము. "మాభోగంబులె యాత్మభోగములుగా మామాటయే మాటగా" కళా. 5, ఆ. 215.
మామిడి, దే. వి: 1. రూ-మావిడి-మావి: (సం.)- అమ్రము-ఆమ్రము, కాంతము. కామవల్లభము, కామశరము, కామాంగము, కీరేష్టము, కేశవాయుధము, కోకిలానందము, కోకిలావాసము, గంధబంధువు, చామరపుష్పము, చూతకము—చూతము, మాకందము, రసాలము*; తద్విశేషములు.—౧. అంటుమామిడి; ౨. అంబాళము, నల్లమామిడి. (సం.)-అంబ, అంబరీషము, ఆమ్రాతకము, అమ్లపాటలము, ఆమ్లాతకము, కపి, కపిచూడ, కపిచూతము, కపిప్రియము, కపిరసాఢ్యము, కపీటనము, కీరము, గుణపరిమళము, బంతము, పీతనకము, పీతము, భృంగాభీష్టము, ... , స్త్రీప్రియవృక్షము; ౩. ఆటకమామిడి—అటికమామిడి. (సం.)—కుంభఅష్టకము, ... , ... , రక్తపుష్పము, విశాలము, శ్లేష్మాంతకము: ౪. అడవిమామిడి, (సం.) అంబష్ఠ, ప్రియాలము; ౫. పలమావి, ... మామిడి, తేనెమామిడి. (సం.)—... ; పుండరీకము. సహకారము; ౬. కట్టుమామిడి; ౭. ...మామిడి, పుల్లమామిడి. (సం.)—..., ..., కోశామ్రము, ... ఫలము, ... వృక్షము, ..., లాక్షావృక్షము; ౮. కోఁడిగుడ్డుమామిడి, కోఁడిమామిడి; ౯. గుజ్జుమామిడి, రాచమామిడి. (సం.)-కామఫలము, కామాయుధము, కామేష్టము, కోకిలానందము, కోకిలోత్సవము, రాజామ్రము; ౧౦. తుమ్మెదమామిడి. (సం.)-కోశామ్రము, క్రిమిద్రుమము; ౧౧. పచ్చిదియ్యపు మామిడి; ౧౨. పోఁతమామిడి. (సం.)—క్షీరామము, ...; ౧౩. జీడిమామిడి, ముంతమామిడి. (సం.)—అగ్నికీలము; ౧౪. (సం.)—అక్షీబము—అమ్లీబము; ౧౫. (సం.)—అద్భుదఫలము. ౧౬. మామిడిపిందె (ఇక్షై పలుకరకములు అంటుమామిడి, పలురకముల మొక్కమామిడిఫలపు) ౧౭. చెట్టుపేరు యింటిపేరుగా గలవారు (౧ మామిడివారు, రావివారు, జామవారు, చింతావారు, వేపావారు)
మామిడిఅల్లము, దే. వి. అల్లములో భేదము. కస్తూరిపసుపు (అని కొందఱు) *: చూ, శృంగిబేరము.
మామిడిగుత్తులు, ద్వి. వి. బ: చూ, ధాన్యము.
మామిడిపిందె, వా: వి. చూ, మామిడి. ౧౬.
మామిరీతు, వా. వి. పద్ధతి: మామిలీయతు.
మామిలీయతు, వా. వి.—పై.—
మామూలు, వా. వి. 1. వాడుక, అలవాటు: చూ, స్వభావము; 2. వాడుకగానిచ్చెడు విత్తము; 3. లంచముగానిచ్చెడు విత్తము; 4. బహుమతి.
మామెన, దే. వి: చూ, శారిక *:
మాయ, సం. వి. అ. స్త్రీ. 1: అజ, అజయ, ఉపాదానము, ప్రకృతి, ప్రత్యాహారము, ప్రధానము, (తె.)=మాయము;2; =మాయము. ఇంద్రజాలాదివిద్య: చూ, మాయము.1; 3.=మాయము: చూ, వంచన; 4. ఒకపట్టణము. కాశీ. 3, ఆ. 87: చూ, దేశములు; 5. బుద్ధి: చూ,హృల్లేఖము. 2;6: చూ, విష్ణువు. 1: అం. 7: చూ, ఉపాయములు. 1; 8: చూ,పుణ్యనగరములు; పా. 9. దీనికి ఉపమానము -రాక్షసులు.
మాయకాఁడు, దే. విణ. (వై.=మాయావి అనికొందఱు): 1: చూ, వంచకుఁడు.1.2 ఇంద్రజాలికుఁడు:చూ,వ్యాళగ్రాహి.
మాయదారి, ద్వ. విణ.—పై.—
మాయపోతు, దే. విణ.—పై —
మాయము, వై. వి. 1=మాయ: (దేశ్యమని శ. ర.) కనికట్టు - కనుకట్టు, కయిలాటము - కైలాటము, గారడము—గారడి, దండన, బూటకము, బూమియ, మతకము, మాయము, వేడబము. (సం).—కుహరము, కూటము,

ముందువెనుకలు, దే అవ్య. ఎడతెగక: చూ, సదా.

ముంపు, దే, వి: 1. ముంచుట రామా. 6, ఆ. 88: ముఱుగుడు; 2: గుంపు: చూ, సమూహము:

ముంపుగొను, దే: అ, క్రి: దాఁటుకట్టు: భాగ: 8, స్కం: 5.3:

ముకద్దమా, వా: వి, గ్రామ్యవ్యవహారము: రూ-మొకద్దమా.

ముకాబిలా, వా. వి: సంప్రతింపు: రూ-మొకాబిలా.

ముకాసా, వా. వి: వస్తు లేకుండఁగ నియ్యఁబడిన గ్రామము. రూ - మొఖాసా.

ముకు, వై. వి: రూ-ముక్కు. 1. నాసిక: చూ, రూ-ముక్కు. 1; 2. పక్షిముక్కు, చంచువు: చూ, రూ-ముక్కు. 2; 3: చనుమొన: చూ, స్తనము; అ. క్రి. 4: రూ-ముక్కు:శ్వాస బిగఁబట్టు; దే. అ. క్రి: 5: చూ, నశించు: వా: 6: శ్లేష్మో ద్రేకమున ఊపిరాడక శ్వాసించు.

ముకుందము, సం: వి: అ, న. 1. ఎఱ్ఱదామర: చూ, సహస్రపత్రము; 2. రూ - కుందము: పాలంక్య - పాలుక్య, కుందురువు *: చూ, రాజార్హము; 3: చూ, పాదరసము 4. ఒకానొకమణి: చూ, రత్నములు; అం: 5: చూ, నిధులు; 6: చూ, జన్యతాళములు.

ముకుందుఁడు, సం: వి. అ. పుం: చూ, విష్ణువు. 1.

ముకుఁగోళ్ళు, ద్వ. వి: బ: (రూ - ముక్కుఁగోళ్ళు - ముక్కుఁగ్రోళ్ళు -ముకుఁగ్రోళ్లు.) నాసాపుటము: చూ, ముక్కుఁజెఱలు,

ముకుఁగ్రోళ్ళు, ద్వ, వి. బ.—వై.—కాశీ. 4, ఆ. 272.

ముకుఁజెఱలు, ద్వ. వి.—పై.—

ముకుఁద్రాడు, ద్వ. వి. (ముకు+త్రాడు) నాథము: చూ, రూ - ముక్కుఁద్రాడు;

ముకుటము, సం. వి: అ: న: 1. చూ, రూ - మకుటము; దే. వి; (1). రూ-ముక్కుటము. నారమడి, నారచీర,క్షౌమము: చూ, వస్త్రము.

ముకుదూలము, వై. వి: ముక్కునడిమియెముక, రూ-ముక్కుదూలము, ముక్కుకంబము: చూ, శల్యము. 1.

ముకుదొమ్మ, ద్వ. వి: ఒకచేఁప: చూ, మత్స్యము. 1:

ముకుబంతి, వై. వి. ధేనువులకు శైత్యముచే నాసారంధ్రము లందుఁగలిగెడు కేశావృతపిండరూపవ్యాధి.హరి.పూ.2,ఆ143.

ముకురము, సం: వి: అ; పుం: 1. రూ -మకురము, అద్దము, ఆత్మదర్శకము, ఆత్మదర్శము, ఆదర్శనము, ఆదర్శము, కర్కరము, కర్కము, కర్పరము, కురువిందము.(తె),— అద్దము, 2; పొగడ, మకురము *: చూ, వకుళము; 3: మల్లెపువ్వు, మకురము: చూ, హసంతి: 2: 4: కుమ్మరిలాతము: చూ, మకురము. 4. గ్లాసు.

ముకులి, అం: చూ, సుషిరవాద్యములు.

ముకుష్ఠకము, సం. వి. అ, పుం: చూ, మకుష్ఠకము.

ముకుళము, సం. వి. అ, పుం. న. 1:=మొగడ-మొగ్గ; రూ-మకుళము: చూ, మొగ్గ. 1; పుం: 2: అభినయ హస్తవిశేషము (అయిదు వ్రేళ్లను కొనలుకూర్చి పట్టినది): చూ వ్యంజకము. 1; అం. 3: చూ, అసంయుత హస్తములు; 4, చూ, సంచారీభావమునఁ బుట్టిన దృష్టులు.

ముకుళస్వస్తికము, అం. చూ, నృత్తహస్తములు.

ముకుళించు, సం. అ. క్రి.=ముడుఁగు. 1: చూ, ముడుఁగు. 1; అం. క్రి. 2. మొగిడ్చు.

ముకుళితము, సం. విశే. ముకుళించినది: ముద్రితము.

ముకుళీభవించు, సం. అ. క్రి: చూ, ముకుళించు. 1.

ముకూలకము, సం. వి అ. పుం: చూ, మకూలకము *:

ముక్క, దే. వి. తునుక: చూ, ఖండము. 4;

ముక్కంటి, దే. వి. (మూఁడు+కన్ను) త్రిలోచనుఁడు చూ, శివుఁడు.

ముక్కంటిచెలి, దే. వి. త్ర్యంబకసఖుఁడు. కుబేరుఁడు; చూ, శ్రీదుఁడు.

ముక్కంటిచుక్క, ద్వ. వి. ఉత్తరాభాద్రపదానక్షత్రము: చూ, రిక్క. 1—26.

ముక్కంటితల, దే. వి: శివునిశిరస్సు: (సం)— డ.

ముక్కంటితలపువ్వు, ద్వ. వి. చంద్రుఁడు: చూ, హిమాంశు.

ముక్కంటిరొలిపట్టి, దే. వి: చూ, వినాయకుఁడు. 1.

ముక్కంటిపండు, దే. వి; కొబ్బరికాయ.

ముక్కంటి పంపుల మెక్కెడు దిండీఁడు, ద్వ. వి: చూ. ముక్కంటిరొలిపట్టి.

ముక్కంటిమల, ద్వ. వి: కైలాసము: చూ, పర్వతము,

ముక్కంటియావు, దే. వి: అచ్చుపెద్దు: చూ, వృషభము. 1.

ముక్కంటియమ్మలపొది, ద్వ. వి; చూ, సముద్రము.

ముక్కంటియిల్లు, దే. వి; చూ, ముక్కంటిమల.

ముక్కంటివెలఁది, దే. వి; చూ, పార్వతి.

ముక్కంటిసొమ్ము, దే. వి: చూ, సర్పము. వేం, అం. 102.

ముక్కడి, దే. వి. (మూఁగు+కాఁడి.) 1. అనేకులకు ఒక పెట్టున తగిలెడివ్యాధి. సాంక్రమికామయము: ముంగడి, ముడిచె: 2. దుక్కిచాలించి ఆహారమునకు పోవునపుడు అరకలన్నిటి నొక్కచో ప్రోగుచేసి యొక్క టిగాచేర్చి విలిపి నట్టి యాఅరకలకాండ్ల మొత్తము.

ముక్కద్దము, వై. వి.(ముక్కు+అద్దము): చూ,సులోచనము.

ముక్కన్ను, దే. వి. (మూఁడు+కన్ను) మూఁడవకన్ను.

ముక్కపురుగు,ద్వ.వి.తవుటిపురుగు:చూ,సస్యసంహారి(పురుగు)

ముక్కర, ద్వ. వి: చూ, రూ-ముక్కఱ.

ముక్కరమాను, దే. వి. పుల్లిరును తిరుగుచట్టము.

ముక్కరము,ద్వ.వి. (ముక్కు+కాఱెము):చూ,ముక్కుఁగోళ్లు.

ముక్కఱ, ద్వ. వి. (ముక్కు+ఱాయి) రూ-ముక్కర, అడ్డబాస: చూ, భూషణము. 2.

ముక్కలిపీఁట, ద్వ. వి: చూ, రూ-ముక్కాలిపీఁట.

ముక్కస, దే. వి. మూఁడుకుంచములు: రూ—ముక్కుస.

ముక్కాక, ద్వ. వి: మూఁడుకాకల సమాహారము.

ముక్కాని, ద్వ. వి. (మూఁడు+కాని) మూఁడుకానులు.

ముక్కామల, వా. వి: గ్రామనామము. ఇంటిపేరుఅయ్యె.

ముక్కారు, ద్వ. వి. (మూఁడు+కారు) 1. మూఁడుకారులు; 2: ముక్కారుపంట, తొలుకారు. (ఇదే మొదటిపంట చూ, సారువా.

ముక్కారుపంట, వా. వి: చూ, ముక్కారు. 2.

ముక్కాలిపీఁట, ద్వ. వి: (మూఁడు + కాలు + పీఁట) రూ-ముక్కలిపీఁట. మూఁడు కాళ్ళమర్చిన యెత్తుబల్ల; చూ, సింహాసనము.

ముక్కాలు, దే. వి. (మూఁడు + కాలు) 1. మూఁడుకాళ్లు; 2. మూఁడుపాతికెలు.

ముక్కాలుగడియ, ద్వ. వి. త్రిపాదఘటిక.

ముక్కిఁడి, ద్వ. విశే. (ముక్కు + ఇఁడి) ముక్కుపోయిన వాఁడు: చూ, విగ్రుఁడు.

ముక్కిడి, దే. వి. ఒకచెట్టు: చూ, వృక్షము.

ముక్కు, వై వి.1: రూ-ముకు. (సం.). గంధనాళి, గంధవహ-గంధవాహ—ఘోరణ, ఘ్రాణము, ఘ్రాతి, ణ, తనుభస్త్ర, నభము, నస, నాసిక. తద్వి.— ౧. ఈఁగముక్కునకు—తొండము; ౨. ఏనుఁగు ముక్కునకు—తొండము. (సం.) తుండము; ౩. గుఱ్ఱపు ముక్కునకు—(సం.) ఘోరణ, ప్రోథము; ౪. చేఁప ముక్కునకు—త్రోటి; ౫. చప్పట ముక్కునకు-చప్పట ముక్కు. (సం.) అవటీట-అవటీటము, అవనాట, అవభ్రట, నతనాసిక; ౬. పంది ముక్కునకు—పందిపీఁట, పందిముక్కు, పందిమూతి, ముట్టియ—ముట్టె; ౭. పక్షి ముక్కునకు—తొండము, త్రోటి. (సం.) చంచువు, తుండము; ౮. బుఱ్ఱ ముక్కునకు—దొఱ్ఱ ముక్కు, బుఱ్ఱ ముక్కు: ("చూ, వదనము.2.")2: చూ, ముకు. 2; బ. 3. చనుమొన: చూ, స్తనము; అ. క్రి. 4: చూ, రూ-ముకు 4; దే.అ క్రి. 5: చూ, రూ-ముకు. 5; వా 6: చూ, రూ-ముకు. 6. "శిశువు ముక్కుచుండెను"; 7. "ముక్కు" అను ఇంద్రియము. ఇంటిపేరుగగా గల కవి "ముక్కు తిమ్మన కవి". (ఇక్లే ముక్కువారు: చూ, బుఱ్ఱ, నోరు).

ముక్కుఁగమ్మి, వై. వి: చూ, ముక్కుపోఁగు.

ముక్కుఁగ్రోళ్ళు, ద్వ. వి. బ: చూ, రూ-ముకుఁగోళ్లు.

ముక్కుఁజెఱము, ద్వ. వి: రూ-ముకుఁజెఱము, ముకుఁగోళ్లు—ముకుఁగ్రోళ్లు—ముక్కుఁగోళ్ళు—ముక్కుఁగ్రోళ్ళు. (సం.) నాసాపుటము.

ముక్కుఁద్రాడు, ద్వ. వి: రూ-ముకుఁద్రాడు. (సం) నాథము: చూ, సూత్రము. 1.

ముక్కుఁ బట్టుకొని కూర్చుండుట, జా. జపము చేయుచుఁ గూర్చుండుట. "ముక్కుఁ బట్టుకొని కూర్చున్నట్టి" రామా. 8, ఆ. 182.

ముక్కుకంబము, ద్వ. వి: చూ, ముకుదూలము.

ముక్కుకొయ్య, ద్వ. వి. బాధాకరుఁడు: చూ, వేసరి.

ముక్కుకొలికి, ద్వ. వి: (సం.)—ఘంటాపథము, చర్వితము.

ముక్కుకోఁతలు, జా. చిక్కులుపెట్టుట. "అనుచున్ రైతులు ముక్కు కోఁతలకు లోనై మ్రొక్కఁగా దిక్కులేకుసికిన్" (ధర్మజ రాజసూయము).

ముక్కుటము, దే. వి: చూ, రూ-ముకుటము (1.)

ముక్కుతెవులు, ద్వ. వి. ముక్కురోగము: చూ, శ్వాసము 1.

ముక్కుదాడిమ, వై. వి. ఒకచెట్టు: చూ, వృక్షము.

ముక్కుదూలము, వై. వి: చూ, రూ-ముకుదూలము.

ముక్కుపూరెడు, ద్వ.వి. ఒకరకము పూరెడు: చూ, శకుంతి (పక్షి)

ముక్కుపై వ్రేలువేసికొనుచు, జా. ఆశ్చర్యపడుచు. "యెంతటి వారును ముక్కుపై వ్రేలువేసికొనరు." (ధర్మజరాజసూయము)

ముక్కుపొడి, వా వి. పొడుము, ముక్కుపొడుము, (సం.)నస్యము. తద్వి.—అవపీడన, అవపీడనము

ముక్కుపొడుము, —వై.—

ముక్కుపోఁగు, ద్వ వి. ముక్కుఁగమ్మి: చూ, భూషణము. 2-౯.౬.

ముక్కుముంగర, ద్వ. వి. చూ, భూషణము. 2—౯. ౫.

ముక్కుమొగముఁ జూడక, జా. మొగమోటమి ఆలోచింపక. "ముక్కుమొగంబుఁ జూడ కటుముట్టను బొమ్మనెదేల" విజ. 3, ఆ. 30.

ముక్కులు, దే. వి. బ 1. చూచుకములు: చూ, ముక్కు. 3; బ. 2. చీరు, మిక్కిలి చిన్నసూకలు: చూ, శంబుకము; 3: చూ, భక్ష్యము కాశీ. 7, ఆ. 186.

ముక్కువిఱుచుట, జా ఇష్టపడక పోవుట, ఆక్షేపించుట. "బాంధవులు ముక్కువిఱువం, బుత్రులు వేసరంగళత్రంబులు వేసరింప." (కవికర్ణ రసాయనము)

ముక్కుస, ద్వ.వి. (మూఁడు + కుంచము) చూ, రూ-ముక్కస.

ముక్కూరు, దే. అ. క్రి. అజ్ఞానమును పొందు.

ముక్కెర, వా. వి, రూ ముంగర: చూ, భూషణము. 2.

ముక్కోటిక, ద్వ. వి. (మూఁడు + కొటిక) త్రిపురములు.

ముక్కొను, దే. అ. క్రి. (మును + కొను) ముందుకొను.

ముక్కొమ్ము మెకము, ద్వ వి. (ముందు + కొమ్ము మెకము): బిళ్లదున్న, మను-మన్ను, మనుఁబోతు, మనుబిళ్ళు. (సం.) ఋశ్యము-ఋష్యము. తద్వి. — ఆఁడు ఋశ్యమృగమునకు—(తె.)—మనుపెంటి.

ముక్కోటి కలకంటు, ద్వ. వి: చూ, శివుఁడు. అం. ప. 1—10.

ముక్కోణము, మి.వి (మూఁడు + కోణము): చూ, త్రిభుజము.

ముక్కోపము, మి. వి: చూ, రూ-ముంగోపము.

ముక్కోపి, మి. వి: చూ, రూ-ముంగోపి.

ముక్కోల, దే వి. (మూఁడు + కోల): చూ, త్రిదండము, 1-2.

ముక్త, సం. వి. ఆ. (స్త్రీ) 1 = ముత్తెము. రూ-మౌక్తికము: చూ, రత్నములు. 1: 2. అంకులాఁడి: చూ, స్వైరిణి; విశే. 3. ముక్తినొందినది; 4. విడువఁబడినది: చూ, హీనము. 3.

ముక్తకంచుకము, సం. వి. అ. పుం; చూ, నిర్ముక్తము.

ముక్తకము, సం. వి. అ. న. 1: చూ, కరయంత్రము; అం. 2: చూ, మహాకావ్యము.

ముక్తపదగ్రస్తము, అం: చూ, అలంకారము. 3. (విడిచిన పదమే యప్రధానముగా మరలమరల వచ్చుట "ఉదా.—మేరుధరాధరధీరా। ధీరాఖ్యానందకర"; "వానికీర్తి లోక మాక్రమించు, మించును, మించుతేజంబు, జంబునదీ జంబాలంబుంబోలుఁ దమకాంతిచే నాతఁడురంజిల్లు, జిల్లుల్వడఁ జేయు మదనుని గర్వంబురూపు, రూపుమాపు శత్రుయ శంబుల నాతనిశక్తి") (చూ, హేతువు 2.)

ముక్తసరి, వా. వి. రూ-ముక్తసరు: చూ, సంగ్రహము. 2.

ముక్తసరు, —పై.—
ముక్తాయింపు, దే.వి. 1: చూ, ముగింపు; వా. 2. వాద్యముతోను ఆటతోను గూడిన (ముక్తాయింపు) పాట; 3. పాటవెనుక వాద్యము.
ముక్తావళి, సం. వి. ఇ. ఈ. స్త్రీ. ముత్యాలదండ: చూ, హావళిక. 2. (భూషణము. 2 ఽ—(౩౯.)
ముక్తాసనము, అం: చూ, ఆసనములు.
ముక్తాస్ఫోటము, సం.వి అ.పుం ముత్తెపుఁజిప్ప: చూ, శుక్తి. 1.
ముక్తాహారము, సం. వి అ పుం: చూ, ముక్తావళి
ముక్త్యారు, వా. వి: చూ, స్వతంత్రాధికారమును పొందినవాఁడు.
ముక్తి, సం. వి. ఇ స్త్రీ =ముగితి-ముత్తి. 1: చూ, సదాగతి. 2; 2. విడుపు: చూ, విమోచనము.
ముక్తిచతుష్టయము, అం: సామీప్యము, సాలోక్యము, సారూప్యము, సాయుజ్యము. (4).
ముక్తిత్రయము, అం,జీవన్ముక్తి, విదేహముక్తి, క్రమముక్తి(3)
ముక్తులు, అం. 1: చూ, ముక్తిత్రయము; 2: చూ, ముక్తి చతుష్టయము.
ముఖక్రియలు, అం: భుగ్నము, వ్యాభుగ్నము, ఉద్వాహము, వివృతము, వివృతము, వివివృత్తము, (6)
ముఖచపల, అం: చూ, వృత్తము. 1. (కందపద్యభేదము లాఁటింటిలో నొకటి) (చూ, కందము 3.)
ముఖత్రాణము, సం.వి.అ.న కవచభేదము: చూ, వారవారణము
ముఖము, సం. వి: అ. న. 1.=మొగము: చూ, వదనము. 2; 2: నోరు: చూ, వదనము. 1; 3. మాట: చూ, శబ్దము. 2; 4: చూ, నిస్సరణము. 1; 5. ఉపాయము:చూ,వెరవు; 6. ప్రయత్నము: చూ, సన్నాహము. 2; అం. 7: చూ, ముఖసంధి; 8. (మొగము: చూ, లక్షణాంగములు. (పురుషునికి—ముఖము పూర్ణచంద్రసమమయిన దానధర్మశీలుఁడగు. కరాళమయిన దరిద్రుఁడగు. హయవక్త్రమయిన దుఃఖదరిద్రము లనుభవించును; 9. (మొగము). చూ, స్త్రీ లక్షణాంగములు. (స్త్రీకి.—నిర్మలమై పూర్ణచంద్రసమమైన రాజపత్నియగు. రక్తిమగల్గిన భాగ్యవతియగు. పద్మసమమై నునుపుగలిగిన సుఖవతియగు. వికృతమయినను ఎండియున్నను విధవయగు. చక్రమువలెనున్నను గుజ్జుపు మొగమైనను దుర్గంధము గలిగినను దరిద్రురాలగు. పెద్దపులిమొగమైన దాసియగు. రోమములును మొటిమలును గలిగి నుదురు మొగమును మించియున్నను వ్రేలుచున్నను దుర్లక్షణియగు. నోరుపెద్దదియైన మగనిఁజంపును.)
ముఖములు, అం. ఈశాన, తత్పురుష, వామదేవ, సద్యోజాత, అఘోరములు (5)
ముఖరజ్జువులు, అం. (వాగె): ఉత్క్షిప్తము, శిథిలము, ఉత్తరవతి, మందము. వైహాయసి, విక్షిప్తైకకరము, అర్ధకంథరము, సమము, ఉత్కీర్ణము, విభక్తము,అత్యుత్క్షిప్తతలము, ఉద్ధృతము, వ్యాగూఢము, గోకర్ణిక. (14)
ముఖరము, సం. విణ. 1.=మొగరి. మ్రోఁగునది. ధ్వనితము: చూ, రవణము. 2; 2. అసంబద్ధ వచనములాడునది.
ముఖరుఁడు, సం విణ: అబద్ధముఖుఁడు, అసత్యుఁడు, ఆహుఁడు, దుర్ముఖుఁడు, వంచకుఁడు. (వై).—పల్లరి, కల్లరీఁడు, జల్లికాఁడు, టక్కరి, టపరికాఁడు, రాపోటు, దబ్బఱ-దబ్బఱ-దబ్బఱి- దబ్బఱకాఁడు, దొంగరి, దొంగలాఁడు, రజ్జులాఁడు. పద్మ.-(దే)—పుట్టుపల్లరి ("చూ,పంచకుఁడు 3")
ముఖవాసన, సం. వి. ఆ. స్త్రీ, అ. పుం, సుగంధ్యాదివాసన. చూ, వాసన. 1.
ముఖపీఠ, సం. వి. స్త్రీ. మొగిలిపూ: చూ, ...
ముఖశాల, సం. వి. ఆ. స్త్రీ = మొగసాల-మోసల. 1. దల వాకిటివాకిలి: చూ, సదనము. 1; వా.2: చూ, మొగవాకిలి.2.
ముఖసంధి, అం (ఆరంభ బీజములచే ముఖసంధి): చూ, నాటక సంధులు (సంధులు)
ముఖస్తము, వా. సం. అవ్య: ముఖాముఖి (తె). ఎట్టయెదురు, పక్కనియెదురు.
ముఖాముఖి, వా. సం అవ్య. (ఇ)—పై.—
ముఖాస్త్రము, సం. వి. అ. పుం పీతః చూ, హరిలాంఛనము.
ముఖ్యైకశాస్త్రాణము, అం: ౧. సద్యోజాతముఖమునఁ బుట్టిన చంపత్పుటతాళము, ౨. వామదేవముఖమునఁబుట్టిన చచ్చపుట తాళము, ౩. అఘోరముఖమునఁబుట్టిన షట్పితాపుత్రకతాళము, ౪. తత్పురుషముఖమునఁ బుట్టిన సంపద్వేష్టకతాళము, ౫ ఈశానముఖమునఁబుట్టిన యుద్ఘట్టతాళము (5) (ఈయైదింటియందే 96 తాళములుఁబుట్టి 101 తాళమయ్యెను): (చూ జన్యతాళములు.)
ముఖేముఖే సరస్వతి, న్యా. "ప్రతివాని ముఖమందును సరస్వతిగలదు" అనఁగా సరస్వతి యొకరిసొత్తుగాదు. ఆమె బ్రహ్మ ముఖమునమాత్రమే యుండును. ఎల్లరి ముఖములందును గలదు.
ముఖ్యము, సం. విణ. గామికి: చూ, శ్రేష్ఠము.
ముఖ్యుఁడు, సం వి.అ.పుం:చూ ప్రధానుఁడు.3.(హి. అధిష్ఠాత)
ముగండి, దే. వి: చూ, ముక్కఁడి. 1.
ముగము, వై. వి.= ముఖమ్. (రూ - మొగ - మొగము - మోము.) మూతి: చూ, వదనము. 1.
ముగతి, దే. వి: చూ, పరిపత్ని.
ముగింపు, దే. వి: చూ, సమాప్తి. 1.
ముగితి, వై. వి=ముక్తి. యు. 2, ఆ. 44: చూ, సదాగతి. 2.
ముగియుక, దే. వి. చూ, ముగింపు.
ముగియు, దే. అ. క్రి. 1: చూ, మరణించు. అం, భా. ద్వి. 87; 2. అయిపోవు: చూ, సరిపోవు. 3; ప్రే. 3. ముగించు.
ముగుద, వై. వి.=ముగ్ధా. 1. అఁడుది. రామ. 3, ఆ. 85: చూ, స్త్రీ; 2. పండ్రెండేండ్ల పర్యంతమైన వయసుగల అఁడుది; చూ, స్త్రీ; విణ. 3. తెలివితక్కువది.
ముగురు, దే స. బ. మూఁడుశబ్దమునకు మహన్మహత్యర్థక బహువచనాంతాదేశము: రూ-ముగ్గురు-మువురు- ముగులు - మువ్వురు-మూగురు-మూవురు.
ముగులు, వా. స. బ.—పై.—
ముగ్గ, దే. వి. ఒకానొకచెట్టు: చూ, వృక్షము.
ముగ్గవేయు. వా. స. క్రి. పండవేయు.

ముగ్గు, దే. వి. 1. రూ-ముగ్గు. ఇల్లులలికినపిమ్మట ముత్యములు లోనగువానితో లతాద్యాకారముగా చేయు అలంకరణము: చూ, రంగవల్లి; వా. అ. క్రి. 2. కాయపండు, కాయఫలించు.
ముగ్గుటిని గూర్చెను ముండదయ్యము, లో. (పెండ్లికొమారునికి నత్తి — పెండ్లికొమార్తెకునత్తి — పౌరోహితునకునత్తి. వీరి సంభాషణలనడుమ పాకావాఁడు బాకాపట్టుట. అనుచిత్ర కథ దీనికి ముడిపెట్టుచుందురు.) "ముగ్గురం, గూర్చినె ముండదయ్యమని కుందిరి." (రామాభ్యుదయము.5,ఆ.146.)
ముగ్గురు, దే. స. బ. (మూఁడు+గురు): చూ,రూ-ముగురు.
ముగ్గులు, దే. స. బ —పై—
ముగ్గులు, వా. వి. బః చూ, చిక్కులు. 1.
ముగ్గొయ్య, దే. వి. (ముందు+కొయ్య) 1. అగ్రదండము; 2: గండు, గడ్డు, గడుసు. (సం.) అసంభావ్యత. అసంభావ్యము, అసాధ్యత, అసాధ్యము, ప్రచండము.
ముగ్ధ, సం. వి. ఆ. స్త్రీ. 1 = ముగుద-ముద్దియ, ముదిత. స్వీయాంతర్భేద విశిష్ట నాయికావిశేషము. (ఉదయించుచున్న యౌవనముగలది, పండ్రెండేండ్ల వయస్సుగలిగి యౌవనోదయ మందుచున్నది: చూ, స్వీయ: (చూ, యౌవనభేదములు): విణ. 2.=ముద్దు. చక్కనిది: చూ, హృద్యము; 3. తెలివిలేనిది: స్థూలము. 3; 4 క్రొత్తది:చూ,శారదము.5.
ముగ్ధుఁడు, సం. విణ.=ముద్దుఁడు, గోల: చూ, ముద్దుఁడు.
ముచపత్ర, సం. వి. ఆ. స్త్రీ. ఆదార్వి (తె) జరూక.కోరింద.
ముచిక, ద్వ. వి. రూ-ముచ్చిక. కొబ్బరి తాటి మామిడిలోనగు వాని తొడిమక్రింది బిల్ల. (కాయపండిన వెంటనే రాలిపోవుట కనువుగ విభాజ్యకణములీ బిల్లనంటియుండును.)
ముచికకుడికి, వా. వి. చిట్టచివరకు, అంతమునకు.
ముచికుందుఁడు, సం. వి. అ. పుం: చూ, బ్రహ్మ. 1.
ముచుండ, సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱమల్లె *: చూ, హసంతి. 2.
ముచ్చి, దే. వి. 1: అంచులవాఁడు, జీనిగిరివాఁడు. (సం).— ఆలేఖ్యకృత్తు, కృణువు, చిత్రకరుఁడు, చిత్రకారుఁడు, చిత్రకుఁడు, చిత్రకృత్తు, రంగాజీవుఁడు.("రూ-రంగాజీవుఁడు."). అం. 2. చూ, శిల్పులు.
ముచ్చిక, ద్వ. వి. (ముందు+సిక): చూ, రూ-ముచిక (సంధివివర్ణవికారము.)
ముచ్చిచ్చు, ద్వ.వి. (మూఁడు+చిచ్చు) త్రేతాగ్ని: చూ,వహ్ని 1.
ముచ్చిముమ్మాటికి, జా. తప్పనిసరిగా మూఁడుమార్లు.
ముచ్చిరి, దే. విణ. 1. కోపి: చూ, రోషణుఁడు; 2 శోకమునొందినవాఁడు;3 దుఃఖమునొందినవాఁడు: చూ,విమనుఁడు.
ముచ్చిరితనము, దే. వి. మనోవ్యథ: చూ, విపత్తు.
ముచ్చిరు, దే. అ. క్రి: చూ, శోకించు.
ముచ్చిలకా, వా. వి. రూ—ముచ్చిలికా. 1. రయితు భూమిఖామందునకు వ్రాసియిచ్చెడుసాగు షరతుపత్రము. కదపా; 2. ఉభయవాదుల నడుమపుట్టెడు ఒడంబడిక. [చూ,అపేటువు.
ముచ్చిలి, దే. వి. పెడతల, యందలిగుంటః ముచ్చిలిగుంటః

ముచ్చిలించు, దే. స: క్రి. రూ - ముచ్చిలించు. దొంగిలించు: చూ, సడపు.
ముచ్చిలిగుంట, దే. వి: చూ, ముచ్చిలి.
ముచ్చిలికా, వా. వి: చూ, రూ-ముచ్చిలకా.
ముచ్చిలిపాటు, ద్వ. వి. కునికిపాటు, ప్రమీల: చూ,స్వప్నము2.
ముచ్చిలు, దే. స. క్రి,రూ-ముచ్చిలు: చూ, రూ-ముచ్చిలించు.
ముచ్చివుక, దే, వి (మూఁడు+చివుక): ముద్దుగులము.
ముచ్చె, వై. వి = మోచకా, 1: చూ, పార్ష్ణిత్ర.
ముచ్చెబంగారు, వై. వి: చూ, బేగడ.
ముచ్చెలక, వా. వి. (మూఁడు+చెలక) దుగులముబేడ.
ముచ్చెవాఁడు, ద్వ. వి: చూ, మాదిగ.
ముచ్చు, దే. వి. (ముడ్డి+పూస) 1: చూ, ముడ్డిపూస; (సంధినివర్ణవికారము); 2. తిగ: చూ, మూఁడు.
ముచ్చంగి, దే.వి ఒకచేఁప. హంస.4,అ 187: చూ.మత్స్యము1.
ముచ్చట, దే. వి. 1. వృత్తాంతము: చూ, సమాచారము. 2;2. గుసగుస: చూ, సల్లాపము; 3. ప్రేమము. వసు. 4, ఆ.9: చూ, స్నేహము; 4. కోరిక. ఉ, రా. 8, అ. 178: చూ, వాంఛ; వా. 5. అల్లికతోఁగూడిన సికముడి, ముచ్చటముడి: చూ, సిక. 2.
ముచ్చటకాఁడు, దే. విణ.కోరికగలవాఁడు.పంచ. వేం.4,అ442.
ముచ్చటపడు, దే. అ. క్రి. కోరు. కళా. 3, ఆ. 101: చూ, వాంఛించు.
ముచ్చటముడి, వా. వి: చూ, ముచ్చట. 5.
ముచ్చటలాడు, దే. అ. క్రి: చూ, ముచ్చటించు.
ముచ్చటించు, 1.—పై.—; వా. 2. సమాచారమునుచెప్పు.
ముచ్చట్లు, దే. వి. బ (మూఁడు+చోట్లు) 1. మూఁడుప్రదేశములు: చూ, స్థానము. 1; వా. 2. భార్యాభర్తలుగాని తదితరులుగాని అనురాగముతో నాడుకొనెడు సంభాషణాదికము. "అచ్చట్లు ముచ్చట్లు చెప్పుకొనుచున్నారు."
ముచ్చుముడుఁగు, వై. అ. క్రి. (ముడుఁగు+ముడుఁగు) మిక్కిలిముడుఁగు. భో. 4, ఆ. 165; జై. 3, ఆ. 112.
ముచ్చవలము, దే. వి. (మూఁడు+చవలము) మూఁడు చవలములు.
ముచ్చవుక, వా. వి: చూ, రూ-ముచ్చివుక.
ముచ్చు, దే. వి. 1: చూ, ముచ్చు. 2: 2. రూ-ప్రముచ్చు. దొంగ: చూ, హారకుఁడు. 1; 3. అరఁటిపువ్వులోని కాడ. (ఇదే స్త్రీకేసరము) దొంగ: చూ, రూ-ప్రముచ్చు. 2.
ముచ్చొకము, ద్వ. వి: ఇరాఱు-ఈరాఱు, నల్తిగ, పండ్రెండు, పదిరెండు, బార-బారా, రెండాఱులు. (సం.)—జగతి, ద్వాదశకము. ("చూ, రెండాఱులు").

ముజ్జిడ్డు, వా. వి. తెలుపికానిచిక్కు, ఇబ్బంది.
ముజరా. వా. వి. 1. తిరిగిరావలసిన పైకము లోనగునది; 2. పెత్తనదారిముదరా.
ముజుముదారు, వా. వి. లెక్కలను పరిశీలించు ఉద్యోగి.
ముజ్జగము, ద్వ. వి. మూడుజగములు.
ముఝూల బ్రాహ్మణులు, అం: చూ, కపూరియె బ్రాహ్మణులు.
ముటము, దే. వి: రూ—మూటము ముద్దపిడుక: చూ, శుష్కగోమయము (పిడుక)
ముటాలు, వా; వి బ వంటకట్టెయలు: చూ, సమిధ.
ముట్టఁబడు, ద్వ. అ: క్రి. ఎత్తుపడు, బలహీనమగు. భో. 6, ఆ: 188; నిర్వ. 4, ఆ 76: చూ, వలియు.
ముట్టడము, వై. వి. = ముద్రణ. (దే. అని శ, ర.) 1.నిర్బంధము, కట్టు: చూ, హఠము. 2; 2. ముట్టడి:చూ,యుద్ధము
ముట్టడి, వై. వి. = ముద్రణ. (దే: అని శ. ర): చూ, ముట్టడము. 2: బ్ర 3, ఆ. 190.
ముట్టడించు, దే: స. క్రి. (కోటలోనగువాని) ముట్టడివేయు: చూ, సంరోధించు.
ముట్టణము, దే. వి: చూ, రూ - ముట్టడము. (ముట్టడికి.— భాగ. 10, స్కం. పూ. 1533.)
ముట్టనీయకుండును, అం: చూ, చిహ్నములు.
ముట్టించు, దే. ప్రే: 1. ముట్టఁజేయు; 2. కాల్చు: చూ, దహించు; 3. రగుల్చు: చూ, రవులుచు.
ముట్టికాళ్ళవాఁడు, దే. విఱ: చూ, సంజ్ఞావు.
ముట్టికాళ్ళు, దే. వి: చూ, ముడికాళ్ళు.
ముట్టికోలు, వా. వి: చూ, రూ-ముట్టుకోలు.
ముట్టియ, దే. వి: చూ, రూ-ముట్టె.
ముట్టు, దే. వి. 1. అంటుదానిరజస్సు, ముట్టునెత్తురు: చూ, రేతస్సు. 1; 2. తాఁకుడు. భార. శల్య. 1, ఆ. 337: చూ, స్పర్శము. 1; 3. కొలుముట్టు: చూ, సాధనము. 2; విఱ. 4 ముట్టుది: చూ, రజస్వల; స. క్రి. 5: చూ, స్పృశించు; 6 శత్రువులను దాఁకు. నిర్వ. 7, ఆ. 46: చూ,స్పృశించు; 7. మర్మముదాఁకు; చూ, స్పృశించు; 8:చూ, ముట్టడించు. నిర్వ. 6. ఆ.14;9 కడముట్టు నిర్వ.3,ఆ.39.చూ,నరిపోవు 3.
ముట్టుకట్ట, వా. వి. ముట్టఁగూడనికట్ట: చూ, అంటుకట్ట.
ముట్టుకొను, దే. స. క్రి. 1: చూ, ముట్టడించు. నిర్వ. 3, ఆ. 6; 2. ఆక్రమించు: చూ, మొగరించు:ప్రే.3. ముట్టుకొలుపు.
ముట్టుకోలు, దే. వి: చూ, ముట్టడము. 2.
ముట్టుకోలుగాను, దే. స. క్రి. రూ—ముట్టుకోల్గాను: చూ, ముట్టడించు.
ముట్టుకోలుపట్టు, రూ-ముట్టుకోల్పట్టు.—పై.—(రామా.6, ఆ249)
ముట్టుకోలుపడు, —పై.—.
ముట్టుకోల్గాను, —పై,—(సా. 3, ఆ. 166)
ముట్టుకోల్పట్టు, —పై.—(సా. 3: ఆ. 168.)

ముట్టుగోవ, ద్వ. వి అంటగోవ.చొప్పగోవ చూ ముట్టుగోవ.
ముట్టుత, దే. వి: చూ. ముట్టు. 1.
ముట్టునీళ్లు, ద్వ. వి. బ. బహిష్ఠ యయిన ఆఁడుది నాలవ నాఁడుచేయు స్నానము: చూ, స్నానము. 1; (తద్వి.—మాయునీళ్లు: చూ, స్నానము 1.)
ముట్టుపడు, ద్వ. అ. క్రి: చూ, సంఘటించు.
ముట్టుపాటు, ద్వ. వి: చూ, సంఘటనము.
ముట్టుమోఁకాళ్ళవాఁడు, వా. వి: చూ సంజ్ఞువు.
ముట్టుసందు, దే. వి. వెలుపలకు పోవవీలులేనిసందు: చూ, మార్గము, 1.
ముట్టె, దే. వి. రూ-ముట్టియ. 1. పందిముక్కు: చూ,ముక్కు. 1—ఉ; 2. పశ్వాదులమూతి
ముట్టెచేఁప, దే. వి. ఒకచేఁప: చూ, మత్స్యము. 1.
ముట్టెతోఁపు. వా. వి; నిదానములేని తొందర.
ముట్టెమేకము, ద్వ. వి: చూ, పంది.
ముట్టెమోపు, దే. వి. కార్యనిర్వాహక సమయము. (శ. ర.)
ముట్టైనది, వా. వి: చూ, ముట్టుత.
ముట్లచవిక, దే. వి. ముట్టువాండ్రుండెడి యిల్లు (గది): చూ, సదనము. 1. (ముట్లగది.)
ముట్లుడిగినది, వా, విఱ నిష్కళ స్త్రీ: చూ, స్త్రీ.
ముఠా, వా. వి. 1. కొన్నిగ్రామములు కలిసిన సంస్థానము; 2. జనులగుంపు: చూ, సమూహము.
ముడత, వా. వి: చూ, మడత. 3.
ముడి, దే. వి. 1. గ్రంథి, చెట్టులోనగువాని ముడి: చూ, ముడుత; 2 దారములోనగువాని ముడి. గంటు. (సం.)—గ్రంథి; 3. వెంట్రుకల ముడి. పా. 1, ఆ. 124. గంటు, దుయుముడి-దూముడి-దూయుముడి. (సం.)-కేశకలాపము, గ్రంథి: చూ, సిక. 1; తద్వి -(రాజులముడికి-చూ, సిక. 1; 4. రూకలముడి: గంటు; 5: గొంతుముడి. (సం.)కంఠమణి; 6. ఎద్దుమూఁపురము. "ముడిగిబ్బ": చూ, స్కంధము. 1; 7. కలహము: చూ, యుద్ధము; 8. ముడివల్లెవాసెడి కొన్ని హల్లుల రూపాంతరము. "తాముడి, గాముడి, మాముడి"; 9. సంధి: చూ, సాప్తపదీనము; 10: చూ,·రూ-ముడ్డి: విఱ. 11. ఖండముకానిది: అఖండము; 12. వికసింపనిది.
ముడికాఁడు, దే. విఱ. 1. ధూర్తుఁడు: చూ, వంచకుఁడు; 2. దంభకూరుఁడు: చూ, కూరుఁడు. 3; 3: చూ, సంధాయకుఁడు.
ముడికాళ్లవాఁడు, దే. వి. చూ, ముట్టికాళ్ళవాఁడు.
ముడికాళ్ళు, దే. వి: కంగటికాళ్ల, ముట్టికాళ్లు.
ముడికొక్కు, దే. వి. ఒకానొక పురుగు: చూ, సస్యసంహారి (పురుగు).
ముడిగాలి, దే.వి. రూ-మూడిగాలి, అపానము: చూ, వాయువు
ముడిగిబ్బ, దే. వి. ఆఁబోతు: చూ, వృషభము. 1,
ముడిగొను, దే. స. క్రి: చూ, ముడుచు.
ముడిచె, దే. వి: చూ, ముక్కుఁడి. 1.
ముడికట్ట, వా. వి: విత్తనాలకట్ట.
ముడినువ్వులు, వా. వి. బ. పప్పుచేయని నువ్వులు.

ముడిబట్ట, ద్వ. వి. అంచు కమ్ములులేని బట్ట: చూ, వస్త్రము.
ముడిబొమ, దే. వి. ముడివడ్డబొమ.
ముడియ, దే. వి. 1: చూ, మూట. రామా. 6, ఆ. 230 ; 2: చూ, పందెము. 1.
ముడియవిడుపు, దే. వి. రూ-ముడియవిడ్పు. ముడియవిడుచు దొంగ: చూ, హారకుఁడు. 1.
ముడియవిడ్పు, — పై —
ముడివడు, ద్వ. అ. క్రి. 1. ముడిగలది యగు; 2: చూ, సంధించు. స్వా. 3, ఆ. 34; 3. పెనఁగొను : చూ, వెంటిగొను; 4 అతిశయించు: చూ, సందడించు; 5. కలుగు: చూ, సంభవించు.
ముడివాటు, ద్వ. వి. ముడివడుట.
ముడివెట్టు, దే స. క్రి. 1. ముడివేయు. స్వా. 5, ఆ. 94; వా. 2. భార్యాభర్తలకు ముడిపెట్టు; 3. పుస్తెకట్టు ; 4. లంకెవేయు.
ముడివేయు, — పై.—
ముడివేయుట, జా. వాదమునకు బట్ట ముడివైచి ప్రతిజ్ఞచేయుట. "ముడియ వైవఁగవచ్చు మొన దారసించిన శూరత్వమున వెన్నుఁజూపఁ దనుచు". (పాండు. 1, ఆ. 63)
ముడుంబ (బా), వా. వి. 1. చిక్కు, తకరరు; 2. ఉమ్మడి. "ముడుంబా వదలలేదు" (ఉత్తర సర్కారులలో వాడుక).
ముడుఁగఁబాఱు, ద్వ.అ.క్రి: చూ, ముడుఁచు. 1 నై.2,ఆ.119.
ముడుఁగు, వై. అ. క్రి. = ముకుళ. (రూ-మునుగు — ముగ్గు, మ్రొగ్గు.) 1.— పై.— సౌ. 2, ఆ, 30; 2. తగ్గు: చూ, స్రుక్కు. 9; 3: చూ, సంకోచించు. వసు. 2, ఆ. 44 ; 4. చేష్టలుడుఁగు: చూ, వెఱఁగుపడు.
ముడుఁగుఁదామర, ద్వ. వి. (రూ-ముణుఁగుఁదామర-మొగడఁదామర): చూ, పొత్తిదామర.
ముడుఁచు, వై. ప్రే. 1.= ముకుళ. ముడుఁగఁ జేయు. వసు. 3,ఆ. 161 : చూ, స్రుక్కు. 8; 2 : ముడిపెట్టు. (ఈ యర్థ మౌపచారికము), గంటుపెట్టు ముడిగొను, ముడివేయు.
ముడుకు, దే. వి: చూ, మోఁకాలు. ఆం, పదా. నర. 74.
ముడుచు, దే. స. క్రి: చూ, స్రుక్కు. 8.
ముడుచుకొను, దే. అ. క్రి: చూ, సంక్షేపించు.
ముడుచుట, దే. వి. ముడివేయుట: రూ-ముడ్చుట. (సం.)— ఆకుంచనము.
ముడుత, దే. వి. 1: కంతి, కడింది, కణుపు - కనుపు - కన్ను, కొడుపు, గంటు, గనుపు, గుబ్బ, చిట్టియ-చిట్టె, బుడిపి — బుడ్పి, బొడప, బోటు, ముడి. (సం.) — కాండసంధి, కుటి, గడువు, గ్రంథి, పర్వము, పర్వరీణము; 2. వస్త్రపునెఱి : చూ, వళి. 2; 3. కడుపుమీఁది వళి: చూ, వళి. 1.
ముడుతపడు, దే. అ. క్రి: ఉగ్గుపడు.
ముడుపరి, దే. వి. (ముడుపు + అరి) ముడుపుపట్టినవాఁడు.
ముడుపు, దే. వి. 1. (శుభకార్యాదుల - ఆరంభమునందు) ధనము ముడిచి మీఁదుకట్టిన మూట: మిఁదు, ముల్లియ — ముల్లె: 2. ధనము; చూ, హిరణ్యము. 3; వా. 3. దేవతాదుల నుద్దేశించి చెల్లించెడు ధనాదికము: మీఁదు, ముల్లియ-ముల్లె.
ముడుము, దే. వి: చూ, ముడుకు.
ముడుసు, దే. వి. 1. ఎముక: చూ, శల్యము. 1; 2. గ్రంధిలాస్థి: చూ, శల్యము. 1; 3: చూ, ముడ్డిపూస.
ముడేకము, దే. వి: ఏగాని, అరకాని.
ముడ్చుట, దే వి: చూ, రూ-ముడుచుట.
ముడ్డి, దే. వి. 1. రూ - ముడి-మూడి, కట్టియ-కట్టె,గాఁడు, పట్టి-పత్తె, పూడ (సం).— అపానము, అవస్కరము, ఆధారము, ఉపస్థ, కల్మాషి, గుదము, గుహ్యము, తనుహృదము, పాయువు, పృష్ఠము.తద్వి.—౨గుదద్వారమునకు — (సం) చుతము, చుతి.
ముణుకరాములు, వా. వి. బ. ఎటుతోఁచనిస్థితి. (విశాఖపట్టణ ప్రాంతమున వాడుక.)
ముణుఁగుఁదామర, ద్వ వి: చూ, రూ - ముడుఁగుఁదామర.
ముతంగి, సం. వి. ఈ. స్త్రీ. తెల్లగిసె *: చూ, శుకనాశము.
ముతరాచ, ద్వ. వి. సవారీలు వాహనములులోనగువాని మోయు నొకశూద్రజాతి: రూ - ముత్తరాచ - ముత్తిరాచ, ముత్తిరాచవాఁడు, ముత్తిరాజులు.
ముతుక, దే. విణ. 1: చూ, రూ - ముదుక. 1; 2: చూ,రూ-ముదుక. 2.
ముత్త, దే. విణ: చూ, ముదుక. 1. పాండు, 3, ఆ. 50.
ముత్తడము, దే వి. ఉత్తరిగ: చూ, భూషణము. 2.
ముత్తనియవ్రేలు, దే. వి. జుట్టెనవ్రేలు: చూ, వేలు. 2.
ముత్తయిదువ,దే.వి రూ - ముత్తైద -ముత్తైదువ-ముత్తో: చూ,స్త్రీ.
ముత్తర, అం. రూ-ముత్తెర-మెత్తర: చూ, విన్నాణములు. (మల్లకాస్త్రము.)
ముత్తరంగలు, దే. వి. బ. కడుపుమీఁది త్రివళులు:చూ, వళి.1.
ముత్తరము, దే. వి బ. మూఁడుతరములు.
ముత్తరాచ, ద్వ. వి: చూ, రూ—ముతరాచ.
ముత్తవపులగము, ద్వ. వి. చిట్టాముదపుఁజెట్టు: చూ,సహదేవ.
ముత్తవ, ద్వ. వి. వృద్ధపితామహి రూ-ముత్తవ్వ: చూ. సవిత.2.
ముత్తవ్వ, ద్వ. వి. (ముత్త + అవ్వ) — పై —
ముత్తాత, దే. వి. (ముత్త + తాత) వృద్ధపితామహుఁడు: చూ, ప్రపితామహుఁడు; [సదాగతి. 2.
ముత్తి, వై. వి. = ముక్తి. మోక్షము. నీలా. 1. ఆ. 118:చూ,
ముత్తిగ, ద్వ.వి (మూఁడు + తిగ) తొమ్మిది: చూ,ముమ్మూఁడు.
ముత్తియము, వై. వి. = మౌక్తిక. రూ—ముత్తెము: చూ, రత్నము. 1.
ముత్తిరాచ, ద్వ. వి: చూ, రూ-ముతరాచ.
ముత్తిరాచవాఁడు, — పై.—
ముత్తిరాజులు, ద్వ. వి. బ.—పై.—

ముత్తము, ద్వ. వి. (మూఁడు + తూము) మూఁడుతూములు.
ముత్తవ, దే. వి: చూ, ముత్తవపుఁగము *.
ముత్తెపుఁజిప్ప, ద్వ. వి. (ముత్తెము + చిప్ప) 1: చూ, ముక్తాస్ఫోటము; 2: చూ, భక్ష్యము.
ముత్తెపుఁబంట, ద్వ. వి (ముత్తెము + పంట) చెఱకు *: చూ, రసాలము. 3.
ముత్తెపుఁదీఁగ, ద్వ. వి: రూ-ముత్తెపుతీఁగె. (సం) కటశర్కర, గాంగేష్ఠి. *.
ముత్తెపుతీఁగె, —పై.—
ముత్తెపురిక్కనెల, అం. చైత్రమాసము: చూ, మాసములు.
ముత్తెపుసవతు, వై. వి. చిత్రానక్షత్రము: చూ, రిక్క. 1-౧-౪
ముత్తెము, వై. వి. = చూ, రూ-ముత్తియము.
ముత్తెర, అం: చూ, రూ-ముత్తర.
ముత్తెరువులాఁడి, దే. వి, ఆకాశగంగ: చూ, నది.
ముత్తెసరము, వై. వి. = ముక్తాహార. రూ-ముత్తెసరి. ముత్యాలదండ: చూ, భూషణము. 2.
ముత్తెసరి, 1. = పై—; 2. సస్యవిశేషము: చూ. సస్యము. 1.
ముత్తెసరులు, వై. వి బ: చూ, ధాన్యము.
ముత్తైద, దే. వి: చూ, రూ-ముత్తయిదువ.
ముత్తైదువ, —పై —
ముత్త్రావ, దే. వి: చూ, ముత్తువ *.
ముత్తో, దే. వి. (ముత్త + తోయలి): చూ, ముత్తయిదువ.
ముత్యమంతమాట, జా. కొలఁదిమాట. "సత్యమగు నీముత్యమంతమాట." (ధర్మజరాజ)
ముత్యము, వై. వి. = ముక్తా. 1: చూ, రూ-ముత్తియము. పాండు. 2, ఆ. 171; అం. 2: చూ, రత్నములు. వా. 3. ముత్యమనునామముగాగల "ముత్య" అనుఇంటిపేరుగలవారు
ముత్యాలకుచ్చు, ద్వ. వి. పారితథ్యావిశేషము, వాలపాశ్యావిశేషము; చూ, భూషణము. 2—౧౦-౧౬.
ముత్యాలమ్మ, వై. వి. ఒకగ్రామదేవత: చూ, మహాలక్ష్మి. 3.
ముత్త్రోవ, దే. వి. మూఁడుత్రోవలు.
ముత్త్రోవద్రిమ్మరి, దే. వి. (మూఁడు + త్రోవ + త్రిమ్మరి) త్రిపథగ: చూ, నది.
ముదము, సం. వి, న్. స్త్రీ: 1. రూ-ప్రమదము: చూ, సంతోషము; అం. 2. (మోదము): చూ, సంచారిభావములు. "(అహోహో. మున్ను నేనొనర్చిన నోములు నేఁటికిఁబండె- నిట్టిసమయంబు చేకూరునని తలంచనైతి. రాఘవేంద్రుండు సురవైరిందుని మెనఁట.")
ముదముద, దే వి: కొతుకు: చూ, సంకోచము.
ముదల, దే. వి. 1. ఆజ్ఞ. ప్రభా. 5. ఆ. 203: చూ, సెలవు; 2. గణుతి. ఉ, హరి. 4, ఆ. 269: చూ, లక్ష్యము. 1; 3. గనిమచేరికనేల: చూ, హరిప్రియ. 2. (భూమి. 1.)
ముదలకించు, దే. స. క్రి: చూ, మార్కొను 1 రామా. 5. ఆ. 198.
ముదలపెట్టు, దే. స. క్రి. ఆజ్ఞాపించు. కళా-1, ఆ. 188: చూ, సెలవిచ్చు.
ముదలించు, దే. స. క్రి. 1. ఆడుగు. ఉ, హరి. 3, ఆ. 64. చూ, సవాలువేయు; 2: చూ, ముదలకించు. నిర్వ. 7, ఆ. 78:
ముది, దే. వి. (రూ-ముదిమి-ముదితనము.) 1. వార్ధకము. స్వా. 1. ఆ. 50; చూ, స్థావిరము; విణ. 2. వృద్ధ, వృద్ధుఁడు ఉ, రా. 4, ఆ. 306: చూ, స్థవిరుఁడు.
ముదికాకి, ద్వ. వి. ఆర్యకోస: చూ, వాయసము. 1.
ముదిగారము, దే. వి: చూ, మౌర్ఖ్యము.
ముదిగొండ, వా. వి. 1-2 ఒకానొకగ్రామము; 2. గ్రామనామము ఇంటిపేరుగాగలవారు. కందికొండవారు, జెల్లపుకొండవారు, ఇత్యాది.
ముదిత, సం. ఐ. ఆ. స్త్రీ. 1 = ముద్రియ. పరకీయాభేదము: చూ, ముగ్ధ. 1; దే. వి (1) ఆఁడుది. య. 2, ఆ. 100: చూ, స్త్రీ:
ముదితము, సం. విణ ఉల్లాఘము, ప్రతీతము, నిర్వృతము: చూ, హ్లాదనము.
ముదితనము, దే. వి: చూ, ముది. 1.
ముదిమి, దే. వి: చూ, ముది. 1.
ముదిమివాఁడు, దే. వి: చూ, ముది. 2.
ముదియ, వై. వి = ముగ్ధా. (రూ- ముద్ద - ముద్దియ - ముద్దుగుమ్మ): చూ, ముగ్ధ 1.
ముదియది, వై. వి ముసలిది, ముద్ది: చూ, వృద్ధ.
ముదియనివారిలోఁబెద్ద, ద్వ. వి: చూ. బ్రహ్మ. 1.
ముదియనివారు, ద్వ. వి. బ. దేవతలు. అం. పద. సుర. 38; చూ, వేలుపు.
ముదియు, దే. అ. క్రి: చూ, డొక్కు. 3.
ముదిరము, సం. వి: అ, పుం: చూ, మేఘము. 1.
ముదిరుఁడు, సం. వి: ఆ. పుం: చూ, విటుఁడు.
ముదివాఁడు, దే. విణ: చూ, ముది. 2.
ముదిసినవాఁడు, —పై.—సాం. మా. 4.
ముదుక, దే. విణ: 1. చూ, ముది. 2. జై. 4. ఆ. 44; 2. రూ-ముతుక హరి, పూ. 5, ఆ. 143; చూ, బెరను. 2.
ముదుకఁడు, దే విణ: చూ, ముది. 2.
ముదుకసరులు, దే వి. బ: చూ, ధాన్యము.
ముదుగు, దే. విణ: చూ, ముదుక. 2.
ముదుగునూకలు, దే. వి. బ. గంగ్రనూకలు: చూ, శంబుకము.
ముదుటుంగరము, వై వి. = ముద్రాంగుళీ. (ద్వ. అని శ. ర.) రూ-ముద్దుటుంగరము: చూ, భూషణము. 2—౧౨—(౨).
ముదురు, దే. విణ 1: చూ, ముది. 1. పాండు. 2, ఆ 109; 2: చూ, ముది. 2; అ. క్రి. 3. (కాయలోనగునది) పరిణమించు: చూ, వికసించు; 4; చూ, వర్ధిల్లు.
ముదురుమొగ్గ, దే. వి. పుష్పించుటకు సిద్ధమైనమొగ్గ; చూ, మొగ్గ. 1.
ముదుసరి, దే. విణ: చూ, ముది. 2.
ముదుసరితనము, దే. వి: చూ, ముది. 1.
ముదుసలి, దే. విణ: చూ రూ-ముదుసరి.
ముదుసరిది, దే. విణ: చూ, ముదియది.
ముద్గపర్ణి, సం. వి, ఈ, స్త్రీ. పిల్లిపెసర *: చూ, పెసర,

ముద్గఘుక్కు, సం. వి. జ్. న. గుడ్లము: చూ, హయము.
ముద్గము, సం. వి: అ. పుం, బ: పెసలు: చూ, పెసర.
ముద్గరము, సం, వి: అ, పుం, 1; అవదారణము, ఉద్ఘాతము, కర్కరము, కుద్దాలము - కుద్దాలము - కూద్దాలము, ఖనిత్రము, ఖాత్రము, ఘనము, టంక - టంకము - టంగము. (తె).— గుద్దలి. త్రవ్వుకోల - త్రవ్వుకోల, బొరిగ - బొరిగె. తద్విశేషములు.— ౧ అభ్రి (చూ, పీలి. 2.-౨) కాష్ఠకుద్దాలము, రదని. (తె).—కొఱ్ఱుగుద్దలి; ౨. (తె).—కోఱుదుపాఱ-గోఁకుడుపాఱ, చెక్కుడుపాఱ, తవుకోల-తవ్వుగోల, దోఁకుడుఁబాఱ; ౩. కర్కరము, కలిలము, కురారము, గాఢముష్టి, ఛిదిరము, ద్రుఘణము, పరశువు, పరశ్వధము, స్వధితి. (తె).- గండగొడ్డలి - గండ్రగొడ్డలి, గొడ్డలి; ౪. కాష్ఠలోహి, కూటము, ఖనిత్రము, ద్రుఘణము, వాతర్ధి. (తె) —ఇనుపగుదియ-ఇనుపదుడ్డు, గుదువ, గుదియ-గుదె గునపము-గునుపము, దుడ్డు; ౫. (సం).— ముసుండము, ముసుండి; ౬. (తె)— క్రుచ్చిక, (చూ, క్రుచ్చిక); ౭. (తె)— చిప్పగుద్దలి, చిప్పగొడ్డలి; ౮: కాపాలము; ౯. ఖనిత్రము, ఖనిత్రి, విశిఖ, (తె)— గడ్డపాఱ,పార - పాఱ; ౧౦ (తె)—కొండగుద్దలి. (మిగతవానికి "చూ,స్వధితి.") 2: చూ, సమ్మెట. 1; 3. మల్లె *: చూ, హసంతి. 2; 4: చూ, అసనములు; 5: చూ, ముప్పదిరెండాయుధములు (బాణము. 1.)
ముద్గలుఁడు, సం, వి: అ. పుం. జీవాత్మ: చూ, హంసుఁడు. 2.
ముద్ద, వై: వి. 1:=ముగ్ధ: చూ, రూ-ముదియ; దే. వి 2. కబళము: చూ, పిండము. 3: 3 పిడుచ: చూ, పిండము. 4.
ముద్దకట్టు, దే, అ. క్రి: అడకట్టు-అడగట్టు, అడగొను, కరుడుగట్టు, చిముడు, పాయుఁబాఱు, పాయు, మెత్తఁబడు.(సం) ఘనీభవించు. [చూ, స్వర్ణకారుఁడు.
ముద్దకమ్మరి, ద్వ. వి. బాయికరఁగి యినుము చేసెడు కమ్మరి:
ముద్దకవ్వము, దే. వి. మ్రానిబిల్లతగిలించిన కవ్వము : చూ, వైశాఖము. 2. (మంథానము)
ముద్దకొలిమి, దే. వి. బాయి యినుముగా కరఁగెడు కొలిమి (పల్లము): చూ, రంధ్రము. 1.
ముద్దఖర్జూరము, వా. వి: చూ, అశ్వభక్ష్య.
ముద్దతు, వా. వి కాలపరిమితి (ముద్దతుకవులు=కరారునామా; ముద్దతుక్రయము=అవధిక్రయము).
ముద్దపప్పు, దే. వి. వండినపప్పు: చూ, సూపము.
ముద్దబీగము, దే. వి: కప్పతాళము (చూ, బీగము).
ముద్దయ్య, వై. వి కుమారస్వామి: చూ, స్కందుఁడు.
ముద్దర, వై. వి.=ముద్రా 1. అచ్చు, చప్పు, ముద్దు, మొహరు: చూ, సికా; తద్వి.—వ్రేళ్లచేత అంకుశాకారముగ పెట్టెడి ముద్ర: సం. అంకుశముద్ర.
ముద్దరాలు, ద్వ. విణ. ముగ్ధ: చూ, ముదియ.
ముద్దాడు, దే. స. క్రి. 1. చుంబనాది పూర్వకముగా లాలనము చేయు. హరిశ్చ. 3, ఆ. 136: ముద్దిడు, ముద్దుపెట్టుకొను ; 2. ఆదరించు. ఉ, హరి. 5, ఆ. 6: చూ, సంభావించు,
ముద్దాయి, వా. వి. నేరము మోపఁబడినవాఁడు: ప్రతివాది
ముద్ది, దే వి. 1. ఆపద: చూ, విపత్తు; 2: చూ, ముదియది.
ముద్దిడు, దే. స. క్రి: చూ, ముద్దాడు. 1. విజ. 1, ఆ. 137.
ముద్దియ, వై. వి.=ముగ్ధా. చూ, రూ-ముదియ.
ముద్దిఁకె, దే. వి తోత్రము: చూ, ముల్లుకోల.
ముద్దు, వై. వి. 1. ప్రేమము అం, పదా. చర. 7: చూ, స్నేహము; 2. తామరదుద్దు, ఆం, భా. ప్ర. 165: చూ, మిద్దియ. 2; 3: (సం)-అన్వర్థము, చుంబనము. తద్వి.— దొంతరముద్దు; 4.=ముద్రా. చూ, ముద్దర. "ముద్దుటుంగరము"; విణ. 5 ప్రియమైనది. (ఉ, హరి. 4, 7): అనుఁగు, పాటన, పాటింపు (సం.)—ఆదరము, ఆదృతి: చూ, సౌందర్యము; 6.=ముగ్ధ. మనోజ్ఞత : చూ, హృద్యము; విణ. 7. మనోజ్ఞము."అలుక ముగుల ముద్దుగానున్నది": చూ, హృద్యము.
ముద్దుఁడు, వై. విణ.=ముగ్ధ. ఉ, హరి. 3, ఆ. 100: చూ, స్తబ్ధుఁడు.
ముద్దుగల కాళ్లపురువు, ద్వి. వి. జంటముక్కాలి: చూ, షట్పదము.
ముద్దుగల తల్లులబిడ్డఁడు, ద్వ. వి: చూ, ముద్దయ్య.
ముద్దుగుమ్మ, ద్వ. వి.(రూ-ముద్దులగుమ్మ) 1. మనోజ్ఞురాలగు ఆఁడుది: చూ, స్త్రీ. 2. ఆఁడుబిడ్డ: చూ, స్త్రీ.
ముద్దుగురియుట, జా. మనోహరముగా నుండుట. "ముత్యాల సరులతో ముద్దుగురిసె" (శృంగార నైషధము); "ముద్దులు గురియరా ముదిపెండ్లికొడుకా అనిన పెండ్లికివచ్చిన స్త్రీలందఱు నా భార్యలే" అన్నట్లు. (లోకోక్తి).
ముద్దుగులము, వా. వి: చూ, ముచ్చివుక.
ముద్దుటుంగరము, వై. వి. =: చూ, రూ-ముదుటుంగరము. రామా. 6, ఆ. 186
ముద్దుటుంగ్రము, వై. వి.=: —పై.—
ముద్దుపెట్టుకొను, ద్వ. స. క్రి: (సం.)—చుంబించు.
ముద్దుప్రాలు, ద్వ. వి: చూ, ధాన్యము
ముద్దుముద్దు, వా. విణ: చూ, జిలిబిలి 4.
ముద్దురాలు, ద్వ. వి. (ముద్దు+ఆలు): చూ, ముద్దుగుమ్మ.
ముద్దులగుమ్మ, ద్వ. వి: చూ, రూ-ముద్దుగుమ్మ.
ముదులాఁడి, ద్వ.వి.1.-పై.-; విణ 2 మనోజ్ఞురాలు; చూ, స్త్రీ.
ముద్దులాఁడు, ద్వ. విణ: చూ, మనోజ్ఞుఁడు. భాగ. 10, స్కం. పూ. 1253.
ముద్దులుగుల్కుట, జా: చూ, ముద్దుగురియుట. "ముదులుగుల్కు నీ భువనమోహన కుండలరత్న దీధితుల్." (కవికర్ణ రసాయనము); "ముద్దులు గుల్కుచున్న యుగ్మలి."(రసిక జన మనోరంజనము).
ముద్దులు మూటఁగట్టుట, జా: చూ, ముద్దుగురియుట. మఱికొన్ని సంగతులు ముద్దులు మూటఁగట్టఁ జాలు", (శ్రీనివాస విలాసము).
ముద్దె, దే. వి: చూ, ముద్దు. 2.
ముద్ర, సం. వి, అ. స్త్రీ. =ముద్దు. 1; చూ, ముద్దర: 2,

ఉంగరము లోనగువానియందుఁ గల సంజ్ఞాక్షరములు. (రె.)- అచ్చు; 3. ధాన్యపు రాశిపై ముద్ర: బరగడ: అం. 4: చూ, అలంకారము. 3 ("చెప్పఁదలఁచినది పదములందుఁ జూపుట ఉదా. -నిత-బగుర్విత్స్వ"); 5: చూ, నృత్తహస్తములు.

ముద్రగడ, మి. వి. రాజదండము.

ముద్రణము, సం. వి. అ. న. 1. ముద్రించుట; 2.=ముట్టడి. ఆక్రమించి నిర్బంధించుట: చూ, ముట్టడి.

ముద్రపత్ర సంపుటము, సం. వి. అ. పుం అచ్చు పొత్తము: చూ, సంపుటము. 3.

ముద్రపలక, వా. మి. వి. (ధాన్యపు రాశిపైన వేయు) ముద్ర బల్ల: చూ, ముద్రబల్ల.

ముద్రబల్ల, వా. మి. వి. —వై.— "ముద్రబల్లవద్ద దెబ్బతిన్నట్లు".

ముద్రలు, అం: ఖేచరి, భూచరి, మధ్యమ, షణ్ముఖి, శాంభవి. 5)

ముద్రాంగుళీయకము, సం. వి. అ. న. =ముద్దుటుంగరము : చూ, ముదుటుంగరము.

ముద్రాక్షరశాల, సం.వి.ఆ.స్త్రీ ముద్రాశాల, అచ్చుఁగూటము-ఆచ్చుకూటము: చూ, సదనము. 1.

ముద్రారక్షకము, అం: చూ, కళలు.

ముద్రాశాల, సం వి. ఆ. స్త్రీ: చూ, ముద్రాక్షరశాల.

ముద్రించు, సం. స. క్రి. 1. ముద్రాంకితము చేయు: చూ, అచ్చుకొట్టు-అచ్చుగుద్దు-అచ్చువేయు; వా. 2. చక్రాంకితము చేయు; 3. ఉత్తరము లోనగువాని మీఁద సీలునునొక్కు (కొట్టు).

ముద్రిక, సం. వి. ఆ. స్త్రీ: చూ, ముదుటుంగరము.

ముద్రికము, అం: చూ, ఆసనములు.

ముద్రితము, సం. విణ. 1. ముద్రింపఁబడినది; 2 ముకుళింపఁబడినది: ముకుళితము; అం. 3: చూ, గమకములు.

ముధ సం. వి. ఆ. స్త్రీ: చూ, వ్యర్థము.

మున్, దే, అవ్య: చూ, ముంగల. 3.

మునక, దే. వి. రూ-మునుక: చూ, స్నానము. 1.

మునగ, వై. వి. =మురంగి. రూ-మునుగ*: చూ, శిగ్రువు.

మునస, దే. వి. ఏతపు మ్రానిమీఁది యరభాగము. (ఏతపు మ్రానిక్రింది యరభాగము మీట); తద్వి.—ముంగిసమ్రాను.

మునసపు(బు), వా. వి. రూ-మున్సిపు. 1. గ్రామాధికారి: అధ్యక్షుఁడు; 2: న్యాయాధికారి. "డిస్ట్రిక్టు మునసబు."

ముని, సం. వి. ఇ. పుం. 1. ఋషి (వశిష్ఠాది: చూ, సన్న్యాసి; 2: చూ, బుద్ధుఁడు; 3. అగిసెయ*: చూ, శుకనాసము; దే. వి. (1) అత్యగ్రము; (2)యత్నము: చూ, సన్నాహము. 2; విణ. (3) వత్తియందు మునుశబ్దము యొక్క అంత్యోకారమునకు ఇకారము వచ్చినరూపము. "మునివ్రేళ్లు; మునిముచ్చు."

మునిఁగించు, దే. ప్ర. క్రి. 1. స్నానముచేయించు; వా. 2. (కనఁబడకుండునటుల పడవ లోనగునవి) నీటిలోమునుఁగునట్లుచేయు.

మునిఁగినవాఁడు, దే. విణ. ఆప్లుతుఁడు: చూ, స్నాతుఁడు.

మునికొలుగు, దే. వి: చూ, రూ-ముంగొలుగు.

మునికోల, దే. వి. 1: చూ, రూ-ముల్లుకోల; 2: కశ్శాసము, కమిచీ, కొరడా, చబుకు, చిప్పుచాటు, చేతికోల-చేకోల-చేతికోల-చేలకోల-చేర్నికోల, జాటి, టిటిడు-టిటిడు, సంటెబద్దె, సాటి. (సం.)— అష్ఠీ, కశ, ప్రతోదము, తోత్రము, తోదనము, ప్రాజనము. (మిగత వానికి "చూ, సమ్మెట. 2.")

మునిచీఁకటి, దే. వి. (ముని+చీఁకటి) ప్రాక్షుక్షణికిసరోవనె పక్షుమునుపటి చీఁకటి, మునిమునిచీఁకటి (అసికొందరు.) చూ, మేచకము. 1:

మునిబ్రాహ్మణులు, అం: చూ, దశవిధబ్రాహ్మణులు. (కంద మూలాదు లశనముగ గ్రహించి దాంతులై తపోనిష్ఠగలిగి వేదశాస్త్రములను కర్తవ్యాకర్తవ్యములను గుర్తెఱింగి విశేష జ్ఞానముచే సత్యవాక్కుగలవారే బ్రాహ్మణులు. "శ్లో. ఫల మూలాశనోదాంతో తపస్వీ వేదశాస్త్రవిత్, కృత్యాకృత్య విశేషజ్ఞో సత్యవాఙ్మునిరుచ్యతే.".

మునిమనుమఁడు, దే. వి. (ముని + మనుమఁడు.) ప్రపౌత్రుఁడు, వరంపరుఁడు. రూ-ముమ్మనుమఁడు: చూ, సూనుఁడు 1.

మునిమనుమరాలు, దే. వి. ప్రపౌత్రి. రూ- ముమ్మనుమరాలు: చూ, నూన. 1.

మునిమాపు, దే. వి. (ముని + మాపు): చూ, ప్రదోషము. 1. పా. 1, ఆ. 49.

మునిముంగల, ద్వి వి. (ముంగల+ముంగల) ఎట్టఎదుట: చూ, మొట్టమొదలు.

మునిముచ్చు, దే. వి. (ముని+ముచ్చు) 1: చూ, పశ్యతో హరుఁడు. 2. కళా. 3, ఆ 188: చూ, హోరకుఁడు. 1; 2. పశ్యతోహరురాలు: చూ, హోరకుఁడు. 1. ("చూ, స్త్రీ.")

మునియేఁడు, దే. వి. (ముని+ఏఁడు) రూ- మున్నేఁడు. నిరుటికి తొలియేఁడు: చూ, సంవత్సరములు.

మునిషి, వా.వి.1.తురకచదువుచెప్పువాఁడు;2:చూ, వ్రాఁతకాఁడు.

మునిసత్వ, అం: చూ, ద్వాదశసత్వలు.

మునీంద్రుఁడు, సం. వి. అ. పుం. 1: చూ, ఋషుఁడు; 2: చూ, సన్యాసి (ఋషి.)

మునీనాంచ మతిభ్రమః,న్యా. మునులకునుమతిభ్రమముగలఁగును.

మును, దే. వి. 1. (రూ - మునుపు - మున్ను) పూర్వకాలము: చూ, మొదలు, 4; 2. (రూ-మునుపు-మున్ను) ఆరంభము: చూ, మొదలు 4; 3. అంతము. తుది. హరి: పూ. 7, ఆ. 193: చూ, సుద; అవ్య. 4: చూ, ముంగల.

మునుఁగు, దే. అ. క్రి. రూ-మున్గు. 1: చూ, మరణించు. సౌం. మా. 36; 2. మునుకవేయు: చూ, స్నానమాడు: 3. అడఁగు. భో. 1. ఆ. 101: చూ, క్రుక్కు. 4; 4: చూ, నశించు; 5. మఱుఁగుపడు: చూ, లాఁచు.

మునుఁగువాఁడు, దే. విణ. ఆప్లుతుఁడు: చూ, స్నాతుఁడు.

మునుక, దే. వి. రూ-మునుక. మునుఁగుట.1: చూ,స్నానము 1; 2, మునుకవేయుట. విజ. 1, ఆ. 121:చూ,స్నానము1,

మునుకు, దే. అ. క్రి: 1; చూ, సంతాపించు. జై. 7, ఆ.115. 2. మాఱుపలుకు. భో. 5. ఆ. 66; 3. పలుకు. నై. 3, ఆ. 44: చూ, వచించు.
మునుకువ, దే. వి. పూనిక. య. 3,ఆ,16:చూ,సన్నాహము2.
మునుకొను, దే. అ. క్రి. రూ-మున్కొను: చూ,ముందుపడు.
మునుకోలు, దే. వి. మునుకొనుట.
మునుగ, వై. వి.=మురంగీ: చూ, రూ-మునగ *:
మునుగట్టు, ద్వ. వి. తూరుపుఁగొండ: చూ, పర్వతము.
మునుచీఁకటులవిచ్చుమొగ్గ, ద్వ. వి. చంద్రుఁడు. వేం. ఆం. 11: చూ, హిమాంశువు.
మునుచు, దే. ప్రే: చూ, రూ-ముంచు.
మునుపడు, ద్వ. అ. క్రి: చూ, మునుకొను.
మునుపు, దే. వి. రూ-మున్పు: చూ, రూ-ముసు 1.—2.
మునుము, దే. వి. రూ-మున్ము 1. పైరుపండిన పిదపకోయుట కేర్పఱచుకొనిన పరిమితి: పాయ; 2. వరుస, పంక్తి: చూ, శ్రేణి. 1; 3. ఎదురు: చూ, ముందర. 1; 4. ఎదుటిచోటు; 5: చూ, సేనాముఖము; 6: తఱుచుఁదనము-తఱుచుఁదనము, ఒత్తడి, ఒత్తు, జవరము; విణ. 7. తఱచు. హరి. ఉ. 9,ఆ. 46: చూ, మొత్తము; వా. వి. 8. నాఱునాటెడువరుస.
మునుముకొను, దే. అ. క్రి. వరుసపెట్టు.
మునులయిల్లు, వా. వి. ఆకుటిల్లు: చూ, సదనము. 1.
మున్కొను, దే. అ. క్రి: చూ, రూ-మునుకొను.
మున్గు, దే. అ. క్రి: చూ, రూ-మునుఁగు. (మునుకవేయుటకు-పాండు. 4, ఆ. 196)
మున్నడి, దే. అవ్య. క్రి: విణ.(మున్ను+అడుగు) ముందుగా: రూ-మున్నాడి.
మున్నరక, దే వి. 1; తొలిధుక్కి: చూ, లాంగలము. 1; 2: ధైర్యము. విజ 3. ఆ. 144; చూ, స్థైర్యము. 1.
మున్నాడి, దే.అవ్య.క్రి.విణ:చూ, రూ-మున్నడి.పా.1:ఆ.103
మున్నీటిచూలి, ద్వ. వి. క్షీరసాగరకన్యక: చూ, లక్ష్మి. 1:
మున్నీటిపట్టి, ద్వ. వి: చూ, హిమాంశువు. సాం. దే. 10:
మున్నీటియగ్గి, ద్వ. వి: చూ, బడబానలము.
మున్నీరు, ద్వ. వి. (మును+నీరు): చూ, సముద్రము. పాండు. 2, ఆ. 109.
మున్ను, దే. వి: చూ, రూ-మును. 1—2.
మున్నూఱు, దే. స. బ. (మూఁడు+నూఱులు) మూఁడు నూఱులు.
మున్నూలు, దే. వి: త్రిసూత్రి: రూ-మూనూలు. ముప్పిరి, ముప్పేట: చూ, సూత్రము 1:
మున్నెరిక, దే. వి. పూర్వరాగమువలనఁగలిగినవిరహతాపము.
మున్నేఁడు, దే. వి: చూ, రూ-మునియేఁడు.
మున్పు, దే. వి: చూ, రూ-మునుపు.
మున్ము, దే. వి: చూ, రూ-మునుము.
మున్నపు, వా. వి: చూ, రూ-మునసపు (బు.)

ముప్పండ్రు, ద్వ; వి. బ: ముప్పదిమంది.
ముప్పటిలు, దే. అ: క్రి.రూ-ముప్పటిల్లు.చల్లారు:చూ,గ్రుక్క 4.
ముప్పటిల్లు, వా. అ. క్రి.—పై—
ముప్పది, ద్వ. స: (మూఁడు+పది) ముప్పై (30.)
ముప్పదియాఱేఁడ్లది, ద్వ, వి. నిరతము, లోల, మిక్కిలియిచ్చ గలది: చూ, స్త్రీ.
ముప్పదిరెంటిగుంపు, ద్వ. వి. రేవతి: చూ, రిక్క.1—అలా.
ముప్పదిరెండాయుధములు, అం: (చూ, బాణము. 1. ఉ.ఌ) బాణము, ఖడ్గము (కటారి), తోమరము (కోదండము), స్తోమము, చేరి, సృగము, శక్తి, యష్టి, భిండివాలము, పరిఘము, పరశ్వధము, గద, ప్రాసము, ముద్గరము, ముసలము, శూలము, పాశము, చక్రము, ముసుండి, దండము, వజ్రము, అశని, హలము, అరిష్టము, క్రకచము, కుంతము, పరశువు, శంకువు, వేణువు, తోత్రము, కుసూలము, త్రిశూలము. (32). (చూ, ఆయుధనామవిశేషములు 657పొరట.)
ముప్పదిరెండు, ద్వ. వి: (సం.)—ఆకృతి.
ముప్పరువునేల, దే. వి క్రోశత్రయము: రూ - ముప్పర్వునేల.
ముప్పర్లు, వా. వి. చిరాఅవర్జాలులేని వరుసపద్దుల పొత్తము.
ముప్పర్వునేల, దే. వి: చూ, రూ-ముప్పర్వునేల.
ముప్పలము, ద్వ. వి (మూఁడు+పలము) మూఁడుపలములు.
ముప్పాతిక, ద్వ. వి (మూఁడు+పాతిక) మూఁడు పాతికలు.
ముప్పావు, ద్వ. వి. (మూఁడు+పావు) మూఁడుపావులు.
ముప్పావులా, ద్వ. వి.(మూఁడు+పావులా) మూఁడుపావులాలు
ముప్పిడి, దే. వి. (మూఁడు+పిడి) చాఁకు: చూ, రిష్టి. 2.
ముప్పిర, దే. వి (మూఁడు+పిర) మూఁడుపిరలు.
ముప్పిరి, దే. వి. (మూఁడు+పిరి): చూ, మున్నూలు: విణ. 2 మూఁడుపిరులుగలది.
ముప్పిరిగొను, దే. అ క్రి: 1 మూఁడుపిరులుగా పెనఁగొను; 2. పెనఁగొను. నిర్వ. 10, ఆ. 140: చూ, వెంటిగొను.
ముప్పు, దే. వి. 1: వార్ధకము: చూ, స్థావిరము; 2: చూ, విపత్తు. రామా. 7, ఆ. 119.
ముప్పూఁట, దే. వి. (మూఁడు+పూఁట) మూఁడు పూఁటలు.
ముప్పె, వా. వి: చూ, వ్యాధుఁడు. 2.
ముప్పేట, దే. వి: చూ, ముప్పిరి.
ముప్పేటపేరు, దే. వి: త్రిసరము: చూ, హవణిక. 2. (చూ, భూషణము. 2.)
ముప్పై, వా. వి: ముప్పది. (30.)
ముప్పొంగు, దే. అ. క్రి. (మూఁడు+పొఁగు) మూఁడు పొంగులు పొంగు.
ముప్పొత్తులు, దే. వి: బ. (మూఁడు+పొత్తులు) అసడ్డ: చూ, సయాట.
ముప్పోకలాఁడు, దే. వి. (మూఁడు + పోకలు + అడు.) త్రిగుణాత్మకుఁడు: చూ, వేలుపు.
ముబ్బడి, దే. విణ: చూ, రూ-ముమ్మడుగు.
ముబ్బడించు, దే. అ. క్రి. ముమ్మడియగు: రూ-ముమ్మడించు.
ముబ్బాసవాగ్గీము, ద్వ వి: చూ, సూర్యుఁడు అం,పెదా.సుర21.
ముబ్బె, దే. వి. నితంబపార్శ్వము: చూ, మంబె.

ముబ్బేడ, వా. వి, (మూఁడు + బేడ) మూఁడుబేడలు.
ముముక్షుత్వము, అం: చూ, సాధనచతుష్టయము.
ముముక్షువు, సం. విణ. (ఉ) విడువనిచ్ఛగలవాఁడు.
ముమూర్ష, సం. వి, ఆ. స్త్రీ: చావనిచ్ఛ: చూ, వాంఛ.
ముమూర్షువు, సం. విణ. (ఉ) చావనిచ్ఛగలవాఁడు.
ముమ్మడి. దే. విణ: చూ, రూ-ముమ్మడుగు.
ముమ్మడించు, దే. అ. క్రి: చూ, రూ-ముబ్బడించు.
ముమ్మడుగు, దే. విణ. మూఁడురెట్లు: ముబ్బడి-ముమ్మడి.
ముమ్మనుమఁడు, దే. వి: చూ, రూ-మునిమనుమఁడు.
ముమ్మనుమరాలు, దే. వి: చూ, రూ-మునిమనుమరాలు.
ముమ్మరము, దే. విణ: 1. అధికము. పంచ; నా. 3, ఆ. 84: చూ, హేరాళము. 2: చూ, విజృంభణము.
ముమ్మరించు, దే. అ. క్రి. అతిశయించు: చూ, సందడించు.
ముమ్మాఱు, దే. వి. (మూఁడు + మాఱు) మూఁడుమాఱులు.
ముమ్మూఁడు, దే. స. (మూఁడు + మూఁడు.) మూఁడుమూఁళ్లు రూ-ముమ్మూడు. తొమ్మిది, ముత్తిగ. (చూ, ఓమ్.) (సం) అంకము. ఖండము, నవకము.
ముమ్మూడు, దే. స. (మూడు + మూడు)—పై.—
ముమ్మూల, దే. వి. మూఁడుమూలలుగలది.
ముమ్మొన, అం; చూ, మొనలు.
ముమ్మొనవాలు, ద్వ. వి. (మూఁడు + మొనవాలు) త్రిశిఖము, త్రిశూలము: చూ, బాణము. 1—౩౪.
ముమ్మొనవాలుదాలుపు, ద్వ. వి. శూలి: చూ, శివుఁడు.
ముమ్మొనవాల్దంట, —పై—
ముమ్మోటు, దే. విణ: (మును + మోటు) మూఢశిరోమణి.
ముయ్యంచు, ద్వ. వి: (మూఁడు + అంచు) 1. మూఁడుమూలలు; విణ. 2. మూఁడుమూలలుగలది.
ముయ్యంచుతుంగ, ద్వ. వి. మూఁడంచుల తుంగ *: చూ, తృణము. 1.
ముయ్యగ్గి, ద్వ. వి. అగ్నిత్రయము: చూ, వహ్ని. 1.
ముయ్యడ, ద్వ. వి (మూఁడు + ఆడ) ఆఱు మానికలు, కుడపషట్కము.
ముయ్యాకుఁబొన్న, ద్వ. వి. (మూఁడు + ఆకు + పొన్న.) ముప్పంచాకు *: చూ, సాలపర్ణి.
ముయ్యాఱు, దే. స. (మూఁడు + ఆఱు) మూఁడుఆఱులు. 3 × 6 = 18.
ముయ్యెలగుట్ట, ద్వ. వి. (మూఁడు + ఎల్ల + గుట్ట) 1 మూఁడు ఎల్లలుకలియుచోటు: చూ, స్థానము. 1; 2. మూఁడుదారులు కలియుచోటు, త్రికము, స్వా. 3. ఆ. 34: చూ-మార్గము. 1.
ముయ్యేఁడు, దే. స (మూఁడు + ఏఁడు) మూఁడేళ్లు. 3 × 7 = 21.
ముయ్యేఱు, దే. వి. (మూఁడు + ఏఱు) త్రిపథగ, గంగ: చూ, నది.
ముర, సం. వి. ఆ. స్త్రీ: = మరువము. వాసనగలమొక్క: చూ, రాజార్హము. (చూ, సల్లకి.)
మురంగి, సం. వి. ఈ: స్త్రీ: = మునగ. కారుమునగ *: చూ, ॰ పవు.
మురకనాటిబ్రాహ్మణులు, అం; చూ, అంధ్రులు. 603 పొటలు. (మురకనాడులు, వెన్నూరు మురకనాటిలు అని రెండు విధములు. శుక్లయజుర్వేదులు. కాత్యాయనసూత్రమువారు.)
మురజబంధము, అం. (మద్దలబంధము): చూ, శబ్దాలంకారములు. (హేతువు. 2.)
మురజము, సం. వి అ. పుం: 1; మృదంగము (దీర్ఘమోఁత మూర్జన.): చూ, పీణ; అం: 2 చూ: అనద్ధవాద్యములు.
మురటి, దే. వి: చూ, పుష్పము. అం. పదా. 5—7.
మురదారుసింగు, వా. వి: కంకుష్ఠము కంకుష్ఠువు.
మురబ్బ, వా. వి: మురబ్బా 1. పాకితమము. మురబ్బీ; 2. అల్లపుమురబ్బా అనులేహ్యము.
మురబ్బా, వా. వి —పై—
మురబ్బీ, వా. వి: చూ, మురబ్బ. 1.
మురమర్దనుఁడు, సం. వి. అ. పుం; చూ, విష్ణువు. 1:
మురము, దే. వి. అందుగు *: చూ, సల్లకి. (చూ, మర.)
మురమురః దే. వి: 1. మూల్గుటయందగు ధ్వన్యనుకరణము; చూ, హూహూ; 2. అణఁగుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.
మురళి, సం. వి. ఈ. స్త్రీ: 1. పిల్లనఁగ్రోవి. పాండు, 1, ఆ. 164: చూ, వీణ; 2, అశ్వధారావిశేషము. పా. 2, ఆ. 101: చూ, హయము.
మురళించు, దే. స. క్రి: తిరస్కరించు: చూ, హేళనముచేయు.
మురళ్యాదులుసుషిరములు, అం: చూ, వాద్యములు.
మురాయింపు, వా, వి. బుకాయింపు: చూ, మొరాయింపు,
మురారి, సం. వి, ఇ. పుం: 1. కృష్ణుఁడు: చూ, విష్ణువు. 1; 2: ఒకానొకకవి.
మురారేస్తృతీయః పంథాః, న్యా. మురారి. మూఁడవదారి.
మురాళము, దే. వి: దిగదుడుపు: చూ, సురాళము. 1.
మురాళించు, దే. స. క్రి. దిగఁదుడుచు: చూ, సురాళించు.
మురి, దే. వి. 1: కండకావరము, గర్వము. అచ్చ. కిష్కిం, కాం. 32: చూ, హంకారము; 2. నడకయందలి కులుకు: మురిపము - మురిపెము.
మురించు, దే. ప్రే: 1. అంకించు, త్రిప్పు, త్రిప్పియాడు, మలపు, ముఱకటించు. తద్వి.-౧. కడుపులో త్రిప్పునకు.—గుంగ్రించు గూంగ్రించు.
మురికాఁడు, దే. విణ. గర్విష్ఠుఁడు. అచ్చ. బాల, కాం. 199: చూ, హేరంబుఁడు.
మురికి, దే. వి. రూ-ముఱికి. మాలిన్యము: చూ, మలినము. 1.
మురికొను, దే. స. క్రి. (మురియ + కొను.) ఖండించు. ఉ. హరి. 6, ఆ. 10: చూ, వెలగు.
మురిడీగొలుసు, దే. వి: ముంజేతవేసికొనెడి బంగారు మెలికల గొలుసు: చూ, భూషణము. 2-౧౨-(౨౪)
మురిపము, దే. వి; చూ, మురి. 1-2. (గర్వమునకు.—ఉ. హరి. 1, ఆ. 57.)

మురిపెము, దే. వి.—పై.—; 3: చూ, విలాసము. 2; 4. శృంగారగర్వము: చూ, హంకారము.
మురియ, దే. వి. ముక్క: చూ, శకలము. 4.
మురియఁబడు, ద్వ. అ. క్రి. అతిశయించు. పంచ. నా. 1, ఆ. 282: చూ, సందడించు. 2.
మురియు, దే. అ. క్రి. 1. నడుచునప్పుడు కులుకు; 2. గర్వించు: చూ, హంకరించు; 3. నివర్తిల్లు: చూ, పర్టిల్లు; 4. తెగు. హరి. ఉ, 2, ఆ. 60: చూ, ప్రకృ-వాఱు; 5. పాకముచెడు: చూ, విఱుగు. 5.
మురుఁడు, సం. వి. అ. పుం. మురుఁడనురక్కసుఁడు: చూ; రాక్షసుఁడు. 1.
మురుగు, దే. వి. (రూ-ముర్గు-మురువు-ముర్వు.) 1. ముంజేతి నగ: చూ, భూషణము. 2-౧౨-(౨౫); 2. అల్లికవేసిన బంగారు కమ్మి.
మురము, దే. వి. అందుగు*: చూ, సల్లకి. (రూ-మురిము.)
మురువనడ, దే. వి: చూ, మురళి. 2.
మురువు, దే. వి. రూ-ముర్వు. 1. గర్వము. య. 2. ఆ. 52; చూ, హంకారము; 2 : చూ, సౌందర్యము; 3. శృంగార గర్వము: చూ, హంకారము; 4: చూ, రూ-మురుగు. 1; 5: చూ, రూ-మురుగు. 2; 6: చూ, విలాసము. 2; విశ. 7. సుందరము. బ్ర. 5. ఆ. 29: చూ, సౌందర్యము; 8. మంజులము: చూ, హృద్యము.
ముర్గు, దే. వి: చూ, రూ-మురుగు.
ముర్మరము, సం. వి. అ. పుం. 1. కుమ్మ; 2. సూర్యుని గుఱ్ఱము: చూ, హయము.
ముర్మురుఁడు, సం. వి. అ. పుం; చూ, మన్మథుఁడు.
ముర్వు, దే. వి. విశ: చూ, రూ-మురువు,
ముఱకటము, దే. వి. ముఱకటించుట.
ముఱకటించు, దే. స. క్రి: చూ, మురించు.
ముఱకము, దే. వి. నిక్కు: చూ, హంకారము.
ముఱముఱమను, దే. అ. క్రి. కోపవికారము చూపు: చూ, ముఱముఱలాడు.
ముఱముఱలాఁడు, దే. అ. క్రి: చూ, ముఱముఱమను,
ముఱి, దే. వి: 1: చూ, శౌర్యము; విశ. 2. అల్పము: చూ, స్వల్పము: 3. కుత్సితము: చూ, హీనము. 1.
ముఱికి, దే. వి. 1; నింకిరి: చూ, మలము. 1; 2. కల్మషము చూ, మలినము. 1.
ముఱికికాలువ, వా. వి. ముఱికినీరుపోవుకాలువ. (ఇది పంటకు పనికిరాదు)
ముఱికిగుంట, వా. వి. పీతిరిగుంట; చూ, మఱుఁగుదొడ్డి.
ముఱికి చెమట, దే. వి: కొంచు: చూ, స్వేదము.
ముఱికినాఁడు, దే. వి: ఒకదేశము. రూ-ములికినాఁడు-మురికినాఁడు (ఆనికొండలు) (చూ, మురకనాటిబ్రాహ్మణులు:)
ముఱిచీఁకటి, దే. వి. గబ్బుచీఁకటి: చూ, మేచకము, 1.
ముఱిముఱి, దే. విశ. కొంచెముక్రొంచెము: చూ, స్వల్పము.
ముఱిముఱిచీఁకటి, దే. వి: చూ, ముఱిచీఁకటి.
ముఱియు, దే అ. క్రి: గర్వించు, రూ-మురియు. అచ్చ. కిష్కిం, కాం. 72: చూ, హంకరించు.
ముఱు, దే.వి రూ-ముఱ్ఱు. 1: చూ, మురియ; 2: చూ, పీయూషము.
ముఱుగు, దే. అ. క్రి. 1: కుళ్ళు—క్రుళ్ళు; 2: చూ, సదమదమగు. మార్క. 2, ఆ. 41.
ముఱుగుడు, దే. విశ: ముఱిగినది. స్వా. 4, ఆ, 37: చూ. వి. ముంపు.
ముఱుత్రోవ, దే. వి. (ముఱుగు+త్రోవ.) దుర్గంధమగుదారి: చూ, మార్గము. 1.
ముఱ్ఱు, దే. వి: చూ, రూ-ముఱు.
ముఱ్ఱుఁదాము, దే. వి: చూ, మాతులాహి.
ముఱ్ఱుఁదాలు, ద్వ, వి: చూ, రూ-ముఱు. 2.
ముఱ్వు, దే. వి: చూ, రూ-మురువు. 2.
ములక, దే. వి: రూ-ములుక *: చూ. సింహి. 2. (ఇది కప్ప ములక, తెల్లములక, పెద్దములక అని త్రివిధము.)
ములకాలకఱ్ఱ, వా. వి; చూ, ములుకోల. (ఉత్తరసర్కారులలో వాడుక.)
ములికి, దే వి. రూ-ముల్కి. 1. అంప: చూ, బాణము. 1; 2. బాణపుటలుఁగు: చూ, బాణము. 1; 3. బొంగరపుముల్లు; వా. 4. మనసుననాటిన మాట: చూ, శబ్దము. 2.
ములు, దే. వి. రూ-ముల్లు. 1: కంటకము: చూ, సితాగ్రము: 2, నీవారాదిశూకము: చూ, సితాగ్రము; 3 త్రాసుముల్లు, ములు: చూ, సితాగ్రము: 4. మల్లయుద్ధాయుధాగ్రము: (బ)ముళ్లు,
ములుక, దే. వి. చూ, రూ-ములక *.
ములుకత్తి, ద్వ. వి: ముల్లుతీసెడుకత్తి; చూ, రిష్టి. 2.
ములుకోల, దే. వి: 1. (ములకాలకఱ్ఱ): చూ, రూ-ముల్లుకోల: 2. తోత్రము: చూ, రూ-ముల్లుకోల.
ములుగ, పై. దే. వి: దరియ - గరుగు - గఱుగు *.
ములుగు, పై. వి. 1.=మూలక. బొక్కసము: చూ, పంటసాల; దే. వి. 2: చూ, రూ-మూలుగు, 1; అ. క్రి: (రూ-మూలుగు - మూల్గు.) 3. నొప్పిచే ధ్వనించు. ఉ, హరి. 6, ఆ. 77: చూ, రూ - మూలుగు. 3; 4. అఱచు: చూ, శబ్దించు.
ములుగొలిమిడి, దే. వి. ఇక్షురము * : చూ, మొగబీర.
ములుగోరఁట, ద్వ. వి. ఝింటి *: చూ, సహ. 2.
ములుచిఁత, దే. వి: చూ, రూ-ముల్లుచిఁత *: పర. 5, ఆ. 185.
ములుచ, దే. విశ. 1. ధూర్తుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 2: చూ, మూఢుఁడు. కళా. 6, ఆ. 267; 3. తక్కువ: చూ, వెలితి. 2.
ములుచఁదనము, దే. వి, గట్టిదనము: చూ, వృత్తము. 6. (బెడిదము. 5.)
ములుజెముడు, ద్వ. వి: (సం).—అలంబుషము. త్రికటము*:
ములుతారు, దే. వి: ఒకవల. హరిశ్చ. 2, ఆ. 15: చూ, వల. 1.
ములుతోఁటకూర, దే. వి. ముళ్లతోఁటకూర*. చూ, మారిషము.
ములుత్రాసు, దే. వి: చిన్నత్రాసు: చూ, త్రాసు.
ములుదోస, దే. వి: రోమశి *: చూ, హరివాలుకము.
ములుదోసతీఁగె, —పై—

ములుపంది, దే. వి: ఏదు, శల్యము: చూ, సూకరము.
ములుబంతి, ద్వ. వి. ఒకానొకచోరసాధనము, గద్దగోరు-గ్రద్ద గోరు, గరుడిగోరు, తలముళ్ళు, బలపము: చూ, రిష్టి. 2.
ములుము, దే. వి. బావులనీళ్లు పాఱించిపండించెడు పొలము: చూ, హరిప్రియ. 2 (భూమి. 1.)
ములుమోదుగు, దే. వి: చూ, రోహి. 2. *:
ములువాలుగ, దే. వి. ఒకచేఁప: చూ, మత్స్యము. 1.
ములువెంపలి, దే. వి: కంటకపుంఖి *: చూ, వెంపలి.
ములువెలఁగ, దే. వి: పుల్లవెలఁగ. చతురశ్రికము, గ్రంధిలము, కశేరుకము, కంటకకపిత్థము *: చూ, వెలఁగ.
ములువెలమ, దే. వి: చూ, వికంకతము. 1 *:
ములుసూపు, దే. అ. క్రి: 1. అతిశయించు: చూ, సందడించు; వా. 2. త్రాసుముల్లు బరువువైపుఒరగు.
ముల్కి, దే. వి: చూ, రూ-ములికి.
ముల్చు, దే. విణ: 1: చూ, రూ-ములుచు. 2. పర: 3, ఆ. 198; 2: చూ, ములుచు. 3,
ముల్లంగి, వై. వి. = మూలకమ్: చూ, హస్తికంద. *:
ముల్లంగిపిట్ట, ద్వ. వి: చూ, పక్షి.
ముల్లముస్తె, దే. వి: చూ, ముల్లుచింత *:
ముల్లాకుఱాయి, దే. వి: ఒకరకముపత్రపరశువు: చూ, వృశ్చినము.
ముల్లియ, వై. వి: 1. = మూత, రూ-ముల్లె: చూ, మూట; 2: చూ, ముడుపు. 1; 3: చూ, ముడుపు 2; 4: చూ, ముడుపు. 3.
ముల్లియవిప్పు, ద్వ. వి. మూటలదొంగ: చూ, హారకుఁడు. 1.
ముల్లు, దే. వి: చూ, రూ-ములు.
ముల్లుకోల, వా. వి. రూ-ములుకోల: చూ, సిబ్బ.
ముల్లుచింత, దే. వి. (ముల్లు + ఉచ్చింత) రూ-ములుచింత* : చూ, శుండ 5.
ముల్లుచూపుట, జా. పక్షపాతము లేకుండుట. "వెలయంగ నశ్వమేధంబులు ........., ధర్మమువలనన ములుసూపు." (భారతము) (చూ, ములుసూపు. 2)
ముల్లుపుచ్చికొఱ్ఱుదచు, వా. అ. క్రి. మునుపటికంటె నెక్కువ బాధకలుగు.
ముల్లె, వై. వి. = మూఁత: చూ, రూ-ముల్లియ.
ముల్లెవిప్పువాఁడు, ద్వ. వి: చూ, ముల్లియవిప్పు.
మువురు, దే. స. బ: చూ, రూ-ముగురు.
మువ్వ. ద్వ. వి. (మూఁడు + వా) 1. మొనలో మూఁడు సందులుగల పెద్దగజ్జె, గజ్జియ: చూ, భూషణము. 2-౧౦-(౩); 2. ఒకపట్టణము. రూ-మువ్వ: చూ, సీమ (1) (దేశములు).
మువ్వంచె, ద్వ. వి. (మూఁడు + పంచె) 1: మూఁడు పంచెలు; విణ. 2, మూఁడు పంచెలుగలది.
మువ్వంచాకు, ద్వ. వి. (మూఁడు + పంచె + ఆకు): చూ, ముయ్యాకుఁదొన్న *.
మువ్వంటు, దే.వి. (మూఁడు + అంటు) నెలకులోపలి మూఁడు పురుడులు. హరి, ఉ. 4, అ. 251.

ముప్పరోదె, దే. వి. ముప్పసరము, కాఁడికిని గంటకులు క్రొత్తగా అలవరించెడి మెట్టు: చూ, వృషభము 1.
ముప్వగలవన్నెమెకము, ద్వి. వి. పెద్దపులి: చూ, శార్దూలము. 1.
ముప్పిడోనె, ద్వి, వి. అడుగున బంటిపలక గల దోనె: చూ, హోదము.
ముప్వన్నె, ద్వి. విణ. మూఁడు రంగులుగలది.
ముప్వన్నెకాఁడు, ద్వి. వి: చూ, సూర్యుఁడు.
ముప్వన్నెమెకము, ద్వి. వి. పెద్దపులి: చూ, శార్దూలము. 1.
ముప్వన్నెవిల్లు, ద్వి. వి. ఇంద్రధనుస్సు: చూ, వాణము. 1.
ముప్పసరము, దే. వి: చూ, ముప్పరోదె.
ముప్వీసము, దే. వి. మూఁడు వీసములు.
ముప్వురు, దే. స. బ: చూ, రూ-ముప్పురు.
ముప్వేలుపులయిక్క, దే. వి: చూ, సూర్యుఁడు.
ముషిటె, సం. వి. ఈ. (స్త్రీ): చూ, విషముష్టి* (వీనిగింజలు చిప్పిపేళ్లరసమున రెండుజాములు వండినశుద్ధి) (చర్మరోగములు హరించును).
ముషితము, సం. విణ. 1. దొంగిలఁబడినది: రూ-మూషితము: చూ, హృతము; 2. వఱకఁబడినది.
ముష్కకము, సం వి. అ. పుం = మొక్కము. (రూ-ముష్కరము-ముష్కశము*): చూ, మొక్కము.
ముష్కము, 1: —వై.—; 2: చూ, వృషణము; 3: చూ, మొత్తము. 2.
ముష్కరము, సం. వి. అ. పుం. = మొక్కరిము*: చూ, మొక్కము.
ముష్కరుఁడు, సం. విణ = మొక్కలుఁడు: చూ, వ్యాఘుఁడు. 2.
ముష్కశము, సం. వి. అ. పుం: చూ, రూ-ముష్కరము.
ముష్టి, సం. వి. ఇ. పుం. (స్త్రీ). 1. కత్తిపిడి: చూ, రిష్టి. 2. (పిడి. 2); 2. పిడికిలి, సంగ్రాహము: చూ, పిడి. 1; 3: చూ, సమృద్ధి; 4 = మునిఁడి*: చూ, ముషిటి; పుం. 4. అభినయ హస్తవిశేషము: చూ, వ్యంజకము. 1; వా. వి. 5. బిచ్చము: చూ, వేఁడికోలు; అం. 7: చూ, అసంయుత హస్తములు.
ముష్టితాడనము, అం: చూ, తాడనములు.
ముష్టింపచుఁడు, సం. విణ. దరిద్రుఁడు: చూ, లొల్లెగాఁడు (బీదవాఁడు.)
ముష్టిప్రకరణము, అం: చూ, ప్రమేయములు.
ముష్టిబంధము, సం. విణ. 1. గట్టిగా పిడికిలించుట, సంగ్రాహము: చూ, హస్తము. 1; 2. పిడికిలి, సంగ్రాహము: చూ, హస్తము. 1.
ముష్టిస్వస్తికము, అం: చూ, నృత్తహస్తములు.
ముసగెన, దే. వి: చూ, గునగున.
ముసద్ది వా. వి. 1: చూ, లెక్కవాఁడు: 2: చూ, లేఖకుఁడు.
ముసద్దీపేచి, వా వి. 1. వ్రాఁతరుసుము ముట్టని విషయములో వ్రాఁతకాఁడు వ్రాఁతయందు చూపెడు లోపము. "ముసద్దీపేచీయుండరాదు"; మధ్యవర్తియొక్క మడత సంభాషణము 3. ఉభయ వాదులయొక్క భావములు విడకపోవుట.

